





# ఉప వేదాలు

## శిల్ప కళ

## భారతీయ మహాశిల్పము -4,5,6 భాగములు





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 4, 5, 6, భాగములు




రచయిత :

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి





ప్రచురణకర్త :

డా॥ స్వర్ణ వాచస్పతి, B. V. Sc.

# పరిచయము

మా తండ్రిగారైన కీ॥ శే॥ విమర్శకాచార్య-శిల్పకళాకోవిద స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు కాశ్యపశిల్పము, మానసారము, శిల్పరత్నము, సమరాంగణ సూత్రధార. అపరాజితపృచ్ఛ, విశ్వకర్మప్రకాశ, విశ్వకర్మీయ శిల్పము, శిల్ప సంగ్రహము, మయవాస్తు, మయమతము, ఆత్రేయ శిల్పము, నారదీయశిల్పము, గార్గేయాగమము, పరశివ విశ్వకర్మాగమము, మున్నగు నెన్నియో ప్రాచీన గ్రంథములు పరిశీలించి వాటి నొక పద్ధతిప్రకారము 16 భాగములుగల "భారతీయ మహాశిల్పము" అను మహాగ్రంథముగ తయారుజేసిరి. అందు 16వ భాగము శిల్పపదములతో గూర్చిన నిఘంటువు. వారు 1951 లో రచించిన మహాకవి కందుకూరి రుద్రయ ప్రణీత నిరంకుశోపాఖ్యానము యొక్క- సుధాతరంగిణీవ్యాఖ్య యెందరో మహా పండితుల ప్రశంసలను బొందినది. ఆ గ్రంథమును రచించిన పిమ్మట నెంతయో కష్టపడి మా తండ్రిగారు పై గ్రంథము లన్నియు సేకరించి "భారతీయ మహాశిల్పము"ను రచించిరి. వారు "భారతీయ మహాశిల్పము"1, 2, 3 భాగములకు వ్రాసిన పీఠికను జూచిన, వారా గ్రంథముల సేకరించుటకు, వ్రాయుటకు, ముద్రించుటకు బడినశ్రమ విదితము కాగలదు. వారంతట శ్రమ దీసికొనియు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థికసహాయముతో నా గ్రంథము నందలి 1, 2, 3 భాగములను 1971లో ముద్రించగలిగిరి. మా తండ్రిగారు 1981 లో పరమపదించిరి. నేను 1992 లో పదవీవిరమణ గావించిన పిమ్మట మాతండ్రిగారు రచించిన "భారతీయ మహాశిల్పము"నందలి అముద్రిత భాగములను ముద్రించదలచి 1994 లో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికి ఆర్థికసహాయముకొఱకు అర్థించగా వారు 1996లో భారతీయ మహాశిల్పము 4, 5, 6 భాగముల ముద్రణకు ముప్పదివేల రూపాయలు ఆర్థిక సహాయమును మంజూరుచేసిరి.

భారతీయ మహాశిల్పము 4, 5, 6 భాగముల ముద్రణకు ఆర్థికసహాయ మొనరించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కార్య నిర్వహణాధికారి వారికి, సకాలములో ముద్రణ పూర్తి గావించిన తెనాలి న్యూ విజయా ప్రెస్, తిరుమల ప్రింటర్సు వారికి, పుస్తక ముద్రణను పర్యవేక్షించుచు అచ్చువేయుటలోని తప్పులను సరిదిద్దిన నా సోదరుడు చి॥ గూడవల్లి చంద్రమోహన్‌కు కృతజ్ఞతలు తెలియజేయుచు భగవంతుడు వారిని యాశీర్వదించుగాక యని కోరుచున్నాను.

—స్వర్ణ వాచస్పతి.

# స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారి జీవిత చరిత్రము

స్వర్ణసుబ్రహ్మణ్య కవిగారు నేటి ప్రకాశము జిల్లాలోని ఒంగోలు చిలకలూరిపేట మార్గములో గల కోనంకి గ్రామమునకు



దగ్గఱలోనున్న కోళ్ళపూడి గ్రామములోని కోటేశ్వరరావు-లక్ష్మమ్మ దంపతులకు క్రీ॥ శ॥ 1901 సం॥న జన్మించిరి. వీరికి బాల్యముననే పితృ వియోగము కలుగుటచే తండ్రియొక్క మేనమామల గ్రామ

మగు మురికిపూడిలో నివసించుచుండెడివారు. వారచట ప్రాథమిక పాఠశాలలో విద్య నభ్యసించుచు నొకదినమున గృహమునుండి పాఠశాల కేగుచుండగా మార్గమధ్యమున వృద్ధ దంపతులు కన్పించి వారి కేద్దియో నుపదేశించి "నిత్యము దీనిని మననము జేసికొనుము. నీకు మేలు కలుగును" అని వచించి యదృశ్యమై పోయిరనియు, పిమ్మట వారే గ్రంథముల జూచినను నవియన్నియు నంతకుమునుపు జూచినట్లే యుండి జ్ఞాపకముండెడివనియు కవిగారు వారి కాత్మీయు లగు దీవి లక్ష్మీకాంతరావుగారితో జెప్పిరి.

సుబ్రహ్మణ్య కవిగారు ప్రాథమిక పాఠశాల విద్యను బూర్తి చేసిన యనంతరము వారితల్లి సుబ్రహ్మణ్యముగారిని, వారి చెల్లెలు శ్యామలాంబను దీసికొని మురికిపూడి నుండి బయలుదేరివచ్చి గుంటూరుజిల్లా పొన్నూరు మండలములోని పెదపాలెము గ్రామములో స్థిరనివాస మేర్పఱచుకొనెను. అతి బాల్యముననే కుటుంబ భారము వహించిన కవిగారు స్వర్ణకార వృత్తి నవలంబించి (ఆవృత్తినిగూడ నెచట నభ్యసించలేదు) కుటుంబమును బోషించుచు తెలుగు సంస్కృత గ్రంథముల నొక్కొక్కదానిని కొని తానే స్వయముగ చదువుకొను చుండెడివారు. తరువాత నా గ్రామములో పదిశెంట్ల స్థలమునుకొని గృహమును నిర్మించుకొనుచు నా గృహమునకు గావలసిన ద్వారములు, కిటికీలు, తలుపులు తానే స్వయముగ తయారుచేసికొనెను. ఇట్లు వడ్రంగమును స్వయముగ నభ్యసించి, క్రమముగ నా గ్రామములో వడ్రంగపుపనులు చేయుచు స్వర్ణకార వృత్తికి దూరమయ్యెను. ఈవిధముగ వడ్రంగము జేయుచు వాస్తు-జ్యోతిష విద్యల నభ్యసించి క్రమముగ నా పరిసరగ్రామములలో వాస్తు సిద్ధాంతిగ ప్రసిద్ధిని బొందిరి.

యుక్తవయస్కుడగు కవిగారు బాపట్ల చెంతగల కంకటపాలెము గ్రామములో నివసించుచున్న ఓలేటి పుల్లయ్య - శ్యామ

వివాహమాడెను. అప్పటికి కవిగా, వాస్తు సిద్ధాంతిగ గుంటూరు, ప్రకాశము జిల్లాలలో ప్రఖ్యాతిని బొందిన కవిగారు వడ్రంగపు బనికి గూడ దూరమైరి. క్రమముగా పాండిత్యము నందును ప్రసిద్ధి వహించి యానాటి 'పంచానన' 'అరుణోదయ' మొదలగు పత్రికలకు 'అప్పకవీయము' వంటి గ్రంథములను విమర్శించుచు వ్యాసములను వ్రాయుచుండిరి. ఆనాటి ప్రఖ్యాత కవియైన వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారిని కొలదికాలము తనయొద్ద నుంచుకొని వారిచే 'విశ్వకర్మకులోత్సాహా' మొదలగు గ్రంథముల నాంధ్రీకరింపజేసిరి. ది. 5—12—1925 న బాపట్ల చెంతనున్న నరసాయపాలెము గ్రామములో 'హవిర్ద్రవ్యాదు లెవరి కేయే సందర్భమున జెందవలయున'ను యంశముపై, గ్రామస్థులు బారిష్టరు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి యధ్యక్షతన సభ నేర్పాటు చేసిరి. ఆ సభయందు కవిగారు ధర్మశాస్త్రములలోని శ్లోకములను, అందలి వివరములను విపులీకరించుచు వాదించగా ప్రతిపక్షులెవరును వారి వాదములను ఖండింపలేకపోయిరి. అప్పుడు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు విశ్వబ్రాహ్మణుల వాదనను సమర్థించుచు తీర్మానించిరి. ఈ విధముగ ప్రఖ్యాతిని గాంచిన కవిగా రనేక గ్రంథములను రచించిరి.

## కవిగారి రచనలు

1. పార్వతీ పరిణయము - హరికథ. దీనిని 1929 లో ముద్రించుటజరిగినది. ఇందు కవిగారే ప్రతికీర్తనకు రాగ - తాళములు వ్రాసిరి. ఈ గ్రంథము 'బాలకవి'గా ప్రసిద్ధిగాంచిన కవిగారి తొలిరచనయైనను నది ప్రౌఢకవిత్వము.
2. ఆధ్యాత్మ వీరబ్రహ్మంగారి చరిత్రము. దీనిని ప్రథమముగ 1934 లో ముద్రించుట జరిగినది. తరువాత ననేకులనేక

3. మహాకవి కందుకూరి రుద్రయ ప్రణీతంబగు నిరంకుశోపాఖ్యానమునకు సుధా తరంగిణీ వ్యాఖ్యానము. ఈ గ్రంథము 1951 లో ముద్రించుట జరిగినది. కవిగారికి సంస్కృతాంధ్రముల యందుగల పాండితీ ప్రతిభ నీ గ్రంథము వెల్లడించు చున్నది. ఈ వ్యాఖ్యానమున కవిగారు, నన్నయ-తిక్కన, శ్రీనాథుడు మున్నగు ప్రముఖ కవుల 219 గ్రంథముల నుదాహరించిరి. అప్పకవివంటి ప్రముఖుల ప్రయోగముల నుదాహరణములతో విమర్శించిరి. ప్రస్తుత మీ గ్రంథమును తెలుగు విశ్వవిద్యాలయమువారు పునర్ముద్రించు చున్నారు.

4. 'అమరుకావ్యము' నకు తాత్పర్యమును వ్రాసిరి. ప్రచురణ 1974 సం॥రము.

5. ఈశ్వరమ్మగారి కాలజ్ఞానము ప్రచురణ 1979 సం॥రము.

6. బాణాల శరభకవికృత 'శ్రీకాళహస్తి శతకము' పరిశీలించి వ్రాయబడినది. ప్రచురణ 1979 సం॥రము

7. శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారి మహిమలు : ప్రచురణ 1979. ఈ గ్రంథమున కవిగారి చినతాత కుమారుడైన శ్రీ అమరలింగస్వామివారి జీవిత చరిత్ర, వారి మహిమలు వివరింపబడినవి.

8. విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కార్యకర్తృత్వం : ప్రచురణ 1979 సం॥రము. ఇందు వేదముల నుండియు, ఉపనిషత్తుల నుండియు, పురాణములనుండియు ననేక వివరము లీయబడినవి.

9. విశ్వకర్మ వ్రతకల్పము : ముద్రణ 1980 మరియు 1992.

10. యలవర్తి ఆంజనేయ శాస్త్రిగారి జీవిత చరిత్ర.

11. భారతీయ మహాశిల్పము : ఈ గ్రంథమునం దనేక శిల్ప గ్రంథము లుదాహరింపబడి యున్నవి. ఈ గ్రంథము పది యూరు భాగములుగల మహద్గ్రంథము. ఇందు 1, 2, 3 భాగములు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థిక సహాయముతో 1971 లో ముద్రించబడినవి. 4, 5, 6 భాగములు తిరుమల-తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో 1996 సం॥రములో ముద్రించబడినవి. మిగిలిన పది భాగము లముద్రితములు.

12. మనుసూత్రము.

| | | |
|---|---|---|
| 13. | నాగరఖండము : టీకా తాత్పర్య సహితము | అముద్రితములు |
| 14. | ఈశ్వరశతకము : తాత్పర్య సహితము | |
| 15. | పరవస్తు చిన్నయసూరిగారు రచించిన 'శబ్ద లక్షణ సంగ్రహము' వృత్త్యుదాహరణ సహితము. | |

16. ఆంజనేయ శాస్త్రిగారి ప్రార్థనా శ్లోకములు సంస్కృతములో రచించిరి. అవి ప్రతిరోజు విద్యార్థులచే పఠింపబడు చుండును.

## సంతానము - భార్యావియోగము

కవిగారికి 1931 వ సం॥న విశ్వనాథాచారి, 11-9-1933 శ్రీముఖ సం॥ము భాద్రపద బ॥సప్తమి సోమవారము రాత్రి 12-00 గం॥కు మృగశిర 1వ పాదమున వాచస్పతి, 1935 లో కోటేశ్వరరావు జన్మించిరి.

రాజ్యలక్ష్మి - అక్క - బావగారలైన వడ్డెపాటి కోటమ్మ-హనుమయ్య గార్లకు సంతానము లేనందున, విశ్వనాథాచారిని వారు దత్తతగ స్వీకరించిరి.

కవిగారి భార్య 1949వ సం॥లో ప్రసవమునకై పొన్నూరు లోని అమెరికన్ హాస్పిటలులో చేర్చబడి, మృతశిశువును ప్రసవించి యచటనే స్వర్గస్థురాలయ్యెను.

## సన్మానములు

కవిగారికి నంద్యాల మున్నగు ననేక చోటుల ఘనసన్మానములు జరుపబడెను. ఆళ్ళగడ్డలో 1978 సం॥న కనకాభిషేకము జరిగెను. 17—12—1966న గుంటూరు హిందూకాలేజి హైస్కూలులో ఆనాటి అమాత్యులు యమ్. ఆర్. అప్పారావుగారి సమక్షమున గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారిగారు సన్మానించిరి.

దేవాలయ ప్రతిష్ఠలు : సుబ్రహ్మణ్య కవిగారు గుంటూరు ప్రకాశం జిల్లాలలో ననేక గ్రామములందు వివిధ దేవతా ప్రతిష్ఠలు జేసిరి.

## అంత్యదశ

కవిగారు చివరగ నొక వారమురోజు లనారోగ్యముతో బాధపడి 1981 లో పరమపదించిరి.

## వంశప్రతిష్ఠ

కవిగారి చినతాత కుమారుడైన "అమరలింగము"తి బాల్యము ననే పాఠశాలయందు విద్యాబుద్ధు లభ్యసింపలేదు. పంచ్రాంగము

సంవత్సరముల ప్రాయముననే బ్రహ్మజ్ఞాన సంపన్నుడై తాను నివసించు ముప్పవరము(ఒంగోలు-చిలకలూరిపేట మార్గములోనున్నది) గ్రామములోను, రామకూరు కొండపైనను, అనేక మహాత్మ్యములను జూపి శ్రీశైలమునకు తపస్సుకై వెళ్ళుచున్నానని వచించి వెళ్ళిపోయెను.

కవిగారు కేవలము ప్రాథమిక పాఠశాలయందు విద్య నభ్యసించియు స్వయముగ సంస్కృతాంధ్రములయందపార పాండిత్యము గడించి వాస్తు-జ్యోతిష-సాహిత్యములయం దనేక గ్రంథములను రచించెను. అప్పకవి వంటి మహాకవులను విమర్శించి తన పాండితీ ప్రతిభను విద్వత్ లోకమున చాటెను.

కవిగారి రెండవ కుమారుడగు వాచస్పతి పశువైద్య శాస్త్రమునందు పట్టా పుచ్చుకొని, పదవీ విరమణానంతరము మహాకవియగు వాల్మీకి రచించిన రామాయణము నింతవఱ కేకవి యూహించని రీతిలో ముఖ్యమగు శ్లోకములు, వాని తాత్పర్యము, వాటి వివరణ వ్రాసి, "ఇదియే రామాయణము నందలి సహజకథ" అని యెల్లరు ప్రశంశించే విధముగా 'వాల్మీకి రామాయణసౌరభాలు' రచించి పండిత పామరుల మన్ననలను పొందెను.

**ఈ గ్రంథమును గురించి కొందఱి అభిప్రాయములు.**

"విమర్శకాచార్యులు, శిల్పకళా కోవిదులు బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవీంద్రుల పుత్రులు డా॥ వాచస్పతిగారు విరచించిన "వాల్మీకి రామాయణ సౌరభాలు" అనే విమర్శనాత్మక గ్రంథాన్ని పట్టినపట్టు విడవకుండా ఆమూలాగ్రంగా పఠించాను. అమందమైన ఆనందం కలిగింది. విమర్శించటంలో సుబ్రహ్మణ్యకవుల సునిశిత దృష్టి కుమారులకు సంక్రమించింది. వాచస్పతిగారు సభాతో సభ విష్యతి అన్నట్లు వాల్మీకి రామాయణ సౌరభాలను గుబాళింప జేశారు......" డా॥ కన్నెగంటి రాజమల్లాచారి M. A. Ph. D. తెలుగు లెక్చరర్ S. V. K. P. కళాశాల, మార్కాపురం.

"ఇన్నాళ్ళకు వాల్మీకి రామాయణ సౌరభాలు అనే మంచి గ్రంథం చదివినందుకు ఆనందిస్తున్నాను. ముందుగా డా॥ స్వర్ణ వాచస్పతిని అభినందిస్తున్నాను. నిజాన్ని నిర్భయంగా నిస్సంకోచంగా ఆవిష్కరిస్తున్నందుకు- మతమౌఢ్యంనుంచి గతజాడ్యంనుంచి శృతశృంఖలాలు తుప్పును వదిలించడానికి వచ్చినదీ గ్రంథం ...... ఈ గ్రంథం చక్కని విశ్లేషణతోనూ- వివరణాత్మకంగా ఉదాహరించిన తీరు బాగుంది......"

ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి, తెలుగు శాఖాధిపతి, నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

"వాల్మీకి రామాయణాన్ని క్షుణ్ణంగా పరిశీలించి మీబుద్ధికందిన సూక్ష్మాంశాలను పొందుపరచినందుకు సంతోషం. గతానుగతికరీతిలో గాకుండా వాల్మీకి రామాయణాన్ని కొత్తకోణాల్లోంచి చూసిన మీ ప్రయత్నం ప్రశంసనీయం. రామాయణ జిజ్ఞాసువులు అవశ్యం చదవవలసిన గ్రంథం మీది......

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్-

**డా॥ సి. నారాయణరెడ్డి.**

ఇలాగే ఈ గ్రంథాన్ని గురించి యెన్నో అభిప్రాయాలు వెలువరించబడినాయి. ఈ గ్రంథ రచనను పురస్కరించుకొని డా॥ స్వర్ణ వాచస్పతిగారికి 25-12-95 న గుంటూరులో సన్మానం చేయుట జరిగినది.

ఇవన్నియు వ్రాయుటలోని ముఖ్యోద్దేశం ఒక్కటే. మనం ఈనాడు విద్యను డిగ్రీలతో కొలుస్తున్నాం. స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారి చదువు ప్రాథమిక పాఠశాల వఱకే పరిమితమైనది. కాని వారు సంస్కృతాంధ్ర పండితు లాశ్చర్యపడే విధముగా ననేక గ్రంథములను రచించిరి. వారు రచించిన 'నిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీవ్యాఖ్య'ను గురించి తమ అభిప్రాయము వ్రాయుచు శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు "సుధాతరంగిణ్యాఖ్య (స్వర్ణ సుబ

హ్మణ్య కవి కర్తృక) యుభయ వాఙ్మయ రసపిపాసకలవా రనుభ వింపదగియున్నది. ఇందు సందర్భోచితముగా వివిధ నిఘంటువులు వ్యాకరణాలంకారాది శాస్త్రములు, సకల గీతాభినయభరత కలా లక్షణ గ్రంథములు పెక్కులుదహరింపబడినవి. "కవిసమయములు" "ప్రకృతిసాక్షాత్కృతి" "కవిహృదయము" "లోకోక్తులు" "న్యాయ ములు"మున్నగు కవితాసామగ్రి సమగ్రముగా,హృదయంగమముగా వివరించి సంధానింపబడినది. దీనిని జాగ్రత్తగా బఠించి, ధారణజేసిన కలార్థి కొక యాంధ్రభాషయందే గాక, సంస్కృతభాషా కావ్యము లన్వయించుటయందును నిరాఘాట పాండిత్యము తప్పక చేకూర గలదు......"

అదేవిధముగా డా॥ స్వర్ణ వాచస్పతి పశువైద్య శాస్త్రము నందు పట్టభద్రుడై సాహిత్యమునందు వాల్మీకివంటి మహాకవుల గ్రంథములను విమర్శించి పండితుల మన్నన లందుకొనుట ప్రశంస నీయము.

డా॥ స్వర్ణ వాచస్పతిగారు తన తండ్రిగారిచే వ్రాయబడి అముద్రితములుగ నున్న గ్రంథములను ముద్రించుటకు జేయుచున్న కృషి ప్రశంసనీయము.

వేదాగమ సంస్కృత పండితులు
పురోహిత సామ్రాట్
**శ్రీ పామర్తి నాగభూషణశర్మ, తెనాలి.**
గాంధీనగర్ - శ్రీయలవర్తి ఆంజనేయశాస్త్రి
వేదసంస్కృత పాఠశాల, ప్రధానోపాధ్యాయులు.

# పీ ఠి క

1951 సంవత్సర ప్రాంతమున వాస్తుమథనామృతము, శిల్పమథనామృతము, భారతీయ శిల్పము అను మూడు గ్రంథములను వేర్వేఱుగా రచింప దలచి **వాస్తుమథనామృతమును భారతీయ శిల్పమును** వ్రాసితినిగాని యవి ముద్రింపబడ లేదు. ఇంతలో మన్నేటికోట వాస్తవ్యులగు గోనుగుంట బ్రహ్మయాచార్యులుగారు నాయొద్దకువచ్చి వాస్తుమథనామృతము నందలి 300 లకు పైగానున్న యంశములనుజూచి యచ్చెరువంది యివి యన్నియు వ్రాసికొనిన బాగుండునుగాని సుమారు రు. 3000-00 లతో గాని యీగ్రంథము ముద్రించుటకు వీలుపడదనియెంచి గణితముల వరుసను మాత్రము కొంతవఱకు వ్రాసికొని ముద్రించిరి. ఆ గ్రంథమే "**గృహవాస్తు గణితరత్నావళి**" గా ప్రచారములోనున్నది. శిల్పమథనామృతమును వ్రాయబూనగా ప్రయాగ విశ్వవిద్యాలయమున చరిత్రాచార్యులుగానున్న శ్రీ ప్రసన్న కుమారాచార్యులు, ఎం. ఏ. పిహెచ్.డి., గారిచే సంస్కరింపబడి లండన్ ఆక్సుఫర్డు యూనివర్సిటి ప్రెస్సు వారిచే ముద్రితమై బొంబాయి, కలకత్తా, మద్రాసు, చీనా, జపాన్, న్యూయార్కు వఱకు వ్యాపించిన **మానసారమను** వాస్తుశాస్త్రము బీహారు నలందా కాలేజి ప్రొఫెసర్ ఫణీంద్రనాథబోస్ యం. ఏ. గారిచే పరిష్కరింపబడి బెనారస్‌లో ముద్రింపబడిన **ప్రతిమాలక్షణము, శిల్పశాస్త్రము** అను గ్రంథములు ఇండియా, యూరోప్, అమెరికాలకు వ్యాపించినవి. నాసికక్షేత్రనివాసి శిల్పకళానిధి వఝె కృష్ణశర్మగారిచే సంశోధితమై పూనా ఆనందాశ్రమ ప్రెస్సులో ముద్రింపబడిన **కాశ్యపశిల్పము**. త్రివేంద్రము మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి పరిశోధితమై అనంతశయన గ్రంథావళిగ ప్రకటింపబడిన **మయమతము శిల్పరత్నము** రెండు భాగములు, మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి సంపాదితమై బరోడా గైక్వాడ్ మహారాజాగారి లైబ్రరీ కొసంగబడి బి. భట్టాచార్య

యం. ఏ. పిహెచ్. డి. పరిశోధితముగా ప్రకటింపబడిన **సమరాంగణ సూత్రధార** నామవాస్తుశాస్త్రము **అపరాజిత, ప్రృచ్ఛ,** తంజావూరు సరస్వతీ గ్రంథాలయమునుండి వ్రాయించి తెప్పించిన **విశ్వకర్మ శిల్పము,** మున్నగు గ్రంథములు మహాపండితులచే సంస్కరింపబడి నప్పటికిని శిల్పవృత్తి నవలంబించి చేయువారలకు సరియైన యర్థములందు గోచరింపక యొక్కొకచోట చిక్కుతీగెలతో బెనవేసికొన్న మహారణ్య మధ్యప్రదేశమువలె నభేద్యముగ నుండుటకు గారణము శిల్పపద నిఘంటువులు లేకపోవుటచేతను, సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించక యొకవైపునకు త్రోసిపుచ్చుచు వచ్చుటచేతను, శిల్పులకు పారంపర్య క్రమశిక్షణ లభించకుండుటచేతను, కలిగినట్లూహించవలసియున్నది. మహర్షులచే వ్రాయబడిన యీ గ్రంథములయందు నాకుగల యభిరుచియే యేమాత్రము వెనుకంజ వేయనీయక స్థిరచిత్తముతో నుంచుటచే పరమేశ్వరానుగ్రహమువలన దీనిని వ్రాయజాలితిని. శిల్పశాస్త్రమనినను, వాస్తు శాస్త్రమనినను సమానమను భావముతోనే ప్రాచీనులు వ్రాసియుండిరి. ఇప్పుడు మాత్రము కొందఱు శిల్పము వేఱు వాస్తు వేఱు అని భావించుచుండిరి. ఆధునికులలోను శ్రీ ఫణీంద్రనాథబోసుగారు గృహాస్తువాస్తు శాస్త్రమును శిల్పశాస్త్రమనియే వ్యవహరించిరి. ఇట్టిస్థితిలో వాస్తు మథనామృతము, శిల్పమథనామృతము, భారతీయ శిల్పమను చరిత్రము. ఈ మూడును - భారతీయ మహాశిల్పమునందలి షోడశకళలుగా నిర్ణయింపబడి యందిమిడియున్నవి. ఇవి క్రమక్రమముగా నుత్తరోత్తరోత్కర్షములై వివిధాంశముల నిముడ్చుకొని యున్న శిల్పరూప చిత్రములతో నేత్రానందమును, హృదయానందమును గలిగించుచుండుటచేతనే వయోధికుడనగు నేనింతటి మహత్తర గ్రంథమును లిఖించగలిగితిని.

ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి

పించి "యేతన్ముద్రణను నకు దగిన యత్నము చేయుదము. తలపెట్టిన పనిని ఆపవలదని యభయమొసంగుచు, శిల్పపదములకు తగిన నిఘంటువు లేనియెడల మీ శ్రమ కొంత వ్యర్థముగా గనుపించును. చదువువారలకు బోధపడునంతటి తాత్పర్యమున్నను నిఘంటువును గూడ వ్రాయుట ముఖ్య"మనిరి. అటులే చేయుదునని నిర్ణయించితిని. నే నింతటి భారమును వహించుటచూచి యెడనెడ ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి మున్నగు పత్రికలలో దర్శనాచార్య శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు వ్యాసములు వ్రాయుచు భారతీయ మహాశిల్పమును గుఱించిన సమస్త విషయములు లోకమునకును ప్రభుత్వమునకును దెలియజేయుచు వచ్చిరి. 1963 లో గ్రంథముద్ర ణకు సహాయార్థమై ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారి నర్థించితిమి. అప్పటికి రిజిష్టరుగాలేక నామమాత్రముగానున్న ఆంధ్రశిల్ప కళా పరిషత్తునుగూడ ప్రభుత్వదృష్టికి తెచ్చితిమి. వారు సంఘము రిజిష్ట రయినదా? అని ప్రశ్నించినంతనే నేను బాధ్యతవహించి నా స్వంత ధనముతో 1964 లో రిజిష్టరు చేయించి దరిమిలా లలితకళా ఎకాడమీ అనుబంధ సంస్థగా నుండునట్లు కోరగా శ్రీవారు అనుమ తించి ఆంధ్రశిల్ప కళాపరిషత్తును దయాదృష్టితో చూచుచునే యుండిరి.

## గ్రంథరచనా వివరములు

మొదటిభాగమున :- వాస్తు హోమము ఉపపీఠ భేదములు, అధిష్ఠానభేదములు మున్నగు 104 విషయములు కూర్పబడినవి.

రెండవ భాగమున :- నాలప్రతిష్ఠ స్తంభ, వేదికా, జాలక, తోరణ, కుంభలతాది లక్షణభేదములు మున్నగు 41 విషయము లుగ్గడింపబడినవి.

మూడవ భాగమున :- గర్భన్యాసము ఒకట- అంతస్తు మొదలు అయిదంతస్తుల వఱకుగల దేవాలయభేదములు - మున్నగు 122 విషయములు చెప్పబడినవి.

నాల్గవ భాగమున :- ఆఱంతస్తులు మొదలు పదునాఱంతస్తుల వఱకుగల దేవాలయభేదములు, వైరాజ్య ప్రాసాదభేదములు, అంద్యత్ర్యంగ, పంచాంగ, సప్తాంగ, నవాంగాదిభేదములు-రుచకము మొదలగు 64 భేదములు-మున్నగు138 విషయములు కూర్చబడినవి.

ఐదవ భాగమున:- సాంధారభేదములు, నాగరోద్భవ విమాన ప్రాసాదభేదములు, కైలాసజాతి ప్రాసాదభేదములు, విమాన నాగరచ్ఛందజ పుష్పకాది ప్రాసాదభేదములు, శ్రీధరాది శుద్ధఛంద భేదములు, మేరుజాతిభేదములు మున్నగు - 160 విషయములు చెప్పబడినవి.

ఆఱవ భాగమున :- మేరుభేదములు, లాసభేదములు, పుష్పక భేదములు, మణికభేదములు, త్రివిష్టపభేదములు, భూమిజప్రాసాద భేదములు, ఉదయకలాసగ్రంథి రేఖాభేదములు ద్రావిడప్రాసాద భేదములు - వరాటప్రాసాద భేదములు, మున్నగు 134 విషయములుగ్గడింపబడినవి.

ఏడవ భాగమున:- వరాటప్రాసాదభేదములు, విమానప్రాసాద భేదములు, నాగరసాంధార ప్రాసాదభేదములు, రుచకజాతి సాంధార ప్రాసాదభేదములు, లతినజాతి ప్రాసాదభేదములు, మిశ్రజాతి ప్రాసాద భేదములు, శ్రీసంజ్ఞ కవలభి ప్రాసాదభేదములు, సింహావలోకన ప్రాసాదభేదములు, నాగరజాతి బ్రహ్మవిష్ణ్వాది ప్రాసాదములు, ద్వారదేవతలు, ప్రాకార విధానము మున్నగు 178 విషయములుక్తములైనవి.

ఎనిమిదవ భాగమున :- ప్రాకారవిధానము, పరివారదేవతలు గోపురభేదములు, మండప భేదములు, మున్నగు 34 విషయములు వాకొనబడినవి.

తొమ్మిదవ భాగమున:- శిలాలక్షణములు, రత్నలక్షణములు, స్వయంభులింగ భేదములు, శివరూప భేదములు, గణపతి భేదములు, సూర్యలక్షణము, గ్రహాలక్షణములు మున్నగు 124 విషయములు వివరింపబడినవి.

పదియవ భాగమున :- విష్ణురూప భేదములు, దేవీరూప భేదములు, దిక్పాలక లక్షణములు, నానావిధ దేవతల లక్షణములు, ఋషి లక్షణ భేదములు, యక్ష రాక్షస గంధర్వ అప్సర కిన్నరాది రూపభేదములు, జైనబౌద్ధాది లక్షణములు మున్నగు 144 విషయములు చెప్పబడినవి.

పదునొకండవ భాగమున :- ప్రతిమావిధానము, ఉత్తమ మధ్యమ కనిష్ఠదశతాల భేదములు, నవతాల భేదములు, అష్టతాల భేదములు, సప్తతాల భేదములు, షట్తాల భేదములు, పంచతాల భేదములు, చతుస్తాల భేదములు, త్రితాల భేదములు, ఏకతాల లక్షణము, మున్నగు 33 విషయము లుక్తములు.

పదిరెండవ భాగమున:- దేవదానవాది ప్రతిమానభేదములు, ముఖభేదములు, పంచపురుష భేదములు, ఋజ్వాగతాది స్థానక భేదములు, పతాకాది చతుఃషష్టిహస్త భేదములు, రసదృష్టి భేదములు, ఆయుధభేదములు చిత్రలేఖనాదికము, మున్నగు 167 విషయములు వివరింపబడినవి.

పదుమూడవ భాగమున:- భూమి లక్షణములు, గ్రామలక్షణములు, ఏకశాల భేదములు, ద్విశాలభేదములు, త్రిశాలభేదములు, చతుశ్శాలభేదములు, మున్నగు 300 విషయములు వివరింపబడినవి.

పదునాల్గవ భాగమున :- సప్రయోగ సర్వదేవతా ప్రతిష్ఠాగమము శైవవైష్ణవ శాక్తేయముల కుపయోగించు జీర్ణోద్ధారాదులు, మున్నగు విషయములు చెప్పబడినవి.

పదునైదవ భాగమున - వివిధ యంత్ర రహస్యములు, చిత్ర శిల్పము, వేదకాలమునుండి నేటివఱకుగల శిల్పచరిత్రము, అందలి మహత్తర చమత్కారములు మున్నగు 200 విషయముల వాకొనబడినవి.

పదునాఱవ భాగమున :- సమస్త శిల్పగ్రంథముల నుండి

ఇట్లు దాదాపు రెండువేల ముఖ్యవిషయములతో గూడిన యిమ్మహా గ్రంథముద్రణమునకు శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు భాగము నకు వెయ్యిరూపాయలుగా అంచనావేసి ప్రస్తుతము మొదటి మూడు భాగములకు రు. 3000 00 లు 1966 మార్చినెలలో ఆర్థిక సహాయ మొనరించిరి.

గేయప్రబంధమగు పార్వతీపరిణయ రచనా కాలమునుండి నిరంకుశోపాఖ్యాన ముద్రణసమయమునను భారతీయ మహాశిల్ప ముద్రణ ప్రయత్నమునను, సమయానుకూలముగ తగు సహాయ మొనర్చుచున్న మత్సోదరతుల్యుడగు శ్రీ దీవి లక్ష్మీకాంతరావు గారికిని, నా రచనలయందలి యభిరుచిని లోకమునకు ప్రకటించుచున్న దర్శనాచార్య శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారికిని, 1964లో గుంటూరు విద్యాశాఖాధికారిగా నుండి యీ భారతీయ మహాశిల్ప ముద్రణ మత్యావసరమని ప్రభుత్వమువారికి సూచించుటయేగాక, పలువిధముల ప్రోత్సాహ మొసగుచున్న త్రిభాషాకవులు శ్రీ పులివర్తి శరభాచార్యులు బి. ఏ. బి. ఇడి. గారికిని ఏతద్రచనా మధ్యకాలమున ధైర్యదాన మొసంగిన ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికిని, 1965 లో గోవా దేశాంతవర్గత కాంసరపాల క్షేత్రస్థ కాళికాలయమున సహస్ర చండీమహాయజ్ఞము నకు నన్నాహ్వానించి అగ్రసన్మానమొసంగిన శ్రీ దైవజ్ఞ బ్రాహ్మణ సంఘమువారికిని, శిల్పగ్రంథోపయోగాదులనెల్ల గుర్తించిన సంస్కృత శాఖామాత్యులగు శ్రీ యం. ఆర్. అప్పారావుగారికిని, శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారికిని, ప్రభుత్వాదేశప్రకారము గుంటూరు హిందూకాలేజి హైస్కూలు భవనములో 17-12-1966న సన్మానసభ జరిపించి రెండు దుశ్శాలువలు నూటపదారు రూపాయలు ఇచ్చి సన్మానించిన గుంటూరు డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ డి. వెంకటస్వామి యం. బి. ఇ. డి. గారికిని, నాకృతజ్ఞతను ప్రకటించుచు ధన్యవాదము లర్పించుచున్నాను.

—గ్రంథకర్త.

శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 4వ భాగము




రచయిత:

విమర్శకాచార్య శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి





ప్రచురణకర్త:

డా॥ స్వర్ణ వాచస్పతి, B. V. Sc.

# విషయసూచిక

## చతుర్దశకళ

| కాశ్యప | మానసారము | సమరాం | అపరా |
|---|---|---|---|
| 33.34.35.36 | 24.25.26.27 | 62.49.56 | 81.154.155 |
| 37.38.39.40.41 | 28.29.30 | | 104.106.157 |
| | | | 158.159.168 |

శ్రీ విరాడ్విశ్వకర్మణేనమః

# 1. ఇష్టదేవతాస్తుతి

"దేవఃసపాతు"

శ్లో॥ ఉత్పత్తి రక్షణలయాన్ జగతాం ప్రకుర్వన్
భూవారి వహ్ని మరుతో గగనంచ సూతే
నానా సురేశ్వర కిరీట విలోలమాలా
భృంగావవీఢ చరణాంబురుహం నమామి॥ (మానసారము)

శ్లో॥ జయతి వరదమూర్తిర్మంగలం మంగలానాం
జయతి సకల వంధ్యా భారతీ బ్రహ్మరూపా।
జయతి భువనమాతా చిన్మయీ మోక్షరూపా
దిశతు మమ మహేశో వాఙ్మయః శబ్దరూపం॥ (విశ్వకర్మ ప్రకాశ)

"అభీప్సితార్థ" మహాదేవం

తా॥ సకల మంగళములను కలుగజేయునట్టిదియును, సకల వరముల నిచ్చునట్టిదియును, అగు లక్ష్మిదేవికి నమస్కారము చేసెదను. మఱియు సకల లోకములవారిచేతను నమస్కరింపదగినదియును, బ్రహ్మ స్వరూపురాలునగు సరస్వతీదేవికి నమస్కారము చేసెదను. సకలలోకములకు తల్లియును, చిత్స్వరూపురాలును, మోక్షస్వరూపురాలును, అగు పార్వతీదేవికి నమస్కరించెదను. ఇట్టి దేవతలయందు భక్తిగలిగి యుండుటచేత పరమేశ్వరుడు సంతోషమును బొంది వాఙ్మయమైన శబ్దరూపమును విశేషముగా నిచ్చుగాక.

శ్లో॥ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురైరపి
సర్వవిఘ్నచ్ఛి దేతస్మై గణాధిపతయేనమః॥ (అపరాజితపృచ్ఛ)

# 2. షడ్భూమి విధానము, పద్మాసనము

కాశ్యపశిల్పము 33 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ, షడ్భూమిక విధింపరం
తస్య విస్తారతుంగంతు, ప్రాసాదమానవద్భవేత్॥ 1
విస్తారం రుద్రధాభజ్య, గుణాంశం గర్భగేహకం।
ద్విభాగం గృహ పిండంస్యా దలింద్రం శివభాగయా॥ 2
హారం శివాంశ మానేన అలింద్రంవా స్థలం।
భవేత్ ధరాతలే ద్విత్రిభూమౌ ... ... ॥ 3

పాదేతత్ స్థాపనం యత్ర, తావద్వ్యాసుద్ధృతం ।
ఘనం బాహ్యోచిత మలంకారం, ఘనాభ్యంత రవద్భవేత్॥ 4
రమ్యాంశం విభజేత్తారం. విన్యాసం సూత్రయో ।
స్తరం.భాగం కూటకవిస్తారం కోష్ఠంతర ద్విగుణా యతం॥ 5
భాగేన పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్ ।
చతుష్కూటాష్ట కోష్ఠంచ భానుపంజర సంయుతం॥ 6
హారాంతరం చతుర్వింశత్కల్పయేదాది భూతలే ।
పంజరం హర్మ్యమధ్యేతుం కర్ణేషు కోష్ఠకం భవేత్॥ 7
పార్శ్వయోః కర్ణకూటస్య. పంజరం పరికల్పయేత్ ।
కోష్ఠపంజరయోర్మధ్యే కల్పయేత్తువిశేషతః॥ 8

తా॥ ఆఅంతస్తులు గల దేవాలయమును గూర్చి చెప్పుచున్నాడు. విస్తారమును యెత్తును మునుపు చెప్పినట్లు చేయవలెను. విస్తారమును 11 భాగములుచేసి అందు గర్భగృహము 3 భా, గోడ 2 భా, చుట్టూ చేయవలెను. అలింద్రము 1 భా, హారము 1 భా, చేయవలెను అలింద్రముగాని లేక తలముగాని చేయవలెను. అధిష్ఠానము నందును రెండవ యంతస్తునను మూడవ యంతస్తునను ఇట్లుచేయవలెను. స్తంభమునునిలుపవలసినచోట గట్టిగా దిమ్మనుకూడ కట్టవచ్చును వెలుపల తగిన యలంకారములను చేయవలయును. దిమ్మలోపల గూళ్ళుంచి చేయు విధముననే పీఠము లేర్పఱచి కూడ చేయవచ్చును. విస్తారమును 12 భాగములుచేసి కర్ణకూటము 1 భా, కోష్ఠము 2 భా, పంజరము 1 భా, మిగిలినది హారమును చేయవలెను. కూటములు 4 ను, 8 కోష్ఠములను, 12 పంజరములును, 24 హారాంతరములును మొదటి యంతస్తున చేయవలెను. పంజరమును హర్మ్యము యొక్క నడుమచేయవలెను. కోణమునందు కోష్ఠమును చేయవలెను. కర్ణ కూటము యొక్క ప్రక్కల యందును పంజరములను చేయవలెను. కోష్ఠపంజరముల యొక్క నడుమ హారమును చేయవలెను.

శ్లో॥ తదూర్ధ్వ భూదశాంశేషువ్యోమాంశం కర్ణకూటకం ।
మధ్యే పంజరమేకాంశం కర్ణకూటమివా కృతిః॥ 9
ద్విభాగం కోష్ఠదీర్ఘంస్యా దర్ధాంశం పంజరస్యతు ।
శేషం హారాంతరంఖ్యాత. మేషాం సంఖ్యాబది భూమివత్॥ 10

తస్యోర్ధ్వ భూమిశాలంతు, నవభాగ విభాజితే।
కర్ణకూట మథాంశేన మధ్యశాలా గుణాంశకం॥ 11
పంజరవ్యాస మేకాంశ మర్ధాంశం హారయోఽంతరం।
తదూర్ధ్వం వసుభాగంతు శివాంశం కూట విస్తృతం॥ 12
మధ్యేకోష్ఠం ద్విభాగేన ఏకాంశం పంజర స్తతః।
హారాంతర మథార్ధాంశం కల్పయేచ్ఛిల్ప విత్తమః॥ 13
తస్యోర్ధ్వ భూమివిస్తారం షడ్భాగంవిభజేత్సమం।
కూట మేకాంశ మానేన కోష్ఠాయామంతు తద్ద్వయం॥ 14
అర్ధాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్।
తదూర్ధ్వభూమి విస్తారమర్ధాంశం మధ్యభద్రకం॥ 15
దండంవాధ్యర్ధ దండంవా ద్విదండంవా భద్రనిర్వకం॥

తా॥ దాని పై అంతస్తును 10 భాగములుచేసి కర్ణకూటము 1 భా, మధ్యపంజరము 1 భా, కర్ణకూటమువలె చేయవలెను. కోష్ఠము 2 భా, పంజరము ½ భా మిగిలినది హారాంతరము చేయవలెను. మొదటి అంతస్తువలెనే సంఖ్యను సరిపుచ్చవలెను. దానిపై అంతస్తును 9 భాగములుచేసి కర్ణకూటము 1 భా, మధ్యశాల 3 భా, పంజరము 1 భా, హారాంతరము ½ భా, దానిపై అంతస్తును 8 భాగములుచేసి కూటము 1 భా, మధ్యకోష్ఠము 2 భా, పంజరము 1 భా, హారాంతరము ½ భా చేయవలెను. దానిపై అంతస్తును 6 భాగములుచేసి కూటము 1 భా, మధ్యకోష్ఠము 2 భా, పంజరము ½ భా మిగిలినది ¼ వంతు హారాంతరము చేయవలెను. దానిపై అంతస్తును విస్తారములో సగము మధ్యను భద్రమును చేయవలెను. దాని యొక్క నిర్గమము 1 దండముగాని, 1½ దండముగాని, 2 దండములుగాని, చేయవలెను.

శ్లో॥ తత్తుంగం సప్తపంచాశ దంశం కృత్వాతు దేశికః॥ 16
అధిష్ఠానం త్వగ్ని భాగం షడ్భాగంచరణోదయం।
పాదహీనాగ్ని భాగంతు మంచమాన ముదాహృతం॥ 17
పాదోచ్ఛంసార్ధ పంచాంశం. మంచంసార్ధ ద్విభాగం।
పాదాధికంతు పంచాంశం, పాదాయామమితి స్మృతం॥ 18
సార్ధద్విభాగం మంచోచ్ఛం పంచాంశం చరణోదయం।

పాదహీనంతు పంచాంశం, తలిపస్యోదయం భవేత్ ।
ద్విభాగం ప్రస్తరంఖ్యాత మర్ధాధిక్యం యుగాంశకం॥ 20
పాదాయామ మిదం ఖ్యాతం పాదోనదవ్యంశ మంచకం ।
వ్యోమాంశం, వేదికామానం పాదోనద్వ్యంశ కంగలం॥ 21
సార్ధవేదాంశమానేన, శీర్షకం పరికల్పయేత్ ।
పక్షాంశంతు విమానం చ షడ్భూమిక మేవహి॥ 22

తా॥ అలయము యెత్తును 57 భాగములుచేసి అధిష్ఠానము 3 భా, స్తంభము 6 భా, ప్రస్తరము $2\frac{3}{4}$ భా, ద్వితీయస్తంభము $5\frac{1}{2}$ భా, ప్రస్తరము $2\frac{1}{2}$ భా, తృతీయ స్తంభము $5\frac{1}{4}$ భా, ప్రస్తరము $2\frac{1}{2}$ భా, చతుర్థస్తంభము 5 భా, ప్రస్తరము $2\frac{1}{4}$ భా, పంచమస్తంభము $4\frac{3}{4}$ భా, ప్రస్తరము 2 భా, షష్ఠస్తంభము $4\frac{1}{2}$ భా, ప్రస్తరము $1\frac{3}{4}$ భా, వేదిక 1 భా, గలము $1\frac{3}{4}$ భా, శిఖరము $4\frac{1}{2}$ భా, స్తూపిక 2 భా, ఇట్లు చేయవలయును

శ్లో॥ సాష్టవింశత్తలానిస్యు ర్వింశత్కూట సమన్వితం ।
షడష్ట పంజరో పేతం, పాదం ప్రత్యల్పనాసికం॥ 23
హెూమాదిస్తూపి పర్యంతం, చతురశ్రం ప్రకల్పయేత్ ।
శిఖరేతు మహానాసీ చతస్రః పరి కల్పయేత్॥ 24
అంబుజాసన మాఖ్యాతం సర్వదేవ ప్రియావహం॥

తా॥ పైజెప్పిన దానివే 28 తలములును, 20 కూటములును, 48 పంజరములును, స్తంభములయందు క్షుద్రనాసికలును అధిష్ఠానము మొదలు శిఖరము వరకు నలుచదరమును, శిఖరమున 4 మహానాసికలును చేసిరేని పద్మాసనమగును. (అనుబంధము 1 వ పటము చూడుడు)

## 3. సుశాంకరా విభేదములు

శ్లో॥ తదేవ శిఖరం కంఠం.వస్వశ్రం పరికల్పయేత్॥ 25
అశేష సౌష్టికాంతంతు శీర్షకం చతురశ్రకం ।
ఉన్నతావనతోపేతం. భద్రంవాఽభద్ర కోష్ఠకం॥ 26
సాంతరప్ర స్తరోపేతౌ హీనౌవాఽపిసమున్నతౌ ।
సుశాంకర మిదం ఖ్యాతం, తదేవం కూటశీర్షకం॥ 27

వృత్తాకారం ప్రకర్తవ్యం, నామ్నా తద్భద్రలీనకం।
తదేవశిఖరేచాష్ట స్వల్పనాసియుతం మహత్॥ 28
శివభద్రమితి ఖ్యాతం శివప్రీతికరం పరం।
తదేవద్వ్యశ్రవృత్తాఖం శీర్షకంగలసంయుతం॥ 29
ముఖేలలాటనా సాధ్యం నగేంద్ర మితి సంజ్ఞితం।
షడ్భూమిరేవ మాఖ్యాతా సప్తభూమి మధోపరి॥ 30
ఇది కాశ్యపశిల్పే షడ్భూమి విధానం త్రయస్త్రింశః పటలః.

తా॥ పై జెప్పినదానినే శిఖరమును కంఠమును 8 కోణములుగా చేసి అన్ని అంతస్తులకును కర్ణకూటములు చేసి శిఖరములు నలుచదరము గాను కొన్ని యెత్తును కొన్ని పల్లముగను చేసి భద్రమునుగాని భద్రము లేకుండ కోష్ఠముగాని ప్రత్యేక ప్రత్యేక ప్రస్తరములతోను, అవి హెచ్చు తగ్గులుగా గాని లేక సమానమైన యెత్తునగాని చేసిరేని దానిని సుశాంకర మందురు. లేక అదియే కూటములు శిఖరము గుండ్రముగాచేసినచో భద్రలీన మందురు. దానినే శిఖరమున 8 క్షుద్రనాసికలును కలిగియుండు నట్లు చేసిరేని శివభద్ర మందురు. దానినే ద్వ్యశ్రవృత్తముగా శిఖరమును గలమునుచేసి ముఖనాసికను చేసిన యెడల నగేంద్రమగును. ఇది ఆఱంతస్తులు గల దేవాలయ విధానము.

## 4. షడ్భూమి మరియొకపద్ధతి పద్మకాంతము

మానసారము 24వ అధ్యాయము :

శ్లో॥ విధానం షట్తలం సమ్యగ్లక్షణం వక్ష్యతేఽధునా।
విస్తారోత్సేధం భాగంచ పూర్వవత్పరి కల్పయేత్॥ 1
సప్తాధికంతు పంచాశద్భాగం కృత్వా తదుచ్ఛ్రయే।
సార్ధత్ర్యంశ మధిష్ఠానం, సప్తాంశం పాదదీర్ఘకం॥ 2
తదర్ధం ప్రస్తరోత్సేధ మూర్ధ్వపాదం షడంశకం।
తదూర్ధ్వం మంచం త్ర్యంశంస్యా దూర్ధ్వపాదం శరాంశకం॥ 3
తదర్ధం ప్రస్తరోత్సేధం సార్ధవేదాంశకాంఘ్రికం।
ప్రస్తరంచ ద్విభాగంస్యా దూర్ధ్వేబంధ్వంశ మంఘ్రికం॥ 4
ప్రస్తరం సార్ధభాగంస్యా చ్చతుర్భాగంచ పాదకం।

తా॥ పైజెప్పిన దానినే ప్రతి అంతస్తున అధిష్ఠానమును ఒక్కొక్క భాగము చేయుచు కర్ణముల యందు హర్మ్యములను చేసినచో కాంతార మగును. ఆహర్మ్యములను దిశలయందుచేసిన యెడల సుందరమగును. ఉపపీఠములనుకూడ ప్రతి అంతస్తున చేసినచో ఉపకాంతమగును. లేక పై అంతస్తున అంతటను వేదికలును ప్రస్తరములును అంతర ప్రస్త రములును కల్పించిన యెడల కమలాకమగును. మూడవ అంతస్తును మంచమును చేసినచో రత్నకాంతమగును. నాలుగు ప్రస్తరములతో గూడె నేని విపులాంకమగును. ఐదు అంతస్తులు ప్రస్తరము చేసిన ఎడల జ్యోతిష్క్రాంతమగును. ఆదియే భద్రములతో జేసిన యెడల సరోరుహ మగును. అదియే గలమును శిఖరమును గుండ్రముగా చేసినచో విపుల మగును. అదియే శిఖరము గలము 8 కోణములుగా జేసిన యెడల స్వస్తి కాంతమగును. దానినే మొత్తము చతురస్రముగా జేసిన యెడల నంద్యా వర్తమగును. దానినే గలమును మాత్రము 8 కోణములుగాజేసి శిఖర మును గుండ్రముగా జేసిన యెడల ఇక్షుకాంతమగును. ఇట్లు 13 భేద ములు కలవు.

శ్లో॥ త్రిచతుష్పంచ షట్సప్తం మధ్యకోష్ఠం విశాలకం॥ 14
ఏక ద్విత్రిచతుష్పంచ భాగంహారం సపంజరం ।
ఏకం వాఽథ ద్విభాగం వా. కర్ణకూట విశాలకం॥ 15
తలే తలే కర్ణకూటం కోష్ఠహారాది భూషితం ।
ఏక ద్విత్రివిభాగంచ హారమధ్యేతు భద్రకం॥ 16
ఏక ద్విత్రిచతుష్పంచం కోష్ఠమధ్యేతు భద్రకం ।
కర్ణకూట విశాలేత్రి భాగైకం మధ్య భద్రకం॥ 17
భద్రశాలా మహానాసీ చార్ధశాలాద్యలంకృతం ।
ఆదిభూమి క్రియా యుక్తా చోర్ధ్వేచోర్ధ్వే తలేన్యపేత్॥ 18
ద్వితలాత్ షట్తలాంతంస్యా దేవం యుక్త్యా స్వలంకృతం
నానాధిష్ఠానసం యుక్తం నానాపాదైరలంకృతం॥ 19
నానా పంజరశాలాభి ర్నాసికా పంజరాన్వితం ।
ప్రస్తరాది కపోతాంతం క్షుద్రనాస్యా విభూషితం॥ 20

తా॥ 3, 4, 5, 6, 7 భాగములు మధ్యకోష్ఠమును విస్తారముచేసి

కూడ చేయవలయును 1 భాగముగాని, 2 భాగములుగాని, కర్ణకూటము యొక్క విస్తారమును చేయవలయును. ప్రతి అంతస్తున కర్ణకూటము లును కోష్ఠములును హారములును చేయవలెను 1, 2, 3 భాగములు హారముయొక్క మధ్యను భద్రమును చేయవలెను. 1, 2, 3, 4, 5 భాగములు కోష్ఠము యొక్క మధ్యను భద్రమును చేయవలెను. కర్ణకూటము యొక్క విస్తారమును మూడుభాగములుచేసి అందు 1 భాగము మధ్యను భద్రమును చేయవలెను. భద్రశాలయును, మహానాసియును, క్షుద్రనాసియును మొదలగు అలంకారములను చేయవలెను. మొదటి అంతస్తున చేసిన రూపములన్నియును పై పై అంతస్తుల యందు చేయవలెను. రెండవ యంతస్తు మొదలు ఆఱవ అంతస్తు వరకు ఇట్లు ఆలోచనతో అలంకారమును చక్కగా చేయవలెను. అనేక అధిష్ఠానములును, అనేక స్తంభములును, నానావిధములైన పంజరములును, అనేక విధములైన శాలలును, అనేక నాసికా పంజరములును ప్రస్తరము మొదలు కపోతము వరకు క్షుద్రనాసికలును కల్పించవలెను.

శ్లో॥ శిఖరేచ మధ్యనాస్యైః క్షుద్రకపోతనాసికాః ।
సవంశనాసికా యుక్తం. సర్వాలంకారసం యుతం॥ 21
గ్రీవేచక్షుద్రపాదానాం. యుక్త్యాచ సమలంకృతం ।
కర్ణహర్మ్యాది సంయుక్తం, యత్తలోపరిదేశకే॥ 22
ఏకభాగం ద్విభాగంవా, మూలవ్యావృతావిందకం ।
ఊర్ధ్వోర్ధ్వతలానాంతు చైకబాగేనావిందకం॥ 23
ఏతత్తు షట్తలంప్రోక్తం, శేషం కుర్యా పూర్వవత్ ।
పూర్వోక్తం సర్వదేవానాం, మపి తత్రాఖిల సాధకోష్ఠ కేషు॥
బ్రహ్మ విష్ణు శివనారదైః సహ, సంతుష్టైః కురుతే శిల్పవిత్తమః॥ 24
ఇతి మానసారే వాస్తుశాస్త్రే షట్తలవిధానం ।
నామ చతుర్వింశోఽధ్యాయః॥ 25

తా॥ శిఖరమున మధ్యనాసికలును, క్షుద్రకపోతనాసికలును, మహానాసికలును. సమస్తమైన అలంకారములును గలమునను క్షుద్రస్తంభముల యందును యుక్తితో అలంకారములను చేయవలెను. కర్ణముల యందు హర్మ్యములు 1 భాగముగాని 2 భాగములుగాని చుట్టూ అలిందములును పై పై అంతస్తుల యందు ఒక్కొక్క భాగమే అలిందమును

చేయవలెను. శేషించిన పనులు ఆలోచనతో చక్కగా చేయవలెను. పూర్వము చెప్పబడిన సమస్తదేవతలకును స్థానములు అన్నిచోట్లను కల్పించవలెను. బ్రహ్మ, విష్ణువు, శివుడు నారదుడు మొదలగు వారు చెప్పిన శాస్త్రముల ననుసరించి చెప్పబడిన షడ్భూమి విధానము.

## 6. షడ్భూమికము ద్రావిడ పద్ధతి

సమరాంగణ 62 వ అధ్యాయము :

శ్లో॥ అథషడ్భూమమేకోన, త్రింశద్ధస్తం ప్రచక్ష్మహే॥ 173
చత్వారింశత్కరాః సైకా స్తస్యోచ్ఛ్రాయో విధీయతే।
పీఠం ప్రకల్పయేత్తస్య, సార్ధహస్త ద్వయోచ్ఛ్రితం। 174
జంఘాసముచ్ఛ్రయే కార్యా సార్ధహస్త చతుష్టయం।
కూటప్రస్తారమస్యాహుః, సార్ధహస్తోచ్ఛ్రితంబుధాః॥ 175
జంఘాద్వితీయాతు భవేత్ తస్యాహస్త చతుష్టయం।
ద్వితీయ కూటస్యోత్సేధం, సార్ధహస్తం ప్రకల్పయేత్॥ 176
జంఘా యాచతురో హస్తాన్పాంఘ్రి ష్వోపర్జితా।
తృతీయ కూటప్రస్తారం, కార్యప్యాయోఽపి పూర్వవత్॥ 177
జంఘాభవేచ్చ తుర్థీచ, ససార్ధంతు కరత్రయం।
పూర్వమానేన కుర్వీత, కూటప్రస్తారమూర్ధ్వతః॥ 178
హస్తత్రయం విధాతవ్యాజంఘోచ్ఛ్రాయేణ పంచమీ।
కూటప్రస్తారకం కుర్యాత్ సార్ధహస్తోచ్ఛ్రితం తతః॥ 179
షష్ఠీ హస్తత్రయం జంఘాపాదహీనం విధీయతే।
ప్రాగ్వత్ ప్రస్తారకూటంతు కపోతంత్రి కరోచ్ఛ్రితం॥ 180
తస్యోపరిభవేద్ఘంటం, హస్తపంచకముచ్ఛ్రితా।
కర్తవ్యం పద్మముపరి. సువిచిత్రం షడంగులం॥ 181
కుర్యాద్భాగైక వింశత్యా కుంభమాభరణైర్యుతం।
షడ్భూమికోఽయమాఖ్యాతః కథ్యతే సప్తభూమికః॥ 182

తా॥ ఆలయము వెడల్పు 29 హస్తములును ఎత్తు 41 హస్తములును చేయవలెను. పీఠము 2½ హ, జంఘ 4½ హ, కూటము 1½ హ, రెండవ జంఘ 4 హ, కూటము 1½ హ, మూడవ జంఘ 3½ హ, కూటము 1½ హ, నాల్గవ జంఘ 3½ హ, కూటము 1½ హ, ఐదవ జంఘ 3 హ, కూటము 1½ హ, ఆఱవ జంఘ 2¾ హ, కూటము 1½ హ, కపోతము 3 హస్తములు

నాసికతో అందముగా చేయవలెను. ఘంట 5 హస్తములు, దానిపైన పద్మము ¼ అనగా 6 అంగుళములు దానిపైన కుంభము సమస్త విధము లైన అలంకారములతో 21 భాగములు చేయవలెను. ఇది షడ్భూమిక విధానము. (అనుబంధము 2వ పటము చూడుము)

## 7. సప్తభూమి లక్షణము

కాశ్యపశిల్పము 34 వ పటలము :

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ, సప్తభూమేస్తు లక్షణం।
ప్రాసాదమాన విధినా వ్యాసోదయం ప్రకల్పయేత్॥ 1
రవ్యంశం విభజేత్తారం, వేదాంశం గర్భగేహకం।
పక్షాంశంభిత్తి విష్కంభ మేకేనాలింద్ర మిష్యతే॥ 2
హారాంతరమథాంశేన, పరితః కల్పయేద్బుధః।
విన్యాస సూత్రయోరంతం భాన్వంశేన సమం భవేత్॥ 3
ఏకాంశం కూట విస్తారం. కోష్ఠం తద్ ద్విగుణాయతం।
పంజర వ్యాసమేకాంశం. శేషం హారాంతరం భవేత్॥ 4
చతుష్కూటాష్టశాలాచ భానుపంజర సంఖ్యయా।
తస్యోర్ధ్వభూమి విస్తారం, ధర్మభాగ విభాజితే॥ 5
కర్ణకూటంచ కోష్ఠంచ- పూర్వవత్పరి కల్పయేత్।
పంజర వ్యాస మర్ధాంశం శేషం హారాంతరం భవేత్॥ 6
తస్యోర్ధ్వ భూమివిస్తారం ధర్మభాగ విభాజితే।
పంజరం కూటకోష్ఠంచ, పూర్వవత్పరి కల్పయేత్॥ 7
ఊర్ధ్వభూమౌన వాంశేతు మధ్యేశాలాగ్ని భాజితే।
వ్యోమాంశం కర్ణకూటంస్యా దేకాంశం పంజరస్తతః॥ 8

తా॥ ఏడంతస్తులుగల దేవాలయమును గూర్చి చెప్పుచున్నాడు. ప్రాసాదలక్షణమున జెప్పబడిన రీతిగా విస్తారమును ఎత్తును చేయ వల యును. విస్తారమును 12 భాగములుచేసి అందు గర్భాలయమును 4 భాగములును, గోడయొక్క లావు 2 భాగములును, ఆలింద్రము 1 భాగమును హారాంతరము 1 భాగమును ఇట్లు చుట్టూ చేయవలయును. విన్యాససూత్రములోపల 12 భాగములుచేసి అందు కర్ణకూటము యొక్క విస్తారము 1 భాగమును, కోష్ఠముయొక్క విస్తారము 2 భాగములును, పంజరము యొక్క విస్తారము 1 భాగమును మిగిలిన ప్రదేశము

హారాంతరమును చేయవలెను. అయితే 4 కూటములును, 8 శాలలును' 12 పంజరములును ఇట్లు చేయవలెను. దానిపై యంతస్తున విస్తారమును 10 భాగములుచేసి కర్ణకూటము 1 భాగమును, కోష్ఠమును 2 భాగములును మునుపటివలెనేచేసి పంజరవ్యాసమును ½ భాగము చొప్పున చేయవలెను. మిగిలినది హారాంతర మగును. దానిపై యంతస్తును 10 భాగములుచేసి పంజరమును కూటమును కోష్ఠమును మునుపటివలెనేచేసి మిగిలిన దానిని హారాంతరము చేయవలెను. దానిపై యంతస్తును 9 భాగములుచేసి, మధ్య శాలను 3 భాగములుగా చేయవలెను. కర్ణకూటమును 1 భాగమును పంజరమును 1 భాగమును చేయువలయును. మిగిలినది హారాంతరమని తెలియవలెను.

శ్లో॥ హారాంతర మధార్ధాంశం తస్యోర్ధ్వం వసుభాజితే ।
మధ్యేశాలాద్విభాగేన శేషం పూర్వవదాచరేత్॥ 9
తదూర్ధ్వ భూమివిస్తారం రసభాగ విభాజితే ।
కూటమేకాంశ మిత్యుక్తం శాలాతద్ ద్విగుణాయుతా॥ 10
అర్ధాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్ ।
తదూర్ధ్వ భూస్త్రిభాగైకం మధ్యే దండేన నిర్గతం॥ 11

తా॥ పై జెప్పిన నాల్గవయంతస్తున హారము ½ భాగము చొప్పున చేయవలెను. ఐదవ యంతస్తు విస్తారమును 8 భాగములుచేసి మధ్యను శాల 2 భాగములు చేయవలెను. మిగిలినవన్నియును మునుపుచేసిన ప్రకారమే చేయవలెను. 6వ అంతస్తును విస్తారమును 6 భాగములు చేసి కూటము 1 భాగమును శాల 2 భాగములును పంజరము ½ భాగమును చేయవలెను. మిగిలినది ½ భాగము చొప్పున హారాంతరమును చేయవలెను. దానిపై యంతస్తు యొక్క విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగమును మధ్య నిర్గమము 1 దండము చేయవలెను.

శ్లో॥ సప్తషష్టీతి భాగంతు కర్తవ్యం సదనోదయం ।
సపాదాగ్నిరధిష్ఠానం, సార్ధషట్కాంఘ్రి తుంగకం॥ 12
తదర్ధం మంచమానంతు షడ్భాగం చరణోదయం ।
సత్రిపాదద్విభాగంతు మంచమాన ముదాహృతం॥ 13
సార్ధభూతాం శమంఘ్ర్యుచ్చం సార్ధద్వ్యంశం ప్రస్తరం ।
సపాద పంచమభాగంతు స్తంభమాన ముదాహృతం॥ 14
ప్రస్తరం సార్ధపక్షాంశం భూతాంశం చరణోదయం ।
సపాద ద్విభాగం మంచంస్యాత్ సత్రిపాదయుగాంశకం॥ 15

చరణోదయమిత్యుక్తం ప్రస్తరోచ్చం ద్విభాగయా।
పాదోచ్చం సార్ధవేదాంశం, పాదోనద్వ్యంశ మంచకం॥ 16
వ్యోమాంశం వేదికోత్సేధం పాదోనద్వ్యంశకం గలం।
అర్ధాధిక్య యుగాంశంతు శిఖరోదయ మిష్యతే॥ 17
పక్షాంశం స్తూపిమానంతు గణ్యం సప్తతలం విదుః॥

తా॥ ఆలయము యెత్తును 67 భాగములుచేసి అధిష్ఠానము $3\frac{1}{4}$ భా, స్తంభము $6\frac{1}{2}$ భా, ప్రస్తరము $3\frac{1}{4}$ భా, రెండవ స్తంభము 6 భా, ప్రస్తరము $2\frac{3}{4}$ భా, మూడవ స్తంభము $5\frac{1}{2}$ భా, ప్రస్తరము $2\frac{1}{2}$ భా, నాల్గవ స్తంభము $5\frac{1}{4}$ భా, ప్రస్తరము $2\frac{1}{2}$ భా, ఐదవ స్తంభము 5 భా, ప్రస్తరము $2\frac{1}{4}$ భా, ఆఱవ స్తంభము $4\frac{3}{4}$ భా, ప్రస్తరము 2 భా, ఏడవ స్తంభము $4\frac{1}{2}$ భా, ప్రస్తరము $1\frac{3}{4}$ భా, వేదిక 1 భా, గలము $1\frac{3}{4}$ భా, శిఖరము $4\frac{1}{2}$ భా స్తూపిక 2 భా, ఇట్లు చేయవలయును.

## 8. సముజ్జ్వలము మొదలగు 10 భేదములు

శ్లో॥ పంజరం కూటకోష్ఠంచ సమసూత్రేతు కల్పితం॥ 18
హారా మాదాగ్రం యుగాశ్రంతు శిఖరే వేదినాసికా।
శాలా షట్త్రింశతిర్యుక్తంభాను ద్విగుణకూటకం॥ 19
షష్టిపంజరసం యుక్తం పాదం ప్రత్యల్పనాసికా।
నానాధిష్ఠాన సం యుక్తమేకాకార మథాపివా॥ 20
ఏకేనాకృతిరం ఘ్రీతు సముజ్జ్వాల ముదాహృతం॥

తా॥ పంజరములు కర్ణకూటములు కోష్ఠములు ఇవి యన్నియును సమానముగా సూత్రమును పట్టి చేయవలయును. అధిష్ఠానము మొదలు కొని స్తూపికవఱకు నలుచదరముగాను శిఖరమున వేదికయును, నాసికయును 36 శాలలును, 24 కర్ణకూటములును, 60 పంజరములును స్తంభముల యందు క్షుద్రనాసికలును, అనేకవిధములయిన అధిష్ఠానములును లేక ఒక్కటే రీతిగానున్న యధిష్ఠానములును స్తంభములు కూడ అన్నియును ఒక్కటే రూపముతోను చేయబడెనేని అది సముజ్జ్వాల మని పించుకొనును (అనుబంధము 4వ పటము చూడుము)

శ్లో॥ తదేవాంతర కూటాఃస్యుః సాంతర ప్రస్తరాన్వితం॥ 21
శ్రీఛందమితి విఖ్యాతం సర్వదేవార్హకంపరం।
తదేవతత కూటాశ్చా నంతాః కోష్టాః సమంచకాః॥ 22

శ్రీ విశాల మితిఖ్యాతం సర్వదేవ ప్రియావహం।
తదేవ శీర్షం కంఠంచ అష్టాశ్రం వేదికా తథా॥ 23
శ్రీకాంత మితి విఖ్యాతం కూటకోష్ఠ సమంతువా।
సమంచతత కూటంస్యా చ్ఛ్రీప్రియం తదుదాహృతం॥ 24
తదేవవృత్త శిఖరం స్తూపించైవ గలం తథా।
రుద్రకాంతమితి విఖ్యాతం రుద్రప్రీతికరం పరం॥ 25

తా॥ పై జెప్పిన దానినే లోపలను గూడ కర్ణకూటములును ప్రస్తరములును చేసిన యెడల శ్రీఛందమగును. అదియే విస్తారముగా కూటములును కోష్ఠములును పంజరములును నిండుగా చేసిరేని శ్రీవిశాలమగును. అదియే శిఖరము గలము వేదిక 8 కోణములుగా రచించినచో శ్రీకాంతమగును. కూటకోష్ఠములు సమముగాగాని ప్రస్తరములతోగూడిన కూటములుగాని చేసినయెడల శ్రీప్రియమగును. అదియే గుండ్రనిశిఖరమును స్తూపికయును, గలమును కలదానినిగా జేసిరేని రుద్రకాంతమగును.

శ్లో॥ తదేవ కర్ణకూటంతు వేదాశ్రాష్టాశ్రమండలం।
క్రమేణాది తలాత్ కల్ప్యం, వృత్తభద్రమిదం వరం॥ 26
తదేవోన్నత కూటంచ నతశాలాసమన్వితం।
కూటప్రస్తకవృత్తంచ సువృత్త మితి విద్యతే॥ 27
సోన్నతం కూటకోష్ఠంచ పంజరోన్నత మంచకం।
యథేష్టం శిఖరాకారం కంఠం స్తూపి ఘటి తథా॥ 28
యుగాశ్రం శీర్షకోపేతం కంఠంకూటం ప్రకల్పయేత్।
శివభద్ర మితిఖ్యాతం శివప్రీతికరం పరం॥ 29
తదేవ కూటకోష్ఠంతు దండం వాధ్యర్ధదండకం।
ద్విదండం వాథనిష్క్రాంతం భద్రంవా భద్రపంజరం॥ 30
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదై రలంకృతం।
నానాచిత్రై ర్విచిత్రంతు శివసౌఖ్య ముదాహృతం॥ 31
తదేవ గర్భగేహంతు వృత్తంవాథయుగాశ్రకం।
వృత్తమేవం హిబాహ్యేతు వృత్తాభం సాష్టికాన్వితం॥ 32
శేషం పూర్వవదుద్దిష్టం నానాసర్వాంగమండలం।

యద్దేష్టం శిఖరాకారం శివప్రీతిక మిష్యతే।
ఏవం సప్తతలంఖ్యాతం వసుభూమి మధోపరి॥ 34

ఇతి కాశ్యపశిల్పే సప్తభూమి విధానం నామచతుస్త్రింశః పటంలః

తా॥ పై జెప్పిన దానినే కర్ణకూటములను నలుచదరమును 8 కోణములుగాను గుండ్రముగాను ఇట్లు వరుసగా మొదటి అంతస్తునుండి చివర అంతస్తు వరకు చేసిరేని వృత్తభద్రమగును. అదియే యెత్తయిన కర్ణకూటములతో పల్లముగానున్న శాలలతోను కర్ణకూటములును ప్రస్తరములును గుండ్రముగా జేసిరేని సువృత్తమగును, కర్ణకూటములును కోష్ఠములును యెత్తుగాచేసి పంజరములను ప్రస్తరములనుకూడ యెత్తుగానేచేసి శిఖరము యొక్క యాకారమును యిష్టానుసారముగా రచించి గలమును స్థూపికను కుంభమును ఇవి యన్నియు నలుచదరముగా చేసిరేని కర్ణకూటములు కూడ కంఠములతో నహనలు చదరముగానే చేసినయెడల శివభద్రమగును. అదియే కర్ణకూటములును కోష్ఠములును 1 దండముగాని 1½ దండముగాని 2 దండములుగాని నిర్గమమునుచేసి భద్రములనుగాని భద్రపంజరములనుగాని అనేకవిధములయిన అధిష్ఠానములతోను, అనేకవిధములైన స్తంభములతోను, అనేకవిధములైన చిత్రములతోను, కల్పించిరేని శివసౌఖ్యమగును. అదియే గర్భాలయము గుండ్రముగాగాని నలుచదరముగాని అటులే వెలుపలగూడ శుభ్రముగాచేసి కర్ణకూటములుగూడ అటులే గుండ్రముగాచేసి మిగిలిన పనులన్నియును మునుపటివలెనే చేయవలెను. అనేకవిధములైన రూపములను గుండ్రముగా పంజరములను కోష్ఠములనుకూడచేసి అంతరప్రస్తరములు లేకుండ యిష్టము వచ్చినట్లు శిఖరమును అందముగాను అలంకారముగాను చేసిన శివప్రియమగును. ఇట్లు సప్తతల విధానమును అందలి భేదములను చెప్పబడినవి. అష్టతలవిధానమును చెప్పబోవుచున్నాను.

## 9. సప్తభూమి మరియొక పద్ధతి

**మానసారము 25 వ అధ్యాయము :**

శ్లో॥ సప్తభూమి విధానంచ లక్షణం వక్ష్యతేఽధునా।
విస్తారోత్సేధమానంచ పూర్వవత్పరి కల్పయేత్॥ 1
జన్మాదిస్థూపి పర్యంతం సమానాని విభాజితే।
భాగేన షట్షడంశంస్యాత్ ద్వ్యంశాధిష్ఠాన తుంగకం॥ 2

తద్ద్వయం పాదతుంగంస్యాత్ ప్రస్తరోచ్చం కలాంశకం।
తదూర్ధ్వేఽంఘ్రి సార్ధవహ్న్యంశం తదర్ధం ప్రస్తరోదయం॥ 3
గుణాంశం పాదతుంగంస్యాత్ సార్ధభాగోర్ధ్వ మంచకం।
సార్ధయుగ్మాంశ పాదోచ్చం సపాదాంశంతు ప్రస్తరం॥ 4
వేదికాచార్ధ భాగంస్యాత్ సపాదాంశం గలోదయం।
చరణోచ్చం ద్విభాగంస్యా న్మంచోచ్చమం బరాంశకం॥ 5
పాదోనద్వ్యంశ పాదోచ్చం శివాంశం ప్రస్తరోదయం।
అధ్యర్ధం పాదతుంగంస్యా న్మంచోచ్చంతు తదర్ధకం॥ 6
వేదికాచార్ధ భాగంస్యాత్ సపాదాంశం గలోదయం।
తద్ద్వయం శిఖరోత్తుంగం శేషంతు తచ్ఛిఖోదయం॥ 7

తా॥ ఏడంతస్తులు గల దేవాలయము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును యెత్తును పూర్వము చెప్పబడిన ప్రకారము చేయవలెను. అధిష్ఠానము మొదలు స్తూపికవరకు సమానభాగములుగా చేయవలయును. ఎత్తును 36 భాగములుచేసి అధిష్ఠానము 2 భా, స్తంభము యెత్తు 4 భా, ప్రస్తరము 2 భా, రెండవ స్తంభము $3\frac{1}{2}$ భా, ప్రస్తరము $1\frac{3}{4}$ భా, మూడవ స్తంభము 3 భా, ప్రస్తరము $1\frac{1}{2}$ భా, నాల్గవ స్తంభము $2\frac{1}{2}$ భా, ప్రస్తరము $1\frac{1}{4}$ భా, వేదిక $\frac{1}{2}$ భా, గలము $1\frac{1}{4}$ భా, ఐదవ స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా, ఆఱవ స్తంభము $1\frac{3}{4}$ భా, ప్రస్తరము 1 భా, ఏడవ స్తంభము $1\frac{1}{2}$ భా, ప్రస్తరము $\frac{1}{4}$ భా, వేదిక $\frac{1}{2}$ భా, గలము $1\frac{1}{4}$ భా, శిఖరము $2\frac{1}{2}$ భా, మిగిలినది స్తూపిక $\frac{1}{2}$ భాగము చేయవలయును.

## 10. పుండరీకము మొదలగు 8 భేదములు

శ్లో॥ పూర్వవద్భక్తి మానేన విస్తారం తత్ప్రకల్పయేత్।
క్షుద్రే మధ్యేచ ముఖ్యేచ కూటశాలాది భాగతా॥ 8
ఏకంవా థద్విభాగంవా కర్ణకూటవిశాలకం।
షట్సప్తాష్టనవాంశంవా శాలాయామంతు మధ్యమే॥ 9
శాలాకూటద్వయోర్మధ్యే శేషాంశం చాంతరాలకం।
తన్మధ్యేద్విత్రిభాగైకం క్షుద్రశాలా విశాలతా॥ 10
తత్తత్పార్శ్వద్వయోర్యా ద్వారే శేషభాగం విధీయతే।

తలేతలేచ పాదౌచ కర్ణహర్మ్యాదిమండితం।
పుండరీక మిదం ప్రోక్తం సర్వాలంకార సంయుతం॥ 12
మధ్యేతు భద్రశాలంచ శ్రీకాంతమితి స్మృతం।
ఊర్ధ్వేశాలాసమాయుక్తం శ్రీభోగమితి కథ్యతే॥ 13
శాలాపార్శ్వేతు కూటంస్యా ద్వారణం తత్రప్రకథ్యతే।
గలకూట సమాయుక్తం పంజరాఖ్య ముదీరితం॥ 14
తలేతలే భద్రకోష్ఠ మాశ్రమంచేతి కర్తితం।
మంచయుగ్మేన సంయుక్తం హర్మ్యకాంతమితి స్మృతం॥ 15
ఊర్ధ్వేకూట సమాయుక్తం హిమకాంతమితి స్మృతం।
ఏతదష్ట విధం ప్రోక్తం సప్తభూమి విధానకే॥ 16

తా॥ పూర్వము చెప్పబడియున్న ప్రకారము విస్తారమును చేయవలెను. క్షుద్రము, మధ్యమము, ఉత్తమము అను భేదములతోను కూట శాలలు మొదలైన భాగములతోను 1 భాగముగాని 2 భాగములుగాని కర్ణ కూటముయొక్క విస్తారమును చేయువలెను. 6, 7, 8, 9 భాగములు మధ్యను శాలయొక్క పాదవును చేయవలెను. శాలయొక్కయు, కూటము యొక్కయు మధ్యనున్న స్థలమును అంతరాలమును చేయువలెను. అందులో 2, 3 భాగములుచేసి అందు 1 భాగము క్షుద్రశాలయొక్క విస్తారమును చేయవలెను. వాని వాని యొక్క యిరువైపులనున్న హార మును శేషభాగమని చెప్పుదురు. దానిపైన 1 భాగము చుట్టును అలింద మును చేయవలయును. ప్రతిఅంతస్తునను రెండుస్తంభములయందు కర్ణహర్మ్యములను కల్పించవలెను. దీనిని పుండరీకమందురు. (అను బంధము 5వ పటము చూడుము) మధ్యను భద్రశాలను చేసినయెడల శ్రీకాంతమగును. పైన శాలలను చేసిరేని శ్రీభోగమగును. శాలయొక్క ప్రక్కలయందు కూటములు చేసిరేని వారణమగును. గలమున కూటము లను చేసిరేని పంజరమగును. ప్రతిఅంతస్తునను భద్రకోష్ఠములనుచేసిరేని ఆశ్రమమగును. రెండు ప్రస్తరములతోగూడి యుండెనేని హర్మ్యకాంత మగును. పైన కూటములతో గూడియుండెనేని హిమకాంతమగును. ఇట్లు 8 విధములు కలవు.

శ్లో॥ తలేతలేతు కోష్ఠంస్యా త్కర్ణకూటాద్య లిందకం।
క్షుద్రశాలాది సర్వేషాం వేదికాభిరలంకృతం॥ 17

తోరణైర్నాసికైర్యుక్తం క్షుద్రనాసైశ్చ భూషితం।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదైరలంకృతం॥ 18
నానాప్రస్తరసంయుక్తం జాలకాభిరలంకృతం।
ఏకాంగం చత్రయాంగంవా పంచసప్తాంగమేవవా॥ 19
ఏవం సప్తతలం ప్రోక్తం శేషంప్రాగుక్తవన్నయేత్।
దేవానాం పూర్వవత్కుర్యాత్తలేతలే విమానకే॥ 20

ఇది మానసారే వాస్తుశాస్త్రే సప్తతల విధానం నామ పంచ వింశోఽధ్యాయః

తా॥ ప్రతి అంతస్తునను శాలయును కర్ణకూటమును ప్రవిందమును క్షుద్రశాలలును, వేదికలును మొదలగువానితోను, తోరణములతోను, నాసికలతోను, క్షుద్ర నాసికలతోను అనేక విధములయిన అధిష్ఠానముల తోను, అనేకవిధములైన స్తంభములతోను, అనేకవిధములైన ప్రస్తరముల తోను, అనేకవిధములైన జాలకములతోను అలంకారముగా చేయవలెను. ఒక్కటే రూపముగాని లేక 3 రూపములుగాని, లేక 5 రూపములుగాని, లేక 7 రూపములుగాని ఒక్కొక్కదానియందు చూపవచ్చును. ఇట్లు యేడంతస్తులు గల దేవాలయ విధానము చెప్పబడినది. మిగిలిన పను లన్నియును పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. ప్రతి అంతస్తునను దేవతలకు నిర్ణయింపబడిన స్థానముల ననుసరించి ఆయా స్థానముల యందా దేవతల నుంచవలెను.

## 11. సప్త భూమికము ద్రావిడ పద్ధతి

**సమరాంగణ 62వ అధ్యాయము.**

శ్లో॥ పంచత్రింశత్కరః ప్రోక్తో విస్తారాత్సప్త భూమికః।
సార్ధాష్టేకోన పంచాశత్కర్ణ మిత్యుచ్ఛ్రితం కరాత్॥ 183
త్రిహస్తం పీఠముత్సేధా జంఘా పంచకరోచ్ఛ్రితా।
సార్ధహస్తోచ్ఛ్రితః కూటప్రస్తారోఽస్య విధీయతే॥ 184
ద్విహస్తో వేదికాబంధో జంఘోచ్ఛ్రాయశ్చతుష్కరః।
సార్ధహస్త సముత్సేధః కూటప్రస్తార ఇష్యతే॥ 185
సార్ధహస్తోచ్ఛ్రితావేదీ జంఘాసార్ధకరత్రయం।
సార్ధహస్తోచ్ఛ్రితః కూటప్రస్తారః ప్రకీర్తితః॥ 186

సపాదహస్తా వేదీస్యా జ్జం ఘాతుంగం కరత్రయం।
సార్ధహస్త స్తుకూటస్య ప్రస్తారః స్యాత్సముచ్ఛ్రయాత్॥ 187
హస్తంస్యా ద్వేదికాబంధో జంఘాం కోహికరద్వయం।
సపాదహస్తః కూటస్య ప్రస్తారో వేదికాకరం॥ 188
పాదో నద్వికరాజంఘా కూటం పాదయుతః కరః।
హస్త మాత్రోచ్ఛ్రితావేదీ జంఘాపార్ధ కరోచ్ఛ్రితా॥ 189
కూటప్రస్తారకో హస్తం కపోతః స్యాత్కరత్రయం।
స పద్మశీర్ష ఘంటాతు సార్ధం స్యార్ధస్త పంచకం॥ 190
ఏవమేష సముద్దిష్టః ప్రాసాదః సప్తభూమికః॥

తా॥ ఏడంతస్తులు గల దేవాలయమునకు విస్తారము 35 హస్తములును, ఎత్తు 49½ హస్తములను చేయవలెను. పీఠము 3 హస్తములు, జంఘ 5 హస్తములు, కూటము 1½ హస్తములు, వేదిక 2 హస్తములు, రెండవ జంఘ 4 హస్తములు, కూటము 1¼ హస్తములు, వేది 1¼ హస్తములు, మూడవ జంఘ 3½ హస్తములు, కూటము 1½ హస్తములు, వేది 1¼ హస్తములు, నాల్గవ జంఘ 3 హస్తములు, కూటము 1½ హస్తములు, వేదిక 1 హస్తము, ఐదవ జంఘ 2 హస్తములు, కూటము 1¼ హస్తములు, వేదిక 1 హస్తము. ఆఱవ జంఘ 1¾ హస్తములు, కూటము 1¼ హస్తము, వేదిక 1 హస్తను. జంఘ 1½ హస్తములు, కూటము 1 హస్తము, కపోతము 3 హస్తములు. పద్మముతో గూడిన శిఖరము గల ఘంట 5½ హస్తములు. ఇట్లు సప్తభూమిక ప్రాసాదము యొక్క విధానము చెప్పబడియుండెను. ఆపైన పద్మమును ¼ భాగమును, కలశమును 21 అంగుళములు చేయవలయును. (అనుబంధము 6వ పటము చూడుడు)

## 12. అష్టభూమి విధానము

కాశ్యప శిల్పము 35వ పటము.

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ వసుభూమి విధింపరం।
ప్రాసాదమాన విధినా సంగ్రాహ్యాం విస్తృతోదయం॥ 1
త్రయోదశ విభాగంతు కృత్వాప్రాసాదవిస్తృతం।
భూతాంశం గర్భగేహంతు ద్విభాగం గృహపిండికా॥ 2

అలింద్రంచైకభాగేన హారం భాగేన కల్పయేత్।
అథవానలభాగేన గర్భగేహం విధీయతే॥ 3
భాగేనగృహ పిండః స్యా దలింద్రంత్వేకభాగయా।
కుడ్యమేకే నకర్తవ్య మలింద్రంతు వినాఽంశకం। 4
తదర్ధం పంజరవ్యాసం భద్రం వాఽభద్రమేవవా।
భానుకోష్ఠం చతుష్కూటం కలాపంజరసం యుతం॥ 5
హారాంతరం చద్వాత్రింశ త్కల్పయేదాది భూతలె।
వక్షస్థల మలింద్రం స్యాత్ ప్రస్తరాంత ఘనీకృతం॥ 6
తదూర్ధ్వ భూమివిస్తృతం త్రయోదశ విభాజితే।
కూటకోష్ఠాది సర్వాంగ మాదిభూమి మివైవతు॥ 7

తా॥ ఎనిమిది అంతస్తులు గల దేవాలయము యొక్క విధానమును చెప్పుచున్నాడు. విస్తారమును యెత్తు మునుపు చెప్పబడియుండిన ప్రకారము చేయవలెను. విస్తారమును 13 భాగములు చేసి, అందు గర్భాలయము 5 భాగములు, గోడ 2 భాగములు, అలింద్రము 1 భాగమును హారము 1 భాగమును చేయవలెను. లేదా గర్భగృహమును 3 భా, గోడ 1 భా, అలింద్రము 1 భా, మరల గోడ 1 భా, అలింద్రము 1 భా, పంజరం ½ భా, భద్రముతోగాని భద్రము లేకుండగాని చేయవచ్చును. 12 కోష్ఠములును, 4 కూటములును, హారములును 32 హారాంతరములును మొదటి అంతస్తున చేయవలయును. (అనగా 14 భాగములు చేయవలెననుట) లేక జలాంతరమును ముగాను చేయవచ్చును. ప్రస్తరము యొక్క చివర ఒక్కటే దిమ్మగా చేయవలెను. దాని పైఅంతస్తును 13 భాగములు చేసి కూటకోష్ఠాది సమస్త రూపములును మునుపటివలెనే చేయవలయును.

శ్లో॥ తస్యోర్ధ్వ భూవిశాలంతు భానుభాగ విభాజితే।
కర్ణకూటం తదేకాంశం శాలాభాగద్వ్విభాగయా॥ 8
అర్ధాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్।
పంజరం కూటకోష్ఠంచ సంఖ్యాత్వాది తలోక్తవత్॥ 9
హారాంతర మధ్యార్ధాంశం లంబపంజర సంయుతం।

కర్ణకూటం తదేకాంశం మధ్యేశాలా ద్విభాగయా।
పంజరవ్యాసలేకాంశ మర్ధాంశంహార యోఽయాంతరం॥ 11
చతుష్కూటం చతుఃశాలం వసుపంజర సంయుతం।
హారాంతరం తథాప్రోక్తం కల్పేఽవ్యం షట్తలంభవేత్॥ 12
తదూర్ధ్వ భూమిభాగంతు షడ్భాగం విభజేత్సమం।
కూటవ్యాసైకాంశమిత్తం మధ్యేకోష్ఠం ద్విభాగయా॥ 13
అర్ధాంశం పంజర వ్యాసం శేషం హారాంతరం భవేత్।
తదర్ధం పంజరవ్యాసం భద్రా భద్రంతు ఏవశా॥ 14

తా॥ దాని పై అంతస్తును 12 భాగములు చేసి కర్ణకూటము 1 భా, శాల 2 భా, పంజరము $\frac{1}{2}$ భా, మిగిలినది హారాంతరము. అనగా $\frac{1}{4}$ భాగము ఇట్లు చేయవలెను. పంజరములు, కూటములు, శాలలు మొదలైనవి మొదటి అంతస్తున చేసిన సంఖ్యయే యుండవలెను. హారాంతరము $\frac{1}{2}$ భాగమును, నిడుపైన పంజరములును, అదేమాదిరిగా అంతస్తును 8 భాగములు చేసి కర్ణకూటము 1 భా, మధ్యశాల 2 భా, పంజరము 1 భా, హారము $\frac{1}{2}$ భా, 4 కూటములను 4 శాలలును, 8 పంజరములును మిగిలినది హారాంతరములును చేయవలెను ఇట్లు ఆఱవ అంతస్తును గూర్చి చెప్పబడి యుండెను. దానిపై అంతస్తును 6 భాగములు చేసి కూటము 1 భా, మధ్యశాల 2 భా, పంజరము $\frac{1}{2}$ భా, మిగిలినది హారాంతరమును చేయవలెను. హారములో సగమును పంజరమును చేయవలెను. భద్రమును చేసిగాని లేక భద్రమును చేయకుండగాని యిట్లు చేయవచ్చును.

శ్లో॥ భానుకోష్ఠం చతుష్కూటం కలాపంజరసంయుతం।
హారాంతరంచ ద్వాత్రింశత్కల్పయేదాది భూతలే॥ 15
వర్షస్థల మలింద్రంస్యాత్ ప్రస్తరంత్వ ఘనీకృతం।
తదూర్ధ్వ భూమి విస్తారం త్రయోదశ విభాజితే॥ 16
కూటకోష్ఠాది సర్వాంగమాదిభూమి మివైవతు।
తస్యోర్ధ్వ భూవిశాలంతు భానుభాగ విభాజితే॥ 17
కూటకోష్ఠాది సర్వాంగం మానసంఖ్యాది పూర్వవత్।
తదూర్ధ్వ భూదశాంశేతు కూటకోష్ఠంచ పూర్వవత్॥ 18

హారాంతర మథార్ధాంశం లంబపంజర సంయుతం।
తదూర్ధ్వ భూవిశాలంతు వసుభాగ విభాజితే॥ 19
కర్ణకూటం తదేకాంశం మధ్యేశాలా ద్విభాగయా।
పంజర వ్యాసమేకాంశ మర్ధాంశం హారయోఽంతరం॥ 20
చతుష్కూటం చతుఃశాలం వసుపంజర సంయుతం।
హారాంతరం తథాప్రోక్తం కల్ప్యేవం షట్తలంభవేత్॥ 21

తా॥ 12 శాలలును, 4 కూటములును, 16 పంజరములును, 32 హారాంతరములును మొదటి అంతస్తున చేయవలెను. జలాంతరమును అలంకారముగా చేసి ప్రస్తరమును విడదీసి చేయవచ్చును. ఆ పైఅంతస్తు యొక్క విస్తారమును 13 భాగములు చేసి కూటములు, శాలలు, పంజరములు మొదలైనవి మొదటి అంతస్తునకు వలెనే చేయవలెను. దానిపై అంతస్తును 12 భాగములు చేసి కూటకోష్ఠాది సమస్త రూపములు మునుపటివలెనే చేయవలెను. దానిపై అంతస్తును 10 భాగములు చేసి కూటకోష్ఠాదులను హారాంతరమును మునుపటివలెనే చేయవలెను. అర్ధభాగము విస్తారముతో ఎత్తయిన పంజరములను చేయవలెను. దాని పైఅంతస్తును 8 భాగములు చేసి కర్ణకూటము 1 భాగము, మధ్యశాల 2 భాగములు, పంజరము 1 భాగము, హారాంతరము ½ భాగము చేయవలెను. కూటములు 4, శాలలు 4, పంజరములు 8, హారాంతరములు 16 ఇట్లు షడ్భూమియందు చేయువలెను.

శ్లో॥ తదూర్ధ్వ భూవిశాలంతు షడ్భాగం విభజేత్సమం।
కూటమేకాంశమిత్యుక్తం మధ్యేకోష్ఠం ద్విభాగయా॥ 22
అర్ధాంశం పంజరవ్యాసం శేషంహారాంతరం భవేత్।
తదూర్ధ్వ భూవిశాలార్థ్యే మధ్యేదండేన నిస్రవకం॥ 23
కూటాత్కోష్ఠంతు నీస్రవంవా మధ్యశాలాత్వనీస్రవకా।
కూటంకోష్ఠమశేషంతు సమసూత్రేణ ఏవవా॥ 24
సప్త సప్తతిర్హస్తం కృత్వా హెూమాత్ సముచ్ఛ్రియం।
సార్ధత్ర్యంశమధిష్ఠానం సప్తాంశం చరణోదయం॥ 25

(త్రిభాగం ప్రస్తరం కుర్యాత్ స్తంభం షడ్భాగముచ్ఛ్రితం త్రిభాగం ప్రస్తరం చోర్ధ్వే సార్ధభూతాంశమంఘ్రికం)

సార్ధ ద్విభాగం మంచోచ్చం కల్పయేత్తు విశేషతః॥ 26

సపాద పంచభాగంతు చరణోదయమీరితం।

ప్రస్తరంసార్ధ పక్షాంశం భూతాంశం చరణోదయం॥ 27

సపాదద్వ్యంశమంచం స్యాత్పాదంపాదోన పంచకం।

మంచమానం ద్విభాగంతు సార్ధంపాదం యుగాంశకం॥ 28

సత్రిపాదాంశమంచోచ్చం వ్యోమాంశం వేదికోదయం।

కంఠంపాదోన పక్షాంశం సార్ధవేదాంశ శీర్షకం॥ 29

కంఠమానసమం స్థూపి తుంగమిత్యత్రకథ్యతే॥

తా॥ దానిపై అంతస్తును సమానముగా 6 భాగములు చేసి కూటము 1 భాగము, మధ్యశాల 2 భాగములు, పంజరము ½ భాగము, మిగిలినది ¼ భాగము హారాంతరము చేయవలయును. దానిపై అంతస్తు యొక్క విస్తారమున మధ్య 1 దండము నిర్గమమును చేసి కూటమునుండి కోష్ఠమునకు నిర్గమముగాని లేక మధ్యశాలకు నిర్గమము లేకుండగాని చేయుచు కూట కోష్ఠములు సమసూత్రముతో చేయవలెను. ఎత్తును 77 భాగములు చేసి అధిష్ఠానము 3½ భాగములు, మొదటి స్తంభము 7 భాగములు. ప్రస్తరము 3¼ భాగములు, రెండవ స్తంభము 6½ భాగములు, ప్రస్తరము 3 భాగములు, మూడవ స్తంభము 6 భాగములు, ప్రస్తరము 3 భాగములు, నాల్గవ స్తంభము 5½ భాగములు, ప్రస్తరము 2½ భాగములు, ఐదవ స్తంభము 5¼ భాగములు. ప్రస్తరము 2½ భా, ఆఱవ స్తంభము 5 భాగములు ప్రస్తరము 2¼ భాగములు. ఏడవ స్తంభము 4¾ భాగములు. ప్రస్తరము 2 భాగములు. ఎనిమిదవ స్తంభము 4½ భాగములు, ప్రస్తరము 1¾ భాగములు, వేదిక 1 భాగము, గలము 1¾ భాగములు, శిఖరము 4½ భాగములు, స్థూపిక 1¾ భాగములు. ఇట్లు చేయవలయును.

## 13. శివచ్ఛందము మొదలగు 5 భేదములు

శ్లో॥ స్థూప్యంతం తదుపానాది వేదాశ్రం పరికల్పయేత్॥ 30

అష్టాశ్రంచ యుగాశ్రంస్యాత్ స్తంభం ప్రత్యల్పనాసికం।

శిఖరేతు చతుర్నాసి యుక్తాస్తే స్యుర్మహాంతరాః॥ 31

ఏకాకారతలం స్తంభం శివచ్ఛంద ముదాహృతం।
తదేవతతశాఖాః స్యుర్కుంచకాః సొష్ఠికోన్నతం॥ 32
వాగీశమితి విఖ్యాతం సర్వదేవ ప్రియావహం।
చతురష్టాశ్ర వృత్తాభం సొష్టికోవా పునఃపునః॥ 33
విమాన శిఖరం కంఠ మష్టాశ్రం పరికల్పయేత్।
తదష్టభాగం విఖ్యాతం ధర్మప్రీతికరంపరం॥ 34
తదేవ కూటకోష్ఠంచ సమంచంవా విమంచకం।
సమోన్నతం తథాకూటం నానారూపయుతాంఘ్రికం॥ 35
నానాచిత్ర విచిత్రంతు తత్పర్వతమితి స్మృతం।
తదేవ శిఖరం కంఠం వృత్తాభం పరికల్పయేత్॥
నామ్నా కైలాసమిత్యుక్తం మమప్రీతి కరంపరం।
ఏవష్టతలం ఖ్యాతం నవభూమిమథోపరి॥ 37
ఇతి కాశ్యపశివేది వసుభూమి విధానం నామపంచత్రింశః పటలః.

తా॥ ఉపానము మొదలుకొని స్తూపికవఱకు నలుచదరముగా చేయవలెను. లేదా 8 కోణములుగా గాని నలుచదరముగా గాని స్తంభములను వానికి క్షుద్ర నాసికలును, శిఖరమున నలువైపుల నాసికలును, మహాతరములును అన్నియును ఒక్కటే ఆకారము గల స్తంభములును చేసినయెడల శివచ్ఛందమగును. దానినే విస్తారముగా శాఖలతో ప్రస్తరములు కర్ణకూటములు చేసినయెడల వాగీశమగును. నలుచదరముగా గాని యెనిమిది కోణములుగాగాని గుండ్రముగాగాని కర్ణకూటములు కూడ చేసి విమానము యొక్క శిఖరమును గలమును 8 కోణములుగా చేసిరేని ధర్మప్రీతికరమగును. అదియే కూటకోష్ఠములు ప్రస్తరములతోగాని ప్రస్తరములు లేకుండగాని సమానమై యెత్తున చేసి అనేక చిత్రములుగా స్తంభములు చేసి యిష్టము వచ్చిన చిత్రములతో చేసిరేని పర్వతమగును. అదియే శిఖరము కంఠము గుండ్రముగా చేసినయెడల కైలాసమగును. ఇట్లు 5 విధములగు భేదములు చెప్పబడినవి. ఎనిమిదంతస్తులు గల దేవాలయము యొక్క విధానము చెప్పబడినది.

(అనుబంధము 7వ పటము చూడుడు)

# 14. అష్టభూమి మరియొక పద్ధతి 8 విధములు

మానసారము 26వ అధ్యాయము.

శ్లో॥ అష్టతల విధానంచ లక్షణం వక్ష్యతేఽధునా।
పూర్వవత్తుంగ మానేన కుద్యమాద్యంగం మానయేత్॥ 1
పూర్వవద్భక్తిమానేన కూటశాలాదిమానయేత్।
భూ కాంతం భువస్కాంతంచ స్వర్గకాంతం తథైవచ॥ 2
మహాకాంతం జనకాంతంచ తపస్కాంతం సత్యకాంతకం।
దేవకాంత మితిప్రోక్త మష్టధానామ ఏవచ॥ 3
షోడశాంశక మాధిక్యం భాగం హర్మ్యవిశాలకం-
ఏకాంశం కర్ణకూటంస్యా ద్ధారాంతరం శివాంశకం॥ 4
ద్విభాగే నానుశాలాచ తదర్ధం చాంతరాలకం।
సప్తాంశేన మహాశాలా హర్మ్యమేతత్తు విన్యసేత్॥ 5
చతుష్కోణే చతుష్కూటం కోష్ఠేహారాది రష్టధా।
క్షుద్రశాలాష్టధాప్రోక్తం కోష్ఠశాలా చతుష్టయం॥ 6
మధ్యశాలా త్రిభాగేన భద్రశాలాచ మధ్యమే।
తత్తత్పార్శ్వద్వయోరేవ ద్విద్విభాగార్ధం శాలయేత్॥ 7
ఏవం మూలతలాద్యేచ్చ చోర్ధ్వోర్ధ్వోఽర్ధ తలంన్యసేత్।
అథూష్టాదశాంశేతు కూటహారాచ పూర్వవత్॥ 8

తా॥ ఎనిమిదంతస్తులు గల దేవాలయమును గూర్చి చెప్పుచున్నాడు. మునుపు చెప్పబడియున్న రీతిగా కోడను అధిష్ఠానమును చేయవలెను. కూటశాలాదులను గూడ పూర్వము చెప్పబడి యుండినట్లు చేయవలయును. భూకాంతము, భువస్కాంతము, స్వర్గకాంతము, మహాకాంతము, జన కాంతము, తపస్కాంతము, సత్యకాంతము, దేవకాంతము అను 8 భేద ములు కలవు. ఆలయము యొక్క విస్తారమును 17 భాగములు చేసి కర్ణ కూటము 1 భా, హారాంతరము 1 భా, అనుశాల 2 భా, అంతరాలము 1 భా, మహాశాల 7 భా. ఇట్లు హర్మ్యమును నిర్మించవలెను. నాలుగు మూలల యందు 4 కూటములును, కోష్ఠమున హారములు 8యును, క్షుద్ర శాలలు 8యును, కోష్ఠశాలలు 4ను, మధ్యశాల 3 భా, మధ్యను భద్రశాల యును దానికిరుపైపుల రెండును 2½ భాగములు చేయవలెను. ఇట్లు మొదటి అంతస్తునను దానికిపైన పైనను వరుసగా చేయవలెను లేక 18 భాగములు చేసి కూటములను హారములను చెప్పబోవురీతిగా చేయవలెను.

శ్లో॥ షడ్భాగేన మహాశాలా చతుఃశాలా త్రిభాగికా।
మధ్యశాలా యుగాంశేన భద్రశాలాచ మధ్యమే॥ 9
అనుశాలాచ మధ్యేచ ఏకభాగేన భద్రకం।
శేషంతు పూర్వవత్కుర్యా ద్భూకాంతముదీరితం॥ 10
ఏకోన వింశదంశేన చాష్టభూమి విశాలకే।
ఏకైకం కూటవిస్తారం మహాశాలాశరాంశకం॥ 11
అనుశాలా త్రిభాగావా హారాంతరం ద్విభాగికం।
మహాశాలా త్రిభాగేన భద్రశాలా విశాలతా॥ 12
శేషం ప్రాగుక్తవత్కుర్యా దేవంభాగాధికం తతః।
మధ్యశాలా శరాంశేన యుక్త్యాతన్మధ్య భద్రకం॥ 13
శేషంతు పూర్వవత్కుర్యాద్భువస్కాంత మితిస్మృతం।
ఏవం చాష్టతలే క్షుద్రహర్మ్యమేవం ప్రకల్పయేత్॥ 14
ఏకవింశాంశకంచాష్ట తలహర్మ్యే విశాలకే।
మధ్యేసప్తాంశకే చైవ మహాశాలా ప్రకల్పయేత్॥ 15
తన్మధ్యే భూతభాగేన మధ్యశాలా సభద్రకా।
తద్బహిశ్చ త్రిభాగేన భద్రశాలా విభూషితం॥ 16
శేషం ప్రాగుక్తవత్కుర్యాత్ స్వర్గకాంతమితి స్మృతం।
ఏవమష్టతలం కుర్యాన్మధ్యమాలయమేవచ॥ 17

(అనుబంధము 8వ పటము చూడుడు)

తా॥ మహాశాల 6 భాగములు, చతుఃశాల 3 భాగములు, మధ్యశాల 4 భాగములు, మధ్యను భద్రశాలయును, అనుశాలలును భద్రము 1 భాగమును మిగిలినవి మునుపటివలెనే చేయవలెను. ఇది భూకాంతము, విస్తారమును 19 భాగములు చేసి కూటమును ఒక్కొక్క భాగముచేసి మహాశాల 5 భాగములును, అనుశాల 3 భాగములును, హారాంతరము 2 భాగములును, మహాశాలలో 3వ వంతు భద్రశాలను చేయవలెను. మిగిలినవి మునుపటివలెనే చేయవలయును. తరువాత విస్తారమును 20 భాగములు చేసి మధ్యశాల 5 భాగములును, దానిమధ్య భద్రమును ఆలోచనతో చేయ

వలెను. మిగిలినవి మునుపటివలెనే చేయవలయును. ఇది భువస్కాంతము. ఇట్లు క్షుద్రహర్మ్యమున చేయవలెను. ఆలయము యొక్క విస్తారమును 21 భాగము చేసి మధ్యను మహాశాల 7 భాగములు చేయవలెను. దానిమధ్యను 5 భాగములదో మధ్యశాలను భద్రముతోసహ చేయవలయును. దాని వెలుపల 3 భాగములు భద్రశాల యలంకారముగా నుండవలెను. మిగిలినవి మునుపటివలెనే చేయవలయును, దీనిని స్వర్గకాంతమందురు. ఇది మధ్యమాలయ విధానములోనిది

శ్లో॥ ద్వావింశాంశకంతారేచ శ్రేష్ఠమష్టతలం భవేత్।
తన్మధ్యే చాష్టభాగేన మహాశాలా విశాలకం॥ 18
తన్మధ్యే వేదభాగేన కోష్ఠశాలాసభద్రకా।
మహాకాంత మితిప్రోక్తం తన్మధ్యేచ ద్విభాగతః॥ 19
భద్రశాలా సమాయుక్తం జనకాంత మితిస్మృతం।
తచ్ఛాలాయా ద్విపార్శ్వేతు నేత్రశాలా సభద్రకా॥ 20
ఏతత్తు తపస్కాంతంస్యా చ్ఛేషం ప్రాగుక్తవన్నయేత్।
తదేవ మధ్యశాలేతు తత్పార్శ్వేచ విశేషతః॥ 21
ఏకైకం కూటవిస్తారం తత్సమంహారసం యుతం।
ఏతత్తు సత్యకాంతంస్యా చ్ఛేషం పూర్వవదాచరేత్॥ 22
తదేవ మనుశాలాచ కుర్యాన్మధ్యంస భద్రకం।
దేవకాంత మితిప్రోక్తం చోర్ధ్వోర్ధ్వతలంన్యసేత్॥ 23
ఏవం శ్రేష్ఠం త్వష్టతవే సర్వాలంకార సంయుతం।
జన్మాదిస్తూ పిపర్యంతం చాంగమాన మిహోచ్యతే॥ 24

తా॥ విస్తారమును 22 భాగములు చేసి దానిమధ్య మహాశాల 8 భాగములును, దానిమధ్య కోష్ఠశాల భద్రసహితముగ 4 భాగములును చేసిరేని మహాకాంతమగును. దానిమధ్య 2 భాగములు భద్రశాలతోసహ చేసిన యెడల జనకాంతమగును. ఆ శాలయొక్క యిరువైపుల నేత్రశాలలు భద్రముతోకూడ చేసిరేని తపస్కాంతమగును. మిగిలిన పనులుయును మునుపటివలెనే చేయవలయును. అదియే మధ్యశాలయందును దాని ప్రక్కలను 1.1. భాగము కూటవిస్తారమును, అదే కొలతతో హారమును చేసిరేని సత్యకాంతమగును. శేషము మునుపటివలెనే చేయవలెను. అదియే

అనుశాలలును మధ్య భద్రముతో శాలయును చేసినచో దేవకాంతమగును
పై పై అంతస్తుల యందిట్లు చేయుచుండవలెను. ఇట్లు శ్రేష్ఠమైన అ
తలమునందు సర్వాలంకారముగ చేయవలెను

శ్లో॥ సైకాష్ట పంచసైకాంశం హర్మ్యతుంగం విభాజితే।
అధారం చాష్టభాగేన వేదాంశం చరణాయతం॥
తదర్ధం వలభ్యుత్సేధం సార్ధవహ్న్యంశమంఘ్రికం।
సత్రిపాదాంశకంమంచ మూర్ధ్వేపాదం గుణాంశకం॥
తదర్ధం చోర్ధ్వమంచస్యా త్త్రిపాదాగ్నాంఘ్రి తుంగకం।
స పాదాంశం ప్రస్తరోచ్చం ద్వ్యర్ధాంశంచరణాయతం॥
తదర్ధం ప్రస్తరోత్సేధం జంఘా సాంఘ్రిద్వయాంశకం।
ప్రస్తరంచైక భాగేన ర్ద్వేద్వ్యంశ మంఘ్రికం॥
ఊర్ధ్వమంచం త్రిపాదంస్యా ద్దిత్వాదోనద్వ్యంశ మంఘ్రికం।
ఏకాంశం ప్రస్తరోత్సేధం తదూర్ధ్వేచ త్రిభాగికం॥
తత్త్రిభాగైక వేదింస్యాత్ ద్విభాగం గలతుంగకం।
సపాదద్వ్యంశకంచోర్ధ్వే శిరః శేషం శిఖోదయం॥

తా॥ ఎత్తును 46 భాగములు చేసి అధిష్ఠానము 8 భా, స్తంభము
భా, వలభి 2 భా, రెండవ స్తంభము 3½ భా ప్రస్తరము 1¾ భా, మూడ
స్తంభము 3 భా, ప్రస్తరము 1½ భా, నాల్గవ స్తంభము 2¾ భా, ప్రస్తర
1½ భా, ఐదవ స్తంభము 2½ భా, ప్రస్తరము 1¼ భా, ఆఱవ స్తంభ
2¼ భా, ప్రస్తరము 1 భా, ఏడవ స్తంభము 2 భా, ప్రస్తరము ¾
ఎనిమిదవ స్తంభము 1¾ భా, ప్రస్తరము 1భా, వేదిక 1భా, గల 2భ
శిఖరము 2¼ భా, మిగిలినది ½ భా, స్తూపికను చేయవలయును.

శ్లో॥ కేచిత్త దేవతుంగేతు సప్తభాగాధికం తథా।
ఊర్ధ్వోర్ధ్వపాదమూలేతు యుక్త్యాంశేన మసూరకం॥
తలానాంచైక భాగేన కర్ణహర్మ్యశి (ర్మ్యమా) వృతం న్యసేత్।
అంతర ప్రస్తరోపేతం సర్వాలంకార సంయుతం॥
తస్యాం తస్యైక భాగేన కుర్యాదావృతాలిందకం।
మూలేభాగే పదాంశేన చోర్ధ్వంచోర్ధ్వ తలాంశకం॥

నేత్రశాలార్ధశాలాచ భద్రశాలావిభూషితం।
థోరణైర్నీడశాలాది నాసికాభి రలంకృతమ్॥ 34
కోష్ఠశాలాచ మధ్యేచ చోర్ధ్వేశాలాచ మండితం।
నాసికా పంజరాఢ్యంచ భద్రనాస్యైరలంకృతం॥ 35
క్షుద్రశాలా ప్రదేశేతు సర్వాలంకార సంయుతం।
కర్ణకూటాంగమధ్యేతు నాసికా పంజరాన్వితం॥ 36
సర్వాంగం క్షుద్రనాస్యంగం ప్రస్తరాలంకృతిక్రియా।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదైరలంకృతం॥ 37
నాగర ద్రావిడాదీనాం వేసరాదిశిఖాన్వితం।
సర్వాలంకార సంయుక్తం పూర్వవత్పరికల్పయేత్॥ 38

ఇది మానసారే వాస్తుశాస్త్రే అష్టతల విధానం నామ షడ్వింశోఽధ్యాయః.

తా॥ కొందఱు దానినే యెత్తులో 7 భాగములు పెంపుచేసి పై పై స్తంభముల యొక్క మొదళ్లయందు ఆలోచనతో ఒక్కొక్క భాగము అధిష్ఠానమును చక్కగావేసి అన్ని అంతస్తులలో ఒక్కొక్క భాగము కర్ణశాలను చుట్టూ చేయవలయును. అంతర ప్రస్తరములతోను సమస్తమైన అలంకారములతో చేయవలెను. దానిలోపల ఒక్కభాగము చుట్టూ అలిందమును చేయవలయును. మొదటి అంతస్తు చేసిన భాగముల ప్రకారమే పై పై అంతస్తుల యందును భాగములను చేయుచుండవలెను నేత్రశాల, అర్థశాల, భద్రశాల మొదలైనవానిచేత అలంకారముగా చేయవలెను. తోరణములతోను, పంజరములతోను, శాలలతోను, నాసికలతోను అలంకారముగా చేయవలెను. మధ్యను కోష్ఠశాలయును పైన శాలయును నాసికలును పంజరములును, భద్రనాసికలును చేయవలెను. క్షుద్రశాల యందు అన్ని అలంకారములను చేయవలెను. కర్ణకూటము యొక్క మధ్యను నాసికా పంజరములను చేయవలెను. క్షుద్రనాసికలను అంతటను చేయవలెను. ప్రస్తరములు మొదలైన అలంకారములతో చేయవలెను. అనేకమైన అధిష్ఠానములును అనేకవిధములైన స్తంభములును నాగర, ద్రావిడ, వేసరములను శిఖరములతో సమస్త విధములయిన యలంకారములతో మునుపటి వలెనే చేయవలయును

# 15. ద్రావిడ పద్ధతి అష్ట భూమికలు

సమరాంగణ సూత్రధార 62వ అధ్యాయము.

శ్లో॥ అథాష్ట భూమికం బ్రూమః ప్రాసాదం శుభలక్షణం॥ 191
చత్వారింశత్కరాంస్తస్య విస్తారం పరికల్పయేత్।
ఉచ్ఛ్రాయః సప్త పంచాశత్ కరాఃస్యుః పాదవర్జితాః॥ 192
నవహస్తాన్ ప్రకుర్వీత సార్ధాన్ ప్రథమ భూమికాం।
ద్వితీయాష్టౌ సపాదోర్ధ్వం తృతీయాష్టౌ కరాన్భవేత్॥ 193
చతుర్థీ సప్త హస్తాతు షట్కరా పంచమీభవేత్।
పంచహస్తా తతః షష్ఠీ చతుర్హస్తాతు సప్తమీ॥ 194
తతోఽష్టమీ త్రిహస్తాస్యాద్ వేదీబంధః కరద్వయం।
ఘంటాం చతుష్కరాంకుర్యా దేవంస్యా దష్టభూమికః॥ 195

తా॥ విస్తారము 40 హస్తములును, ఎత్తు 56$\frac{3}{4}$ హస్తములును చేయవలెను. మొదటి అంతస్తు 9$\frac{1}{2}$ హ, రెండవ అంతస్తు 8$\frac{1}{4}$ హ, మూడవ అంతస్తు 8 హ, నాల్గవ అంతస్తు 7 హ, ఐదవ అంతస్తు 6హ, ఆఱవ అంతస్తు 5హ, ఏడవ అంతస్తు 4హ, ఎనిమిదవ అంతస్తు 3హ, వేదిక 2 హ, ఘంట 4 హస్తములు చేసి ఆపైన కలశమును 21 అంగుళములు పద్మమును 6 అం. అందము ననుసరించి చేయవచ్చును.

(అనుబంధము 9వ పటము చూడుడు)

# 16. నవభూమి విధానము

కాశ్యప శిల్పము 36వ పటలము.

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ నవభూమి విధిం పరం।
ప్రాసాద మానవత్కార్యం గేహస్య సదనంతరం॥ 1
పక్షాంశం విభజేత్తారం గుణాంశం గర్భగేహకం।
ద్విభాగా గృహపిండీస్యా దలింద్రంత్వేకభాగయా॥ 2
వ్యోమాంశం కుడ్యవిస్తార మలింద్రం తత్సమం భవేత్।
హారవ్యాసం శివాంశేన కల్పయేచ్ఛిల్పవిత్తమః॥ 3
అథవాషోడశాంశంతు ప్రాసాదం విభజేత్సమం।
యుగాంశం గర్భగేహంతు ద్విభాగా గృహపిండికా॥ 4

అలింద్రంతు శివాంశేన వ్యోమాంశం కుడ్యవిస్తృతం।
అలింద్రం వ్యోమభాగేన హారా వైవంత తత్సమం॥ 5
విన్యాస సూత్రయోరంతః, కలాంశం విభజేత్సమం।
ఏకాంశం సౌష్ఠికం వ్యాసం కోష్ఠం తద్ద్వి గుణాయతం॥ 6
పంజర వ్యాసమేకాంశ మర్ధాంశం హారమానకం।
హారాంతరంచ ద్వాత్రింశ త్కల్పయేదాది భూతలే॥ 7
ఏవమేవ ప్రకర్తవ్యం ద్వితీయంచ మహీతలం।
తృతీయ భూతలాయామం మనుభాగ విభాజితే॥ 8

తా॥ తొమ్మిది అంతస్తులు గల దేవాలయమును గూర్చి చెప్పుచున్నాడు. విస్తారమును 15 భాగములు చేసి అందు గర్భగృహము 3 భాగములును, గోడ 2 భాగములును, అలింద్రము 1 భాగమును మరలగా 1 భాగమును మరల అలింద్రము 1 భాగమును, హారము 1 భాగమును చేయవలయును. లేక 16 భాగములు చేసి గర్భమందిరమును 4 భాగములు చేసి మిగిలినవన్నియును పై జెప్పిన ప్రకారమే చేయవలయును. ప్రస్తరము యొక్క పైభాగమును 16 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, కోష్ఠము 2 భాగములు, పంజరము 1 భాగమును, హారము ½ భాగమును. ఇట్లు 32 హారములను చేయవలయును. ఇది మొదటి అంతస్తు పైన చేయు పద్ధతి. రెండవ యంతస్తు పైనను ఈప్రకారమే భాగములను చేయవలయును. మూడవ యంతస్తు పైన 14 భాగములను చేయవలెను.

శ్లో॥ అర్ధాంశం పంజరవ్యాసం శేషం పూర్వవదాచరేత్।
తద్వచ్చతు స్తలంచైవ కల్పయేద్దేశికోత్తమః॥ 9
పంచభూమి విభాగంతు భానుభాగ విభాజితే।
ఏకాంశం కూటవిస్తారం శాలాతద్ద్విగుణాయతా॥ 10
అర్ధాంశం పంజరవ్యాసం తస్యార్ధం హారయోఽంతరం।
భానుశాలాచ కూటాభం పంజరం షోడశైవతు॥ 11
తదూర్ధ్వ భూవిశాలంతు వసుభాగ విభాజితే।
ఏకాంశం సౌష్ఠికవ్యాసం మధ్యేభాగ ద్విశాలయా॥ 12
పంజర వ్యాసమేకాంశ మర్ధాంశం హారయోఽంతరం।
తదూర్ధ్వ భూవిశాలంతు దశభాగ విభాజితే॥ 13

ఏకాంశం కూటవిస్తారం కోష్ఠం తద్ద్విగుణాయతం।
పంజర వ్యాసమర్ధాంశం శేషం హారాంతరం భవేత్॥ 14
తదూర్ధ్వే భూవిశాలంతు గుణభాగ విభాజితే।
మధ్యాంశం దండమానేన నిర్గమం పరికల్పయేత్॥ 15

తా॥ పంజరము ½ భాగము చేయవలెను. మిగిలిన పనులన్నియును మునుపటివలెనే చేయవలెను. నాలుగవ అంతస్తును కూడ అదే ప్రకారము చేయవలెను. ఐదవ అంతస్తును 12 భాగములు చేయవలెను. కూటము 1 భా, శాల 2 భా, పంజరము ½ భా, హారము ¼ భా, శాలలు 12, కూటములు 4, పంజరములు 16 చేయవలెను. దానిపై భూమిని 8 భాగములు చేయవలయును. కూటము 1 భా, మధ్యశాల 2 భా, పంజరము 1 భా, హారము ½ భా ఇట్లు చేయవలయును. దాని పైఅంతస్తును 6 భాగములు చేసి కూటము 1 భా, శాల 2 భా, పంజరము ½ భా, మిగిలినది హారమును చేయవలెను. దానిపై అంతస్తును 3 భాగములు చేసి అందు మధ్య 1 భాగమును దండమానముచేత నిర్గమమును చేయవలెను.

శ్లో॥ అష్టాశీతి విభాగంతు కృత్వాగేహోదయం బుధః।
పాదోన చతురం శంతు ధరాతలమితిస్మృతం॥ 16
పాదోచ్చం సార్ధ సప్తాంశం సార్ధాగ్న్యంశంతు ప్రస్తరం।
సప్తాంశం చరణోచ్చంతు సపాదాగ్న్యంశ మంచకం॥ 17
సార్ధషట్కాంఘ్రితుంగంతు గుణాంశం మంచమానకం।
షడ్భాగం పాదమానంతు పాదోనాగ్న్యంశ మంచకం॥ 18
పాదోచ్చం సార్ధభూతాంశం సార్ధ పక్షాంశమంచకం।
స పాదపంచ భాగంతు పాదోత్సేధం సముచ్యతే॥ 19
ప్రస్తరం సార్ధ పక్షాంశం భూతాంశం చరణోదయం।
పాదాధిక్యం ద్విభాగంతు ప్రస్తరస్యోదయం భవేత్॥ 20
పాదోన పంచకం పాదం ప్రస్తరోచ్చం ద్విభాగయా।
సార్ధ వేదాంశకం పాదం పాదోనద్వ్యంశ మంచకం॥ 21
శివాంశం వేదికోత్సేధం కంఠంచాధ్యర్ధభాగయా।
శిఖరం సార్ధవేదాంశం పాదోనద్వ్యంశకం శిఖం॥ 22

విస్తారే వింశదంశేషు కూటమేకైక భాగికం।
మధ్యశాలా షడంశంస్యాత్తత్సమం చాంతరాలకం॥ 3
తన్మధ్యేచ ద్విభాగేన క్షుద్రశాలై ర్విభూషితం।
తత్పార్శ్వే హార సంయుక్తం ద్విద్విభాగేనకారయేత్॥ 4
సారకాంత మితిప్రోక్తం శేషం ప్రాగుక్తవన్నయేత్।
మహాశాలై శ్చతుర్భాగం మధ్యేభద్రంతు రౌరవం॥ 5
తదేవ భద్రశాలైశ్చ వేదభాగ విశాలకం।
ద్విభాగం భద్రసంయుక్తం చండితం పరికీర్తితం॥ 6
తదేవ మధ్యశాలేతు ద్వ్యంశేన భద్రకోష్ఠకం।
భూషణం చేతిప్రోక్తంతు సర్వాలంకార సంయుతం॥ 7
ఏతచ్చతుర్విధం ప్రోక్తం నవభూమ్యల్పహర్మ్యకే।
అథవాచాల్పహర్మ్యేతు మధ్యకోష్ఠం గుణాంశకం॥ 8
అథవా చతురంశేన మధ్యభద్ర విశాలకం।
అథవా పంచభాగంస్యా త్పూర్వవన్నామ హారితం॥ 9

తా॥ తొమ్మిది అంతస్తులు గల దేవాలయమును గూర్చి చెప్పుచున్నాడు విస్తారమును, యెత్తును మునుపు చెప్పినరీతిగా చేయవలెను. సారము, రౌరవము, చండితము, భూషణము, వివృతము, సుప్రతీకాంతము, విశ్వకాంతము అను 7 విధములు కలవు. విస్తారమును 20 భాగములు చేసి కూటము 1-1 భాగము, మధ్యశాల 6 భాగములు, దానితో సమానము అంతరాలము, దానిమధ్య క్షుద్రశాల 2 భాగములు, దాని యొక్క ప్రక్కలను హారములతో 2-2 భాగములు చేయవలెను దీనిని సారకాంత మందురు, మిగిలినవి పూర్వము చెప్పినట్లు చేయవలెను పైచెప్పిన మహాశాలయందు 4 భాగములును మధ్య భద్రమును చేసినయెడల రౌరవమగును అదియే భద్రశాలలతో 4 భాగములు విస్తారమును, 2 భాగములు భద్రమును చేసిరేని చండితమగును. అదియే మధ్యశాల యందు 2 భాగములు భ దశాలను చేసినయెడల భూషణమగును. ఈ నాల్గును క్షుద్రములు. ఇందులోనే మధ్యశాలను 3 భాగములు చేసినను చేయవచ్చును లేక 4 భాగములు కూడ చేయవచ్చును లేక 5 భాగములును చేయవచ్చును మునుపటివలెనే నామములను తెలియువలెను.

శ్లో॥ చతుర్వింశతి విస్తారం కూటానాం పూర్వవద్భవేత్।
మహాశాలానుశాలాచ సాష్టాంశక గుణాంశకం॥ 10
మహాశాలాయతే మధ్యే వేదభాగేన భద్రకం।
సర్వాలంకార సంయుక్తం వివృతం చేతికథ్యతే॥ 11
పంచవింశతి భాగేన మధ్యభద్రం శరాంశకం।
తత్పార్శ్వే కర్ణకూటౌచ నరాణాంచైక భాగికం॥ 12
అనుశాలా త్రిభాగైకం మధ్య భద్రంతు సంయుతం।
సుప్రతీకాంతకంనామ శేషం ప్రాగుక్త వన్నయేత్॥ 13
షడ్వింశతి విభాగేన మధ్యమంతు యుగాంశకం।
మధ్య మహర్మ్యకే కుర్యాత్ సర్వాలంకార సంయుతం॥ 14
శ్రేష్ఠం నవతలం హర్మ్యే సప్తవింశతి భాగికం।
శాలా పార్శ్వే ద్విభాగైకం హారకూట స పంజరం॥ 15
కూటశాలైశ్చ సప్తాంశం మధ్యభద్రంశరాంశకం।
భద్రకోష్ఠం త్రయాంశంస్యా చ్ఛేషం పూర్వవదాచరేత్॥ 16
శ్రేష్ఠం నవతలం ప్రోక్తం విశ్వకాంతముదీరితం।
తదూర్ధ్వే ద్వ్యంశమానేన వక్ష్యేచోర్ధ్వే జలస్థలం॥ 17

తా॥ విస్తారమును 24 భాగములు చేసి కూటములు మునుపటివలెనే చేయవలయును. మహాశాల 8 భాగములును, అనుశాల 3 భాగములును చేయవలెను. మహాశాల యొక్క నిడివిలో మధ్య 4 భాగములు భద్రమును చేయవలెను. ఇట్లు సమస్తమైన యలంకారములతోగూడి యుండెనేని వివృతమగును. మరియు విస్తారమును 25 భాగములు చేసి మధ్య భద్రమును 5 భాగములు చేయవలెను. దానిప్రక్కలను కర్ణకూటములను ఒక్కొక్క భాగము చేయవలెను. అనుశాలను 3 భాగములు చేసి అందు 1 భాగమును మధ్య భద్రమును చేసిరేని సుప్రతీకాంత మగును. మిగిలిన పనులన్నియును మునుపటివలెనే చేయవలయును. విస్తారమును 26 భాగములు చేసి నడుమ నాల్గు భాగములు శాలను మధ్యమ హర్మ్యమున సమస్తాలంకారములతో చేయవలెను. ఉత్తమ నవతల హర్మ్యమును 27 భాగములు చేసి శాలయొక్క ప్రక్కలను రెండు భాగములు చేసి అందులో

1 భాగము హారము కూటము పంజరమును చేయవలెను. కూటశాలను 7 భాగములు చేసి మధ్య 5 భాగములు భద్రమును చేయవలెను. భద్రకోష్ఠమును 3 భాగములు చేయవలెను. మిగిలినవి మునుపటివలెనే చేయవలెను. ఉత్తమ నవతలమున యిట్లు చేయవలెను. దానిపైన 2 భాగములు జల నిర్గమమును చేయవలెను. దీనిని విశ్వకాంతమని చెప్పుదురు.

శ్లో॥ జన్మాదిస్తూపి పర్యంతం గణ్యమాన మిహోచ్యతే।
హర్మ్యమష్టతలే తుంగే పంక్తిభాగాధికం తథా॥ 18
సార్ధద్వ్యంశ మధిష్ఠానం తద్ద్వయం పాదతుంగకం।
తదర్ధం ప్రస్తరోత్సేధం శేషమష్టతలోక్తవత్॥ 19
ఏవం నవతలోత్సేధం సర్వాలంకార సంయుతం।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదై రలంకృతం॥ 20
కర్ణహర్మ్యాది సంయుక్తం ద్వారంతత్ప్రస్తరాన్వితం।
భద్రకూటాదిశాలాభిర్నాసికా పంజరాన్వితం॥ 21
యుక్త్యాహారాది యథా సర్వాచానుకూలాను నాసికా।
తోరణాద్యంగ నీడైశ్చ జాలకాది విభూషితం॥ 22
శేషంతు పూర్వవత్కుర్యాద్ది క్షుదేవాన్ న్యసేత్క్రమాత్।
తలే తలే విమానేతు చోక్తవత్కారయేద్బుధః॥ 23
ఏవం నవతలం ప్రోక్తం శేషం యుక్త్యా ప్రయోజయేత్॥ 24

ఇతి మానసారే వాస్తుశాస్త్రే నవత విధానం నామ సప్తవింశోఽధ్యాయః.

తా॥ అధిష్ఠానము మొదలు స్తూపిక వరకు గల యెత్తును చెప్పుచున్నాడు. అష్టతలమున చెప్పబడిన దానికంటె 10 భాగములు పెంపుచేసి అందు అధిష్ఠానము 2½ భాగములును, స్తంభము 5 భాగములును, ప్రస్తరము 2½ భాగములును చేయవలెను. ఇట్లు నవతలమును సమస్తమైన అలంకారములతోను, అనేక విధములైన అధిష్ఠానములతోను, అనేకవిధములైన స్తంభములతోను, కర్ణహర్మ్యములతోను, ద్వారము ప్రస్తరముతో కూడియును, భద్రములు కూటములు మొదలైన శాలలతోను, నాసికలతోను, పంజరములతోను, ఆలోచనతో హారములు మొదలైనవి యెట్లుండవలయు అన్నియును అటులే సరిపడునట్లు అనునాసికలును, తోరణములు మొద

లైన రూపములు కలిగియున్న పంజరములతోను, జాలకములు మొదలైన వానితోను చేయవలెను. మిగిలిన పనులన్నియును మునుపటివలెనే చేయవలయును. ప్రతి అంతస్తున అన్నిదిశలయందు వరుసగా దేవతల నుంచవలెను. ఇంతేకాక తనకు దోచినవిధముగా శాస్త్రము ననుసరించి అన్ని అంతస్తుల యందును పనులు చేయవలెను. ఈప్రకారముగా తొమ్మిది అంతస్తులు గల దేవాలయమును రచించవలెను.

## 19. నవ భూమికలు ద్రావిడ పద్ధతి

సమరాంగణ 62వ అధ్యాయము.

శ్లో॥ అథోచ్యతే హస్తమానాత్ ప్రాసాదో నవభూమికః।
విస్తారాదేక పంచాశ దుచ్ఛ్రాయఃస్యాద్ ద్విసప్తతిః॥ 196
కర్ణప్రమాణం తస్యోక్తా విస్తారోఽస్య సముచ్ఛ్రితిః।
పంచహస్తా భవేద్ఘంటా వేది బంధస్తదర్ధతః॥ 197
కుర్యాద్ధస్త త్రయుం సార్ధం నవమీ మస్యభూమికాం।
అష్టమీం చతురః సార్ధాన్ సపాదాన్ పంచ సప్తమీం॥ 198
షష్ఠీం షట్పాద హీనాంశ్చ స పాదః సప్త పంచమీం।
అష్టౌ చతుర్థీం పాదోనాన్ హస్తాన్ త్రీత్రితృతీయకాన్॥ 199
(దశహస్తాః ద్వితీయాయాం ప్రథమాంసార్ధ రుద్రకం।)
విలోమేనైషకథితః ప్రాసాదో నవభూమికః॥ 200

తా॥ తొమ్మిది అంతస్తుల దేవాలయము యొక్క విశాలము 51 హస్తములును, ఎత్తు 72 హస్తములును కలిగియుండవలెను. మొదటి అంతస్తు $11\frac{1}{2}$ హస్తములును, రెండవ అంతస్తు 10 హస్తములును, మూడవ అంతస్తు 9 హస్తములును, నాల్గవ అంతస్తు $7\frac{3}{4}$ హస్తములును, ఐదవ అంతస్తు $7\frac{1}{4}$ హస్తములును, ఆఱవ అంతస్తు $5\frac{3}{4}$ హస్తములును, ఏడవ అంతస్తు $5\frac{1}{4}$ హస్తములును, ఎనిమిదవ అంతస్తు $4\frac{1}{2}$ హస్తములును, తొమ్మిదవ అంతస్తు $3\frac{1}{2}$ హస్తములును, వేది $2\frac{1}{2}$ హస్తములును, ఘంట 5 హస్తములును చేయవలయును. ఆపైన పద్మమును 6 అంగులములును, కలశమును 21 అంగులములును చేయవలయును. ఇది నవభూమి విధానము.

# 20. దశభూమి లక్షణము

కాశ్యప శిల్పము 37వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ దశభూమేస్తు లక్షణం।
పార్శ్వప్రాసాదమానోక్త ప్రమాణైర్వోదయం తతం॥ 1
కల్పయిత్వాతు తత్తారం మనుభాగ విభాజితే।
వేదాంశం గర్భగేహంతు గృహపిండీ త్రిభాగయా॥ 2
అలింద్రంత్వేకభాగేన హారాంతరం శివాంశకం।
విన్యాససూత్రయో రంతర్మనుభాగ విభాజితే॥ 3
తేష్వేకం కూటవిస్తారం శాలాదీర్ఘంతు తద్ద్వయం।
ఏకాంశం పంజరవ్యాసం పాదం హారాంతరం భవేత్॥ 4
చతుష్కూటం భానుశాలం పంజరం షోడశాన్వితం।
హారాంతరంచద్వాత్రింశ త్కల్పయేదాది భూతలే॥ 5
తదూర్ధ్వ భూమివిస్తారం త్రయోదశ విభాజితే।
ఏకాంశం కర్ణకూటంతు శాలాతద్ ద్విగుణాయతా॥ 6
ఏకాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్।
ఊర్ధ్వ భూవిస్తృతంభాను భాగంకృత్వాఽంశ సాష్టికం॥ 7
ద్విగుణంకోష్ఠ దీర్ఘంతు అర్ధాంశం పంజరస్తతం।
పాదం హారాంతరం ఖ్యాతం తేషాం సంఖ్యాది పూర్వవత్॥ 8

తా॥ పది అంతస్తుల దేవాలయ విధానమును చెప్పుచున్నాడు. విస్తారమును, యెత్తును ప్రాసాద లక్షణమున జెప్పబడినట్లు చేయవలెను. ఆ విస్తారమును 14 భాగములు చేసి గర్భాలయము 4 భాగములును, గోడ 3 భాగములును, అలింద్రము 1 భాగమును, హారాంతరము 1 భాగమును చేయవలెను. ప్రస్తరముపైన 14 భాగములు చేసి కూటము 1 భాగమును, శాల 2 భాగములును, పంజరము 1 భాగమును, హారాంతరము $\frac{1}{4}$ భాగమును చేయవలెను. కూటములు 4, శాలలు 12, పంజరములు 16, హారాంతరములు 32. ఇట్లు మొదటి ప్రస్తరముపైన చేయవలయును. దాని పైఅంతస్తును 13 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, శాల

2 భాగములును, పంజరము 1 భాగమును, మిగిలినది హారాంతరము $\frac{1}{8}$ భాగమును చేయవలెను. దాని పైఅంతస్తును 12 భాగములు చేసి కూటము 1 భాగమును, శాల 2 భాగములును, పంజరము $\frac{1}{2}$ భాగమును, హారాంతరము $\frac{1}{4}$ భాగమును చేయవలెను.

శ్లో॥ తస్యోర్ధ్వతల విస్తారం రుద్రభాగ విభాజితే।
పాదం పంజర విస్తారం శేషం పూర్వవదేవహి॥ 9
తదూర్ధ్వే భూదశాంశేతు వ్యోమాంశం కూటవిస్తృతం।
కోష్ఠం తద్ ద్విగుణాయామం శేషం హారాంతరం భవేత్॥ 10
హారాంతరం త్రిభాగైకం పంజర వ్యాసముచ్యతే।
తస్యోర్ధ్వే భూనవాంశేతు శివాంశం సౌష్ఠికం భవేత్॥ 11
హారాంతరం ద్విభాగైకం పంజర వ్యాసముచ్యతే।
తస్యోర్ధ్వే భూనవాంశేతు శివాంశం సౌష్ఠికం భవేత్॥ 12
అధ్యర్ధాంశంతుకోష్ఠంస్యా చ్ఛేషం హారాంతరం సమం।
హారాంతరం ద్విభాగైకం పంజర వ్యాసముచ్యతే॥ 13

తా॥ దాని పైఅంతస్తును 11 భాగములు చేసి, పంజరమును $\frac{1}{4}$ భాగము చేయవలెను. మిగిలినవి పూర్వమువలెనే చేయవలయును. దానిపై అంతస్తును 10 భాగములు చేసి కూటము 1 భాగమును, కోష్ఠము 2 భాగములును, మిగిలినది హారాంతరమును హారాంతములో 3వ వంతు పంజరమును చేయవలెను దాని పైఅంతస్తును 9 భాగములు చేసి కూటము 1 భాగమును, హారాంతరమును రెండు భాగములు చేసి అందు 1 భాగము పంజరమును చేయవలయును. లేదా 9 భాగములు చేసి కూటము 1 భాగమును, శాల $1\frac{1}{2}$ భాగమును మిగిలినది హారాంతరమును. హారాంతరములో సగము పంజరమును చేయవలయును. మరియు

శ్లో॥ ప్రాగ్వతోసంఖ్యా సరుద్రాంశం స భూమిరేవమేవహి।
అష్టాంశం విభజేత్సప్త తలవిస్తారమేవహి॥ 14
కూటమేకాంశమానేన మధ్యేశాలా ద్విభాగయా।
పంజర వ్యాసమేకాంశం హారాంతరంత దర్ధకం॥ 15
చతుష్కూటం చతుఃశాలం పంజరాష్టక సంయుతం।
హారాంతరం కలాసంఖ్యాం కల్ప్యేవం సప్తకం తలం॥ 16

సప్తాంశం విభజేదష్ట మధశ్చైవతు విస్తరం।
ప్రాగ్వత్కూటంచ కోష్ఠంచ శేషం హారాంతరం తథా॥ 17
తస్మిన్ హారాంతరే నీడమగ్నిభాగైక విస్తృతం।
నవభూమి విశాలంతు షడ్భాగం విభజేత్సమం॥ 18
ప్రాగ్వత్కూటంచ కోష్ఠంచ పంజరంచ ప్రకల్పయేత్।
తదూర్ధ్వే భూమివిస్తార మనలాంశ విభాజితే॥ 19
మధ్యే భద్రం తదేకాంశం దండమానేన నిర్గతిః.

తా॥ ఆ అంతస్తునే 11 భాగములు చేసి దిగువ అంతస్తుల వలెనే భాగముల ప్రకారము అన్ని రూపములను చేయవచ్చును. ఇట్లు మూడు విధములుగా ఆఱవ అంతస్తున చేయవచ్చును. ఏడవ అంతస్తును 8 భాగములు చేసి కూటము 1 భాగము, మధ్యశాల 2 భాగములు, పంజరము 1 భాగము, హారాంతరము ½ భాగము. ఇట్లు 4 కూటములు, 4 శాలలు, 8 పంజరములు, 16 హారములు చేయవలెను. ఎనిమిదవ యంతస్తును 7 భాగములు చేసి 4 కూటములు, 4 శాలలు, 8 పంజరములు, 16 హారములు కల్పించవలెను. అయితే హారములో 3వ వంతు పంజరమును చేయవలెను. తొమ్మిదవ అంతస్తును 6 భాగములు చేసి మునుపటివలెనే సమస్తమును చేయవలెను. దానిపై భూమియొక్క విస్తారమును 3 భాగములు చేసి అందు 1 భాగము మధ్య భద్రమును చేయవలెను. దానియొక్క నిర్గమము దండ మానముతో కల్పించవలెను.

శ్లో॥ ప్రాసాదస్యతు చోత్సేధం శతభాగ విభాజితే॥ 20
యుగాంశం తదధిష్ఠాన మష్టాంశం చరణాయతం।
పాదోన వేదభాగంతు మంచమాన ముదాహృతం॥ 21
పాదోచ్ఛం సార్ధ సప్తాంశం ప్రస్తరం సార్ధవహ్నికం।
ధాత్వంశం చరణోచ్ఛంతు సపాదాగ్న్యంశ మంచకం॥ 22
సార్ధ షట్కాంఘ్రితుంగంతు ప్రస్తరంచాగ్ని భాగయా।
రసాంశం పాదదీర్ఘంతు పాదోనాగ్న్యంశ మంచకం॥ 23
పాదోచ్ఛం సార్ధ పంచాంశం సార్ధ పక్షాంశమంచకం।
పాదాధికంతు పంచాంశం పాదస్యోత్సేధముచ్యతే॥ 24

సార్ధపక్షాంశ మంచోచ్చం పంచాంశం పాదదైర్ఘ్యకం।
పాదాధికంతు పక్షాంశం మంచమానము దాహృతం॥ 25
సత్రిపాద యుగాంశంతు పాదదైర్ఘ్యముదా హృతం।
ప్రస్తరోచ్చం ద్విభాగంతు సార్ధ వేదాంశ మంఘ్రికం॥ 26
పాదోనద్వ్యంశమం చఃస్యాదేక భాగంవితర్దికా।
కంఠ మధ్యర్థ భాగేన శీర్షకం సార్ధ వేదకం॥ 27
పాదహీన ద్విభాగంతు స్తూప్యుత్సేధము దాహృతం॥

తా॥ ఆలయము యొక్క ఎత్తును 100 భాగములుచేసి అధిష్ఠానము 4 భాగము, స్తంభము 8 భాగము, ప్రస్తరము $3\frac{3}{4}$ భాగమును, రెండవ స్తంభము, $7\frac{1}{2}$ భాగమును, ప్రస్తరము $3\frac{1}{2}$ భాగము, మూడవ స్తంభము 7 భాగము, ప్రస్తరము $3\frac{1}{4}$ భాగము, నాల్గవ స్తంభము $6\frac{1}{2}$ భాగము, ప్రస్తరము 3 భాగము, ఐదవ స్తంభము 6 భాగము, ప్రస్తరము $2\frac{3}{4}$ భాగమును, ఆఱవ స్తంభము $5\frac{1}{2}$ భాగమును, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగమును, ఏడవ స్తంభము $5\frac{1}{4}$ భాగమును, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగమును, ఎనిమిదవ స్తంభము 5 భాగమును, ప్రస్తరము $2\frac{1}{4}$ భాగమును, తొమ్మిదవ స్తంభము $4\frac{3}{4}$ భాగమును, ప్రస్తరము 2 భాగమును, పదియవ స్తంభము $4\frac{1}{2}$ భాగము, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగమును, వేదిక 1 భాగము, గలము $1\frac{1}{2}$ భాగమును, శిఖరము $4\frac{1}{2}$ భాగమును, స్తూపిక $1\frac{3}{4}$ భాగము. ఇట్లు చేయవలయును.

## 21. మనుష్యకాంతము మొదలగు 6. విధములు

శ్లో॥ తదేవోన్నత కూటాది నరకాంత మితిస్మృతం।
అగ్రాకారం యుగాశ్రంతు శిఖరేయుగనాసికా।
పాదం ప్రత్యల్పనాసాఢ్యం నానాపాద ధరాతలం॥ 29
అత్యంత కాంత మిత్యుక్తం సర్వదేవ ప్రియావహం।
తదేవోన్నత కోష్ఠంచ నతంవోన్నత సౌష్ఠికం॥ 30
పక్షశాలాతు మధ్యస్థం శాలాదండేన నీవ్రకం।
అష్టాశ్రంశిఖరం కంఠం శిఖరంచాష్ట నాసికం॥ 31
నానాలంకార సంయుక్తం చతుష్కూట మిదం పరం।
తదేవ కూట కోష్ఠంచ సాంతర ప్రస్తరం పరం॥ 32
కూట కోష్ఠాది సర్వాంగం సమసూత్ర మథాపివా।
మంత్ర పూత మితిఖ్యాతం విమానం సర్వకామికం॥ 33

తదేవ శిఖరం కంఠం వృత్తాఖం పరికల్పయేత్ శిష్నా।
కాంత మితిఖ్యాతం సర్వదేవార్హకం గృహం॥ 34
తదేవ కర్ణ కూటానాం శీర్ష కంచగలంతథా వృత్తా
కారం ప్రక ర్తవ్యం యత్ర దీశ్వరకాంతకం॥ 35
దశ భూభాగమాఖ్యాతం తతస్త్వేకా దశాతలం॥ 36

ఇతి కాశ్యపశిల్పే దశభూమి విధానం సప్త త్రింశః పటలః.

(అనుబంధము 12వ పటము చూడుడు)

తా॥ పైన చెప్పినదానినే యెత్తైయిన కర్ణ కూటములతో చేసిన యెడల మర్త్య కాంతమగును శిఖరము నలుచదరమును నాలుగు నాసికలును కలిగియుండి స్తంభములకు క్షుద్రనాసికలును నానావిధములై స్తంభములును అధిష్ఠానములును కలిగియున్నయెడల, అత్యంత కాంతమగును. అదియే యెత్తైన శాలలతోను కర్ణ కూటములు పల్లముగాగాని లేక యెత్తుగాగాని యుండి మధ్యను పక్షశాలయును అది 1 దండము నిర్గమమును శిఖరమును గలమును 8 కోణములుగాను 8 నాసికలును అనేక విధములయిన అలంకారములును కలిగి యుండెనేని చతుష్కూటమగును. అదియే కూట కోష్ఠములు అంతర ప్రస్తరములతో గూడియుండి కూట కోష్ఠాది సమస్త రూపములును సమసూత్రముతోనె యుండిన యెడల మంత్ర పూతమగును. అదియే శిఖరమును కంఠమును గుండ్రముగా నుండిన యెడల శివ కాంతమగును. అదియే కర్ణ కూటములును శిఖరమును గలమును గుండ్రముగా నుండెనేని యీశ్వర కాంతమగును.

## 22. దశభూమి లక్షణము మరియొక పద్ధతి

మానసారము 28వ అధ్యాయము.

శ్లో॥ దశభూమి విధానం చ లక్షణం వక్ష్యతేఽధునా।
విశాలోత్సేధ భక్తిశ్చ దశ భూమ్యాస్తు పూర్వవత్॥ 1
భూకాంతం చంద్రకాంతంచ భువనంచాంతరిక్షకం।
మేఘ కాంతంచా బ్జకాంతం చైవంషడ్విధ మీరితం॥ 2
ఏవం నామవశాద్దర్మ్య విస్తారం పరికల్పయేత్॥

తా॥ పది అంతస్తులుగల దేవాలయము యొక్క విధానమును చెప్పుచున్నాడు. విస్తారమును యెత్తును పూర్వము చెప్పబడియున్న

ప్రకారము చేయవలయును భూకాంతము మొదలగు 6 భేదములు కలవు. వాని వానియొక్క పేరులనుబట్టి విస్తారమును కల్పించవలెను.

## 23. భూకాంతము మొదలగు 6 భేదములు

శ్లో॥ భూకాంతం చంద్రకాంతం దశతల హర్మ్యే భాగమానేన॥ 3
నవ తలహర్మ్యవ శాత్ప్రోక్తవ త్కూటశాలా దీన్।
క్షుద్ర మధ్యమమేవం యుక్త్యా దశతలె సంకల్ప్య॥ 4
ఉక్త హర్మ్య విశాలేత్వష్టా వింశత్యంశకం కృత్వా।
ఏకైకం కూట విస్తారం మధ్యే ద్వాద శకంతుశాలాభం॥ 5
అనుశాలాగుణాంశేన తత్పార్శ్వే ద్వి ద్వి భాగేన హారాః।
మహాశాలామధ్యదే శేతు షట్భాగేన భద్రసం యుతం॥ 6
ఏవంతు భువనం కాంతం శ్రేష్ఠంహర్మ్యం దశతరే కుర్యాత్।
తదేవ సౌష్ఠిక విస్తారం హారానుశాలాం ద్వి ద్వి భాగేన కుర్యాత్॥ 7
పూర్వ వచ్ఛేషం చాంతరిక్ష కాంత మిదముదితం।
తదేవశాలా పార్శ్వేపై కందేద్యకం సౌష్ఠికహారాః॥ 8

(అనుబంధము 13వ పటము చూడుడు)

తా॥ భూ కాంతము చంద్రకాంతము దశతల హర్మ్యమున భాగములచేత చేయవలయును. పూర్వము నవతలమున చెప్పబడియున్న ప్రకారము కూటములు శాలలు మొదలైనవి క్షుద్ర మధ్యమముల యందు ఆలోచనతో చేయవలెను. అనగా క్షుద్రమున భూకాంతమును మధ్యమమున చంద్రకాంతమును చేయవలయుననుట. ఆలయము యొక్క విస్తారము 28 భాగములుచేసి కూటవిస్తారము 1.1 భాగమును, మధ్యనుశాల 12 భాగములును, అనుశాల 3 భాగములును దాని ప్రక్కల 2.2 భాగముల చొప్పున హారములను మహాశాల యొక్క మధ్యభాగమున 6 భాగములు భద్రమును చేయవలెను. ఇది భువనకాంతమగును ఉత్తమ దశలహర్మ్యమున నిట్లు చేయవలయును. అదియే కూటము హారము అనుశాల 2.2 భాగములచొప్పున చేయవలయును. మిగిలినపనులన్నియును మునుపటివలెనే చేయవలయును. దీనిని వ్యోమకాంత మందురు, పై చెప్పినదానినే శాలయొక్క యిరువైపుల 1 గాని లేక సగముగాని కూటమును హారమును చేయవలయును, మరియు.

శ్లో॥ షడ్భాగేన మహాశాలా చైతన్నామ్నా మేఘ కాంతంస్యాత్ ।
తన్మధ్యే చతురంశేన శాలాభద్ర యుక్తమబ్జకాంతకం ॥ 9
శేషం పూర్వవ దుద్దిష్టం కుర్యాద్ద శతలహర్మ్యే విస్తారే ॥

తా॥ మహాశాల 6 భాగములుచేసిరేని అది మేఘకాంతమగును. దానిమధ్య 4 భాగములు భద్రమును రచించిన యెడల పద్మకాంత మగును. మిగిలినపనులన్నియును మునుపటివలెనే చేయవలయును.

శ్లో॥ జన్మాది స్తూపి పర్యంతం తుంగే గణ్యంచాధునా వక్ష్యామః ॥ 10
తుంగే సత్ర్యంశషష్ఠ్యంశం గుణాంశం తుమసూరకం ।
తద్ ద్వయంపాద తుంగంస్యా త్తదర్ధం ప్రస్తరోదయం ॥ 11
తదూర్ధ్వేఽంఘ్రి శరాంశంస్యాత్తదర్ధం ప్రస్తరోన్నతం ।
సార్ధవేదాంశకంపాద మూర్ధ్వే మంచం ద్వయాంశకం ॥ 12
వేదాంశంచాంఘ్రి కోత్తుంగం తస్యార్ధం ప్రస్తరోన్నతం ।
తద్ ద్వయంచోర్ధ్వకే పాదం సార్ధాంశం ప్రస్తరోన్నతం ॥ 13
తదూర్ధ్వేఽంఘ్రి గుణాంశంస్యాత్తదర్ధ మూర్ధ్వే మంచకం ।
ద్వ్యర్ధాంశంపాద తుంగంస్యాత్ సపాదాంశంతు ప్రస్తరం ॥ 14
పాదంద్వ యాంశకం కుర్యాచ్ఛివాంశం ప్రస్తరోదయం ।
తద్ద్వ యంచోర్ధ్వ పాదంస్యాత్తదర్ధ మూర్ధ్వ మంచకం ॥ 15
ద్విభాగం చోర్ధ్వపాదంచైకాంశంచోపరిమంచకం ।
తత్సమం వేదికోత్సేధం గ్రీవతుంగం కలాంశకం ॥ 16
వేదాంశం శిఖరోత్తుంగం శేషాంశంతు శిఖోదయం ।
ఊర్ధ్వ చోర్ధ్వతవే సర్వే కర్ణహర్మ్యాది మండితం ॥ 17
ఏకభాగం ద్వి భాగంవా చాంతశ్చా వృతాలిందకం ।
అధిష్ఠానోప పీఠేవా మహావేద్యాది మేవవా ॥ 18
ఊర్ధ్వేరోర్ధ్వతవే కుర్యాత్సర్వాలంకార సంయుతం ।
నానాలంకార సర్వాంగం యుక్త్యాప్రాగుక్త వన్నయేత్ ॥ 19
పంజరం శిఖరంపాదం మసూరం ప్రస్తరంవలభి తోరణకూటం ।
కల్పయేత్ దశ తలాఖ్యాని మానే చిత్రమల్ప మధ్యే ।
మహదల్పనాసికం ॥ 20

ఇతి మానసారే వాస్తు శాస్త్రే దశతల విధానం నామ అష్ట వింశోఽధ్యాయః

తా॥ అధిష్ఠానము మొదలు స్తూపికవఱకు యెత్తును చెప్పుచున్నాడు ఎత్తును 63 భాగములుచేసి అందు అధిష్ఠానము 3 భాగము, స్తంభము 6 భాగము ప్రస్తరము 3 భాగము, రెండవ స్తంభము 5 భాగము, ప్రస్తవము $2\frac{1}{2}$ భాగము, మూడవ స్తంభము $4\frac{1}{2}$ భాగము, ప్రస్తరము 2 భాగము నాల్గవ స్తంభము 4 భాగము ప్రస్తరము 2 భాగము, ఐదవ స్తంభము 4 భాగము, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగము, ఆఱవ స్తంభము 3 భాగము, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, ఏడవ స్తంభము $2\frac{1}{2}$ భాగము, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, ఎనిమిదవ స్తంభము 2 భాగము, ప్రస్తరము 1 భాగము, తొమ్మిదవ స్తంభము 2 భాగము, ప్రస్తరము 1 భాగము, పదియవ స్తంభము 2 భాగము, ప్రస్తరము 1 భాగము, వేదిక 1 భాగము, గలము 2 భాగము, శిఖరము 4 భాగము, స్తూపిక $1\frac{1}{4}$ భాగముపైపై అంతస్తులయందు అన్నిటియందును కర్ణ హర్మ్యములు మొదలైన వానితోనలంకారముగ చేయవలెను లోపల ఆ లింగముచుట్టూ 1 భాగముగాని 2 భాగములుగాని చేయవలెను. అధిష్ఠానము ఉపపీఠముగాని లేక మహావేదిక మొదలైనవిగాని చేయవచ్చును. పైపై అంతస్తులయందు అన్ని అలంకారములతో యిట్లు చేయవలెను. అనేకవిధములైన అలంకారములతో అన్ని రూపములను ఆలోచనతో పూర్వము చెప్పబడి యుండినట్లు చక్కగా చేయవలెను. పంజరము శిఖరము స్తంభము అధిష్ఠానము ప్రస్తరము వలభితోరణము కూటము మొదలైనవి చేయవలెను. దశ తలమను విమానమున చిత్రములు క్షుద్ర మధ్య మోత్తములయందు క్షుద్రనాసిక లుండవలెను.

## 24. దశ భూమికము ద్రావిడ పద్ధతి

సమరాంగణ 62వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీ మభిధాస్యామః ప్రాసాదందశ భూమికం। 200
ఏకోనాశీ తిరుత్సేధః కరాస్త ద్విస్తృతిఃపునః ।
షట్పంచాశత్కరాః కర్ణ మానాత్ బ్రూమో౽ధభాగశః ॥ 201
ఏకాదశ కరోత్సేధా కార్యాప్రథమ భూమికా ।
సార్ధానేదశ ద్వితీయాస్యాత్ తృతీయాతు కరాన్దశ ॥ 202
సావానష్టౌ చతుర్థీతు సప్తః సార్ధాస్తు పంచమీ ।
షష్ఠి సప్తకరా ప్రోక్తా సప్తమీషట్కరాభ వేత్ ॥ 203

పంచ హస్తాష్ట మిజ్ఞేయా నవమీతు చతుష్కరా ।
త్రిహస్తా దశమీకార్యా వేదీసాంశంకర ద్వయం ॥ 204
ఘంటా కుర్యాత్ ప్రమాణేన సార్ధంకర చతుష్టయం ।
ఏవ మేవ సముద్దిష్టో విన్యాసోదశ భూమికే ॥ 205

తా॥ పది అంతస్తులు గల దేవాలయము యొక్క కొలతలను చెప్పుచున్నాడు. ఎత్తు 79 హస్తములును, విస్తారము 56 హస్తములును, కర్ణమానమునుండి కొలతలను నిర్ణయించవలెను. మొదటి అంతస్తు 11 హస్తములును, రెండవ అంతస్తు $10\frac{1}{4}$ హస్తములును, మూడవ అంతస్తు 10 హస్తములును, నాల్గవ అంతస్తు $8\frac{1}{4}$ హస్తములును, ఐదవ అంతస్తు $7\frac{1}{4}$ హస్తములును, ఆఱవ అంతస్తు 7 హస్తములును, ఏడవ అంతస్తు 6 హస్తములును, ఎనిమిదవ అంతస్తు 5 హస్తములును, తొమ్మిదవ అంతస్తు 4 హస్తములును, పదియవ అంతస్తు 3 హస్తములును, ఆపైన వేదిక 2 హస్తములును, ఘంట $4\frac{1}{2}$ హస్తములును, తదుపరి పద్మము 6 అం. కలశము 21 అం. ఇట్లు దశతలమును చేయవలయును.

(అనుబంధము 14వ పటము చూడుడు)

## 25. ఏకాదశ భూమి విధానము

కాశ్యప శిల్పము 38వ పటలము.

శ్లో॥ అథవక్ష్యే విశేషేణరుద్ర భూమి విధానకం ।
ప్రాసాదమాన విధినా సంగ్రహేత్తు తతోదయం ॥ 1
తిథ్యంశం విభజేత్తారం గుణాంశం గర్భగేహకం ।
పక్షాంశం గృహపిండీస్యా దలింద్రంత్వేక భాగయా ॥ 2
ఏకాంశం కుడ్యవిస్తార మలింద్రంతు శివాంశకం ।
హారాంతర మధాంశేన కల్పయేత్తు యధాక్రమం ॥ 3
అలింద్రం వాఽపి స్తంభంవా ఘనభిత్తి తథాఽపివా ।
ప్రస్తరాంతం ఘనంవాఽపి తదూర్ధ్వేఽలింద్ర మేవవా ॥ 4
విన్యాస సూత్రయోరంత ర్వ్యాసః పక్షాంశ భాజితే ।
శివాంశం కర్ణకూటం స్యాత్పక్షశాలా ద్విభాగయా ॥ 5
మధ్య శాలాగ్నిభాగాస్యా దర్ధాంశం పంజరంభవేత్ ।
హారాంతరంచ తత్తుల్యం, కల్ప్యే వంహ్యాదిభూతవే ॥
తదూర్ధ్వ భూవిశాలంతు మనుభాగ విభాజితే ।

శివాంశం కూటవిస్తారం కోష్ఠంతద్ ద్విగుణాయతం ॥ 7
శేషం హారాంతరం ఖ్యాతం త్రిభాగైకంతు పంజరం ।
పంజరం కూటకోష్ఠంచ సంఖ్యావై ప్రాగివైవతు ॥ 8

తా॥ పదకొండు అంతస్తులు గల దేవాలయము యొక్క విధానమును చెప్పుచున్నాడు. ప్రాసాదలక్షణమున చెప్పబడినరీతిగా విస్తారమును ఎత్తును చేయవలెను. ఆవిస్తారమును 15 భాగములుచేసి గర్భాలయము 3 భాగములును, గోడ 2 భాగములును, అలింద్రము 1 భాగమును, గోడ 1 భాగమును, అలింద్రము 1 భాగమును, హారము 1 భాగమును, చేయ వలయును. అలింద్రముగాని స్తంభముగాని లేక లావుగల గోడగాని ప్రస్తరము వరకు లావుగా దిమ్మగానిచేసి దానిపైన యలింద్రముగాని చేయవచ్చును. ప్రస్తరము యొక్క పైభాగమును 15 భాగములుచేసి కర్ణకూటము 1 భాగము, ప్రక్కలనుండెడి శాలలు 2.2 భాగములు, మధ్య శాల 3 భాగములు, పంజరము ½ భాగము, హారము ½ భాగము. ఈ ప్రకార ముగా కూటములు 4ను, శాలలు 12ను పంజరములు 16ను హారములు 32ను చేయవలెను. దానిపై అంతస్తును 14 భాగములుచేసి కూటము 1 భాగమును, కోష్ఠము 2భాగమును, మిగిలినది హారాంతరమును. హారములో 3వ వంతు పంజరమును మొదటి అంతస్తువలనే అన్ని రూపములను చేయవలయును. (మూడవ అంతస్తును 13 భాగములును, నాల్గవ అంతస్తును 12 భాగములునుచేసి కూటములు శాలలు పంజరములు హారములు అదియే సంఖ్యతో చేయవలెను (మూలములో కనపడలేదు)

శ్లో॥ తదూర్ధ్వ భూమివిస్తారం రుద్రాంశంతు విభాజితే ।
పంజరం కూటకోష్ఠంచ ప్రాగివైవ ప్రకల్పయేత్ ॥ 9
తస్యోర్ధ్వ భూమివిస్తారం దశభాగ విభాజితే ।
కూటంచైవంతు కోష్ఠంచ సంఖ్యామానంచ పూర్వవత్ ॥ 10
తదూర్ధ్వ భూనవాంశేతు కూట వ్యాసంశివాంశకం ।
అర్ధ్యర్ధాంశంతు కోష్ఠానాం శేషంహారాంతరం భవేత్ ॥ 11
హారాంతర త్రిభాగైకం పంజర వ్యాసముచ్యతే ।
ప్రాగ్వత్కూటాది సంఖ్యాఃస్యుః కల్పయేచ్ఛిల్ప విత్తమః ॥ 12
అష్టాంశం విభజేదష్టభూ మేశ్చైవంతు విస్తరం ।
కూటవిస్తారమే కాంశం మధ్యేశాలా ద్విభాగయా ॥ 13

పంజరవ్యాసమేకాంశం హారాంతంచ తదర్ధకం।
చతుష్కూటం చతుశ్శాలం పంజరాష్టక సంయుతం॥ 14
హారాంతరంకలా సంఖ్యా ప్రోచ్యతేఽష్ట తలాన్వితే।
నవభూమి విశాలంతు సప్తధా విభజేత్సమం॥ 15
కూటవ్యాస మథాంశేన కోష్ఠదీర్ఘం ద్విభాగయా।
శేషంహారాంతరం ఖ్యాతం తత్త్రిభాగైక పంజరం॥ 16

తా॥ ఐదవ అంతస్తును 11 భాగములుచేసి పంజరములు కూటములు కోష్ఠములు మునుపటివలెనే చేయవలయును. ఆఱవ అంతస్తును 10 భాగములుచేసి కూటములు కోష్ఠములు మున్నగునవి పూర్వమువలెనె చేయవలెను. ఏడవ అంతస్తును 9 భాగములుచేసి కూటము 1 భాగమును, శాల $1\frac{1}{2}$ భాగమును, మిగిలినది హారాంతమునుచేసి అందులో 3వ వంతు పంజరమును చేయవలెను. దానిపై అంతస్తును 8 భాగములుచేసి కూటము 1 భాగమును, మధ్యనుశాల 2 భాగములను, పంజరము 1 భాగమును, హారము $\frac{1}{2}$ భాగమును చేయవలయును 4 కూటములు 4 శాలలు 8 పంజరము 16 హారములు చేయవలెను. ఇది యెనిమిదవ అంతస్తు లక్షణము. దానిపై అంతస్తును 7 భాగములుచేసి కూటము 1 భాగముశాల 2 భాగములు మిగిలినది హారాంతరము అందులో మూడవ వంతు పంజరము ఇట్లు తొమ్మిదవ అంతస్తున చేయవలయును.

శ్లో॥ దశభూమి విశాలంతు రసభాగవిభాజితే।
ప్రాగ్వత్కూటంచ కోష్ఠంచ పంజరంచ ప్రకల్పయేత్॥ 17
ఏకాది పంచ భూమ్యంతం భద్ర పంజర సంయుతం।
పంజరం భూపరిష్టాత్తు భద్రంవా భద్రపంజరం॥ 18
ఊర్ధ్వభూమి విశాలంతు గుణభాగ విభాజితే।
మధ్య భద్రం తదేకాంశం, దండమానేన నిర్గతిః॥ 19

తా॥ పదియవ అంతస్తును 6 భాగములుచేసి లోగడ అంతస్తునకు వలెనే కూటములు శాలలుపంజరములు హారములు చేయవలెను. మొదటి అంతస్తునుండి అయిదంతస్తులవరకు భద్ర పంజరములను చేయవలెను. పంజరము యొక్క పైభాగమున భద్రమునుగాని భద్ర పంజరమునుగాని చేయవలయును పదునొకండవ అంతస్తున అనగా శిఖరభాగమున విస్తార మును 3 భాగములుచేసి అందు 1 భాగము మధ్య భద్రమును వదించ

వలెను. ఆ భద్రపీఠము యొక్క నిర్గమము దండము విస్తారము కలిగి యుండవలెను.

శ్లో॥ ప్రాసాదస్య తుచోత్సేధం శతాంశం చ త్రయోదశం।
కృత్వాసార్ధం యుగాంశంతు, ధరాతలము దాహృతం ॥ 20
పాదోచ్చం సార్ధవస్వంశం. మంచమానం యుగాంశకం ।
వస్వంశం చరణాయామం పాదోనంచ యుగాంశకం ॥ 21
చరణం సార్ధ సప్తాంశం ప్రస్తరం సార్ధవహ్నికం ।
సప్తాంశం పాదదీర్ఘంతు సపాదాగ్నిక మంచకం ॥ 22
అర్ధాధికం షడంశంతు పాదోచ్చమగ్ని మంచకం ।
షడంశం పాదతుంగంతు పాదో నత్ర్యంశ మంచకం ॥ 23
సద్విపాదంతు భూతాంశం పాదదీర్ఘ ముదాహృతం ।
అర్ధాధిక ద్విభాగంతు ప్రస్తరస్యోదయం భవేత్ ॥ 24
సపాద పంచభాగంతు పాదోదయ ముదాహృతం ।
సార్ధ పక్షాంశమంచోచ్చం భూతాంశం చరణోదయం ॥ 25
సపాద పక్షభాగంతు మంచమానము దీరితం ।
పాదోన పంచ భాగంతు చరణోదయ మీరితం ॥ 25
మంచమానం ద్విభాగంస్యా త్సార్ధ వేదాంశ మంఘ్రికం ।
సత్రి పాదశివాంశంతు ప్రస్తరస్య సముచ్చ్రకం ॥ 27
శివాంశం వేసికామానం కంఠోచ్చం సార్ధభాగయా ।
అర్ధాధికంతు వేదాంశం శిఖరోదయమిష్యతే ॥ 28
పాదోనంతు ద్విభాగంస్యాత్ స్తూపేరు దయమిష్యతే ।
హిమాది స్తూపిపర్యంతం యుగాత్రశం పరికల్పయేత్ ॥ 29

తా॥ దేవాలయము యొక్క యెత్తును 113 భాగములు చేసి అధిష్ఠానము 4½ భాగములు, స్తంభము 8½ భాగములు, ప్రస్తరము 4 భాగములు, రెండవ స్తంభము 8 భాగములు, ప్రస్తరము 3¾ భాగములు, మూడవ స్తంభము 7½ భాగములు, ప్రస్తరం 3½భా, నాల్గవ స్తంభము 7 భాగములు ప్రస్తరము 3¼ భాగములు, ఐదవ స్తంభము 6½ భాగములు, ప్రస్తరము 3 భాగములు, ఆఱవ స్తంభము 6భా ప్రస్తరం 2¾ భాగములు, ఏడవ స్తంభము 5¾ భాగములు, ప్రస్తరము 2½ భాగములు, ఎనిమిదవ స్తంభము 5¼ భాగములు, ప్రస్తరము 2¼ భాగములు, తొమ్మిదవ స్తంభము 5 భాగ

ములు, ప్రస్తరము $2\frac{1}{4}$ భాగములు, పదియవ స్తంభము $4\frac{3}{4}$ భాగములు, ప్రస్తరము 2 భాగములు, పదునొకండవ స్తంభము $4\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, వేదిక 1 భాగము, గలము $1\frac{1}{2}$ భాగము, శిఖరము $4\frac{1}{2}$ భాగములు స్తూపిక $1\frac{3}{4}$ భాగములు చేయవలయును. అధిష్ఠానము మొదలు స్తూపికవఱకు నలుచదరముగా చేయవలయును.

## 26. బ్రహ్మకాంతము మొదలగు 7 భేదములు

శ్లో॥ శిఖరేతు చతుర్దిక్షు మహానాసీ సమన్వితం ।
పాదం ప్రత్యల్పనాసాఢ్యం బ్రహ్మకాంతం తదుచ్యతే ॥ 30
సౌష్ఠికం సాంతరం మంపం విజయం తదుదాహృతం ।
తదేవ తతకూటంచం నంతాః కోష్ఠాః సమంచకాః ॥ 31
సర్వార్థక మిదంఖ్యాతం సర్వ దేవార్థకంపరం ।
తదేవ శిఖరం కంఠం వృత్తమష్టాశ్రవేదికా॥ 32
ఇంద్రకాంత మితిఖ్యాతం సర్వ దేవార్థకంపరం ।
తదేవమధ్య భద్రాఢ్యం కూటకోష్ఠా సమౌతతౌ॥ 33
సమంచం వావిమంచంవా కూటశాలాచ పంజరం ।
గణికాశాల కంప్రోక్తం బ్రహ్మ విష్ణు శివార్థకం ॥ 34
తదేవ శిఖరం కంఠం వృత్తమష్టాశ్ర వేదికం ।
రుద్రకాంత మితిఖ్యాతం విమానం సార్వదైవికం ॥ 35
తదేవ కర్ణకూటంతు భద్రయు కర్ణకూటకం ।
తదేవ సౌష్ఠికానాంతు శీర్షకం మండలాకృతిః ॥ 36
నామ్నాకర్ణ విశాలంతు సర్వదేవప్రియం గృహం ।
ఏవమేకాదశ భూమేర్లక్షణం పరికీర్తితం ॥

ఇతికాశ్యపశిల్పే రుద్రభూమి విధానమష్టా త్రింశః పటలః

(అనుబంధం 16వ పటము చూడుడు)

తా॥ శిఖరమున 4 దిశలను మహా నాసికలును, ప్రతి స్తంభమునందు క్షుద్రనాసికలును చేసినచో బ్రహ్మకాంతమగును కూటములకు ప్రస్తరములను చేసిరేని విజయమగును అదియే విస్తారమైన కూటములతోను శాలలతోను ప్రస్తరములతోను చేసిన యెడల సర్వార్థకమగును. అదియే శిఖరము గలము గుండ్రమును, వేదిక 8 కోణములును చేసిరేని ఇంద్రకాంతమగును, అదియే మధ్య భద్రములును కూటములును కోష్ఠములును సమానముగాను ప్రస్తరములతోగాని ప్రస్తరములు లేకుండాగాని కూటములు,

శాలలు, పంజరములు కలిగిన యెడల గణికమగును. అదియే శిఖరము ను గలమును గుండ్రముగాను వేదిక 8 కోణములుగాను చేసిరేని రుద్ర కాంతమగును అదియే కర్ణకూటములకు భద్రములును శిఖరము గుండ్రము గాను చేసిరేని కర్ణ విశాలమగును.

## 27. ఏకాదశ భూమి మరియొక పద్ధతి

మానసారము 29వ అధ్యాయము శంభుకాంతము మొ॥గు 6 విధములు

శ్లో॥ ఏకాదశ తలవిధిం లక్షణం వక్ష్యతేధునా ।
శంభుకమీశ కాంతంచ చంద్రాఖ్యం యమకాంతకం ॥ 1
వజ్రకాంత మర్కకాంతంచ స్యాత్క్రమాద్ధర్మ్యనామకం॥
రుద్రహర్మ్య తలేతారే చైకోనవింశదంశకం ॥ 2
కూటానాం చద్విభాగం స్యాన్మహా శాలానవాంశకా ।
అనుశాలా యుగాంశంస్యాద్ధారా చద్వి ద్విభాగికం ॥ 3
మహాశాలా యామధ్యేతు భద్రశాలా శరాంశకం ।
శంభు కాంతమితిప్రోక్తం సర్వాలంకార సంయుతం ॥ 4
తదేవ నాసిమధ్యేతు ద్విభాగం భద్ర సంయుతం ।
ఈశకాంత మితిప్రోక్తం క్షుద్ర హర్మ్యాది చేరితం ॥ 5
మధ్యమేకాదశతలె త్రింశద్భాగ విశాలకం ।
మహాశాలా దశాంశంస్యాన్మధ్య భద్రం శరాంశకం ॥ 6
తత్పార్శ్వే ఏకైకభాగేన కూటం హారాస పంజరం ।
తదేవ వేదభాగేన భద్రశాలాచ మధ్యమే॥ 7
శేషంప్రాగుక్త వత్కుర్యాచ్చంద్ర కాంతమి తిస్మృతం ।
తదేవకూటమే కాంశంస్యాదను శాలాపంచభాగికం॥ 8
త్రిపాదం భద్ర సంయుక్తం తత్త్రిభాగైక భాగికం ।
యమ కాంతమితి ప్రోక్తం సర్వాలంకార సంయుతం ॥ 9

(అనుబంధం 15వ పటం చూడుడు)

తా॥ పదునొకండు అంతస్తులు గల దేవాలయ విధానమును చెప్పు చున్నాడు. శంభుకాంతము, ఈశ్వరకాంతము, చంద్రకాంతము, యమ కాంతము, వజ్రకాంతము, సూర్యకాంతము అని 6 విధములు కలవు. అలయ విస్తారమును 19 భాగములుచేసి కూటము 2 భాగములు, మహాశాల 9 భాగములు, అనుశాల 4 భాగములు, హారము 2.2 భాగములు, మహాశాల యొక్క మధ్య భద్రశాల 5 భాగములు చేసిరేని శంభుకాంతమగును. అది

యేనాసిక యొక్క మధ్యను భద్రము 2 భాగములు చేసినచో ఈశ్వరకాంత మగును. ఇవి క్షుద్రహర్మ్యములు మధ్యమ ఏకాదశ తలమున విస్తారమును 30 భాగములుచేసి మహాశాల 10 భాగములు, దాని మధ్య భద్రము 5 భాగములు, వాని ప్రక్కల 1-1 భాగము కూటమును, హారము పంజరముతో కూడి యుండవలెను అదియే భద్రశాల 4 భాగముల మధ్యనుచేసి మిగిలినవి మునుపటివలెనే చేసినచో చంద్రకాంతమగును. అదియే కూటము 1 భాగమును అనుశాల 5 భాగములును భద్రము 3 భాగములును, దాని యొక్క 3 భాగములలో 1 భాగము నిర్గమము చేసిన యమకాంతమగును.

శ్లో॥ శ్రేష్ఠహర్మ్య విశాలేతు చైకవింశ తిభాజితే ।
ద్వి ద్విభాగేన కూటం స్యాద్ధారంచ ద్వి ద్విభాగతః 10
హారాచతద్ ద్వయోర్మధ్యే చానుశాలా శరాంశకం ।
తన్మధ్యే త్త్రిభాగేన భద్రం కుర్యా ద్విచక్షణః ॥ 11
మహాశాల నవాంశేన మధ్యే భద్రం శరాంశకం ।
తన్మధ్యే భద్రశాలాచ బంధు భాగేన యోజయేత్ ॥ 12
ఏవంతు వజ్ర కాంతంస్యా దర్క కాంత మిహోచ్యతే ।
తదేవ శాలాప్రాంతేతు పార్శ్వేచై కేనసాష్ఠికం ॥ 13
తద్ ద్వయోరంతరే దేశే తత్సమం క్షుద్రహారయోః ।
పూర్వ వత్కూట విస్తారం శేషం హారంస పంజరం ॥ 14
తన్మధ్యేతు త్రిభాగేన క్షుద్రశాలా విశాలతా ।
తత్పార్శ్వేత్రి త్రిభాగేన హారమధ్యేస భద్రకం ॥ 15
క్షుద్రశాలా త్రిభాగేన మధ్య భద్ర సమన్వితః ।
క్షుద్రహారాచ సర్వేషాం నాసికా పంజరాన్వితా ॥ 16

తా॥ ఉత్తమ హర్మ్యము యొక్క విశాలమును 21 భాగము చేయువలెను. 2 2 భాగములు కూటమును, 2 2 భాగములు హారమును, హరముల యొక్క రెంటి మధ్య అనుశాల 5 భాగములును. దాని మధ్య మూడవ వంతు భద్రమును, చేయవలయును మహాశాల 9 భాగములను దానిమధ్య భద్రము 5 భాగములును మరల దాని మధ్య భద్రశాల 4 భాగములను చేయవలయును ఇది వజ్ర కాంతమగును పైచెప్పిన దానినే శాల యొక్క ప్రక్కను 1 భాగము కర్ణకూటమును చేయవలయును. ఆ రెండు శాలల యొక్క మధ్య ప్రదేశమున దానితో సమానముగా క్షుద్రహర

మును చేయువలెను. కూటములను మునుపటివలెనే విస్తారమును చేయువలయును. మిగిలిన దిహారమును అందులో పంజరమును కూడ చేయువలెను. దాని మధ్య మూడు భాగములు క్షుద్రశాల యొక్క విస్తారమును చేయ వలెను. దాని ప్రక్కలయందు 3 3 భాగము హారములను వాని మధ్య భద్రములను క్షుద్రశాల 3 భాగముల ను అందు మధ్య భద్రముతో చేయ వలెను. క్షుద్రహారములన్నిటికిని నాసికా పంజరము లుండవలయును.

శ్లో॥ మధ్యే మధ్యే మహానాసి నేత్రశాలాచ పార్శ్వయోః ।
సర్వాలంకార సంయుక్తం షడ్విధం పరికీర్తితం ॥ 17
శేషభాగంతు సర్వేషాం యుక్త్యాతత్రైవ యోజయేత్ ।
ఏవం విస్తార గణ్యంస్యాత్తుంగ గణ్యమిహోచ్యతే ॥ 18
జన్మాదిస్తూపి పర్యంతం చోక్తవత్సం గ్రహం విదుః ।
ఏకాదశాంశ భాగేన దశతలోదయాధికం ॥ 19
తదేవసార్ధ వహ్న్యంశం మసూరోత్తుంగమిష్యతే ।
సప్తాంశం పాదదైర్ఘ్యం స్యాత్తదర్ధం ప్రస్తరోదయం ॥ 20
శేషం ప్రాగుక్త వద్గణ్య మేకాదశ తలోదయే ।
తలోర్ధ్వోర్ధ్వతనే సర్వం కర్ణ హర్మ్యాది మండితం ॥ 21
ఏకభాగం ద్విభాగంవా పరితోఽలిందమిష్యతే ।
నానాధిష్ఠాన సంయుక్తం నానా పాదైవలంకృతం ॥ 22
శాలాకూటైశ్చ హారైశ్చ చోక్త వత్సమలంకృతం ।
హారాంతరే కూటశాలా గ్రీవ దేశోక్త దేవతాన్ ॥ 23
అనుశాలాష్ట దిక్పాలాం స్తత్తద్వాహన సంయుతం ।
యక్ష విద్యాధరా దీనాం గరుడాదీని విన్యసేత్ ॥ 24
గణాధిపగణైశ్చైవ సర్వహర్మ్యేషు నిక్షిపేత్ ॥ 25
ఇతి మానసారే వాస్తుశాస్త్రే ఏకాదశ తల విధానం నామ
నవవింశోఽధ్యాయః

తా॥ మధ్య మధ్య మహానాసికలును, ప్రక్కల నేత్రశాలలును, కలిగియుండవలెను. ఇట్లు 6 విధములని తెలియవలెను. మిగిలిన పను లన్నియును ఆలోచనతో చేయవలెను. విస్తారమును చెప్పితిని. ఎత్తును చెప్పుచున్నాను. అధిష్ఠానము మొదలు స్తూపిక వరకు దశతలమున చెప్పి యున్న దానికంటె 11 భాగములధికము చేయవలయును. అడియే 3½

ఏవ మాదితలం కుర్యాదూర్ధ్వం రుద్రతలోక్తవత్ ।
సప్తవింశోత్తరశతం కృత్వా హర్మ్యోదయం ద్విజ ॥ 9
ధరాతలోచ్చం భూతాంశం సవాంశం చరణోదయం ।
సార్ధ వేదాంశం మంచోచ్చం శేషం రుద్రతలోక్తవత్ ॥ 10
ఏవం భానుతలం ప్రోక్తం త్రయోదశ తలంశృణు ॥ 11
ఇది కాశ్యపశిల్పే భానుభూమి విధానమ్కోన చత్వావింశః పటలః

తా॥ పదిరెండంతస్తులు గల దేవాలయ విధానమును చెప్పుచున్నాడు అలయముల యొక్క విస్తారమును ప్రాసాద మానమున చెప్పబడియున్నది దానిని 17 భాగములుచేసి దానినే కర్ణకూటముల యొక్క శిఖరములు మొగ్గలువలె చేయవలెను. గర్భ మందిరమును 5 భాలను, గోడ 2 భా, లను అలింద్రము 1 భా, మరల గోడ 1 భా, దాని ప్రక్కను అలింద్రము 1 భాగమును, హారము 1 భాగమును చేయవలయును. లేక గర్భమును 3 భాగములును గోడ 3 భాగములును, చేసి మిగిలినవి మునుపటివలెనే చేయ వలయును. ప్రస్తరము పైనను 17 భాగములు చేసి మధ్యశాల 3 భాగ ములును, కర్ణకూటము 1 భాగమును, ఆ రెంటి మధ్య 2 భాగములు శాల యును కూటము యొక్కయు శాల యొక్కయు మధ్యను, శాలల యొక్క రెంటి మధ్యను 1 భాగము పంజరమును చేయవలెను. అది కర కూటమువలెనే యుండవలయును. హారమును అందులో సగము చేయ వలెను క్షుద్ర పంజరములను కూడ హారములో చేయువలయును. ఇట్లు మొదటి అంతస్తును చేసి ఆపైన ఏకాదశ భూమియందు చెప్పబడిన ప్రకా రము వరుసగా అన్ని అంతస్తుల యందును చేయువలెను. ఆలయము యెత్తును 127 భాగములుచేసి అధిష్ఠానము 5 భాగములను, స్తంభము యెత్తు 9 భాగములను, ప్రస్తరము 4½ భాగమును చేసి మిగిలినవియేకాదశ తలమువలెనే అన్నియును చేయువలెను

(అనుబంధము 18వ పటం చూడుడు)

# 30. ద్వాదశభూమి మరియొక పద్ధతి

## పాంచాలము మొదలగు 10 విధములు

మానసారము 30వ అధ్యాయము

శ్లో॥ అన్యభూమి విధానంచ లక్షణం వక్ష్యతేఽధునా ।
భూమిలంబ విధానేతు విస్తారోత్సేధ ముక్తవత్ ॥ 1
క్షుద్రాల్ప మధ్య ముఖ్యేమ యన్మానోరమ్య మానయేత్ ।

విమానస్య విధానేతు చోక్తవద్భక్తి సంగ్రహం ॥ 2
పాంచాలం ద్రావిడం చైవ మధ్యకాంతం కలింగకం ।
వరవిరాటం కేరలం చైవ వింశకం మాగధం తథా ॥ 3
జనకం ముర్జకం చైవ దశకాంతం ప్రకీర్తితం ।
రవి భూమి విశాకేతు చాష్టా వింశాంశకం భవేత్ ॥ 4
మహాశాలా దశాంశం స్యాచ్ఛేషం పూర్వవదాచరేత్ ।
పాంచాలం ద్రావిడం చైవ రవిభూమ్యల్ప హర్మ్యకే ॥ 5
మధ్యమాలయ విస్తారే త్రయస్త్రింశ ద్విభాజితే ।
త్రిభాగం కూట విస్తారం త్వేకాంశం మధ్య భద్రకం ॥ 6
మహాశాలా నవాంశం స్యాచ్ఛేషం పూర్వవదా చరేత్ ।
మధ్యకాంతమితి ప్రోక్తం తస్యకూటం ద్విభాగికం ॥ 7
అనుశాలా షడంశం స్యాత్తస్యాంగం పూర్వ దర్భవేత్ ।
ఏవంక లింగకాంతం స్యాన్నానాలంకార సంయుతం ॥ 8

తా॥ పదిరెండంతస్తులు గల దేవాలయము యొక్క విధానమును చెప్పుచున్నాడు. భూమి లంబ విధానమున చెప్పబడిన రీతిగా విస్తారమును ఎత్తును చేయవలెను. క్షుద్రము, మధ్యము, ముఖ్యము, అను భేదముల ప్రకారము ఏ మానము అందముగా నుండునో ఆ ప్రకారముగా నిర్ణయించవలెను. విమానము యొక్క విధానమున చెప్పబడిన ప్రకారము భాగములను చేసి పాంచాలము, ద్రావిడము, మధ్యకాంతము, కలింగము, వరాటము, కేరలము, వింశకము, మాగధము, జనకము, ఘూర్జరము, అను 10 విధములను ద్వాదశ తలమున చేయవలెను. విస్తారమును 28 భాగములు చేసి మహాశాల 10 భాగములును, మిగిలిన వన్నియును ఏకాదశ తలమున చెప్పబడినట్లు చేయవలెను. పాంచాలమును ద్రావిడమును ద్వాదశ భూమి యందు అల్ప హర్మ్యమున చేయవలెను. మధ్య మాలయమున విస్తారమును 33 భాగములు చేసి కూటము 3 భాగములను అందు 1 భాగము మధ్య భద్రము కూడా యుండవలెను. మహాశాల 9 భాగములు చేసి మిగిలినవన్నియును మునుపటివలెనే చేయవలయును. దీనిని మధ్యకాంతమందురు. దాని యొక్క కూటము 2 భాగములును, అనుశాల 6 భాగములును, చేయవలెను. దాని యొక్క రూపములన్నియును మునుపటివలెనే

యుండవలెను. దీనిని కలింగకాంతమందురు. అన్ని విధములైన అలంకార ములతో చేయవలెను.

(అనుబంధము 19వ పటము చూడుడు)

శ్లో॥ చతురధిక త్రిదశభాగం హర్మ్య విశాలతే ।
అష్టాంశేన మహాశాలా పార్శ్వేశాలా శివాంశకం ॥ 9
ద్వ్యంశాను పంజర శాలా తదర్ధం చాంతరాలకం ।
అనుశాలా త్రిభాగంస్యా దేవాంశ మంతరాలకం ॥ 10
ద్వ్యంశం పంజర శాలాచ పార్శ్వేహారం శివాంశకం ।
కూటానాంచ త్రిభాగం స్యాత్సర్వాంయుక్త్యాస భద్రకం 11
మహాశాలా యుగాంశేన మధ్య భద్రం ప్రకారయేత్ తనేతనే విమానేతు
శాలా పంజర షోడశం ॥ 12
క్షుద్రశాలా ద్విహారాచ తన్మధ్యే చాష్టకం భవేత్ ।
చతుర్దిక్షు మహాశాలా చతుష్కూటం తవేతవే ॥ 13
ఏవం వరాటకాంతం స్యాచ్ఛేషం భాగంతు పూర్వవత్ ।
తదేవ భూతభాగేన క్షుద్రశాలా విశాలకం ॥ 14
హారాచ తత్త్రిభాగేన యుక్త్యాచ సమలంకృతం ।
శేషం ప్రాగుక్త వత్కుర్యాత్తుదేవ కేరల కాంతకం ॥ 15
తదేవ హారాంతన్మధ్యే చైక భాగేన సౌష్ఠికం ।
వింశ కాంతమితి ప్రోక్తం శేషం పూర్వవదా చరేత్ ॥ 16

తా॥ దేవాలయము యొక్క విస్తారము 34 భాగములు చేసి మహా శాల 8 భాగములను, ప్రక్కను శాల 1 భాగమును, 2 భాగములు అనుశాల పంజరము, అందులో సగము అంతరాలము అనుశాలను 3 భాగములు చేసి అందు 1 భాగము అంతరాలము, పంజరపు శాల 2 భాగములు, దాని ప్రక్కను హారము 1 భాగము, కూటము 3 భాగములు అందులో భద్రము 1 భాగము కూడా చేయవలెను. మహాశాల 4 భాగములు మధ్య భద్రమును కూడ చేయవలెను. విమానము యొక్క ప్రతి అంతస్తునను శాలలు పంజర ములు 16ను, క్షుద్రశాలలు 2ను హారములు, 8యును నలువైపుల మహా శాలలును, ప్రతి అంతస్తునను 4 కూటములను ఇట్లుండిన వరాటకాంత మగును. మిగిలినవన్నియు మునుపటివలెనే భాగములతో చేయవలెను. అదిమే క్షుద్రశాల 5 భాగములు హారములు అందులో 3వ భాగము ఆలోచ

నతో అలంకారముగా చేయవలెను. మిగిలినవి పూర్వము వలెనే చేయవలెను ఇది కేరళ కాంతమగును. అదియే హారమును దాని మధ్య పంజరమును 1 భాగమును చేసి రేనివింశకాంతమగును. మిగిలిన పనులన్నియును మును పటివలెనే చేయవలయును.

శ్లో॥ తదే వానుశాలా మధ్యే భద్రశాలైక భాగికం।
ఏవం మాగధ కాంతంస్యాత్కర్ణ కూటంస భద్రకం ॥ 17
తదేవ మహాశాలాయా ద్విభాగం మధ్య భద్రకం।
జన కాంతమితి ప్రోక్తం శ్రేష్ఠారవి తలాన్వితం॥ 18
ఏకాదశ తలోత్తుంగే త్రయోదశాంశ మధీకం।
తద్భాగేన యుగాంశంతు కుట్టిమోదయమీరితం ॥ 19
అష్టాంశం పాదతుంగం స్యాత్తదర్ధం ప్రస్తరోదయం।
అర్ధాం శంతుశిఖోపేతం శేషాంశం ప్రాగ్వదుచ్ఛ్రయం ॥ 20
ఏవం ద్వాదశ తలంస్యా త్తుంగం యుక్త్యా సమాచరేత్।
ఏకేన పరితోऽలిందం తదూర్ధ్వోర్ధ్వ తలానిచ॥ 21
ఏకానేక తలాంతేచ చాదిభూమి వశాద్విదుః।
అనాదృతాంశకం కృత్వా తదూర్ధ్వోర్ధ్వ తలానిన్యసేత్॥ 22
ఏక ద్విత్రితు దండంవా మధ్యశాలాయా నిర్గమం।
మధ్యమేకం ద్విదండంవా క్షుద్రశాలాది నిర్గమం ॥ 23
ఏకాంశ మర్ధార్ధ దండంవా సర్వేషాం భద్ర నిర్గమం।
తవే తవేచ పాదాది బహు కూటంచా లిందకం ॥ 24

తా॥ అదియే అనుశాల యొక్క నడుమ 1 భాగము భద్రశాలను చేసి కర్ణకూటములకు భద్రములను కూడా చేయవలెను. అది మాగధకాంతమగును. అదియే మహాశాలలో సగము మధ్య భద్రమును చేసినచో జన కాంతమగును. ఇవి యుత్తమ ద్వాదశ తలమున చేయువలయును. ఏకాదశ భూమియందు చెప్పబడిన యెత్తులో 13 భాగములు కలిపి అందు అధిష్ఠానము 4 భాగములను స్తంభము 8 భాగములును, ప్రస్తరము 4 భాగములును చేయవలెను. 1 భాగము చుట్టూ అలిందమును చేయవలెను. శిఖరములో $\frac{1}{2}$ భాగమును కలుపవలెను. దాని పై అంతస్తులు ఒక్కొక్కటి మొదటి అంతస్తు నుండి క్రమముగా చేయవలెను. తగ్గింపు చేయబడిన ప్రకారము అకొలతనే తీసికొని పై పై అంతస్తులు చేయుచుండవలెను.

అనగా క్రమముగా తగ్గుపలలు గ్రహించి చేయవలెను. 1-2-3 దండములు మధ్యశాల యొక్క నిర్గమములను చేయవలెను. క్షుద్రశాల మొదలైన వాని యొక్క నిర్గమము మధ్యను 1 దండముగాని లేక 2 దండములుగాని చేయవలెను. 1 భాగముగాని $1\frac{1}{2}$ దండముగాని అన్ని భద్రములకును నిర్గమమును చేయుచుందురు. ప్రతి అంతస్తుని స్తంభములు మొదలుగాను అనేక కూటములును అలిందములును చేయవలెను.

శ్లో॥ సర్వాంగం కర్ణహర్మ్యాది సాంతర ప్రస్తరాన్వితం ।
వినాభద్రం మహాశాలా చైకశాలా సమన్వితం ॥ 25
ఏకభద్రోర్ధ్వ శాలాచ మధ్యకోష్ఠ సమన్వితం ।
ద్విభద్రా చేన్మహాశాలా మూర్ధ్నిశాలాం ప్రకల్పయేత్ ॥ 26
సభద్రాచ మహాశాలా భద్రశాలా సమన్వితా ।
ఊర్ధ్వశాలా సభద్రాఢ్యం ప్రస్తరం సమలంకృతం ॥ 27
నిర్గమాంగం మహాశాలా క్షుద్రశాలా సవేశనం ।
యత్తతో ప్రాసాద మధ్యేతు మహాశాలాం ప్రకల్పయేత్ ॥ 28
సర్వేషాం హారమధ్యేతు క్షుద్రశాలాం ప్రకల్పయేత్ ।
యథా హర్మ్యేతు విదిక్షుచ కర్ణకూటం వినిక్షిపేత్ ॥ 29
క్షుద్రశాలాయాం హారాచ వేశనం యుక్తితోన్యసేత్ ।
నాసికా పంజరా దీనాం తోరణాద్యంతు పంజరం ॥ 30

తా॥ కర్ణహర్మ్యము మొదలైన సమస్త రూపములను అంతర ప్రస్తరములతో గూడ చేయవలయును. మహాశాలకు భద్రము చేయకుండ యేక శాలతోగూడి యొక్కటియే భద్రమును పైన శాలయును మధ్యశాలయును చేయవలయును. మహాశాలకు రెండు భద్రములును పై శాలకు గూడ భద్రమును ప్రస్తరమును చేయవలెను. మహాశాల యొక్క నిర్గమము క్షుద్రశాల వేశనమును ప్రాసాదము యొక్క నడుమ మహాశాలను కల్పించవలెను. అన్ని హారముల యొక్క క్షుద్రశాలలను చేయవలెను. హర్మ్యమున యెట్లు చేయుదుమో అటులే మూలలయందును కర్ణకూటములను చేయవలెను. క్షుద్రశాల యందు హారము యొక్క వేశనము అలోచనతో చేయవలెను. నాసికా పంజరము మొదలైన వానికిని తోరణము మొదలైనవి

శ్లో సర్వేషాం హర్మ్యకేహారం చోక్తవత్సమలం కృతం ।
ఏకద్విత్రి ద్విభాగం వా ప్రాసాద నిర్గమం భవేత్ ॥ 31
అథవా హస్తమానేన చైకానేకే నవర్ధయేత్ ।
ద్విభూమ్యంత తలాంతం చైకాదశకరాంతకం ॥ 32
క్రమాత్తు నిర్గమం కుర్యాద్యుక్త్యా తత్రైవ శిల్పిభిః ।
అనాఖ్యాతా నిచాంగాని యస్మిన్ హర్మ్యేషు చోక్తవత్ ॥ 33
తత్తదంగాని సర్వాణి సర్వహర్మ్యేషు యోజయేత్ ।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదైరలంకృతం ॥ 34
నానాపంజరా దీనాం నానావర్ణై శ్రీలైశ్చతోరణం ।
నానా నాసికాకూటం నానాహారై రలంకృతం ॥ 35
నానా ప్రస్తర సంయుక్తం నానాగల విభూషితం ।
నానావేదికా కుర్యాన్నానాలంకార భూషితం ॥ 36
నానాపాలికా దీనాం నానాంగేషు స్థూపికాన్వితం ।
నానాకారంతు పద్మంస్యాన్నానాచ పాలిఫలకాదిభిః ॥ 37

తా॥ అన్ని హర్మ్యములకును హారమును చెప్పబడిన రీతిగా చేయవలెను. 1 గాని, 2 గాని లేక 3 భాగములలో 2 భాగములుగాని ప్రాసాదమునకు నిర్గమమును చేయవలెను. లేక హస్తముతోనైన చేయవలెను. 1 హస్తముగాని యింకా పెంచిగాని చేయవచ్చును. రెండంతస్తులు వరకు 11 హస్తముల వరకును వరుసగా నిర్గమమును చేయవచ్చును, శిల్పాచార్యుడు ఆలొచనతో చేయవలెను. ఇందు కొన్ని రూపములు చెప్పబడకుండినను వానిని గూడ తెలిసికొని మందిరమునకు ఎచ్చటనే రూపముండవలయునో ఆ ప్రకారముగా ఆయా రూపములన్నియును చేయవలయును. ఇట్లు అన్ని విధములైన దేవాలయములకును చేయుచుండవలెను. అనేక విధములైన అధిష్ఠానములును, స్తంభములును, పంజరములును, తోరణములును, నాసికలును, కూటములును, హారములును, ప్రస్తరములును గలములును, వేదికలును, పాలికలును, పద్మములను ఇంకను అనేక విధములైన యలంకారములును, అనేక విధములైన రూపములయందు స్థూపికలును, మొదలగు వానిచేతను.

శ్లో॥ కుర్యాత్తు సర్వహర్మ్యాణాం శిల్పిభిః సమలంకృతం ।
తవే తవే విమానస్య దిశా దిక్ష్వాది కోష్ఠకే ॥ 38

తత్ర ద్దేవాలయే దేవాంస్త త్రత్ప్రాగుక్త వన్నయేత్ ।
యక్ష విద్యాధరాదీనాం గణభూతాది రాక్షసాన్ ॥ 39
జన్మాది సప్తమాతరశ్చ రోహిణ్యాచాప్స రస్త్రియః ।
విశ్వకర్మాద్య గస్త్యాది నారదా దయః శ్రుతిఘోషకాన్ ॥ 40
సాలోక్యాది పదైః సర్వ భక్తాంశ్చ లక్షణోక్తవత్ ।
అసంఖ్యాతస్త్ర యస్త్రింశద్ బ్రహ్మదీనాంచ సర్వశః ॥ 41
హర్మ్యమూవే తవే చోర్ధ్వే సర్వత్ర పరికల్పయేత్ ।
అన్యోన్యానుక్త మానానాం చాంగంయుక్త్యా ప్రయోజయేత్ ॥ 42

తా॥ సమస్తమైన దేవాలయములకును పై శ్లోకములయందు చెప్ప బడినట్లలంకారములను చేయవలెను విమానము యొక్క ప్రతి అంతస్తు నను అన్ని దిశలయందును శాలల యందు క్రమ ప్రకారము ఆయా దేవా లయముల యందా దేవతల నుంచవలెను. పూర్వము కూడా దేవతలనుంచ వలసిన స్థానములు మొదలైనవి చెప్పబడియున్నవి. యక్షులను, విద్యాధ రులు మొదలైన వారిని, ప్రమధ గణమును, భూతములు మొదలైన వారిని రాక్షసులను, సప్తమాతృకలను, రోహిణిని, అప్సర స్త్రీలను, విశ్వకర్మ మొదలైన వారిని, అగస్త్యుడు మొదలైన వారిని నారదుడు మొదలైన వారిని సాలోక్య భక్తులను లెక్కకుమించిన ముప్పదిమూడు కోట్ల దేవతలను బ్రహ్మ మొదలైన వారిని పీఠము మొదలుకొని శిఖరము వరకు అన్ని అంతస్తులయందు మొదటను పైనను అంతట చక్కగా నుంచవలెను. ఇందు చెప్పబడక యున్న కొన్ని రూపములను గూడ ఆలోచనతో తెలిసికొని చక్కగా చేయవలయును.

## 31. సోపాన లక్షణము

శ్లో॥ దేవానాం మానుషాణాంచ హర్మ్య దీనాంచ సర్వశః
ఆరోహవరోహర్థంచ సోపాన లక్షణం తథా ॥ 43
హర్మ్యాది మండపాదీనాం ప్రాకారా దౌచగోపురే ।
తథా పర్వత దేశేతు వాపీకూప తటాకకే ॥ 44
నగరగ్రామాది సర్వేషాం కల్ప యేచ్ఛిల్ప విత్తమః ।
అచలంచ చలం చైవ ద్విధా సోపాన మీరితం ॥ 45
శిలాభిశ్చేష్టవైర్వా ఫిదారుభిః సచలం మతం ।
సర్వైవశ్చైవాలయం ప్రోక్తం క్షుద్రసోపాన సంయుతం ॥ 46

సర్వేషాం ముఖభద్రాణాం పార్శ్వే సోపాన సంయుతం ।
పార్శ్వయోర్ద్వారదేశేతు ముఖసోపాన మేవవా ॥ 47
ఆరోహార్థం సర్వహర్మ్యేతు దక్షిణద్వార భద్రకే ।
తత్పార్శ్వే పూర్వ దిగ్దేశే సోపానం కారయేచ్ఛుభం ॥ 48
గుహ్యాంతర్ద్వార దేశేతు వామేసోపాన సంయుతం ।
ఆరాధ్య దేవ దేవస్య ప్రదర్శన మగర్హితం ॥ 49
తస్మాత్తు ముఖభద్రేతు పార్శ్వే సోపానం కారయేత్ ।
పార్శ్వయోః పృష్ఠ దేశేతు తత్పూర్వే పక్షపార్శ్వకే ॥ 50

తా॥ దేవతా గృహములకును మానవ గృహమునకును అంతటను ఎక్కుటకును దిగుటకును మెట్లు నిర్మించు విధానమును చెప్పుచున్నాడు. మేడలకును, మండపములకును, ప్రాకారములకును, గోపురములకును, పర్వత ప్రదేశమునకును, దిగుడు బావులకును, కోనేళ్లకును, చెరువులకును నగరములయందును గ్రామములయందును శిల్పాచార్యుడు మెట్లు రచించవలెను. అచలమనియును, చలమనియును రెండు విధములు కలవు. జాతితోను ఇటుకలతోను రచించినది యచలము. దారువుతో రచించినది చలము అన్నిటికిని అచలములగు మెట్లను నిర్మించవలెను. చిన్న మెట్లను కూడా చేయవలెను. ముఖ భద్రములన్నింటికిని ప్రక్కను మెట్లుండవలెను. ద్వార దేశము యొక్క ప్రక్కలను మెట్లుండవలెను. ద్వారము యొక్క ముందరను మెట్లుండవలెను. అన్ని హర్మ్యములందును ఎక్కుటకు దక్షిణ ద్వారము యొక్క భద్రమునను దాని ప్రక్కలను తూర్పునను మెట్లను రచించవలెను. రహస్య ద్వారము యొక్క ఎడమ ప్రక్కను గూడ మెట్లుండవలెను. పూజించుసట్టి దేవ దేవుని పీఠమునకు గూడ మెట్లుండవలెను. కనుక ముఖ భద్రము యొక్క రెండు వైపులను మెట్లను రచించవలెను. ప్రక్కలను వెనుకను దానికి తూర్పునను ప్రక్క యొక్క యిరువైపులను మెట్లను చేయవలయును.

శ్లో॥ యత్రదేశేతు సోపానం తత్రదోషోన విద్యతే ।
ప్రముఖే ముఖ సోపానంన కుర్యాచ్ఛల్ప విత్తమః ॥ 51
అపరే పార్శ్వ యోర్ద్వారే భద్ర హీనత్ర యంతుచేత్ ।
తత్పూర్వకేతు సోపానం కుర్యాత్ సంపత్ప్రదాయకం ॥ 52
ప్రపాంగే ప్రముఖే భద్రే సోపానం పూర్వ పార్శ్వయోః ।

కుర్యాత్తు తంత్ర విచ్ఛిల్పి చోక్తమేవం పురాతనైః ॥ 53
తైతిలానా మితిప్రోక్తం కుర్యాత్సోపాన ముహ్యతాం ।
నరాణాం సర్వ హర్మ్యేషు వక్ష్యేసోపాన లక్షణం ॥ 54
తపస్వ్యాది ద్విజాతీనాం కర్ణానాంచ విశేషతః ।
దేవానా ముక్త వత్కుర్యా ద్గేహం సర్వేషు యోజయేత్ ॥ 55
ద్విజానాం భూపతీ నాంచ సర్వేషాం భద్రదేశకే ।
పార్శ్వే సోపాన సంయుక్తం తత్పూర్వేదా ప్రకల్పయేత్ ॥ 56
అలిందయుక్తం తద్ద్వారే వామే సోపాన సంయుతం ।
వినాలింద ప్రదేశేతు ప్రముఖే సోపాన మేవచ ॥ 57
వైశ్యానాం శూద్ర జాతీనాం సోపానం వక్ష్యతేఽధునా
యత్తద్వారాది భద్రాణాం యుక్త్యా సోపాన సంయుతం ॥ 58

తా॥ సోపానము కలచోట దోషముండదు ప్రధాన ద్వారమునకు యెదురుగా మెట్లను చేయరాదు. వేరొక ద్వారము యొక్క ప్రక్కలను చేయవచ్చును. అచ్చట భద్రమును హీనములను ఉన్నచో దానికి తూర్పున మెట్లను చేయవచ్చును చలి పందిరి యొక్క ముంగిటను మెట్లు యెదురు గాను ప్రక్కలను చేయువలెను. దేవాలయములకుగూడా యిట్లు చేయ వచ్చును. మానవ గృహములన్నిటికిని మెట్లు చేయు విధానమును చెప్పు చున్నాడు. యతి మొదలగు ద్విజాతులకును అన్ని కులముల వారికిని దేవ తలకు చెప్పినట్లు సమస్త గృహములకు చేయవచ్చును. ద్విజులకును రాజు లకును అందరికిని భద్రదేశమున ప్రక్కలను మెట్లుండవలెను. ద్వారము నకెదురుగా నైనను మెట్లుండవచ్చును ద్వారమున అలిందమును యెడమ ప్రక్కను మెట్లును చేయువలెను అలిందములేని చోట యెదురుగా మెట్లుం డవలెను. వైశ్యులకును శూద్రులకును మెట్లు చేయు పద్ధతి చెప్పబడు చున్నది ద్వారము యొక్క భద్రము నందు యుక్తితో మెట్లను చేయ వలయును

శ్లో॥ గోపురాణాంతు తత్పార్శ్వే సర్వేషాం లక్షణాన్వితం ।
అద్రిదేశే సమారోహ్యే యత్ర తత్రైవ కారయేత్ ॥ 59
వాపీకూప తటాకేవా పరితః సోపాన సంయుతం ।
చతుర్దిక్షు చతుష్కోణే చాంతరావేఽథ వాపునః ॥ 60

తత్రైవ శ్రేష్ఠ దిగ్దేశే కులద్వారం ప్రకల్పయేత్ ॥ 61
తత్పూర్వేచ ద్విపార్శ్వేచ కుర్యాత్సోపాన ముక్తవత్ ।
అచలంతు ఇతిప్రోక్తం చలం స్థాప్యం యథేష్టకం ॥ 62
ద్వాదశాంగుల మారభ్య త్రిత్ర్యంగుల వివర్ధనాత్ ।
సార్ధహస్తా వసానంస్యాన్న వధా విస్తృతం భవేత్ ॥ 63
సార్ధ ద్విహస్తమారభ్య షటోషడంగుల వర్ధనాత్ ।
సార్ధ వేదకరాంతంచ చలమే కంతదాయతిః ॥ 64
ఏక హస్తం సమారభ్య షటోషడంగుల వర్ధనాత్ ।
తత్త్రి హస్తావసానంస్యాత్ స్థిర సోపాన విస్తృతం ॥ 65
ద్విహస్తంతు సమారభ్య చతుర్హస్తా వసానకం ।
త్రిహస్తాది పంచ హస్తాంతం షటోషడంగుల వర్ధనాత్ ॥ 66
ఏతదచల సోపానం విస్తారం నవధా భవేత్ ।
జన్మాది స్తూపి పర్యంతం కుర్యాత్తుంగం హియోజయేత్ ॥ 67

తా॥ గోపురములకు ప్రక్కలను మెట్లు కొలత ప్రకారము చేయవలెను. కొండ యెక్కుటకు కూడా మెట్లు చేయవలెను. కోనేరు దిగుడుబావి చెఱువు మొదలైనవానికి చుట్టును మెట్లుండవలెను. నాలుగు ప్రక్కలను నాలుగు మూలలను ఆ దిశల యొక్క మధ్యను యిట్లు భద్రములను పేరు గల మెట్లును అక్కడనే ముఖ్యమైన దిశయందు యే జాతికి దగిన ద్వారమును ఆ జాతికి కల్పించవలెను. దాని యెదుటను ఇరువైపులను మెట్లను చేయవలసిన విధముగా చేయవలెను. ఇది అచలములగును, ఇష్ట కములను స్థాపించునట్లు చలమును చేయువచ్చును. విస్తారము 12 అంగుల ములు మొదలు 3 3 అంగులములు వృద్ధి చేయుచు. 1½ హస్తము వరకు 9 విధములుగా చేయవచ్చును. 1½ హస్తము మొదలు 6.6 అంగులములు పెంచుచు 4½ హస్తముల వరకు పాదపు చేయవచ్చును. ఇది చలసోపాన విధము 1 హస్తము మొదలు 6.6 అంగులములు పెంచుచు 3 హస్తముల వరకు స్థిరసోపానమునకు విస్తారమును చేయవచ్చును. 2 హస్తములు మొదలుకొని 4 హస్తముల వరకును 3 హస్తములు మొదలుకొని 6 6 అంగులములు పెంచుచు 5 హస్తముల వరకును 9 విధములుగా స్థిరసోపానమునకు విస్తారమును చేయవచ్చును. అధిష్ఠానము మొదలు స్తూపికవరకు యెత్తును కొలత ప్రకారము చేయవలయును.

శ్లో॥ లుప మానముక్త వత్కుర్యాత్ సోపానాయామ ముహ్యతాం।
అద్రి సోపాన దేశేతు దైర్ఘ్యమానం యథేష్టకం॥ 68
విస్తారం పూర్వ వత్కుర్యాద చలం చోక్త వద్భవేత్।
పరితః సోపాన విస్తారం తటాకాద్యా కారం తథా॥ 69
పరితః సర్వసోపానం కుర్యాత్ ప్రాగుక్త వన్నయేత్।
పట్టికాత్రయమారభ్య వర్ధయేత్ ద్వి ద్వి పట్టికాం॥ 70
త్రయోవింశ చ్ఛతాంతంస్యాద్ దేవానామపి కథ్యతే।
పట్టమద్రి మార్గ పర్యంతం తిర్యన్ చోర్ధ్వోర్ధ్వం చోక్తవత్॥ 71
మానుషాణాంతు సోపానం పట్టికా యుగ్మ సంయుతం॥
త్రిచతుష్పంచ షణ్మాత్రం చలం సోపానపాదకే॥ 72
తద్ఘనంచ విశాలేతు సమంవాపాద మధికం।
అర్ధాధికంతు పాదోన ద్విగుణం ద్విగుణం తతః॥ 73
దండద్వయ సమాయుక్తం ఛిద్రయుక్తాతు పట్టికాః।
ఏక ద్విత్ర్యంగులం వాపి పట్టికా ఘనమేవచ॥ 74
ద్వి త్రివేద శరాంగుల్యం షట్ సప్తాంగుల మేవవా।
అష్టనంద దశాంగుల్యం పట్టికా విస్తృతం భవేత్॥ 75
ఏవంతు చలసోపాన మచలం తత్ర ప్రవక్ష్యతే।
పంచ షడంగుల మారభ్య ద్విద్వ్యంగుల వివర్ధనాత్॥ 76

తా॥ లోపల యొక్క కొలతల ననుసరించి చేయవలయును. అన్ని మెట్లకును పాదవును ఊహించవలెను. కొండమెట్లను చేయునప్పుడు విస్తార మాను యిష్టము వచ్చినట్లు చేయవచ్చును. మెట్ల యొక్క విస్తారమును మా తము పూర్వము చెప్పబడినట్లు చేయవలయును. చెఱువులు మొదలైన వానికి చుట్టూ వాని ఆకారము ననుసరించి చేయవలయును. చుట్టూ చేయ వలసిన మెట్లన్నియును మునుపు చెప్పినట్లు చేయవలయును. 3 పట్టికలు మొదలుకొని 2.2 పట్టికలు పెంచుచు 123 పట్టికల వఱకు దేవతలకు మెట్లు చేయువచ్చును. పట్టము కొండదారి వఱకును అడ్డమును దానికి పైపైను చెప్పబడినట్లు చేయవలెను. మనుష్యులకు మెట్లు 2 పట్టికలతోనే చేయవచ్చును. 3-4-5-6 వఱకు చలసోపానము యొక్క పాదమున చేయవచ్చును. దాని యొక్క లావు విస్తారముతో సమానముగాని లేక ఒక పావంతు అధికముగాని, లేక సగము యెక్కువగాని, లేక ముప్పాతిక

వంతు యెక్కువగాని లేక రెట్టింపుగాని చేయవచ్చును. 2 హస్తములు పొడవు గలిగి బెజ్జములతో పట్టిక లుండవలయును. పట్టిక యొక్క లావు 1-2-3 అంగులములుండ వచ్చును. 2-3-4-5 అంగులములుగాని లేక 6-7 అంగులములుగాని 8-9 అంగులములుగాని, పట్టిక యొక్క విస్తారమును చేయవచ్చును. ఇట్లు చలసోపానమును చేయవలెను. అచలమును చెప్పుచున్నాను. 5–6 అంగులములు మొదలుకొని 2.2 అంగులములు పెంచుచు

(చెప్పబోవు శ్లోకములతో నన్వయము)

శ్లో॥ ద్వాదశైకార్కమాత్రాంతం పట్టికోత్సేధ విస్తృతం ।
అధిక్యాంగుల విస్తీర్ణం హీనమానోదయం భవేత్ ॥ 77
సోపాన పార్శ్వయోర్దేశే హస్తి హస్త విభూషితం ।
హస్తమూల విశాలేతు చోక్తాంగుపీన్ మానయేత్ ॥ 78
మూలస్య తత్త్రి భాగైకం హస్తాగ్రాంతం క్షయం క్రమాత్ ।
హస్తి హస్తవదాకారం ద్వారయుక్తం మనోహరం ॥ 79
త్రిచతుష్పంచ వక్త్రింవా మూలేన సింహాన నైర్యుతం ।
అగ్రాధోఽఽధార పట్టంస్యా త్పట్టి కంచోక్తమానకం ॥ 80
అగ్రాధారం పాలికాకారం పట్టికావేదికాకృతిః ।
సర్వాలంకార సంయుక్తం సోపానం లక్షణాన్వితం ॥ 81
అద్రి సోపాన పార్శ్వేతు ।
నకుర్యాత్ పార్శ్వాంఘ్రికం ॥ 82
అనేక హర్మ్యస్య విశాలదేశకే ।
సుభూషణోన్మానం యథా ప్రవిశ్యతే కుర్వంతి దోషం ।
కిలభర్తృకర్తౄణాం ఉక్తంమానం కురుతేతు సంపత్ ॥ 83

తా॥ పై శ్లోకములో చెప్పినట్లు 5-6 అంగులములు మొదలుకొని 2.2 అంగులములు పెంచుచూ 12.13 అంగులముల వరకు పట్టిక యొక్క యెత్తును చేయవచ్చును. ఎత్తుకంటె 1 అంగులము వెడల్పును చేయుట హీనమానము మధ్యమ ఉత్తమ మానములకు ఇంతను వెడల్పు చేయవలయును. మెట్ల యొక్క యిరుప్రక్కలను యేనుగు తొండములను చేయవలెను. తొండము యొక్క మొదట చెప్పబడినట్లు అంగులముల మానమును చేయవలెను. మొదలును 3 భాగములు చేసి అందులో 1 భాగము

తొండము యొక్క ఏనుగు తొండమువలెనే రూపమును చక్కగా చేయవలెను. ద్వారముతో గూడ అందముగా చేయవలెను. 3-4-5 ముఖములును చేయవచ్చును. మొదట సింహము యొక్క ముఖ ముండవలెను. పైనను క్రిందను ఆధార పట్టమును చేయవలెను. పట్టికను గూడ కొలత ప్రకారము చేయవలయును. పై ఆధారమును పోలికవలె చేయవలయును. పట్టికను వేదికవలె చేయవలెను. సమస్తమైన అలంకారములతో మెట్లను లక్షణ యుక్తముగా నిర్మించవలెను కొండ యొక్క మెట్ల ప్రక్కను ప్రక్క స్తంభములను ? యగూడదు. సమస్త హర్మ్యముల యొక్క విస్తార దేశమున అలంకారములును ఎత్తును చెప్పబడిన రీతిగా చేయవలయును శాస్త్రోక్త ప్రకారముగా చేసిరేని యజమానునకును శిల్పాచార్యునకును. సమస్త సంపదలు కలుగును.

## 32. జాతి హర్మ్యాది లక్షణము

(మానసారము 30 అధ్యాయము)

శ్లో॥ వక్ష్యేఽహం జాతి హర్మ్యాణామాయాది లక్షణం క్రమాత్ ।
పూర్వోక్తానాం విమానానాం విస్తారాదివశాద్ధి స్యాత్ ॥ 84
ఆయంద్వ్యయంచ యోనిశ్చ నక్షత్రం వారమంశకం ।
తిథిర్వాథ షడేతాని తథాయాది విదోవిదుః ॥ 85
సంచితా సంచితా నాంచ అంశేరాయాది భిర్యుతం ।
అపసంచిత హర్మ్యాణాం తిథ్యంతం షడ్ గ్రహీష్యతే ॥ 86
ఏకం త్రిపాద మర్ధంచ పాదహస్తం యథాక్రమం ।
జాతిచ్ఛందం వికల్పంచ అభాసంచ చతుర్విధం ॥ 87
వితత్తవేవ సంయుక్తం హర్మ్యాణాం మానకల్పనం ।
షట్ సప్తాష్టక వృద్ధిఃస్యాద్ ద్వాదశేన క్షయం నయేత్ ॥ 88
శేషం తదాయమిత్యుక్తం సంచితాపి యథాక్రమం ।
సప్తాష్ట నవవృద్ధ్యాతు హరేత్పంక్త్యా వ్యయం భవేత్ ॥ 89
ఏకద్విత్రయ వృద్ధ్యాతు క్షపయేత్వష్టాభిశ్చ యోనికం ।
షట్ సప్తాష్ట వృద్ధ్యాతు సప్త వింశకయో భవేత్ ॥ 90

తా॥ జాతి హర్మ్యముల యొక్క అయము మొదలైన లక్షణములను వరుసగా చెప్పుచున్నాను. పూర్వము చెప్పబడిన విమానముల యొక్క

విస్తారమును ఒకవైపు దానితోనొకవైపు దానిని వృద్ధి చేయుచు వానికి ఆయము, వ్యయము, యోని, నక్షత్రము, వారము, అంశము, (తిథి), ఇట్లు 6 విధములు చక్కగా ఆలోచించి చేయవలెను. సంచితములకును, అసంచితములకును, అంశ, ఆయము మొదలైనవి కలిగియుండవలెను. అపసంచిత హర్మ్యములకు తిథి దోషడ్వర్గుగా జేయవలెను. 1 హస్తము ముప్పాతికవంతు సగము ఒకటింపాతికవంతు ఇట్లు వరుసగా జాతి ఛందము, వికల్పము, ఆభాసము, అను నాలుగు విధములు కలవు. కనుక ఆ భాగముల ననుసరించి హర్మ్యముల యొక్క మానమును కల్పించవలెను. 6-7-8 సంఖ్యలచే వృద్ధిచేసి 12చేత భాగించినచో మిగిలినది ఆయమగును. సంచితము మొదలైన వానికి వరుసగా 7-8-9 సంఖ్యలతో పెంచి 10 చేత హరించగా వ్యయమగును. 1-2-3 చేతపెంచి 8చేత భాగించిన యెడల మిగిలినది ధ్వజాదియోనియగును. 6-7-8 చేతపెంచి 27చేత భాగించినచో మిగిలినది నక్షత్రమగును.

శ్లో॥ తచ్ఛేషం చాపి నక్షత్రం గణయేదశ్వినీ క్రమాత్ ।
షడష్టనంద వృద్ధ్యాతు సప్తభిః క్షపయేత్తతః ॥ 91
శేషం తద్వార మిత్యుక్త మర్కవారాది వారయున్ ।
త్రిభిర్వేదైస్తు వృద్ధిఃస్యాన్నందహో నిర్నవాంశకం ॥ 92
తిథిరంధ్రేణ వృద్ధిఃస్యా త్త్రింశతాక్షయో భవేత్ ।
సిద్ధ్యాది ద్వాదశాయఃస్యాచ్ఛిఖరా దివ్యయందశ ॥ 93
ధ్వజాద్యష్ట యోనిఃస్యా త్తస్కరాదినవాంశకం ।
ప్రథమాది తిథిరిత్యేవం చోక్త వద్గణయేత్సుధీః ॥ 94
ఏవమాయాది షడ్వర్గ ।
శుద్ధంవినా శుభంత్యజేత్ ॥ 95
ఆయాది షడ్వర్గయుతే విమానే చాయాధికం ।
క్షీణవ్యయం శుభంస్యాత్ గ్రామాది కర్తృ నృపతిక్రియానాం ।
సర్వం శుభం తత్కురుతేతు విద్వాన్ ॥ 96

ఇతి మానసారే వాస్తుశాస్త్రే ద్వాదశ తల విధానం
నామ త్రింశోఽధ్యాయః ॥

తా॥ వానిని అశ్వని మొదలుగా లెక్కించవలెను. 6-8-9 సంఖ్యలతో పెంచి 7చే భాగించిన శేషము వారమగును. ఆదివారము మొదలుగ లెక్కిం

చవలెను. 3-4చేత పెంచి 9చే హరింపగా శేషము అంశయగును. 9 చేత పెంచి 30 చేత భాగించిన యెడల మిగిలినది తిథి యగును. సిద్ధ మొదలగు 72 ఆయములును, శిఖరము మొదలగు 10 వ్యయములను ధ్వజము మొదలగు 8 యోనులును, తస్కరము మొదలగు 9 అంశలును, పాడ్యమి మొదలగు తిధులును ఇట్లు వరుసగా లెక్కించవలెను. ఇట్లు ఆయము మొదలయిన షడ్వర్గశుద్ధిలేని యెడల శుభములు కలుగవు. ఆయము మొదలైన షడ్వర్గముతో గూడియున్న విమానమున అయము యెక్కువగను వ్యయము తక్కువగను ఉండెనేని శుభములు కలుగును. గ్రామములు మొదలైనవియును కర్త రాజు మొదలయిన వారును సమస్తమును శుభముగ నుండుటకు షడ్వర్గశుద్ధిని చేయువలయును

## 33. ద్వాదశ భూమి ద్రావిడ పద్ధతి

పద్మము మొదలగు 5 విధములు

(సమరాంగణ 62వ అధ్యాయము)

శ్లో॥ బ్రూమో ద్వాదశ భౌమంస ।
సప్తషష్ఠి కరాయతః 211
ఉచ్ఛ్రాయాత్పంచనవతి హస్తఃస్యాత్కర్ణ మానతః ।
ఆద్యా చతుర్దశకరా భూమికాస్య విధీయతే ॥ 212
ద్వితీయైకా దశకరాన్ తృతీయార్ధయుతాన్ దశ ।
దశహస్తాంశ్చ తుర్థీ స్యా దష్టౌ సార్ధాంస్తు పంచమీ ॥ 213
సార్ధ సప్తకరా షష్ఠీ సప్తహస్తాచ సప్తమీ ।
అష్టమీ షట్కరా పంచ హస్తాతుసవమీ భవేత్ ॥ 214
దశమీ స్యాచ్చతుర్హస్తా త్రిహస్తైకాదశీ క్షితిః ।
ద్వాదశీ ద్వౌకరౌసార్ధౌ వేదీ బంధః కరద్వయం ॥ 215
చతుర్హస్తా భవేద్ఘంటా సర్వాలంకార భూషితా ।
స్తంభకర్ణస్య మానేన కుంభం కుర్యా ద్విచక్షణః ॥ 216
ఉచ్ఛ్రాలం ద్విగుణం స్తంభాతో హీరం సార్ధ గుణాంశకం ।
ఇత్యేతేద్రా విడాః సమ్యక్ ప్రాసాదా ద్వాదశోదితాః ॥ 217
ఏషాం పద్మ మహా పద్మ స్వస్తికా వర్ధమానకః ।
సర్వతో భద్ర ఇత్యేతా స్తలబంధాన్ నివేశయేత్ ॥ 218
అరభ్య భూమేరేకస్యా ఆచ ద్వాదశ భూమికాత్ ।

ఊర్ధ్వమానంచ కర్తవ్యం సామాన్యంతేషు పంచసు ॥ 219
పీఠై స్తలచ్ఛంధక భూమికాభిర్వి ।
నిర్మితా ద్రావిడ నామధేయాః ప్రాసాద ముఖ్యాః
కథితా యథా యథా ఇత్థం మహాశిల్పి భిరుచ్యతేఽసౌ 220

(అనుబంధము 20వ పటము చూడుడు)

ఇది సమరాంగణ సూత్రధారనామ్ని వాస్తుశాస్త్రే
ద్రావిడ ప్రాసాదా ద్యాయోనామ ద్విషష్టితమః

తా॥ పదిరెండు అంతస్తులు గల దేవాలయమును నిర్మించు విధానమును చెప్పుచున్నాడు. విస్తారము 67 హస్తములును ఎత్తు 95 హస్తములును కర్ణమానము చేత చేయవలయును. మొదటి అంతస్తు 14 హస్తములును, రెండవ అంతస్తు 11 హస్తములును, మూడవ అంతస్తు $10\frac{1}{2}$ హస్తములును, నాల్గవ అంతస్తు 10 హస్తములును, ఐదవ అంతస్తు $8\frac{1}{4}$ హస్తములును, ఆఱవ అంతస్తు $7\frac{1}{3}$ హస్తములును, ఏడవ అంతస్తు 7 హస్తములును, ఎనిమిదవ అంతస్తు 6 హస్తములును, తొమ్మిదవ అంతస్తు 5 హస్తములును, పదియవ అంతస్తు 4 హస్తములును, పదునొకండవ అంతస్తు 3 హస్తములును, పదిరెండవ అంతస్తు $2\frac{1}{2}$ హస్తములును, వేదిక 2 హస్తములును, ఘంటి 4 హస్తములును, అన్ని అలంకారములతో చేయవలెను. స్తంభము యొక్క కర్ణముతో సమానముగా కుంభమును చేయవలెను. ఊచ్ఛాలము స్తంభము నుండి రెట్టింపు చేయవలెను. హీరము $3\frac{1}{4}$ భాగము చేయవలయును. ఇవియన్నియును ద్రావిడ ప్రాసాదములు 12 విధములు అందును పద్మము మహా పద్మము స్వస్తికము, వర్ధమానము, సర్వతోభద్రము, అను 5 విధములు గలవు. భాగ భేదములచేత వానికి నామము లేర్పడుచున్నవి. మొదటి అంతస్తు నుండి పది రెండంతస్తుల వరకును ఈ ఐదింటికి ఎత్తు సామాన్యముగా నుండినను పీఠ భేదములును, తలచ్ఛందక భేదములు, భూమి భేదములును, వీనిచేత ముఖ్య నామములైదుగా నిర్ణయింపబడినవి. ఇట్లు మహా శిల్పులచే జెప్పబడిన లక్షణంలను వివరించితిమి.

## 34. త్రయోదశ భూమి విధానము

(కాశ్యప శిల్పము 40వ పటలము)

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ త్రయోదశ తలంపరం ।
తస్య విస్తారమానంతు ప్రాసాద మానవచ్ఛవేత్ ॥ 1

ఏకోనవింశ దంశంతు కర్తవ్యం సదనంతతం ।
గుణాంశం గర్భగేహంతు పక్షాంశం గృహ పిండకం ॥ 2
అలింద్రంచ శివాంశం స్యాద్భిత్తిః స్యాదున్నతం సమం ।
అలింద్రం త్వేక భాగేన భిత్తివ్యాసం శివాంశకం ॥ 3
వ్యోమ భాగమలింద్రం స్యాద్ద్వారా వ్యాసంచ తత్సమం ।
విన్యాస సూత్రయోరంతరే కోన వింశదంశకే ॥ 4
శివాంశం కర్ణ కూటంస్యా న్మధ్యే శాలాగ్ని భాగయా ।
పక్షశాలాచ తత్తుల్య మేకాంశం పంజరస్యతు ॥ 5
హారాంతర మధార్ధాంశం క్షుద్ర పంజర సంయుతం ।
పంజరం కర్ణకూటాభం తదా భక్షుద్ర పంజరం ॥ 6
ఏవ మాదితలం ప్రోక్తమూర్ధ్వం భానుతలోక్తవత్ ।
ద్వి చత్వారింశ దాధిక్యే శతాంశే సదనోచ్ఛ్రితే ॥ 7
పంచాంశం తదధిష్ఠానం దశాంశం చరణోదయం ।
భూతాంశం మంచ మానంస్యాచ్ఛేషం ద్వాదశ భూమివత్ ॥ 8
త్రయో దశతలం హ్యేవం కలా భూమి మధోపరి ॥ 9

(ఇది కాశ్యప శిల్పే త్రయోదశ భూమి విధానం
నామ చత్వా వింశః పటలః)

తా॥ పదమూడంతస్తులు గల దేవాలయము యొక్క విధానమును చెప్పుచున్నాడు విస్తారమును పూర్వము ప్రాసాద మానమున చెప్పబడిన రీతిగా చేయవలెను. ఆ విస్తారమును 19 భాగములు చేసి గర్భమును 3 భాలను గోడ 2 భా ను, అలింద్రము 1 భా ను. మరల గోడ 1 భా ను, మరల అలింద్రము 1 భాగమును, మరల గోడ 1 భాగమును, మరల అలింద్రము 1 భాగమును, హారము 1 భాగమును చేయవలయును. ప్రస్తరము పైన 19 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యను శాల 3 భాగములును, ప్రక్కను శాల 3 భాగములును, పంజరము 1 భాగమును, హారము $\frac{1}{2}$ భాగమును, అందు క్షుద్ర పంజరమును చేయవలయును. కర్ణ కూటమువలె పంజరమును, పంజరమువలెనే క్షుద్ర పంజరమును చేయవలెను ఇట్లు మొదటి అంతస్తును చేయవలయును. దానిపైన ద్వాదశ భూమి యందు చెప్పబడినట్లు చేయవలెను. ఆలయము యొక్క యెత్తును 142 భాగములు చేసి అధిష్ఠానము 5 భాగములును, స్తంభము 10 భాగ

ములును, ప్రస్తరము 5 భాగము లును చేయవలెను. మిగిలిన పనులన్ని యును ద్వాదశ భూమివలెనే చేయవలయును.

## 35. షోడశ భూమి విధానము

(కాశ్యప శిల్పము 41వ పటలము)

శ్లో॥ అథ షోడశ భూమిస్తు వక్ష్యతే దేశికోత్తమ ।
ఏవం క్రమేణ సంకల్ప్య పంచాలింద్ర సమన్వితం ॥ 1
పంచహార సమాయుక్తం గృహపిండే సమానకం ।
గర్భగేహం షడంశంచ వేదాంశం గృహపిండికా ॥ 2
శేషం పూర్వ వదుద్దిష్ట మలింద్రాది ద్విజోత్తమ ।
ఏకద్విత్రి చతుష్పంచ భూమౌవాఽథ ధరాతలే ॥ 3
దేవతా స్థాపనం కుర్యాత్ షోడశ స్థల హర్మ్యకే ।
దేవతా స్థాపనం భూమిర్యావత్తా వద్ఘనంకురు ॥ 4
బాహ్యాలింద్రే అలంకారం ఘనమత్యం తరంకురు ।
అలింద్ర జల తత్పాదాచ్ఛాదితం వాతులాదిభిః ॥ 5
ప్రస్తరాంతర్ఘనంవాఽథ భ్రాంతం వాతత్తు తద్ఘనం ।
వ్యాసేస వేద త్రింశాంశే కర్ణకూటం శివాంశకం ॥ 6
హర్మ్యం మధ్యేతు వేదాంశం శాలాయామ ముదాహృతం ।
తయోర్మధ్యేతు పక్షాంశేఽర్ధ తుంగం పరికల్పయేత్ ॥ 7
తయోర్మధ్యే శివాంశేన పంజరం కర్ణ కూటవత్ ।
హారాంతరం తయోర్మధ్యే అర్ధాంశేనైవ కల్పయేత్ ॥ 8
ఏవంహి కల్పయేదాది భూమౌ శాలాష్ట వింశతిః ।
కర్ణకూటం తువేదాసు ద్వాత్రింశం పంజరం భవేత్ ॥ 9
సవేద షష్టి సంఖ్యాః స్యాద్ధారాం తరం ద్విజోత్తమ ।
ఏవమాది తలంఖ్యాతం తద్దిద్వాత్రిం శదంశకే ॥ 10

(అనుబంధము 21వ పటమును చూడుడు)

తా॥ పదునాఱు అంతస్తులు గల దేవాలయమును రచించు పద్ధతిని చెప్పుచున్నాడు. ఒక్కొక్క భాగము చొప్పున అలింద్రములు 5ను, హార ములు ఒక్కొక్క భాగము చొప్పున 5ను, గోడ కూడ ఒక్కొక్క భాగమును గర్భ గృహము 6 భాగములును గోడ 4 భాగములును, ఇట్లు 42 భాగము

లతో చేయవలెను. మిగిలినవన్నియును మునుపటివలెనే చేయవలెను. మరియు పదునాఱు అంతస్తుల దేవాలయమున దేవతా స్థాపనము మొదటి అంతస్తునగాని, రెండవ అంతస్తునగాని, మూడవ అంతస్తునగాని, నాలుగవ అంతస్తునగాని అయిదవ అంతస్తునగాని చేయవచ్చును. దేవతా స్థాపనమును ఎంతవఱకు నిర్ణయింతుమో అంతవఱకు ఒక్కటే దిమ్మగా చేయవలెను. వెలుపల అలింద్రమున అలంకారము దిమ్మ యొక్క పైన పరస్థలమును విడగొట్టి చేయవలయును. అలింద్రములున్న చోట స్తంభములును వానిపైన దూలములను వేయవలయును. లేక ప్రస్తరములోనే కలిపి యైనను చేయవచ్చును. ఇట్లు నలువైపుల దిమ్మ మీదనుగాని ప్రస్తరమునగాని చేయవచ్చును. విస్తారమును 34 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 4 భాగములను, కర్ణకూటమునకును మధ్యశాలకును మధ్య ప్రదేశమును అందులో సగము యెత్తునను 2 భాగముల చొప్పునను 6 శాలలను చేయవలయును. ఆ శాలల యొక్క నడుమ పంజరములను ఒక్కొక్క భాగము చొప్పున చేయవలెను ఆ పంజరములకు రెండు వైపుల జలాంతరములను అర్ధ భాగము, అర్ధ భాగము చొప్పున చేయవలెను. ఇట్లు మొదటి అంతస్తు పైన 28 శాలలును, 4 కర్ణ కూటములును, 32 పంజరములును 64 హారములును చేయవలయును. మరియును రెండవ అంతస్తున 32 భాగములు చేయవలయును.

శ్లో॥ ద్విభాగం మధ్యశాలా స్యాచ్ఛేషం పూర్వవదా చరేత్ ।
ద్వితీయం హ్యేవమాఖ్యాతం తృతీయ మధునోచ్యతే ॥ 11

తా॥ రెండవ అంతస్తున మధ్యశాలను 2 భాగములు చేసి మిగిలిన వన్నియును మొదటి అంతస్తున చేసిన కొలత ప్రకారము చేయవలయును.

శ్లో॥ త్రింశదంశ విభాగంతు కృత్వా విమానం త్రిభూమికం ।
కర్ణకూట స్యపార్శ్వస్థం పంజరం త్వర్ధభాగయా ॥ 12
హారాంతరంత దర్ధంస్యాచ్ఛేషం ద్వితయ భూమివత్ ।
చతుర్భూమి విశాలంతు చాష్టా వింశతి భాగయా ॥ 13
కర్ణకూట సమీపస్థం శాలాయాస్తు ద్విపార్శ్వయో ।
అర్ధాంశం పంజరవ్యాసం శేషం ప్రాగివ కల్పనం ॥ 14
పంచమే తల విస్తారే షడ్వింశత్యం శభాజితే ।
మధ్యే శాలాతు వేదాంశం వ్యోమాంశం కర్ణకూటకం ॥ 15

తయోర్మధ్యస్థ శాలాచ తయోర్మధ్యే చకోష్ఠకం ।
ప్రత్యేకం చద్విభాగేన కల్పయేచ్ఛిల్ప విత్తమః ॥ 16
తయోర్మధ్యేఽర్ధ భాగేన పంజరం కర్ణకూటరత్ ।
హారాంతరం తదర్ధేన తేషాం సంఖ్యాఽఽ దిభూమివత్ ॥ 17

తా॥ మూడవ అంతస్తును 30 భాగములు చేసి కర్ణకూటము యొక్క ప్రక్కనున్న పంజరమును మాత్రము ½ భాగము చేసి అందులో సగము హారాంతరమును చేయువలెను మిగిలినవన్నియును రెండవ అంతస్తున చేసి నట్లే చేయువలెను నాలుగవ అంతస్తున విస్తారమున 23 భాగములు చేసి కర్ణకూటము ప్రక్కనున్న శాల యొక్క రెండు వైపులను పంజరములను అర్ధ భాగము అర్ధ భాగము చొప్పున చేయువలెను. మిగిలినవి యెప్పటివలెనే చేయువలెను. ఐదవ అంతస్తున విస్తారమును 26 భాగములు చేసి మధ్య శాలను 4 భాగములును కర్ణకూటము 1 భాగమును, వాని మధ్య శాలలు పూర్వమువలెనే 2 2 భాగములు చేసి పంజరములను ½ భాగము చొప్పున కర్ణకూటమువలెనే చేయువలయును. హారమును అందులో సగము చొప్పున చేయువలయును. అన్ని రూపములను మొదటి అంతస్తు వలెనే యుండ వలయును.

శ్లో॥ షష్ఠంచ భూమి విస్తారం చతుర్వింశతి భాజితే ।
మధ్యే కోష్ఠం ద్విభాగేన శేషం పూర్వ వదేవహి ॥ 18
సప్త భూమేస్తు విస్తారం ద్వావింశత్యం శకం భవేత్ ।
శివాంశం కర్ణకూటంతు మధ్యశాలా ద్విభాగయా ॥ 19
తయోర్మధ్యే శివాంశేన క్షుద్రకోష్ఠం ప్రకల్పయేత్ ।
తయోర్మధ్యే ద్విభాగేన కోష్ఠాయామ ముదాహృతం ॥ 20
అర్ధాంశం పంజర వ్యాసం తదర్ధం హారయోఽంతరం ।
పంజరం కూట కోష్ఠంచ సంఖ్యావై ప్రాగివైవతు ॥ 21
అష్టమం భూమి విస్తారం వింశత్యంశ విభాజితే ।
వ్యోమాంశం కర్ణకూటంస్యా న్మధ్యేకోష్ఠం ద్విభాగయా ॥ 22
తయోర్మధ్యే విభాగేన కోష్ఠాయామ ముదాహృతం ।
అర్ధాంశం పంజర వ్యాసం తదర్ధం హారయోఽంతరం ॥ 23

పంజరం కూటకోష్ఠంచ సంఖ్యా స్యాత్ ప్రాగివైవతు ॥

తా॥ ఆఱవ అంతస్తున విస్తారమును 24 భాగములు చేసి మధ్య శాలను 2 భాగములు చేసి మిగిలినవి పూర్వము వలెనే చేయవలెను. ఏడవ అంతస్తు విస్తారమును 22 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును ఆ రెంటి మధ్య క్షుద్ర కోష్ఠము 1 భాగమును మరల ఆ రెంటి మధ్య కోష్ఠము 2 భాగములును, పంజరము ½ భాగమును అందులో సగము హారమును చేయవలెను పంజరములు కూటములు శాలలు మునుపటివలెనే సంఖ్య యుండవలెను. ఎనిమిదవ అంతస్తున విస్తారమును 20 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, ఆ రెంటి మధ్య శాలలు ఆ ప్రకారముగా మిగిలిన $1\frac{1}{2}$ చొప్పున భాగములును, పంజరము ½ భాగమును హారము ¼ భాగమును చేయవలెను పంజరములు కూటములు కోష్ఠములు మునుపటి సంఖ్యయే యుండవలెను గాని తగ్గించగూడదు.

శ్లో॥ అష్టమం భూమి విస్తారం వింశత్యంశ విభాజితే ॥ 24
వ్యోమాంశం కర్ణకూటం స్యాన్మధ్యే కోష్ఠం ద్విభాగయా ।
తయోర్మధ్యే ద్విభాగేన కోష్ఠాయామ ముదాహృతం ॥ 25
తయోర్మధ్యే శివాంశేన క్షుద్ర కోష్ఠం ప్రకల్పయేత్ ।
శేషం ప్రాగివ కర్తవ్యం తేషాం సంఖ్యాది పూర్వవత్ ॥ 26
నవభూమి విశాలంతు త్రి షడంశ విభాజితే ।
శివాంశం కర్ణకూటం స్యాన్మధ్యే శాలా ద్విభాగయా ॥ 27
తయోర్మధ్యేఽర్ధభాగేన పంజరం పరి కల్పయేత్ ।
తస్యార్ధేనైవ తత్పార్శ్వే తయోర్హారాంతరం భవేత్ ॥ 28
తత్పార్శ్వయో ద్విభాగం స్యాత్కోష్ఠం కుర్యా ద్విశేషతః ।
కూటకోష్ఠాంతరే చైవ కోష్ఠయోరంతరేఽపిచ ॥ 29
పంజరం కల్పయేద్ధీమా నర్ధాంశేనైవ సువ్రత ।
హారాంతరం తదర్ధాంశం కల్పయేచ్ఛిల్ప విత్తమః ॥ 30
వింశత్కోష్ఠం చతుష్కూటం పంజరం ఖాను భిర్ద్వయం ।
కల్పైవ్యేవం నవభూమౌతు దశభూమి మథోచ్యతే ॥ 31

తా॥ మరియు ఎనిమిదవ అంతస్తును యింకొక విధముగాను చేయవచ్చును. ఆ భాగములను చెప్పుచున్నాను. విస్తారమును 20 భాగములు

చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, ఆ రెంటి మధ్యశాల 2 భాగములును, మరల ఆ రెంటి మధ్య క్షుద్రశాల 1 భాగమును చేసి మిగిలినవి మునుపటివలెనే చేయవలెను. వాని యొక్క సంఖ్య మును పటివలెనే యుండవలెను. తొమ్మిదవ అంతస్తును 18 భాగములు చేసి కర్ణ కూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, ఆ రెంటి మధ్య పంజరము ½ భాగమును, దాని యొక్క రెండు ప్రక్కలను అందులో సగము చొప్పున హారము నుంచవలెను, ఆ పంజరమునకు రెండు ప్రక్కలను 2.2 భాగముల చొప్పున శాలలు చేయవలెను. కూటకోష్ఠముల రెంటి మధ్యను శాలల రెంటి మధ్యను ½ భాగము చొప్పున పంజరములను చేయవలెను. అందులో సగము హారము రెండు వైపుల నుండవలెను. శాలలు **20** కూటములు **4** పంజరములు **24** చేయవలయును.

శ్లో॥ దశభూమేస్తు విస్తారం షోడశాంశ విభాజితే ।
కర్ణకూటం శివాంశం స్యాత్తత్సమం పంజరస్తరం ॥ 32
శాలాయామం ద్విభాగంస్యా దర్ధాంశం హారయోఽంతరం ।
భాను శాలా చతుష్కూటం కలా పంజర సంయుతం ॥ 33
హారాంతరంతు ద్వాత్రింశత్కల్పయే ద్దశమేతవే ।
ఏకాదశ తల వ్యాసం మనుభాగ విభాజితే ॥ 34
శివాంశం కర్ణకూటంతు మధ్యేశాలా ద్విభాగయా ।
తయోర్మధ్యస్థ శాలానాం గుణాంశం పరికల్పయేత్ ॥ 35
అర్ధాంశం పంజర వ్యాసం తదర్ధం హారయోఽంతరం ।
చతుష్కూటార్క శాలాచ పంజరం షోడశాన్వితం ॥ 36
హారాంతరం చద్వాత్రింశ త్కల్ప్యం రుద్రతవేఽపిచ ॥

తా॥ పదియవ అంతస్తు విస్తారమును 16 భాగములు చేసి కర్ణ కూటము 1 భాగము, శాల 2 భాగములు, హారము ½ భాగము, **12** శాలలు **4** కూటములు **16** పంజరములు **32** హారములు చేయవలెను. పదునొకండవ అంతస్తు విస్తారము 14 భాగములు చేసి కర్ణకూటము 1 భాగము, మధ్యశాల 2 భాగములు, ఆ రెంటి మధ్య శాలలు 3 3 భాగములు, పంజరము ½ భాగము, అందులో సగము హారము కూటములు 4 శాలలు 12 పంజరములు 16 హారములు 32 చేయవలయును.

పంజరం కూటకోష్ఠంచ సంఖ్యా రుద్రతలే తువా ।
సర్వేషామపి కోష్ఠానాం పక్షాంశం ప్రవిధీయతే ॥ 38
త్రయోదశ తలవ్యాసం దశభాగ విభాజితే ।
కర్ణకూటం శివాంశేన మధ్యేశాలా ద్విభాగయా ॥ 39
తయోర్మధ్యేఽర్ధ భాగేన పంజరం కర్ణకూటవత్ ।
హారాంతరం చతుస్యార్ధం సంఖ్యా ద్వాదశ భూమివత్ ॥ 40
చతుర్దశ తలవ్యాసో వసుభాగ విభాజితే ।
శివాంశం కర్ణకూటం స్యాన్మధ్యేశాలా ద్విభాగయా ॥ 41
అర్ధాంశం పంజర వ్యాసం తస్యార్ధం హారయోఽంతరం ।
చతుష్కూటం చతుఃశాలం పంజరం షోడశాన్వితం ॥ 42
హారాంతరం చతుర్వింశత్కల్ప్య వంతుహ్యా నూత్తమం ॥

తా॥ పది రెండవ అంతస్తును 12 భాగములు చేసి పంజరములు కూటములు శాలలు పదునొకండవ అంతస్తున చేసిన సంఖ్యయే చేయువలయును శాలలన్నియును రెండేసి భాగములే చేయువలయును పదుమూడవ అంతస్తు విస్తారమును 10 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, దానికిరువైపుల శాలలు 2.2 భాగములును, పంజరము ½ భాగమును అందులో సగము హారమును ఇట్లు పదిరెండవ అంతస్తున చేసినట్లు చేయువలయును. పదునాల్గవ అంతస్తు విస్తారమును 8 భాగములు చేసి కూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, పంజరము ½ భాగమును అందులో సగము హారమును 4 కూటములును, 4 శాలలును, 16 పంజరములును, 24 హారములును చక్కగా చేయువలయును.

శ్లో॥ త్రి పంచభూమి షడ్భాగం విస్తారం విభజేత్సమం ॥ 43
కర్ణకూటం తువ్యోమాంశం మధ్యేశాలా ద్విభాగయా ।
హారాంతరం తుశశ్యంశం యుగ్మ పంజర సంయుతం ॥ 44
షోడశోర్ధ్వ తలవ్యాసో వేదభాగ విభాజితే ।
ద్విభాగ విస్తృతం దండమానం నీవ్రంతు మధ్యమే ॥ 45

తా॥ పదునైదవ యంతస్తును 6 భాగములు చేసి కర్ణకూటము 1 భాగమును, మధ్యశాల 2 భాగములును, హారాంతరము 1.1 భాగము చేసి అందులో సగము మధ్య పంజరమును చేయువలెను. పదునారవ అంతస్తు

విస్తారమును 4 భాగములు చేసి అందులో సగము మధ్య 1 దండము ప్రమాణము ముందుకు నిర్గమమును చేయవలయును.

శ్లో॥ కృత్వా ప్రాసాదతుంగంతు ద్విభాగేన శతద్వయం ।
ధరాతలంతు సప్తాంశం చరణం చత్రయోదశం ॥ 46
సార్ధ షష్ఠంతు మంచోచ్చం పాదోచ్చం భాను సంఖ్యాయా ।
ప్రస్తరోచ్చంతు షడ్భాగం రుద్రాంశం చరణోదయం ॥ 47
సార్ధ భూతాంశ మంచంస్యా ద్దశాంశం చరణోదయం ।
భూతాంశం మంచమానంతు నవాంశం చరణోదయం ॥ 48
సార్ధ వేదాంశ మంచోచ్చం కల్పయేచ్ఛిల్ప విత్తమః ।
పాదోచ్చం సార్ధవస్వంశం మంచమానం యుగాంశకం ॥ 49
వస్వంశం చరణోచ్చంతు మంచం పాదోనకం యుగం ।
చరణం సార్ధ సప్తాంశం ప్రస్తరం సార్ధ వహ్నికం ॥ 50
సప్తాంశం పాదదీర్ఘంతు పాదాధిక్యాగ్ని మంచకం ।
అర్ధాధికం షడంశంతు పాదోచ్చంత్వగ్ని మంచకం ॥ 51
షడంశం పాదమానంతు పాదో నాగ్న్యంశ మంచకం ।
అర్ధాధికంతు భూతాంశం పాద దైర్ఘ్య ముదాహృతం ॥ 52
అర్ధాధికం ద్విభాగంతు ప్రస్తర స్యోదయం భవేత్ ।
సపాద పంచ భాగంతు పాదదీర్ఘ ముదాహృతం ॥ 53

తా॥ పదునాఱంతస్తులు గల దేవాలయము యెత్తును 198 భాగములు చేసి అధిష్ఠానము 7 భాగములు, స్తంభము 13 భాగములు, ప్రస్తరము $6\frac{1}{2}$ భాగములు, రెండవ స్తంభము 12 భాగములు, ప్రస్తరము 6 భాగములు మూడవ స్తంభము 11 భాగములు, ప్రస్తరము $5\frac{1}{2}$ భాగములు, నాల్గవ స్తంభము 10 భాగములు, ప్రస్తరము 5 భాగములు, ఐదవ స్తంభము 9 భాగములు, ప్రస్తరము $4\frac{1}{2}$ భాగములు, ఆఱవ స్తంభము $8\frac{1}{2}$ భాగములు ప్రస్తరము 4 భాగములు, ఏడవ స్తంభము 8 భాగములు, ప్రస్తరము $3\frac{3}{4}$ భాగములు, ఎనిమిదవ స్తంభము $7\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $3\frac{1}{2}$ భాగములు తొమ్మిదవ స్తంభము 7 భాగములు, ప్రస్తరము $3\frac{1}{4}$ భాగములు పదియవ స్తంభము $6\frac{1}{4}$ భాగములు, ప్రస్తరము 3 భాగములు, పదునొకండవ స్తంభము 6 భాగములు, ప్రస్తరము $2\frac{3}{4}$ భాగములు, పదిరెండవ

స్తంభము $5\frac{1}{4}$ భాగములు, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగములు, పదుమూడవ స్తంభము $5\frac{1}{4}$ భాగములు చేయవలయును.

(అనుబంధము 22వ పటము చూడుడు)

శ్లో॥ సార్ధ పఞ్చాంశ మంచోచ్చ్రం భూతాంశం చరణాయతం ।
సపాదపఞ్చ భాగంతు మంచమాన ముదీరితం ॥ 54
పాదోన పంచ భాగంతు చరణోదయ మీరితం ।
మంచమానం ద్విభాగం స్యాత్సార్ధ వేదాంశ మంఘ్రికం ॥ 55
సత్రిపాద శివాంశంతు ప్రస్తరస్య సముచ్ఛ్రితం ।
శశ్యంశం వేదికామానం కంఠోచ్చ్రం తద్ ద్విభాగయా ॥ 56
అర్ధాధిక యుగాంశంతు శిఖరోదయ మీరితం ।
సపాదాంశం శిఖామానం కల్పయేత్తు క్రమేణచ ॥ 57

తా॥ పదుమూడవ ప్రస్తరము $2\frac{1}{2}$ భాగములును, పదునాల్గవ స్తంభము 5 భాగములును, ప్రస్తరము $2\frac{1}{4}$ భాగములును, పదునైదవ స్తంభము $4\frac{3}{4}$ భాగములును, ప్రస్తరము 2 భాగములును. పదునాఱవ స్తంభము $4\frac{1}{2}$ భాగములును, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములును, గలము 2 భాగములును, శిఖరము $4\frac{1}{2}$ భాగములును, స్తూపిక $1\frac{1}{4}$ భాగమును మొత్తము 198 భాగములు చేయవలయును.

## 36. బ్రహ్మకాంతము మొదలగు 6 విధములు

శ్లో॥ హెూమాదిస్తూపి పర్యంతం యుగాశ్రం పరికల్పయేత్ ।
శిఖరేతు చతుర్దిక్షు మహానాసీ సమన్వితం ॥ 58
పాదం ప్రత్యల్పనా సాధ్యం బ్రహ్మకాంత ముదాహృతం ।
తదేవ సోన్నతం మంచం సాష్టికోన్నత కోష్ఠకం ॥ 59
సారస్వత మిదం ఖ్యాతం శివప్రియకరం గృహం ।
తదేవ నతకూటంచ కోష్ఠోన్నత సమంచకం ॥ 60
ప్రాదేశమితి విఖ్యాతం సర్వ సమృద్ధి కారణం ।
తదేవ శిఖరం కంఠం వస్వశ్రం పరికల్పయేత్ ॥ 61
శిఖరేఽష్ట మహానాసీ యుక్తం తచ్ఛ్రీకరం భవేత్ ।
తదేవ మధ్య భద్రాఢ్యం కూటకోష్ఠౌ సమోన్నతౌ ॥ 62
సమంచోవాప్య మంచోవా కూటశాలౌ ద్విజోత్తమ ।
పార్వతిక మిదంఖ్యాతం మమ ప్రీతికరం భవేత్ ॥ 63

తదేవ శిఖరం కంఠం వృత్త మష్టాశ్ర వేదికం ।
వేదికాశ్చైవ వృత్తావా వృత్తాకార ఘటాఽపివా ॥ 64
సుశాంభవ మిదంఖ్యాతం శంకరస్య ప్రియావహం ।
పంజరం కూటకోష్ఠంచ శిఖరంచ ఘటం తథా ॥ 65
ఏవ మాదీని సర్వాణి నాగరాద్యుచితం కురు॥

తా॥ అధిష్ఠానము మొదలుకొని స్తూపిక వఱకు నలుచదరముగాచేసి నలువైపుల మహానాసికలను రచించి స్తంభములకు క్షుద్రనాసికలను చేసినచో బ్రహ్మకాంతమగును. అదియే యెత్తయిన ప్రస్తరములును, కూటములును, శాలలును కలిగియుండెనేని సారస్వత మగును. అదియే తగ్గిన కూటములును, ఎత్తయిన శాలలు ప్రస్తరములును కలిగియుండెనేని ప్రాదేశ మగును. ఇది సఖ్యమును సమృద్ధి చేయును. అదియే శిఖరమును కంఠమును 8 కోణములుగా చేసి శిఖరమున 8 మహా నాసికలను రచించిన యెడల శ్రీకరమగును అదియే మధ్యను భద్రమును రచించి కూటములును శాలలును సమానమైన యెత్తులో రచించి వానికి ప్రస్తరములతో గాని ప్రస్తరములు లేకుండగాని చేసినచో పార్వతీకమగును. అదియే శిఖరమును కంఠమును గుండ్రముగా చేసి వేదిక 8 కోణములుగా రచించి వేదికలు గుండ్రముగా గాని గుండ్రముగా కుంభములుగాని రచించినచో సుశాంభవమగును. ఇదియును శివప్రియమైనదియే పంజరము కూటము కోష్ఠము, శిఖరము, కుంభము ఈ మొదలైనవన్నియును నాగరము వేసరము ద్రావిడము అను పద్ధతుల ననుసరించి చక్కగా ఒక్కటే జాతిలో చేయవలయును.

శ్లో॥ అనేనైవాథవా కుర్యా దేకానేకాది భూమయః ॥ 66
యంత్ర స్తంభేషు కర్తవ్యం తలంత స్స్యాద మంచకం ।
తత్తల స్యోచిత వ్యాసం తుంగ కుడ్యంచ గర్భకం ॥ 67
కర్తవ్యం విధినాతేన ఘంటాలంకార సంయుతం ।
సాలింద్రం సదనార్థంతు సోపానం రోహణాయవై ॥ 68
తత్ర తత్రోచితం కుర్యాచ్ఛి లాభిశ్చేష్టకాదిభిః ।
తస్యాగ్రే మండపం కుర్యాదేకానేక తలంతు వా ॥ 69
ప్రాగుక్త విధినా కుర్యా త్పర్వాలంకార సంయుతం ।
కరాలముద్గీ గుల్మాన కల్కచిక్కాణ కర్మకృత్ ॥ 70

నానాచిత్రైర్వి చిత్రంతు కర్తవ్యం విధిచోదితం ।
ఏవంయః కురుతే హర్మ్యం స్వశక్త్యా ప్రోక్తవత్తువా ॥ 71
ఇహైవధనవాన్ శ్రీమాన్ పుత్రపౌత్ర కలత్రకై :
దాసీదాసాది భిశ్చాన్యైః స్వేచ్ఛా వంశో ముదాఽ స్త్విహ ॥ 72
సోఽనేక కుల జాతంచ పావయేత్తు ముదాచనా ॥ 73

(ఇది కాశ్యప శిల్పే షోడశ భూమి విధాన మేకచద్వారింశః పటలః)

తా॥ ఇట్లు ఒక్క అంతస్తు గల దేవాలయమున గాని అనేక అంతస్తులు గల దేవాలయములందు గాని చేయవలయును. యంత్ర స్తంభముల యందు ప్రస్తరము లేకుండ అంతస్తులు చేయవచ్చును. ఆయా అంతస్తులకు తగిన విస్తారమును చేయుచుండవలెను. ఎత్తును గర్భమును కూడా అటులే చేయుచుండవలెను. ఘంటను చేయవలెను. మందిరమునకు అలింద్రములు గాని పైకి బోవుటకు మెట్లు గాని యెక్కడ యేది ఉచితమో అక్కడ ఆ విధముగా చేయవలెను. జాతితోగాని యిటుకలదోగాని చేయవచ్చును. దేవాలయము ముందు మండపమును ఒక్క అంతస్తుతోగాని అనేకమైన అంతస్తులతోగాని చేయవచ్చును. ఆ మండపము కూడ నానా విధములైన యలంకారములతో నుండవలెను. ఇంకను అనేక విధములైన రంగులతో చిత్రలేఖనము కూడ చేయవచ్చును. ఇట్లు శాస్త్ర ప్రకారము దేవాలయమును ఎవ్వరు చక్కగా నిర్మింతురో వారు ఈ లోకమునందు ధనవంతులును శ్రీమంతులును పుత్ర పౌత్రాభివృద్ధి కలవారును, సత్కలత్ర సమన్వితులును, దాస దాసీజన సేవితులును, స్వేచ్ఛ గలవారును సంతోష యుక్తులును అయియుందురు. ఇంతేకాక అనేక కులముల వారిని కూడా పరిశుద్ధులుగా చేయగలవారగుదురు.

## 37. బ్రహ్మ సృష్టిలోని 5 శాఖల ప్రాసాద వివరములును

(ఒక్కొక్క జాతి యందలి సంఖ్యయును)

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ త్రిదశానాం నృపాణాంచ వర్ణినాంచ విశేషతః ।
ఉత్పత్తి ప్రస్మృతిం బ్రూమః ప్రాసాద యస్యతే మదాః ॥ 1
పురాబ్రహ్మా సృజత్పంచ విమానాన్య సురద్విషాం ।
వియద్వర్త్మ విచారీణి శ్రీమంతిచ మహంతిచ ॥ 2

తానివై రాజకైలాసే పుష్పకం మణికాభిధం ।
హైమానిమణి చిత్రాణి పంచమంచ త్రివిష్టపం ॥ 3
ఆత్మనః శూలహస్తస్య ధనాధ్యక్ష స్యపాశినః ।
సురేశినేచ విశ్వేశో విమానాని యథాక్రమం ॥ 4
బహూన్యన్యానిచైవంస సూర్యా దీనామ కల్పయత్ ।
విశేషాయ యథోక్తైస్తా న్యాకారైః ప్రతి దైవతం ॥ 5
ప్రాసాదాంశ్చ తదా కరాన్ శిలా పక్వేష్టికాదిభిః ।
నగరాణామలంకార హేతవే సమకల్పయేత్ ॥ 6
వైరాజం చమరశ్రం స్యాద్వృత్రదం కైలాస సంజ్ఞితమ్ ।
చతురశ్రాయుగాకారం విమానం పుష్పకం భవేత్ ॥ 7
వృత్తాయతం చరణిక మష్టాశ్రిః స్యాత్త్రి విష్టపమ్ ।
తద్భేదాన్ శ్రీమహేూఽన్నాంశ్చ వి విధాన సృజతో ప్రభాః ॥ 8
యేయత్ర విహితా భేదాః పూర్వం కమల యోనినా ।
సర్వాంస్తానాభి ధాస్యామో నామ సంస్థాన మానతః ॥ 9

తా॥ పూర్వము బ్రహ్మదేవుడు 5 ప్రాసాదములను రచించెను. అందు 1 వైరాజము, 2 కైలాసము, 3 పుష్పకము, 4 మణికము, 5 త్రివిష్టపము వైరాజము తనకొఱకును, కైలాసము శివునకును, పుష్పకముకు చేరునకును మణికము వరుణునకును, త్రివిష్టపము ఇంద్రునకును నిర్ణయించెను. శివ, కుబేర, వరుణ, ఇంద్ర, బ్రహ్మసూర్య, విష్ణు, ప్రభృత దేవతలకు యోగ్యముగ విమానములను రచించెను.

(అపరాచిత 154వ సూత్రము)

శ్లో॥ విమానాః ప్రథమం పంచ స్వయంబ్రహ్మ ప్రభాషితాః ।
మనోహ్లాద కరాహ్యేతే తథా స్వచ్ఛంద చారిణః ॥ 2
వైరాజ్య ప్రథమోనామ పుష్పకశ్చ ద్వితీయకః ।
కైలాసోమణికస్తత్ర తథాచైవ త్రివిష్టపః ॥ 3

తా॥ మొట్ట మొదటి బ్రహ్మచే చెప్పబడిన విమానములు 5 వైరాజ్యము పుష్పకము, కైలాసము మణికము త్రివిష్టపము అను నామములు కలవి మఱియు

శ్లో॥ వైరాజ్యం చతురశ్రంచ కైలాసంవృత్తమేవచ ।
పుష్పకం కారయేత్ ప్రాజ్ఞశ్చతురశ్రాయతం తథా ॥ 4

వృత్తాయతం చైవకుర్యాన్మణికంతత్ర బుద్ధిమాన్ ।
త్రివిష్టప మథాష్టాశ్రం సర్వ దేవాలయేషుచ ॥ 5
ప్రయుక్తా విధితశ్ఛందాః సూత్రమార్గైరనే కధా ।
వైరాజ్య కుల సంభూతాః సర్వాః ప్రాసాద సంజ్ఞకాః ॥ 6

తా॥ వైరాజ్యము నలుచదరమును, కైలాసము గుండ్రమును, పుష్పకము పొడవు గల చదరమును మణికము పొడవు గల గుండ్రమును, త్రివిష్టపము 8 కోణములును కలిగియుండును. అసలు వైరాజ్యము నుండి యేసమస్త ప్రాసాదములు కలిగినవి.

శ్లో॥ ప్రాసాదావై పంచశతా న్యష్టాశీత్యధికానిచ ।
సర్వేషాం మూలయోనిస్తు వైరాజ్యం నామ కీర్తితా॥ 8
చతురశ్రాయ తచ్ఛందే పుష్పకాదిశ తత్రయం ।
అన్యేపంచ శతాన్యేవం వృత్తాః కైలాస సంభవాః ॥ 9
వృత్తాయతా స్సార్ధశత సంఖ్యాకా మణికోద్భవాః ।
త్రైవిష్టపా స్తథాష్టాశ్రామతాః సార్ధ శతత్రయం ॥ 10
సంఖ్యాయాష్టా శీత్యుత్తరాణ్యష్టా దశ శతానిచ ।
ఉక్తాః శ్రేష్ఠా బ్రహ్మణాశ్చ వైరాజ్య కుల సంభవాః ॥ 11
తన్మధ్యే మిశ్రకాశ్చైవ శతంచ ద్వాదశోత్తరం ।
స్యుర్విం శతిశతాన్యేవం ప్రాసాదా మిశ్ర సంయుతాః ॥ 12
పంచాశత్ సహస్రాణి పంచవింశతిధా పృథక్ ।
ఏకైకేతే౽ష్టధాభిన్నాశ్చ తుర్లక్షమి తా స్తథా ॥ 13

తా॥ వైరాజ్య జాతి ప్రాసాదములు 588, పుష్పకజాతి ప్రాసాదములు 300, కైలాసజాతి ప్రాసాదములు 500, మణికజాతి ప్రాసాదములు 150, త్రివిష్టపజాతి ప్రాసాదములు 350, ఈ యైదు జాతులు కలసి 1888యును మిశ్రజాతులు 112ను కలసి మొత్తము 2000 అయినవి. ఇట్లు భేదములచే 50000, కలిగినవి వానిలో ఒక్కొక్కటి యెనిమిది విధములుగ నేర్పడి మొత్తము 4 లక్షలు అయినవి. వీనిలో కొన్ని సూత్రము చెప్పబోవు చున్నాను.

## 38. వైరాజ్య ప్రాసాద లక్షణము

(అపరాజిత 104వ సూత్రము)

శ్లో॥ వైరాజ్యం శ్వేదవర్ణంచ హేమరత్న విభూషితం । 10

తా॥ వైరాజ్య ప్రాసాదము తెలుపుగను బంగారము తోచును మణు లతోను అలంకరింపబడియుండును.

(అపరాజిత 155వ సూత్రము)

శ్లో॥ అథోవక్ష్యేచ వైరాజ్యం ప్రాసాదం సర్వకామదం ।
తల్లభం సర్వదేవానాం శివస్యాపి విశేషతః ॥ 1
అనంత పుణ్యదాం చైవ పూజాం వైబ్రహ్మణోదితాం ।
తేషా మనుక్రమం వక్ష్యే శృణుచైకాగ్ర మానసః ॥ 2
చతురశ్రీ కృతేక్షేత్రే తథా షోడశ భాజితే ।
తస్య మధ్యం చతుర్భాగైర్గర్భం సూత్రైశ్చకారయేత్ ॥ 3
ద్వాదశ స్వథశేషేషు బాహ్యేభిత్తీః ప్రకల్పయేత్ ।
ఠ త్రిర్భాగోచ్ఛ్రయం చైవ చతుర్భాగైశ్చ కారయేత్ ॥ 4
భిత్త్యుచ్ఛ్రయో జన్మతశ్చ సపాదః శిఖరోదయః ।
చతుర్గుణైః పృథక్ సూత్రైః పద్మకోశం సమాలిఖేత్ ॥ 5
స్కంధ కోశాంతరం చైవ సప్తభాగైశ్చ భాజయేత్ ।
ఏకభాగా భవేద్గ్రీవాసార్ధం చామలసారకం ॥ 6
పద్మపత్రం తథాసార్ధం త్రిభాగైః కలశోన్నతిః ।
చతుర్ద్వారేషు ప్రాగ్గ్రీవా గర్భతులాశ్చ గర్భతః ॥ 7
హేమరత్నమయైః స్తంభైః శుక్లపట్టః సుచ్ఛాద్యకైః ।
ముక్తాది భిశ్శృఖ చిత్రైర్వితా నైర్దివ్య భూషణైః ॥ 8
స్ఫాటికైర్వి విధైర్జాకైర్ హిరణ్య మణివేదికైః ।
సింహకర్ణైః సుశోభాఢ్యై ర్నిర్యూ హచ్ఛాద్య కర్ణకైః ॥ 9
శిఖరైర్హేమ రత్నాఢ్యై ర్ఘంటా కలశకాన్వితైః ।
గజాశ్వ నరపీఠాద్యైః సర్వ లక్షణ సంయుతైః ॥ 10
లోకనాథేఽత్రద్రష్టవ్యా అదౌ వైరాజ్య సంభవాః ।
వైరాజ్యా వైపంచశతా న్యష్టాశీత్యుత్తరాణిచ ॥ 11

తా॥ మానవులకు అన్ని కోరికలనిచ్చునట్టి వైరాజ్య ప్రాసాద లక్షణ మును చెప్పుచున్నాడు. అనంత పుణ్యము నిచ్చునదియును బ్రహ్మ వలన చెప్పబడినదియును అగునిట్టి ప్రాసాద లక్షణమును ఏకాగ్రచిత్తుడవై వినుము. క్షేత్రమును నలుచదరముగా 16 భాగములు చేసి దానిలో మధ్య

గోడ యెత్తు 1 భాగమును పాదవు 4 భాగములు చేసి గోడ యెత్తు నుండి శిఖరము 1¼ భాగమును, 4 భాగముల సూత్రముల చేత పద్మ కోశమును లిఖించవలెను. స్కంధము 7 భాగములు చేయవలెను. గ్రీవ 1 భాగము. అమలసారకము 1½ భాగము, పద్మ పత్రము 1½ భాగము, కలశము 3 భాగములు చేయవలెను. నాలుగు ద్వారములయందు ప్రాగ్గీవమును గర్భము నుండి గర్భితులను, సువర్ణ రత్నమయములైన స్తంభముల చేతను తెల్లని వస్త్రముతోను ముత్తెపుసరులతోను కూడిన పతాకలతోను, చక్కని అలంకారములతోను స్ఫటికములతో చేయబడిన గవాక్షులతోను, బంగారపు వేదికలతోను, సింహకర్ణములతోను, సిగయందు కర్ణములతోను, సువర్ణములను రత్నములతోను గూడిన శిఖరములు చేతను ఘంట, కలశము, మొదలగు వానిచేతను, గజ పీఠము, అశ్వ పీఠము, నర పీఠము, అను పీఠములచేతను అనేక విధములైన లక్షణములచేతను చూడదగినంత చక్కదనముతో బ్రహ్మకుపయుక్తమైన వైరాఖ్యమను పేరు గల మొదటి జాతి ప్రాసాదములు 588 భేదములు కలవు.

(అనుబంధము 23; 24, 25 పటములు చూడుడు)

## 39. అందురుచకము మొదలగు 24 భేదములు

(సమరాంగణ 49 అధ్యాయము)

శ్లో॥ రుచకశ్చిత్ర కూటశ్చ తృతీయః సింహ పంజరః ।
భద్రః శ్రీకూట ఉష్ణీషః శాలాఖ్యో గజయూథపః ॥ 10
నంద్యావర్తోఽవతంసాహ్వః స్వస్తికః క్షితి భూషణః ।
భూజయో విజయోనందీ శ్రీతరుః ప్రమదా ప్రియః ॥ 11
వ్యామిశ్రో హస్తి జాతీయః కుబేరో వసుధాధరః ।
సర్వభద్రో విమానాఖ్యో ముక్తకోణశ్చ నామతః ॥ 12
చతుర్వింశ తిరుద్దిష్టా చతురశ్రాః సమాసతః ॥

తా॥ రుచకము, చిత్రకూటము, సింహ పంజరము, భద్రము, శ్రీకూటము, ఉష్ణీషము, శాల, గజ యూథపము నంధ్యావర్తము అవతంసము స్వస్తికము, క్షితిభూషణము, భూజయము, విజయము, నంది శ్రీతరువు ప్రమదా ప్రియము వ్యామిశ్రము హస్తి జాతీయము, కుబేరము, వసుధాధరము, సర్వతో భద్రము. విమానము.

సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ జ్యేష్ఠా భాగశ్చ తుర్ణస్త సార్ధ హస్తత్రయోఽపరః ।

కల్పనీయః కనీయఃస్తు హస్తత్రితయ సమ్మితః ॥ 23
జ్యేష్టమధ్య కనీయోధి తేవంభా వై ద్విభాజితః ।
భవంతి సర్వప్రాసాదా జ్యేష్ట మధ్యాధమ క్రమాత్ ॥ 24

ముక్తకోణము, అను 24 భేదములు కలవు. రుచకమును చెప్పబోవు చున్నాడు. ఉత్తమ జాతికి 4 హస్తములును, మధ్యమ జాతికి 3½ హస్తములును, అధమ జాతికి 3 హస్తములును ప్రమాణమని తెలియవలెను.

(సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే చతుర్భాగ విభాజితే ।
కుర్యాత్ స్వారోహకాశ్యాసం పీఠమంశ సముద్ధృతం ॥ 25
తధాతస్యో పరిస్థాప్యా హంసపృష్టి సమంతతః ।
హస్తమాత్రోచ్ఛ్రితా వృత్తా జలనిర్గమ భూషితా ॥ 26
తతః పీఠస్య తస్యాంతర్ద్వి భాగాయామ విస్తృతిః ।
ప్రాసాదో రుచకః కార్యో భాగత్రిత యముచ్ఛ్రితః ॥ 27
సార్ధ భాగేన సంభాస్యా త్సార్ధ భాగస్తుయోఽపరః ।
ఛాద్యత్రయంస కంఠంస్యాత్తేన సామలసారకం ॥ 28
ద్వారం భాగోచ్ఛ్రితంతస్య కార్యం భాగార్ధ విస్తృతం ।
సప్రాగ్రీవః సకర్త వ్యశ్చ తుర్దశ ధరా వృతః ॥ 29
ససాధావింద కశ్చారు రూర్ధ్వచ్ఛాద్యోప కర్షవాన్ ।
క్రియతేఽత్రయదా స్తంభైర్ద్వా వింశత్యా సమావృతః ॥ 30
సప్రాగ్రీవ పరిష్కారో భాగికాలింద శోభితః ।
మధ్యప్రదేశే రుచకః ప్రాసాదః పరికీర్తితః ॥ 31

తా॥ నలుచదరముగా నున్న ప్రదేశమును 4 భాగములుగా చేసి సోపానములతో సహ పీఠము 1 భాగమును దాని పైన హంసపృష్ఠమును 1 హస్త ప్రమాణము యెత్తు చేసి గుండ్రముగాను జల నిర్గమ యుక్తముగా నుంచి తరువాత పీఠము లోపల 2 భాగములు నలుచదరముగా ప్రాసాదమును రచించి దాని యెత్తును 3 భాగములును, 1½ భాగము సంభయును 1½ భాగము ఇతరములును, 4½ భాగములు కంఠముతో గూడ శిఖరమును ద్వారము 1 భాగమును దాని విస్తారము ½ భాగమును, ప్రాగ్రీవమును కల్పించి 14 ధరలును, 22 స్తంభములును, సాధము అలిందమును కలిగి

(అనుబంధము 26, 27 పటములు చూడుడు)

## 40. చిత్ర కూటము

(సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ కర్ణ ప్రాగ్రీవ కైశ్చిత్రైః సప్రాగ్రీవశ్చయో వృతః ।
ద్వాభ్యాం ద్వాభ్యాం గవాక్షాభ్యాం చతుర్దిశ మలంకృతః ॥ 32
కపోతాలీ పరిక్షిప్తః శోభితో ద్వార సంపదా ।
తదానీం చిత్రకూటాఖ్యః ప్రాసాదః సోఽభిధీయతే ॥ 33

తా॥ కర్ణ ప్రాగ్రీవములతోను ప్రాగ్రీవములతోను ఒక్కొక్క దిశ యందు రెండేసి గవాక్షులతోను కపోత సమూహముతోను అలంకారముగా చేసిన యెడల చిత్రకూట ప్రాసాదమగును.

## 41. సింహ పంజరము

(సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ అయమేవ పునః షడ్భిః స్తంభైర పిచితోయదా ।
ప్రాగ్రీవక విహీనశ్చ సభవేజ్జాల రూపకః । 34
సింహ పంజర ఇత్యుక్తః ప్రాసాదః సతదాశుభః ॥

తా॥ పైన చెప్పిన దానినే మరల 6 స్తంభములతోను ప్రాగ్రీవము లేకుండ గవాక్షుల నుంచి నట్లయున సింహ పంజర ప్రాసాదమగును.

(అనుబంధము 28వ పటము చూడుడు)

## 42. భద్రము

(సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ కర్ణ ప్రాగ్రీవ కౌద్వౌ ద్వాదస్యైవ భవతో యదా ॥ 35
అలిందక గతిస్థిత్యా తదా భద్రః ప్రకీర్తితః ॥

తా॥ కర్ణ ప్రాగ్రీవములు 2.2 దానికే చేసి అలిందముల నుంచి దేని భద్ర ప్రాసాదమగును.

## 43. శ్రీ కూటము

(సమరాంగణ 49వ అధ్యాయము)

శ్లో॥ స్యాచ్చిత్ర కూటః ప్రాగ్రీవైశ్చ తుర్భిర్దిక్షు తుష్టయేః ॥ 36

బహిరంతశ్చ తుర్ద్వారః శ్రీకూట ఇతినామతః ॥

తా॥ చిత్రకూటమునే నలు దిశల ప్రాగ్రీవములతోను వెలుపలను లోపలను 4 ద్వారములతోను చేసిన యెడల శ్రీకూట ప్రాసాద మగును.

(అనుబంధము 29వ పటము చూడుడు)

# 44. ఉష్ణీషము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ షడ్దారుక సమాయుక్త ప్రాగ్ద్వార స్స్వయమేవచేత్ ॥ 37
ప్రాసాద స్తంభ గర్భః స్యాత్ తదోష్ణీషోఽభిధీయతే ॥

తా॥ షడ్దారుకముతో గూడి ప్రాగ్ద్వారమున ప్రాస్తాద స్తంభ గర్భ మును రచించిన యెడల ఉష్ణీష ప్రాసాదమగును.

# 45. శాలాఖ్యము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ చతురంశక విస్తీర్ణం షడంశ విహితాయతి ॥ 38
పీఠంశాలా గృహస్యోక్తం సశాలా నిర్గమం శుభం ।
మధ్యాద పరత స్తస్య ద్విభాగాయత విస్తృతం ॥ 39
విధేయం గర్భభవన మలిందక పరిష్కృతం ।
కార్యా తస్యాగ్రతః సీమా భాగద్వితయుమాయుతా ॥ 40
భాగమేకంచ విస్తీర్ణా చతుః స్తంభో పశోభితా ।
తదగ్రతోఽపరాసీమా కార్యా భాగాన్ షడాయుతా ॥ 41
తిర్యక్స్థా భాగ విస్తీర్ణా ప్రవేశ ద్వయశోభితా ।
ఏపశాలా గృహః స్తంభైర్ద్వా వింశత్యా సమావృతః ॥ 42
ప్రాగ్రీవ వేదికాజాల పక్షసోపానకైః శుభైః ।

తా॥ విస్తారము 4 భాగములును నిడివి 6 భాగములును ఇట్లు పీఠ మును చేసి మధ్య నుండి వెనుకకు 2 భాగములు అయత విస్తారమును చేసి గర్భాలయమును అలిందములతో గూడ రచించి దాని ముందు ప్రదే శమును 2 భాగములు అయతము చేసి 1 భాగము విస్తారము చేసి 4 స్తంభ ములతో కన్పించి దాని ముందు ప్రదేశమును 6 భాగములు అయతము చేసి అడ్డముగా 1 భాగము విస్తారమును ప్రవేశములు రెండు చేసి 22 స్తంభ

ములు చుట్టూ కల్పించి ప్రాగ్రీవమును వేదికయును గవాక్షులును ఇరువైపుల మెట్లును రచించిరేని శాలా గృహమగును.

(అనుబంధము 30వ పటము చూడుడు)

# 46. గజ యూధము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ పంచ భాగోన్మిత వ్యాసే క్షేత్రే భాగాష్ట కాయతే ॥ 43
పీఠం కుర్యాదు భయతః ససోపానం శిలాచితం ।
మధ్యాదపర భాగోఽస్య దేవాగారం నివేశయేత్ ॥ 44
ద్విభాగాయత విస్తారం చతురశ్రం సుసంహితం ।
పాదోనభాగ విస్తార మధ్యర్ధం భాగ ముచ్ఛ్రితం ॥ 45
తస్యకార్యం ముఖం మధ్యే పార్శ్వతశ్చ యశోభితం ।
సచయా నిర్గతాసీమా ద్వౌభాగౌత్రిం స్తంధాయతా ॥ 46
చతురశ్రా చతుః స్తంభా తదగ్రే భాగ విస్తృతా ।
పంచభాగాయతా తిర్యక్ కార్యాసీమా తధాపరా ॥ 47
ద్వాత్రింశ దత్ర కర్తవ్యాః స్తంభాః సర్వైక్య సంఖ్యయా ।
బహిః పరిసరోగర్భాత్ ససీమ్నో భాగ విస్తృతః ॥ 48
ఏవంస్యా ద్వేదికాజాల రూపాది భిరలం కృతః ।
బహిశ్చయోచ్ఛ్రిత శ్చైష ప్రాసాదోగజ యూధపః ॥ 49

తా॥ వ్యాసమును 5 భాగములు చేసి ఆయతమును 8 భాగములు చేసి దానికిరువైపుల మెట్లును పీఠమును శిలలతో రచించి మధ్య నుండి వెనుక భాగమును దేవాలయముగాను 2 భాగములు విస్తారమును నలుచదరముగా చేసి ముప్పాతిక భాగము విస్తారమును 1½ భాగము యెత్తునుదానికి మధ్య ద్వారమును ఆ ద్వారమునకిరువైపుల చయములను ఆచయములు 2 భాగములు నిర్గమములును 3 భాగములు ఆయతములును నలుచదరంగా 4 స్తంభములును దాని ముందు 1 భాగము విస్తారమును అడ్డముగా 5 భాగములు ఆయతమును గల ప్రదేశమును కల్పించి 32 స్తంభములతో గర్భమునకు చుట్టూ 1 భాగ విస్తారము కల ప్రదేశమున అమర్చి యిట్లు వేదికయును జాలకములును మొదలగు వానితో నలంకరించిన వెలుపలి చయము యెత్తు గలది గజయూధ ప్రాసాదమగును.

(అనుబంధము 31వ పటము చూడుడు)

# 47. నంద్యావర్తము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ షడ్భాగ భాజితే క్షేత్రే చతురశ్రే సమంతతః ।
గర్భో ద్విభాగికః కార్యోద్వారం భాగ సముచ్ఛ్రితం ॥ 50
భాగార్ధం ద్వార విస్తారః ప్రాసాద స్యోచ్ఛ్రితిం పునః ।
కుర్వీత చతురో భాగాన్ ఛాదయేచ్ఛిత్ర కూటవత్ ॥ 51
కార్యా ద్విభాగికాః శాలాః సాలిందా స్తస్య బాహ్యతః ।
బహిర్భిత్తి పరిక్షిప్తా శ్చతుర్భాగాయతాః శుభాః ॥ 52
ద్వౌ ద్వౌగవాక్ష కౌ స్తంభాః ప్రతిశాలంభ వంతిషటో ।
చతుః స్తంభ ధృతైర్యుక్తాః కార్యా వాధార్మి కాలయైః ॥ 53
నంద్యావర్తోఽయ మేవంస్యా స్సప్రాగ్రీవ చతుష్టయః ।
ప్రాగుక్త లక్షణో పేతః ప్రాసాదః శుభ లక్షణః ॥ 54

తా॥ చతురశ్ర ప్రదేశమును 6 భాగములు చేసి 2 భాగములు గర్భమును ద్వారము 1 భాగము యెత్తును ½ భాగము విస్తారమును, ప్రాసాదము యెత్తు 4 భాగములును చిత్రకూటమువలె కప్పి 2 భాగముల శాలలును, వాని వెలుపల అలిందములును, వెలుపలి గోడ 4 భాగములు పొడవును 2.2 గవాక్షులును, స్తంభములును ప్రతిశాలయును 24 స్తంభములును లేక ధార్మికాలయములును నలువైపుల ప్రాగ్రీవములును కలిగి యుండినచో నంద్యావర్త ప్రాసాదమగును.

(అనుబంధము 32వ పటము చూడుడు)

# 48. అవతంసము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ క్షేత్రే షడ్భాగ విస్తారే దశభాగ కృతాయతే ।
మధ్యాదపర భాగేఽస్య దేవకోష్ఠం నివేశయేత్ ॥ 55
చతురంశ ప్రతిన్యాసం చతురశ్రం సమంతతః ।
ద్వారంతస్య విధాతవ్యం భాగమధ్యర్ధ ముచ్ఛ్రితం ॥ 56
పాదోనంభాగ విస్తారం సింహవక్త్ర విభూషితం ।
సీమాతస్యా గ్రతః కార్యా దేవకోష్ఠేన సమ్మితా ॥ 57
స్తంభైః షోడశ భిర్యుక్తా భాగద్వితయ ముచ్ఛ్రితైః ।

ససీమ్నో దేవకోష్ఠస్య సమంతాద్భిత్తి వేష్ఠితః ॥ 58
అలిందో భాగికః కార్యో గవాక్షైరుప శోభితః ।
తత్సీమ్నో శ్చాగ్రతః పార్శ్వే షడ్దారుకయుతా బహిః ॥ 59
కార్యా ద్విరంశాః ప్రాగ్రీవా భాగికాలింద వేష్టితాః ।
ద్వి ద్విస్తంభ ధృతాః సర్వే పార్శ్వే తశ్చయ శోభితాః ॥ 60
అలిందాస్తు చతుః స్తంభాః కార్యాః ప్రాగ్రీవకాగ్రతః ।
అవతంసక ఇత్యేష సర్వ లక్షణ సంయుతః ॥ 61

తా॥ క్షేత్రమును విస్తారమును 6 భాగములును అయవమును 10 భాగములును చేసి మధ్య నుండి వెనుక భాగమున దేవకోష్ఠమును 4 భాగములు చౌకముగా చేసి ద్వారము 1¼ భాగము యెత్తును $\frac{3}{4}$ భాగము విస్తారమును సింహ ముఖములతో నలంకారముగాను దాని ముందు సీమతో సహితముగాను 16 స్తంభములతోను 2 భాగముల యెత్తుతోను చేసి ఆ సీమ యందును దేవకోష్ఠము చుట్టును, అంతటను చుట్టును గోడ నిర్మించి అలిందమును 1 భాగము చేసి దానికి గవాక్షలను చేసి ఆ సీమ యొక్క ముందును ప్రక్కలను వెలుపలను షడ్దారుకయుతముగ 2 భాగములు ప్రాగ్గ్రీవములును, 1 భాగము అలిందము చుట్టును అన్నియును 2.2 స్తంభములతోను, ప్రక్కల చయములతోను, అలిందములు 4 స్తంభములతో ప్రాగ్గీవముల ముందుండవలెను. ఇది అవతంసప్రాసాదము.

(అనుబంధము 33, 34 పటములు చూడుడు)

# 49. స్వస్తికము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదః కథితః సమ్యన్ స్వస్తికః ప్రోచ్యతేఽధునా ।
చతురశ్రీ కృతేక్షేత్రే షడ్భాగ ప్రవిభాజితే ॥ 62
ప్రాసాదం కల్పయేన్మధ్యే ద్విభాగాయత విస్తృతం ।
ద్వారపాశోఽస్యభాగార్ధ విస్తృతో భాగికోదయః ॥ 63
గర్భవేశ్మ చతుః స్తంభ మలిందో భాగికో బహిః ।
తస్యస్యర్ధ్వా దశ స్తంభా భాగికోఽలిందకోఽపరః ॥ 64
వింశతి స్తంభ సంయుక్తో విధాతవ్యః సమంతతః ।

చయావృతశ్చ పురతో భాగో వాష్ట ధరాన్వితః ॥ 65
భాగమేకైక ముత్సృజ్య కర్ణాభ్యాం భాగవిస్తృతౌ ।
భాగికోచ్ఛ్రయనిష్క్రాసౌ కార్యౌ ప్రాగ్రీవ కౌపునః ॥ 66
బాహ్యతోభిత్తి సంశ్లిష్టౌ త్రిదిశంసగవాక్షకౌ ।
స్వస్తికోఽయం సమాఖ్యాతః ప్రాసాదశ్చిత్ర లక్షణః ॥ 67

తా॥ నలుచదరము సమానముగా చేయబడిన ప్రదేశమును 6 భాగములు చేసి దాని మధ్య 2 భాగములు విస్తారమును 2 భాగములు ఆయతమును అందు ద్వారము యెత్తు 1 భాగమును వెడల్పు ½ భాగమును గర్భాలయము 4 స్తంభములు అలిందము 1 భాగమును వెలుపల 12 స్తంభములును మరల 1 భాగము అలిందము వెలుపలను 20 స్తంభములును చయమునకు చుట్టు చేయవలెను. ముందు 1 భాగము 3 ధరలను ఒక్కొక్క భాగమును వదలి కర్ణములు 1 భాగము విస్తారమును 1 భాగము యెత్తును 1 భాగము నిర్గమమును కలిగి ప్రాగ్గీవమున కిరువైపుల నుండవలెను. వెలుపల గోడ దాని నానుకొని చుట్టు యుండవలెను. 3 వైపుల గవాక్షులుండవలెను. ఇట్లు రచించబడినది స్వస్తిక ప్రాసాదమగును.

(అనుబంధము 35వ పటము చూడుడు)

# 50. క్షితిభూషణము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ అథాభి ధీయతేఽధునా ప్రాసాదః క్షితి భూషణః ।
షడ్భాగ భాజితే క్షేత్రే చతురశ్రే సమంతతః ॥ 68
ద్విభాగాయామ విస్తారం మధ్యే గర్భ గృహం భవేత్ ।
భాగద్వ యోచ్ఛ్రితైః స్తంభైర్యుతం వ్యక్తైఃస లక్షణైః ॥ 69
నిష్క్రాంతేషు బహిర్భాగే గర్భపాదేషు యోజయేత్ ।
తోరణాని మనోజ్ఞాని కకుప్సు చతసృష్వపి ॥ 70
గర్భ స్తంభ ప్రమాణేన తాని స్తంభద్వయేనవా ।
సముత్క్షిప్తాని యుక్తాని కలశై రవి మండపైః ॥ 71
పల్లవైః పత్ర జాత్యాది విన్యాసైశ్చాప్య నేకశః ।
భూషితాస్యే పునర్మూర్ధ్ని మకరాణాం ముఖైరపి ॥ 72
స్తంభ యోరంతరే దద్యాదు భౌమకర పూరిమౌ ।

అన్యోన్యాభిముఖే శ్లిష్టే కుర్యాన్మకర యోర్ముఖే ॥ 73
చతుర్ణామ పినిర్దిష్ట స్తోరణానాం మయావిధిః ।
అలిందో భాగికశ్చాన్యో బహిర్భాగే ప్రకీర్తితః ॥ 74
స్యుర్భాగికాన్య లిందాంతే ధార్మికాయత నానిచ ।
వేష్టితాని బహిర్భిత్త్యా సమ్ముఖాని పరస్పరం ॥ 75
ధార్మికాలయ భిత్తీనాం భూమిర్యా బాహ్యతో భవేత్ ।
తస్యాః షడ్దారుకాణి స్యుర్భాగమాత్రోచ్ఛ్రితా నిచ ॥ 76
ప్రాగ్రీవకైః ససోపానైర్ది క్షుక్షైస్తాని భూషయేత్ ।
అపరస్యాః పునర్భిత్తే ర్భాగద్వయ వినిస్మృతం ॥ 77
మధ్యే ద్విభాగ వి స్తీర్ణం దేవకోష్ఠం నివేశయేత్ ।
ద్వారపాశంచ కుర్వీత తస్యోర్ధ్వం భాగ ముచ్ఛ్రితం ॥ 78
తథా భాగార్ధ విస్తార మిత్యేష క్షితిభూషణః ।
ప్రాసాదః కీర్తితః సమ్యక్ సర్వ లక్షణ లక్షితః ॥ 79

తా॥ నలుచదరముగా గల ప్రదేశమును 6 భాగములుగా చేసి 2 భాగములు ఆయతమును 2 భాగములు విస్తారమును గల మధ్య గృహమును చేయవలెను. స్తంభములు 2 భాగముల యెత్తు నుండవలెను. నిర్గమము యొక్క వెలుపలి భాగమున గర్భ స్తంభముల యందు చక్కని దోరణములను కూర్చవలెను. ఇట్లు నలువైపుల చేయవలెను. అవి గర్భ స్తంభమును బట్టి రెండు స్తంభములతోగాని అన్నిటికి కలిపి గాని పైన రచించవలెను. పైన కలశముల చేతను పల్లకముల చేతను పత్రజాతి మొదలయిన అలంకారముల చేతను అనేక విధములుగా శిఖరమును అలంకారముగా చేయవలెను. మఱియు శిరస్సున మకరముల యొక్క ముఖముల చేతను స్తంభముల మధ్య రెండు మకరముల యొక్క శిరస్సుల చేత అనగా ఒకదానికొకటి యెదురుగా నున్నట్లు రెండు తలలనానించి మకర తోరణమును చేయవచ్చును. నలువైపుల నిట్లు తోరణములను రచించవలెను. అలిందము 1 భాగము వెలుపల నుండవలెను. అలిందము చివర 1 భాగము ధార్మికాలయములు వెలుపలి గోడను చుట్టూ ఒకదానికొకటి యెదురుగా నుండవలెను. ధార్మికాలయముల గోడకు భూమి వెలుపల నుండవలెను. దానికి షడ్దారుకములు 1 భాగము యెత్తున నుండవలెను. ప్రాగ్రీవములు సోపానములతో గూడ అన్ని దిశల యందు అలంకారముగా

నుండవలెను. తదుపరి రెండవ గోడ 2 భాగములు నిర్గమము కలిగియుండవలెను. మధ్య 2 భాగములు విస్తారమున దేవతాలయమును చేయవలయును. దానిపైన 1 భాగము యెత్తున ద్వారపాశమును చేయవలెను.
ఇది క్షితి భూషణ ప్రాసాదము.

(అనుబంధము 36వ పటము చూడుడు)

# 51. భూజయము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ క్షేత్రస్య చతురశ్రస్య భాగాన్ ద్వాదశ కల్పయేత్ ।
మధ్యే గర్భం చతుః స్తంభం తస్య కుర్యాత్ ద్విభాగికం ॥ 80
తద్బహిర్భాగికోఽలిందో ద్వాదశ స్తంభవాన్ భవేత్ ।
మధ్యేఽపరస్యాం యౌ స్తంభౌ తాభ్యాం కుర్వీత తోరణం ॥ 81
అలిందో భాగికః కార్యోభిత్త్యా భాగికయా వృతః ।
ప్రాచ్యాంషడ్దారుకం మధ్యే గర్భ వ్యాసోన్మితాయతి ॥ 82
తృతీయో భాగికోఽలిందః స్యాద్భిత్త్యా పరివేష్టితః ।
చతుర్భాగాయతం భూయ స్తత్ర షడ్దారుకం భవేత్ ॥ 83
ప్రాగ్రీవం భాగ విష్కంభం కుర్యాద్భాగ ద్వయాయతం ।
అగ్రతః శోభితం స్తంభైర్భాగాంతస్థ చయావృతం ॥ 84
యథాప్రాచ్యాం తథోదీచ్యాం యామ్యాయపి కీర్తితం ।
దిశిప్రతీచ్యాంతు పునర్ద్వితీయాలింద కార్బహిః ॥ 85
ద్విభాగాయామ విష్కంభం దేవకోష్ఠం నివేశయేత్ ।
సపక్షద్వారకం శ్రీమద్ ద్వార పాశోపశోభితం ॥ 86
భాగికోఽలిందక స్తస్మాద్ బహిర్భిత్త్యాభి వేష్టితః ।
బహిశ్చయావృతో వాస్యాద్ గవాక్షైర్వా విభూషితః ॥ 87
పృథ్వీ విజయతేయస్మాత్ తేనాసౌ పృథివీజయః ॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 12 భాగములు చేసి మధ్య గర్భము 2 భాగములు 4 స్తంభములతోను దాని వెలుపల 1 భాగము అలిందము 12 స్తంభములతోను మధ్య పడమర నున్న రెండు స్తంభములకు తోరణను అలిందము 1 భాగమును గోడ 1 భాగమును చుట్టూ చేయవలెను. తూర్పున షడ్దారుకము నడుమ గర్భవ్యాసముతో సమానముగా నుండవలెను

మూడవ అలిందము 1 భాగమును దాని చుట్టు గోడయును 4 భాగముల పొడవును దానికి షడ్దారుకమును చేయవలయును. ప్రాగ్రీవము విస్తారము 1 భాగమును, ఆయతము 2 భాగములును కలిగి ముందు స్తంభములు నిలుపబడి చయములచే నావరింపబడినదియును. తూర్పున యెటులో అటులే ఉత్తరము దక్షిణము పడమర దిశలయందును, మరల ద్వితీయాలిందమునకు వెలుపల 2 భాగముల ఆయామ విష్కంభములతో దేవకోష్ఠమును నివేశము చేయవలెను. దానికి పక్ష ద్వారమును తోరణమును అలంకారముగా చేయవలెను. దాని నుండి అలిందమును 1 భాగము చేయవలయును. దానికి వెలుపల చుట్టూ గోడ యుండవలెను. లేదా చయముతోనైనా ఆవరింపబడి యుండవలెను. గవాక్షులతో నైన నుండవలెను. దీనిని పృథివీ జయ ప్రాసాదమందురు.

(అనుబంధము 37వ పటము చూడుడు)

## 52. విజయము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ యథా పృథ్వీజయ స్యైవ కర్ణ ప్రాగ్రీవకావుభౌ ॥ 88
కోణేషు భాగి కౌస్యాతాం విజ్ఞేయో విజయ స్తదా ॥

తా॥ పై జెప్పిన భూజయమునకు కర్ణ ప్రాగ్రీవములు రెండును కోణముల యందొక భాగము చొప్పున చేసిన యెడల విజయ ప్రాసాదమగును.

## 53. నందము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ అయం సమంతాదుత్క్షిప్తో బాహ్యాలిందం వినాయదా ॥ 89
మధ్యమాలింద సౌధస్థ కర్ణప్రాసాద కైశ్చితః ।
ప్రథమాలింద గర్భోచ సముత్క్షిప్తతరౌ తతః ॥ 90
స్యాతాం ఛాద్యద్వయచ్ఛన్నౌ తదానందోఽభిధీయతే ॥

తా॥ వెలుపల అలిందము లేకుండా మధ్యమ అలింద సౌధమున నున్న కర్ణ ప్రాసాదముల చేత కూర్చబడి మొదటి అలిందము గర్భము పైన రెండు కప్పులతో కప్పబడియుండెనేని నంద ప్రాసాదమగును.

## 54. శ్రీతరువు

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే దశభాగ విభాజితే ॥ 91
చతురశ్రో భవేన్మధ్యే దేవకోష్ఠో ద్విభాగికః ।
ద్వారబంధోఽస్య భాగోచ్చః కార్యో భాగార్ధ విస్తృతః ॥ 92
స్యాద్బహిర్వా దశధరోఽలిందకో దేవకోష్ఠతః ।
భాగికః సచవిజ్ఞేయోభిత్తి యుక్తస్తతోఽపరః ॥ 93
అయం ద్విభాగికైర్యుక్తః ప్రాగ్రీవైర్భాగ నిర్గమైః ।
తథా తృతీయోఽలిందః స్యాత్ సమంతాద్భిత్తి వేష్టితః ॥ 94
ప్రాగ్రీవకైశ్చతుః స్తంభైః సప్రవేశైర్విభూషితః ।
భాగికీ స్యాద్బహిర్భిత్తిరితరా తుధరైః సమా ॥ 95
ఇత్యేష శ్రీ తరుర్నామ ప్రాసాదః పరికీర్తితః ।

తా॥ నలుచదరముగా చేసిన భూమిని 10 భాగములు చేసిదాని మధ్య 2 భాగములు దేవకోష్ఠమును ద్వార బంధము యెత్తు 1 భాగమును విస్తారము ½ భాగమును దానికి వెలుపల 12 ధరలును దేవకోష్ఠము నుండి అలిందమును 1 భాగమును తరువాత గోడయును. ప్రాగ్రీవము 2 భాగములును నిర్గమము 1 భాగమును అటులే మూడవ అలిందము కూడా అంతటను గోడచే చుట్టబడి యుండవలెను. ప్రాగ్రీవములు 4 స్తంభములతోను, ప్రవేశములతోను అలంకారముగా నుండవలెను. వెలుపలి గోడ 1 భాగమును ఇతరములు ధరలతో సమానములును చేయవలెను. ఇది శ్రీతరు ప్రాసాదము

(అనుబంధము 38వ పటము చూడుడు)

## 55. ప్రమదా ప్రియము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ అస్యైవ స్తంభ గర్భస్య ద్వితీయాలింద భిత్తిషు । 96
షడ్దారూణి విధేయాని పూర్వరూప వ్యవస్థితేః ।
ద్వౌద్వౌ ప్రాగ్రీవకౌ కార్యౌ తృతీయాలింద కార్బహిః ॥ 97
తౌ చద్విభాగాంతరితౌ సర్వతో భాగ నిర్గతౌ ।
ఏవం పంచాశతా స్తంభైర్వా భ్యాంచ పరివేష్టితః ॥ 98

చతుః స్తంభైః సప్రవేశైః సమంతాదుప నిర్గమైః ।
ప్రాసాదోఽయం సమాఖ్యాతో నామతః ప్రమదాప్రియః ॥ 99

తా॥ పై చెప్పిన దానినే స్తంభ గర్భము యొక్క రెండవ అలిందము గోడ యందు షడ్దారువులను చేసి మునుపటివలె 2.2 ప్రాగ్రీవములును మూడవ అలిందము వెలుపల 2 భాగములు అంతటను నిర్గమమును ఇట్లు 52 స్తంభములతో చుట్టబడియుండి 4 స్తంభములతో ప్రవేశము కలిగి అంతటను ఉప నిర్గమములుండెనేని ప్రమదా ప్రియ ప్రాసాదమగును.

(అనుబంధము 39వ పటము చూడుడు)

# 56. వ్యామిశ్రము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ భాగ విస్తార విష్కంభమస్య ప్రాగ్రీవకం యధా ।
భిన్నాలిందా గ్రత స్తిర్యగ్ ద్వేశావే తన్ముఖం శుభం ॥ 100
ద్వితీయాలిందక స్థానేకర్ణ ప్రాసాద కైర్యుతః ।
ఏవంవ్యామిశ్ర సంజ్ఞోఽయం ప్రాసాదః పరికీర్తితః ॥ 101

తా॥ పై చెప్పిన దానినే ప్రాగ్రీవముతోను అలిందములను తీసివేసి ముందఱ అడ్డముగా 2 శాలలును రెండవ అలింద ప్రదేశమున కర్ణ ప్రాసాదములును చేసిరేని వ్యామిశ్ర ప్రాసాదమగును.

(అనుబంధము 40వ పటము చూడుడు)

# 57. హస్తి జాతీయము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ విజయస్యా స్యచయదా కర్ణలాంగల కైర్యుతా ।
భవేచ్ఛిత్తి స్తదాహస్తి జాతీయ ఇతికధ్యతే ॥ 102

తా॥ విజయమునకు కర్ణలాంగలములు చేసి గోడ రచించిరేని హస్తి జాతియ ప్రాసాదమగును

# 58. కుబేరము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ సీమా ప్రాగ్రీవ భూమిషు యదాస్యుః పృథి వీజయే ।
ద్విభాగా శ్చాభితోఽలిందా స్తిర్యక్ శాలా ముఖేషుచ ॥ 103

అలిందే పశ్చిమాశాలా సర్వాశాలో కనాశుభా ।
షడ్దారుకం తథైవాత్ర చతుర్భాగాయతం భవేత్ ॥ 104
పూర్వవత్సర్వ మన్యచ్చ కుబేరః స తదా భవేత్ ॥

తా॥ భూజయమున సీమలయందును ప్రాగ్రీవ భూముల యందును 2 భాగములు చుట్టూ అలిందములును ముఖములయందు అడ్డముగా శాలలును అలిందమున పడమర శాలయును షడ్దారుకము 4 భాగముల అయతమును కలిగియుండెనేని కుబేర ప్రాసాదమగును.

(అనుబంధము 41వ పటము చూడుడు)

## 59. వసుధాధరము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదః కథ్యతేఽన్యశ్చ సంప్రతీహ ధరాధరః ॥ 105
కుబేరో ప్రస్తరోత్థితః కర్ణ ప్రాసాద భూషితః
మధ్య ద్వారాన్వితః శ్రీమాన్ ధరాధర ఇతిస్మృతః ॥ 106

తా॥ కుబేర ప్రాసాదముపైన కర్ణ ప్రాసాదములును మధ్య ద్వారమును కలిగినచో వసుధాధర ప్రాసాదమగును.

## 60. సర్వతో భద్రము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ యత్రాగ్రతశ్చిత్రకూట స్తస్మాద్యః సర్వతోదిశం ।
ధరాధర సమో భద్రాః సర్వతోభద్ర ఉచ్యతే ॥ 107

తా॥ చిత్రకూటమునకు ముందును అటులే నలుదిశలను భద్రములను చేసిరేని సర్వతోభద్ర ప్రాసాదమగును. నవతలమున నున్నరూప చిత్రమును చూడవచ్చును.

## 61. విమానాఖ్యము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ కర్ణప్రాగ్గ్రీవ కౌద్వౌద్వౌ శాలా ప్రాగ్గ్రీవకావపి ।
స్యాతాం యదాస్య ప్రోక్తోఽసౌ విమానాఖ్య స్తదా శుభః ॥ 108

తా॥ కర్ణ ప్రాగ్రీవములు 2 ను, శాలాప్రాగ్రీవములు 2ను కల్పించిన యెడల విమాన ప్రాసాదమగును.

## 62. ముక్త కోణము

సమరాంగణ 49వ అధ్యాయము

శ్లో॥ విమాన పీఠే నిర్ముక్తః శాలాభిః సర్వతో వృతః।
అన్యోన్య శాలా సంబంధే విమానోన్యస్యతే యదా॥ 109
కర్ణ ప్రాసాద కోపేతః కోణైః శాలోఙ్ఝి తైర్యుతః।
తదా విముక్తకోణః స్యాత్ ప్రాసాదోఽత్యర్థ శోభితః॥ 110

తా॥ విమాన పీఠమున విడువబడిన శాలలతో అంతటను చుట్టుకొనబడి ఒకదానికి మఱియొకటి సంబంధముండునట్లును కర్ణ ప్రాసాదములతోను శోభిల్లునది ముక్తకోణ ప్రాసాదమగును.

## 63. అపరాజిత పృచ్ఛలోని వైరాజ్యాది నాగర ప్రాసాదములు 25ను ద్వారనిర్ణయమును

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ వైరాజ్య మథవక్ష్యామి ప్రాసాదం సర్వకామదం।
విశ్రామ్యంతీచ విష్ణుంచ బ్రహ్మయత్ర రవి స్తథా॥ 1
ఏకద్వారం చతుర్ద్వారం త్రిద్వారంచ తథైవచ।
ద్వారద్వయంచ కర్తవ్యం దూషణం నకదాచన॥ 2
పూర్వోత్తరయామ్యే చైవ పూర్వాపరోత్తరే తథా।
యామ్యాపరోత్తరే శస్తం త్రిద్వారంత్రి విధంమతం॥ 3
పూర్వాపరేస్యాద్ ద్విద్వారం దూషయేచ్ఛయామ్యోత్తరే।
ఏకద్వారంచ మాహేంద్ర్యాం చతుర్ద్వారం చతుర్దిశం॥ 4
పూర్వేచ భక్తిదం ద్వారం ముక్తిదం వరుణోద్గమం।
యామ్యోత్తరే శివేద్వారె కృతేదోషో మహద్భయం॥ 5
ఏకద్వారంచ మహేంద్ర్యా మన్యదా దోషదం భవేత్।
భద్రం సర్వత్ర కల్యాణం చతుర్ద్వారే శివాలయే॥ 6
బ్రహ్మ విష్ణుర వీణాంచ కుర్యాత్ పూర్వోక్తమేవహి।
సమోసదనే జైనేంద్రే దిశాదోషోన విద్యతే॥ 7

తా॥ వైరాజ్య ప్రాసాదమునకు 1-2 3-4 ద్వారములు పెట్టవచ్చును. తూర్పు ఉత్తరము దక్షిణము ఈ మూడు దిశలను, తూర్పు పడమర ఉత్తరము ఈ మూడు దిశలను. దక్షిణము, పడమర, ఉత్తరము ఈ మూడు దిశలను ద్వారములను పెట్టవచ్చును మూడు ద్వారములు పెట్టునప్పుడు ఇంతకంటే మించి చేయగూడదు, రెండు ద్వారములు పెట్టునప్పుడు తూర్పున పడమరను పెట్టవలయునేకాని దక్షిణమునను ఉత్తరమునను ద్వారములను పెట్టరాదు ఒక్కటే ద్వారమును పెట్టునపుడు తూర్పుననే పెట్టవలయును. నాలుగు ద్వారములు పెట్టునప్పుడు మాత్రమే నలుదిశల నుండవచ్చును. తూర్పు ద్వారము ఐశ్వర్యమునిచ్చును. పడమర ద్వారము మోక్షమునిచ్చును. దక్షిణమునగాని ఉత్తరమునగాని శివద్వారమున్నయెడల దోషము అది మహా భయమును కలిగించును. ఒక్కటే ద్వారమైనచో తూర్పుననే చేయవలెను ఇతర దిక్కుల యందు పైన చెప్పినట్లు దోషములు కలుగును. నలువైపుల ద్వారముకల శివాలయము సమస్త శుభముల నిచ్చును. బ్రహ్మ, విష్ణు, సూర్య, ప్రభృతి దేవతులకు గూడ 4 ద్వారములు పెట్టవచ్చును. మరియు ప్రధానాలయము ననుసరించినయుప దేవాలయములకును జైనబౌద్ధాది యితరాలయములకును ద్వార దోషమును పాటింప నక్కరలేదు.

అపరాజిత 10౭వ సూత్రము

శ్లో॥ అదౌతునాగరాన్ వక్ష్యే ప్రాసాదాన్ సర్వకామదాన్ ।
అనేకాండక సంయుక్తాన్ క్రమయుక్తి విధింస్తథా ॥ 18
ఉత్సేధే నాగరాః శృంగైరనేకా కారరూపిణః ।
శృంగోరః శృంగ ప్రత్యంగ తవంగాదిక భూషితాః ॥ 19
ఏకద్విత్రి క్రమోన్నద్యా రేఖాగర్భ సముద్భావాః ।
దోషావహాశ్చ సంకీర్ణా విపులా ధాన్య సౌఖ్యదాః ॥ 20
త్రిమూర్తియస్తు భద్రాంతే రధికాః సర్వకామదాః ।
శుకనాసేచ సంఘాటా భద్రే త్వేకైక సంయుతాః ॥ 21
అమలసారాంతస్థిత కలశైః సువిభూషితాః ।
పతాకా ధ్వజయుక్తాశ్చ నాగరాః సర్వకామదాః ॥ 22
పీఠోపపీఠ జంఘాభిర్మేఖలా కూటచ్ఛాద్యకైః ।
దలభక్త్యాచ యుక్తాశ్చ కర్తవ్యాః సర్వకామదాః ॥ 23

మండపై రుపశోభాఢ్యై ర్వితానైర్బహుభిర్యుతాః ।
భాద్యఘంటా కూటయుక్తా నానా సంవరణా స్తథా ॥ 24
నాగరచ్ఛందజా ఏవం ప్రాసాదాః సర్వకామదాః ।
వల్లభాః సర్వదేవానాం శివస్యాపి విశేషతః ॥ 25

తా॥ నాగర ప్రాసాదము యొక్క లక్షణమును చెప్పుచున్నాను. అనేకమైన అండకములతోను ఉన్నతము యొక్క భేదములతోను, ఆకార భేదములతోను, శృంగము; ఉరః శృంగము ప్రత్యంగము, తవంగము మొదలయిన అలంకారములను 1-2-3 ఎత్తుతో రేఖల నుండి కలిగినవి యును. సంకీర్ణముల దోషములు కలిగించదు. భద్రముల పైన త్రిమూర్తులును, రథికలును, శుకనాసయందు సంమాదిములును, భద్రమున ఒక్కొక్కటియును ఆ మలసారమునలో పలక లోహములును పతాకలును ధ్వజములును, కలవి నాగరములు పీఠము ఉప పీఠము, జంఘ, మేఖల. కూటము భాద్యము దలవిభక్తి మండపము విధానములు, భాద్యము ఘంట కూటములుకల అనేక సంవణలును కలవి నాగరచ్ఛంద భములు సమస్త దేవతలకును శివుని ముఖ్యముగాను రచించవలె.

(అపరాచిత 157వ సూత్రము)

శ్లో॥ చతురశ్రం సమంశుద్ధం షోడశాం శోప కల్పితం ।
వేదాంశో గర్భ అఖ్యాతో భిత్తిః సూర్యపదోద్భవా ॥ 8
భ్రమ నిర్మాణతః స్తంభైః సీమా ప్రాగ్గ్రీవకాగ్రతః ।
చతుర్భాగోన్నతాభిత్తిః సపాదా శిఖరోన్నతిః ॥ 9
చతుర్గుణైః పృథక్ సూత్రైః పద్మకోశం సమాలిఖేత్ ।
స్కంధకోశాం తరంచైవ సప్తభాగైశ్చ కారయేత్ ॥ 10
గ్రీవాభాగా సముత్సేధే సార్ధమా మలసారకం ।
పద్మచ్ఛత్రం తథాసార్ధం ద్విభాగః కలశోఽంతరే ॥ 11
శుకనాసాన్ సింహకర్ణాన్ చతుర్దిక్షు ప్రకల్పయేత్ ।
జగతీవై పంచగుణా కామదా చతురాననా ॥ 12
ఇమం వైరాజ్య కందేవ ప్రాసాదం కారయేత్తుయః ।
ఏకవింశతి స్వర్గాణాం లభతే రాజ్య మీప్సితం ॥ 13

తా॥ నలుచదరము సమముగా చేసి దానిని 16 భాగములు చేసి అందు 4 భాగములు మధ్య దేవాలయ గర్భమును వదలి మిగిలిన 12 భాగ

ములు చుట్టూ గోడను కల్పించవలెను. చుట్టూ నిలిపిన స్తంభములతో సీమలు ప్రాగ్రీవములు ముందును గోడ 4 భాగముల యెత్తును శిఖరము యెత్తు $1\frac{1}{4}$ భాగమును, నాలుగు భాగములు గల సూత్రముతో పద్మకోశ మును రచించవలెను. స్కంధము నుండి దిగువ 7 భాగములు చేసి గలము 1 భాగమును, ఆ మలసారకము $1\frac{1}{2}$ భాగమును, పద్మము $1\frac{1}{2}$ భాగమును, కుంభము 3 భాగములును చేయవలయును. శుకనాసలును, సింహ కర్ణ ములును నలు దిశల యందు రచించవలెను. జగతి 5 భాగములుగా నుండవలెను. నలువైపుల ద్వారములును కలిగినది వైరాజ్య నాగర ప్రాసాద మగును.

## 64. నందనము (త్ర్యంగములు)

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ వైరాజ్య స్యచసంస్థానే నందనం కారయేచ్ఛుభం।
కర్ణం తథా చైకభాగ ముదకాంతర భూషితం ॥ 14
ద్విభాగంచ భవేద్భద్ర మర్ధభాగేన నిర్గతం ।
భాగార్ధం పార్శ్వ సూత్రంతు నిర్గమ స్తత్సమో భవేత్ ॥ 15
అర్ధభాగస్తు విస్తార ఏవం భద్రం విధీయతే కర్ణేష్వేకైక ।
శృంగంచ భద్రేద్వే ఉరు మంజరీ॥ 16
శిఖరం త్ర్యంశ విస్తారం పాదోనంవేద ముచ్ఛ్రితం ।
పద్మ కోశోద్భవ సూత్రే పంచాంశః కలశోఽంతికే ॥ 17
రథి కాతుయదాభద్రే నందనః సర్వకామదః ।
ఇహనందతి తత్కర్తా స్వర్గేవా త్రిదశైః సహ ॥ 18

తా॥ వైరాజ్యమునే కర్ణము 1 భాగమును భద్రము 2 భాగములును భద్ర నిర్గమము $1\frac{1}{2}$ భాగమును, పార్శ్వ సూత్రము నిర్గమముతో సమాన మును $1\frac{1}{2}$భాగము విస్తారమును ఇట్లు భద్రమును రచించవలెను. కర్ణమున ఒక్కొక్క శిఖరమును భద్రమున రెండు శిఖరములును శిఖరముల యొక్క విస్తారము 3 భాగములును, ఎత్తు $3\frac{3}{4}$ భాగములును, పద్మకోశము పుట్టిన సూత్రమున పై భాగము నుండి కలశము యొక్క చివరకు 5 భాగ ములును భద్రముననను రథికయుండవలెను. దీనిని నందన ప్రాసాద మందురు.

(అనుబంధము 42వ పటము చూడుడు)

## 65. సింహము

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ ముఖభద్రే ప్రతిభద్ర ముద్గమోరథికోపరి ।
కర్ణశృంగే సింహకర్ణం సింహనామాస ఉచ్యతే ॥ 19
దేవానాంతు ప్రకర్తవ్యః సింహస్త త్రైవ శాశ్వతః ।
తుష్యేద్గిరి సుతాతస్య సౌభాగ్య ధన పుత్రదా ॥ 20

తా॥ ముఖ భద్రమున ప్రతి భద్రమును రథికము పైనను కర్ణశృంగములును సింహ కర్ణములును కలది సింహ ప్రాసాదమగును. దానియందు సింహము శాశ్వతముగా నుండుటచే పార్వతి సంతోషించి సౌభాగ్యమును ధనమును సంతానమును సర్వదా యిచ్చుచుండును.

## 66. శ్రీనందనము

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ కర్ణే శృంగేతు దాతవ్యం పంచాండక విభూషితం ।
తథా శ్రీనందనోనామ కర్తుః సంతాన వర్ధకః ॥ 21

తా॥ కర్ణముల యందును శిఖరమునను 5 అండకములతో ప్రకాశించునది శ్రీ నందన ప్రాసాదము

## 67. మందరము (పంచాంగములు)

(అపరాజిత 15 వ సూత్రము)

శ్లో॥ షడ్భాగాయతే భాగం కర్ణం ప్రతి రథం తథా ।
ద్విభాగంచ భవేద్భద్రం నిర్గమశ్చార్ధ భాగతః ॥ 22
ప్రతిరథం భాగ నిష్కాసం గర్భో వేదాంశవైః పృథుః ।
ద్వేద్వేకర్ణే తథాభద్రే శృంగం ప్రతిరథేఽథవా ॥ 23
ఏవం విధః ప్రకర్తవ్యో మందరస్తు శివాత్మజః ।
మేరు పుణ్యార్థకార్థంతు లభ్యతే మందరే కృతే ॥ 24

తా॥ పాదవు 6 భాగములు చేసి అందు కర్ణము 1 భాగము ప్రతి రథము 1 భాగము భద్రము 2 భాగములు భద్ర నిర్గము అర్ధ భాగము ప్రతి రథముల యొక్క విస్తారము భాగము గర్భము 4 భాగములు కర్ణమున 2 శృంగములును భద్రమున 2 శృంగములును ఇట్లు చేయబడినది మందర ప్రాసాదము

(అనుబంధము 43-1, 43-2, 43-3వ పటములు చూడుడు)

## 68. మలయము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ భద్రేశృంగ త్రయం కుర్యాన్మలయో నామ నామతః ॥ 24½

తా॥ పై చెప్పిన దానినే భద్రమున మూడు శిఖరములుంచిరేని మలయ ప్రాసాదమగును.

## 69. విమానము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ త్యక్త్వైవ భద్రశాలంతు ప్రత్యంగాని ప్రదాపయేత్ ॥ 25
ప్రతిరథోర్ధ్వ తిలకో విమానః సర్వకామదః ॥

తా॥ భద్రశాల లేకుంత పంజరములు మొదలగు యితర రూపములు చేసినచో విమాన ప్రాసాదమగును.

## 70. సువిశాలకము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ భద్రే తృతీయోరు శృంగం సభవేత్ సువిశాలకః ॥ 26

తా॥ భద్రము నందు శిఖరములను పెద్దవిగా మూటిని రచించినచో సువిశాల ప్రాసాదమగును.

## 71. త్రైలోక్య భూషణము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ త్యక్త్వైవ భద్ర శృంగంతు విక్రమః స్యాత్ ప్రతిరథే ।
కర్ణే చాష్టదలం కుర్యాన్నామ్నా త్రైలోక్య భూషణః ॥ 27

తా॥ భద్రమును శృంగమును తీసివేసి ప్రతి రథమునను కర్ణమునను 8 దళములను చేసిన యెడల త్రైలోక్య భూషణ ప్రాసాదమగును.

## 72. మహేంద్రము (సప్తాంగములు)

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ అష్టధా చాయతే క్షేత్రే భుజ కర్ణ విశోధితే ।
భాగం భాగంచ భద్రార్ధం కర్ణః ప్రతిరథో రథః ॥ 28
ప్రతిరథోஉంశోనిష్కాసే రథోஉర్ధోஉర్ధంచ భద్రకం ।
ఉదకాంతర యుక్తశ్చ పంచాంశో గర్భ విస్తరః ॥ 29
ద్వౌశృంగే తిలకం కర్ణే శృంగే ప్రతిరథే తథా ।

ఏకశృంగంచో పరథే ఉరః శృంగాణి ద్వాదశ ॥ 30

పంచాంశం మూలశిఖరం ఘంటా కలశ భూషితం ।

ఈప్సితంల భతేకర్తా యావదాభృత సంప్లవం ॥ 31

తా॥ క్షేత్రమును 8 భాగములు చేసి భద్రము 2 భాగములు కర్ణము 1 భాగము ప్రతి రథము యొక్క నిర్గమము 1 భాగము రథము ½ భాగము నిర్గమము భద్రము ½ భాగము జలాంతరమును గర్భము 5 భాగములును తిలకమున 2 శిఖరములును భద్రమున 2 శిఖరములును, కర్ణమున 2 శిఖరములును, ప్రతిరథమున 1 శిఖరమును ఉపరథమున 1 శిఖరమును ఉరః శృంగములు 12ను ప్రధాన శిఖరము 5 భాగములును అది ఘంట కలశము అను రెండు రూపములతో ప్రకాశించవలెను. యజమానునకు కోరికలు సిద్ధింపజేయును. ఇది మహేంద్రప్రాసాదము.

(అనుబంధము 44వ పటము చూడుడు)

## 73. రత్నశీర్షము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ కర్ణేశృంగత్రయుం కుర్యాద్రత్నశీర్షః స ఉచ్యతే ॥ 31½

తా॥ కర్ణమున 3 శిఖరముల నుంచి రేని రత్న శిఖర ప్రాసాదమనిపించుకొనును.

## 74. శతశృంగము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ త్యక్త్వైవ శృంగం భద్రస్య మత్తాలంబంతు కారయేత్ ॥ 32

తస్యచ్ఛాద్యోర్ధ్వ కర్ణేతు తతః శృంగాణి దాపయేత్ ।

శతశృంగస్త దానామ్నా ఈశ్వరస్య సదాప్రియః ॥ 33

తా॥ శిఖరమును తీసివేసి దాని యొక్క కప్పు పైనను కర్ణమునను శిఖరములను కల్పించినచో శత శృంగ ప్రాసాదమగును.

(అనుబంధము 45వ పటము చూడుడు)

## 75. భూధరము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ తిలకానిచ శృంగేషు తథో పరథకేషుచ ।

రథ ప్రతిరథోర్ధ్వేచ తిలకాని ప్రకల్పయేత్ ॥ 34

శేషాః పంచాండ శృంగాశ్చ భూ ధరాఖ్యః స ఉచ్యతే ॥

తా॥ శిఖరములయందు తిలకములును ఉప రథములయందును రథముల యందును ప్రతి రథములయందును కూడ తిలకములను రచించవలెను. మిగిలిన ప్రదేశమున 5 అండకములతో 5 శిఖరములనుచేసి రేని భూధర ప్రాసాదమగును.

(అనుబంధము 46-1, 46-2 పటములు చూడుడు)

## 76. భువన మండనము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ శ్రీవత్సం చైవ రేఖార్ధం భవేద్భువన మండనః ॥ 35

తా॥ శ్రీ వత్సమను ప్రాసాదము నందలి రేఖలను సగము చేసి రచించిన యెడల భువన మండన ప్రాసాదమగును.

## 77 త్రైలోక్య విజయమును క్షితివల్లభమును

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ తథైవ తిలకం కుర్యాచ్ఛృంగ ద్వయమధోపరి ।
త్రైలోక్య విజయశ్చైవత్రి శృంగైః క్షితివల్లభః ॥ 36

తా॥ పైన చెప్పిన దానినే ముందు భద్రమును రెండు శిఖరములును చేసినచో త్రైలోక్య విజయప్రాసాదమగును. అదియే మూడు శిఖరములతో జేసినచో క్షితివల్లభ ప్రాసాదమగును.

## 78. మహీధరము (నవాంగములు)

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ మహీధరం ప్రవక్ష్యేఽహం శతమూలే విభాజితే ।
పదికస్తతః కర్ణోభద్రం ద్విపద మిశ్రితం ॥ 37
కర్ణస్యోభయతస్త్ర యస్త్రయః ప్రతిరథాస్తథా ।
నిర్గమాస్సమభాగైశ్చ భాగార్ధం భద్ర నిర్గమః ॥ 38
భాగ షట్కాయతోగర్భః సప్తభాగోఽథవోచ్యతే ।
కర్ణే ప్రతిరథే భద్రే ద్వేద్వే శృంగేచ కారయేత్ ॥ 39
రథోపరథే తిలకం ప్రత్యంగం చరథోపరి ।
మత్తాలంబయుతం భద్రం స్యాన్మహీధర సంజ్ఞకః ॥ 40

తా॥ చతురస్ర ప్రదేశమును 10 భాగములు చేసి కర్ణము 1 భాగము భద్రము 2 భాగములు, కర్ణము యొక్క రెండు వైపులను 3.3 ప్రతిరథములును సమభాగములతో నిర్గమములును, భద్రము యొక్క నిర్గమము ½ భాగమును, గర్భము 6 భాగములును, లేక 7 భాగములును, కర్ణమునను, ప్రతిరథమునను భద్రమునను 2.2 శిఖరములును, రథమునందును ఉపరథమునందును తిలకమును, రథము పైన మఱియొక రూపమును భద్రమును మత్తాలంబముతో రచించుటయును గలది మహీధర ప్రాసాదమగును.

(అనుబంధము 47వ పటము చూడుడు)

## 79. కైలాసము నవమంగళము

**అపరాజిత 157వ సూత్రము**

శ్లో॥ భద్రే శృంగం తృతీయంచ కైలాసః శంకరప్రియః ।
భద్రేత్యక్త్వా రథేశృంగం నవ మంగళ ఉచ్యతే ॥ 41

తా॥ భద్రమునకు 3 శిఖరములు చేసిన యెడల కైలాస ప్రాసాదమగును. భద్రము నందు లేకుండ చేసి రథమును శిఖరమును చేసిన యెడల నవమంగళ ప్రాసాదమగును.

## 80. గంధమాదనము సర్వాంగసుందరము

**అపరాజిత 157వ సూత్రము**

శ్లో॥ తథాభద్రే పునర్దద్యాత్ సభవేద్గంధ మాదనః ।
త్యక్తం భద్రే రథేశృంగ యుక్తం సర్వాంగ సుందరం ॥ 42

తా॥ భద్రమున శిఖరములను చేసిన యెడల గంధ మాదనప్రాసాదమగును. భద్రమును వదలి రథమున శృంగములు చేసిన యెడల సర్వాంగ సుందర ప్రాసావమగును.

## 81. విజయానందము

**అపరాజిత 157వ సూత్రము**

శ్లో॥ భద్రేద ద్యాత్పునః శృంగం విజయానంద సంజ్ఞకః ॥

తా॥ భద్రమున మరల నింకొక శిఖరమును చేసినచో విజయానంద ప్రాసాదమగును.

## 82. సర్వాంగ తిలకము

అపరాజిత 157వ సూత్రము

శ్లో॥ మత్తాలంబయుతే భద్రే ఉపశృంగం పరిత్యజేత్ ॥ 43
మత్తాలంబో భయకర్ణే కుర్యాచ్ఛృంగ ద్వయంతథా ।
సర్వాంగ తిలకోనామ కర్తుః సంతాన భోగదః ॥ 44

తా॥ మత్తా లంబముతో గూడిన భద్రమున ఉప శిఖరము లేకుండా చేసి మత్తాలంబము యొక్క రెండు కర్ణములయందు రెండు శిఖరముల నేర్పఱచిన యెడల సర్వాంగతిలక ప్రాసాదమగును.

## 83. మహాభోగము

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ ఉరు శృంగంతతో దద్యాన్మత్తాలంబ సమన్వితః ।
మహాభోగ స్తదానామ సర్వకామ ఫలప్రదః ॥ 45

తా॥ మత్తాలంబమున యెత్తయిన శిఖరములను చేసినచో మహాభోగ ప్రాసాదమగును.

## 84. మేరువు

(అపరాజిత 157వ సూత్రము)

శ్లో॥ రథేకర్ణే ప్రతిరథే శృంగంచో పరధే తథా ।
మేరురేష సమాఖ్యాతః సర్వదేవైః సుపూజితః ॥ 46
సర్వస్వర్ణ మయేమేరౌ పుణ్యంయత్త్రిః ప్రదక్షిణైః ।
తైవేపక్వేష్వకే చైవ తత్పుణ్యం లభతేనరః ॥ 47
సృష్టావుక్తా బ్రహ్మణాయాః పూజావై పంచవింశతిః ।
వైరాజాద్యాః సముత్పన్నాః సర్వేప్రాసాద సంజ్ఞకాః ॥ 48

తా॥ రథముననను, కర్ణముననను, ప్రతిరథముననను, ఉపరథముననను శిఖరములు కలిగియుండినచో సర్వదేవ పూజితమైన మేరు ప్రాసాదమని పించుకొనును. అట్టి ప్రాసాదమునకు ముమ్మారు ప్రదక్షిణము చేసినయెడల సువర్ణమయమైన మేరువును ప్రదక్షిణ మొనర్చినంతటి పుణ్యము లభించును. ఇట్లు బ్రహ్మచే నిర్మింపబడి చెప్పబడియున్నవి. మరియు వైరాజ్యాదినాగర ప్రాసాదముల నుండి సమస్త ప్రాసాదములుత్పన్నమైనవి.

(అనుబంధము 48వ పటము చూడుడు)

# 85. రుచకము మొదలగు 64 ప్రాసాదములు

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదాఞ్ శిఖరాన్వితాన్ ।
రుచకాదీంశ్చతుః షష్టింనామ లక్ష్మణతః క్రమాత్ ॥ 1
పూర్వంయాని విమానాని పంచోక్తాన్యభవం స్తతః ।
తదాకారభృతః సర్వే ప్రాసాదాః పంచ వింశతిః ॥ 2
శిఖరైర్వి విధాకారై రేకే నాండేన భూషితాః ।
కేచిదండ త్రయోపేతాః కేచిత్పంచాండ కాన్వితాః ॥ 3
ఈ షద్భేదేనతేజ్ఞేయాః ప్రాసాదాః సర్వ్వకామదాః ।
సౌవర్ణా రాజతాశ్చైవ దేవానాం సతతం ప్రియాః ॥ 4
మణిముక్తా ప్రవాలాద్యై ర్భూషణైః సువిభూషితాః ।
రీతికాత్రపు లోహాద్యైః పిశాచోరగ రాక్షసాం ॥ 5
దేవలోకా భవంత్సేతే కామ స్వచ్ఛంద చారిణః ।
పాతావేచా పినిర్దిష్టాః పాషాణైః స్ఫటికై స్తథా ॥ 6
ఇష్టకా కాష్ఠపాషాణై ర్మర్త్యలోకేఽపినందకాః ।
సుఖదాశ్చ భవంత్యేతే కర్తుః కారయితు స్తథా ॥ 7
లక్ష్మణేనాన్వితానేతాన్ కథయామో యథావిధి ।
పురాణాం భూషణార్థాయ భుక్తి ముక్తి ప్రదాన్నృణాం ॥ 8

తా॥ శిఖరములతో గూడిన రుచకము మొదలైన 64 ప్రాసాదములను చెప్పుచున్నాను. మొట్ట మొదట 5 విధములు మాత్రము చెప్పబడినవి. తరువాత వాని యాకారముల ననుసరించి క్రమముగా 25 భేదములేర్పడినవి. శిఖరముల యొక్క రూపములు వేఱువేఱుగా నున్నను ఒక్కటే అండకము కలవి కొన్నియును మూడు అండకములు కలవి కొన్నియును ఐదు అండకములు కలవి కొన్నియును ఇట్లు కొంచెము భేదములు కనుపఱచుచు రచించబడినవి. బంగారము, వెండితో రచించబడినవి దేవతలకు ప్రియము మణులు ముత్తెములు పగడములు మొదలుగు వానిచే బాగుగా నలంకరింపబడినవి కూడ దేవతల కిష్టములేయగును. ఇత్తడి సీసము ఇనుము మొదలైనవి పిశాచములకును ఉరగులకును రాక్షసులకును ఇష్టములైనవి. దేవలోకం నందలి వారికివి నిర్ణయింపబడినవి. పాతాలము నందును పాషాణములును స్ఫటికంలును చెప్పబడినవి మానవ లోకమున ఇటుకలును దారువులును పాషాణంలును చెప్పబడినవి. ఈ చెప్పబడినవి చేయుంచు

వానికిని చేయువానికిని సంతోషమును సుఖమును కలిగించును. ఇవి లక్షణ యుక్తముగా నిర్మించిరేని భుక్తిముక్తి ప్రదములును పట్టణములకు అలంకారములును అగును.

## 86. అందులతినములు 25 విధములు

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ రుచకో భద్రకశ్చైవ హంసోహం సొద్భవస్తథా ।
ప్రతిహంస స్తథానందో నంద్యావర్తో ధరాధరః ॥ 9
వర్ధమానోఽద్రికూటశ్చ శ్రీవత్సోఽథ త్రికూటకః ।
ముక్తకోణో గజశ్చైవ గరుడః సింహ ఏవచ ॥ 10
భవశ్చ విభవశ్చైవ పద్మో మాలాధరస్తథా ।
వజ్రకః స్వస్తికః శంకుర్మలయో మకర ధ్వజః ॥ 11
ఇత్యేతేనామతః ప్రోక్తాః ప్రాసాదాః పంచవింశతిః ।
ఏతేషాం రూప నిర్మాణం కథయామో యథావిధి ॥ 12
రుచకాది షోడశైషాం చతురశ్రాః ప్రకీర్తితాః ।
భవశ్చ విభవశ్చైవ చతురశ్రా యతోఽథవా ॥ 13
పద్మో మాలాధరశ్చైవ వృత్తావేతావుదాహృతౌ ।
మలయో మకరాఖ్యోఽథద్వౌతు వృత్తాయతావిమౌ ॥ 14
వజ్రకః స్వస్తికః శంకు రిత్యష్టాశ్ర యస్త్రయః ।
లతినాః కథితాహ్యేతే బ్రూమోఽన్యాన్ మిశ్రకానథ ॥ 15

తా॥ రుచకము, భద్రకము, హంసము, హంసోద్భవము, ప్రతిహంసము, నందము, నంద్యావర్తము, ధరాధరము, వర్ధమానము, అద్రికూటము, శ్రీవత్సము, త్రికూటము, ముక్తకోణము, గజము, గరుడము, సింహము, భవము విభవము, పద్మము, మాలాధరము, వజ్రకము, స్వస్తికము, శంకు, మలయము, మకరధ్వజము, అను 25 పేరులు కలిగియున్నవి. ఇందులో గల భేదములను చెప్పుచున్నాను. రుచకము మొదలు సింహము వఱకు 16ను నలుచదరము సమానము కలవి. భవము, విభవము అను రెండును దీర్ఘచతురశ్రములు, పద్మము, మాలాధరము, ఈ రెండును వృత్తాకారములు మలయము మకరధ్వజము అను రెండును దీర్ఘ వృత్తాకారములు, వజ్రకము, స్వస్తికము, శంకు అను మూడును అష్టాశ్రములు కలవి. ఈ 25ను లతినములని చెప్పబడుచున్నవి.

(అపరాజిత 106వ సూత్రము)

శ్లో॥ యాత్వేకా నాగరారేఖా శృంగే శిఖర వర్జితాః ।
లతినాస్తు సమాఖ్యాతా రుచకాది సముద్భవాః ॥ 28

తా॥ నాగర పద్ధతిలో నుండి తల యందు శిఖరములు లేనివి లతిన ములందురు- అవిరుచకాదుల నుండి పుట్టబడినవి.

## 87· రుచకము మొదలగు 25 లతినము వివరము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే చతుర్భాగ విభాజితే ।
భాగాభాగాతు భిత్తిర్వే శేషం గర్భ గృహం భవేత్ ॥ 9
తదగ్రతః పునఃకార్యో భాగద్వయ వినిర్గమః ।
విస్తారేతు త్రయోభాగాః ప్రాగ్గ్రీవః స్తంభ భూషితః ॥ 10
పీఠోత్సేధశ్చ భాగేన జంఘాతత్ర ద్విభాగతః ।
వరవండ్యంతర పత్రంచ పాదోనభాగమశ్నుతే ॥ 11
సార్థ పంచాంశతశ్చైవ పీఠోచ్ఛ్రాయం ప్రకల్పయేత్ ।
భాగార్ధం చైక భాగంచ భాగం భాగార్ధమేవచ ॥ 12
కుముదం కలశం చైవ కపోతాల్యంతరైః సహ ।
అనేనక్రమ యోగేన పీఠోచ్ఛ్రాయం ప్రకల్పయేత్ ॥ 13
సపాద చతురంశాశ్చ ఉచ్ఛ్రాయే శిఖరస్యచ ।
చతుర్గుణైః పృథక్ సూత్రైః పద్మకోశం సమాలిఖేత్ ॥ 14
స్కంధ కోశాంతరం చైవ సప్తభాగశ్చ కారయేత్ ।
గ్రీవాభాగ సముత్సేధా సార్ధమామలసారకం ॥ 15
పద్మచ్ఛత్రంతథా సార్ధం త్రిభాగైః కలశోన్నతిః ।
రుచకస్తు సమాఖ్యాతో భద్రకంచాప్య థశృణు ॥ 16

తా॥ నలుచదరముగా నున్న ప్రదేశమును 4 భాగములు చేసి ఒక్కొక్క భాగము గోడయును మిగిలిన రెండు భాగములు గర్భమును చేయవలెను. దాని ముందు మరల నిర్గమమును 2 భాగములు చేయవలెను దాని విస్తారము 3 భాగములును ప్రాగ్రీవము స్తంభములతో అలంకారముగా చేయవలెను. పీఠము యెత్తు 1 భా, జంఘ 2 భా, వరవండి అంతరపత్రము యీ రెండును కలసి ముప్పాతిక భాగము, పీఠము యెత్తు $5\frac{1}{2}$ భాగములు కుముదము $\frac{1}{2}$ భా, కలశము 1 భా, కపోతాలి 1 భా, అంతర పత్రము

½ భా, ఇట్లు క్రమముగా పీఠము యొక్క యెత్తును చేయవలెను. శిఖరము 4¼ భా, నాలుగు భాగములు గల సూత్రము చేత పద్మకోశమును చేయవలెను. (3 భాగములతో చేయుట సహజము) స్కంధకోశాంతరములు 7 భాగములు చేయవలెను. గ్రీవ 1 భాగము యెత్తు, అమలసారకము 1½ భాగముల యెత్తు పద్మ రూపము గల భద్రము 1½ భాగము, కలశము 3 భాగములు. ఇట్లు చేసిరేని రుచకమగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే చతుర్భాగ విభాజితే ।
భాగికా సర్వతోభిత్తిః శేషం గర్భగృహం భవేత్ ॥ 45
తస్యాగ్రతః పునఃకార్యో భాగద్వయ వినిర్గతః ।
విస్తారేణ త్రిభాగశ్చ ప్రాగ్గ్రీవ స్తంభ భూషితః ॥ 46
పీఠోత్సేధస్య భాగేన భవేజ్జంఘా ద్విభాగికా ।
భాగార్ధమంతరం పత్రం పాదేన స్యాద్వరండికా ॥ 47
సపాదాంశ్చ తురోభాగాన్ శిఖరస్యోచ్ఛ్రయః స్మృతః ।
త్రిగుణేనచ సూత్రేణ పద్మకోశం సమాలిఖేత్ ॥ 48
స్కంధకోశాం తరంచాస్య భాగైః ప్రవిభజేత్త్రిభిః ।
భవేద్గ్రీనార్ధ భాగేన భాగేనా మలసారకం ॥ 49
పద్మశీర్షంచ భాగార్ధాంత్ భాగేన కలశః స్మృతః ।
ఇత్యుక్తో రుచకాఖ్యోయం ॥ 50

అనగా చతురశ్ర ప్రదేశమును 4 భాగములు చేసి మధ్య 2 భాగములు గర్భమును చుట్టును గోడయును రచించి దాని పైన నిర్గమము 2 భాగములును, విస్తారము 3 భాగములును, కల్ప్రాగ్గీవమును రచించవలెను. పీఠము 1 భా, జంఘ 2 భా, అంతర పత్రము ½ భా, వరండిక ¼ భా, శిఖరము 4¼ భా, మూడు రెట్లు గల సూత్రము చేత పద్మకోశమును చేయవలెను. స్కంధ కోశాంతరము 3 భాగములు చేత విభజించవలెను. గ్రీవ ½ భాగము, అమలసారకము 1 భా, పద్మకోశము ½ భాగము, కలశము 1 భా, ఈ ప్రకారము చేసిరేని రుచకమగును.

## 88. భద్రకము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ ద్విభాగో భద్ర విస్తారః పాద షడ్భాగ నిర్గతం ।

భద్రకస్య సమాఖ్యాతా శిఖాంతేచ రథాకృతిః ॥ 17

తా॥ భద్రము యొక్క విస్తారము 2 భా, నిర్గమము $1\frac{1}{2}$ భా, స్తూపిక రథా కారముగా నుండినచో భద్రకమగును.

## 89. హంసము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ వార్యంతరం తథాకుర్యా న్మధ్యే భద్రక కర్ణయోః ।
తతోహంసః సలిజ్ఞేయః స్వరూపో లక్షణాన్వితః ॥ 18

తా॥ ప్రాసాదము యొక్క కర్ణములయందు జలాంతరములనురచించిన యెడల హంస ప్రాసాదమగును.

సమరాంగణ 56వ అధ్యాయము

భద్రంతు కర్ణయోర్మధ్యే కారయేదుర కాంతరం ।
తదాహంసో విజానీయాత్ ప్రాసాదో దేవతాలయః ॥ 52

అని చెప్పబడియున్నది.

## 90. హంసోద్భవము

శ్లో॥ వార్యంతరం భద్రకేతు భద్ర మధ్యేతు కారయేత్ ।
హంసోద్భవ స్తథానామ బ్రహ్మణశ్చ సుఖావహః ॥ 19

తా॥ పై చెప్పిన భద్రకమున భద్ర మధ్య జలాంతరమును కల్పించినచో హంసోద్భవమగును.

సమరాంగణమున

శ్లో॥ హంసస్యైవ యదా కుర్యాత్ భద్రస్థానే జలాంతరం ।
తదాహంసోద్భవోనామ ప్రాసాదః పరికీర్తితః ॥ 53

అని చెప్పబడియున్నది.

## 91. ప్రతిహంసము

శ్లో॥ యథాభద్రే తథాకర్ణే కారయేదుద కాంతరం ।
నిర్గతం భాగపాదేన ద్వౌస్తంభౌ కర్ణ భద్రయోః ॥ 20

తా॥ భద్రముననూ కర్ణముననూ జలాంతరమును కల్పించి యొకభాగములో నాల్గవ వంతు నిర్గమము చేసి రెండు రెండు స్తంభములను రచించ యెడల ప్రతిహంసమగును.

సమరాంగణ

శ్లో॥ రథాంత కర్ణయోశ్చైవం యదాస్యాదుద కాంతరం ।

ప్రతిహంస స్తదాప్రోక్తః ప్రాసాదోఽయం మనోరమః 54
అని యున్నాడు...

## 92. నందము

శ్లో॥ ప్రాగ్గ్రీవం చైవ రుచకే భద్రమానేన కారయేత్ ।
నిర్గమేనష్ట కర్ణంచ సనందః సర్వకామదః ॥ 21

తా॥ రుచకమున ప్రాగ్గ్రీవము భద్రము యొక్క కొలత ప్రకారము చేసి నిర్గమమున కర్ణము లేకుండా చేసిన యెడల నందమగును.

సమరాంగణ

శ్లో॥ ప్రాగ్గ్రీవా రుచకస్యైవ సీమ విస్తార విస్తృతాః ।
నిర్గతా భద్రమానేన తదానందః సఉచ్యతే ॥ 55

అని పై యభిప్రాయముతో సమముగానే చెప్పియున్నాడు.

## 93. నంద్యావర్తము

శ్లో॥ ప్రాగ్గ్రీవేతు పురోఽలిందం కారయే ద్వీథిపూర్వకం ।
నంద్యావర్త స్తథానామ క ర్తవ్యో దేవతాలయః ॥ 22

తా॥ పై చెప్పిన నందములకు ప్రాగ్గ్రీవమున ముందు ఆలిందమును కల్పించినచో నంద్యావర్తమగును.

సమరాంగణ

శ్లో॥ ప్రాగ్గ్రీవైర్భద్ర మానేన నందోయది విభూష్యతే ।
నిర్గతైర్భాగమానేన చతుష్పక్షైః సమంతతః ॥ 56
ప్రాగ్గ్రీవః పురతః కార్యః స్తంభద్వయ విభూషితః ।
నంద్యావర్త స్తదాప్రోక్తః ప్రాసాదో విజయావహః ॥ 57

అనగా నందము ప్రాగ్గ్రీవముతోను భద్రముతోను అలంకరింపబడి భాగ ప్రకారము నలుచదరముగా జేసి దానిముందు రెండు స్తంభములను రచించిన యెడల నంద్యావర్తమగును.

## 93. ధరాధరము

శ్లో॥ కక్షే జలాంతరం చైవ స్తంభైశ్చాద్య విభూషితైః ।
ధరాధరశ్చ విజ్ఞేయః సదేవ్యమర వల్లభః ॥ 23

తా॥ నంద్యావర్తమునకు భద్రమున జల నిర్గమమును రచించినచో ధరాధరమగును.

సమరాంగణ

శ్లో॥ నంద్యావర్తేయదా కుర్యాద్ భద్రాంతే జల నిర్గమం ।
ధరాధర స్తదాజ్ఞేయః ప్రాసాదో భువనోత్తమః ॥ 58

అవి పై రీతిగానే చెప్పియున్నాడు

## 95. వర్ధమానము

(అపరాజిత 158వ సూత్రము)

శ్లో॥ దశధాభాజితే క్షేత్రే ద్విభాగః కర్ణవిస్తరః ।
త్రిభాగంచ భవేద్భద్రం సార్ధం ప్రతిరథో మతః ॥ 24

తా॥ విస్తారమును 10 భాగములు చేసి అందు రెండేసి భాగములు కర్ణములును భద్రము 3 భాగములును ప్రతి రథములు $1\frac{1}{2}$ భాగము చొప్పునను చేసిన యెడల వర్ధమానమగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ దశధాభాజితే క్షేత్రే చతురశ్రే సమంతతః ।
భాగద్వయేన కర్ణంస్యాద్ భజేచ్ఛేషంచ సప్తధా ॥ 59
భాగత్రయేణ రథకో మధ్యమోఽస్యవిధీయతే ।
ద్వాభ్యాం ద్వాభ్యాంతు భాగాభ్యాం రథకౌ వామదక్షిణౌ ॥ 60
భాగస్యైవ త్రిభాగేన భవేదస్య ।
వినిర్గమః కథిత్వా వర్ధమానోఽయం ॥

అనాగా 10 భాగములలో 2.2 భాగములు కర్ణములకు వదలి మిగిలిన 6 భాగములను 7 భాగములుగా చేసి అందు మధ్య 3 భాగములు భద్రమును దానికిరువైపుల 2.2 భాగములు రథములును చేసిరేని వర్ధమానమగును. అని చెప్పినాడు

## 96. గిరికూటము

(అపరాజిత 158వ సూత్రము)

శ్లో॥ కర్ణే వార్యంతరం కుర్యాద్ గిరికూటః స ఉచ్యతే ॥ $24\frac{1}{2}$

తా॥ వర్ధమానమునకు కర్ణమున జలాంతరమును రచించిన యెడల గిరికూటమగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ వర్ధమానస్య భద్రస్థ మధ్యసూత్రేణ యోజయేత్ ।
కర్ణసూత్రం తదగ్రాభ్యాంన్యస్యేత్ సూత్ర చతుష్టయం ॥ 62
తదుత్పన్నైస్తు భద్రస్థ కర్ణైః స్యాద్గిరి కూటః ॥

అనగా వర్ధమానమునకు భద్రము నందు మధ్య సూత్రము చేత కర్ణ సూత్రమును కలిపి వానిపైన నాలుగు సూత్రముల నుంచి భద్రమునకు కర్ణములను రచించిన యెడల గిరికూటమగును

## 97. శ్రీవత్సము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ కర్ణే ప్రతిరథే చైవ శ్రీవత్సోవారి సంయుతే ॥ 25

తా॥ పై చెప్పిన దానికే కర్ణమునను భద్రముననూ జలాంతరమును కల్పించినచో శ్రీ వత్సమగును

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ కర్ణాంతేంచ రథాంతేచ యదిస్యాత్ సలిలాంతరం ।
వర్ధమానస్య భవతి శ్రీవత్సః స్యాత్ తదాశుభః ॥

అని చెప్పియున్నాడు

(అనుబంధము 49వ పటము చూడుడు)

## 98. త్రికూటము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ వర్ధమానస్య సంస్థానే భద్రమధ్యే జలాంతరం ।
త్రికూటః సతు విజ్ఞేయః కర్తవ్యః శుభలక్షణః ॥ 26

తా॥ వర్ధమానమునకు భద్రము యొక్క నడుమ జలాంతరమును రచించిన యెడల త్రికూటమగును

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ గిరికూటస్య సంస్థానే తద్రూపేవినివేశితే ॥ 64
కర్ణాన్ ప్రతిరథేష్వస్య నిఖిలేష్వపి యోజయేత్ ।
ప్రాగ్వత్ ప్రతిరథోద్భూత సూత్రాభ్యాం కర్ణవర్త్మనా ॥ 65
త్రికూటాఖ్యః స్తదెవస్యాత్ ప్రాసాదో దేవతాలయః ॥

అని రచించియున్నాడు.

## 99. ముక్తకోణము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ కర్ణే భద్రాణిదేయాని నష్టాంగం మూలనాసికం ।
ముక్తకోణః సవిజ్ఞేయః సర్వకామ ఫలప్రదః ॥ 27

తా॥ పై జెప్పిన దానినే కర్ణములయందు భద్రములను రచించిన యెడల ముక్తకోణమగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ త్రికూటస్యైవ సంస్థానే భద్రంకర్ణ పరిచ్యుతే ॥ 66
స్వరూప భద్ర సంస్థానే ముక్తకోణః ప్రజాయతే ॥
అని చెప్పబడియున్నది.

## 100. గజము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ ఉభౌ ప్రతిరథౌ మధ్యే పృష్ఠతోవృత్త మాలిఖేత్ ।
ఏవంవిధః ప్రకర్తవ్యః సగజః సర్వకామదః

తా॥ పై జెప్పిన దానినే వెనుక వైపున రెండు ప్రతిరథముల మధ్య వర్తులముగా రేఖను లిఖించి ఈ విధముగా రచించినచో గజ ప్రాసాద మగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతుర్భి ర్విస్తృతేర్భాగైః క్షేత్రే పంచభిరాయతే ॥ 67
భాగేన భిత్తిః కర్తవ్యా శేషం గర్భగృహం భవేత్ ।
అస్యక్షేత్రార్ధ సూత్రేణ పృష్ఠతో వృత్తమాలిఖేత్ ॥ 68
పురతః శూరసేనోఽస్య పృష్ఠతోఽపిగజాకృతిః ।
ప్రాసాదోఽయంగజోనామ గణేశస్య విధీయతే ॥ 69

అనగా వెడల్పు 4 భాగములును, పొడవు 5 భాగములును చేసి అందు గోడ 1 భాగము చుట్టును చేసి మిగిలినది గర్భ గృహము చేయవలెను. దీనిని వెనుకవైపున సగము గుండ్రముగా చేయవలెను. ముందు చదరముగానే యుండవలెను. అందు వలన గజాకారమేర్పడును గణపతికి ప్రాసాదము ముఖ్యము.

## 101. గరుడము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ వర్ధమానస్య సంస్థానే పార్శ్వం కుర్యాత్తదూర్ధ్వతః ।
కుర్యాద్వృతౌ శృంగకూటౌ పక్షిరాజః సుఖాశ్రయః ॥

తా॥ వర్ధమానమునకే ప్రక్కలను శిఖరములను కలశములను రచించిన యెడల గరుడ ప్రాసాద మగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ వర్ధమానస్య సంస్థానే గరుడం వినివేశయేత్ ।

తస్యపక్షౌ విధాతవ్యౌ ప్రాసాదార్ధేన నిర్గతౌ ॥ 70
పక్షయోఽస్తుదశస్తస్య వర్ధమానం విభాజయేత్ ।
జాతిశుద్ధౌరథాః కార్యాః పార్శ్వ యోర్గమడో భవేత్ ॥ 71

అనగా వర్ధమానమునకు 10 భాగములు చేయవలెను. అందులో సగం ఐక్కలు రెండు వైపుల కలసి 5 భాగములు నిర్గమము చేయవలెను. మొత్తము 15 భాగములగును. రథములను రెండు వైపుల ఒక్కటే జాతి పనితో రచించవలెను. దానిని గరుడమందురు.

## 102. సింహము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ ప్రతిభద్రంచ హంసేచేత్ సింహనామాస ఉచ్యతే ।
చతురశ్రాస్తు కథితాః సర్వకామ ఫలప్రదాః ॥ 30

తా॥ హంసమునకు ప్రతి భద్రమును చేసిన యెడల సింహమగును. ఈ చెప్పిన వన్నియును నలుచదరములగు ప్రాసాదములు అన్ని కోరికలను ఫలములను ఇచ్చునవి.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ వర్ధమానస్య సంస్థానే ప్రాగ్వత్ కర్ణానియోజయేత్ ।
ద్విభాగారథికా కార్యా శేషం భద్రం ప్రకల్పయేత్ ॥ 72
జంఘాస్య పంచభిర్భాగైః పీఠంచాస్యతదర్ధతః ।
వీరండ్యర్ధాంశికాభిశ్చ భాగశ్చాంతర పత్రయోః ॥ 73
తథోత్సేధ త్రిభాగైశ్చ నవభిః శిఖరోచ్ఛ్రితః ।
కుంభశ్చామలసారశ్చ సింహేఽస్మిన్ భాగమానతః ॥ 74

అనగా వర్ధమానము వలెనే కర్ణములును రచించి పంజరము 2 భాగములును యిరువైపుల చేసి మిగిలిన దానిని మధ్య భద్రమును చేయవలెను దానికి జంఘ 5 భాగములు పీఠము అందులో సగము ($2\frac{1}{2}$) వరండ $\frac{1}{2}$ భాగము అంతర పత్రము 1 భా, దాని యెత్తు 3 భా, శిఖరము యెత్తు 9 భా, కుంభము కలశము రచించినచో సింహ ప్రాసాదమగును.

## 103. భవము విభవము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ గిరికూటస్త్రి కూటశ్చ యదాగర్భాయతో భవేత్ ।

భవశ్చ విభవశ్చైవ త్రిలింగాశ్చ ప్రకీర్తితాః ॥ 31

తా॥ గిరికూటము త్రికూటము గర్భము పాడవుగా నుండెనేని భవ మును అందె మూడు రూపములు గలవి విభవమును అగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతుర శ్రీకృతేక్షేత్రే చతుర్భిర్భాజితైః పదైః ।
సీమా విస్తారమానేన రథాంస్తత్ర ప్రకల్పయేత్ ॥ 75
పాదేనైకేన నిర్యాతాన్ దిక్షు సర్వాస్వను క్రమాత్ ।
ప్రాగ్గ్రీవాన్ పునరస్యైవ భాగ ద్వితయ విస్తృతాన్ ॥ 76
పదషడ్భాగ నిర్యాతాన్ విదధీత చతుర్దిశం ।
చతుర్భాగాయతోగర్భః కార్యోఽస్యద్వ్యంశ విస్తృతః ॥ 77
జంఘోత్సేధంచ పీఠంచ యధా భద్రే తథాభవేత్ ।
ప్రాసాదో భవ సంజ్ఞోఽయం దేవతాత్రితయాశ్రయః ॥ 78

అనగా నలుచదరమగు ప్రదేశమును 4 భాగములు చేసి సీమయొక్క విస్తారము ననుసరించి రథములను ఒక్క పాతిక వంతు నిర్గమముతో అన్ని దిక్కుల చేయవలెను ప్రాగ్గ్రీవములు 2 భాగములు విస్తారమును కల్పించవలెను, వాని యొక్క నిర్గమము $1\frac{1}{2}$ భాగము చేయవలెను. ఇట్లు నలువైపుల నుండవలెను. గర్భము పాడవు 4 భాగములును విస్తారము 2 భాగములును చేసిన తరువాత జంఘ యొక్క యెత్తును పీఠమును భద్ర మున రచించినట్లు రచించవలెను. ఇది భవమగును.

శ్లో॥ భవస్యైవ యదాకుర్యాద్ రథాన్ సజల నిర్గమాన్ ।
ద్విభంగం సంశ్రయోఽన్యఃసః ప్రాసాదో విభవాభిధః ॥ 79

అనగా భవమునకే పంజరములను జన నిర్గమములను చేసి రెండు భంగములు కలిగించినచో (మూడు శిఖరములు చేసినచో) విభవమగును.

## 104. పద్మము మాలాధరము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ వృత్తే షోడశ కర్ణాద్యాః వినాభద్రైశ్చ పద్మకః ।
వినాకర్ణం కలాభద్రైశ్చ వేన్మాలాధరః సతు ॥ 32

తా॥ చతురశ్రాకారమునకు 16 కర్ణములు గుండ్రముగా చేసి భద్ర ములు లేకుండ నిర్మించిన యెడల పద్మకమగును. కర్ణములు లేకుండా 16 భద్రములను నిర్మించిన యెడల మాలాధరమగును. ఆ పద్ధతులను చెప్పుచున్నాను.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ అష్టధాభాజితే క్షేత్రే చతురస్రే సమంతతః ।
విదధ్యాద్ గర్భసూత్రాణి కర్ణ సూత్రాణి చక్రమాత్ ॥ 80
దిక్సూత్రే ష్వఖివేష్వస్య సీమార్థం పదమేవచ ।
పదస్యాష్టా దశో భాగస్త ద్యోగాద్వృత్తమాలిఖేత్ ॥ 81
విస్తారార్థం భవేద్గర్భోగర్భార్ధాస్త స్యభిత్తయః ।
తద్వృత్త బాహ్యసూత్రేణ భాగాన్ షోడశ కారయేత్ ॥ 82
దిక్సూత్ర కర్ణసూత్రేషు రథకాన్ సంప్రకల్పయేత్ ।
ద్విభాగా రథికాకార్యా సలిలాంతర భూషితా ॥ 83
సలిలాంతరమేతస్య శ్రీవత్సస్యేవ కల్పయేత్ ।
జంఘోత్సేధేచ పీఠేచ శిఖరంచ తథా భవేత్ ॥ 84
మాలాధరః సవిజ్ఞేయః సబాహ్యాభ్యంతరః సమః ।

అనగా నలుచదరపు ప్రదేశమును 8 భాగములు చేసి గర్భసూత్రములును కర్ణసూత్రములును, వరుసగా సరిచూచి దిక్సూత్రములన్నిటియందును సీమ కొఱకు ఒక్కొక్క పదమును కలిపి అప్పుడు 18 భాగములకు వృత్తమును లిఖించవలెను. ఆ విస్తారములో సగము గర్భమును, గర్భములో సగము చొప్పున గోడయును కల్పించవలెను ఆ వృత్తము యొక్క వెలుపలి సూత్రము చేత 16 భాగములు చేసి దిక్సూత్రముల యందును, కర్ణ సూత్రముల యందును, 2 భా చొప్పున రథములను జలాంతరములను రచించవలెను. శ్రీ వత్సమున జేసినట్లే చేయవలెను. జంఘ యెత్తును, పీఠమును, శిఖరమును, అదే విధముగా చేయవలెను. దీనిని మాలాధర మందురు.

సమరాంగణ 56వ అధ్యాయము

మాలాధరస్య సంస్థానే యత్క్షేత్రం పూర్వవత్ స్థితం ॥ 85
ఉదకాంతర విచ్ఛిన్నం పద్మం తత్రనివేశయేత్ ।
తథాగ్రేకారయేత్కర్ణ వ్యాసార్ధేన వినిర్గమాన్ ॥ 86
పద్మపత్ర విభాకారాణ్ జాతి శుద్ధాన్‌సలక్షణాన్ ॥

అనగా మాలాధరమునకే జలాంతరము లేకుండ చేసి పద్మమును కల్పించిన యెడల నడి ప్రపద్మ ప్రాసాదమగును. దాని ముందు కర్ణవ్యాసములో సగము నిర్గమము చేయవలెను. పద్మ పత్రములవలె జాతిశుద్ధము

లైనవియును లక్షణయుక్తములైనవియును రూపములను రచించవలెను
(అనుబంధము 50, 51వ పటము చూడుడు)

# 105. వజ్రకము, స్వస్తికము, శంకువు

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ అష్టకర్ణో వజ్రకః స్యాత్ స్వస్తికో భద్ర సంయుతః ।
స్వస్తికే ప్రతిభద్రాణి శంకుశ్చాష్టాశ్ర సూత్రతః ।

తా॥ ఎనిమిది కర్ణములు కలది వజ్రకమగును 8. భద్రములుకలది స్వస్తికమగును. మఱియు స్వస్తికమునందు ప్రతి భద్రములును, 8 కోణములును కలిగియున్నచో శంకువగును.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ మలయస్యైవ కర్ణేషు రథికాన్యది కల్పయేత్ ।
ఉదకాంతర విచ్ఛిన్నాన్ పద షడ్భాగ నిర్గమాన్ ॥ 93
పీఠోత్సేధశ్చ జంఘాచ శిఖరం చాత్ర యద్భవేత్ ।
ఏకమాత్రా సమాయుక్తం లతినాతే ప్రతీయతే ॥ 94
నాంతర్ ద్విధాయతే త్ర్యంశమానాం చతురశ్రాణాం ।
కోణేష్వర్థ పరిక్షయాత్ ॥
అష్టాశ్రంజాయతే యత్ర వాజాగ్రమపినాంతరం ॥ 95
అష్టాశ్రం చతురోభాగాన్ విదధ్యాత్ తత్రభాగికీ ।
భిత్తిర్విధేయా భాగాభ్యాం భవేద్గర్భ గృహంతతః ॥ 96
రథికా సువిధేయోఽస్య పరితో జల నిర్గమః ।
వజ్రకోనామ కథితః ప్రాసాదః శుభలక్షణః ॥ 97

అనగా మలయము యొక్క కర్ణముల యందు రథములను కల్పించి జలాంతరము చేసి 6 భాగములు నిర్గమమును పీఠము యెత్తు జంఘ, శిఖరము, ఒక్కటే జాతి కలవి లతినములగును మరియు చతురశ్రమున మూలలయందు సగపాలును తగ్గించి మూడింటనొకపాలు తగ్గించినచో 8కోణములును, నాలుగు భాగములు అష్టాశ్రమును, అందు 1 భాగమును గోడ 2 భాగములును, మిగిలినది గర్భ గృహమగును చుట్టును రథికలను వాని యందు జల నిర్గమములను కలిగించినచో వజ్రమగును.

(అనుబంధము 52, పటము చూడుడు)

సమరాంగణము 56వ అధ్యాయము

శ్లో॥ వజ్రకస్యైవ సంస్థానే సలిలాంతర వర్జితే ।

చత్వారింశద్భాగ భక్తే రథికాః స్యుస్త్రిభాగికాః ॥ 98
అష్టాసుదిక్షు కర్ణాశ్చ భవంత్యస్య ద్విభాగికాః ।
కర్ణైః పద్మకతుల్యోఽయం స్వస్తికః సముదాహృతః ॥ 99

అనగా వజ్రకమునకు జలాంతరములు లేకుండ చేసి 40 భాగములు చేయగా రథికలు 3 భాగముల చొప్పునను, ఎనిమిది దిశలయందు కర్ణములు రెండు భాగముల చొప్పునను, చేసిన యెడల నిడిపద్మకముతో సమానముగా నుండి స్వస్తికమనిపించుకొనును.

(అనుబంధము 53వ పటము చూడుడు)

మఱియు సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ వజ్రకస్యైవ సంస్థానే యేరథాః ప్రాక్ ప్రదర్శితాః ।
ఏకైకస్తేషు కర్తవ్య శ్చతుర శ్చతురోఽంశకాన్ ॥ 100
భాగద్వయేన మధ్యః స్యాద్ రథకోశాద్వి నిర్గతః ।
శంకుర్నామాయముద్దిష్టః ప్రాసాదోఽష్టభిరాశ్రిభిః ॥ 101

అనగా వజ్రకమునే 4.4 భాగముల చొప్పున రథములను చేసి 2 భాగములు నిర్గమములను చేయవలెను. 8 కోణములతో నుండెనేని శంకుప్రాసాదమగును.

(అనుబంధము 54వ పటము చూడుడు)

## 106. మలయము మకరధ్వజము

అపరాజిత 158వ సూత్రము

శ్లో॥ మలయస్త్వాయతే పద్మే మాలాధృక్ మకరధ్వజః ।
లతినాః కథితాస్త్వేవం ప్రాసాదాః పంచవింశతిః ॥ 34
ఇతిసూత్ర సంతానగుణ కీర్తి ప్రకాశప్రోక్త్య శ్రీభువన దేవాచార్యోక్త పరాజిత పృచ్ఛాయాం పంచ వింశతిలతిన ప్రాసాద నిర్ణయాధికారో నామాష్ట పంచాశదుత్తర శతతమం సూత్రం ॥

తా॥ పూర్వము చెప్పిన పద్మమును పొడవుగా చేసినచో దీర్ఘవృత్తమనిపించుకొనును. అట్టి రూపము గలది మలయమగును. అటులే మాలాధరము కూడ మకర ధ్వజమగును. ఇవి 25 లతిన ప్రాసాదములు. శ్రీభువన దేవాచార్యుడు రచించిన అపరాజిత పృచ్ఛ 158వ సూత్రము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ షడ్భాగానాయతే క్షేత్రే విస్తారేచ చతుర్దకే ॥ 87

ద్విభాగా ద్విపులో గర్భ శ్చతుర్భాగాయతో భవేత్ ।
గర్భ వ్యాసమితం సూత్రం పదపాద సమన్వితం ॥ 88
వృత్తార్ధం భ్రమయేత్తేన దక్షిణేనోత్తరేణచ ॥ 89
పురతః పృష్ఠతశ్చాపి తద్వృత్తమను వర్తయేత్ ।
వృత్తక్షేత్ర మిదంతస్య భాగైర్ద్వా దశభిర్భవేత్ ॥ 90
ద్విభాగో భద్ర విస్తారో భాగికీ రథ విస్తృతిః ।
భద్రాణాంచ రథాన్మధ్యే భాగేనైకేన విస్తృతాన్ ॥ 91
ఉదకాంతరకంచాత్ర మాలాధరవదా చరేత్ ।
వృత్తాయతస్తు కర్తవ్యః ప్రాసాదో మలయాభిధః ॥ 92

**అనగా పాదవు** 6 భాగములును వెడల్పు 4 భాగములును **చేసి అందు** గర్భము పాదవు 4 భాగములును విస్తారము 2 భాగము**లును** చేసి ఒక్కొక్క భాగము గోడను రచించవలెను. దక్షిణమునను, ఉత్తరమునను, అర్ధవృత్తములను గీయవలెను. ముందు వెనుక కూడ ఆ వృత్తముల నను సరించవలెను ఈ వృత్త క్షేత్రమును 12 భాగములు చేయవలెను భద్రము 2 భా, విస్తారము 1 భా, భద్రములకు రథముల నుండి మధ్య 1 భాగము **విస్తారముండ**వలెను మాలాధరమున**కు** జేసినట్లే జలాంతరమును చేయ వలెను, వృత్తాయతము**గా** నుండవలెను. ఇది మలయ ప్రాసాదము. ఇటులే మాలాధరమును రచించిన యెడల మకరధ్వజ ప్రాసాదమగును.

(అనుబంధము 55, 56 పటములు చూడుడు)

## 107. రుచకము నుండి పుట్టిన 9 మిశ్ర ప్రాసాదములు

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ మిశ్రకాణా మధ్య బ్రూమో లక్షణానియథా క్రమామ్ ॥ 103
భద్రకస్యైవ సంస్థానే భద్రే శృంగం యదాభవేత్ ।
సుభద్రోనామ సంజ్ఞోఽయం కర్ణకూటైః కిరీటకః ॥ 104
పూర్వోక్తస్య యదాశృంగం భద్రంకేసరిణో భవేత్ ।
లతాఖ్యోక్తం తదాఽస్యాత్ సర్వతో భద్రసంజ్ఞితః ॥ 105
భద్రేశృంగం పరిత్యజ్య సింహంతత్రైవ కారయేత్ ।
మిశ్రయోగేత యోర్మిశ్ర సభవేత్ సింహకేసరీ ॥ 106
శ్రీవత్సస్యైవ సంస్థానే భద్రేకూటం నివేశయేత్ ।
శర్ణతేనైవ యోగేన ప్రతిశృంగో పశోభితమ్ ॥ 107

కలశైః సప్తదశభిః పద్మఘంటామవైః సహ ।
సచిత్రకూట ఇత్యుక్తో విచిత్ర శిఖరాన్వితః ॥ 108
కర్ణేభద్రే ప్రతిష్ఠానే పూర్ణేశృంగే యదాభవేత్ ।
అండకైః సప్త దశభి స్తదాస్యాత్ సధరాధరః ॥ 109
శ్రీవత్సస్యైవ సంస్థానే కర్ణేకూటం నివేశయేత్ ।
శృంగం భద్రోప భద్రేచ తదాతిలక ఉచ్యతే ॥ 110
యథాకర్ణే తథాభద్రే యోభవేచ్చిత్ర కూటవత్ ।
ఉత్తమాంగేచ యస్తద్వత్ సస్యాత్సర్వాంగ సుందరః ॥ 111
ప్రతిశృంగేషు సర్వేషు యదా కూటంనివేశ్యతే ।
మిశ్రకః సతు విజ్ఞేయః శ్రీనామ్నా చాంతికోఽంతికః ॥ 112
సర్వేకూటావృతాః కార్యాః సర్వే కార్యాశ్చతుర్ముఖాః ।
మిశ్రకా బహు శృంగాశ్చ కుటీసంజ్ఞాస్తతోఽపరే ॥ 113
ఇదంనావానాం మిశ్రణా మిహలక్షణ మీరితమ్ ॥

తా॥ భద్ర స్థానమున భద్రమునకు శృంగముండెనేని సుభద్రమగును కర్ణకూటములున్నచో కిరీటమగును. భద్రమున సింహములు శృంగము చేసినచో లతయగును. అదియే సర్వతోభద్రము అగును భద్రమున శృంగమును తీసివేసి సింహముల నుంచినచో సింహకే సరియగును. శ్రీ వత్సమునందు భద్రమునకు కూటములుంచినచో అవి 8 కర్ణమున ఉపకలశములతో 8 మహాకలశము 1 మొత్తము 17 కలశములు కలిగి చిత్రకూటమగును. కర్ణమునను భద్రమునను పెద్ద శృంగములను చేసినచో 17 అండకములు కలశములు కలిగి ధరాధరమగును కర్ణమున కూటముండి భద్రము ఉపభద్రము నలుదిశల నున్నచో తిలకమగును. కర్ణమునను భద్రమునను కూటములున్న యెడల సర్వాంగ సుందరమగును ప్రతిశృంగములన్నిటి యందును కూటములున్నచో శ్రీతిలకమగును. ఇవియన్నియును నలుచదరము కలిగియుండునది.

అపరాజిత 168వ సూత్రము

శ్లో॥ భద్రకస్య చ సంస్థానే భద్రే శృంగం యదాభవేత్ ।
సుభద్రో నామవిజ్ఞేయః కిరీటః కర్ణకూటతః ॥ 8
కేసరీచ భవేత్పూర్వం భద్రే శృంగం యదాభవేత్ లతాఖ్యః ।

సర్వతో భద్రః సర్వకామ ఫలప్రదః ॥ 9
భద్రే శృంగం పరిత్యజ్య సింహం తత్రైవ కారయేత్ ।
మిశ్రయోగేన యోమిశ్రః సభవేత్ సింహకేసరీ ॥ 10
శ్రీవత్సస్యైవ సంస్థానే భద్రేకూటం సువిశ్రుతః ।
కర్ణేతేనైవ యోగేన ప్రతిశృంగోప శోభితే ॥ 11
కుంభకైః సప్తదశభిః పద్మఘంటా ద్యలంకృతః ।
చిత్రకూటః సమాఖ్యాతో విచిత్ర శిఖరాన్వితః ॥ 12
కర్ణేభద్రే ప్రతిష్ఠానే పూర్ణం శృంగం యదా భవేత్ ।
అండకాః షోడశైకోవా సభవేచ్చ ధరాధరః ॥ 13
శ్రీవత్సస్య చ సంస్థానే కర్ణేకూటం నిధాపయేత్ ।
శృంగం భద్రోపభద్రేతు సనామ్నా తిలకః స్మృతః ॥ 14
యథాకర్ణే తథాభద్రే యోభవేచ్చిత్ర కూటవత్ ।
ఉత్తమాంగేషు యోగేషు సభవేత్ సర్వ సుందరః 15
ఈ శ్లోకములయర్థముపై తాత్పర్యము సమానమే ।

# 108. కేసరి మొదలగు 25 సాంధారముల వివరము

అపరాజిత 106వ సూత్రము

శ్లో॥ తలచ్ఛంద విభక్తాశ్చ గర్భభిత్తి భ్రమంతికాః ।
భ్రమణీ క్రమయోగేన సాందారాః శిఖరైర్యుతాః ॥ 34

తా॥ ఆలయ ప్రదేశమును విభజించి గర్భము గోడ, భ్రమంతిక, భ్రమణి శిఖరము మొదలగునవి కలవి సాంధారములు.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ కేసరి సర్వతో భద్రో నందనో నందిశాలకః ।
నంధీశో మందరాఖ్యశ్చ శ్రీవత్సశ్చామృతోద్భవః ॥ 18
హిమవాన్ హేమకూటశ్చ కైలాసః పృథివీజయః ।
ఇంద్రనీలో మహానీలో భూధరోరత్న కూటకః ॥ 19
వైడూర్యః పద్మరాగశ్చ వజ్రకోముకుటోజ్జ్వలః ।
ఐరావతో రాజహంసో గరుడో వృషభస్తథా ॥ 20
మేరుః ప్రాసాదరాజశ్చ దేవానామాలయోహిసః ।
సుసంయోగేతు సాంధారాన్ కథయామో యథావిధి ॥ 21

లతా త్రిపుష్కరాఖ్యౌచ పంచవక్త్ర శ్చతుర్ముఖః ।
నవాత్మకశ్చ నిర్గూఢః ప్రాసాదాః పంచ సంజ్ఞితాః ॥ 22

తా॥ 1 కేసరి 2 సర్వతో భద్రము 3 నందనము 4 నందిశాలము 5 నందీశము 6 మందరము 7 శ్రీ వత్సము 8 అమృతోద్భవము 9 మహివంతము 10 హేమకూటము, 11 కైలాసము 12 పృథివీజయము, 13 ఇంద్రనీలము, 14 మహానీలము, 15 భూధరము, 16 రత్నకూటము 17 వైడూర్యము 18 పద్మరాగము 19 వజ్రకము, 20 ముకుటోజ్జ్వలము 21 ఐరావతము 22 రాజహంసము, 23 గరుడము 24 వృషభము, 25 మేరుప్రాసాదరాజము లత త్రిపుష్కరము పంచవక్త్రము చతుర్ముఖము, నవాత్మకము, ఈ 5ను నిర్గూఢ ప్రాసాదములు.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ఆద్యః పంచాండకః కార్యః ప్రాసాదః కేసరీతియః ।
సర్వతో భద్రకోయస్తు విధేయః ననవాండకః ॥ 23
త్రయోదశాండక స్తుస్యాన్నందకో నామయో భవేత్ ।
నందిశాలస్తుయః ప్రోక్తః సస్యాత్ సప్తదశాండకః ॥ 24
అండకైరేకవింశత్యా నందీశః పరివారితః ।
పంచవింశాండ కోపేతం మందరం కారయేద్బుధః ॥ 25
శ్రీ వత్సః శస్యతేచైతే ష్వేకోన త్రింశతాండకైః ।
స్యాత్త్రయస్త్రిం శతాండైస్తు ప్రాసాదో హ్యమృతోద్భవః ॥ 26
అండవైః క్రియతే సప్త త్రింశతా హిమవానపి ।
సైకయా హేమకూటస్తు స్యాచ్చత్వారింశతాండకైః ॥ 27
పంచ చత్వారింశ తాండైః కైలాసో నామనామతః ।
భవత్యే కోన పంచాశ దండకః పృథివీజయః ॥ 28
ఇంద్రనీలశ్చయః ప్రోక్తః సత్రి పంచాశతాండకైః ।
సప్తపంచాశతాయుక్తో మహానీల స్తథాండకైః ॥ 29
ఏకషష్ట్యండకోపేతః ప్రాసాదో భూధరో భవేత్ ।
పంచ షష్ట్యండకైర్యుక్తో రత్నకూటః ప్రశస్యతే ॥ 30
నవషష్ట్యండకః కార్యో వైడూర్య శుభలక్షణః ।
త్రిసప్తత్యండకయుతః పద్మరాగో విధీయతే ॥ 31
అండకైః సప్త సప్తత్యా ప్రాసాదో వజ్రకాభిధః ।

ఏకాశీత్యండకోపేతో విధేయో ముకుటోజ్జ్వలః ॥ 32
ఐరావతస్తు పంచాశీ త్యండకః పరికీర్తితః ।
నవాశీత్యండవైర్యుక్తో రాజహంసః ప్రశస్యతే ॥ 33
త్రిణవత్యండ కోపేతః ప్రాసాదో గరుడాభిధః ।
నవత్యా సప్తయుతయా ప్రాసాదో వృషభోఽండకైః ॥ 34
శతేనైకోత్తరేణాండై ర్మేరుప్రాసాదరాట్స్మృత । ౩4
హరేర్హిరణ్య గర్భస్య భాస్కరస్య శివస్యచ ।
మేరురేష విధాతవ్యో నాన్యస్య త్రిదివౌకసః ॥ :5

తా॥ 5 అండకములు కేసరి 9 అం. సర్వతో భద్రము 13 అం. నందకము 17 అం. నందిశాల 21 అం నందీశమ 25 అం మందరము 29 అం. శ్రీవత్సము, 33 అం. అమృతోద్భవము 37 అం. హిమవంతము 41 అం. హేమకూటము 45 అం. కైలాసము 49 అం, పృధివీజయము 53 అం. ఇంద్రనీలము 57 అం. మహానీలము, 61 అం. భూధరము, 65 అం రత్నకూటము 69 అం వైడూర్యము, 73 అం. పద్మరాగము, 77 అం. వజ్రకము, 81 అం. ముకుటోజ్జ్వలము 8 అం. ఐరావతము 89 అం. రాజహంసము 93 అం. గరుడము 97 అం. వృషభము 101 అం. మేరుప్రాసాద విష్ణువు. బ్రహ్మ శివుడు సూర్యుడు వీరికి దప్ప యితర దేవతలకే మేరు ప్రాసాదమును రచించరాదు.

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ సాంధారాణా మతంః స్పష్టం ।
బ్రూమః సంప్రతి లక్షణమ్ ॥ 114
చతురశ్రీ కృతేక్షేత్రే భాగాష్ట కవిఒజితే ।
తస్యమధ్యే భవేద్గర్భో ద్విభాగో దేవతాలయః ॥ 115
భాగేనివేశయేద్భిత్తిః కుర్యాద్భాగేన కారికాం ।
బాహ్యః త్రింపునర్భాగే విధేయ స్తస్య సిద్ధయే ॥ 116
తస్యకర్ణేషు కర్తవ్యా రధికాశ్చ ద్విభాగికాః ।
శేషం భద్రం ప్రకర్తవ్యం ముదకాంతర భూషితమ్ ॥ 117
భాగేన నిర్గమందిక్షు సర్వాస్వేష భవేద్వీధిః ।
చతుర్భాగోచ్ఛ్రితా జంఘా ఖురకశ్చ తదర్ధతః ॥ 118
వరండ్యంతర పత్రంచ భాగేనైకేన కల్పయేత్ ।

షడ్భాగే శిఖరంమూతే శీర్షమంశ సముచ్ఛ్రితం ।
తస్యోచ్ఛ్రి యంత్రిథాకృత్వా వేణుకోశం సమావిఖేత్ ॥ 120
స్కంధకోశాంతరంతస్య చతుర్ధా విభజేత్తతః ।
పద్మశీర్షం తథాగ్రీవాం సార్ధేనాంశేన కారయేత్ ॥ 121
కుర్యాద్భాగేన భాగేన కుంభంచా మలసారకం భాగార్ధేన ।
ప్రకుర్వీత తదూర్ధ్వం బీజపూరకమ్ ॥ 122
ప్రాసాదః కేసరీనామ సర్వతః సంతతి ప్రియః ॥

తా॥ మొదట కేసరియను ప్రాసాదమునకు లక్షణమును చెప్పు చున్నాడు. సమానముగా నలుచదరమును చేయబడినప్రవేశమును 8.8 భాగ ములు చేసి గర్భము 2 భాగములును, గోడ చుట్టును 1 భాగమును, దాని వెంబడి కారిక 1 భాగమును, వెలుపలి గోడ 1 భాగమును చేయవలయును ఆ పైన కర్ణకూటములను, 2.2 భాగములను వాని మధ్య భద్రమునుజలాం తరములతో గూడ 4 భాగములును చేయవలెను. ఆ భద్రమునకు నిర్గమము 1 భాగమును, ఇట్లు నలువైపుల రచించవలెను జంఘ యెత్తు 4 భాగ ములు, పీఠము 2 భాగములును, వరండి అంతర పత్రము ఈ రెండును కలసి 1 భాగమును, ఆ పైన రథిక $1\frac{1}{2}$ భాగము విస్తారమును $3\frac{1}{2}$ భాగ ముల యెత్తును శిఖరము 6 భాగముల విస్తారమును ఎత్తు 7 భాగములను దాని యెత్తును 3 భాగములు చేసి వేణుకోశమును రచించవలెను. (అనగా విస్తారమునకు 3 రెట్లు యెత్తు) దాని యొక్క స్కంధకోశాంతరము 4 భాగ ములు చేయవలెను. పద్మము మొగ్గవలె నుండవలెను. గలము $1\frac{1}{2}$ భాగము చేయవలెను. కుంభము 1 భాగమును, స్తూపిక 1 భాగమును, ఆపైన కల శము ½ భాగమును చేయవలెను. దీనికి మొత్తము 5 శిఖరములయినవి.

(అనుబంధము 57వ పటము చూడుడు)

ఇది కేసరియను ప్రాసాదము సర్వత్ర సంతానమును సంతోషమును కలిగించును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే అష్టాష్టక విభాజితే ।
భాగభాగం భ్రమభిత్తి ద్విభాగోదేవతాలయః ॥ 9
నిరంధారే పదా భిత్తిరర్ధం గర్భం ప్రకల్పయేత్ ॥
మధ్యచ్ఛందశ్చ వేదాశ్రో బాహ్యే కుంభాయతం శృణు ॥ 10
క్షేత్రార్ధేచ భవేద్భద్రం భద్రార్ధం కర్ణ విస్తరః ।

కర్ణస్యార్ధ ప్రమాణేన కర్తవ్యో భద్ర నిర్గమః ॥ 11
చతుష్కర్ణేషు స్థానాని శ్రీవత్స శిఖరాణిచ ।
రథికోద్గమేచ పంచైవ కేసరీ గిరిజాప్రియః ॥ 12

అనగా సాంధారమున గర్భమున కంటె నిరంధారమున గర్భము విస్తారము చేయవలయునని. యిందు చెప్పబడియున్నది. ఎట్లనగా (మధ్య 2 భాగములు గర్భమును చుట్టును 1 భాగము గోడయును మొత్తము 4 భాగములు)

## 109. సర్వతో భద్రము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతురశ్రం సమంకృత్వా భూమి భాగం విచక్షణః ॥ 123
ప్రాసాద వ్యాసతః కుర్యాజ్జగతీం ద్విగుణామిహ ।
విదధ్యాజ్జగతీ పీఠం ప్రాసాదార్ధ సముచ్ఛ్రితం ॥ 124
పీఠస్యో పరిసంస్థాప్య ప్రాసాదం విభజేత్తతః ।
సర్వతో భద్ర సంస్థానం హస్త సంఖ్యాయదా భవేత్ ॥ 125
హస్తైః సప్తత్రింశతాతు జ్యేష్ఠః సార్ధో ఉదాహృతః ।
మధ్యమః సప్తవింశత్యా ప్రాసాదః స్యాత్ కలాధికైః ॥ 126
కనీయాన్ పంచదశభిః ప్రాసాదః సముదీరితః ।
తలచ్ఛందో యదాహ్యేషాం తథాచై వోర్ధ్వతోగతః ॥ 127
జ్యేష్ఠ మధ్య కనిష్ఠానాం తథా సమ్యక్ నిగద్యతే ।
చతురశ్రీ కృతేక్షేత్రే శతమూల విభాజితే ॥ 128
న్యసేత్త న్మధ్యతో గర్భం చతుర్వర్గ పదాన్వితం ।
గర్భపాదేన భిత్తిః స్యాత్ తద్వ దేవాంధకారికా ॥ 129
బాహ్య భిత్తిస్తథైవస్యాత్ దశశః స్యుర్విభాగికా ।
ప్రతివర్గ పదాంశేన షోడశేన జలాంతరమ్ ॥ 130
శేషం భద్రం ప్రకర్తవ్యం గర్భార్ధేన వినిర్గతమ్ ।
భాగార్ధం క్షోభయేత్పార్శ్వే నిర్గమంచ తథాచరేత్ ॥ 131
శేషః స్యాద్భద్ర విస్తారః పంచభాగా యతస్తథా ।
పీఠం తస్యైవ కర్తవ్యం సార్ధద్వయ సముచ్ఛ్రితం ॥ 132
ద్విగుణాంచ తథాజంఘా ముచ్ఛ్రయేణాస్య కల్పయేత్ ।
మేఖలా మర్ధభాగేన భాగేనాంతర పత్రకం ॥ 133

ప్రథమా రథికాత్రత్ర కార్యా భాగత్రయోచ్ఛ్రితా ।
ద్వితీయారథికాయాసా సార్ధ భాగేనచోచ్ఛ్రితా ॥ 134
భాగే భాగేఽంతరంకార్య ముపర్యు పరిచోభయోః ।
షడ్భాగాన్ విస్తృతం కుర్యాచ్ఛిఖరం సప్తమోచ్ఛ్రిత ॥ 135
ఏవం భూమి ఖరష్టాభిః కుర్యాదేనం విచక్షణః ।
జల నిర్గమ విచ్ఛిన్నారథాః ప్రతిరథా స్తథా ॥ 136
చతుర్గుణైః పృథక్ సూత్రైః పద్మకోశం సమాలిఖేత్ ।
మంజరీ లలితా కార్యా నీలోత్పల దలాకృతిః ॥ 137
గ్రీవా చైకార్ధ భాగేన భాగేనామలసారకం ।
పద్మశీర్షంచ కర్తవ్యం గ్రీవామానేన ధీమతా ॥ 138
సార్ధభాగేన సోష్ణీషః పద్మస్యో పరికుంభకః ।
సర్వతో భద్ర ఇత్యుక్త ఏషానామాతి శోభితః ॥ 139
విధాయ సర్వతో భద్రం దేవానామాలయం ।
శుభం లభతేపరమం లోకం దివి స్వచ్ఛంద భాషితః ॥ 140

తా॥ భూమిని నలుచదరముగా జేసి ప్రాసాదము యొక్క విస్తారమునకు రెట్టింపుగా జగతిని చేయవలెను. ఆ జగతి పీఠము ప్రాసాదములో సగము యెత్తును చేసి ఆ పీఠము పైన ప్రాసాదమును రచించవలెను. సర్వతోభద్రము 37½ హస్తములు ఉత్తమము 27 హస్తములపై 1 కలఅధికము మధ్యమము, 15 హస్తములు అధమము తలచ్ఛందము ననుసరించి యెత్తును నిర్ణయించవలెను. ఆ చతురస్రమును 10 10 భాగములు జేసి దాని మధ్య 4 భాగములు గర్భమును, గోడ 1 భాగమును, అంధకారిక 1 భాగమును, వెలుపలి గోడ 1 భాగమును, కర్ణము 2 భాగములునుమధ్య 6 భాగములు భద్రమును మరల భద్రము నుండి 5 భాగముల ప్రదేశమును ముందుకు 1 భాగము నిర్గమము చేయవలెను. శేషించిన 1 భాగమును రెండు వైపుల ఖండించవలెను. అప్పుడు భద్రము యొక్క విస్తారము 5 భాగములగును. దానికి పీఠము 2½ భాగముల యెత్తును జంఘ 5 భాగముల యెత్తును, మేఖల ½ భాగమును అంతర పత్రము 1 భాగమును మొదటి రథిక 3 భాగముల యెత్తును, రెండవ రథిక 1½ భాగముల యెత్తును, భాగ భాగమునకు పైన అంతర పత్రమును చేయవలెను శిఖరము విస్తారము 6 భాగములును, ఎత్తు 7 భాగములును, చేయవలెను. ఇట్లు 8 అండకములను చేయవలెను. జల నిర్గమములను ఖండించి రథ

ములును, ప్రతి రథములను, చేయవలెను. 4 భాగములుగల సూత్రముతో పద్మకోశమును లిఖించవలెను. దళములతో మంజరిని చక్కగా రచించవలెను మొత్తము 9 కలశములు కలవియగును గలము ½ భాగమును, శిఖరము 1 భాగమును, పద్మము యొక్క మొగ్గను గ్రీవ ప్రమాణమున రచించవలెను దానిపైన 1½ భాగము కుంభమును రచించవలెను. (ఉష్ణీవము ఇట్లు చేసిరేని సర్వతోభద్రమగును

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ క్షేత్రే విభక్తే దశధా గర్భః షోడశకోష్టకైః ।
భిత్తిం భ్రమంచ భిత్తించ భాగభాగం ప్రకల్పయేత్ ॥ 13
ద్విభాగః కర్ణ ఇత్యుక్తో భద్రం షడ్భాగికం తథా ।
నిర్గతం చైకభాగేన భాగికా పార్శ్వశోభణా ॥ 14
కర్ణికాచార్ధ భాగేన భాగార్ధం భద్ర నిర్గమం ।
భాగత్రయంచ విస్తారే ముఖ భద్రం విధీయతే ॥ 15
భద్రే వైతూద్గమాః పంచ కర్ణే ఒష్టశృంగకానిచ ।
శ్రీవత్స శిఖరం కార్యం ఘంటా కలశ సంయుతమ్ ॥ 16

తా॥ క్షేత్రమును 10 భాగములు చేసి అందు గర్భము 4 భా, గోడ 1 భా, అంధకారిక 1 భా, మరల గోడ 1 భా, చేసి పైన కర్ణకూటము 2 భా, భద్రము 6 భాగములు, అ భద్రమును రెండు వైపుల ½ భాగము చొప్పున తగ్గించి మధ్య 5 భాగములు ముందుకు 1 భాగము నిర్గమమును, మరల కర్ణిక ½ భా, భద్రము యొక్క నిర్గమము ½ భాగమును, 3 భాగముల విస్తారమును కలుగునట్లు ముఖ భద్రమును రచించవలెను. కర్ణముల యందెనిమిదియును శిఖరమున నొకటియును 9 కలశములగును (భద్రములయందుకూడ కలశములను 4 స్థాపించినచో 13 కలశములు కూడనగును)

# 110. నందనము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతురశ్రీకృతేక్షేత్రే దశధా ప్రవిభాజితే ।
వ్యాస పాదేన గర్భః స్యాత్తదర్ధా దంధకారికా ॥ 141
జంఘాస్కంధశ్చితం కర్ణం భద్రంచాప్యస్య యద్భవేత్ ।
సర్వతో భద్ర వత్సర్వం తద్విధేయం చతుర్దిశం ॥ 142
తస్య భద్రాణి సర్వాణి భిత్తిభిః పరివేష్టయేత్ ।

భద్రే భద్రే పునశ్చాస్య వర్ధమానం నివేశయేత్ ॥ 143
పంచ భాగ స్తథా సార్ధాః శిఖరస్యోదయో భవేత్ ।
సర్వతో భద్రకాకారా రథకాశ్చాత్ర కారయేత్ ॥ 144
కుర్యాత్ షడంశ విస్తీర్ణ శిఖరంతు తథోచ్ఛ్రితం ।
సర్వతో భద్ర సంస్థానా దేషాంచా ప్యత్ర యోజయేత్ ॥ 145
గ్రీవా చామలసారంచ కుంభశ్చా పితథా భవేత్ ।
ప్రాసాదో నందనోనామ కర్తవ్యో దేవతాలయః ॥ 146
కృతేఽస్మిన్నందతి స్వామీ దురితానిచ నిర్దహేత్ ।

తా॥ క్షేత్రమును **10** భాగములు చేసి గర్భము **5** భాగములు, గోడ **2½** భా, సాంధారమునకు గర్భము **2½** భా, గోడ **1¼** భా, వెలుపలి గోడ **1¼** భాగమున 'భ్రమందిక **1¼** భాగము చేయవలెను. జంఘ స్కంధము కర్ణము భద్రము మొదలైనవి సర్వతో భద్రము వలెనే నలువైపుల చేయవలెను అయితే భద్రము లన్నియును గోడతో చుట్టు బడియుండవలెను. ప్రతి భద్రమునను వర్ధమానమును నివేశము చేయ వలెను. పొడవు **5½** భాగములతో లిఖించవలెను. రథములను సర్వతో భద్రమునందు చేసినట్లే చేయవలయును. వాని యొక్క పొడవు **6** భాగ ములు చేయవలెను. మధ్య గలమును, అమలసారమును, కుంభమును అదే ప్రకారముగా చేయవలయును మొత్తము **13** శిఖరములగును. దీనిని నందన ప్రాసాదమందురు. ఇది సమస్త పాపములను హరింపజేయును.

అపరాజిత 159వ సూత్రమున

శ్లో॥ శ్రీవత్స భద్రమారూఢే రథికోద్గమ భూషితే ।
నందనే నందతిస్వామీ దురితం హరవిధ్రువం ॥ 17

అనగా శ్రీవత్సము నందు జేసినట్లే భద్రములయందు కర్ణకూటము లను జేసినచో నందనమగును.

## 111. నందిశాల

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ భక్తే ద్వాదశధా క్షేత్రే చతురశ్రీ కృతేతతః ॥ 147
సప్తవర్గ పదోగర్భో భిత్త్యాసహ విధీయతే ।
సపాదపాదికా భిత్తిః గర్భే కుర్యా ద్విచక్షణః ॥ 148
బాహ్యభిత్తిశ్చ తద్వత్ స్యాత్ తద్వచ్చాప్యంధ కారికా ।
పీఠోచ్ఛ్రయ స్తథా జంఘా కర్ణేషు రథికాశ్చయోః ॥ 149

ఏకైకాం రథికాంచాన్యాం విన్యసే త్ప్రకయోర్ద్వయోః ॥ 150
చతస్రో రథికాశ్చైవం కర్ణే కర్ణే నివేశయేత్ ।
శేషో భద్రస్య విస్తారః స్వవిస్తారార్ధ నిర్గతః ॥ 151
భూషయేత్ సింహకర్ణైశ్చ భద్ర వ్యాసార్ధ మున్నతైః
విన్యసేచ్ఛిఖరంతత్ర భాగైర్విస్తృత మష్టభిః ॥ 152
చతుర్గుణేన సూత్రేణ వేణుకోశం సమాలిఖేత్ ।
స్కంధకోశాంతరం చాస్య త్రిభిర్భాగైర్వి భాజయేత్ ॥ 153
గ్రీవార్ధ భాగికోత్సేధా ద్భాగేనా మలసారకః ।
పద్మశీర్షం తథార్ధేన భాగేన కలశః స్మృతః ॥ 154
త్రిపాదారథికా స్తిస్ర ఉచ్ఛ్రాయేణ ప్రకీర్తితాః ।
సర్వతో భద్రకాకారో నందిశాలః ప్రకీర్తితః ॥ 155

తా॥ క్షేత్రమును 12 భాగములు చేసి అందు గర్భము 4½ భాగములు గోడ 1¼ భాగము, అంధకారిక 1¼ భాగము మరల గోడ 1¼ భాగము,చేయ వలెను పీఠము యెత్తు జంఘ, కర్ణములయందు రథములు, సర్వతో భద్ర మున చేసినట్లే చేయవలెను. ఒక్కొక్క రథమును యిరువైపుల చేయ వలెను, ఇట్లు నాలుగు మూలల నాలుగు రథములను చేయవలెను. మిగిలి నది భద్రము యొక్క విస్తారమును చేయవలెను. ఆ విస్తారములో సగము నిర్గమమును చేయవలెను, భద్రమున ఎత్తైన సింహ కర్ణములను రచించియచట శిఖరము నుంచవలెను. 8 భాగములు శిఖరము యొక్క విస్తార ముండవలెను. 4 భాగములు గల సూత్రముచేత వేణుకోశ మును లిఖించవలెను స్కంధకోశాంతరము 3 భాగములు చేయవలెను. గలము ½ భాగము, అమలసారము 1 భాగము, పద్మము మొగ్గ ½ భాగము కలశము 1 భాగము, రథిక ¾ భాగమును దాని యెత్తు 3 భాగములును, చేయవలెను. దీనికి 17 కలశములుండును. సర్వతో భద్రమువలెనే నంది శాల ప్రాసాదముండును.

అపరాజిత పృచ్ఛ 159వ సూత్రము

శ్లో॥ తస్యోర్ధ్వోద్భవాష్ట శృంగం భద్రం తస్యాను రూపతః ।
నందిశాలోగుణైర్యుక్తః స్వరూపో లక్షణాన్వితః ॥ 18

అనగా సర్వతో భద్రమున కంటె 8 శిఖరములు అధికము కలిగినది నందిశాలయగును.

(అనుబంధము 58, 59 పటము చూడుడు)

# 112. నందీశము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ నందిశాలస్య సంస్థానే తద్రూపే సమవస్థితే ।
తస్య భద్రాణి సర్వాణి భిత్తిభిః పరివేష్టయేత్ ॥ 156
భద్రే భద్రే తస్య తస్య వర్ధమానం నివేశయేత్ ।
అర్ధషష్ఠాం స్తథా భాగాన్ స్యాద్భద్ర శిఖరోచ్ఛ్రియః ॥ 157
పీఠోచ్ఛ్రాయంచ జంఘాచ తథాస్య శిఖరోచ్ఛ్రియం ।
నందిశాల సమాకారం సమమేవ ప్రకల్పయేత్ ॥ 158
కార్యోఽయం సర్వదేవానాం ప్రాసాదో నంది వల్లభః ॥

తా॥ పై జెప్పిన నందిశాల ప్రాసాదమునే భద్రములన్నిటికిని చుట్టు గోడను రచించి ప్రతి భద్రమునను వర్ధమానమును చేయవలెను. ఆ భద్రముల యొక్క విస్తారము 3 భాగము లుండవలెను. వాని శిఖరముల యెత్తును పీఠము యెత్తు, జంఘ, దానిపై శిఖరము, ఇవి యన్నియును నందిశాలవలెనే చేయవలెను. దీనిని నందీశమని చెప్పుదురు.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ త్రిభాగంచ భవేద్భద్రం భద్రార్ధం ప్రరథ స్తథా ।
కర్ణే శృంగద్వయం భద్రే ఏకైకం ప్రరథేతథా ॥ 19

అనగా భద్రము 3 భాగములును, ప్రరథములు $1\frac{1}{2}$ భాగములును కర్ణమున 2 శృంగములును, భద్రమున 2 శృంగములును, ప్రరథమున 1 శృంగమును, ఇట్లు మొత్తము 21 కలశములు కలది నందీశమగును.
(అనుబంధము 60వ పటము చూడుడు)

# 113. మందరము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ నందివల్లభ సంస్థానం పూర్వవత్పరి కల్పయేత్ ॥ 159
ఉభయోః కర్ణయోర్మధ్యే తత్రరథికేస్థితే ।
తయోశ్చ పరికర్తవ్యం శిఖరం లక్షణాన్వితం ॥ 160
షడంశ విస్తృతం చైవత్సార్ధ షట్క సముచ్ఛ్రితం ।
చతుర్గుణేన సూత్రేణ వేణుకోశం సమాలిఖేత్ ॥ 161
గ్రీవా చామలసారంచ కుంభకస్యాత్రయో భవేత్ ।

కార్యాః స సర్వతో భద్ర సంస్థాన ఇతి నిశ్చయః ॥ 162
మందరోఽయమితిఖ్యాతః ప్రాసాదః క్షితిభూషణః ॥

తా॥ నందివల్లభ ప్రాసాదమును మునుపటివలెనే చేసి రెండు కర్ణముల మధ్య రథములను శిఖరములతో రచించవలెను. శిఖరము యొక్క విస్తారము 6 భాగములును, ఎత్తు 6½ భాగములును, చేసి 4 రెట్లు గల సూత్రముతో వేణుకోశమును లిఖించవలెను గలము, ఆమలసారము, కుంభము, ఇవియన్నియును సర్వతో భద్రమువలెనే చేయవలయును దీనిని మందర ప్రాసాదమందురు. 25 కలశములతో నుండును

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ ద్వాదశాంశస్తు విస్తారో మూల గర్భస్తదర్ధతః ।
భాగ భాగంతు కర్తవ్యా ద్వేభిత్తి చాంధకారికా ॥ 20
కర్ణ ప్రరథ భద్రార్థం కారయేత్ ద్విద్విభాగతః ।
ప్రరథం సమనిష్కాసో భద్రం భాగేన నిర్గతం ॥ 21
కర్ణేద్వే భద్రకే ద్వేచ చైకం ప్రతిరథే తథా ।
సఘంటా కలశారేఖా రథికోద్గమ భూషితా ॥ 22

అనగా విస్తారమును 12 భాగములు చేసి ప్రధాన గర్భము 6 భాగములును, గోడలు 2 ను అంధకారిక 1 యును ఒక్కొక్క భాగము చొప్పున చేసి ఆ పైన 4 భాగములు మధ్య భద్రమును చేసి కర్ణమును ప్రరథమును 2.2 భాగముల చొప్పున చేయవలెను. ప్రరథము సమానముగా నుండును. భద్రము మాత్రము 1 భాగము నిర్గమము కలిగి యుండును. కర్ణమున 2ను, భద్రమున 2ను, ప్రతిరథమున 1యును, ఘంటతో గూడిన ప్రధాన కలశమును మొత్తము 25 కలశములగుచున్నవి. ఇది మందరము.

# 114. శ్రీ వత్సము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ నందివల్లభ సంస్థానే తద్రూప సమవస్థితే ॥ 163
దిక్సూత్రే కర్ణసూత్రేచ కుంభవత్ రథికాష్టకం ।
రథికా అపిచైతాః స్యుర్ద్వి భాగాయత విస్తృతాః ॥ 164
షడ్భాగ విస్తృతి శ్చాస్య శేషం శిఖర మాచరేత్ ।
ఉచ్ఛ్రయశ్చాస్య కర్తవ్యో భాగానాం సార్ధ సప్తకం ॥ 165
షడ్భాగః స్కంధ విస్తారో గ్రీవాచాస్య ద్విభాగికా ।

రేఖాచామల సారంచ కలశశ్చాత్రయో భవేత్ ॥ 166
సర్వతో భద్రవత్ సస్యాచ్ఛ్రీ వత్సో యముదాహృతః ॥

తా॥ నందివల్లభ స్థానమున దిక్సూత్రము నందును కర్ణ సూత్రము నందును రథములను 2 భాగములు అయత విస్తారములతో చేయవలెను. శిఖరము యొక్క విస్తారము 6 భాగములు చేయవలెను. మొత్తము 14భాగములని తెలియవలెను. శిఖరము యెత్తు $7\frac{1}{2}$ భాగములుండవలెను స్కంధ విస్తారము 6 భాగములును, గ్రీవ 2 భాగములు, రేఖ, అమలసారము, కలశము, ఈ మూడును సర్వతో భద్రమువలె నుండును. 29 కలశములుకలిగి శ్రీవత్సమనిపించుకొనును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ చతుర్దశాంశ విస్తారే గర్భశ్చాష్టాంశే విస్తరః ।
భాగభాగం భ్రమోభిత్తిర్బాహ్య భిత్తిస్తు భాగికా ॥ 23
కర్ణేశృంగ ద్వయం కుర్యాచ్ఛిఖరం చాష్ట విస్తరం ।
ప్రరథః కర్ణమానేన తిలకం శృంగకోపరి ॥ 24
నందికాయాంచ తిలకం భద్రే శృంగత్రయం భవేత్ ।
శ్రీవత్సస్తు సమాఖ్యాతః కర్తవ్యస్తు శ్రియఃపతేః ॥ 25

అనగా విస్తారమును 14 భాగములు చేసి గర్భము 8 భాగములును, గోడ భ్రమము (అంధారము) వెలుపలి గోడ ఇవి ఒక్కొక్క భాగమును చేసి పైన కర్ణమున 2 శృంగములును, శిఖరము 8 భాగముల విస్తారమును ప్రరథము కర్ణ మానమున చేయువలెను శృంగముపైన తిలకములనురచించవలెను. నందిక యందును తిలకమును చేయవలెను భద్రమున 3శృంగములును, చేయవలెను ఇవి విష్ణువునకు ప్రశస్తము దీనిని శ్రీవత్సమందురు. 29 కలశములుండును.

(అనుబంధము 61వ పటము చూడుడు)

# 115. అమృతోద్భవము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే చతుర్దశ విభాజితే ॥ 167
ద్విభాగ విస్తృతాః కర్ణా రథికాస్తేషు కారయేత్ ।
ఉదకాంతర విచ్ఛిన్నా మూల కర్ణేషు యోజయేత్ ॥ 168
శేషం భద్రస్య విస్తార స్తదర్ధమపి నిర్గమః ।

సర్వతో భద్రమ ప్యస్య భద్రే భద్రే విభజ్యచ ॥ 169
పూర్వై ర్వర్గుణైస్తు సంయుక్తే చతుర్దిక్షు నివేశయేత్ ।
తస్య గర్భస్తు కర్తవ్యః పదషష్ఠక విస్తృతః ॥ 170
సార్ధభాగ ప్రమాణం స్యాద్భిత్తి గర్భస్య మధ్యతః ।
బాహ్య భిత్తిస్తథైవాస్య శేషం భ్రమణమా చరేత్ ॥ 171
జంఘా షడ్భాగ ముత్సేధాత్ పీఠం తస్య తదర్ధతః ।
వరండీ మంతరం పత్రం భాగేనైకేన కారయేత్ ॥ 172
రథికా ద్వాదశ విస్తారాను పర్యుపరియోజితాః ॥
తిస్రస్తిస్రో నివేశ్యాఃస్యుః కర్ణేకర్ణే యథాక్రమం ॥ 173
ప్రథమా రథికా స్తస్య కుర్యాద్భాగ త్రయోచ్ఛ్రితాః ।
కుర్యాదు పర్యుపర్యంతాః పాదపాద వివర్జితాః ॥ 174
అష్టభిర్విస్తృతం భాగైః సార్ధైర్నవ భిరుచ్ఛ్రితం ।
సర్వతో భద్రకాకారం శిఖరం తస్య కారయేత్ ॥ 175
ప్రాసాదోఽయంవిమానాఖ్యః ప్రఖ్యాతశ్చామృతోద్భవః ॥

తా॥ క్షేత్రమును 14 భాగములు చేసి గర్భము 6 భాగములును, గోడ $1\frac{1}{2}$ భాగమును, వెలుపలి గోడ $1\frac{1}{2}$ భాగమును, మిగిలినది అంధకారికను 1 1 భాగము చేయవలెను కర్ణములు 2 భాగముల విస్తారము వాని యందు రథికలను చేయవలయును ప్రధాన కర్ణముల యందు జలాంతరమును రచంచవలెను మిగిలినది భద్రమును చేయవలెను. అందులో సగము నిర్గమమును చేయవలెను. సర్వతో భద్రమునందువలె దీనికిని నలుదిశల భద్రములను రచించవలెను. జంఘ 6 భాగములును, పీఠము అందులో సగము 3 భాగములును, వరండియును అంతర పత్రమును కలసి 1 భాగమును, రథికలను 12ను వరుసగా పైన పైన 3.3 చేయవలెను. మొదటి రథిక 3 భాగముల యెత్తును, దానిపై రథిక $\frac{1}{4}$ భాగము తక్కువయును, దానిపై రథిక $\frac{1}{2}$ భాగము తక్కువయును. ఇట్లు వరుసకు ఒక పాతిక భాగము తక్కువ చొప్పున రచించవలెను. 8 భాగముల విస్తారమును, $9\frac{1}{2}$ భాగముల యెత్తును కలుగునట్లు సర్వతో భద్రమువలె శిఖరమును నిర్మించవలెను. 33 కలశములతో నుండును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ కర్ణేశృంగ త్రయం కుర్యాత్ప్రరథః పూర్వకల్పితః ।

అనగా కర్ణమున 3 శృంగములును ప్రథమును మునుపటివలెనే చేయవలయును.

(అనుబంధము 62, 63 పటములు చూడుడు)

# 116. హిమవంతము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ద్వి సప్తాయత విస్తారం హిమవంతం విభాజయేత్ ॥ 176
చతుర్ధా రధికాస్తత్ర కర్ణేకర్ణే నివేశయేత్ ।
ద్విభాగ విస్తృతాః సర్వా ఉపర్యు పరికారయేత్ ॥ 177
ప్రథమాభూమికాతస్య స్యాచ్ఛభాగ త్రయోచ్ఛ్రితా ।
పాదపాద విహీనాస్తు క్రమేణో పరిభూమయః ॥ 178
నందిశాల గుణైర్యుక్తం శిఖరం చాత్ర కారయేత్ ।
సర్వతో భద్ర వన్మధ్యే భూమికాశ్చ సమాచరేత్ ॥ 179
ద్విభాగారధి కాస్తస్య సర్వాభాగ త్రయోచ్ఛ్రితాః ।
ద్వితీయ భూమి రధికా భూమ్యుచ్ఛ్రయేణ కారయేత్ ॥ 180
శిఖరస్యోచ్ఛ్రయః కార్యః సపాదవ్యాసస మ్మితః ।
అమృతోద్భవ వజ్జంఘా పీఠంచాత్ర తథాభవేత్ ॥ 181
జాతి శుద్ధో భవత్యేష హిమవాన్ భువనోత్తమః ॥

తా॥ విస్తారమును 14 భాగములు చేసి రధికలను 4 కర్ణములయందు చేయవలెను. రధికలు 2 భాగములు విస్తారముతో పైన పైన చేయవలయును మొదటి అంతస్తున రధిక 3 భాగముల యెత్తు చేయవలెను. తరువాత ఒక్కొక్క అంతస్తుకు పాతికవంతు చొప్పున తగ్గించుచుండవలెను. నందిశాలవలె శిఖరమును చేయవలెను. సర్వతో భద్రమువలె మధ్య భూమికలను చేయవలెను. రధిక విస్తారము 2 భాగములును, ఎత్తు 3 భాగములును చేయవలెను. రెండవ యంతస్తున దాని యెత్తును బట్టి చేయవలెను. శిఖరము యొక్క యెత్తు విస్తారము కంటె పాతికవంతు యెక్కువ చేయవలెను. అమృతోద్భవమునకు జేసినట్లే జంఘ పీఠము చేయవలెను. జాతి శుద్ధముగా చేసిన యెడల హిమవత్ ప్రాసాదమగును. దీనికి 37 కలశము లుండును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ ద్వేద్వే శృంగే ప్రతిరథే త్వమృతోద్భవ సంస్థితౌ ।
హిమవాన్ద్వే ఉరఃశృంగే పూజ్యః సురనరోరగైః ॥ 27

అనగా శృంగములు ప్రతిరథమున 2.2 ను, అమృతోద్భవమునందు వలె రచించి ఉరఃశృంగమునను కూడా కలశములను నిలిపిన యెడలహిమ వంతమగును.

(అనుబంధము 64, 65 పటములు చూడుడు)

## 117. హేమకూటము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ హిమాచలస్య సంస్థానే తద్రూపే సమవస్థితే ॥ 182
తస్య భద్రేషు సర్వేషు వర్ధమానంచ యోజయేత్ ।
భాగషట్క ప్రవిస్తారం తదర్ధేన వినిర్గతం । 183
భాగైః సప్తభిరప్యస్య సార్ధైః స్యాచ్ఛిఖరోచ్ఛ్రయః ।
శిఖరస్యాగ్రతః స్తంభం సింహకర్ణైర్విభూషయేత్ ॥ 184
దిక్స్వాత్రైరస్య సర్వేషు క్రియాం ప్రాగ్వత్ ప్రకల్పయేత్ ।
జంఘోత్సేధశ్చకర్ణశ్చ శిఖరం చాస్యయద్భవేత్ ॥ 185
హిమవత్స దృశం సర్వం విధేయం తద్విజానతా ।
హేమకూట ఇతిఖ్యాతః ప్రాసాదోఽయంజగత్త్రయే ॥ 186
ఏషత్రి భూమి నిలయః కార్యోనాన్యస్య కస్యచిత్ ।

తా॥ హిమవత్ప్రాసాదమునే అన్ని భద్రములయందు వర్ధమానమును చేసి 6 భాగముల విస్తారమును, అందులో సగము నిర్గమమును, 7½ భాగములు శిఖరము యెత్తును, శిఖరము యొక్క ముందు స్తంభమును సింహ కర్ణములతో నలంకారమును చేయవలెను దిక్స్వాత్రముల చేత అన్నిటియందును పూర్వము వలెనే చేయువలెను. జంఘ యెత్తును, కర్ణమును, శిఖరమును, హిమవంతము వలెనే రచించవలెను. ఇది మూడంతస్తులు కలిగియుండును. 41 కలశములతో నుండవలెను దీనిని హేమకూటమందురు.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ ఉరః శృంగత్రయం భద్రే నందికా తిలకాన్వితా ।
హేమకూటస్తదానామ ప్రకర్తవ్య స్త్రి భూమికే ॥ 28

అనగా భద్రమున ఉరఃశృంగములు 3ను నందిక యందు తిలకములును 3 అంతస్తులును కలది హేమకూటము.

(అనుబంధము 66, 67 పటములు చూడుడు)

# 118. కైలాసము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ హిమవత్తుల్య సంస్థానం ప్రాసాదం పరికల్పయేత్ ॥ 187
తస్య మధ్యే విధాతవ్యః సర్వతో భద్ర సంజ్ఞితః ।
వర్జనీయంతు తన్మధ్యే వర్ధమాన నివేశనం ॥ 188
తతః స్థానేషు సర్వేషు ఖండరేఖా నివేశయేత్ ।
వ్యాసోచ్ఛ్రితైస్తతః సింహ కర్ణైర్భద్రం విభూషయేత్ ॥ 189
ఊర్ధ్వంచ శిఖరం తస్య వర్జనీయం విచక్షణైః ।
ద్వేద్వే చరథికే కార్యే సపాదద్వ్యంశ కోచ్ఛ్రితీ ॥ 190
తయోశ్చోపరి విస్తారా చ్ఛిఖరం చతురశ్రకం ।
ఉచ్ఛ్రయః పంచభిః సార్ధైర్విధేయః శిఖరస్యచ ॥ 191
దిక్సూత్రేషుచ సర్వేషు క్రియామేవం ప్రకల్పయేత్ ।
బాహ్యారేఖాతు జంఘాచ హిమవత్స దృశీస్మృతా ॥ 192
కైలాసోయమితిఖ్యాతః కర్తవ్యః శూలపాణియే ।

తా॥ హిమవంతముతో సమానముగా ప్రాసాదమును రచించి దాని మధ్య సర్వతో భద్రమును కల్పించి వర్ధమానమును మాత్రము తగ్గించ వలెను. అన్ని స్థలములయందును ఖండ రేఖల నుంచవలెను. భద్రమున వ్యాసముతో సమానమైన యెత్తున సింహ కర్ణములను నిర్మించవలెను దానికి పైన శిఖరమును చేయుగూడదు. 2.2 రథికలనురచించవలెను. అవి $2\frac{1}{4}$భాగ ముల యెత్తుండవలెను. వాని పైన విస్తారము నుండి శిఖరమును నలుచద రముగా చేయవలెను. ఆ శిఖరము యొక్క యెత్తు $5\frac{1}{2}$ భాగములుండ వలెను. అన్ని దిశలను దిక్సూత్రముల ననుసరించి చేయవలయును. వెలు పలి రేఖ యందు జంఘ హిమవంతమున జేసినటులే చేయవలెను. 45 కల శములు కలిగియుండవలెను. దీనిని కైలాసమందురు. శివప్రియమైనదని తెలియవలెను.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ నందికాగ్రాంతతః శృంగం రేఖాశ్చ తిలకోత్తమాః ।
కైలాసశ్చతదానామ ఈశ్వరస్య సదాప్రియః ॥ 29

అనగా నందికముల యొక్క పైన శృంగము రేఖలు తిలకములు కలిగియున్నచో శివప్రియమైన కైలాసమగును.

# 119. పృథివీజయము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ఏతస్యైవ యదా భద్ర ముచ్ఛ్రితం సింహ కర్ణకైః ॥ 193
ద్వేద్వేచ రథికేతత్ర దీయేతేసు మనోరమే।
శేషః శిఖర విస్తారః పంచభాగ సముచ్ఛ్రితః ॥ 194
ప్రాగ్గ్రీవకాశ్చ భద్రేషు భాగభాగ వినిర్గతాః।
విస్తారేణ చతుర్భాగా దిక్షు సర్వాస్వయం విధిః ॥ 195
విమాన సదృశీచాస్య బాహ్యరేఖా విధీయతే।
గుణైరేభి స్తదాయుక్తః ప్రాసాదః పృథివీజయః ॥ 196

తా॥ పై చెప్పిన దానినే భద్రమున సింహ కర్ణములతోను 2.2 రథికలును చేసి మిగిలినది శిఖరము యొక్క విస్తారము చేసి 5 భాగముల యెత్తు చేయవలెను. ప్రాగ్గ్రీవములు భద్రములయందు 1.1 భాగము నిర్గమము చేయవలెను. విస్తారము 4 భాగములుండవలెను. విమానముతో సమానముగా వెలుపలి రేఖను చేయువలెను. ఆ రేఖ 3 భాగములతోగూడినది పృథివీజయమగును. 49 కలశములు కలది యై యుండవలయును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ రేఖోర్ధ్వే తిలకం వ్యక్త్వా శృంగం తత్రైవ కారయేత్।
పృథ్వీజయ స్తదానామ కర్తవ్యః సర్వదైవతే ॥ 30

అనగా రేఖ పైన తిలకమును లేకుండా చేసి ఆ ప్రదేశమున శృంగమును రచించినచో పృథ్వీజయ మనిపించుకొనును సమస్త దేవతలకు ముఖ్యమైనది.

# 120. ఇంద్రనీలము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ భక్తే షోడశభిః క్షేత్రే చతురశ్రే సమం తతః।
గర్భో౽ష్టవర్గః స్యాత్తస్య మధ్యేభి ర్ద్విభాగికా ॥ 197
భ్రమణం బాహ్యభిత్తిశ్చ తత్సమే ఏకకీర్తితే।
కర్ణేషు రథికాకార్యా సలిలాంతర భూషితా ॥ 198
తత్తుల్యాయామ విస్తారా రథికాః స్యుస్తథాపరాః।
తద్వత్ ద్వితీయ రథికా భద్రం చతుష్పదాయతం ॥ 199

విస్తారార్థేన నిష్క్రాంతం క్షేభయేద్వర్ధ మానతః ।
వరండ్యంతర పత్రేచ సార్ధ భాగేన కారయేత్ ॥ 200
ఉపర్యుపరి భాగాన్ హి హీనాఃస్యుః క్రమశోభవాః ।
భద్రేరథిక యోర్మధ్యే సింహకర్ణో విధీయతే ॥ 201
ఏతస్యచోచ్ఛ్రయో భాగైః పంచభిః పరికీర్తితః ।
పార్శ్వస్థే సింహ కర్ణస్థ రథికేయే నివేశితే ॥ 202
తయోరుపరిషడ్భాగం విస్తృతం శిఖరం భవేత్ ।
విధేయ ముచ్ఛ్రయేణైతత్ త్రిపాదాన్ సప్త వాధికాన్ ॥ 203
పక్షయోరుభయోస్తస్య రథికే చతదూర్ధ్వతః ।
సింహం నివేశయేద్దిక్షు నిఖిలాస్వప్యయం విధిః ॥ 204
మూలకర్ణే తతశ్చోర్ధ్వం శిఖరం దశ విస్తృతం ।
ఏకాదశోచ్ఛ్రితం కార్యం క్రమ వృత్త్యా మనోరమం ॥ 205
చతుర్గుణేన సూత్రేణ వేణుకోశంతతో లిఖేత్ ।
పూర్వోక్తా సాంతరం భాగైరముష్మిన్ విభజేత్త్రిభిః ॥ 206
గ్రీవార్ధ భాగముత్సేధా దండకం భాగముచ్ఛ్రితం ।
పద్మశీర్షం తథార్ధేన కలశశ్చాంశకోదయః ॥ 207
దేవానామాలయః సప్యా దింద్రనీలోఽయమీరితం ॥

తా॥ క్షేత్రమును 16 భాగములు చేసి గర్భము 8 భాగములును, దాని చుట్టూ గోడ 1 భాగమును, అంధకారిక $1\frac{1}{2}$ భాగమును, వెలుపలి గోడ 1 భాగమును చేయవలెను. కర్ణముల యందు రథికలను జలాంతరముల తో చేయవలెను. శేషించిన రథికలును వానితో సమానమైన విస్తారమును యెత్తును కలిగియుండవలెను. అదే మాదిరిగా రెండవ రథికయుండవలెను భద్రము 4 భాగముల పాదవుండవలెను. విస్తారములో సగము నిర్గమమును చేయవలెను. వర్ధమానము నుండి తగ్గించవలెను. వరండియును, అంతర పత్రమును, $1\frac{1}{2}$ భాగము చేయవలెను. పై పై భాగములు వరుసగా ఒక్కొక్క పాతికవంతున యెత్తు తగ్గుచుండవలెను. భద్రమున రథికల మధ్య సింహకర్ణములను చేయవలెను. వీని యెత్తు 5 భాగములు చేయ వలెను. ప్రక్కనున్న సింహ కర్ణములయందు రథికయందు నివేశములను వాని యొక్క పై భాగమున శిఖరము యొక్క విస్తారము 6 భాగములును ఎత్తు $7\frac{3}{4}$ భాగములును దాని యొక్క రెండు వైపుల రథికములపై భాగ

మున సింహములను అన్ని దిశలయందు చేయవలెను. ప్రధాన కర్ణమున పగము శిఖరము 10 భాగముల విస్తారమును 11 భాగముల యెత్తును చేయవలెను. క్రమ వృత్తముతో చక్కగా నుండవలెను 4 భాగములు గల సూత్రముతో వేణుకోశమును లిఖించవలెను. పూర్వము చెప్పిన లోపలి వెలుపలి భాగములు దీనియందును గా విభజించవలెను. గ్రీవ ½ భాగము యెత్తును, అండకము 1 భాగము యెత్తును పద్మము మొగ్గ ½ భాగము యెత్తును, కలశము 1 భాగము యెత్తును కలిగియుండవలెను. ఇది దేవత లందఱికిని పనికి వచ్చును. 53 కలశములు కలిగియుండును. దీనిని యింద్రనీలమందురు.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ షోడశాంశక విస్తారే ద్విభాగః కర్ణ విస్తరః ।
నందికాచైక భాగేన ద్వ్యంశః ప్రతిరథ స్తథా ॥ 31
పునర్నందీ భవేద్భాగం భద్రం వేదాంశ విస్తరం ।
సమస్తం సమనిష్కాసం భద్రే భాగో వినిర్గమః ॥ 32
చతుః షష్ఠ్యంశకో గర్భో వేష్ఠితో భిత్తి భాగతః ।
బాహ్య భిత్తిర్భ వేద్భాగా ద్విభాగా చ భ్రమంతికా ॥ 33
కర్ణేశృంగ ద్వయంకార్యం శిఖరం సూర్య విస్తరం ।
నందికాయాంతు తిలకం ప్రత్యంగం చద్విభాగికం ॥ 34
శృంగ ద్వయం ప్రతిరథే ఉరః శృంగం షడంశకం ।
శృంగద్వయం నందికాయా మురః శృంగం యుగాంశకం ॥ 35
ద్విభాగం భద్ర శృంగంతు శృంగార్ధే చైవ నిర్గమః
కర్ణే ప్రతిరథే చైవ హ్యుదకాంతర భూషితం ॥ 36
ఇంద్రనీల స్తదానామ ఇంద్రాదిసుర పూజితః ।
వల్లభః సర్వదేవానాం శివస్యాపి విశేషతః ॥ 37

అనగా విస్తారమును 16 భాగములును చేసి కర్ణము 2 భాగములు, నందక 1 భాగము, ప్రతిరథము 2 భాగములు, మరల నంది 1 భాగము, భద్రము 4 భాగములు విస్తారమును ఇవియన్నియును సమాన నిర్గమము కలిగియుండవలెను, భద్రము 1 భా నిర్గమము గర్భము 8.8 భాగములును

కారిక 2 భాగములును చేయవలెను. కర్ణమున శృంగములు 2 భాగము లును శిఖరము 12 భాగములు విస్తారమును, నందిక యందు తిలకమును ప్రత్యంగము 2 భాగములును, ప్రతిరథమున 2 శృంగములును, ఉరఃశృంగము 6 భాగములును, నందిక యందు 2 శృంగములును ఉరఃశృంగము 4 భాగములును, భద్ర శృంగము 2 భాగములును, శృంగమున సగము నిర్గమమును, కర్ణమునను ప్రతిరథమునను జలాంతరమును చేయవలెను. అటుల చేసినచో యింద్రనీలమగును. ఇంద్రాదిసురలకు ప్రియమైనది. ఈశ్వరునకు మిక్కిలి ఇష్టమైనది.

(అనుబంధము 68వ పటము చూడుడు)

# 121. మహానీలము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ఏతస్యైవ యదోర్ధ్వస్థం శిఖరం క్రియతేఽన్యథా ॥ 208
చతుర్థీ రథికాచాస్య దీయతేఽతి మనోరమా ।
పూర్వోక్తేన విధానేన పాదపాదం వివర్జితా ॥ 209
శిఖరస్యాష్ట విస్తారో నవభాగ స్తథోచ్ఛ్రయః ।
ఇంద్రనీలస్య సదృశం శేషమన్య ద్విధీయతే ॥ 210
మహానీలోఽయమాఖ్యాతః ప్రాసాదస్త్రి దశాలయః ॥

తా॥ పై చెప్పిన దానినే పైన నున్న శిఖరమును వేఱుగా రచించవలెను. రథికలు 4ను పూర్వమువలె రచించవలెను. పై పై అంతస్తులలో యెత్తు $\frac{1}{4}$ భాగము తగ్గించుచుండవలెను శిఖరము యొక్క విస్తారము 8 భాగములును దాని యెత్తు 9 భాగములును చేయవలెను. మిగిలిన పనుల న్నియును ఇంద్రనీలమువలెనే చేయవలయును. 57 కలశములతో నుండవలెను దీనిని మహానీలమందురు.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ కర్ణేనందీ తథా శృంగం రేఖోర్ధ్వే తిలకం తథా ।
మహానీల స్తదానామ కర్తవ్యం సర్వదైవతే ॥ 38

అనగా కర్ణమున నందియును శృంగమును చేసి రేఖ పైన తిలకమును నిర్మించినచో మహానీలమగును. ఇది సమస్త దేవతలకు యోగ్యము.

(అనుబంధము 69వ పటము చూడుడు)

# 122. భూధరము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ఇంద్రనీలస్య సంస్థానే దిక్స్వ్రతేషు సమంతతః ॥ 211
సర్వతో భద్రశిఖరం హిత్వావైహాయా న్నివేశయేత్ ।
విధిరేష సమస్తాసు కకుప్సు ప్రవిధీయతే ॥ 212
భద్రేషు వర్ధమానస్య విన్యాసం పరివర్జయేత్ ।
వ్యాసోచ్ఛ్రితైః సింహకర్ణై ర్భద్రమస్య విభూషయేత్ ॥ 213
మహానీలస్య సదృశం సర్వమస్య ప్రకల్పయేత్ ।
ఇంద్రగోపనిభాకారః ప్రాసాదో భూధరః స్మృతః ॥ 214
సురేశ్వరస్య కర్తవ్యో నాన్యేషాం కథమప్యసౌ ॥

తా॥ ఇంద్రనీలమునే దిక్స్వ్రతము ప్రకారము అంతటను సర్వతో భద్ర శిఖరమును చేసి ఇట్లు అన్ని దిశల యందు చేయవలెను. భద్రముల యందు వర్ధమానమవసరములేదు. విస్తారముతో సమానముగ సింహ కర్ణములను చేసి భద్రము నలంకరించవలెను. మహానీలముతో సమానముగ అన్ని పనులు చేయవలయును. ఇంద్ర ధనుస్సువలె నుండుటచే భూధరమగును. ఇది యింద్రునకు ముఖ్యము 61 కలశములు కలిగియుండును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ కార్యం శృంగంచ తిలకే రేఖా మధ్యే ప్రశస్యతే ।
భూధరస్య సమాఖ్యాతః ప్రాసాదో దేవతాలయః ॥ 39

అనగా మంజరి యొక్క మధ్య నున్న తిలకమున శృంగమును చేసిన భూధర ప్రాసాదమగును.

# 123. రత్నకూటము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ భూధరస్యతు సంస్థానే తద్రూపే సమవస్థితే ॥ 215
భద్రే భద్రే పునఃప్రాజ్ఞో వర్ధమానం నివేశయేత్ ।
చతుర్భాగ మితివ్యాసం సార్ధచతుః సముచ్ఛ్రితం ॥ 216
రత్నకూటః సమాఖ్యాతః ప్రాసాదః శ్రీపతేరయం ॥

తా॥ భూధర ప్రాసాదమునే ప్రతి భద్రము నందును వర్ధమానమును చేసి ఆ వర్ధమానము యొక్క విస్తారము 4 భాగములును, ఎత్తు $4\frac{1}{2}$ భాగము

లును చేసిన యెడల రత్నకూటమగును. ఇది విష్ణువునకు యోగ్యము 65 కలశములు కలిగియుండును.

**అపరాజిత 159వ సూత్రము**

శ్లో॥ భూధరస్య యథాప్రోక్తం ద్విభాగం వర్ధయేత్పునః ।
పూర్వవద్దల సంఖ్యాయాం భద్రపార్శ్వే ద్వినందికే ॥ 40
ద్విభాగం బాహ్యభిత్తిశ్చ శేషం పూర్వే ప్రకల్పితం ।
తలచ్ఛంద మితిఖ్యాత మూర్ధ్వమానమతః శృణు ॥ 41
కర్ణే ద్విశృంగం తిలకం శిఖరం సూర్య విస్తరం ।
తిలకే ద్వేనందికాయాం ప్రత్యంగంతు ద్విభాగికం ॥ 42
శృంగత్రయం ప్రతిరథే షడ్భాగం చోరుమంజరీ ।
తిలకే ద్వేపునర్నంద్యా మురఃశృంగం యుగాంశకం ॥ 43
నంద్యాంచ శృంగ తిలకే త్రిభాగా చోరుమంజరీ ।
ద్విభాగం భద్ర శృంగంచ అర్ధే చార్థేచ నిర్గమః ॥ 44
రత్నకూట స్తదానామ శివలింగేషుకామదః ప్రశస్తః ।
సర్వ దేవేషు రాజ్ఞాంతు జయకారణం ॥ 45

అనగా భూధరమున కంటె రెండు భాగములు వృద్ధి చేసి మునుపటి వలె దలముల యొక్క సంఖ్యయందు భద్రము యొక్క యిరువైపులను రెండు నందులను, వెలుపలి గోడ 2 భాగములును, చేసి మిలిగినదిపూర్వము వలెనె చేయవలెను అంతస్తు యొక్క భాగములనిట్లు చేయవలెను. పై కొలతను చెప్పుచున్నాను కర్ణమున 2 శృంగములును తిలకమును, శిఖరం యొక్క విస్తారము 12 భాగములును తిలకమునందు 2 నందికలయందు ప్రత్యంగము 2 భాగములును, ప్రతిరథమున 3 శృంగములును, ఉరః మంజరి 6 భాగములును, తిలకమున మరల 2 నందులును, ఉరఃశృంగము 4 భాగములును, నందియందు శృంగము యొక్క తిలకమున ఊరు మంజరి 3 భాగములును, భద్రము యొక్క శృంగము 2 భాగములును, ఆ శృంగముల యొక్క నిర్గమ $\frac{1}{2}$ $\frac{1}{2}$ భాగములును, కలుగునట్లు చేసిరేని అది రత్నకూటమగును ఇది శివునకు ప్రశస్తము. ఇతర దేవతలకును యోగ్యము రాజులకు జయము కలిగించును.

(అనుబంధము 70, 71, 72 పటములు చూడుడు)

## 124. వైడూర్యము

**సమరాంగణ 56వ అధ్యాయము**

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే వింశత్యా భాజితేంశకైః ॥ 217
కుర్యాద్ద్వి భాగవిస్తారా రథికాః పంచకర్ణగాః
పంచోపరి పునః పంచ దద్యాదేకాంత దూర్ధ్వతః ॥ 218
ప్రథమా భూమి కాచాస్య కార్యా భాగత్రయోచ్ఛ్రితా ।
పాద పాద విహీనాస్తు క్రమేణాపర భూమయః ॥ 219
భద్ర కర్ణాంతరస్థేద్వే రథికేయే తదూర్ధ్వతః ।
శిఖరం దశ విస్తారం కుర్యాత్సార్ధ దశోచ్ఛ్రితం ॥ 220
మూలకర్ణానుసారేణ శిఖరం తత్రయద్భవేత్ ।
తస్య ద్వాదశ విస్తారం త్రయోదశ సముచ్ఛ్రితం ॥ 221
భద్రం విభూషయేత్ పత్రైః సింహ కర్ణైర్మనోరమైః ।
పంచవ్యాసేన సూత్రేణ వేత్రకోశం సమాలిఖేత్ ॥ 222
స్కంధకోశాంతరంచాస్య త్రిభిర్భాగై ద్విభాజయేత్ ।
పద్మశీర్షం తథాగ్రీవాం సార్ధభాగేన కారయేత్ ॥ 223
కుర్యాద్భాగేన భాగేన కుంభం చామలసారకం ।
నవభాగోచ్ఛ్రితాం జంఘాం తదర్ధం ఖురపిండికాం ॥ 224
వరండ్యంతర పత్రంచ కుర్యాద్భాగ ద్వయేనచ ।
వైదూర్యోఽయం సమాఖ్యాతః ప్రాసాదోదానవ ద్విషః ॥ 225

తా॥ క్షేత్రమును 20 భాగములు చేసి రథిక 2 భాగములను, ఇట్లు 5 చేయవలెను. ఆ రథికల పైన మరల 5 రథికలును, మరల వాని పైన 5 రథికలును, చేసి ఆ పైన సూత్రము 1 చేయవలెను మొదటి అంతస్తున రథిక యెత్తు 3 భాగములును, రెండవ అంతస్తున యెత్తు $2\frac{3}{4}$ భాగములును ఇట్లు అన్ని అంతస్తులకు క్రమముగా ఒక్కొక్క పాతికవంతు తగ్గించుచుండవలెను. భద్రము యొక్క కర్ణమున 2 రథికలను చేయవలెను. శిఖరము యొక్క విస్తారము 10 భాగములు చేయవలెను దాని యెత్తు $10\frac{1}{2}$ భాగములును చేయవలెను. ప్రధాన కర్ణమునను సరించి శిఖరము యొక్క విస్తారము 12 భాగములును, ఎత్తు 13 భాగములును చేసి భద్రమును పత్రములతో నలంకరించి సింహ కర్ణములను కూడ చక్కగా చేయవలెను. విస్తారమును 5 రెట్లు చేసి వేత్రకోశమును లిఖించవలెను. స్కంధకోశాంతరమున దానిని 3 భాగములు చేయువలెను. పద్మము యొక్క శిఖరమును, గలమును, $1\frac{1}{2}$ భాగముతో చేయవలెను. కుంభము 1 భాగమును ఆమలసారము 1 భాగములను చేయవలెను. జంఘ 9 భాగ

ముల యెత్తును అందులో సగము 4½ భాగములు పీఠమును, వరండియును అంతర పత్రమును ఈ రెండును కలసి 2 భాగములు చేయవలెను. ఇది వైడూర్యమను ప్రాసాదము 69 కలశములు కలిగియుండును. విష్ణువునకు ప్రీతికరమైనది.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ శృంగం తృతీయం రేఖోర్ధ్వే కర్తవ్యం సర్వశోభనం ।
వైడూర్యశ్చతదానామ కర్తవ్యః సర్వదైవతే ॥ 46

అనగా రేఖ పైన మూడవ శృంగమును చేసినచో వైడూర్య ప్రాసాదమగును. సమస్త దేవతలకుపయోగించును.

(అనుబంధము 73వ పటము చూడుడు)

## 125. పద్మరాగము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ ఏతస్యైవ యదాభద్రే భద్రేస్యాద్ వర్ధమానకః ।
పద్మరాగ స్తథైవస్యాత్కార్యోఽయంపద్మరాగతః ॥ 226

తా॥ పై జెప్పిన దానినే అన్ని భద్రములయందు వర్ధమానములను రచించిన యెడల పద్మరాగమగును 73 కలశములతో ప్రకాశించుచుండును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ తథైవ తిలకం నంద్యాం శృంగయుగ్మంతు ।
సంస్థితం పద్మరాగ స్తదానామ సర్వదేవ సుఖావహః ॥ 47

అనగా పై జెప్పిన దానినే నందియందు తిలకమును 2 శృంగములను రచించిన యెడల పద్మరాగమగును.

## 126. వజ్రకము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ పద్మరాగస్య భద్రేషు వర్ధమానం వివర్జయేత్ ।
భద్రస్య పార్శ్వ ద్వితయే ప్రదద్యాద్రధి కాద్వయం ॥ 227
వ్యాసోచ్ఛ్రాయైశ్చ భద్రాణి సింహ కర్ణైర్విభూషయేత్ ।
యదన్య దస్యతత్ సర్వం పద్మరాగ సమంభవేత్ ॥ 228

తా॥ పద్మరాగము యొక్క భద్రములయందు వర్ధమానమును తీసి వేసి భద్రము యొక్క యిరువైపుల రెండు రథికలను రచించవలెను. విస్తారము యెంతో అంత యెత్తున భద్రములను సింహ కర్ణములతో నలంకరించవలెను. శేషించిన పనులన్నియును పద్మరాగమున జేసినట్లే చేయవలయును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ రేఖోర్ధ్వేచ తతః శృంగం కర్తవ్యం సర్వశోభనం ।
వజ్రకశ్చేతినామాసౌ శక్రాది సురవల్లభః ॥ 48

అనగా రేఖ యొక్క పై భాగమున విస్తారమైన శృంగమును రచించిన యెడల వజ్రకమగును 77 కలశములు గలిగి ప్రకాశించుచుండును.

## 127. ముకుటోజ్జ్వలము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ వజ్రకస్యైవ భద్రేషు పూర్వవద్రథికాస్థితౌ ॥ 229
షడ్భాగ విస్తృతం తత్ర శిఖరం వినివేశయేత్ ।
సప్తభాగ సముత్సేధం దిక్షు సర్వాస్వయం విధిః ॥ 230
ముకుటోజ్జ్వల ఇత్యుక్తః ప్రాసాదోఽయం సురాలయః ॥

తా॥ వజ్రకమునకే భద్రమున మునుపటివలె 2 రథికలను చేసి అచట శిఖరము యొక్క విస్తారము 6 భాగములును, ఎత్తు 7 భాగములును చేయవలెను. అన్ని దిశలయందును ఇట్లే చేయవలెను. దీనిని ముకుటోజ్జ్వలమందురు, 81 కలశములతో నొప్పుచుండును.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ భక్తే వింశతిధాక్షేత్రే ద్విభాగః కర్ణ విస్తరః॥
సార్ధభాగం భవేన్నందీ కర్ణవత్ ప్రరథస్తథా ॥ 49
పునర్నందీ సార్ధభాగం భాగావై భద్రనందికా ।
వేదాంశో భద్ర విస్తార ఏకభాగస్తు నిర్గమః ॥ 50
ద్విభాగా బాహ్యభిత్తిశ్చ ద్విభాగాచ భ్రమంతికా ।
తత్సమామధ్య భిత్తిశ్చ గర్భోఽష్టాంశైః ప్రకల్పితః ॥ 51
కర్ణేద్వి శృంగం తిలకం రేఖాద్వి సప్త విస్తరా ।
నంద్యాం శృంగంచ తిలకం ప్రత్యంగం తుతదూర్ధ్వతః ॥ 52
శృంగత్రయం ప్రతికర్ణే సప్తాంశాచోరు మంజరీ ।

నంద్యాం శృంగంచ తిలక మురఃశృంగం షడంశకం ॥ 53
భద్రనంద్యాం తథాశృంగ మిషుభాగోరు మంజరీ।
భద్ర శృంగం ద్విభాగంస ముకుటోజ్జ్వల ఉచ్యతే ॥ 54

అనగా క్షేత్రమును 20 భాగములు చేసి కర్ణము 2 భాగములను, నంది 1½ భాగములును, ప్రరథము 2 భాగములును, మరల నంది 1½భాగమును, భద్రనంది 1 భాగమును, ఇట్లు రెండు వైపుల చేసి ఆ మధ్య 4 భాగములు భద్రమును 1 భాగము నిర్గమముతో చేయవలెను వెలుపలి గోడ 2 భాగములును, అంధకారిక 2 భాగములును, మధ్య గోడ 2 భాగములును, చేయగా మధ్య 8 భాగములు గర్భము అగును. కర్ణమున 2 శృంగములును తిలకమును, రేఖ 14 భాగమును, విస్తారమును ఉరఃశృంగము 7 భా, నందియందు శృంగమును తిలకమును, ఉరఃశృంగము 6 భాగములును,భద్రనందియందును అటులే శృంగమును చేయవలెను ఊరుమంజరి 5 భాగములును, భద్రము యొక్క శృంగము 2 భాగములును, చేసిన యెడల ముకుటోజ్జ్వలమగును

(అనుబంధము 74వ పటము చూడుడు)

# 128. ఐరావతము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ అస్యైవతు యదాస్థానే భద్రే భద్రే చతుర్దిశం ॥ 231
సింహకర్ణం పరిత్యజ్య వర్ధమానో విధీయతే।
ఊర్ధ్వా భవత్తృతీయాయాః సప్తోచ్ఛ్రాయః షడాయతః ॥ 232
ఐరావతోఽయంకర్తవ్యః ప్రాసాదస్త్రి దశేశితుః ॥

తా॥ పై జెప్పిన దానినే నలువైపుల భద్రముల యందు సింహకర్ణములను తీసివేసి వర్ధమానమును రచించవలెను. మూడవ రథిక పైన శిఖరము యొక్క విస్తారము 6 భాగములును యెత్తు 7 భాగములును చేయవలెను. దీనిని ఐరావతమందురు. 85 కలశములుండును. ఇంద్రునికిప్రియమైనది.

అపరాజిత 159వ సూత్రము

శ్లో॥ రేఖోర్ధ్వేచ తతః శృంగం కర్తవ్యం సర్వకామదం।
55

అనగా రేఖ యొక్క పై భాగమున శృంగమును రచించిన యెడల ఐరావతమగును. అన్ని కోరికలనిచ్చును. ఇంద్రాద్యుత్తమ దేవతలకు యోగ్యమైనది.

(అనుబంధము 75వ పటము చూడుడు)

ఇది శ్రీమద్విశ్వకర్మ వంశమూలర్షి పంచక మధ్య మాహభూనస గోత్ర
పవిత్ర, స్వర్ణాచ్చమాంబా వేంకట శివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటయసుధీమణి
పుత్ర, శ్రీమగ్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితాసుధారస
పాత్ర, పదవాక్య ప్రమాణనిధాన, విమర్శకాచార్య, శిల్పకళాకోవిద,
సర్వతంత్ర స్వతంత్ర, స్థపతి, తిలకాది బిరుదవిరాజమాన
సుబ్రహ్మణ్యాభిధాన విరచితనానావాస్తు శిల్పాగమశాస్త్ర పరిశీల
నాత్మకాంధ్ర తాత్పర్యసహిత భారతీయ మహాశిల్పమునందు
షడ్భూమి మొదలు షోడశభూమివఱకును వైరాజ్యప్రాసా
దములు నాగరప్రాసాదములు లతి ప్రాసాదములు
సాంధారప్రాసాదములలో ఐరావతము వఱకును
గల దేవాలయ భేదములు అను
చతుర్దకళ

సమాప్తం

ముద్రణ:
న్యూ విజయ ఆర్టు ప్రెస్, గాంధీచౌక్, తెనాలి.

# అనుబంధము

1వ పటము



ఎత్తు 6 అంత

పద్మాసనము 57 భా

## 2వ పటము




**ద్రావిడపద్ధతి**

## 3వ పటము




కాంతము

4వ పటము

ఎత్తు 67 భా

7 అంత



సముజ్జ్వలము

5వ పటము

ఎత్తు 36 భా ( మాన )



పుండరీకము




ద్రావిడపద్ధతి

7వ పటము

ఎత్తు 46 భా



భూకాంతము




శివచ్ఛందము




ద్రావిడపద్ధతి


10వ పటము
ఎత్తు 88 హ
9 అంత
బ్రహ్మకాంతము

11వ పటము

ఎత్తు 56 హ ( మాన )



సౌరకాతము




మర్త్యకాంతము




భూకాంతము




ద్రావిడపద్ధతి




ఇంద్రకాతము




శంభుకాంతము

17వ పటము

ఎత్తు 92 హ
వి 65 హ





ద్రావిడపద్ధతి


18వ పటము
ఎత్తు 127 భా
12 అంత
ద్వాదశ భూమి




ద్రావిడపద్ధతి మహాపద్మము

## 21వ పటము

25 భా




16 అంతస్తుల దేవాలయము

22వ పటము




సారస్వతము

26వ పటము




27వ పటము




సింహపంజరము




23వ పటము




2 1/2

వైరాజ్య నందనము

25వ పటము

29వ పటము




30వ పటము



43-1వ పటము










43-3వ పటము

43-2వ పటము

44వ పటము



మహేంద్రము

46వ పటము



భూధరము

45వ పటము



శతశృంగము

46-1వ పటము




47వ పటము



మహీధరము



48వ పటము



మేరువు

49వ పటము

శ్రీవత్సము

గర్భము 8 భా

విస్తారము 14 భా

50వ పటము




51వ పటము



53వ పటము




54వ పటము




55వ పటము




52వ పటము




56వ పటము




57వ పటము



5 అండ. కేసరి

61వ పటము




62వ పటము




62వ పటము



అమృతోద్భవము

64వ పటము



65వ పటము



హేమకూటము అపరా

66వ పటము



హేమకూటము

67వ పటము



హేమకూటము (అపరా)

68వ పటము



ఇంద్రనీలము

69వ పటము



మహానీలము

70వ పటము



రత్నకూటము

71వ పటము



రత్నకూటము

72వ పటము



రత్నకూటము (అపరా)

73వ పటము



అండ. 81
వైడూర్యము

74వ పటము



అండ. 81
ముకుటోజ్జ్వలము

75వ పటము



ఐరావతము. అం. 85

శ్రీ

# భారతీయ మహా శిల్పము

## 5 వ భాగము




రచయిత :

విమర్శకాచార్య శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి





ప్రచురణకర్త :

డా॥ స్వర్ణ వాచస్పతి, B. V. Sc.

# విషయసూచిక



| విశకర్మ ప్రకాశము | సమరాంగణ | అపరాజిత |
|---|---|---|
| 6వ అధ్యాయము 56-85 వరకు (100) వ్రాయబడినవి | 56, 57, 55, 63. | 159, 168, 160, 155, 161, 162, 170, 106, 163, 167. (1-13) |

శ్రీ విరాడ్విశ్వకర్మణే నమః

# 1. ఇష్టదేవతాస్తుతి

శ్లో॥ దేవః సపాతు భువనత్రయ సూత్రధార
స్త్వాం బాలచంద్రకలికాంకిత జూటకోటిః
ఏతత్ సమగ్రమపికారణ మంతరేణ
కార్త్స్న్యా దసూత్రితమసూత్ర్యత యేనవిశ్వమ్॥
(సమరాంగణ)

శ్లో॥ ఉత్పత్తి రక్షణలయార్జగతాం ప్రకుర్వన్
భూవారివహ్ని మరుతో గగనంచసూతే
నానాసురేశ్వర కిరీటవిలోల మాలా
భృంగావళీఢచరణాంబురుహం నమామి॥ (మానసారము)

శ్లో॥ జయతివరదమూర్తి ర్మంగలం మంగలానాం
జయతిసకల వంద్యాభారతీ బ్రహ్మరూపా
జయతిభువన మాతాచిన్మయీ మోక్షరూపా
దిశతుమమమహేశో వాఙ్మయఃశబ్దరూపం॥(విశ్వకర్మప్రకాశ)

శ్లో॥ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితో యః సురైరపి
సర్వవిఘ్నచ్ఛిదేతస్మై గణాధిపతయే నమః (అపరాజితపృచ్ఛ)
మహాదేవం శశిధరం॥

# 2. సాంధారమున రాజహంస ప్రాసాదము

సమారాంగణ 56వ అధ్యాయం.

శ్లో ఐరావతస్య సంస్థానే ప్రాసాదేపూర్వవత్ స్థితే॥ (233)
వర్ధమానం విహాయోర్ధ్వేయదా సింహోనివేశ్యతే
శిఖరాణి చచత్వారి దిక్షుసర్వాసువర్జయేత్ ॥ (234)
క్షేత్రాయాష్టమే? ర్విస్తారం గర్భవేశ్మని వేశయేత్.
చతుర్భాగాయతం భద్రం నిర్గమేణవిభాజితం॥ (235)
భద్రత్రయం ప్రయుంజీత భిత్తిభాగేనవేష్టితం.
ద్వారోచ్ఛ్రయం స్వవిస్తారాద్ ద్విగుణేన సమన్వితమ్ (236)
గవాక్షస్త్రత్రకర్తవ్యో యథాద్వారం నలంఘ్యతే.

మధ్యేచతుష్కికా కార్యా ద్విభాగాయత విస్తృతా॥ (237)
ప్రాసాదో రాజహంసోఽతుం బ్రహ్మాదీనాం ప్రశస్యతే॥

తా॥ ఐరావతమున వర్ధమానమును తీసివేసి సింహములను రచించి నలుదిశల యందలంకారము చేయవలెను. గర్భము 8 భాగములు చేయవలెను. (వెలుపలి గోడ 2 భాగములు, లోపలి గోడ 2 భాగములు, అంధకారిక 2 భాగములు) భద్రము 4 భాగముల విస్తారమును అందు 1 భాగము నిర్గమమును చేయవలెను. ఇట్లు 3 భద్రములను రచించవలెను. ఆ భద్రములకు చుట్టూ గోడ యుండవలెను. ద్వారము యెత్తులో సగమువిస్తారముండవలెను. గవాక్షులు ద్వారము యెత్తులో సగము యెత్తుండవలెను. గవాక్షులు ద్వారముయొక్క పైభాగమును మించియుండరాదు. మధ్య చతుష్కిక 2 భాగములు నలుచదరముగా చేయవలెను. దీనిని రాజహంసమందురు. 89 కలశములుండవలెను. ఇది బ్రహ్మకు ప్రియమైనది.

అపరాజిత159వసూ

శ్లో॥ తత్రైవ తిలకం కుర్యాద్ భద్రకర్ణేతు శృంగకం
రాజహంసః సమాఖ్యాతః కర్తవ్యో బ్రహ్మమందిరే॥ (56)

అనగా భద్రముయొక్క కర్ణమున తిలకమును శృంగమును చేసిన యెడల రాజహంసమగును దీనిని బ్రహ్మమందిరమున రచించుట శ్రేష్ఠము.

(అనుబంధము 1వ పటము చూడుడు.)

## 3. గరుడము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ రాజహంసస్య సంస్థానే తృతీయ రథికోపరి॥ (238)
యదాస్య శిఖరంసప్త సముచ్ఛ్రాయం షడాయతం।
స్యాత్తదా గరుడోనామ గరుడధ్వజవల్లభః॥ (239)
ప్రాసాదః సర్వకామార్థః కర్తుః కారయితుస్తథా॥

తా॥ రాజహంసమున మూడవ రథికపైన శిఖరము 6 భాగముల

విస్తారమును 7 భాగముల యెత్తును చేసినట్లయిన గరుడమగును. దీనికి 93 కలశము లుండవలెను.

అపరాజిత 159వ సూ.

శ్లో॥ రేఖోర్ధ్వేచతతః శృంగం కర్తవ్యం సర్వకామదం
పక్షిరాజస్తదానామ కర్తవ్యః స్త్రియః పతేః॥ (57)

అనగా రేఖపైన శృంగమును రచించిరేని గరుడమగును ఇది విష్ణువునకు చేయదగినది. (అనుబంధము 3వ పటము చూడుడు)

# 4. వృషభము

## సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ అస్యైవమూలశిఖరం త్యక్త్వా భాగద్వయోన్మితం। (240)
క్రియంతేరథికా కర్ణే తదూర్ధ్వం మూలమంజరీ
క్రియతేద్వా దశోచ్ఛ్రాయా దశభాగాయతాయదా। (241)
తదాస్యాద్ వృషభోనామ వృషభధ్వజవల్లభః॥

తా॥ పైదానికే ప్రధాన శిఖరమును తీసివేసి 2 భాగములు కర్ణమున రథికలనుచెసి ఆపైన మూలమంజరిని చేసి ఆ మూలమంజరి (శిఖరము)యొక్క విస్తారము 10 భాగములును, ఎత్తు 12 భాగములును చేసినచో వృషభమగును అపరాజిత 159వ సూ. శ్లో॥ద్వావింశవ్యావిభక్తేచద్విభాగభిత్తికాభవేత్. భ్రమణీతత్సమాచైవపునర్భిత్తిశ్చతత్సమా (58శతమూలపద్దెర్గర్భకర్తవ్యోలక్షణాన్వితః కర్ణప్రతిరథరథోపరథాది ద్వివిస్తరాః॥ (59)భద్రనందీభవేద్భాగం వేదాంశోభద్రవిస్తరః భాగో భద్రే నిర్గమః స్యాచ్ఛేషావైపూర్వకల్పితాః॥ (60) కర్ణేద్విశృంగం తిలకం శిఖరంషోడశాంశకం, శృంగద్వయం ప్రతిరథే ప్రత్యంగం చత్రిభాగికం। (61) రథేశృంగత్రయం కుర్యాచ్ఛృంగోర్ధ్వేచోరుమంజరీ. ద్వేద్వేశృంగే ఉపరథే ఉరః శృంగంషడంశకం॥ (62)భద్రనంద్యాం భవేచ్ఛృంగం వేదాంశాచోరుమంజరీ ద్విభాగం భద్ర శృంగంచ।

కర్తవ్యంచ మనోరమం॥ (63) సప్త నవత్యండకయుక్ కర్తవ్యో లక్షణాన్వితః వృషభోనామ విఖ్యాత ఈశ్వరస్య సదాప్రియః॥ (64) అనగా క్షేత్రమును 22 భాగములుచేసి గోడ 2 భాగములును, అంధకారిక 2 భాగములును, లోపలిగోడ 2 భాగములును, గర్భము 10 భాగములును, చేయవలెను. కర్ణము ప్రతిరథము, ఉపరథము. ఇవి 22 భాగముల చొప్పున చేయవలెను. భద్రనంది 1 భాగమును, భద్రము యొక్క విస్తారము 4 భాగములును, భద్రముయొక్క నిర్గమము 1 భాగమును, చేసి మిగిలినవి పూర్వము వలెనే చేయవలెను. కర్ణమున 2 శృంగములును, తిలకమును శిఖరము 16 భాగముల విస్తారమును ప్రతి రథమున 2 శృంగములును, ప్రత్యంగము 3 భాగములును రథమున 3 శృంగములును శృంగం పైన ఊరు యంజలియును, 2 శృంగములును ఉపరథమున 2 శృంగములును, ఊరః శృంగము 6 భాగములును, భద్రనందియందు శృంగమును, ఊరు మంజరి 4 భాగములును, భద్ర శృంగము 2 భాగములును, ఇట్లుచక్కగా చేయవలెను. 97 కలశములతో నుండవలెను. దీనిని వృషభమందురు. ఈశ్వరున కెల్లప్పుడు యిష్టమైనది.

(అనుబంధము 3వ పటము చూడుడు)

## 5. మేరువు

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ శతార్ధహస్త విస్తారం జ్యేష్ఠం మేరుంప్రకల్పయేత్ (242)
మధ్యమే హస్త సంఖ్యాస్యాత్ షట్ త్రింశద్ద్వి పదాధికః
దశత్రిగుణితాహస్త సంఖ్యాప్రోక్తాకనీయసి (243)
చతురశ్రీకృతేక్షేత్రే భాగవింశతిభాజితే
విస్తారార్ధంత్యజేద్గర్భ గృహంభిత్త్యా సమన్వితం ॥ (244)
భాగప్రమిత విస్తారా గర్భ భిత్తిర్విధీయతే

సార్ధద్విభాగాన్యాభిత్తి స్తద్వదేవాంధకారికా॥ (245)
ది భాగారథికాకార్యా కర్ణే కర్ణేవిజానతా।
చతుర్భాగారథా భద్రే ష్వేత దర్ధేనసిర్గతా॥ (246)
భద్రకర్ణాంతయోః కార్యం తదష్టాంశం జలాంతరం
భద్రాణాంరథికాః కార్యాః పార్శ్వయోరుభయోస్తథా॥ (247)
రథికానాంచసర్వాసాం స్వభద్రం విస్తరార్ధతః
శృంగం భద్రం తథైవైకం తథాసర్వాణి కారయేత్॥ (248)
దిక్సూత్రేషుచ సర్వేషు వర్ధమానం నివేశయేత్
అష్టభాగోచ్ఛ్రితాజంఘా ఖురపిండంతదర్ధతః॥ (249)
మేఖలాంతరపత్రేచ స్యాతాంభాగద్వయోద్గతే.
ప్రథమారథికాస్తత్ర సపాదాత్స్రతయోచ్ఛ్రితాః॥ (250)
పాదపాదవిహీనాః స్యుః క్రమేణో పరిభూమయః
దిక్సూత్రేషుసకర్ణేషు క్రియాప్రాగ్వద్విధీయతే॥ (251)
శిఖరందశవిస్తారం భాగద్వాదశకోచ్ఛ్రితం
చతుర్గుణేనసూత్రేణ వేణుకోశంసమాలిఖేత్॥ (252)
స్కంధకోశాంతరం చాస్య త్రిభిర్భాగైర్విభాజయేత్
గ్రీవాచపద్మశీర్షం చతావద్భాగార్ధ ముచ్ఛ్రయం॥ (253)
భాగంచామలసారం స్యాత్ కలశోభాగమేవచ
శతశృంగావృతో మేరురయం ప్రాసాద ఈరితః॥ (254)
ప్రదక్షిణీకృతే తస్యా తత్పుణ్యాం కనకాద్రిణా
శైవేష్టకామయేతత్ స్యాత్ కృతేఽస్మిన్నధికం తతః॥ (255)

తా॥ ఉత్తమజాతి మేరువు 50 హస్తముల విస్తారమును మధ్యమము 36½ హస్తములును, అధమము 30 హస్తములును, కలిగియుండును. అది చతురశ్రముగను, 20 భాగములనుచేసి అందు గర్భము గోడతోగూడ కలసి 10 భాగములును ఆ గర్భగోడ 1

భాగము విస్తారమును, తరువాత చుట్టూ అంధకారిక 2½ హస్తములును దాని వెలుపల గోడచుటూ 2½ హస్తములును చేయవలెను. కర్ణము లన్నిటియందును రథికలు. 2.2 భాగములు చేయవలెను. భద్రమును 4 భాగములు చేయవలెను. అందులో సగము భద్రముయొక్క నిర్గయమును చేయవలెను. భద్రములయొక్క కర్ణములయందు అందులో 8వ వంతు జలాంతరమును చేయవలెను. భద్రములకును రెండుప్రక్కలను రథికలను చేయవలెను. అన్ని రథికలకును వాని యొక్క భద్రమును విస్తారములో సగము చేయవలెను. శృంగమును భద్రమును 1-1 అంతటను చేయవలెను. దిక్సూత్రముల ప్రకారము అన్ని దిశలయందు వర్ధమానమును రచించవలెను. జంఘ 8 భాగముల యెత్తును ఖురపిండము 4 భాగముల యెత్తును. మేఖల అంతర పత్రము ఈ రెండును 2 భాగములును, మొదటి రథికలు $1\frac{1}{4}$ భాగము విస్తారమును, 3 భాగముల యెత్తును, దానిపై అంతస్తులకు వరుసగా ఒక్కొక్క పాతికవంతు యెత్తు తగ్గించుచుండవలెను. దిక్సూత్రము లన్నిటియందును మొదటి అంతస్తున చేసినట్లే అన్ని అంతస్తుల యందు చేయవలెను. శిఖరముయొక్క విస్తారము 10 భాగములును దాని యెత్తు 12 భాగములును, నాలుగురెట్లుగల సూత్రముతో వేణుకోశమును లిఖించవలెను. దానియొక్క స్కంధకోశము 3 భాగములతో రచించవలెను. గ్రీవ పద్మశీర్షము ఇవి అర భాగము చొప్పున చేయవలెను. ఆమలసారం 1 భాగము చేయవలెను. కలశమును 1 భాగము చేయవలెను. మేరువు 100 శృంగములతో ఆవరింపబడి మొత్తము 101 కలశములతో నొప్పుచుండును. దీనికి ముమ్మారు ప్రదక్షిణమొనర్చినచో మహామేరువును దర్శించి పూజించిన పుణ్య ఫలము కలుగును. శిలలతోనుఇటుకలతోను రచించవచ్చును.

అపరాజిత 159వ సూ॥

శ్లో॥ కర్ణే శృంగత్రయంచైవ ఏకోత్తరశతాండకః
మేరుశ్చాపి సమాఖ్యాతః కర్తవ్య శ్చత్రిమూర్తికే॥ (65)
సర్వస్య హేమమేరోశ్చ యత్పుణ్యం త్రిః ప్రదక్షిణైః
కృతైశైవేష్టకాభిశ్చ। తత్పుణ్యాల్లభతేఽధికమ్॥ (66)
హరోహిరణ్యగర్భశ్చ హరిర్దినకరస్తథా।
ఏతేదేవాః స్థితా మేరౌ, నాన్యేషాంసకదాచన॥ (67)

తా॥ కర్ణమున 3 శిఖరములును, 101 అండకములును కలిగినది మేరువు. శివ బ్రహ్మ విష్ణు సూర్యులకు దక్క దీనిని రచించగూడదు అట్లు రచించినచో దోషము కల్గును. ఈ మేరువును రచించినందున సువర్ణ మేరువును ముమ్మారు ప్రదక్షిణ మొనర్చిన దానికంటె ఫలమధికము.

(అనుబంధము 4, 5 పటములు చూడుడు.)

## 6. నిర్గూఢాంధారములు- లవాఖ్యము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ నందిశాలాఖ్య సంస్థానే తద్రూపేసమవస్థితే
ద్వితీయా రథికాకార్యా భాగద్వయవినిర్గతా॥ (256)
శేషోభద్రస్య విస్తారః స్వవిస్తారార్ధనిర్గతః
(అష్టాంశాయామవిస్తారః స్వవిస్తారావి నిర్గతః) (257)
అష్టాంశాయామవిస్తారా శాలాస్యాత్ పురతః పునః
తస్యామధ్యేభవేద్గర్భో ద్విభాగాయామవిస్తరః (258)
గర్భభిత్తిర్భవేచ్చాస్య భాగేనైకేనిర్గతా
బాహ్యాభిత్తిస్తథైవస్యాత్ తత్సమాచాంధకారికా॥ (259)
ద్విభాగారథికాస్తస్య సలిలాంతరభూషితాః
శేషోభద్రస్యవిస్తారో భాగేనైకేననిర్గమః॥ (260)
జంఘోత్సేధంచపీఠంచ విదధ్యాన్నందిశాలవత్
రథికాస్తత్రకర్తవ్యాః కర్ణేభాగత్రయోచ్ఛ్రితాః॥ (261)

షడంశాక్ష విస్తృతం కుర్యాచ్ఛిఖరం సప్తమోచ్ఛ్రితం
కార్యా కేసరి వచ్చాస్య రేఖాసామలసారికా॥ (262)
ఏభిర్గుణైర్యుతం చైవం పార్శ్వయోరపి యోజయేత్
ప్రాసాదోఽయం లతాఖ్యః స్యాత్ కర్తవ్యోదాన విద్విషః॥ (263)

తా॥ నందిశాలయందు రెండవరధికను 2 భాగముల నిర్గమముతో చేసి మిగిలినది భద్రముయొక్క విస్తారము చేయవలెను. భద్రముయొక్క నిర్గమమువిస్తారములో సగము చేయవలెను. 8 భాగముల పాడవునువిస్తారమును, ఆవిస్తారములలో సగమునిర్గమమునుచేయవలెను మొదటి8.8 భాగములు నలుచదరము చేయవలెను. దానినడుమగర్భము 2 భాగముల విస్తారమును అదే పొడవును కలిగియుండవలెను. ఆ గర్భ గోడ యొక్క నిర్గమము 1 భాగము వెలుపలిగోడ 1 భాగం అంధకారిక 1 భాగంచేయవలెనురధిక 2 భాగములు జలాంతరములతో చేయవలెనుమిగిలినది భద్రముయొక్కవిస్తారము చేయువలెను. భద్రనిర్గయం 1 భాగము చేయవలెను. జంఘయును, పీఠమును, నందిశాలకు చేసినట్లే చేయవలెను. దానికర్ణములయందు రధికలను 3 భాగముల యెత్తుంచునట్లు చేయవలెను. శిఖరముయొక్కవిస్తారము 6 భాగములును ఎత్తు 7 భాగములును చేయవలెను. భద్రము రేఖయును ఆమలసారమును కేసరియందు చేసినట్లే చేయవలెను. ఇట్లు ప్రక్కలనుగూడ చేయవలెను. ఇది విష్ణువునకు యోగ్యమైనది. లతాఖ్య ప్రాసాదమని చెప్పుదురు.

అపరాజిత 168వ సూ.

శ్లో॥ భక్తేద్వాదశధాక్షేత్రే షట్త్రింశీతోష్ట గర్భకః
భాగోభాగాభ్రమో భిత్తిర్భాగావై బాహ్యాభిత్తికా॥ (23)
కర్ణానుగంద్విభాగంచ భద్రం ద్విగుణ విస్తరం
ఏకైకభాగనిష్కాసో భద్రేప్రతిరథేఽధీవా॥ (24)

కర్ణే ప్రతిరథేకుర్యాచ్ఛృంగం వైపత్యతో భవం
ద్వితీయక్రమేః కర్ణోర్ధ్వే కూటంస్యాత్తి లతాన్వితం॥ (25)
శిఖరంచాష్టవిస్తారం షడ్భాగాచోరుమంజరీ
ప్రథమేచ చతుర్భాగః శ్రీతిలకస్తు కామదః॥ (26)
శ్రీతిలకాగ్రసంస్థానే తత్ప్రమాణాంశత స్తథా
సంలగ్నా బాహ్యభిత్తౌచ భద్రేచంద్రావలోకనా॥ (27)
మధ్యకోష్ఠకద్వారంతు భవేచ్ఛ్రీతిలకాగ్రతః
కేశరిద్వార్ద్వయంకుర్యాత్ లతాఖ్యః సర్వకామదః॥ (28)

అనగా క్షేత్రమును 12 భాగములుచేసి గర్భము 6 భాగములును గోడ 1 భాగము, అంధకారిక 1 భాగమును, మరియు గోడ 1 భాగమును చేయవలెను. కర్ణము 2 భాగములును, భద్రము 4 భాగములును, అవి 1-1 భాగము నిర్గమమును భద్రమునను ప్రతి రథమునను, కర్ణమునను, ప్రతిరథమునను అంతటను శృంగములను చేయవలెను. మరల రెండవ వరుసను కర్ణముపైన కూటములకు భద్రములను రచించవలెను. శిఖరముయొక్క విస్తారము 8 భాగములును ఉరుమంజరి 6 భాగములును, మొదట 4 భాగములు భద్రోపభద్రములు శ్రీ తిలకమును ఆ శ్రీతిలకముముందు ఆదేకొలతను వెలుపలి గోడయును. భద్రమున విశ్రాంతిస్థలమును, మధ్యకోష్ఠమునకు ద్వారము రచించి శ్రీ తిలకముముందు సింహముగల రెండు ద్వారములును రచించిన యెడల సమస్తమైన కోరికల నిచ్చునట్టి లతాఖ్యమగును—

## 7. త్రిపుష్కరము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ అగ్రేతనం యదాపశ్చాన్న్యస్యేత్కేసరిణం తదా
భవేత్ త్రిపుష్కరాఖ్యోఽయం ప్రాసాదస్త్రిదశాలయః॥ (264)
తా॥ కేసరి ప్రాసాదమునకు ముందువెనుకలు భద్రములను

చేసిన త్రిపుష్కరమగును.

అపరాజిత 168వ సూ॥ యథాగ్రతస్తథాపృష్ఠే త్రిపుష్కర ఇతీరితః (28) అనగా లవాఖ్యమున ముందుద్వారములు చేసినట్లె వెనుకగూడ చేసిరేని త్రిపుష్కరమగును.

## పంచవక్త్రము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ నందిశాలస్య సర్వాసు దిక్ష్వయం కేసరీయదా
స్యాత్తదా పంచవక్త్రోఽసౌ విధేయః పద్మజన్మనః॥ (265)

తా॥ నందిశాలకు అన్నిదిక్కులయందు కేసరికి చేసినట్లు చేసినయెడల పంచవక్త్రమగును. అది బ్రహ్మకు ముఖ్యమైనది.

అపరాజిత 168వ సూ॥ యమ్యోత్తరేఽగ్రతఃపృష్ఠే పంచవక్త్రో మహేశ్వరః॥ (29)

అనగా నలువైపుల 2.2 న్యాశముల చొప్పున రచించినచో పంచవక్త్రమగును.-

(అనుబంధము 6, 7 పటములు చూడుడు)

## 9. చతుర్ముఖము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ యదాచ పంచవక్త్రస్య మధ్యే గర్భోనదీయతే
బాహ్యరేఖాదికం ప్రాగ్వత్ దిక్షుసర్వాసు కల్పితే॥ (266)
చతుః స్తంభసమాకార్యా మధ్యేచాస్య చతుష్కికా
వితానంచో పరిన్యస్యే న్మధ్యత స్తస్యభూషణం॥ (267)
హరోహిరణ్య గర్భశ్చ హరిర్దినకర స్తథా
ఏతేచతుర్ముఖేస్థాప్యా నాపరేషాంభవత్యయం॥ (268)

తా॥ పంచవక్త్రమునకు మధ్యగర్భము లేకుండచేసి వెలుపలి రేఖలననుసరించి చుట్టూ పనిచేసి మధ్యను 4 స్తంభములును తోరణములును చేసి. దీనియందు ఈశ్వరుడు. బ్రహ్మ విష్ణువు సూర్యుడు

ఈ నలుగురిని మాత్రము ప్రతిష్ఠించ వలయును ఇతర దేవతలుండ రాదు. దీనిని చతుర్ముఖమందురు. అపరాజిత 168వ సూ

శ్లో॥ పంచవక్త్రస్య సంస్థానే- స్వాచ్చతుర్ధిక్షు కేశరి
ద్వికోష్ఠకం త్యజేత్ స్తంభం దాపయేచ్చ చతుష్కికాం॥ (30)
చతుర్ముఖ స్తదానామప్రాసాదఃస్యాన్మనోహరః విధేర్విష్ణోరవేః
కుర్యాచ్ఛంభోః కుర్యాద్య దృచ్ఛయా॥ (31)

అనగా పంచవక్త్రమునకు రెండుకోష్ఠములును కేశరులను తగ్గించి. 4 స్తంభములను నిలిపినచో చతుర్ముఖమగును. బ్రహ్మ విష్ణు సూర్య శివ ప్రతిష్ఠలను యిష్టమువచ్చినట్లు చేసికొనవచ్చును.

(అనుబంధము 8వ పటము చూడుడు)

## 10. నవాత్మకము

సమరాంగణ 56వ అధ్యాయము

శ్లో॥ చతుః షష్టికరేకుర్యాత్ క్షేత్రేమానైక వింశతిః
సప్తవర్గ పదోగర్భ భిత్త్యాసహ విధీయతే॥ (269)
స్యాద్గర్భభిత్తిర్భాగేన భాగేనైవాంధకారికా
షడ్భాగం కర్ణవిస్తారం దశధాప్రవిభాజయేత్॥ (270)
షడ్భిరాగైర్భవేదస్య గర్భోభిత్త్యా సమన్వితః
బాహ్యభిత్తిర్భ వేద్భాగాత్ భాగశ్చైవాంధకారికా॥ (271)
ద్విభాగంకర్ణ వైపుల్య ముదకాంతర భూషితం
శేషోభద్రస్య విస్తార శ్చతుర్థాంశ వినిర్గతః॥ (272)
క్షోభయేదర్ధ భాగేతు తదర్ధేనజలాంతరం
మత్తవారణకైర్విద్యాత్ స్తంభై రుపరిశోభితాః॥ (273)
రథికైకాత్రి భాగేన పునః సార్ధద్వి భాగికా
తాసాంపరస్పరక్షేపో భాగోభాగో విధీయతే॥ (274)
శేషం శిఖరవిస్తారః సార్ధషట్కం తదుచ్ఛ్రయః
పృధక్సూత్రైస్త్రి గుణితై ర్వేణుకోశం సమాలిఖేత్॥ (275)

స్కంధకోశాంతరం భాగైశ్చతుర్భి స్తస్యభాజయేత్
గ్రీవార్ధ భాగముత్సేధో భాగేనామలసారకం॥ (276)
పద్మశీర్షంతథా భాగం కలశో భాగసమ్మితః
అర్ధ భాగసముత్సేధం కారయేద్బీజపూరకం॥ (277)
సర్వకర్ణేషు కర్తవ్యాః క్రియాశ్చైవం విచక్షణైః
దిక్సూత్ర బాహ్యభాగేషు వలభీంసన్నివేశయేత్॥ (278)
నిర్గమోపంచ భాగఃస్యాత్ తిర్యక్ ప్రక్షిప్త భాగికాః
అస్యాద్విభాగికో గర్భో మధ్యే భాగత్రయోచ్ఛ్రితః॥ (279)
భాగార్ధ భాగం భిత్తిఃస్యాత్ తత్సమాచాంధకారికా
తస్యాశ్చాగ్రం విధాతవ్యం షడ్దారుకసమన్వితం॥ (280)
ఏకైకాంరథికాంసార్ధ భాగాం కర్ణేషు యోజయేత్
శేషం భద్రస్య విస్తారో భాగః స్యాదస్య నిర్గమః ( 81)
ఏవంభద్రం ద్విభాగంస్యాత్ స్తంభద్వయసమన్వితం
వలభ్యావక్త్రయోర్మధ్యే భాగమేకంచ విస్తృతం॥ (282)
తత్రోదకాంతరం కుర్యాద్ గుణద్వారవిభూషితం
నవభాగోచ్ఛ్రితాజంఘా పీఠమస్య తదర్ధతః॥ (283)
మేఖలాంతరపత్రేచ కుర్యాద్భాగద్వయోన్మితే
రథికాస్యాద్ ద్విభాగాచతతః సార్ధైకభాగికా॥ (284)
శేషంశిఖరవిస్తారః పంచాంశం శిఖరోచ్ఛ్రయః
ఉపర్యుపరికర్తవ్యం సర్వతోభద్రకద్వయం॥ (285)
ద్వేద్వేచ సర్వతోభద్రే కర్ణే కర్ణనివేశయేత్
దిక్సూత్రేషు సమస్తేషు క్రియామేవం ప్రకల్పయేత్॥ (286)
విస్తారః శిఖరస్యాష్టౌ భాగాః సార్ధం సముచ్ఛ్రయః
పంచవ్యాసేన సూత్రేణ వేణుకోశం సమాలిఖేత్॥ (287)
వేణుకోశాంతరం చాస్య త్రిభిర్భాగైర్విభాజయేత్
గ్రీవాచపద్మశీర్షంచ భాగేనస్యాది దద్వయం॥ (288)

ప్రత్యేకం భాగికౌ కార్యా కలశామలసారకౌ
నవాత్మకోఽయంకథితః ప్రాసాదస్త్రిదశాలయః॥ (389)

తా॥ ఆఱువదినాలుగు హస్తములు క్షేత్రమానముచేసి దానిని 21 భాగములుచేసి గర్భము గోడతోసహా 7 భాగములును, ఆ గోడ 1 భాగము విస్తారమును, అంధకారిక 1 భాగమును మరల గోడ 1 భాగమును కర్ణముయొక్క విస్తారము 6 భాగములును, చేసి మరియు దానినే 10 భాగములు చేసి గర్భము 6 భాగములు గోడతోసహా వెలుపలి గోడ 1 భాగము అంధకారిక 1 భాగము కర్ణముయొక్క విస్తారము 2 భాగములు జలాంతరముతో నుండవలెను. మిగిలినది భద్రముయొక్క విస్తారమును చేయవలెను. శాల 4 భాగములుండవలెను. అందు 4వ వంతు నిర్గమమును చేయవలెను. అర్ధ భాగమును తగ్గించి జలాంతరమును చేయవలెను. మదపుటేనుగులును వానిపైన స్తంభములును చేయవలెను. రథిక మొదటిది 3 భాగములును, తరువాత $2\frac{1}{2}$ భాగములును, వానిలో ఒక్కొక్కదానికి క్షేపము 1.1 భాగమును చేయవలెను. మిగిలినది శిఖరముయొక్క విస్తారమును చేయవలెను దానియెత్తు $6\frac{1}{2}$ భాగములు చేయవలెను. మూడురెట్లుగల సూత్రముతో వేణుకోశమును రచించవలెను. స్కంధకోశాంతరము 4 భాగములుచేసి గ్రీవ $\frac{1}{2}$ భాగముయెత్తును, అమలసారము1భాగంఎత్తునుపద్మశీర్షము1భాగముకలశము 1భాగమును. ఆపైనబీజపూరకము భాగమును చేయవలెను. అన్నికర్ణములయందుఇట్లుచేయవలెనుదిక్సూత్రముయొక్క వెలుపలి భాగమునవలభిని రచించవలెను. నిర్గమము అందులో 5వ భాగము చేయవలెను. అడ్డముగా నొకభాగమును చేయవలెను. దీనికి గర్భము 2 భాగములును మధ్య 3 భాగముల యెత్తును గోడ $1\frac{1}{3}$ భాగమును దానితో సమముగ అంధకారికయును దానిముందు చేయవలెను. షడ్దారుకమును రచించవలెను. ఒక్కొక్కరథికను $1\frac{1}{2}$ భాగము చొప్పున కర్ణములయందు చేయవలెను. మిగిలినది భద్రముయొక్క విస్తారము చేయవలెను. దానియొక్క నిర్గమము 1 భాగ

ముండవలెను. భద్రము 2 భాగములును స్తంభములు 2ను వలభియొక్క చుట్టు కొలతలోపల 1 భాగము విస్తారము చేయవలెను. దానికి జలాంతరము చేయవలెను. 3 ద్వారములుండవలెను. జంఘ 9 భాగముల యెత్తును దానియొక్క పీఠము అందులో సగమును, మేఖల ఆంతరపత్రము యీ రెండును కలిసి 2 భాగములును, రథిక 2 భాగములును దానిపైవ 1½ భాగములు......మిగిలినది శిఖరము యొక్క విస్తారమును, ఆ శిఖరము యెత్తు 5 భాగములును, పైపైన సర్వతోభద్రములను రెండింటిని రచించవలెను. సర్వతో భద్రమున ప్రతి కర్ణమునను 2.2 కర్ణములను రచించవలెను. అన్ని దిక్సూత్రముల యందును ఈ ప్రకారము చేయవలెను. విస్తారము శిఖరము 8 భాగములును, ఎత్తు 8½ భాగములును, 5 రెట్లుగలసూత్రముతో వేణుకోశమును రచించవలెను. వేణుకోశాంతరమును 3 భాగములుచేసి గ్రీవ పద్మశిఖరము, యీ రెండును 1 భాగమును, కలశమును 1 భాగమును అమలసారమును 1 భాగమును చేయవలెను. ఇది నవాత్మకము.

## 11. నవాత్మకమున దేవన్యాసము

సమరాంగణ 55వ అధ్యాయము

శ్లో॥ విన్యసేదీశమైశాన్యా మాగ్నేయ్యాం పురుషోత్తమం
బ్రహ్మాణంవాయుదిగ్భాగే నైరృతేచదివాకరం॥ (290)
మధ్యగర్భేశివః స్థాప్యః ప్రాచ్యామపి పురందరః
ధర్మోయామ్యాం ప్రతీచ్యాంచ వరుణః సోమఉత్తరే॥ (291)
భక్తానాం శక్తి సంపన్నః పూర్వాయతనసన్నిధౌ
ప్రాసాదంకారయేద్యత్నాత్ తదాద్యంనైవపీడయేత్॥ (292)
ఉత్కృష్టమపకృష్టంవా యత్రస్థానేనివేశయేత్
ప్రాసాదం తత్రకర్మాణియానితాన్యభి దద్మహే॥ (293)
సమ్ముఖంనైవకుర్వీత హీనంవాయుదివాధికం.
వేధభాగసంశ్రితంస్యాత్ ప్రాసాదోఽతివిగర్హితః॥ (294)

అనోన్యస్యందక్షిణేవేధో హీనఇత్యభిధీయతే
వేధభాగభృతేర్మృత్యుం హీనేహానిం వినిర్దిశేత్॥ (295)
హాకోహిరణ్య గర్భశ్చ హారిర్దినకర స్తథా
ఎతే దేవాః సమాఖ్యాతాః పరస్పరవిరోధినః॥ (296)
ఏతానదక్షిణాపార్శ్వే స్థాపయేత్పురమాశ్రితాన్
వామతోనాన్య దేవానాం నాపిహీనాలయేషుచ॥ (297)
నైతేషాందక్షిణేకుర్యా దన్యేషామపిచాలయం
హీనంవాయదివాహీనం యదీచ్ఛేచ్ఛ్రియ ఆత్మనః॥ (298)
తేషాముత్తరతోహీనం యదీచ్ఛేద్దేవతాలయం
ప్రాసాదపదమానేన నవషట్త్రింశదంతరే॥ (299)
ప్రాసాదంకారయేదన్యం మర్మవేధనివర్జితం
పురతః పృష్ఠతోవాపి పార్శ్వయోరుభయోరపి॥ (300)
మహామర్మాణిచత్వారి కుర్యాద్యత్నాద్యథోత్తరం
స్థూణామధ్యేషుసర్వేషు ద్రవ్యమేకంనదాపయేత్॥ (301)
తదాయుగ్మ... వేధమర్మ వివర్జితం
స్థూణమధ్యేయదాద్రవ్య మేకంమోహాత్ప్రదీయతే॥ (302)
కర్తృకారకయోః పీడాభవేత్పూజానతాదృశీ
తస్మాత్సర్వప్రయత్నేన స్థపతిః కారకోఽపిచ॥ (303)
మర్మాణివర్జయేద్యత్నాత్ ప్రాసాదస్య సమీపతః
అథమర్మనియుక్తం యః ప్రాసాదంకర్తుమిచ్ఛతి॥ (304)
ప్రాసాదతః సదా తేన విధేయం మహదంతరం
ప్రాసాదంతూత్తరే కార్యంఫలపుష్పైర్విభూషితం॥ (305)
యవిత్రైర్లతగైర్యుక్తం కారయేద్దేవతాలయం
ధనధాన్యమవాప్నోతి మోదతే సుఖమేవచ॥ (306)
హారోహిరణ్యగర్భశ్చ హారిర్దినకరోఽపిచ ఏతే దేవాః
సమాఖ్యాతా దేవానామపి పూజితాః (307)

పృథక్ త్వేనచకర్తవ్యా ఏకరూపసమన్వితాః
అష్టబాహుశ్చతుర్వక్త్రః కుండలీముకుటోజ్జ్వలః॥ (308)
హారకేయురసంయుక్తో రత్నమాలోపశోభితః
ఋష్యాగతపురః కార్యః పద్మహస్తోదివాకరః॥ (309)
శంఖచక్రధరోదేవో వామేచమధుసూదనః
కంఠాభరణసంయుక్తో మూర్ధాచముకుటోజ్జ్వలః॥ (310)
బ్రహ్మ పశ్చిమతః కార్యోబృహజ్జఠర మండలః
కుండికామాక్షసూత్రంచ దధత్ కూర్చవిభూషితః (311)
"ప్రాసాదారుచకాదయోఽత్రలతినాః ప్రాగ్వింశతిఃపంచయుక్
తావంతశ్చతతోఽను కేసరిముఖాః సాంధారికాః కీర్తితాః।
మిశ్రాఖ్యానవపంచచాను కథితా స్తద్వన్నిగూఢాఖ్యయా
షష్టిఃస్యాచ్చతురన్వితే తివిదితా స్సైషాభవేత్ర సంపదే॥(312)
ఇతి సమరాంగణ సూత్రధారనామ్నివాస్తు శాస్త్రేరుచకాది
చతుః షష్టిప్రాసాదకోనామ షట్పంచాశోఽధ్యాయః

తా॥ ఈశాన్యమున ఈశ్వరుని, ఆగ్నేయమున విష్ణువును, నైరృతిన సూర్యుని, వాయవ్యమున బ్రహ్మను, మధ్యగర్భమున శివుని స్థాపించవలెను. తూర్పున ఇంద్రుని, దక్షిణమున యముని, పడమర వరుణుని, ఉత్తరమున కుబేరుని స్థాపించవలెను. తూర్పు ఆలయము యొక్క యెదుట భక్తులను స్థాపించి ప్రాసాదమును రచించవలెను. ఇట్లు మొట్టమొదటరచించిన యెడల నెట్టి దోషములుండ నేరవు, ఉన్నత స్థానములుగాని లేక సామాన్య స్థానములుగాని పనికి వచ్చును. మరియు ప్రాసాదమున నిర్మించవలసిన విధానమును చెప్పుచున్నాడు. హీనముగాని అధికముగాని యెదుట రచించగూడదు నాలుగు భాగములతోగూడిన ప్రాసాదము పనికిరాదు. ఒకటికొకటి దక్షిణమున వేధగలిగియున్న నదిహీనమనిపించుకొనును. మరియు వేధ గల భాగముతోగూడిన దేవాలయము మృత్యువును గలిగించును. హీనము హాని కలిగించును. ఈశ్వరుడు బ్రహ్మ, విష్ణువు, సూర్యుడు

ఈ దేవతలు ఒకరికొకరు విరుద్ధము కలవారు. వీరిని దక్షిణమునను ప్రక్కలను గ్రామము నాశ్రయించి స్థాపించగూడదు. ఇతర దేవతలను ఎడమవైపున నుండునట్లు హీనమందిరములను సైతము నిర్మించరాదు. కనుక వీరిని దక్షిణముననే యుంచవలెను. ఒకప్పుడు త్రిమూలయములనైనను ఇతర దేవతలకు దక్షిణముననే యుంచవలెను. ఒకప్పుడుత్తరమున హీనదేవాలయమును రచించదలచినచో ప్రాసాదము యొక్క భాగముల ప్రకారము 9 గాని లేక 36 గాని నలుచదరముగా భాగములతో ప్రాసాదమును చేయవలెను. మర్మవేధ లేకుండునట్లుండవలెను. ముందుగాని వెనుకగాని లేక యిరువైపులగాని నిర్మించునపుడు మహామర్మవేధలు లేకుండ రచించవలెను. గోడమధ్యను ఒకటే వస్తువు నుపయోగించరాదు. రెండు వస్తువులుపయోగించవలయును. గోడమధ్యను ఒక్కటే ద్రవ్యమును తెలియక యుపయోగించినచో కర్తృకారకులిరువురకు పీడలు కలుగును. అటువంటిది పూజింపబడదు కనుక స్థపతి యిట్టివన్నియును తెలిసికొని మర్మదోషములు లేకుండ ప్రాసాదముయొక్క సమీపమున రచించుచుండవలెను. ప్రాసాదమునకుత్తరమున ఫలపుష్పవృక్షములతో నలంకారము చేయవలెను. దేవాలయమిట్లు లక్షణయుక్తముగ నుండవలెను. ధనధాన్యవృద్ధికలుగును. సంతోషముతో నుందురు. శివుడు, బ్రహ్మ, విష్ణువు, సూర్యుడు, వీరు దేవతలచేతనుగూడ పూజింపదగినవారు. ఎనిమిది చేతులును, నాలుగు మోములును, కుండలములు కిరీటములు కలవాడు బ్రహ్మ. హారములు బాహుపురులు రత్నమాలలు ఎదురుగా బుషులును పద్మము చేతియందుననుకలవాడు సూర్యుడు. శంఖము చక్రము ఎడమచేతియందును కంఠాభరణమును శిరస్సున కిరీటమును కలవాడు విష్ణువు. బ్రహ్మపడమరనుండవలెను. పెద్దపొట్టగలవాడు కుండిక, అక్షసూత్రము కూర్చ మొదలగువానితోనుండును. రుచకము మొదలైనలలితములు 25ను, కేసరి మొదలైన సాంధారములు 25ను, భవము మొదలగు

మిశ్రములు 9యును, నిగూఢసాంధారములు లత మొదలగు 5ను, మొత్తము 64 చెప్పబడినవి.

(అనుబంధము 9, 10 పటములు చూడుము)

## నవత్మకము మఱియొకపద్ధతి

అపరాజిత 168వ సూ॥

శ్లో॥ పంచషష్టి కరైశ్శ్రేష్ఠో మధ్యమః స్యాచ్ఛతార్థతః
కనిష్ఠః పంచత్రింశద్భిస్త్రి విధః స్యాన్నవాత్మకః 32
చతురశ్రీకృతే క్షేత్రే చైకవింశతిభాజితే
షడ్భాగికోభవేత్కర్ణో నిర్గమః పంచభాగికః॥ 33
సమాకారోభవేత్కర్ణః శతమూలవిభాజితః
భాగోభాగాభ్రమోభిత్తిః శేషంగర్భగృహంభవేత్॥ 34
తత్ప్రమాణేన కర్తవ్యా భ్రమంతీబాహ్యభిత్తికా
నవభాగంమధ్యకోష్ఠం క్షేత్రభాగోర్ధ్వతో భవేత్॥ 35
చతుర్భద్రంచతుష్కర్ణం మధ్యేస్యాద్గర్భకోష్ఠకం
కర్ణేతథాద్విద్విశృంగం సర్వభద్రోనవాండకః 36
నవాంశంమూల శిఖరంవలభీ భద్రభద్రితః
ఘంటాకలశ సంయుక్త పతాకాధ్వజభూషితం॥ 37
నవాత్మక స్తదానామ కర్తవ్యోవవద్దైవతే
ఈశాన్యామీశదేవఃస్యా దాగ్నేయాంపురుషోత్తమః 38
బ్రహ్మచవాయుదిగ్భాగే నైరృత్యేచ దివాకరః
మధ్యగర్భేశివః స్థాప్యః ప్రాచ్యాంచైవ పురందరః॥ 39
ధర్మోయామ్యాంథవరుణః పశ్చిమేసోమ ఉత్తరే
ఇమందేవాలయంకుర్యాత్ ప్రాసాదంసర్వ శాంతిదం॥ 40
సుభిక్షంక్షేమమారోగ్యం యత్రదేశేఽముద్భవేత్॥

తా॥ నవాత్మకము 65 హస్తములుత్తమము, 50 హస్తములు మధ్యమము, 35 హస్తములు అధమము. నలుచదరమును 21 భాగములు

చేసి కర్ణము 6 భాగములును నిర్గమము అందు 5వ భాగమును చేసి కర్ణమును సమముగా 10 భాగములుచేసి గోడ 1 భాగము అంధకారిక 1 భాగము మిగిలినది గర్భగృహము అదే ప్రకారము 1 భాగము వెలుపలి గోడయును చేయవలెను. మధ్యకోష్ఠము 9 భాగములు చేయవలెను. ఎత్తును అంతే చేయవలెను. నాలుగుభద్రములను నాలుగు కర్ణములను చేయవలెను. మధ్యను గర్భకోష్ఠము కర్ణమున 2.2 శృంగములును సర్వభద్రములు 9 అండకములును ప్రధాన శిఖరము 9 భాగములును వలభియును క్షుద్రములును కలిగియుండవలెను. ఘంట కలశము పతాక ధ్వజము. ఇవి యన్నియు నుండవలెను, నవాత్మకమను పేరు కలది యగుచున్నది. 9 మంది దేవతల కుపయోగించును. ఈశాన్యమున ఈశానుడును, ఆగ్నేయమున విష్ణువును, వాయవ్యమున బ్రహ్మయును, నైరృతిన సూర్యుడును, మధ్యగర్భమున శివుడును, తూర్పున ఇంద్రుడును, దక్షిణమున యముడును, పడమర వరుణుడును, ఉత్తమమున కుబేరుడును, ఇట్లు నవదేవతాత్మకమై సమస్తము శాంతిగను సుభిక్షముగను క్షేమముగను, ఆరోగ్యముగను ఉండును.

(అనుబంధము 11వ పటము చూడుడు)

# 13. నాగరోద్భవ విమానపుష్పకప్రాసాదలక్షణము అందలి 25 భేదములును

అపరాజిత 106వ సూ॥

శ్లో॥ విమానవనాగరచ్ఛందే ఉరః శృంగేతు పుష్పకం
విమానపుష్పకచ్ఛందాః కర్తవ్యాః సర్వకామదాః॥ 36

తా॥ విమాన నాగరచ్ఛందమున ఉరః శృంగము నందు పుష్పమును రచించినయెడల విమానపుష్పకజాతి ప్రాసాదమగును.

అపరాజిత 160వ సూ॥

శ్లో॥ పుష్పకో విజయశ్చైవ సుభద్రోనందశ్రీధరా
విశాలోదుందుభిః ప్రాంతోగరుడశ్చారువర్ధనః॥ 1

సింహః పద్మః సంభవశ్చ సుభ్రతశ్చామృతోర్భవః
గృహరాజః సిద్ధికామో నందిఘోషః సునందనః॥ 2
తారాగణో బృహచ్ఛాలో హంసః సర్వాంగసుందరః
తథాచపుష్పవిజయో మేరుః ప్రాసాదనాయకః 3
పంచవింశతిరిత్యుక్తాః ప్రాసాదాః పుష్పకాదయః
విమాన పుష్పకచ్ఛందే సర్వదేవసుఖావహాః॥ 4
విజ్ఞేయః కేశరీపూర్వం పంచాండః కర్ణశృంగతః
విమానం శిఖరం కుర్యాన్మత్తాలం జేషుపుష్పకః॥ 5

తా॥ పుష్పకము మొదలు మేరువువరకు 25 ప్రాసాదములు విమానపుష్పకచ్ఛందమున గలవు. మొదటి కేశరి 5 అండకములతో చేయబడిది. మత్తాలంబములయందు శిఖరములను జేసినచో పుష్పకమగును.

## 14. విజయము

శ్లో॥ ఛందేచదశధాభక్తే కర్ణేశృంగేచనందనః
మల్లతలోర్ధ్వరేఖాంతం విజయః పుష్పకద్వయాత్॥ 6

తా॥ 10 భాగములుచేసి కర్ణమున శృంగముండిన నందనము మల్లతలముపైన రేఖయొక్క పైభాగమువరకు రెండు పుష్పములను రచించినచో విజయమగును.

## 15. సుభద్రము, నందము

శ్లో॥ కేశరీచ ప్రతిరథే సుభద్రః కామదః
కర్ణోర్ధ్వే కేశరీకామ్యః పూర్వనన్దసంజ్ఞకః॥ 7

తా॥ కేశరిప్రతిరథముతో గూడిన సుభద్రమగును. కర్ణములను చేసి రేని నందమగును.

## 16. శ్రీధరము

శ్లో॥ తృతీయో పుష్పకోభద్రే శ్రీధరశ్చేతిసంజ్ఞితః॥

తా॥ పుష్పకమునకు భద్రములు 3 రచించినచో శ్రీధరమగును.

## 17. విశాలము

శ్లో॥ మందరతిలక రేఖా కార్యామల్లత లేతథా। 8
ఉరుమంజరీవి మానేతదగ్రే పుష్పకద్వయం।
ప్రత్యంగేపుష్పకశ్చైవ విశాలః సర్వకామదః। 9
తా॥ మందరమునందు తిలకరేఖనుచేసి మల్లతలమున ఉరు మంజరినిచేయవలెను విమానమునముందు పుష్పకములు2ను ప్రత్యంగ మున పుష్పకమును చేసినచో విశాలమగును.

## 18. దుందుభి

శ్లో॥ రేఖోర్ధ్వే తిలకంకుర్యాచ్ఛృంగం పంచాండకంఖలు
దుందుభిర్నామప్రాసాదః కర్తవ్యః సర్వదైవతే॥ 10
తా॥ రేఖపైన తిలకమును 5 అండకములతో శృంగమును చేసినచో దుందుభి యగును.

## 19. ప్రాంతము

శ్లో రేఖోర్ధ్వేచతతః శృంగం పంచాండకవిభూషితం
ప్రాంతశ్చేతిసమాఖ్యాతః కర్తవ్యః శాంతిమిచ్ఛతా॥ 11
తా॥ రేఖపైన విస్తారమైనశృంగము 5 అండకములతోనుండె నేని ప్రాంతమగును.

## 20. గరుడము

శ్లో॥ ఉరుమంజరీప్రత్యంగే తాంకుర్యాత్కుముదోద్భవాం
పుష్పకం మంజరీస్థానే గరుడశ్చేతిసంజ్ఞితః॥ 12
తా॥ ప్రత్యంగమున ఉరుమంజరియును కుముదోద్భవమును మంజరీస్థానమున పుష్పకమును చేసినచో గరుడమగును

## 21. చారువర్ధనము

శ్లో పృథ్వీజయోభవేత్పూర్వం శిఖరం వైమల్లతలం
ఉరః శృంగేపుష్పకస్తు సభవేచ్చారువర్ధనః॥ 13
తా॥ భూజయమునకు మల్లతలమున శిఖరమును ఉరఃశృంగ

మున పుష్పకమును చేసినచో చారువర్ధనమగును.

## 22. సింహము

శ్లో॥ ద్విపుష్పక యుతంభద్రం విమానేమంజరీద్వయం
సింహసంజ్ఞః సకర్తవ్యోత్య దేవీనాం శాంతిమిచ్ఛతా॥ 14

తా॥ భద్రమున 2 పుష్పకములును, విమానమున 2 మంజరులును, చేసినచో సింహమగును. దేవీగృహములకు శాంతికరముగనుండును.

## 23. పద్మము

శ్లో॥ పంచాండకాని శృంగాణి రేఖోర్ధ్వేతిలకం శుభం
పద్మ సంజ్ఞస్తదానామ కర్తవ్యః సర్వదైవతే॥ 15

తా॥ రేఖపైన తిలకమును 5 అండకములు శృంగములును చేసినచో పద్మమగును. సమస్త దేవతలకుపయోగము.

## 24 సంభవము

శ్లో॥ కర్తన్యాచతృతీయోరు మంజరీ కుముదోద్భవా
తదగ్రేపుష్పకోనంద్యాం తిలకంసతు సంభవః॥ 16

తా॥ మూడవ ఉరుమంజరిని కుముదోద్భవమును దానిముందు పుష్పకమును నందియందు తిలకముచేసినయెడల సంభవమగును.

## 25. సుధితము

శ్లో॥ పంచాండకశ్చ రేఖోర్ధ్వే సుత్రతోనామశోభనః॥

తా॥ రేఖపైన 5అండకములు కలిగియున్నచో సుధ్రతమగును.

## 26 అమృతోద్భవము

శ్లో॥ శృంగాణిభద్రకర్ణేష్వ మృతోద్భవోద్విపుష్పకః॥ 17

తా॥ భద్రముయొక్క కర్ణములయందు శృంగములున్నచో అమృతోద్భవమగును.

## 27. గృహరాజము

శ్లో॥ రేఖోర్ధ్వేతిలకంచైవ పుష్పకాకార సంస్థితం

గృహరాజస్తదానామ కర్తుః సంతానవర్ధనః॥ 18

తా॥ రేఖపైన తిలకమును పుష్పకమువంటి ఆకారమును చేసినచో గృహరాజమగును. సంతానవృద్ధికరము.

## 28. సిద్ధికామము

శ్లో॥ ఇంద్రనీకేమూలరేఖా ఉరఃశృంగేతు పుష్పకః
ప్రత్యంగేపంచతద్రూపాః సిద్ధికామః సఉచ్యతే॥ 19

తా॥ ఇంద్రనీలమున ప్రధానరేఖ ఉరః శృంగమున పుష్పకము ప్రత్యంగమున అట్టిరూపములు 5ను చేసినయెడల సిద్ధికామమగును.

## 29. నందిఘోషము

శ్లో॥ కార్యాఊర్ధ్వేఽర్కమంజర్యః స్వచ్ఛందాచ్చవిమానకః
నందిఘోషస్తదానామ కర్తవ్యః సర్వదైవతే॥ 20

తా॥ పైన 12 మంజరులును, స్వచ్ఛందముగా విమానములును చేసినచో నందిఘోషమగును.

(అనుబంధము 12వ పటము చూడుడు)

## 30 సునందనము

శ్లో॥ వస్యశృంగాణిసర్వాణి కుర్యాత్పంచాండకానిచ
సునందనస్తదారామ సర్వశాంతి ప్రదఃసదా॥ 21

తా॥ పై చెప్పినదానికి శృంగములన్నియును 5.5 అండకములతో జేసినచో సునందనమగును. ఇది శాంతిప్రదమైనది.

## 31. తారాగణము

శ్లో॥ ప్రత్యంగేచ ఉరఃశృంగం కుర్యాత్తుకుముదోపమం
రేఖోర్ధ్వేచైవతిలకం సతారాగణ ఉచ్యతే॥ 22

తా॥ ప్రత్యంగమున ఉరఃశృంగమునుచేసి కుముదముతో సమానముగాను, రేఖపైన తిలకమును చేసినయెడల తారాగణమగును

## 32. బృహచ్ఛాలము

శ్లో॥ భద్రే కర్ణేచశృంగాణి మత్తాలంబద్వయంతథా

బృహచ్ఛాలస్తునామ్నా ఒసౌ కర్తవ్యః సర్వదైవతే॥ 23

తా॥ భద్రమునను కర్ణము ననుశృంగములును, మత్తాలంబములు 2ను, చేసినయెడల బృహచ్ఛాలమగును.

## 33. హంసము

శ్లో॥ రేఖోర్ధ్వేచ తతః శృంగం పంచాండకవిభూషితం

హంసనామాసచప్రోక్తః సర్వదేవేషుశాశ్వతం॥ 24

తా॥ రేఖపైన విస్తారమైన శృంగమును 5 అండకములను చేసినచో హంసమగును.

## 34. సర్వాంగసుందరము

శ్లో॥ రత్నకూటేమూలరేఖా కార్యంమల్లతలంతధా।

పుష్పకాశ్చత్రయోభద్రే విమానేచోరుమంజరీ॥ 25

సర్వాంగసుందరోనామ కర్తవ్యస్తుశివాత్మజే॥ 25

తా॥ రత్నకూటమున ప్రధానరేఖను చేసిమల్లతలమున పుష్పకములు 3ను, భద్రమునను విమానమునను ఉరుమంజరులను రచించినచో సర్వాంగసుందరమగును.

(అనుబంధము 13వ పటము చూడుడు)

## 35. పుష్పవిజయము

శ్లో॥ ఉరుమంజరీ ప్రత్యంగే తదగ్రేచద్విపుష్పకం॥ 26

రేఖోర్ధ్వేతిలకం కుర్యాత్ పుష్పకాకారరూపకః।

సఖ్యాతః పుష్పవిజయః కర్తవ్యః సర్వకామదః॥ 27

తా॥ ప్రత్యంగమున ఉరుమంజరియును దానియందు 2 పుష్పకములును, రేఖపైన తిలకమును చేయవలెనుపుష్పకాకారమునసుండుటచే పుష్పవిజయమగును.

## 36. మేరువు

శ్లో॥ తస్యశృంగాణి సర్వాణి కుర్యాత్పంచాండకానిచ

మేరుసంజ్ఞకమిత్యేవం సర్వకామప్రదాయకం॥ 28

శ్లో॥ మల్లతలం ద్వాదశధా ద్విభాగః కర్ణ విస్తరః
సార్ధభాగః ప్రతిరథో భాగార్ధా చైవకర్ణికా॥ 29
చతుర్భాగాయతంభద్ర మర్ధభాగంతునిర్గతం
కర్ణానుగానిశృంగాణి భూమిజే పంచభూమవత్ ॥ 30
శ్రీవత్సేకర్ణశృంగాణి పంచభూభూమిజే యథా
కర్ణికాచార్ధభాగాస్యా త్పంచభద్రం విమానకే॥ 31
భద్రేకర్ణేచశృంగాణి త్రిభూమేభూమిజేయథా
కుముదాఖ్యస్తదానామ భద్రలక్షణసంయుతః 32
ఇతి.........అపరాజితపృచ్ఛాయాం
నాగరోర్భవ విమానపుష్పకప్రాసాద లక్షణాధికారోనామ
షష్ట్యుత్తరశతతమం సూత్రం—

తా॥ పైజెప్పినదానికి శృంగములు అన్నియును, అండకములు గను చేసినచో మేరువగును. మల్లతలమును 12 భాగములుచేసి కర్ణము 2 భాగములును, ప్రతిరథము 1½ భాగములను, కర్ణిక ½ భాగములను భద్రము 4 భాగములును, భద్రముయొక్క నిర్గమము ½ భాగమును, కర్ణము ననుసరించి శృంగములును, భూమిజ ప్రాసాదమున 5 అంతస్తులుగల దానివలె శ్రీవత్సమున కర్ణశృంగములును, అయిదంతస్తుల భూమిజములన యెట్లో అట్లే కర్ణిక ½ భాగమును, విమానిమున భద్రము 5 భాగములును, భద్రమునను కర్ణమునను శృంగములును మూడంతస్తులుగల భూమిజములన యెట్లో అట్లే కుముదాఖ్యమును భద్రలక్షణములదో గూడియున్నచో మేరుప్రాసాదమగును.

అపరాజితపృచ్ఛయందు 160వ సూత్రమున నిట్లు చెప్పబడియున్నది.

## 37. కైలాస ప్రాసాద లక్షణము
## అందలి 25 భేదములు

అపరాజిత 155వ సూ॥

శ్లో॥ చతురశ్రాః సమాః శుద్ధాః
కర్ణోర్ధ్వేచసువృత్తకాః సింహాకర్ణైర్విభూషితోర్ధ్వాః
పూర్వాలంకారశోభితాః॥ 15
చతుర్ద్వారేషు ప్రాగ్గ్రీవాః సువితానైర్విభూషితాః
కైలాసాద్యాః సముత్పన్నా వృత్తాః పంచశతానిచ॥ 16

తా॥ నాలుగుప్రక్కల సమానముగా కర్ణములను, ఆకర్ణముల పైన గుండ్రములును, సింహాకర్ణములుపైనను పూర్వము చెప్పబడిన యలంకారములును, నాలుగు వాకిళ్ళను ప్రాగ్గ్రీవములతోను మంచి నివాసములతోను రచించినయెడల కైలాసమగును. అందు భేదములు 500 కలవు. (అనుబంధము 14వ పటము చూడుడు)

అపరాజిత 161వ సూత్రము

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదానాంతులక్షణం
నామపాదప్రమాణంచ ప్రయుక్తంకుంభకాదికం॥ 1
కుంభకఃస్వామిభద్రశ్చ గరుడశ్చసుశీలకః
స్వస్తిక శ్చైవకైలాసోనవినోభిన్నమందరః॥ 2
గజభద్రస్తథాతుంగ ఉదకుంభశ్చమోదకః
గవాక్షః సింహభద్రశ్చ ఇంద్రమిత్రశ్చనందకః॥ 3
పద్మాక్షః కీర్తిదశ్చైవ వజ్రకశ్చంద్రహర్షణౌ
నిషధోనామప్రాసాదః సర్వకామార్థసాధనః॥ 4
సర్వాంగతిలకోజ్ఞేయః స్వామిభరణఏవచ
భిన్నమేరుస్తథానామ ప్రాసాదా దేవదుర్లభాః॥ 5

తా॥ భాగములననుసరించియు లక్షణములననుసరించియు కుంభకము మొదలైన 25 నామములేర్పడినవి.

## 38. కుంభకము స్వామిభద్రము

శ్లో॥ వేదాశ్రమష్టభిర్భక్తం కర్ణాంతేతుసువృత్తకం
పీఠోపపీఠజంఘూర్చ మేఖలాకూటచ్ఛాద్యకం॥ 6
వృత్తాకారంసర్వమిదం సపాదంశృంగమున్నతం
ఘంటాకలశశోభాఢ్యం ప్రాగ్గ్రీవాగ్రసుశోభితం॥ 7
కైలాసచ్ఛందకోత్పన్న ఆద్యఃకుంభకసంజ్ఞితః
కుంభకాదిసముత్పన్నాః ప్రాసాదాఃపంచవింశతిః॥ 8
పరిధావష్టధాభక్తే ద్విద్వ్యంశందిక్షుభద్రకం
నిర్గమశ్చార్ధభాగేన స్వామిభద్రశ్చనామతః॥ 9

తా॥ నాలుగుకోణములను 8 భాగములుచేసి కోణముయొక్క చివర వృత్తమును లిఖించి పీఠము, ఉపపీఠము, జంఘ, మేఖల, కూటము, ఛాద్యము. ఇవి యన్నియును గుండ్రముగానే రచించి $1\frac{1}{4}$ భాగము శిఖరము యెత్తుచేసిఘంటి. కలశముపీనితోను ముందు ప్రాగ్గీవమును రచించినట్లయిన కైలాసజాతినుండి కలిగిన మొదటిది కుంభకప్రాసాదమగును దానివలన వరుసగా 25 భేదము లేర్పడినవి. చుట్టుగీతను 8 భాగములుచేసి అందు 4 భాగములు భద్రమును, నిర్గమము $\frac{1}{2}$ భాగమును ఇట్లు నలువైపుల రచించిరేని స్వామి భద్రమగును.

## 39. గరుడము సుశీలము స్వస్తికము

శ్లో॥ ప్రతిభద్రేపక్షిరాజః సుశీలోవారిమార్గతః
కర్ణాష్టకంచాష్టభద్రం స్వస్తికంసతునామతః॥ 10

తా॥ పైజెప్పినదానినే ప్రతిభద్రము రచించిన-చో గరుడ మగును. జలాంతరమును కల్పించిన-చో సుశీలమగును. కర్ణములు 8 భద్రములు 8 రచించినయెడల స్వస్తికమగును.

(అనుబంధము 15వ పటము చూడుడు)

## 40. కైలాసము, నళినము

శ్లో॥ భద్రకర్ణకయోర్మధ్యే భద్రపాదేతుకర్ణికా
కైలాసశ్చతదానామ సిద్ధకిన్నరసేవితః॥ 11
కుర్యాద్భద్రాణితస్యైవ భద్రార్ధేనవినిర్గతం
నలినశ్చతదానామ కర్తవ్యో దేవతాలయః॥ 12

తా॥ భద్రము కర్ణము వీనియొక్క మధ్యను భద్రపాదమున కర్ణికయును రచించిన యెడల కైలాసమగును. దానికే భద్రములును అందులో సగము నిర్గమమును రచించినచో నలినమగును.

## 41. భిన్నమందరము గజభద్రము తుంగము

శ్లో॥ షోడశోరస్కశృంగాణి అష్టభద్రంతు యోజయేత్
సభిన్నమందరః ఖ్యాతః కర్తవ్యః సర్వశాంతిదః॥ 13
చతుర్భద్రేషు ప్రాగ్గ్రీవా గజభద్రశ్చనామతః
కర్ణవృత్తేషుకర్ణేషు తుంగనామాస ఉచ్యతే॥ 14

తా॥ ఉరఃశృంగములు 16ను, భద్రములు 8 యును, కల్పించినచో భిన్నమందరమగును. భద్రములు 4ను, వానికి ప్రాగ్గ్రీవములును చేసినయెడల గజభద్రమగును. కర్ణములందు గుండ్రని కర్ణములను చేసినయెడల తుంగమగును.

(అనుబంధము 16, 17వ పటములు చూడుడు.)

## 42. ఉదకుంభము - మోదకము

శ్లో॥ కర్ణాశ్చకర్ణికాశ్చైవ స్వస్వవృత్తసముద్భవాః
ఉదకుంభస్తదానామ మోదకశ్చోదకాంతరే॥ 15

తా॥ కర్ణములును, కర్ణికలును వానివాని వృత్తములనుండి కలుగవలెను. దానిని ఉదకుంభమందురు జలాంతరములను కలుగ జేసినయెడల మోదకమగును.

## 43. గవాక్షము - సింహభద్రము

శ్లో॥ అష్టౌ ప్రాగ్గీవకాఽకుర్యాత్ కర్ణయోః స్వస్తికాకృతీః
గవాక్షస్తుతదానామ సిద్ధకిన్నరసేవితః॥ 16
భద్రేసింహావలోకాస్యై ఉద్గమాకారసంస్థితాః
అష్టౌభద్రేషుకర్తవ్యాః సింహభద్రః సనామతః॥ 17

తా॥ స్వస్తికమువలె ప్రాగ్గ్రీవములు 8 కర్ణముల రెంటియందు చేసినచో గవాక్షమగును. భద్రమున సింహావలోకనమును పైకెగయుచున్న యునికియును 8 భద్రములయందు రచించినచో సింహభద్రమగును. (అనుబంధము 18వ పటము చూడుడు)

## 44. ఇంద్రమిశ్రము నందకము పద్మాక్షము కీర్తిదము

శ్లో॥ అశీత్యంశైశ్చపరిధౌచతుర్భద్రంషట్తతః
కర్ణాశ్చద్విపదాఉక్తా భద్రమధ్యేత్రయస్త్రయః॥ 18
ఇంద్రమిశ్రస్తదానామ పూజితస్త్రిదశైరపి
భద్రంరథాశ్చతుష్పాదాః షణ్ణవత్యంశతస్తలం॥ 19
ద్వేద్వేశృంగేచభద్రేషు పద్మాక్షఃసతునామతః
కర్ణాశ్చాష్టదలాః కార్యాః కీర్తిదః సర్వశోభనః॥ 20

తా॥ పరిధి 80 భాగములుచేసి అందు భద్రములు 4ను 12 భాగముల చొప్పునను, నాలుగు కర్ణములు 2 భాగముల చొప్పునను భద్రమధ్య 3 చొప్పున యెనిమిది రథములును. ఇట్లు 80 భాగములు సరిపుచ్చి చేసినయెడల ఇంద్రమిశ్రమగును. మరియు 96 భాగములు చేసి దిశకు 1 భద్రమును 2 రథములును ఇట్లు 8 దిక్కులయందు ఒక్కొక్కటి 4 భాగములచొప్పున రచించినచో నందకమగును. అన్ని భద్రములయందును 2-2 శృంగములును రచించినయెడల పద్మాక్షమగును. కర్ణములు 8 దలములతో చేసిరేని కీర్తిదమగును.

(అనుబంధము 19, 20 పటములు చూడుడు)

## 45. వజ్రకము చంద్రకము హర్షణము

శ్లో॥ ప్రాగ్గ్రీవాశ్చైవభద్రేషు స్థితాదిక్షువిదిక్షుచ
వజ్రకాఖ్యస్తదానామ శక్రాదిసురవల్లభః॥ 21
ప్రాగ్గ్రీవాశ్చతదాఽఽలేఖ్యార్ధవికాకారశోభనాః
చంద్రకశ్చతదానామ వల్లభోరోహిణీపతేః॥ 22
పరిధౌషణ్ణవత్యంశైర్ద్వ్యష్టభద్రంచతుష్పదం
ద్విపదాఃషోడశకర్ణా హర్షణశ్చసమీరితః॥ 23

తా॥ ఎనిమిది దిక్కులయందు భద్రములకు ప్రాగ్గ్రీవములును చేసినేని వజ్రకమగును. ప్రాగ్గ్రీవములు దలాకారములైన లేఖ్యములతో నుండేనేని చంద్రకమగును. పరిధి 96 భాగములు. 4 భాగములు గల భద్రములు 16 చేసి, కర్ణములు 2-2 భాగములచొప్పున 16 చేసిన యెడల హర్షణమగును.

(అనుబంధము 21, 22 పటములు చూడుడు)

## 46. నిషధము సర్వాంగ తిలకము

శ్లో॥ చతుర్భద్రేషుప్రాగ్గ్రీవాః కర్తవ్యాః సర్వకామదాః
నిషధశ్చతదానామ సురకిన్నరసేవితః॥ 24
భద్రకేషుచసర్వేషు ప్రాగ్గ్రీవాంశ్చప్రదాపయేత్
సర్వాంగతిలకోనామ సర్వదేవేషుపూజితః॥ 25

తా॥ నాలుగు భద్రములయందు ప్రాగ్గ్రీవములును శోభించిన పని మునుపటివలెనే చేసినచో నిషధమగును. 8 భద్రములయందును ప్రాగ్గ్రీవములను రచించినయెడల సర్వాంగ తిలకమగును.

## 47. స్వామిభరణము భిన్నమేరువు

శ్లో॥ వజ్రకస్యతుకర్ణాంశ్చ కుర్యాదష్టదలాకృతీన్
ఆఖ్యాతఃస్వామిభరణః పూజితస్త్రిదశైరపి॥ 26

కుర్యాత్ షోడశభద్రేషూరః శృంగాద్వయంద్వయం
భిన్న మేరుస్తదానామ సేవితః సిద్ధకిన్నరైః॥ 27
సర్వేవృత్తాస్తుకర్తవ్యాః ప్రాసాదాః కుంభకాదయః
కైలాసచ్ఛందజాశ్చైవ కుంభకాద్యాశ్చకామదాః॥ 28

ఇతిసూత్రసందాన గుణకీర్తిప్రకాశప్రోక్త శ్రీభువన దేవాచార్యోక్తా పరాజితపృచ్ఛాయాం కుంభకాద్యుద్భవ ప్రాసాదాధికారోనామైకషష్ట్యుత్తర శతతమంసూత్రం—

తా॥ వజ్రకమునకు కర్ణములు 8 దలములుగ రచించినయెడల స్వామిభరణమగును. మరియు 16 భద్రములుచేసి వానియందు ఉరః శృంగములు 2-2 చొప్పున చేసినచో భిన్న మేరువగును. వర్తులాకారమైన ప్రాసాదములన్నియును కైలాసచ్ఛందజములైయున్నవి. అందు కుంభకము మొదలగు 25ను అన్ని కోరికల నిచ్చునట్టివి.

(అనుబంధము 23వ పటము చూడుడు)

## 48. విమాన నాగరచ్ఛందజపుష్పకాది ప్రాసాదములు - 25 వివరము

అపరాజిత 106వ సూత్రము

శ్లో॥ నాగరోర్ధ్వచ్ఛందయుక్తా లదాశృంగైః సమన్వితాః
విమానానాగరచ్ఛందాః ప్రోక్తాస్తేజస్సముద్భవాః॥ 35

అపరాజిత 162వ సూత్రము

విమానానాగరచ్ఛందే పుష్పకైశ్చవిభూషితే
విమానపుష్పకచ్ఛందాః క్రమాన్నాగరజాతతః॥ 1
కథంవిభక్తిశ్ఛందాశ్చరూపాలంకారకావృత్తాః
కథయస్వప్రసాదేన విశ్వేశజగతఃప్రభో॥ 2

అథాతఃసంప్రవక్ష్యామి ప్రాసాదానాంతులక్షణం
విభక్తిచ్ఛందమాకారం ప్రయుక్తంపుష్పకాదికం॥ 3
పుష్పకోవిజయశ్చైవ సుభద్రోనందిశ్రీధరా
విశాలోదుందుభిఃప్రాంతో గరుడశ్చారువర్ధనః॥ 4
సింహః పద్మః సంభవశ్చ సువ్రతశ్చామృతోద్భవః
గృహరాజఃసిద్ధికామో నందిఘోషఃసునందనః॥ 5
తారాగణోబృహచ్చాలో హంసఃసర్వాంగసుందరః
తథాచపుష్పవిజయో మేరుఃప్రాసాదనాయకః॥ 6
పంచవింశతిరిత్యుక్తా ప్రాసాదాఃపుష్పకాదయః
వల్లభః సర్వదేవానాం విమానపుష్పకాస్తథా॥ 7

తా॥ లోగడ చెప్పబడిన 25 నామములు యిప్పుడు చెప్పబడినంతమాత్రమున వినియే యని భ్రమింపగూడదు. ఆ వివరములన్నియు చదివినకొలది తేటపడగలవు.

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ చతురశ్రీకృతేక్షేత్రే అష్టాష్టకవిభాజితే
క్షేత్రార్థంచభవేద్భద్రం భద్రార్థంకర్ణవిస్తరః॥ 8
కర్ణార్ధస్యప్రమాణేన కర్తవ్యోభద్రనిర్గమః
భద్రోపభద్రయుక్తకర్ణ ఉదకాంతరభూషితః 9
వేదబుత్వంకవేదాశ్రే వేదగర్భస్తుసంస్థితిః
సూర్యాభిత్యాభ్రమోనకైర్వసుయుగ్మస్తలీత్వియో॥ 10
వేదబుత్వంకవేదాశ్రే వేదవాలింగపీఠయోః
ఆయ్యావత్సాదిసూత్రైశ్చ శేషస్మాగాశేంశభిత్తయః॥ 11
పీఠోపపీఠజంఘాచ మేఖలామాల్యఛాద్యకం
యస్మానంనాగరేప్రోక్తం తచ్ఛస్తంసర్వకామదం॥ 12

సాంద్రారేషు ప్రకర్తవ్యా భద్రేచంద్రావలోకనా
మంచోపరపంచమాంశహీనం భద్రేషుచాద్యకం॥ 13
యాతదూర్ధ్వేసంవరణా ఘంటాకూటైరలంకృతా
ఉద్గమేసింహకర్ణాఢ్యా భద్రేభద్రే ప్రశస్యతే॥ 14
ప్రహారస్యతతశ్చోర్ధ్వే త్రిభాగంశృంగమున్నతం
లతాఖ్యసర్వతోభద్రం కర్ణేకర్ణేనవాండకం॥ 15
షకంశంమూలశిఖరమష్టభాగసమున్నతం
విమానంపంచభూమంచ శృంగైర్వింశతిభిర్వృతం॥ 16
అథోదయోక్తాఘంటాచవిభక్తాపంచభాగతః
గ్రీవాశీర్షిత్ కుడ్మలంచ పద్మఛత్రోపచ్ఛత్రకం॥ 17
తదూర్ధ్వేకలశంస్థాప్య క్షీరార్ణవసముద్భవం
మత్తాలంబయుతంభద్రం పుష్పకైః సమలంకృతం॥ 18
సమత్తావరణచ్ఛాద్యం ఘంటాకూటైరలంకృతం
ద్వితీయభూమికోర్ధ్వేతు ఘంటావై పుష్పకోన్నతా॥ 19
ఇమంయఃకారయేచ్చైవంప్రాసాదంపుష్పతాహ్వాయం
పుష్పకీర్ణంభవేద్రాజ్యం స్వర్గేవాభూమిశాసనే॥ 20

తా॥ చతురస్రముగానున్న ప్రదేశమును 8 భాగములు చేసి భద్రము 4 భాగములును, కర్ణము 2 భాగములును భద్రముయొక్క నిర్గమము 1 భాగమును, భద్రమున ఉపభద్రమును, జలమార్గము కర్ణమునను చేయవలెను. పైజెప్పిన 8-8 చొప్పున 64 గదులలో మధ్య 4-4 చొప్పున 16 గదులు గర్భమును, అందు మధ్య లింగపీఠమును 4 భాగములుచేసి దానిచుట్టూ 12 భాగముల స్థలమును గోడను చేయవలెను. (ఇది సాంధారము) దాని ప్రక్కను చుట్టూ 1 గదిని అంధకారికను చేయవలెను. అది 20 గదులగును. మరలా దానిచుట్టూ

64 గదులు సరిపోవును. మరియు నిరంధారమున లింగపీఠము 2 భాగములు, దానిచుట్టూ విశ్రాంతి 1 భాగము, దాని వెలుపలి గోడ 2 భాగములు చేయవలెను. పీఠము ఉపపీఠము జంఘ, మేకల, తోరణము, ఛాద్యము. ఇవి అన్నియు నాగరమున జెప్పిన కొలతల ప్రకారము సాంధారముననే చేయవలెను. భద్రమున చంద్రావలోకనమును రచించవలెను. మండోవరమున 5వ భాగము భద్రను యొక్క ప్రస్తరముచు తగ్గించవలెను దానిపైన సంవరణను ఘంట, కూటము, లదో అలంకారముచేయవలెను. ఆ పైన సింహములు వేచుచున్నట్లు రచించవలెను. ఇట్లు ప్రతి భద్రమునను అలంకారము చేయవలెను. ప్రహారముపైన శిఖరముయెత్తు 3 భాగములును, లతాఖ్యమని చెప్పబడుచున్న సర్వతోభద్రమునకు ప్రతి కర్ణమునను 9 అండకములను చేయవలెను. ప్రధానశిఖరము విస్తారము 6 భాగములును, ఎత్తు 8 భాగములును 5న అంతస్తున నుండవలెను. 20 శృంగముల చేత ఆవరింపబడి యుండవలెను. ఘంట మామూలు పద్ధతిగాక అందులో సగముయెత్తుననే చేయవలెను. దానిని 5 భాగములుచేసి కంఠము, గ్రీవ, కుడ్మలము, పద్మఛత్రము, ఉపఛత్రము, ఇట్లు 5 భేదములుగ రచించవలెను. ఆపైన కలశమునునిలుపవలెను. భద్రము మత్తావలంబముతో నుండవలెను. అది పుష్పకములచే నలంకరింపబడవలెను. మత్తావరణముయొక్క కప్పు ఘంట, కూటములతో నుండవలెను. ఇట్లు మొదటి అంతస్తునచేసి, రెండవ అంతస్తుపైన ఘంట పుష్పముయెత్తున చేయవలెను. ఇట్లుచేయబడినది పుష్పకమగును.

(అనుబంధము 24, 25 పటములు చూడుడు)

# 49. విజయము

అపరాజిత 162వ సూ॥

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే శతమూల విభాజితే
భాగంబిత్తిర్భ్రిమోభాగం గర్భశ్చంద్రకలాంశకైః॥ 21
అతశ్శైతంనిరంధారాన్ ప్రకుర్యాచ్చభ్రమైర్వినా
షట్త్రింశత్పదకోగర్భః శేషాభిత్తిర్ద్విభాగికా॥ 22
ద్విభాగఃకర్ణ ఇత్యుక్తో ద్విభాగోభద్రవిస్తరః
భద్రార్ధేచప్రతిష్ఠానముభయోరపిపక్షయోః॥ 23
నిర్గమశ్చైకభాగేనభద్రేప్రతిరథేఽథవా
తలచ్ఛందమితిప్రోక్త మూర్ధ్వమానమతఃశృణు॥ 24
చతురోనందనాత్కర్ణే కుర్యాచ్చవిధిపూర్వకం
శిఖరంచాష్టవిస్తారం సార్థ దిగ్భిఃసముచ్ఛ్రితం॥ 25
మల్లతలంపంచభూమం షష్టిశృంగసమావృతం
కర్ణేపంచాండకాఃకార్యాః శ్రీవత్సఃప్రరథేతథా॥ 26
అర్ధోదయేభవేద్ఘంటా కలశంభూమిజావృతం
ఉరఃశృంగఃక్రమయోగే ద్వాద్వామత్తాకలంబకా॥ 27
పీఠోపపీఠజంఘాశ్చ మేఖలామూల్యభాద్యకం
నాగరచ్ఛందఆఖ్యాతః పూర్వమానప్రకల్పితః॥ 28
శుకనాసాగ్రసంయుక్తదివ్యమండపభూషితం
జగత్యాతతయాయుక్తం కుర్యాచ్ఛృంగసముచ్ఛ్రితం॥ 29
ఇత్థంయఃకారయేచ్చైవ ప్రాసాదంవిజయోద్భవం
లభేతపరమాంల్లోకాన్ భుక్త్వాభోగాన్ సస్వర్గజాన్ 30

తా॥ చతురస్ర ప్రదేశమును 10-10 భాగములుచేసి గోడ 1 భాగమును. అంధకారిక 1 భాగమును, గర్భము 4 భాగములును,

వెలుపల 1 భాగమును చేయవలెను. నిరంధారమైనచో గర్భము 6 భాగములును గోడ 2 భాగములుచుట్టూ చేయవలెను. కర్ణము 2 భాగములును, భద్రము 2 భాగములను, భద్రములో సగము అనగా 1 భాగము ప్రతిష్టానమును రెండువైపులను ఇటులే కర్ణముల కును ప్రతిష్టానము 1-1 భాగము కల్పించవలెను. భద్రమునకుగాని ప్రతిరథమునకుగాని నిర్గమము 1 భాగము చేయవలెను. ఇది తల చ్ఛందము ఎత్తు చెప్పుచున్నాడు. కర్ణము 4 భాగములును శిఖరము విస్తారము 8 భాగములును, ఎత్తు $10\frac{1}{2}$ భాగములును, అయిదవ అంతస్తున మల్లతలమును చేసి 60 శృంగములచుట్టూ ఉండునట్లు రచించ వలెను. కర్ణమున 5 అండకములును శ్రీవత్సము ప్రరథమునను అటులే 5 అండకములను ఘంట సగము యెత్తునుండి కలశమును రచించవలెను. భూమిజములచే నావరింపబడియుండవలెను. ఉరః శృంగము వరుసగా మత్తావలంబములయందు 2-2 రచించవలెను. పీఠము. ఉపపీఠము, జంఘ, మేఖల, తోరణము, ఛాద్యము, నాగర పద్ధతి ప్రకారమే రచించవలెను. శుకనాసముముందు విస్తారమైన జగుతితోను శృంగము యెత్తుగానుండునట్లును మండపమును రచించ వలెను. ఇట్లు చేసినేని విజయప్రాసాదమగును. ఇది ఐహికాముష్మిక సుఖముల నిచ్చును.

(అనుబంధము 26, 27 పటములు చూడుడు)

## 50. సుభద్రము

శ్లో॥ విజయస్యచసంస్థానే కేశరీప్రరథేభవేత్
సుభద్రోనామవిజ్ఞేయః కర్తుః కల్యాణకారకః॥ 31

తా॥ విజయప్రాసాదముననే ప్రరథమున కేశరిపద్ధతి చేసినచో సుభద్రమగును.

# 51. నందము

శ్లో॥ కర్ణోర్ధ్వేక్రమసంస్థానే ప్రదేయశ్చైవకేశరీ
పాదోనద్వయం పృథుత్వం సార్థద్వయం సముచ్ఛ్రితిః॥ 32
శృంగంషడంశవిస్తారం సార్థసప్తాంశముచ్ఛ్రితం
ఇదంమల్లతలంప్రోక్త మేకషష్టిస్తథాండకాః॥ 33
మత్తాలంబద్వయంభద్రే ఉరఃశృంగక్రమేణచ
విధేయంపూర్వవచ్ఛేషం సనందః సర్వకామదః॥ 34

తా॥ కర్ణముల పైన వరుసగా కేశరీపద్ధతి చేయవలెను. విస్తారము $1\frac{3}{4}$ భాగములును, ఎత్తు $2\frac{1}{2}$ భాగములును చేయవలెను. ప్రధాన శిఖరము విస్తారము 6 భాగములును, ఎత్తు $7\frac{1}{2}$ భాగములును చేయవలెను. ఇది మల్లతలము. మొత్తము 61 అండకములతో నుండవలెను. భద్రమున మత్తాలంబములు 2 చేయవలెను. ఉరఃశృంగములును అటులే చేయవలెను. అన్ని కోరికలనిచ్చునట్టి నందమగును.

# 52. శ్రీధరము

శ్లో॥ వేదయుగ్మైకవేదాంశే గర్భఃస్యాచ్చతురంశతః
ద్వేభిత్తీభ్రమయుక్తే చైకైకంపదంచకల్పయేత్॥ 35
ద్విభాగఃకర్ణ ఇత్యుక్తో భాగార్థంచైవకర్ణికా
సార్ధభాగఃప్రతిరథో నిర్గమేవిస్తరేతథా॥ 36
పువఃకర్ణే చార్ధభాగా త్రిభాగో భద్రవిస్తరః
నిర్గమశ్చైకభాగేన శిఖరాదిసముద్భవే॥ 37
వేదాంశోభద్రవిస్తార స్తదర్ధేనతునిర్గమః
చంద్రావలోకనం కుర్యాచ్ఛాద్యఘంటాసమన్వితం॥ 38
విధేయంపూర్వవచ్ఛేషం పీఠాద్యంఛాద్యకాంతకం
నాగరోక్తవిధంమానం ప్రయుక్తంవాస్తువేదిభిః॥ 39

ఉక్తద్విక్రమలేకర్ణేనందనః సర్వతోభవేత్
ప్రరథేసర్వతోభద్రం శృంగంమల్లతలంతథా॥ 40
ద్వౌపుష్పకౌయుతౌభద్రే తవంగాకారరూపిణౌ
ప్రత్యంగేపుష్పకం కుర్యాచ్ఛాద్యఘంటాద్యలంకృతం॥ 41
ఘంటాకుంభశుకాగ్రేచ జగతీమండపద్వికం
పూర్వవచ్చవిధాతవ్యం ప్రశస్తంసర్వకామదం॥ 42
శ్రీధరోఽయంసమాఖ్యాతః ప్రాసాదో దేవతాలయః
లక్ష్మ్యానందయుతో నిత్యంకర్తుః సంతానవర్ధనః॥ 43

తా॥ విస్తారమును 12 భాగములుచేసి గర్భము 4 భాగములును, గోడ 1 భాగములును, అంధకారిక 1 భాగమును, మరల గోడ 2 భాగమును చేయవలెను. కర్ణము 2 భాగములును, కర్ణిక $\frac{1}{2}$ భాగమును, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును, మరల కర్ణిక $\frac{1}{2}$ భాగమును, భద్రము 3 భాగములును, భద్రముయొక్క నిర్గమము 1 భాగమును చేయవలయును. మరల భద్రము 4 భాగములును, నిర్గమము 2 భాగములును. దాని పైకప్పు ఘంటతో రచించవలయును. మిగిలిన పన్నులన్నియును పీఠము మొదలు పైకప్పువరకు నాగర పద్ధతిలోనే చేయవలెను. కర్ణములు రెండు వరుసలయందు నందనమును అంతటను చేయవలయును. ప్రరథమునను అంతటను భద్రమును మల్లతలమున శృంగమును భద్రమున 2 పుష్పకములును, అవితవంగములవలయును. ప్రత్యంగమున పుష్పకమును ఛాద్యమును, ఘంట మొదలైనవియును శుకనాసయందును ఘంట కుంభమును, జగతియును 2 మండపములును, మునుపటివలెనే చేయవలయును. దీనిని శ్రీధరప్రాసాదమందురు. ఐశ్వర్యమును, సంతానమును ఇచ్చును. (అనుబంధము 28, 29 పటములు చూడుడు)

## 53. విశాలము

శ్లో॥ తద్రూపశ్చతదాకారోయుక్తః పూర్వాగుణైస్తథా
తృతీయః పుష్పకోభద్రే విశాలఃసర్వశాంతిదః॥ 44

తా॥ పూర్వము చెప్పిన శ్రీధరముయొక్క పద్ధతితోనే చేసి భద్రమునమాత్రము మూడవ పుష్పకమును రచించినయెడల విశాలమనిపించుకొనును.

## 54. దుందుభి

శ్లో॥ ఋత్వేకచంద్రవేదాశ్రే గర్భంతస్యాంతరాష్టకైః
భ్రమభిత్తిశ్చైకపాదా ద్విభాగాబాహ్యభిత్తయః॥ 45
ద్విభాగఃకర్ణ ఇత్యుక్తోతస్యార్ధంచైవకర్ణికా
కర్ణతుల్యఃప్రతిరథోవిస్తారేనిర్గమేతథా॥ 46
పునశ్చకర్ణికాబాగంవేదాంశోభద్రవిస్తరః
నిర్గమశ్చతదర్ధేన కర్తవ్యఃశాంతిసిద్ధిదః॥ 47
పీఠోపపీఠజంఘాశ్చ మేఖలామల్లఛాద్యకం
శుకాగ్రంమండపాద్యంచ పూర్వమానప్రకల్పితం॥ 48
కర్ణేశృంగద్వయం కుర్యాన్నందనేనసమావృతం
ప్రతిరథేచతత్తుల్యం కర్తవ్యంశాంతిమిచ్ఛతా॥ 49
దిగ్విస్తరంచశిఖరం త్రయోదశసముచ్ఛ్రితం
తద్రూపమానంమల్లంతు ఏకషష్టిస్తథాండకాః॥ 50
ఉరఃశృంగక్రమయోగే పుష్పకద్వయముద్గమే
ప్రత్యంగేపుష్పకంకుర్యాత్ తహగాకారరూపిణం॥ 51
ఘంటాకుంభశుకాగ్రేచ జగత్యాద్యంచపూర్వవత్
ఏవంవిధః ప్రకర్తవ్యః ప్రాసాదోఽయంతుదుందుభిః॥ 52
క్షేమంచాత్రసుభిక్షంచ నృపాదావర్ధతేప్రజా
ధర్మార్థకామమోక్షాణాంప్రాప్తిహేతురభీప్సితః॥ 53

తా॥ చతురశ్రప్రదేశమును 16 భాగములుచేసి గర్భము 8 భాగములును, అంధకారిక 1 భాగమును, గోడ 1 భాగమును, వెలుపలిగోడ 2 భాగములును చేయవలయును. కర్ణము 2 భాగములు కర్ణిక 1 భాగమును, ప్రతిరథము 2 భాగములును, విస్తారముగాని నిర్గమముగాని అదే విధముగా నుండవలయును. కర్ణిక మరల 1 భాగమును, భద్రముయొక్క విస్తారము 4 భాగములును, భద్రముయొక్క నిర్గమము 2 భాగములును, పీఠము, ఉపపీఠము, జంఘ, మేఖల, మల్లతలము, ఛాద్యము, శుకనాసికముందు మండపము మొదలైనవి పూర్వపు కొలతలప్రకారము చేయవలయును. కర్ణమున 2 శృంగములును, నందనముతో ఆవరించబడి యుండవలయును. ప్రతిరథమున గూడ అటులే చేయవలయును. శిఖరము యొక్క విస్తారము 10 భాగములును, ఎత్తు 13 భాగములును చేయవలయును. ఆ ప్రకారము మల్లతలమున 61 అండకములుండవలయును. ఉరఃశృంగముల యొక్క క్రమయోగమున 2 పుష్పకములను పైకి చేయవలయును. ప్రత్యంగముననుు పుష్పకమును చేయవలయును. ఆ పుష్పకముతవంగాకారముగనుండవలయును. ఘంట కుంభము శుకనాసికముందు జగతి యివి యన్నియును పూర్వమువలెనే చేసినచో దుందుభియగును ఇది క్షేమమును సుభిక్షమును వృద్ధిని కలిగించును. కోరికలనిచ్చును,

(అనుబంధము 30, 31 పటములు చూడుడు)

## 55. ప్రాంతము

శ్లో॥ తృతీయంపుష్పకందద్యాత్ సభవేత్ప్రాంతసంజ్ఞకః
ప్రాప్నోతిభోగంముక్తించ స్వర్గేవా ప్రభుశాసనం॥ 54

తా॥ ఉరఃశృంగమున మూడవ పుష్పకమును రచించినయెడల ప్రాంతమగును.

## 56. గరుడము

శ్లో॥ త్యక్త్వాపుష్పకమేకంచ భద్రంపంచాంశవిస్తరం
అలంకృతంసంవరణైస్త్రిభిర్భాగైశ్చనిర్గమః॥ 55
ఏవంగరుడమాఖ్యాతంకుర్యాత్ యోవిష్ణుమందిరే
ప్రాప్నోతివిష్ణులోకంస యావదాభూతసంప్లవం॥ 56

తా॥ పై జెప్పినదానియందొక పుష్పకమును తగ్గించి భద్రమును 5 భాగములు విస్తారముగాజేసి నిర్గమము 3 భాగములు చేసినచో గరుడమగును. ఇది విష్ణుమందిరమున చేసిరేవి విష్ణులోకము లభించును.

## 57. చారువర్ధనము

శ్లో॥ పునఃకుర్యాత్తదాభద్రమురఃశృంగంవిమానకే
ప్రత్యంగాగ్రేపుష్పకశ్చ సభవేచ్చారువర్ధనః॥ 57
వర్ధతేధనపుత్రైశ్చ జన్మజన్మనిభూతవే
అతస్తుభోగభోక్తాస్యాత్ స్వర్గేభూయోఽపవర్గభాక్॥ 58

తా॥ విమానమునమరల భద్రమును ఉరఃశృంగమునుచేసి ప్రత్యంగముపైన పుష్పకమును రచించినచో చారువర్ధనమగును.

## 58. సింహము

శ్లో॥ మత్తాలంబద్వయంభద్రే సింహనామాసశోభనః
పార్వత్యాదికదేవీనాం సర్వాసాంశాంతిదాయకః॥ 59

తా॥ భద్రమున మత్తాలంబములను 2 చేసినచో సింహప్రాసాదమగును. దేవీ మందిరములకు ముఖ్యము.

## 59. పద్మము సంభవము

శ్లో॥ ద్వితీయంచాపిప్రత్యంగే కుర్యాత్కుముదవచ్చతత్
పద్మసంభవనామానౌ కర్తవ్యోపరమేష్ఠినే॥ 60

తా॥ ప్రత్యంగమునకు ముసమువలె రెండవదానిని గూడ రచించినచో పద్మము సంభవము అగును.

## 60. సువ్రతము

శ్లో॥ పద్మసంభవసంస్థానే తద్రూపేతదవస్థితే
కర్ణేప్రతిరథేచైవ క్రమాద్దద్యాత్తృతీయకం॥ 61
పూర్వోర్ద్వ మసమాకార స్వరూపంలక్షణాన్వితం
ఉరఃశృంగంపరిత్యజ్య భద్రేదద్యాద్ద్వి పుష్పకం॥ 62
ప్రత్యంగకేపుష్పకవదసౌసువ్రతసంజ్ఞకః
క్రియతేయైఃశుభం తేషామిహాలోకేపరత్రచ॥ 63

తా॥ పద్మ సంభవ అనుదానినే ఉరఃశృంగమును తీసివేసి కర్ణమునను ప్రతిరథమునను మూడవ శృంగమును రచించి భద్రమునందు 2 పుష్పకములను ప్రత్యంగమున పుష్పకమువలె చేసినయెడల సువ్రతమగును.

## 61. అమృతోద్భవము

శ్లో॥ తృతీయం పుష్పకందద్యాత్సఖవేదమృతోద్భవః
యేనప్రాప్యేతామరత్వంభుక్తిశ్చత్రిదశైఃసహ॥ 64

తా॥ మూడవ పుష్పకమును రచించినచో అమృతోద్భవమగును. దీనివలన దేవత్వమును దివ్యలోకనివాసమును కలుగును.

## 62. గృహరాజము

శ్లో॥ కర్ణికాచైకభాగాస్యాచ్ఛేషంపూర్వప్రకల్పితం
షట్పంచాశంద్విశతకం వాస్తుసంస్థానమేవచ॥ 65
మహోరఃశృంగంవిమానం ప్రత్యంగాద్యంసపుష్పకం
సర్వశృంగంనందనవత్ క్రమాత్త్రిత్రిభిరావృతం 66
గృహరాజస్తదానామ కర్తవ్యఃసర్వదైవతే
కైలాససదృశంచైవ గృహంజన్మసునిశ్చలం॥ 67

తా॥ కర్ణిక 1 భాగముచేసి మిగిలినవి పూర్వమువలెనే చేయవలయును. చతురశ్రప్రదేశమును 16-16 భాగములు చేయవలయును. విమానమునందు గొప్పఉరఃశృంగమును రచించవలెను. ప్రత్యంగమునకు పుష్పకమును చేయవలెను. శృంగములన్నియును నందనమువలె 3-3 చుట్టూ ఉండవలయును. దీనిని గృహరాజమందురు.

## 63. సిద్ధి కామము

శ్లో॥ బృహచ్ఛృంగేమల్లతలం విమానస్తస్యచాగ్రతః
కార్యోవిమానఃప్రత్యంగే సిద్ధికామఃససిద్ధిదః॥ 68

తా॥ విమానముయొక్క పెద్దశిఖరమున మల్లతలమునుచేసి దానిముందు ప్రత్యంగమున విమానమును రచించినయెడల సిద్ధికామమగును.

## 64. నందిఘోషము

శ్లో॥ తృతీయం పుష్పకం కుర్యాత్ కర్ణేప్రతిరథేతథా
నందిఘోషస్తదానామ సర్వదైవతవల్లభః॥ 69

తా॥ కర్ణమునను ప్రతిరథమునను మూడవ పుష్పకమును రచించినయెడల నందిఘోషమగును.

## 65. సునందనము

శ్లో॥ క్షేత్రేఽష్టాదశధాభక్తే త్రిభాగఃకర్ణవిస్తరః
రథోపరథికౌచైవ ద్వాద్వాభాగౌప్రకల్పయేత్॥ 70
వేదాంశోభద్రవిస్తారస్తదర్ధేనచనిర్గమః
ద్వాద్వాభాగౌభ్రమోభిత్తి శేషంగర్భగృహంభవేత్॥ 71
కుర్యాచ్ఛమందరంకర్ణే పంచవింశతిరండకాః
పృథగ్ద్విభాగవిస్తారోనందనఃస్యాత్తదూర్ధ్వతః॥ 72
శతమూవేభవేద్రేఖా తథామల్లతలోద్భవా
ఘంటాకలశశోభాఢ్యా సర్వకామఫలప్రదా॥ 73

శృంగద్వయం ప్రతిరథేపేకంచోపరథేతథా
త్రిపుష్పకయుతంభద్రం ప్రత్యంగంచసపుష్పకం॥ 74
ఏవంవిధః ప్రకర్తవ్యః ప్రాసాదోఽసౌసునందనః
భుక్త్వాతుభూమిజాన్ భోగాన్ స్వర్గేనందతిభూపతిః॥ 75

తా॥ క్షేత్రమును 18 భాగములుచేసి కర్ణము 3 భాగములు, రథము 2 భాగములు, ఉపరథము 2 భాగములును, భద్రము 4 భాగములును నిర్గమము 2 భాగములును చేయవలయును. గోడ 2 భాగములును, భ్రమము 2 భాగములును, లోపలి గోడ 2 భాగములును గర్భగృహము 6 భాగములును చేయవలయును. కర్ణమున మందరమునుచేసి 25 అండకములను చేయవలయును. మరియు 2 భాగముల విస్తారమును దానిపైన నందనమునుచేయవలెను. ప్రధానరేఖ 100 ఘంట, కలశము, వీనితో నలంకరించవలెను. భాగములచుట్టూ ఉండవలెను. మల్లతలముకూడ అటులేయుండవలెను. ప్రతిరథమున 2 శృంగములుండవలెను. ఉపరథమున 1 శృంగమును, భద్రమున 3శృంగములును, ప్రత్యంగమున 1 శృంగమును, ఇట్లుచేసిరేని, సునందనమగును.

అనుబంధము 35, 36 పటములుచూడుడు)

## 66. తారాగణము

శ్లో॥ మహోరః శృంగః పుష్పకో విమానః పంచభూమికః
తారాగణః సమాఖ్యాతః ప్రాసాదో హ్యమరాలయః 76

తా॥ గొప్ప ఉరః శృంగ పుష్పకమును 5 అంతస్తులను కలిగియుండెనేని తారాగణమగును.

## 67. బృహచ్ఛాలము

శ్లో॥ బృహచ్ఛృంగేమల్లతలం తదగ్రేచవిమానకః
ప్రత్యంగంచైవతద్రూపం బృహచ్ఛాలః సఉచ్యతే॥ 77

తా॥ పెద్దశృంగమున మల్లతలమును దానిముందు విమానమును అటులే ప్రత్యంగమును కలిగియుండెనేని బృహచ్ఛాలమగును

## 68. హంసము

శ్లో॥ కుర్యాచ్చతుష్పుష్పకంచ కర్ణేప్రతిరథోర్ధ్వతః
తదానామ్నా హంసఇతి బ్రహ్మణశ్చసదాప్రియః। 78

తా॥ కర్ణమునను ప్రతిరథమునను 4-4 పుష్పకములు కలిగి యున్నచో హంసమగును బ్రహ్మమందిరమునకు శ్రేష్ఠము

## 69. సర్వాంగసుందరము

శ్లో॥ కుర్యాత్ ద్విపుష్పకంకర్ణే సభవేత్ సర్వసుందరః
సర్వదేవేశుభఃశస్తః సర్వకామఫలప్రదః॥ 79

తా॥ కర్ణమున 2 పుష్పకములను రచించిన యెడల సర్వాంగ సుందరమగును.

## 70. పుష్పవిజయము

శ్లో॥ వింశతిర్ధామవిస్తారో వేదాంశఃకర్ణవిస్తరః
త్రిభిర్భాగైఃప్రతిరథో నిర్గమోవిస్తరస్తథా। 80
షడంశోభద్రవిస్తార స్త్రిభాగశ్చాస్యనిర్గమః
ద్వాద్వాభాగాభ్రమోభిత్తీ శేషంగర్భగృహంభవేత్॥ 81
కర్ణేపృథ్వీజయంకుర్యాన్మందరంప్రరథేతథా
ద్విపుష్పకయుతంభద్రం ప్రత్యంగేపుష్పకంతథా॥ 82
మూలరేఖాంమల్లతవే షోడశాంశైశ్చవిస్తరః
సపుష్పవిజయోనామ్నా సర్వదేవహితాత్మకః॥ 83

తా॥ క్షేత్రమును 20 భాగములుచేసి కర్ణము 4 భాగములు, ప్రతిరథము 3 భాగములు, భద్రము 6 భాగములు, దానియొక్క నిర్గమము 3 భాగములు, భ్రమ 2 భాగములు, గోడ 2 భాగములు, మిగిలిన గర్భగృహము కర్ణములు పృథ్వీజయమువలెను. ప్రరథములు మందరమువలెను, భద్రమున 2 పుష్పకములును, ప్రత్యంగమున పుష్ప

కములను, మల్లతలమున ప్రధానరేఖ 16 భాగముల విస్తారమును చేసినచో పుష్పవిజయమగును.

(అనుబంధము 32, 33 పటములు చూడుడు)

## 71. మేరువు

శ్లో॥ విమానంవృద్ధోరుశృంగం పుష్పకంప్రతిభద్రకే
భద్రేత్రిపుష్పకంకుర్యాత్ ప్రత్యంగేచైవపుష్పకం॥ 84
మేరుశ్చాసౌసమాఖ్యాతఃకర్తవ్యఃసర్వదైవతే
మేరుర్హేమరూపమోదివ్యః సర్వరత్నమయోఽపిచ॥ 85
ఏతైశ్చలభ్యవేపుణ్యం పూజాస్యాచ్ఛివమోదికా॥
ఇతి అపరాజిత పృచ్ఛాయాం పుష్పకాదిప్రాసాదలక్షణాది కారో నామద్విషష్ట్యుత్తరశతతమం సూత్రం-

తా॥ విమానము పెద్దదియును పొడవైనది యురఃశృంగము దోను, భద్రమున 3 పుష్పకములును, ప్రతిభద్రమున 1 పుష్పకమును ప్రత్యంగమున పుష్పకమును ఇట్లురచించిన యెడల మేరుప్రాసాద మగును. (ఇట్లు అపరాజిత పృచ్ఛ 162వ సూత్రము)

(అనుబంధము 34వ పటము చూడుడు)

## 72. శ్రీధరము మొదలగు 40 భేదములు శుద్ధచ్ఛందములు

అపరాజిత 106వ సూత్రము

శ్లో॥ భూమిజాభూమికాశ్రమైర్జంఘాహీనైశ్చభూమికైః
శృంగేశృంగయుతాఃకార్యా బహుశృంగసమాకులాః॥ 30
కర్ణేప్రతిరథేచైవ భద్రేచప్రతిభద్రకే
మందారపుష్పకాఘంటావరాటాఃశుభలక్షణాః॥ 31

అపరాజిత పృచ్ఛ 163వ సూత్రము

శ్లో॥ అథాతఃసంప్రవక్ష్యామి ప్రాసాదాన్ శ్రీధరాదికాన్
నామలక్షణసంయుక్తాన్ వాస్తువేదసముద్భవాన్॥ 2

శ్రీధరో హేమకూటశ్చ సుభద్రో రిపుకేసరీ
పుష్పో విజయభద్రశ్చ శ్రీనివాసః సుదర్శనః॥ 3
కుసుమః కేశరనామా చ తథా చ సురసుందరః
నంద్యావర్తశ్చ పూర్ణశ్చ సిద్ధార్థః శంఖవర్ధనః॥ 4
త్రైలోక్యభూషణః పద్మో వజ్రబాహుర్విశాషికః
కమలోద్భవహంసా చ లక్ష్మీధరోఽతివజ్రకః॥ 5
రతిదేహః సిద్ధికామః పంచచామరసంజ్ఞకః
నందిఘోషో మనూత్కీర్ణః సుప్రభః సురనందనః॥ 6
హ్యాగ్షో దుర్ధరో విజయస్త్రికూటో నవశేఖరః
పుండరీకః సునాభశ్చ మహేంద్రః శిఖిశేఖరః॥ 7
వరాటః సుముఖశ్చేతి చత్వారింశత్ప్రకీర్తితాః
శుద్ధచ్ఛందాస్తథైతే చ మిశ్రకాస్తు దశైవ చ॥ 8
శుద్ధానాం లక్షణం వక్ష్యే విభక్తిం భాగసంఖ్యయా
తలచ్ఛందమలంకారైః ప్రయుక్తం వాస్తువేదిభిః॥ 9
చతురశ్రీకృతే క్షేత్రే చతుర్వింశతిభాజితే
కర్ణః ప్రతిరథో భద్రం వేదైర్వేదైస్తథాష్టభిః॥ 10
త్రినిష్కాసః ప్రతిరథో భద్రం వేదాంశనిర్గమం
ద్వా ద్వాభాగా తథా భిత్తిర్భ్రమణీ వేదవిస్తరా॥ 11
షడ్దారుకం భ్రమాదా చ చతుష్షష్టిశ్చ గర్భకః
సార్ధాయామో మండపశ్చ జగతీషు గుణోత్తమా॥ 12
పీఠోపపీఠజంఘాశ్చ మేఖలాకూటచ్ఛాద్యకం
ప్రశస్తం నాగరే నామ భద్రే చంద్రావలోకనా॥ 13
కర్ణే భద్రే ద్విద్విశృంగమేకం ప్రతిరథే భవేత్
పంచవింశత్యండకస్తు శ్రీధరశ్చ సురాలయః॥ 14
ఘంటాకలశశుకాగ్ర పతాకాధ్వజశోభితః
శ్రీరానందో భవేన్నిత్యం స్వర్గే వా భూమిశాసనే॥ 15

తా॥ శ్రీధరము మొదలగు 40 ప్రాసాదములు శుద్ధచ్ఛందములు అందు శ్రీధరముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 24 భాగములుచేసి కర్ణము 4 భాగములు, ప్రతిరథము 4 భాగములు, భద్రము 8 భాగములు చేయవలెను. ప్రతిరథములు 3 భాగములు నిర్గమమును భద్రము 4 భాగములు నిర్గమమును చేయవలెను. గోడ 2 భాగములును, భ్రమణి 4 భాగములును మరల గోడ 2 భాగములును గర్భగృహము 8 భాగములును చేయవలెను. భ్రమణియొక్క మొదట షడ్దారుకమును రచించవలెను. మండపము $1\frac{1}{2}$ విస్తారమును జగతి 3 భాగములును పీఠము, ఉపపీఠము జంఘ, మేఖల, కూటము, ఛాద్యము. ఇవి నాగరపద్ధతితోనే చేయవలెను. భద్రమున చంద్రావలోకనమును చేయవలెను. కర్ణమునను భద్రమునను 2-2 శృంగములును, ప్రతిరథమున 1 శృంగమును, చేయవలెను. మొత్తము 25 అండకములతో శ్రీధరమగును. ఘంట కలశము, శుకనాసిక, పతాకము, ధ్వజము ఇవియన్నియునుండవలెను. ఇది ఒక్కటే అంతస్తుకలది.

## 73. శ్రీధరము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథాన్యాన్ కథయిష్యామః ప్రాసాదాన్ సూక్ష్మలక్షణాన్
పంచాశతమిహోత్కృష్టాన్ ప్రాసాదాఞ్ శ్రీధరాదికాన్॥ 1
శ్రీధరో హేమకూటశ్చ సుభద్రోరిపుకేసరీ
పుష్పోవిజయభద్రశ్చ శ్రీనివాసః సుదర్శనః॥ 2
భగవత్యాః ప్రియోహ్యేతే తథాకుసుమశేఖరః
దేవస్యశంభోర్దయితః ప్రాసాదఃసురసుందరః॥ 3
నంద్యావర్తశ్చపూర్ణశ్చ సిద్ధార్థఃశంఖవర్ధనః
త్రైలోక్యభూషణాశ్చేతి పద్మస్తుబ్రహ్మణఃప్రియః॥ 4

వజ్రబాహుర్విశాలోశ్చ తథాన్యః కమలోద్భవః
హంసర్వ్యబుఇతిఖ్యాదాః ప్రాసాదాః బ్రహ్మణః ప్రియాః॥ 5
లక్ష్మీనిరాజ్యప్రాసాదో వసతౌమధువిద్విషః
మహావజ్రోరతితనుః సిద్ధికామ స్తథాపరః॥ 6
పంచచామరసంజ్ఞశ్చ నందిఘోషాఖ్యఏవచ
మనూత్కర్ణః సుప్రభశ్చ సురానందోఽథహర్షణః॥ 7
దుర్ధరోవిజయశ్చైవ త్రికూటోనవశేఖరః
పుండరీకః సునాభశ్చ మహేంద్రః శిఖిశేఖరః॥ 8
వరాటః సుముఖః శుద్ధ శ్చత్వారింశదితీరితాః
మిశ్రకాస్తు దశప్రోక్తామిథః కర్మప్రభేదతః॥ 9
విజ్ఞేయోనందసంజ్ఞశ్చ మహాఘోష స్తథాపరః
వృద్ధిరామాభిధానశ్చ ప్రాసాదోఽస్యోవసుంధరః॥ 10
ముద్గకోఽథబృహచ్ఛాల స్తథైవచసుధాధరః
సంవరాఖ్యః శుకనిభ స్తథా సర్వాంగసుందరః॥ 11
పంచాశ్యదేవంకథితా ప్రాసాదానాంయథాక్రమమ్
ఇదానీం లక్ష్మణో బ్రూమః శ్రీధరంసర్వకామికం॥ 12
వల్లభంసర్వదేవానాం పుణ్యానాంకారణం
పరం చతురశ్రీకృతేక్షేత్రే చతుర్వింశతిభాజితే॥ 13
ద్వాదశాఖిలకర్ణేషు కర్ణశృంగాణియోజయేత్
విస్తారంచచతుర్భాగ మేకైకస్యవినిర్దిశేత్॥ 14
పరస్పరంచవిష్కంభో ద్విపదోఽత్రవిధీయతే
ద్వ్యంశానికర్ణభద్రాణి నిర్గమశ్చార్ధభాగికః॥ 15
కర్ణః కర్ణపదేఽన్యః స్యాత్ పదార్ధార్ధేన విస్తృతః
వారిమగ్నోవిధాతవ్యో మధ్యగః పూర్వమానయోః॥ 16

భద్రస్యమానముద్దిష్టం విస్తారాద్దశభాగి
కం నిర్గమశ్చ త్రిభిర్భాగైః సమసూత్రసమాహితః॥ 17
ద్విపాదా బాహ్యభిత్తిస్తు ద్విపాదా చాంధకారికా
భవేచ్ఛతపదః కందో గర్భః షడ్త్రింశదంశకః॥ 18
ద్విపదః కర్ణకందశ్చ ప్రత్యంగం పదికంస్మృతం
నిర్గతంచార్ధభాగేన చతుర్దిక్షువ్యవస్థితం॥ 19
భాగేననిర్గతాకార్యా శాలాచాస్యచతుష్పదా
అభ్యంతరం బాహ్యభిత్తేః కందస్యచతథాబహిః॥ 20
ఉభయోరంతరంకార్యం విస్తారాత్పంచభాగికం
అంతరాలంచకుర్వీత శృంగంతచ్చచతుష్పదం॥ 21
విభాగస్తాదృశోఽస్యస్యాత్ బాహ్యశృంగస్యయాదృశః
భిత్తికందాంతరావేచ కార్యంషడ్దారుకంబుధైః॥ 22

తా॥ ఉన్నతమైన ప్రాసాదములు 50 శ్రీధరము మొదలు 8 దేవికిప్రియములు, కుసుమశేఖరము 1 శివునకు ప్రియము. నంద్యావర్తము మొదలు 10 బ్రహ్మకు ప్రియములు. లక్ష్మీధరము 1 విష్ణువునకు. మిగిలినవి సమస్త దేవతలకుపయోగములు. అందు శ్రీధరము మొదలయిన 40 శుద్ధజాతి ప్రాసాదములను 10 మిశ్రజాతిప్రాసాదములను చెప్పుచున్నాడు. అందు శ్రీధరప్రాసాద మెట్లు రచించవలయుననగా చతురశ్రప్రదేశమును 24 భాగములుచేసి అన్ని కర్ణముల యందు 12 కర్ణశృంగములనుచేసి ఒక్కొక్కదానికి విస్తారము 4 భాగములును నిర్గమము 2 భాగములును, భద్రకర్ణములు 2 భాగముల విస్తారమును నిర్గమము $\frac{1}{2}$ భాగమును, కర్ణము కర్ణపదమున $\frac{1}{2}$ భాగము విస్తారమున జలాంతరమును చేయువలయును. భద్రముయొక్క విస్తారము 10 భాగములు చేయపలెను. నిర్గమము 3 భాగములు చేయవలయును. వెలుపలి గోడ 2 భాగములును, అంధకారిక 2 భాగములును, కంఠము 100 భాగములు, గర్భము 36 భాగములును, కర్ణము

2 భాగములును ప్రత్యంగము 1 భాగమును, వానియొక్క నిర్గమము ½ భాగమును, శాల విస్తారము 4 భాగములును, 1 భాగము నిర్గమమును చేయవలెను. లోపలను వెలుపలను గోడ విస్తారమునుండి 5వ భాగము చేయవలెను. అంతరాలమును రచించి శృంగము 4 భాగములు చేయవలెను. వెలుపలి శృంగమునకెట్లో అట్లే భాగములు చేయవలెను. గోడయొక్కయు కందముయొక్కయు మధ్యపద్దారుకమును చేయవలెను.

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ రీతికాతోరణాయుతం చతుర్ద్విమనోరమం
పురతోమండపంకుర్యాత్ సర్వలక్షణసంయుతం॥ 23
భాగైఃపంచాశతాకుర్యాదస్యమానమిహోర్ధ్వగం
ఏషాంమధ్యేసవింశత్యా ప్రవిధేయాస్తులోదయాః॥ 24
తేషాంమధ్యేఽంశకైః షడ్భిర్వేదీబంధోవిధీయతే
నవధాభాజితేతత్ర వేదీబంధేసమ్మేఃపదైః। 25
కుంభశ్చతుష్పదస్తత్ర ద్విపదస్తుమసూరకః
భాగేనాంతరపత్రఃస్యాన్మేఖలాద్విపదాఃస్మృతాః॥ 26
మూలభాగాస్తుయేతైఃస్యాజ్జంఘాదశభిరుచ్ఛ్రితాః
ద్విపదామేఖలాప్రోక్తా ద్వ్యంశేచాంతరపత్రకే॥ 27
అధస్తాదూర్ధ్వపట్టస్యదలపట్టస్యచోపరి
షోడశాంశావిధాతవ్యా స్తత్రైతత్కర్మవార్చయేత్॥ 28
భాగేనరూపధారాస్యాత్ సార్ధాసార్ధాచఆసనమ్
వేదీభాగత్రయోత్సేధాద్వయే...నాసనపట్టకః॥ 29
సార్ధభాగేనకర్తవ్యమూర్ధ్వంచంద్రావలోకనం
ఆసనస్యోర్ధ్వతః స్తంభాః సార్ధపంచపదాఃస్మృతాః॥ 30
భాగేనోచ్ఛాలకంకార్యం శీర్షంసార్ధపదోన్నతం
పట్టఃస్యాద్ద్విపదోత్సేధ స్త్రిపదశ్చాద్యవిస్తరః॥ 31

లంబనంతుతదర్ధేన యథాశోభమథాపివా
ఊర్ధ్వేనాంతరపత్రస్య కల్ప్యతేఽపియథాక్రమమ్॥ 32
కోణేషుకూటాఃకర్తవ్యా వివిధైఃకర్మసంభ్రమైః
విస్తారఃస్యాచ్చతుర్భాగస్తేషా షడ్భాగఉచ్ఛ్రయః॥ 33
కర్ణాఘంటాసమాయుక్తాః కూటమానంవిధీయతే
తత్రమూర్తిక్రమాత్కుర్యాదేకైకంచతదూర్ధ్వతః॥ 34

తా॥ ఇట్టిడి తోరణములు నలువైపుల రచించవలెను. ముందు వైపున మండపమును శాస్త్రోక్తప్రకారము నిర్మించవలెను. ఎత్తు 50 భాగములును దూలముపై మట్టమువరకు 20 భాగములుండవలెను. వేదీబంధము 6 భాగములు చేయవలయును. వేదీబంధము సమాన భాగములు 9 చేయవలయును. కుంభము 4 భాగములు, మసూరము 2 భాగములు, అంతరపత్రము 1 భాగము, మేఖల 2 భాగములు చేయవలయును. ప్రధాన భాగములు జంఘ 19 భా-యెత్తు, మేఖల 2 భాగములు, అంతరపత్రము 2 భాగములు, అధఃపట్టము, ఊర్ధ్వ పట్టము, దలపట్టము 16 భాగములు చేయవలయును. రూపధారగ భాగము 1½-1½ సైన్యములు, వేది 3 భాగములు, ఆసనపట్టము 2 భాగములు, పైన చంద్రావలోకనము 1½ భాగము, అధిష్టానము యొక్క పైన స్తంభములు 5½ భాగములు, ఉచ్ఛాలకము 1 భాగమును, శిఖరము 1½ భాగము, పట్టము 2 భాగములు, చాద్య విస్తరము 3 భాగములు, లంబము 1½ భాగము చేయవలయును. అంతర పత్రమునకు పైన మూలలయందు కూటములు అనేక విధములుగా రచించవలెను. వాని విస్తారము 4 భాగములును, యెత్తు 6 భాగములును, పైన ఘంటయును రచించవలయును. వానియందు దేవతా రూపములను రచించవలెను.

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ తేషాంచతుల్యతా కార్యా విస్తారాదుచ్ఛ్రయాదపి
చత్వార ఏకకర్ణేస్యు రేవంసర్వేషుషోడశ॥ 35
సింహకర్ణస్యవిస్తార మానంస్యాదష్టభాగికం
షడ్భాగస్తుతథోత్సేధో రథికైశ్చవిభూషణం॥ 36
గుణతారసమాయుక్తః శూరసేనాభిధానకః
సింహకర్ణోవిధాతవ్యః సర్వకర్మసమాకులః॥ 37
సింహకర్ణోదయాదూర్ధ్వ మురోమంజరికాభవేత్
విస్తారాదష్టభాగాసావుచ్ఛ్రాయాన్నవభాగికా॥ 38
లతాపంచకసంయుక్తా మంజరీస్యాత్ సుశోభితా।
గ్రీవాపాదోనభాగాస్యాదండకంభాగముచ్ఛ్రితం॥ 39
చంద్రికాచార్ధభాగేన కలశశ్చైవభాగికః
కూటమూర్ధ్ని ద్వితీయాస్యాదురోమంజరికాతథా॥ 40
భాగద్వాదశవిస్తీర్ణా సార్ధేనత్రిదశోచ్ఛ్రితా
భాగమేకంభవేద్గ్రీవా సార్ధభాగేనచాండకం॥ 41
కర్పూరంచార్ధభాగేన కలశశ్చద్విభాగికః
ఉరఃశిఖరకాణ్యష్టౌ భవంత్యేవంచతుర్దిశం॥ 42
ద్వితీయకూటకస్యోర్ధ్వే కర్తవ్యామూలమంజరీ
భాగషోడశవిస్తారా పదాష్టాదశకోదయా॥ 43
స్కంధమానంహిసర్వేషాం యథోక్తంశతవాస్తుని
గ్రీవాసార్ధపదాంశాస్యాదండకం ద్విపదాన్వితం॥ 44
కంకతీఫలతుల్యాని కుర్యాత్సర్వాండకానిచ
ద్విపదంచాండకాయుగ్మం కార్యంసామలసారకం॥ 45
తస్యోపరిస్యాత్కలశో వర్తులస్త్రిపదోచ్ఛ్రితః
తోరణైర్మకరైఃపత్రైఃసాగ్రైశ్చసమరాలకైః॥ 46

హ స్తితుం ద్వైసమాకీర్ణ మప్సరోగణభూషితం
ఈదృశం శ్రీధరంకుర్యాత్ సర్వాలంకారభూషితం॥ 47
శ్రీధరంకారయేద్యస్తు కీర్త్యర్థ మపిమానవః
ఇహైవలభతేసౌఖ్య కుముత్రేంద్రత్వమాప్నుయాత్॥ 48
భోగాన్భుక్త్వాపుమాన్ స్వర్గం నీయతేచ
పదేపదే సర్వపాపవినిర్ముక్తః శాంతశ్చస్యాన్నసంశయః॥ 49

తా॥ ఒక్కొక్క మూలను 4 కర్ణములు చేయవలయును. అన్నియును సమానమైన విస్తారమును యెత్తును కలిగియుండవలెను. సింహకర్ణము యొక్క విస్తారమును 8 భాగములుచేసి యెత్తు 6 భాగములు చేయవలెను. రథికములుకూడ రచించవలెను. విస్తారమునకు మూడురెట్లు శూరసేనమను సింహకర్ణములుండవలెను. సింహకర్ణములకుపైన ఉరోమంజరియుండవలెను. విస్తారము 8 భాగములును, ఎత్తు 9 భాగములును, 5 లతలతో మంజరి చక్కగా నుండవలెను. గ్రీవ $\frac{3}{4}$ భాగమును, అండకము 1 భాగమును, చంద్రిక $\frac{1}{2}$ భాగమును, కలశము 1 భాగమును, కూటశిఖరము 2 భాగములును, ఉరోమంజరి 12 భాగములు, విస్తారమును ఎత్తు $30\frac{1}{2}$ భాగములును, గ్రీవ 1 భాగమును, అండకము $1\frac{1}{2}$ భాగమును, కపరి $\frac{1}{2}$ భాగమును, కలశము 2 భాగములును, ఉరఃశృంగములు 8 యును. ఇట్లు నలువైపులా రచించవలెను. రెండవ కూటముపైన మూలమంజరిని చేయవలయును విస్తారము 16 భాగములు, ఎత్తు 18 భాగములు నుండవలయును. స్కంధము అన్నిటికి గ్రీవ $1\frac{1}{2}$ భాగము, అండకము 2 భాగములు అండకములన్నియు మాదీఫలములవలె నుండవలెను. మండికలు రెండును 2 భాగములుండవలయును. ఆమలసారము 2 భాగములు దానిపైన కలశము గుండ్రముగా 3 భాగముల యెత్తు తోరణములు, మకరములు, పత్రములు, హంసలు కలిగియుండవలెను. ఏనుగుతొండ

ములు, అప్సరసలు ఇట్లు రచించినయెడల శ్రీధరమగును. దీనివలన కీర్తి ఇహసౌఖ్యము, పుణ్యము లభించును.

(అనుబంధము 37, 38, 39, 40 పటములు చూడుడు)

## 74. హేమకూటము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ చతురశ్రీకృతేక్షేత్రే శతమూలవిభాజితే
ద్విభాగఃకర్ణ ఇత్యుక్తఃసార్ధః ప్రతిరథోభవేత్॥ 16
త్రిభాగోభద్రవిస్తారో నిర్గమస్తుతదర్ధతః
అర్ధభాగఃప్రతిరథనిర్గమశ్చప్రకీర్తితః॥ 17
భాగఃభాగంభ్రమోభిత్తిః శేషంగర్భగృహంభవేత్
మండోవరజగత్యాద్యం పూర్వమానప్రకల్పితం॥ 18
కర్ణేచనందనంకుర్యాత్ కేశరీప్రరథేభవేత్
భద్రేశృంగద్వయంకుర్యాత్తిలకంతిలకోపరి॥ 19
రేఖాషడంశవిస్తారా తిలకంసార్ధముచ్ఛ్రితం
ప్రత్యంగంనష్టకర్ణంచ హేమకూటఃసఉచ్యతే॥ 20
హేమరత్నపురేరమ్యే హేమప్రాకారశోభితే
ఈప్సితంలభతేరాజ్యం స్వర్గేవాభూమిశాసనే॥ 21

తా॥ చతురశ్రప్రదేశమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగము, భద్రము 3 భాగములు భద్రముయొక్క నిర్గమము $1\frac{1}{2}$ భాగము, ప్రతిరథముయొక్క నిర్గమము దాని విస్తారముతో సగము చేయవలెను. గోడ 1 భాగము, భ్రమము 1 భాగము, గోడ 1 భాగమును, గర్భము 4 భాగములును చేయవలెను మండోవరజగతినుండి పూర్వము చేసినట్లే చేయవలెను. కర్ణము నందనమువలె రచించవలెను. ప్రతిరథము కేశరివలె రచించవలెను. భద్రమున 2 శృంగములుండవలెను. తిలకముపైన తిలకమును రచించ

వలెను. రేఖ 6 భాగముల విస్తారము చేయవలెను. తిలకము $1\frac{1}{2}$ ఎత్తు చేయవలయును. ప్రత్యంగము కర్ణములేకుండా చేయవలెను. హేమ కూటమని చెప్పుదురు. ఒక్కటే అంతస్తు 29 కలశములు కలిగి యుండును. (అనుబంధము 41, 42 పటములుచూడుడు)

## 75. హేమకూటము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ హేమకూటమథ బ్రూమః శుభలక్షణసంయుతం
సర్వవిద్యాధరస్థాన మాశ్రయఃసపినాకినః॥ 50
చతురశ్రీకృతే క్షేత్రే షడ్వింశత్యంశభాజితే
తత్రస్యుఃషట్పదాఃకర్ణాః శాలాద్వాదశభాగికాః॥ 51
నిర్గతాశ్చత్రిభిర్భాగైరవం త్యేతాశ్చతుర్దిశం
అష్టభాగాయతాభూయో నిర్గమశ్చత్రిభిఃపదైః॥ 52
చతుః స్తంభాశ్చతుష్పార్శ్వాదిక్షు సర్వాస్వయంవిధిః
కర్ణశాలాంతరంకార్యం పదేనైకేనవిస్తృతం॥ 53
ప్రవిష్టంతత్పదేనైకం తదేవాత్రజలాంతరం
పదేనకర్ణేకోణఃస్యాత్ ప్రత్యంగేపదవిస్తృతే॥ 54
నిర్గతేచార్ధభాగేన సమమానేమనోరమే
ద్విపదారథికాభద్రే నిర్గతార్ధపదేనసా॥ 55
చతుష్కర్ణేషుకర్తవ్యం సూపమేవంతుధీమతా
బాహ్యాభిత్తేస్తువిస్తార స్త్రిపదఃపరికీర్తితః 56
చతుఃషష్టిపదోగర్భ స్తద్భిత్తిస్త్రిపదాభవేత్
త్రిపదంకర్ణమానంస్యాద్ వారిమార్గేణసంయుతం॥ 57
పదార్థంవారిమార్గఃస్యాత్ పదమస్యప్రవేశకః
శాలాష్టపదవిస్తీర్ణా భాగార్ధేనవినిర్గతా॥ 58
చతుర్భాగాయతాభద్రం పునర్భాగార్ధనిర్గతం
తలన్యాసోహేమకూటే విభక్తపదనిశ్చయాత్॥ 59

అస్యాగ్రేమండపంకుర్యాన్మహాంతంగుణపూజితం
ఊర్ధ్వంతు హేమకూటస్య ద్విగుణంస్యాత్కలాధికం॥ 60

తా॥ ఈశ్వరునకు ముఖ్యమైన హేమకూటముయొక్క లక్షణ మను చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 26 భాగములు చేసి కర్ణములు 6-6 భాగములును, శాల 12 భాగములును, మిగిలిన 2 భాగములు జలాంతరమును చేయవలెను. నలువైపులా నిర్గమము 3 భాగములు చేయవలెను. మరల 8 భాగములు విస్తారమును, 3 భాగములు నిర్గమమును చేయవలెను, నలువైపుల 4 స్తంభములును, కర్ణశాల ప్రవేశము 1 భాగమును, విస్తారము 1 భాగమును జలాంతరమును చేయవలెను. కర్ణమున 1 భాగము కోణము చేయవలయును. ప్రత్యంగము 1 భాగము విస్తారమును నిర్గమము ½ భాగమును, ఇట్లు అన్నియును సమముగా రచించవలెను. భద్రమున రథిక 2 భాగములును, దాని నిర్గమము ½ భాగమును, ఇట్లు నాలుగు కర్ణములయందు రచించవలెను. వెలుపలి గోడ విస్తారము 3 భాగములును, గర్భగృహము 8 భాగములును, గోడ 3 భాగములును, 3 భాగములు కర్ణమును జలాంతరముతోగూడ చేయవలెను. జలాంతరము ½ భాగముండవలెను. ప్రవేశము 1 భాగము చేయవలయును. శాల 8 భాగములు విస్తారమును, నిర్గమము ½ భాగమును చేయవలయును. మరల భద్రమును 4 భాగముల విస్తారమును, నిర్గమము 1/2 భాగమును చేయవలయును. ఇది హేమకూటమునందు అంతస్థుభాగ పద్ధతి. దీని ముందు మండపమును రచించవలయును. ఆ మండపము గొప్పదియును లక్షణాన్వితమును అయియుండవలయును. హేమకూటము యొక్క పైభాగము రెట్టింపుగాను 16వ వంతు (వీసము) అధికముగా నుండవలయును.

శ్లో॥ అధస్తాదాసనంతస్య సప్తభాగసముచ్ఛ్రితం
భాగేనైకేనఖురకే నమధ్యేపూర్వమానయోః॥ 61
అతఊర్ధ్వంపునర్గ్రాహ్యఃపాదమానమనుక్రమాత్
సప్తభాగోన్నతంకుర్యాద్ వేదీబంధంసుశోభనం॥ 62
తస్యార్ధంకుంభకస్యార్ధ భాగేనకలశోన్నతిః
పదార్ధేనాంతరంపత్రం యథాశోభంవిధీయతే॥ 63
సార్ధంపదంపునఃప్రోక్తాకపోతాలీసుశోభనా
దశభాగోచ్ఛ్రితాజంఘా కర్తవ్యాతిసులక్షణా॥ 64
అస్యోపరివిధాతవ్యం భరణం ద్విపదోచ్ఛ్రితం
మేఖలాంతరపత్రేతు విధీయేతేపదత్రయే॥ 65
అధస్తాన్మేఖలాయాస్తుఖురకస్యతథోపరి
ఏకోనవింశతింభాగానంతరంసంప్రచక్షతే॥ 66
కర్మప్రమాణమేతస్య పృథఙ్మధ్యేఽభిధీయతే
ద్విపదంరాజాసనంస్యా ద్వేదీచాస్యచతుష్పదా॥ 67
భవత్యాసనపట్టస్య కల్పనాభాగమానతః
సార్ధంభాగద్వయంకార్య మూర్ధ్వంచంద్రావలోకనం॥ 68
స్తంభానాసనపట్టార్ధేనయుంజ్యాదష్టభాగికాన్
భరణస్తంభశీర్షేచ ప్రత్యేకంపదకేస్మృతే॥ 69
ద్విపదశ్చార్ధపట్టఃస్యాచ్ఛాద్యకేనసుశోభితః
త్రిపదంఛాద్యకంతత్ర విస్తారేణప్రకీర్తితం॥ 70
ఏతన్మానంసమాఖ్యాత మలిందేషుచతుర్దిశం
ఊర్ధ్వమంతపత్రస్య కథయామోయథాక్రమం॥ 71
షట్పదేకర్ణవిస్తారేసప్తాంశాకర్ణమంజరీ
గ్రీవామర్ధపదంకుర్యాత్ పదమేకంతథాండకమ్॥ 72
అర్ధాంశాచంద్రికాచస్యాదేకాంశః కలశోచ్ఛ్రయః
అస్యోరోమంజరీకార్యావిస్తరేణచతుష్పదా॥ 73

గ్రీవాండకేవిధాతవ్యే భాగేనార్ధేనకుంభకః
సింహకర్ణస్తుకర్తవ్యో ద్విపదోఽస్యైవమధ్యతః॥ 74
ఇత్థంపంచాండకాకర్ణే హేమకూటేషుకీర్తితాః
అష్టాంశవిస్తృతంకుర్యాదుదయేనచషట్పదం॥ 75
అలిందస్యోర్ధ్వభాగస్థం సింహకర్ణంమనోరమం
సింహకర్ణే ద్విభాగస్థాం ద్వాదశాంశకవిస్తృతాం॥ 76
ఉరోమంజరికాంకుర్యాత్ త్రయోదశపదోచ్ఛ్రితాం
సప్తాంశవిస్తృతస్కంధో గ్రీవాచపదముచ్ఛ్రితా॥ 77
అండకంసార్ధభాగేన చంద్రికార్ధపదాస్మృతా
ఆకాశలింగంకుర్వీత ద్విపదంసుమనోరమం॥ 78
విస్తారోమూలమంజర్యా భాగవింశతిసంమితః
ఉచ్ఛ్రాయోఽస్యైకవింశత్యా స్కంధోద్వాదశభాగికః॥ 79

తా॥ దానికి దిగువ 7 భాగముల యెత్తున పీఠమును రచించవలెను. 1 భాగము ఖురకమును చేయవలయును. మధ్యను చేయరాదు దానిపైన వరుసగా 7 భాగముల యెత్తు వేదీబంధమును, అందులో సగము యెత్తు (3 1/2) కుంభమును, శేషించిన సగము యెత్తు (3 1/2) కలశమును చేయవలయును. అంతరపత్రము 1/2 భాగమును, 1 1/2 భాగము కపోతాలి, జంఘ 10 భాగములు, దానిపైన భరణము 2 భాగములు, మేఖల అంతరపత్రము 3 భాగములు, అడుగున మేఖలలును, దానిపైన ఖురకమును రచించవలయును. 19 భాగములుండవలయును. రాజపీఠము 2 భాగములు, వేదిక 4 భాగములు, పీఠముయొక్క పట్టము 1 1/2 భాగము, పైన చంద్రావలోకనము 2 భాగములు, స్తంభములను పీఠపట్టముయొక్క సగముతో కలిపి 8 భాగములు చేయవలెను. స్తంభముపైన భరణము 1 భాగము, అర్ధపట్టము 2 భాగములు, ఛాద్యముతో నలంకారముగా నుండవలయును. ఛాద్యము 3 భాగములు విస్తారము, ఈ కొలత నాలుగువైపుల అలిందముల యం-

దుండవలెను. ఆపైన అంతరపత్రమును చెప్పుచున్నాడు. కర్ణము యొక్క విస్తారము 6 భాగములును కర్ణమంజరి 7 భాగములును, గ్రీవ 1/2 భాగమును, అండకము 1 భాగము, చంద్రిక 1/2 భాగము, కలశము 1 భాగము, దీనికి ఉరోమంజరి 4 భాగముల విస్తారమును, గ్రీవ అండకమునుచేసి కుంభము 1/2 భాగమును, సింహకర్ణములమధ్య 2 భాగములు చేయవలయును. ఇట్లు 5 అండకములు కర్ణమున రచించవలయును. అండకముల విస్తారము 8 భాగములును, ఎత్తు 6 భాగములును, అలిందములయొక్క పైభాగముననున్న సింహ కర్ణములు అందముగా నుండవలయును. 2 భాగములుగల సింహకర్ణములయందు ఉరోమంజరిని 12 భాగముల విస్తారముతోను, 13 భాగముల యెత్తుతోను రచించవలయును. స్కంధము 6 భాగముల విస్తారమును, గ్రీవ 1 భాగము యెత్తును, అండకము 1 1/2 భాగమును, చంద్రిక 1/2 భాగమును, ఆకాశలింగము చక్కగా 2 భాగములతో రచించవలెను. ప్రధాన మంజరియొక్క విస్తారము 20 భాగములును, ఎత్తు 21 భాగములను, స్కంధము 12 భాగములును కలిగియుండవలెను.

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ పంచభౌమస్తు కర్తవ్యో యథాచాతుఃసజాయతే
ప్రథమాభూమికాతత్ర పంచభాగావిధీయతే॥ 80
పరాపరార్ధభాగేన న్యూనాన్యూనావిధీయతే
స్కంధమానం విధాతవ్యం పదేనైకేనచోన్నతం॥ 81
విభజ్యదశధాకుర్యాల్లతాః పంచాతిసుందరీః
హేమకూటస్యకర్ణేషు ప్రత్యంగేనరకిన్నరాః॥ 82
అన్యేతిలకకూటాశ్చ కర్తవ్యాస్తునిరంతరాః
ఈదృశీమంజరీహైమే విధేయాకూటనిర్గతా॥ 83
గ్రీవాసార్ధపదాప్రోక్తా విస్తారాదష్టభాగికా
అండకంద్విపదోత్సేధ మేకాదశపదాయతం॥ 84

చంద్రికాసార్ధభాగోచ్చా విస్తారాన్నవభాగికా
త్రిపదఃకలశఃకార్యోవిస్తారేణోచ్ఛ్రయేణచ॥ 85
ఏవంవిధంవిధత్తేయో హేమకూటంమనోరమం
సక్రీడతిపుమాన్స్వర్గే యావత్రీడాపినాకినః॥ 86

తా॥ 5 అంతస్తులతో చక్కగా రచించవలెను. మొదటి అంతస్తు 5 భాగములు చేయవలెను. దాని తరువాత ఒక్కొక్క అంతస్తు 1/2 భాగము చొప్పున తగ్గించుచుండవలెను. స్కంధము 1 భాగము యెత్తుండవలెను. దానిని 10 భాగములుచేసి మిక్కిలి అందముగానుండునట్లు 5 లతలను రచించవలయును. హేమకూటము యొక్క కర్ణకూటములయందును పంజరములయందును నరరూపములను కిన్నరాదిరూపములను రచించవలయును. ఇతర తిలకముల యొక్క కూటములందును తప్పక ఆయా రూపములను నిర్మించుచుండవలయును. కూటములయొక్క నిర్గమమును మంజరియును ఇట్లు చేయవలయును. గ్రీవ 1 1/2 భాగము యెత్తును విస్తారము 8 భాగములును అండకము 2 భాగముల యెత్తును 11 భాగముల విస్తారమును, చంద్రిక 1 1/2 భాగము యెత్తును విస్తారము 9 భాగములును, కలశము ఎత్తు 3 భాగములును, విస్తారముకూడ 3 భాగములును, ఇట్లు చక్కగా రచించినయెడల హేమకూటమగును. ఇది స్వర్గమున శివ సాన్నిధ్యమున నుండదగిన పుణ్యమును లభింపజేయును.

(అనుబంధము 43, 44వ పటములు చూడుడు)

## 76. సుభద్రము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ ఋత్వంకచంద్రవేదాశ్రే వేదర్తుగర్భఉచ్యతే
శశీచంద్రశ్చంద్రశ్చ భ్రమోభిత్తిశ్చకల్పితాః॥ 22
వేదకర్ణఋతుభద్ర ముదకాంతరభూషితం
కర్ణేచసర్వతోభద్రం భద్రేచంద్రావలోకనం॥ 23

దిగ్భాగంమూలశిఖరం ఘంటాకలశభూషితం
సుభద్రోనామవిజ్ఞేయః సర్వకల్యాణకారకః॥ 24

తా॥ చతురశ్రమును 10-10 భాగములుచేసి మధ్య 4-4 గర్భమును, 1 భాగముచుట్టూ గోడను రచించవలయును. భ్రమము 1 భాగమును, వెలుపలి గోడ 1 భాగమును రచించి ముందు ముఖభద్రమును విస్తారము 6 భాగములును, కర్ణము 4 భాగములును జలాంశరముతోగూడ చేసి కర్ణమును సర్వతోభద్రమువలెను, భద్రమున చంద్రావలోకనమును ప్రధాన శిఖరము 10 భాగములు ఘంట, కలశము మొదలైనవానితో రచించినయెడల సుభద్రమగును.

(అనుబంధము 45, 46 పటములు చూడుడు)

## 77. సుభద్రము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ సుభద్రాఖ్యమథబ్రూమః ప్రాసాదంభద్రభద్రకం
సుభద్రోఽయమతఃప్రోక్తో భద్రేభద్రోయతోఽన్వితః॥ 87
చతురశ్రీకృతేక్షేత్రే చతుర్దశవిభాజితే
గర్భఃషోడశభిర్భాగైః కందఃషట్పదవిస్తృతః॥ 88
భిత్తిఃస్యాత్పదవింశత్యాతత్రకందసమాకృతా
కర్ణాఃప్రత్యంగకాన్యేషాం ప్రత్యేకంపదవిస్తరాత్॥ 89
ద్వ్యంశోమధ్యగవిస్తార ఉభయోర్నిర్గమఃపదం
ద్వ్యంశఃసరథ విస్తార ఆక్రాంతపదనిర్గమైః॥ 90
ద్విపదాబాహ్యభిత్తిఃస్యాద్ విస్తారేణసుశోభితా
చతుష్పదాయతఃకర్ణో భద్రంతస్యద్విభాగికం॥ 91
నిర్గమోఽస్యార్ధభాగేన స్యాదేవంసుందరంకృతం
కర్ణేకోణాస్తుపదికా దిక్షుసర్వాసుశోభనాః॥ 92

సార్ధభాగేనకర్తవ్యం సగ్రీవంకలశాండకం
సింహప్రాసాదవత్కర్ణావిధేయాఃశుభలక్షణాః॥ 106
మూలమానేనవిస్తీర్ణా నిర్గూఢస్యోపరిస్థితాః
ద్వితీయశ్చతృతీయశ్చ తదూర్ధ్వంచసముచ్ఛ్రితః॥ 107
కర్ణస్థకలశాదూర్ధ్వం కర్తవ్యామూలమంజరీ
విస్తారోదశభాగఃస్యాదుచ్చ్రాయోద్వాదశాంశకః॥ 108
లతాభిఃపంచభిర్యుక్తా విచిత్రైశ్చాపికర్మభిః
షట్పాదోఽస్యప్మృతఃస్కంధోగ్రీవాచాస్యచతుష్పదా॥ 109
విస్తారేణసమాఖ్యాతా పాదోనంపదముచ్ఛ్రితా
అండకంసాంఘ్రిభాగేన భవేత్షడ్భాగవిస్తృతం॥ 110
పాదానంచంద్రికాభాగం కలశశ్చద్విభాగికః
ప్రాసాదంయేసుభద్రాఖ్యం కారయంతిసులక్షణం॥ 111
కల్పకోటిసహస్రాణి భద్రంతేషాంశివాగ్రతః
సర్వపాపక్షయకరస్త్రిషులోకేషుకీర్తితః॥ 112

తా॥ సుభద్రమనగా భద్రమునందు భద్రములుగలది. దాని యొక్క లక్షణము చెప్పుచున్నాడు. నలుచదరముగానున్న ప్రదేశ మును 14 భాగములుచేసి, గర్భము 16 భాగములును, కందము 6 భాగములతో కలసి చుట్టూ గోడ 20 భాగములును, అచట కంద ముతో సమానముగా నుండవలయును. కర్ణములును ప్రత్యంగము లును 1-1 భాగములు చేయవలయును. వానియొక్క మధ్యవిస్తారము 2 భాగము లుండవలయును. రెంటియొక్క నిర్గమము 1 భాగము, రథముయొక్క విస్తారము 2 భాగములు ప్రవేశము నిర్గమముకలిపి యుండవలయును. వెలుపలి గోడ 2 భాగములును, కర్ణముయెత్తు 4 భాగములును, భద్రము 8 భాగములును, నిర్గమము 1/2 భాగమును చేయవలయును. కర్ణమున కోణములు 1 భాగమును అన్ని దిశల యందు చేయవలయును. నిగూఢముయొక్క విస్తారము 15 1/2 భాగ

ములను అచట నిర్గమను 2 భాగములు చుట్టూ చేయవలయును. కర్ణముయొక్కయు భద్రముయొక్కయు సందున జలాంతరమును కల్పించవలెను. ప్రవేశము 1 భాగమును 1 1/4 భాగము విస్తారమును యెత్తు అదే కొలత యుండవలెను. రాజపీఠము 1/2 భాగము చక్కగా చేయవలెను ఖురపీఠము యెత్తు 4 భాగములును, కుంభకము 2 భాగములును, మసూరకము 3/4 భాగమును, అంతరపత్రము 1/2 భాగమును, మేఖలలు 3/4 భాగమును, జంఘ 6 భాగములు గ్రాసపట్టిక 1 భాగమును, మేఖల 1 భాగమును, అంతరపద్రము 1 భాగమును, పట్టమునకుదిగువను ఖురమునకు పైనను 11 భాగములుండవలెను. అదియే కొలతలో రెండవ పద్ధతి. రాజపీఠము 1 భాగము యెత్తు చక్కగానుండవలెను. వేదిక 2 1/2 భాగములుండవలయును. పీఠము 1/2 భాగమును, చంద్రావలోకనము 2 భాగములును, పీఠముయొక్క పట్టమునకు పైన స్తంభము 5 భాగములును స్తంభముపైన భరణము యెత్తు 1 భాగము, ఛాద్యము 1 భాగముచుట్టూ కల్పించవలెను. పట్టము 1 భాగమును ఛాద్య విస్తారము 2 భాగములును, లంబనము 1 భాగమును, దానిపైన అంతరపత్రమును రచించవలెను. ఆ పైన కర్ణములు 4-4 భాగములుండవలెను. వానికి భద్రములును కర్ణములు 1 భాగముచొప్పున నుండవలయును. వానియందు ఉపరథములను గూడ రచించవలయును. విస్తారము 1 భాగమును యెత్తు 1 భాగమును చేయవలెను. గ్రీవ యెత్తు 1 1/2 భాగమును, సింహాకర్ణములు విస్తారము 2 భాగములును యెత్తుకూడ 2 భాగములును, శిఖరముకు దిగువ 3 భాగములు కర్ణమంజరిని రచించవలెను. స్కంధము విస్తారము 2 భాగములును యెత్తు 3 భాగములును చేయవలయును. గ్రీవము తో సహా కలశముయొక్క అండకము 1 1/2 భాగము, కర్ణములు సింహ ప్రాసాదమున రచించినట్లు చక్కగా రచించవలెను. నిగూఢమును

మొదట నిర్ణయించిన కొలతప్రకారము పైనకూడ చేయవలెను. 2వ అంతస్తునను, 3వ అంతస్తుననుఅదే యెత్తున రచించవలెను. కర్ణముల యందున్న తిలకములపైన మూలమంజరిని రచించవలయును. మూల మంజరియొక్క విస్తారము 10 భాగములను, యెత్తు 12 భాగములను లతలు తెనువిచిత్రముగా రచించవలయును. స్కంధము 6 భాగములు, గ్రీవ 4 భాగములువిస్తారమును యెత్తు 1 3/4 భాగములును, అండకము 1 1/4 భాగము యెత్తును విస్తారము 6 భాగములును, చంద్రిక 3/4 భాగమును, కలశము 2 భాగములును ఇట్లు రచించిన యెడల సుభద్ర మను ప్రాసాదమగును. అటుల నిర్మించినవారు సమస్త పాపముల నుండి తొలగింపబడి లోకమున కీర్తిగలవారై శివసాన్నిధ్యమున ననేక కోట్లకల్పములుందురు.

## 78. రిపుకేసరి

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ కర్ణేద్వితీయముపరి సర్వతోభద్రకంభవేత్
ద్విభాగంతిలకంకుర్యాత్ ప్రరథేచోరుమంజరీ॥ 25
మత్తాలంబయుతంభద్రం నామ్నాసరిపుకేసరీ
హంతిసర్వాన్ రిపూశ్చాసౌ ఇహలోకేపరత్రచ॥ 26

తా॥ కర్ణమునపైన సర్వతోభద్రమును తిలకము 2 భాగములును ప్రరథమున ఉరుమంజరియును మత్తాలంబముతోడ భద్రమును రచించినయెడల రిపుకేసరియగును. అది యిహపర సౌఖ్యముల నిచ్చును.

## 79. రిపుకేసరి మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ రిపుకేసరిసంజ్ఞోఽయం ప్రాసాదఃపరికీర్త్యతే
చతురశ్రీకృతేక్షేత్రే భాగవింశతిభాజితే॥ 113

ద్విపదా బాహ్యభిత్తిః స్యాన్మధ్యభిత్తిశ్చ తావతీ
భ్రమణీ ద్విపదా కార్యా విస్తారాత్సర్వదిగ్గతా॥ 114
గర్భోఽష్టవిస్తృతః కర్ణకందస్సార్ధభాగికః
చతుర్భాగాయతం భద్రం కుర్యాద్భాగేన నిర్గతం॥ 115
రథకోఽస్యాసముద్దిష్టో విధాతవ్యశ్చతుర్దిశం
పార్శ్వయోశ్చ ప్రతిరథా కార్యా సార్ధపదాయతా॥ 116
పదార్ధేన వినిష్క్రాంతా రథేషు వివిధేష్వపి
కర్ణాయామశ్చతుర్భాగో ద్విపదం కర్ణభద్రకం॥ 117
పదార్ధేన వినిష్క్రాంతం బాహ్యే కర్ణే వ్యవస్థితం
పదపాదేన విస్తీర్ణం ప్రవిష్టం పదమాత్రకం॥ 118
కామ్యం జలాంతరం మధ్యే కర్ణస్య తిలకస్య చ
ద్వ్యంశ స్తిలకవిస్తారః పదేనైకేన నిర్గమః॥ 119
సువర్ణితాః స్యుస్తిలకా భద్రకోణవ్యవస్థితాః
అష్టభాగం భవేద్భద్రం పదత్రయవినిర్గతం॥ 120
చతస్రష్వపి తద్దిక్షు కర్తవ్యం స్తంభభూషితం
ఊర్ధ్వమానమథ బ్రూమః ప్రతిపత్రం సుఖావహం॥ 121
ఊర్ధ్వప్రమాణం ద్విగుణం కర్తవ్యం ద్వికలాధికం
భాగైరేకోనవింశత్యా మధ్యే కార్యస్తులోదయః॥ 122
ఏభ్యో మధ్యాద్విధాతవ్యా వేదీబంధాః సుశోభనాః
ద్విపదః ఖురకః సార్ధం పదం తు కలశో భవేత్॥ 123
మేఖలాంతరపత్రే తు కార్యే సార్ధపదోన్నతే
నవభాగోన్నతా జంఘా ద్విపదా రూపపట్టికా॥ 124
మేఖలాంతరపత్రే తు విదధీత పదద్వయం
మధ్యం స్యాత్ షోడశపదం మానం యః ఖురకోఽస్య చ॥ 125
రాజాసనం తథా వేదీ తద్వదాసనపట్టకం
పదైః పంచభిరేతాని విదధ్యాదూర్ధ్వమానతః॥ 126

చంద్రావలోకనంకుర్యాద్ ద్విపదంభాగమానతః
ఉపర్యానదపట్టస్య స్తంభఃస్యాత్ సప్తభాగికః॥ 127
భరణం స్తంభశీర్షంచ ద్విపదంచోర్ధ్వమానతః
ద్విపదఃపట్టిపిండఃస్యాత్ త్రిపదశ్చాద్యవిస్తరః॥ 128
ఊర్ధ్వమంతరపత్రస్య సాంప్రతంపరికీర్త్యతే
చతుష్పదఃకర్ణశృంగ మాయామోచ్ఛ్రాయతఃసమం॥ 129
గ్రీవాండకంచభాగేన చంద్రికార్ధపదేనచ
కలశశ్చార్ధభాగేన కర్తవ్యోఽత్రనసంశయః॥ 130
అస్యోర్ధ్వతఃప్రకర్తవ్యా ద్వితీయాకర్ణమంజరీ
త్రిపదాయామవిస్తారా గ్రీవాండకలశాః పదం॥ 131
భద్రకర్ణాశ్రితేద్వ్యంశో విస్తారస్తిలకేస్మృతః
ఉచ్ఛ్రాయస్త్రిపదస్తస్య ద్వితీయఃస్యాత్తదూర్ధ్వతః॥ 132
సార్ధద్విపదఉచ్ఛ్రాయో విస్తారోద్విపదఃస్మృతః
సప్తభాగోన్నతంతద్వద్ విస్తారాదష్టభాగికం॥ 133
సింహకర్ణంప్రకుర్వీత ససూత్రమానపూర్వకం
ఉరోమంజరికాకార్యా ద్వితీయాతిలకోర్ధ్వతః॥ 134
అష్టభాగాయతామూవే నవభాగమితోచ్ఛ్రయా
తస్యాస్తుస్కంధవిస్తారో భాగైఃస్యాదూర్ధ్వపంచమైః॥ 135
గ్రీవార్ధభాగముత్సేధాద్ భాగేనామలసారకం
చంద్రికాచార్ధభాగేన కలశోభాగముచ్ఛ్రితః॥ 136
ద్వితీయాకర్ణశృంగస్యస్యాదూర్ధ్వేమూలమంజరీ
భాగద్వాదశవిస్తారాకలయాభ్యధికోర్ధ్వతః॥ 137
స్కంధఃసప్తపదఃప్రోక్తోగ్రీవాభాగసముచ్ఛ్రితా
అండస్యద్వ్యంశఉత్సేధో విస్తారఃసప్తభాగికం॥ 138
చంద్రికైకేనభాగేన కలశస్తుద్విభాగికః
లతానాగరికాకార్యానాన్యత్కర్మాత్రయోజయేత్॥ 139

యేఽస్మిన్ విజయమిచ్ఛంతి భోగాన్ సువిపులానః
సర్వపాపప్రణాశంచ కార్యోవారిరిపుకేసరీ॥

తా॥ రిపుకేసరియొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చ
తుశ్రముగా జేయబడిన ప్రదేశమును 20 భాగములుచేసి వెలుపలిగ
2 భాగములు, మధ్యగోడ 2 భాగములు, భ్రమణి 2 భాగము
గర్భము 8 భాగములును, గుహ 1 1/2 భాగము అందులోనే కల్పి
వచ్చును. భద్రము 4 భాగములును, నిర్గమము 1 భాగమును, ర
ములను నలుదిశలను వానికిరువైపుల ప్రతిరథములను 1 1 2 భాగ
చొప్పునను, వానియొక్క నిర్గమము 1/2 భాగమును, కర్ణముయొ
విస్తారమును 4 భాగములుచేసి అందు 2 భాగములుమధ్య భద్రమ
దానియొక్క నిర్గమము 1/2 భాగమును వెలుపలి కర్ణమున న
వలెను. 1/4 భాగము విస్తారమును 1 భాగము ప్రవేశమును ఉ
నట్లు మధ్య జలాంతరమును చేయవలయును. ఇట్లు తిలకమునకుగ
జలాంతరమును చేయవలయును. తిలకముయొక్క విస్తారము 2
ములును, నిర్గమము 1 భాగమును, భద్రముతో సహితము
చేయవలయును. భద్రము 8 భాగములు విస్తారమును నిర్గమమ
భాగములును కలిగియుండవలయును. ఇట్లు వలువైపుల రచించవ
స్తంభములనుగూడ రచించవలెను. ఎత్తును చెప్పుచున్నాడు.
పత్రము యొత్తు విస్తారమునకు రెట్టింపుగాను శివవంతు (పరక)
ముగాను చేయవలయును. 19 భాగములు మధ్యఅంతస్తు యొ
పాడవు, ఆ మధ్యనుండి వేదీబంధము అందముగా రచించవలయ
అందు ఖురము 2 బాగములను, కలశము 1 1/2 బాగమును,
అంతరపత్రము ఈ రెండునుకలసి 1 1/2 భాగము యొత్తు, జం
భాగముల యొత్తు, రూపపట్టిక 2 బాగములు, మేఖల అంతరప
ఈ రెండునుకలసి 2 భాగములు ఖురముయొక్క నడుము 16 బా

ఈ మూడునుకలసి 5 భాగములుండవలయును. ఆసనపట్టముపైన స్తంభము 7 భాగములు, ఆ స్తంభముపైన భరణమును స్తంభ శీర్ష మునుకలసి 2 భాగములు. పట్టము 2 భాగములు, ఛాద్యముయొక్క విస్తారము 3 భాగములు, అంతరపత్రమునకుపైన కర్ణశృంగము 4 భాగముల విస్తారమును యెత్తుకూడ 4 భాగములుచేసి, ఆపైన గ్రీవము అండకము 1 భాగము, చంద్రిక 1/3 భాగము, కలశము 1/2 భాగ మును చేయవలయును. దానిపైన రెండవ కర్ణమంజరి విస్తారము 3 భాగములును, అదే యెత్తును ఆపైన గ్రీవము, అండము, కలశము ఈ మూడును 1 భాగమును, తిలకమున భద్రము 2 భాగములును, దానియొక్క యెత్తు 3 భాగములును, దానిపైన రెండవది 2 1/2 భాగము యెత్తును, విస్తారము 2 భా గ ము లు ను కలిగియుండును. సింహకర్ణము 7 భాగముల యెత్తును, 8 భాగముల వి స్తా ర ము ను చేయవలయును. తిలకముపైన రెండవ ఉరోమంజరి 8 భాగములు ఆయతమును, 9 భాగములు యెత్తును కలిగియుండవలయును. దాని యొక్క స్కంధము 5 భాగముల విస్తారమును, గ్రీవము 1/2 భాగము ఎత్తు, ఆమలసారము 1 భాగము యెత్తు, చంద్రిక 1/2 భా గ ము ఎత్తు, కలశము ఎత్తు 1 భాగమును, కర్ణశృంగముపైన రెం డ వ ప్రధానమంజరి. విస్తారము 12 భాగములును, ఎత్తు 14 భా గ ము లును స్కంధము 7 భాగములును, గ్రీవము 1 భాగము, ఎత్తును అండకము ఎత్తు 2 భాగములును, విస్తారము 7 భాగములును, చంద్రిక 1 భాగ మును, కలశము 2 భాగములును, లతలు నాగరపద్ధతితో చేయ వలెను. ఇతరమైన అలంకారములుకూడ చేయవచ్చును. ఇది విజయ మును, భోగములను ఇచ్చును. సమస్తమైనపాపముల నశింపజేయును.

(అనుబంధము 47, 48వ పటములు చూడుడు)

# 80. పుష్పకము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ సుభద్రస్యచసంస్థానే తద్రూపేతదవస్థితే
కర్ణేచాష్టదలంకుర్యాత్ త్రిలకంచైవశోభనం॥
తద్వసంతమహారాజ్యే ప్రాపక్తేజన్మజన్మని
పుష్పకఃపుష్పప్రకర యుక్తోవారాంగనాయథా॥

తా॥ సుభద్రముయొక్క కర్ణమున 8 దలములును తిలకమ రచించిన యెడల పుష్పకమగును. పుష్పకప్రాసాదముకల రాజ్య వసంతర్తువలె సమస్త సంపదలతో ప్రకాశించుచుండును.

# 81. పుష్పకము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ఇదానీంపుష్పకంనామ ప్రాసాదమభిదధ్మహే
నిర్మితోధనదస్యార్థేయఃపూర్వంవిశ్వకర్మణా॥
చతురశ్రీకృతేక్షేత్రే చతుర్దశవిభాజితే
విభజ్యత్రిపదఃకర్ణం చత్వారోఽపివిదిగ్గతాః॥
కర్ణోపకర్ణగర్భాద్య సూత్రంతేనసమానిచ
రక్తానిదత్వాసూత్రాణి తదగ్రద్వితయఃస్మృతాః॥
సూత్రేణచతురఃకర్ణాన్ దిక్స్థానుత్పాదయేత్తతః
చత్వారోఽన్యేపునఃకర్ణాః సంసిద్ధాఃసర్వఏవహి॥
ఏవమష్టదలాన్కర్ణాన్ వృత్తానేవప్రకల్పయేత్
భాగప్రవేశవిస్తారం కర్ణాంతేదజలాంతరం॥
శాలాస్యాత్షట్పదాయామాత్రిపదోఽస్యాచ్చనిర్గమః
ద్విపదాబాహ్యభిత్తిఃస్యాత్ షట్పదాకందవిస్తృతిః॥
కందగర్భస్థితంపత్రం భ్రామయేత్ కర్ణకందతః

కుర్వీతతత్రమధ్యేతు కందంషోడశపత్రకం
భిత్తికందాంతరావేయచ్ఛేషంతత్స్యాద్భ్రమంతికా॥ 148
పుష్పకస్యతలన్యాసః పంచపుష్పాకృతిర్భవేత్
ఇదానీమూర్ధ్వమస్యైవకథ్యతేమానపూర్వకం॥ 149
ఏకోనత్రింశదూర్ధ్వంస్యుఃపదాన్ పూర్వంయథాక్రమం
అతోబహిర్విధాతవ్యఃపీఠబంధఃపదత్రయం॥ 150
ద్వయంకుంభఃసపాదాంశః పాదోనఃస్యాన్మసూరకః
అర్ధేనాంతరపత్రంస్యాత్ కపోతాపీచతత్సమా॥ 151
మాలావిద్యాధరీకార్యాపుష్పహస్త్యైరలంకృతా
పదద్వాదశకోత్సేధః (సగుణాః) స్యాత్తులోదయః॥ 152
అస్యమధ్యేవిధాతవ్యా వేదీబంధస్త్రిభాగికః
పదార్ధంఖురకంకుర్యాద్ భాగేనైకేనకుంభకం॥ 153
మసూరకంపదార్ధేన మేఖలాపదమానతః
షడ్భాగముచ్ఛ్రితాజంఘా పుష్పకేపరికీర్తితా॥ 154
మరాలగ్రాహమకరైః పుష్పవిద్యాధరైరపి
సూక్ష్మకర్ణసమాకీర్ణాచాస్యజంఘావిధీయతే॥ 155
భాగేనైకేనభరణంభాగేనైకేనపట్టికా
మేఖలాంతరపత్రంచ భాగేనైకేనచోచ్ఛ్రితం॥ 156
ఊర్ధ్వతస్తలపట్టస్య పట్టస్యోర్ధ్వస్యమస్తకం
భాగైకాదశకాతావత్ విధేయాకర్ణచర్చితా॥ 157
భాగేనరాసనంస్యాద్ ద్విభాగాద్వేదికోచ్ఛ్రితా
భవేదాసనపట్టశ్చ భాగార్ధేనసమున్నతః। 158

తా॥ పుష్పక ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. పూర్వము విశ్వకర్మకు బేరునకొసంగినదని ప్రతీతి చతురశ్ర ప్రదేశమును 14 బాగములు చేసి కర్ణము 3 బాగములు నలుపై పుల రచించ

వలెను. కర్ణము, ప్రతిరథము, గర్భసూత్రముతో సమానముగానుండ వలెను. నాలుగు సూత్రములతోను పైన రెండు సూత్రములతోను 4 కర్ణములను రచించవలయును. మరియు నాలుగుదిశలయందును 4 కర్ణములను రచించవలయును. ఇట్లు 8 దలములను కర్ణములను గుండ్రముగాను 1 భాగము ప్రవేశమును విస్తారమునుచేసి కర్ణము యొక్క ప్రక్కను జలాంతరమును చేయవలయును, శాల యొక్క విస్తారము 6 భాగములను దానియొక్క నిర్గమము 3 భాగములును, వెలుపలిగోడ 2 భాగములును, గుహ 6 భాగముల విస్తారమును, ఆ గుహయొక్క మధ్యనున్న దలమును కర్ణముననున్న గుహవరకు గుండ్రముగా గీయవలెను. అప్పుడు వృత్తాకార మేర్పడును. అది సమ సూత్రముతోనుండును. దానియొక్క నడుమ గుహ 16 దలములతో నుండవలయును. గోడయొక్కయు గుహయొక్కయు నడుమ మిగిలిన ప్రదేశము అంధకారిక యనబడును. పుష్పకముయొక్క తలమును 5 పుష్పములవలెనుండునట్లు రచించవలయును. ఇకను ఎత్తును చెప్పు చున్నాడు. 19 భాగములకుపైన భాగములను మునుపు చెప్పినట్లు చేయ వలయును. దానినుండి పీఠబంధము 3 భాగములు, దానిపైన కుంభము 2 1/4 భాగమును, మసూరకము 3/4 భాగమును అంతర 1/2 భాగ మును, కపోతములవరుస 1/2 భాగమును, మాలవిద్యాధరీ సమూ హముతోను పుష్పహస్తములతో నలంకరింపబడినట్లును రచించవలెను మొత్తము 19 భాగములగును. అచ్చటినుండి దూలముయొక్క పై భాగమువరకు 15 భాగములుండవలయును. దానిమధ్యను వేదీబంధము 3 భాగములును, ఖురకము 1/2 భాగమును, కుంభకము 1 భాగమును మసూరకము 1/2 భాగమును, మేఖల 1 భాగమును, జంఘ 6 భాగము లును, హంస, చేప, మొసలి మొదలైనవియును పుష్పములు విద్యా ధరులు సూక్ష్మకర్ణములతోగూడిన జంఘయును, భరణము 1 భాగ

మును, పట్టిక 1 భాగమును, మేఖల అంతరపత్రము ఈరెండు 1 భాగ మును మొత్తము 15 భాగములు పట్టముయొక్క పైన మస్తకమును 11 భాగములు సూత్రప్రకారము చేయవలయును. రాజపీఠము 1 భాగ మును, వేదిక ఎత్తు 2 భాగములును, పీఠముయొక్క పట్టము 1/2 భాగము యెత్తును చేయవలయును.

శ్లో॥ చంద్రావలోకనం కుర్యాత్ భాగికం త్ర్యంశలంచితం
ఆసనస్యోర్ధ్వతః కుర్యాత్ స్తంభం పంచపదం శుభం॥ 159
హీరగ్రహణకంశీర్షం ద్వయం సార్ధైకభాగతః
గలపట్టశ్చభాగేన మల్లచ్ఛాద్యం ద్విభాగికం॥ 160
భాగేనలంబితం తత్ స్యాత్ సుస్పష్టం సుమనోరమం
ఏతస్యోపరిభాగేన కర్తవ్యాచ్ఛాద్యపట్టికా॥ 161
పదేనైకేనచాస్యోర్ధ్వం కపోతాల్యంతరచ్ఛదే
భాగషట్కేనవిస్తీర్ణే పంచభాగసమున్నతే॥ 162
శూరసేనం ప్రకుర్వీత మధ్యవర్తావితోరణం
మరాలగ్రాహమకరైర్వరాహగజతుండకైః॥ 163
ఏవమాదిభిరాకీర్ణ మవిందస్యోపరిస్థితం
కోణంకుర్యాత్ పుష్పకూటం పుష్పకర్మనిరంతరం॥ 164
చతస్రోభూమయోఽస్యస్యు స్తాంశ్చన్యూనాః పునః పునః
ప్రథమాభూమికాదూర్ధ్వం హీనం సాస్యాత్ పరాపరా॥ 165
ఆద్యస్యకోణకూటస్య విస్తారస్త్రిపదఃస్మృతః
పరేషాం పునరేషాం స్యాత్ క్రమాదూనోఽంఘ్రిణాంఘ్రిణా॥
బాహ్యేత్పరస్పరం క్షేపమం శేనాంశేన యోజయేత్
మధ్యేలతాస్యాకర్తవ్యా భాగషట్కేనవిస్తృతా॥ 167
స్కంధేద్విపదవిస్తారాం విదధ్యాన్మధ్యమంజరీం
షడ్గుణం సూత్రమాదాయ లతారేఖాం సమాలిఖేత్॥ 168

అలేఖంచతతఃకుర్యాత్ సుశుద్ధంభాగసుందరం
భాగేనవేదికోత్సేధః షడ్భాగఃస్కంధవిస్తరః॥ 169
భాగేనైకేనచగ్రీవాద్వాభ్యాంసామలసారకం
విశాలపద్మసదృశం విధేయంపద్మశీర్షకం॥ 170
చంద్రికాపద్మపత్రాభా ద్వయయోతత్పదోచ్ఛ్రితం
త్ర్యంశఃస్యాత్కలశోన్నత్యా జనకైరవకుడ్మలః॥ 171
ఏవంవిధంవిధత్తేయః పుష్పకంసుమనోరమం
తుష్యేత్తస్యధనాధీశః శుభైర్యాతిత్రజేచ్ఛసః॥ 172

తా॥ చంద్రావలోకనమును 1 భాగమును లంబము 3 భాగములును చేయవలయును. పీఠముయొక్క పైభాగమున స్తంభము 5 భాగములును, హీరగ్రహణము 2 భాగములును, శిఖరము 1 1/2 భాగమును గలపట్టము 1 భాగమును మల్లకాద్యము 2 భాగములును, లంబము 1 భాగముతోను చక్కగా నుండవలయును. దీనియొక్క పై భాగమున ఛాద్యపట్టిక 1 భాగమును, కపోతాలి అంతరపత్రము విస్తారము 6 భాగములును, దానియెత్తు 5 భాగములుచేసి శూరసేనమును మధ్యనుచుట్టూ తోరణమును, హంసలు, చేపలు, మొసళ్ళు, పందులు, ఏనుగుతొండములు మొదలగువానితో నిండియుండవలెను. ఇవి యన్నియును అలిందముపైన నుండవలయును. పుష్పములతో కోణమును రచించవలయును. ఇట్లు పుష్పములతోనే 4 అంతస్తులు చేయవలయును. మొదటి అంతస్తుకంటె తక్కినఅంతస్తులు ఒక్కొక్క పాతికవంతు తగ్గుచుండవలయును. మొదటి కోణమునందలి కూటము యొక్క విస్తారము 3 భాగములుండవలయును. వెలుపలినుండి క్షేపము ఒక్కొక్కదానినుండి మరియొక్కొక్కదానికి 1-1 భాగము కలుపవలయును. నడుమ లతయొక్క ముఖము 6 భాగముల విస్తారమును, స్కంధమున మంజరి విస్తారము 2 భాగములుచేసి సూత్రమును 6 రెట్లు చేసి లతారేఖను లిఖించవలెను. తరువాత ఆలేఖమును శుద్ధముగాను

భాగములతో అందముగాను చేయవలయును. వేదిక 1 భాగమును స్కంధముయొక్క విస్తారము 6 భాగములును, గ్రీవ 1 భాగమును, ఆమలసారకము 2 భాగములును, వికసించిన పద్మముతో సమానముగా పద్మముయొక్క శిఖరముండవలయును చంద్రిక పద్మపత్రముతో సమానముగానుండవలయును. ఆ చంద్రిక యెత్తు 2 భాగములును, కలశము యెత్తు 3 భాగములు తామర మొగ్గవలెనుండవలెను ఇట్లు అందముగా పుష్పకమును రచించినయెడల కుబేరుడు సంతోషించి శుభములను సంపదలనొసంగును.

(అనుబంధము 49, 50 పటములు చూడుడు)

## 82. విజయభద్రము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ హేమకూటస్యసంస్థానే తద్రూపేతదవస్థితే
కర్ణేకుర్యాద్ద్వితిలకం కేసరీచభవేదథ॥ 29
కర్ణేనందనపర్యంతం తిలకంతత్రకారయేత్
శేషంచపూర్వవద్ జ్ఞేయం నామ్నా విజయభద్రకః 30

తా॥ హేమకూటమునే కర్ణమున 2 తిలకములను కేసరియును రచించవలయును. కర్ణమున నందనమువరకు తిలకమును చేయవలెను. మిగిలిన పనులన్నియును మునుపటివలెనే చేయవలయును. దీనిని విజయభద్రమందురు.

## 83. విజయభద్రము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ బ్రూమోవిజయభద్రస్య సుభద్రస్యచలక్షణం
వల్లభఃషణ్ముఖస్యాయం బహుపుణ్యవిధాయకః॥ 173
చతురశ్రీకృతేక్షేత్రే చాష్టావింశతిభాజితే
కుర్యాదష్టపదంకర్ణంభద్రంవాస్యచతుష్పదం॥ 174

పదేనైకేననిర్వ్యాతం సర్వకోణేష్వయంవిధిః
ఉదకాంతరకంకార్యం పదకుస్తంపదాయతం॥ 175
దశభాగాయతంభద్రం కార్యంత్రిపదనిర్గతం
దిక్షుఏవంవిధేయఃస్యాన్ముఖతోముఖమండపః॥ 176
త్రిపదాబాహ్యతోభిత్తి స్త్రిపదాచాంధకారికా
మధ్యేప్రాసాదమానంతు కర్తవ్యంషోడశాంశకం॥ 177
కర్ణాశ్చతుష్పదాఃకందేభద్రాణ్యేషాంపదద్వయం
నిష్క్రాంతానిపదేనస్యుః కందకర్ణాశ్రితాసిహి॥ 178
షట్పదంమధ్యరంగంస్యాద్ ద్విపదశ్చాస్యనిర్గమః
కర్ణశాలాంతరంయత్ స్యాత్ కందగర్భోవిధీయతే॥ 179
ద్విపదాకందభిత్తిఃస్యాద్ గర్భోద్వాదశభాగికః
ఊర్ధ్వమాన మిహప్రోక్తం ద్విగుణంద్వికలాధికం॥ 180
చతుర్వింశతిభాగాంతే తులోచ్ఛ్రాయస్యమధ్యతః
ఊర్ధ్వమానంతుయత్ప్రోక్తం గ్రీవాండాద్యంతతోబహిః॥181
కార్యంతులోదయంస్యాచ్చ వేదీబంధోఽంశసప్తకం
త్రిభాగంకుంభకంతత్ర సార్ధభాగోమసూరకః॥ 182
భాగేనాంతరపత్రంస్యాత్సార్ధభాగేనమేఖలా
జంఘాద్వాదశభిర్భాగైర్ద్వ్యంశావాగలపట్టికా॥ 183
అబ్జపత్రం చభాగార్ధం సార్ధభాగావరండికా
భాగేనాంతరపత్రంస్యాద్ రూపకర్మసమాకులం॥ 184
ఊర్ధ్వాధఃపట్టయోర్మధ్యభాగోభాగైకవింశతిః
అతోమధ్యాద్విధాతవ్యం ద్విపదంరాజసేనకా॥ 185
వేదిచతుష్పదాప్రోక్తా భాగేనాసనపట్టకః
పదద్వయేనసార్ధేన కార్యంచంద్రావలోకనం॥ 186
నవభాగోచ్ఛ్రితః స్తంభః పత్రకర్మసమాకులః
[illegible] 187

ఉచ్ఛాలకముభాభాగా భాగాహీరగ్రహాణమాసురం
ద్వ్యంశాపట్టోచ్ఛ్రితిర్భాగ చతుష్కాబాహ్యావిస్తృతిః॥ 188

తా॥ ఎక్కువగా భద్రములతోగూడినదైన విజయభద్రము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. దీని కధిపతి షణ్ముఖుడు. ఎక్కువగా పుణ్యమును లభింపజేయునది. చతురశ్రప్రదేశమును 28 భాగములు చేసి కర్ణము 8 భాగములును, ఆ కర్ణమునకు భద్రము 4 భాగములును, భద్రముయొక్క నిర్గమము 1 భాగమును, ఇట్లు నాలుగు మూలలయందును రచించవలయును. జలాంతరము ప్రవేశము 1 భాగమును చేయవలయును. భద్రముయొక్క విస్తారము 10 భాగములును దానియొక్క నిర్గమము 3 భాగములును, ఇట్లు నలువైపుల రచించవలెను. ఎదురుగా ముఖ మండపమును నిర్మించవలెను. వెలుపలి గోడ 3 భాగములును, అంధకారిక 3 భాగములును, మధ్య గర్భగృహము 16 భాగములును, కర్ణమునుండి కందము 4 భాగములును, ఆ కందమునకు భద్రము 2 భాగములును, కంఠమునందలి భద్రముయొక్క నిర్గమము 1 భాగమును, కంఠకర్ణములను అనుసరించిన భద్రములన్నిటికిని ఒక్కటే కొలత యుండవలయును. మధ్యరంగము 6 భాగములును దానియొక్క నిర్గమము 2 భాగములును చేయవలయును. కర్ణశాలలో నుండునది కందగర్భమగును. కందము యొక్క గోడ 2 భాగముల విస్తారమును గర్భము 12 భాగములు నలుచదరమును అగును. ఇక యెత్తును చెప్పుచున్నాడు, విస్తారమునకు రెట్టింపుచేసి మరల నొక భాగములో 8వ వంతును కలిపి యెత్తు చేయవలయును. దూలముయొక్క పైభాగమువరకు యెత్తు 24 భాగములు మధ్య నుండవలయును. పై కొలతలో గ్రీవము, అండము మొదలైనవి వెలుపలనుండవలయును. దూలముపైన వేదీబంధము 7 భాగములు, దానిలో కుంభము 3 భాగములు, మసూరకము 1 1/2 భాగములు,

అంతరపత్రము 1 భాగము, మేఖల 1 1/2 భాగము, జంఘ 12 భాగ ములు, గలపట్టిక 2 భాగములు, అంధకారిక 1 2 భాగము, వరండిక 1 1/2 భాగములు, అంతరపత్రము 1 భాగము రూప చిత్రములను రచించవలయును. పై పట్టము క్రిందపట్టములయొక్క నడుమ 21 భాగ భాగములుగాచేసి రాజపీఠమును 2 భాగములు చేయవలయును. వేదీ 4 భాగములు, ఆసనపట్టము 1 భాగము, చంద్రావలోకనము 2 1/2 భాగములు, స్తంభము 9 భాగముల యెత్తు, నానావిధములైన పత్రము లను రచించవలయును. భరణము 1 భాగము, శిఖరము 2 భాగములు ఉచ్ఛాలము 2 భాగములు, హీరగ్రహణమును, మసూరమును కలిసి 2 భాగములును, పట్టము 4 భాగములును, మరియు వెలుపలి విస్తార మును చెప్పబోవు శ్లోకముతో నన్వయించుకొనవలెను.

శ్లో॥ ద్వ్యంశాస్యాలంబనోర్ధ్వేతు రూపకంచైకపట్టికా
సాచభాగత్రయేణస్యాత్ సుశ్లిష్టాసాధుచిత్రితా॥ 189
కర్ణకర్ణేషుశృంగాణాం విస్తృతిర్ద్విపదాభవేత్
ఊర్ధ్వమానంత్రిభాగంస్యాద్ గ్రీవాండకలశైఃసహ॥ 190
మధ్యేచతుష్పదాకర్ణాదుకోమంజరికాభవేత్
ఉచ్ఛ్రాయఃషట్పదస్తస్యగ్రీవాండంద్విపదోచ్ఛ్రితం॥ 191
భాగేనకలశోత్సేధః స్యాదేవంకర్ణనిర్మితిః
కర్ణా ... పిండికాకార్యాభద్రదేశేతథోచ్ఛ్రితః॥ 192
కర్తవ్యఃసప్తభిర్భాగైః సింహాకర్ణః సుచర్చితః
కర్ణద్వయేతథాశృంగే తయోరూర్ధ్వంచతుర్దిశం॥ 193
ఉరోమంజరికాయామా దుదయో దశపంచచ
తస్యాశ్చాష్టపదఃస్కంధో గ్రీవాభాగసమున్నతా॥ 194
ద్విభాగమండకం కార్యం చంద్రికాపదముచ్ఛ్రితా
త్రిపదాఃకలశా స్తేషాం మధ్యగాంతరమంజరీ॥ 195

లతాపంచకసంయుక్తా చర్చాయాః క్రియయాన్వితా
భాగవింశతివిస్తీర్ణా కర్తవ్యామూలమంజరీ॥ 196
ద్వావింశతిసముత్సేధా స్కంధోద్వాదశభాగికః
మధ్యాలతాశూరసేన కర్మరూపసమాకులా॥ 197
గ్రీవాసార్ధపదోత్సేధా కార్యాద్విపదమండకం
భాగేనచంద్రికాంకుర్యాత్ కలశంతుచతుష్పదం॥ 198
ఏకోనత్రింశదండోఽయం ప్రాసాదః శుభలక్షణః
షట్పదంపీఠమాఖ్యాతం చరితంపూర్వకర్మవత్॥ 199
ఆరోగ్యంపుత్రలాభశ్చ భవేద్విజయకారిణాం
తేషాంతుష్యతి షడ్వక్త్రోభక్త్యాయేవిదధత్యముం॥ 200

తా॥ పట్టముయొక్క వెలుపలి విస్తారము 2 భాగములును దాని పైన రూపకము 1 భాగమును, పట్టిక 3 భాగములు లెస్సగా చిత్రింప బడియుండవలెను. కర్ణములయొక్క కర్ణములయందలి శృంగముల విస్తారము 2 భాగములు, దానియెత్తు 3 భాగములు, గ్రీవ, అండము, కలశము వీనితోసహా కర్ణమునుండి మధ్య ఉరోమంజరి 4 భాగములు విస్తారము, ఎత్తు 6 భాగములు గ్రీవ, అండకము 2 భాగముల యెత్తు కలశము యెత్తు 1 భాగము. ఇట్లు కర్ణములను రచించవలయును. కర్ణములో సగము నిర్గమమును భద్రదేశమున నుంచవలెను. ఎత్తును అదే ప్రకారము చేయవలయును. సింహకర్ణములు విస్తారము 7 భాగములును యెత్తుకూడ అదే కొలతలతోను రచించవలయును. ఇట్లు నలుమూలల యందుండవలెను. శిఖరమునను నలుమూలల నుండవలెను. ఉరోమంజరి 15 భాగముల విస్తారమును, స్కంధము 8 భాగములును, గ్రీవము 1 భాగమును, అండకము 2 భాగములును, చంద్రిక 1 భాగమును, కలశములు 3 భాగములును, మధ్యనున్న మంజరి 5 లతలతోను చక్కని పనితనముతోను చేయవలయును. ప్రధాన మంజరి 20 భాగముల విస్తారమును, 22 భాగముల యెత్తును,

స్కంధము 12 భాగములును, మధ్యలతో యుద్ధము మొదలగు చిత్రములతోను, గ్రీవ 1/2 భాగము ఎత్తును, అండకము 2 భాగముల ఎత్తును, చంద్రిక 1 భాగమును, కలశము 4 భాగములును, 29 అండకములతోను శాస్త్రోక్త ప్రకారముగాను, పీఠము 6 భాగములును చేసిన యెడల షణ్ముఖుడు సంతోషించి ఆరోగ్యమును, పుత్రలాభమును, జయమును యిచ్చును.

(అనుబంధము 51, 52వ పటములను చూడుడు)

# 84. శ్రీనివాసము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ ప్రతిరథో౽ర్ధనిష్కాసః సంస్థానే శ్రీధరస్యచ
క్రమమూర్ధ్వే పరిత్యజ్య కర్ణే వై సర్వభద్రకం॥ 31
తదూర్ధ్వముదకం కుర్యాత్ ప్రమాణేన పృథుత్వవత్
సప్తవింశతిభక్తంచ పృథుష్వే భద్రకాకృతిః॥ 32
ద్వితీయా భూమికా మూర్ధ్ని తతో మండాశ్చతుష్కికాః
కర్ణే భద్రే ప్రకర్తవ్యా ఊర్ధ్వే మధ్య చతుష్కికా॥ 33
మత్తవారణ శాఖాద్య యుగ్ ఘంటాకూటైరలంకృతా
భద్రోద్గమాశ్చ శృంగో ర్ధ్వే మండాద్యాశ్చాద్య భూమికా॥ 34
శ్రీనివాసస్తదానామ యత్ర వైరమతే ధ్రువం
భుక్త్యర్థంచ ప్రకర్తవ్యః ప్రాసాదః సురపూజితః॥ 35

తా॥ శ్రీధరమునందు ప్రతిరథములు 1/2 భాగము నిర్గమమును, కర్ణమున రథములు లేకుండ భద్రములును, ఆపైన జలాంతరమును, విస్తారము ఎత్తు సమానముగాను, విస్తారమును 27 భాగములు చేసి భద్రములవలె రచించి, రెండవ అంతస్తున శిఖరమున 4 మండములను రచించి, కర్ణములయందు భద్రములను చేసి ఆపైన మధ్యను

మత్తవారణ ఛాద్యమును, ఘంట, కూటములు మొదలైనవానితో నలంకారములును, భద్రములయొక్క పైన శృంగములను, మాడము మొదలైన ఛాద్యములును, అంతస్తులును కలిగియుండినచో శ్రీనివాసమగును. దేవపూజితమైనది.

## 85. శ్రీనివాసము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అధునా శ్రీనివాసాఖ్యః ప్రాసాదఃసమ్యగుచ్యతే
తృత్త్యర్ధమేవక్రియతే జయశ్రీస్తత్రతిష్ఠతి॥ 201
చతురశ్రీకృతేక్షేత్రే భక్తేఽష్టాదశభిఃపదైః
అంధారికాచభిత్తిశ్చ పదేద్వేద్వేయథాక్రమం॥ 202
గర్భశ్చషట్పదఃకార్యః శ్రీనివాసస్యసుందరః
కందేస్యుర్ద్విపదాఃకర్ణాభాగేనసవిలాంతరం॥ 203
భద్రంచతుష్పదంకార్యం పదేనైకేననిర్గతం
బాహ్యాఃస్యుస్త్రిపదాఃకర్ణాభద్రైశ్చద్విపదైర్యుతాః॥ 204
భద్రంచతుర్షుకర్ణేషు పదేనైకేననిర్గతం
కోణకోణాశ్చకర్తవ్యాః పదస్యార్ధంసమాయతాః॥ 205
పదేనాంబుపథిఃకార్యః ప్రవేశాద్విస్తృతేరపి
విస్తారాత్ షట్పదంభద్రం పదద్వితయనిర్గమం॥ 206
సలిలస్యాంతరేకార్యాః తిలకాద్వ్యంశవిస్తృతాః
పదేనైకేననిష్క్రాంతాః శోభితాశ్చారుకర్మణా॥ 207
ఊర్ధ్వమానమథబ్రూమః శ్రీనివాసేయథాక్రమం
ఖురకస్యోచ్ఛ్రితిఃపీఠేపాదోనంపదమిష్యతే॥ 208
కుర్యాత్ సపాదేనాంశేన జాడ్యకుంభ సముచ్ఛ్రితిం
పాదేనాంతరపత్రేతు భాగేనైకేనమేఖలాం॥ 209

పీఠోత్సేధశ్చతుర్భాగః శ్రీనివాసేభవేదితి
వేదీబంధస్యఖురకో భాగార్ధేనసమున్నతః॥ 210
కుంభకఃసార్ధభాగేన పదార్ధేనమసూరకం॥ ... ... ...
... ... ... ... ఇచట 2 పేజీలు (168, 169) జీర్ణమైనది.
"తయోరాహత్యఉపపంచాశాః శ్లోకానష్టాఃసంభావ్యంతే"
... ... ... ... ... ... ... ॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 18 భాగములుచేసి అంధారిక 2 భాగములును, గోడ 2 భాగములును, గోడ 6 భాగములును, కందము నందు కర్ణములు 2-2 భాగములును, జలాంతరము 1 భాగమును, భద్రము 4 భాగములు, దాని నిర్గమము 1 భాగము, వెలుపలి కర్ణములు 3 భాగములును, వానియొక్క భద్రములు 2 భాగములు, నాలుగు కర్ణములయందలి భద్రముయొక్క నిర్గమము 1-1 భాగము, అన్నికోణములయందును రచించవలయును. జలమార్గమును 1 భాగము చేయవలయును. వానియెత్తు 1/2 భాగము, ప్రవేశమునుండి విస్తారమును అంతే చేయవలయును. భద్రము విస్తారము 6 భాగములును, నిర్గమము 2 భాగములును, తిలకమునుండి జలాంతరము 2 భాగములును, నిర్గమము 1 భాగమును, అందముగా చేయవలయును. ఎత్తును చెప్పుచున్నాడు. ఖురకము 3/4 భాగమును, జాడ్యకుంభము 1 1/4 భాగము, అంతరపత్రము 1 భాగము, మేఖల 1 భాగము, పీఠము యెత్తు 4 భాగములు, వేదీబంధముయొక్క ఖురము 1/2 భాగమును, కుంభము 1 1/2 భాగమును, మసూరకము 1/2 భాగమును చేయవలయును. (ఇచట కొంత శిథిలమైనది)

(అనుబంధము 53వ పటము చూడుడు)

## 86. సుదర్శనము - పుష్పశిఖరము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ పుష్పకస్యచసంస్థానే తద్రూపేతదవస్థితే
భద్రకంకర్ణతిలకం భద్రేస్యాత్ సింహాకర్ణకః॥ 36
సుదర్శనస్తదానామ కర్తవ్యంవిష్ణుమందిరం
క్రీడతేవిష్ణులోకేచ సేవ్యతేసురయోషితా॥ 37
చతురశ్రీకృతేక్షేత్రేఽష్టకర్ణాభిన్నసూత్రతః
కర్ణార్ధంచభవేత్కర్ణీ ఉభయకర్ణమధ్యతః॥ 38
కూటావృతఃపంచభూమో ఘంటాకలశభూషితః
తద్రూపంమండపంపీఠంలభతేఽనంగశర్మచ॥ 39

తా॥ పుష్పకమునందు భద్రమును, కర్ణమును, తిలకమును, భద్రమునందు సింహాకర్ణములును కలిగియున్నచో సుదర్శనమగును. చతురశ్ర ప్రదేశమును భిన్న సూత్రములతో 8 కర్ణములగునట్లు చేసి కర్ణములో సగము పంజరమును రెండు కర్ణములమధ్య రచించి ఇట్లు కూటములతో 5 అంతస్తులవరకు చేయవలయును. ఐదవ అంతస్తుపైన ఘంట, కలశము మొదలైనవి రచించిరేని సుదర్శనమగును దీనివలన విష్ణులోకమును పొందగలరు. దీనినే పుష్పశిఖరమనియును జెప్పుదురు సమరాంగణయందు సుమారు 50 శ్లోకములకుపైగా నష్టమైనందున వీనికి రెండవ పద్ధతి లభించలేదు.

## 87. సురసుందరము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ ద్వితీయకంక్రమంత్యక్త్వా పూర్వవద్రిపుకేసరీ
తిలకంతత్రసంస్థానే సభవేత్ సురసుందరః॥ 40

తా॥ రిపుకేసరియందున సగమును రెండవ అంతస్తున మూడు

చేసి కర్ణములయందలి భద్రములను దిశలయందే రచించినచో సుందరమగును.

## 88. సురసుందరము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ... ... పంజరాత్ త్రిభాగేనతుభాగస్య అష్టశృంగస్యః
అష్టశృంగేషుశృంగశృంగాంతరేసవిలాంతరం
అన్యోన్యశృంగనిష్కాసో భాగేనైకేనశస్యతే॥
దశభాగాయతంభద్రం చతుర్థాంశేననిర్గతం
ఏవమేషతలచ్ఛందః కథితఃసురసుందరే॥
ఊర్ధ్వమానమథబ్రూమో భాగశుద్ధ్యాయథాక్రమం
పీఠాదారభ్యవిస్తారాద్ ద్విగుణాస్యాత్సమున్నతిః॥
ఉపపీఠేస్యలంకుర్యాద్ భాగమేకంసమున్నతం
పదేనపాదహీనేన గజద్వారసమున్నతిః॥
ఉచ్ఛ్రితిర్జాడ్యకుంభస్య సార్ధభాగావిధీయతే
కలశోంతరపత్రేచ పాదహీనపదోన్నతే॥
అస్యచోర్ధ్వంతుకర్తవ్యా పదార్ధంగ్రాసపట్టికా
అస్యాఃపీఠోచ్ఛ్రయః ప్రోక్తః మూలభూతోఽభివాస్తునః
ఖురకశ్చపదార్ధేన సార్ధభాగోమసూరకః
భాగేనైకేనకలశః సమవృత్తోఽతిసుందరః॥
భాగంసపాదంకుర్వీత మేఖలాంతరపత్రకే
షడ్భాగేనోచ్ఛ్రితాజంఘా భాగార్ధంగ్రాసపట్టికా॥
కర్ణేచైకేనభాగేనభాగార్ధం కుముదోభవేత్
భాగేనహీరకంకుర్యాద్ యథాశోభాప్రజాయతే॥
మేఖలాంతరపత్రేచ సార్ధభాగేనకారయేత్
ఊరంతఃపదయోర్నభ్లే స్యాత్ సార్ధదాదశాంశకం॥

తన్మధ్యేసార్ధభాగంతురాజాసనంచపట్టకం
ద్వ్యాభాగా వేదికాభాగస్యార్ధమాసనపట్టకః॥
భాగంచంద్రావలోకంస్యాత్ స్తంభమాసనమూర్ధని
నివేశయేత్ పంచభాగం భరణంభాగికంతతః॥
భాగమేకంసముచ్ఛ్రాయః శీర్షకంద్విగుణాయతం
పట్టస్యకుర్యాదుత్సేధం భాగమర్ధసమన్వితం॥
సార్ధభాగద్వయంబాహ్యం తద్రూపం తూత్పలంక్షిపేత్
ద్వ్యాభాగాచ్ఛాద్యకస్యోర్ధ్వే కార్యావాసనపట్టికా॥
విరాజమానాసాకార్యారూపగ్రాహమరాలకైః
మేఖలాంతరపత్రేతు భాగాద్రూపసమన్వితే॥
భాగద్వయేనకర్తవ్యా ద్వితీయామేఖలాబుధైః
కూటాన్యతఃపరంకుర్యాత్ కర్మయుక్తానిపర్వతః॥
కూటేషుకుర్యాత్ ప్రత్యేకం సింహకర్ణసమన్వితం
ఉరోమంజరికాతానిభవేదేవం యథాక్రమం॥
అష్టాండకంత్రయంతేషు షడండంస్యాచ్చతుష్టయం
చతురండంద్వయంకృత్వా త్వేవంకర్ణేవిదుర్బుధాః॥
నవాండకానితుర్యాని విస్తారేణపదద్వయం
సార్ధంభవతిప్రత్యేకం సార్ధముచ్చైఃపదద్వయం॥
ఏవం నిష్క్రాంతమేకైకం (స్యాత్) పదంవాంశమండకం
సింహకర్ణఃషడుచ్ఛ్రాయో భద్రేస్యాత్ప్లవవిస్తృతిః॥
ద్వితీయశ్చతురంతశ్చ శోభితశ్చారుకర్మణా
తృతీయోద్విపదఃకార్యః సింహకర్ణోమనోరమః॥
విస్తారోమూలమంజర్యాశ్చతుర్దశపదోభవేత్
భాగసప్తదశోచ్ఛ్రేతు మాతృభిఃపద్మకోశవత్॥
స్కంధశ్చాష్టపదఃప్రోక్తో గ్రీవాసార్ధపదోచ్ఛ్రితా
ద్విపదశ్చాండకోత్సేధశ్చంద్రికార్ధపదోన్నతా॥

కలశం త్రిపదం ప్రాహు ర్మాతులుంగసముద్భవం
మధ్యేతుమూలమంజర్యాః కుర్వీతశిఖరత్రయం॥
సురేఖంసుప్రసన్నంచ సర్వదేశవిభూషితం
షట్పంచాశత్ భవేదస్మిన్నండకానాంశతద్వయం॥
ఏవంశ్లోఽయమాఖ్యాతః ప్రాసాదోఽండకమానతః
శతమేకోనసప్తత్యాయుతంస్యాన్మధ్యమే పునః॥
ఏకోత్తరంశతంప్రాహు రండకానాంకనీయసి
మందారకుసుమాకారా జ్యేతానిసురసుందరే,
కుర్యాద్యఏవంప్రాసాద మీదృశంసురసుందరం
సవైరించ్యంయుగశతం సూర్యలోకేమహీయతే॥

**తా॥** (ఇచ్చట కొన్ని శ్లోకములు లేవు) పంజరము నుండి 3 భాగములచేత 8 శృంగములకు 2-2 భాగముల చొప్పునను వానిమధ్య 1-1 భాగము జలాంతరమును చేయవలయును. ఒక్కొక్కదాని నిర్గమము 1 భాగము చేయవలయును. భద్రముయొక్క విస్తారము 10 భాగములును, అందలి 4వ భాగము నిర్గమమును, ఇట్లు తలచ్ఛందమును నిర్ణయించవలయును. ఇక యెత్తును చెప్పుచున్నాడు. పీఠము మొదలుకొని శిఖరాంతమువరకు విస్తారమునకు రెట్టింపు చేయవలయును. ఉపపీఠమునుగూడ రచించవలయును. ఉపపీఠము యెత్తు 1 భాగముండవలయును. ద్వారము యెత్తునకు మువ్వాతికవంతు (అనగా 1 భాగము కంటె తరుగు) తక్కువగా స్తంభముయొక్క యెత్తును చేయవలెను. జాడ్యకుంభము యెత్తు 1 1/2 భాగము, కలశము అంతరపత్రముకలసి 3/4 భాగము, దానిపైన గ్రాసపట్టిక 1/2 భాగము, పట్టికయొక్క పీఠము యెత్తు ప్రధాన పీఠము ననుసరించియుండవలయును. ఖురము 1/2 భాగము, మసూరము 1 1/2 భాగము, కలశము 1 భాగము, సమానమైన వర్తులముగానుండవలెను. మేఖల, అంతరపత్రము ఈ రెండునుకలిసి 1 1/4 భాగమును, జంఘ యెత్తు 6 భాగములు, గ్రాస

పట్టిక 1/2 భాగమును, కర్ణము 1 భాగమును, కుముదము 1/2 భాగమును, హీరము 1 భాగమును, శోభను 1 భాగమును, మేఖల అంతరపత్రము 1 1/2 భాగము చేయవలయును. పైన 12 1/2 భాగముల మీదట, మధ్యమమును అందు 1 1/2 భాగము పట్టమును రాజసైన్యమును చిత్రించవలెను. వేదిక 2 భాగములు, పీఠపట్టము 1/2 భాగమును, చంద్రావలోకనము 1 భాగము, పీఠముపైన స్తంభమును 5 భాగములు చేయవలెను. దానిపై భరణము 1 భాగము, విస్తారమును యెత్తు 1 భాగమును, శిఖరము 2 భాగముల యెత్తును, పట్టమునకు యెత్తు 1 1/2 భాగమును, వెలుపల 2 1/2 భాగములును, ఆ రూపమున పద్మమును రచించవలయును. ఛాద్యముయొక్క పై భాగమున పీఠముయొక్క పట్టమును 2 భాగములు చేయవలయును. దానియందు నానావిధములైన ప్రతిమలను మొసళ్ళు, హంసలు మొదలైనవియును రచించవలయును. దాని పై భాగమున మేఖల, అంతరపత్రము ఈ రెండును 1 భాగముచేసి రూపచిత్రములను రచించవలయును. దాని పైన మేఖల 2 భాగములు చేయవలయును. తరువాత కూటములను చేయవలయును. అందు చక్కని పనులు చేయవలయును. కూటముల యందు సింహకర్ణములను ఉరోమంజరిని చేయవలయును. మూడవ అంతస్తుపైన 8 అండకములను, నాల్గవ అంతస్తుపైన 6 అండకములను తరువాత రెండు అంతస్తులకును 4-4 చొప్పున అండకములను రచించవలెను. కర్ణములయందిట్లు రచించవలెను. 9 అండకములను సమమైన విస్తారముతో 2 భాగముల చొప్పున చేయవలెను. తరువాత 1 1/2 భాగము చొప్పున విస్తారమును 2 1/2 భాగము చొప్పున యెత్తును నిర్గమము 1-1 భాగమును అండకము 1 భాగమును, సింహకర్ణము ఎత్తు 6 భాగములును, భద్రమున యేటవాలు విస్తారమును, రెండవ సింహకర్ణము యెత్తు 4 భాగములును, మూడవ సింహకర్ణము యెత్తు 2 భాగములును అందముగా చేయవలయును. మూలమంజరియొక్క విస్తారము

14 భాగములును, ఎత్తు 17 భాగములును పద్మకోశమువలె సుందరముగాను సప్తమాతృకా రూపములతోను రచించవలయును. స్కంధము 8 భాగములును, గ్రీవ 1 1/2 భాగమును, అండకముల యెత్తు 2 భాగములును, చంద్రిక 1/2 భాగము యెత్తును, కలశము 3 భాగముల యెత్తును, మాదీఫలమువలె అందముగాను చేయవలయును. మూలమంజరియొక్క నడుమ 3 శిఖరములను రచించవలయును. చక్కని రేఖతోను అందముగాను చేయనలెను. మరియు నానా దేశాలంకారములతో చిత్రరచనమును చేయవచ్చును. 256 అండకములు కలది శ్రేష్ఠము. 169 అండకములు కలది మధ్యమము. 101 అండకములు కలది అధమము, మందారపుష్పమువలె అండకములు చక్కగానుండవలెను. ఇట్టి ప్రాసాదమును రచించినవారు బ్రహ్మలోకమున నూరు యుగములుందురు. (కొలతలు సరిలేవు)

## 89. నంద్యావర్తము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ చతురశ్రీకృతేక్షేత్రే కర్ణాంతేవృత్తకంభవేత్
అష్టచత్వారింశదంశైః పరిధించప్రకల్పయేత్॥ 41
విదిక్షుదిక్షుభద్రాణిచతుష్పాదానికల్పయేత్
పృథక్‌కర్ణాశ్చద్విపదా ఏకైకంభద్రకాంతరే॥ 42
ద్విక్రమోర్ధ్వేతురేఖాశ్చభద్రేష్వైసింహాకర్ణకాః
పంచభూమోర్ధ్వేశిఖరం ఘంటాకలశభూషితం॥ 43
తద్రూపంమండపంపీఠం నాన్యైస్త్రివంస్వరూపతః
నందతేసచిరంలోకేనంద్యావర్తఃస ఉచ్యతే॥ 44

తా॥ నలుచదరపు ప్రదేశమును కోణముయొక్క చివరకు వర్తులముగా రేఖనుగీచి దానిని 48 భాగములు చేయవలెను. దిశల

యందును, మూలలయందును భద్రములను 4-4 భాగములు చేయవలయును. కర్ణములను 2-2 భాగముల చొప్పున 8 చేయవలయును. వరుసగా రెండు రేఖలను లిఖించి భద్రములయందు సింహాకర్ణములును, అయిదవ అంతస్తుపైన శిఖరము, ఘంట, కలశము, మొదలైన వానిచే అలంకారముగాను చేయవలయును. అదేవిధముగా ముందు మండపమును, అధిష్ఠానమును చేయవలయును. ఇతర ప్రదేశములందును చక్కని రూపములను రచించవలయును. దీనిని నంద్యావర్తమని చెప్పుదురు.

(అనుబంధము 54, 55వ పటములను చూడుడు)

## 90. నంద్యావర్తము మరియొక పద్ధతి

**సమరాంగణ 57వ అధ్యాయము**

శ్లో॥ నంద్యావర్తమథబ్రూమః ప్రాసాదంనృపవృద్ధిదం
భూషితంనాగకన్యాభిర్వల్లభం పృథివీభుజాం॥
చతురశ్రీకృతేక్షేత్రే దశధాప్రవిభాజితే
పదద్వయమిదంయత్నాదాదాయబ్రహ్మణఃపదాత్॥
వృత్తంసమాలిఖేద్గర్భమస్యోర్ధ్వంచతురంభవేత్
భాగేనచతురోభిత్తి ర్భాగేనస్యాద్భ్రమంతికా॥
భాగేనబాహ్యభిత్తిఃస్యాత్ పదపంచకవర్జితా
కందోద్విభాగంకుర్వీత పుష్పశేఖరకంతతః॥
ద్విపదాబాహ్యతఃకర్ణా విధాతవ్యాస్తువర్తులాః
యథాగాత్రంవిధాతవ్యాః స్వస్తికాకృతయశ్చతే॥
చత్వారోరథికాకందే కోణేకోణేచతుష్టయం
పంచభాగాయతంభద్రం సార్థభాగవినిర్గతం॥
భద్రాంతపాతినీకుర్యాత్ ప్రత్యంగేపదసమ్మితే
శేషంభద్రంతుకర్తవ్యం విస్తారేణత్రిభాగికం॥

భాకస్యార్ధేనవిస్తీర్ణం తథాభాగప్రవేశకం
ఏతత్ప్రమాణంకర్తవ్య మిహప్రాజ్ఞైర్గలాంతరం॥

తలచ్ఛందానుగంభద్రం నంద్యావర్తేయథాక్రమం
ఊర్ధ్వమానమథబ్రూమో నంద్యావర్తేయథాక్రమం
సార్ధభాగద్వయోచ్ఛ్రాయమాసనంస్యాత్తదూర్ధ్వతః॥
కార్యస్తులోదయస్తస్య మధ్యేభాగైస్తథాష్టభిః
తులోదయస్యమధ్యేస్యాద్ వేదీబంధోద్విభాగికః॥
భాగికఃకుంభకోత్సేధో మేఖలాకలశాన్వితః
చతుర్భాగాభవేజ్జంఘా భాగికం భరణంభవేత్॥
మేఖలాంతరపత్రతు భాగేనైకేనకల్పయేత్
పాదేనరాజాసనంస్యా దూర్ధ్వతః ఛేదపట్టకః॥
వేదీసాష్టపదోత్సేధా భాగపాదేనచాసనం
భాగార్ధేననతంకుర్యాత్ భాగంచంద్రావలోకనం॥
పాదోనత్రిపదః స్తంభః పల్లవైరుపశోభితః
హీరగ్రహణశీర్షంచ కుర్యాద్భాగసముచ్ఛ్రితి
పట్టమేకపదోత్సేధం ఛాద్యకం ద్విపదాయతం
భాగేనకుర్యాదుపరి పట్టికాంచాతుకర్మణాం॥
అంశాంస్త్రీనుచ్ఛ్రితఃసింహకర్ణః స్యాచ్చతురాయతః
భూషితఃశూరసేనాచ్చ సచకాంగోఽతిశోభనః॥
విస్తారాద్ద్విపదేశృంగే సార్ధభాగద్వయోచ్ఛ్రితే
అస్యోర్ధ్వమన్యశృంగంస్యాత్ సదృశోచ్చపరిస్తృతి॥
ప్రత్యంగేషుచకూటాని సార్ధాంశోచ్ఛ్రాయవంతిచ
ద్వితీయఃసింహకర్ణఃస్యాత్ సింహకర్ణస్యమస్తకే॥
తతఃశృంగేతృతీయః స్యాచ్చతుర్థస్తస్యచోపరి
షడ్భాగవిస్తృతాకర్ణ కూటస్థామూలమంజరీ॥

సప్తభాగోచ్ఛ్రితాచస్యాత్ స్కంధఃస్యాత్సపదోచ్ఛ్రితిః
స్యాదుకో మంజరీమూల మంజర్యామధ్యసంశ్రయా॥
భాగైశ్చతుర్భిర్విస్తారః షడ్భిశ్చాస్యాఃసముచ్ఛ్రితిః
కలశాండకసంయుక్తా కర్ణాభ్యంతరమంజరీ॥
స్యాద్దండకైకవింశత్యా నంద్యావర్తఃసులక్షణః
భక్త్యాయేకారయంత్యేనం నంద్యావర్తమనుత్తమం
విమానంశుభమారుహ్య శక్రలోకంవ్రజంతితే॥

తా॥ నంద్యావర్తప్రాసాద లక్షణము చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి అందు మధ్యనుండి 2 భాగములు చుట్టూ వృత్తము నేర్పరచవలెను. దానిపైన చదరము నమర్చవలెను. గోడ 1 భాగమును, దానిచుట్టూ భ్రమంతిక 1 భాగమును, వెలుపలి గోడ 1 భాగమును చేయుచు, ఆ వెలుపలి గోడయందు 5 భాగములు విడిచిపెట్టవలెను. కందము 2 భాగములు పుష్పమువలె నుండవలెను. వెలుపల కర్ణములయందు గుండ్రముగా 4-4 చొప్పున రథికలును, భద్రముయొక్క విస్తారము 5 భాగములును నిర్గమము 1 1/2 భాగమును, భద్రముయొక్క చివర 1 భాగము ప్రత్యంగమును చేయవలయును. మిగిలినది భద్రము చేయవలయును. అనగా 3 భాగముల విస్తారమును 1/2 భాగము నిర్గమమును చేయవలయును. జలాంతరము 1/2 భాగము విస్తారమును 1 భాగము ప్రవేశమును చేయవలెను. తలచ్ఛందము ననుసరించి భద్రమును రచించవలెను. యెత్తును చెప్పుచున్నాడు. దానిపైన పీఠము 2 1/2 భాగములును, దూలముయొక్క పైభాగమువరకు 8 భాగములును, దూలముయొక్క మధ్యకు వేదీబంధము 2 భాగములును, కుంభము 1 భాగము యెత్తును, మేఖల కలశము వీనితోకూడి యుండవలెను. జంఘ 4 భాగములును, భరణము 1 భాగము, మేఖల అంతరపత్రము ఈ రెండును 1 భాగము,

రాజపీఠమును 1 భాగము రచించవలెను. దానిపైన భేదమును పట్టమునుకలసి 1 భాగమును చేయవలయును. ఆపైన వేదిక 8 భాగములును, పీఠము 1/4 భాగమును, నతము 1/2 భాగమును, చంద్రావలోకనము 1 భాగమును, స్తంభము 2 3/4 భాగములును, దానియందు పల్లవములను రచించవలెను. హీరగ్రహణమును శిఖరమును కలసి 1 భాగము చేయవలయును. పట్టము 1 భాగము, యెత్తును, ఛాద్యము 2 భాగములును, దానిపైన పట్టిక 3 భాగములు సుందరముగా రచించవలయును. సింహాకర్ణములు 4 భాగములును, సేనాయుద్ధమును మిగుల సుందరముగా చిత్రించవలెను. శృంగము 2 భాగముల విస్తారమును ఎత్తు 2 1/2 భాగములును, దానిపైన మరియొక శృంగమును సమానమైన యెత్తుతో రచించవలయును. ప్రత్యంగములయందు కూటములను 1 1/2 భాగము యెత్తు చేయవలయును. రెండవ సింహాకర్ణములు సింహాకర్ణముల యొక్క తలయందుండవలెను. వాని శిఖరమునందు మూడవ సింహాకర్ణములును, ఆ పైన నాల్గవ సింహాకర్ణములును, ఆపైన కర్ణకూటములయందు మూలమంజరి విస్తారము 6 భాగములును, ఎత్తు 7 భాగములును, స్కంధము యెత్తు 10 భాగములును, మూలమంజరియొక్క మధ్యను ఆశ్రయించి యురోమంజరియును, ఆ మూలమంజరి విస్తారము 4 భాగములును, ఎత్తు 6 భాగములును, అండకముతోను, కలశముతోను కూడియుండవలెను. కర్ణములసందున మంజరియును, ఇట్లు 21 అండకములతో నంద్యావర్తము లక్షణయుక్తముగా నుండవలెను. ఈ ప్రాసాదమును రచించినవారు దివ్యలోక సుఖములను పొందుదురు.

(అనుబంధము 56, 57 పటములు చూడుడు)

# 91. పూర్ణప్రాసాదము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ క్షేత్రాష్టాదశధాభక్తే వేదాంశః కర్ణవిస్తరః
కర్ణికాచైకభాగాస్యాద్ భద్రంచాష్టాంశవిస్తరం॥ 45
భద్రావలోకనంకుర్యాత్ భిత్తికర్ణేషుకర్ణికాః
కర్ణేచసర్వతోభద్రం శ్రీవత్సస్తస్యకర్ణికా॥ 46
అర్ధోదయేచాదిభూఃస్యాచ్ఛేషా వైపాదభాగికాః
తృతీయాభూమికాచోర్ధ్వే తతోమాడాన్నివేశయేత్॥ 47
సార్ధచతుర్భూమియుక్తః పూర్ణఃస్యాత్సర్వకామదః
పూర్ణస్వర్గసుఖంలోకే స్వర్గేవాభూమిశాసనం॥ 48

తా॥ క్షేత్రమును 18 భాగములుచేసి కర్ణము 4 భాగములును కర్ణిక 1 భాగమును, భద్రము 8 భాగములునుచేసి, భద్రమున చంద్రావలోకనమును, గోడ మూలలయందు కర్ణికలును, కర్ణమున సర్వతోభద్రమును, శ్రీవత్సమునందు రచించినట్లు కర్ణికలును, మొదటి అంతస్తున 1/2 భాగమును, రెండు, మూడు అంతస్తులయందు 1/4 భాగమును చేయవలెను. మూడవ అంతస్తుపైన మాడమునుండి నివేశమును చేయవలెను. నాలుగు అంతస్తులపైన నొక యర్ధ భాగముకలిగి యుండెనేని యది పూర్ణప్రాసాదమగును. అన్ని కోరికలనిచ్చును. దేవలోక సుఖముల నొసంగును.

# 92. పూర్ణము మరియుక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదమథవక్ష్యామః పూర్ణఃపూరితవాంఛితం॥
వందితంకిన్నరైర్యక్షై ర్మనుష్యపితృవల్లభం
చతురశ్రీకృతేక్షేత్రే దశభాగవిభాజితే॥

విస్తారాద్ ద్విపదోగర్భః కార్యాభిత్తిస్తుభాగికా
ద్విపదంకందభద్రంచ నిర్గమోఽస్యార్ధభాగికః॥
శోభనాదిషుసర్వాసు ద్విపదాచభ్రమంతికా
పదికాబాహ్యభిత్తిస్తు ద్విపదాకర్ణవిస్తృతిః॥
ఆయత్యాచతురోభాగా వండభిత్తేర్వినిర్గమః
భద్రంసుశోభనంతస్యావిధాతవ్యంద్విభాగికం॥
కర్ణస్తుపదికాపక్షుభద్రంభాగార్ధనిర్గతం
జలాంతరంతుభాగార్ధమాయామక్షేపయోఃసమం॥
చతుర్భాగోవలభ్యస్య గర్భోభిత్తిస్తుభాగికీ
యామాయుర్విత్తగోస్త్రీణాం వలభీకీర్తికారయేత్॥
పూర్వతఃకారయేద్ ద్వారం చతుర్గర్భేఽత్రమందిరే
ఊర్ధ్వమానంతువక్ష్యామః ప్రాసాదస్యాస్యసంప్రతి॥
పీఠంద్విభాగికంకార్యం వేదిబంధోద్విభాగికః
జంఘాపదచతుష్కంచ శోభితారూపకర్మణా॥
పదద్వయంతుకర్తవ్యం హీరంసాంతరపత్రకం
కలశాండకయుక్తానా ముచ్ఛ్రాయస్త్రిపదోబుధైః॥
కర్తవ్యాఃకర్ణశృంగాణాం సర్వేషామపిమానతః
చతుష్పదోచ్ఛావలభీ ఘంటాకలశసంయుతా॥
మల్లచ్ఛాద్యత్రయంకుర్యాత్ కర్ణశృంగస్యచోపరి
యుక్తమంతరపత్రేణ భాగోచ్ఛ్రాయంపృథక్ పృథక్॥
భాగేనైకేనఘంటాస్యాద్ భాగాభ్యాంకలశాండకే
సమూలకలశేకర్ణే సూత్రంసంపాతయేద్బుధః॥
మల్లచ్ఛాద్యంవిధాతవ్యం సూత్రేణైకేనలాంఛితం
ప్రాసాదమేవంపూర్ణాయుద్యఃకుర్యాద్ భక్తిమానితం॥
ఆప్తకామఃసపురుషః శర్వలోకేమహీయుతే॥

తా॥ పూర్ణప్రాసాద లక్షణము చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి గర్భము 2 భాగములును, గోడ 1 భాగమును, కందము 2 భాగములును, కందమున భద్రమును రచించి, దానియొక్క నిర్గమము 1/2 భాగమును, ఇట్లు నలువైపుల చేసి భ్రమంతిక 2 భాగములును, వెలుపలి గోడ 1 భాగమును చేయవలెను కర్ణముయొక్క విస్తారము 2 భాగములును, అంతకమునకును గోడకును నిర్గమము విస్తారములో నాల్గవవంతు, దానిముందు 2 భాగములు భద్రమును రచించవలెను. కర్ణము 1 భాగము, భద్రము 2 భాగములు వానియొక్క నిర్గమము 1/2 భాగము, జలాంతరము 1/2 భాగము విస్తారమును అదే ఎత్తును చేయవలెను. వలభి నాల్గవ భాగమును, గర్భము 1 భాగము, గోడ 1 భాగము చేయవలెను తూర్పున ద్వారమును రచించవలెను. మందిరమున నాల్గవవంతు గర్భముండవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. అధిష్ఠానము 2 భాగములు, వేదీబంధము 2 భాగములు, జంఘ 4 భాగములు, రూపచిత్రములతోనుండవలెను. హీరము అంతరపత్రము ఈ రెండునుకలసి 2 భాగములు, అండకము కలశముకలసి 3 భాగములు, అన్ని కర్ణములకును శృంగములుండవలెను. వలభి యెత్తు 4 భాగములు, ఘంట, కలశములతో కూడియుండవలెను. కర్ణశృంగములపైన మల్లచ్ఛాద్యములు 3 రచించవలెను. అంతరపత్రముతో మల్లచ్ఛాద్యము 1 భాగము చేయవలెను ఘంట 1 భాగమును, అండకము 1 భాగము, కలశము 1 భాగము, ప్రధాన కలశము కర్ణమునుండి సూత్రముతో పరీక్షించి మల్లచ్ఛాద్యమును రచించవలెను. ఈ ప్రాసాదమునే వరుభక్తితో చేయుదురో వారు ఆయుష్యమును కోరికలను పొందుటయేకాక శివలోకమున నుందురు.

# 93. సిద్ధార్థకము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ సుదర్శనస్యసంస్థానే తద్రూపేతదవస్థితే
కర్ణేచసర్వతోభద్రం సతుసిద్ధార్థకోభవేత్॥ 49

తా॥ సుదర్శన ప్రాసాదమున, కర్ణమున అంతటను భద్రములను రచించినయెడల సిద్ధార్థకమగును.

# 94. సిద్ధార్థకము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ సిద్ధార్థమథవక్ష్యామః సర్వకామార్థసిద్ధిదం॥
కామాఃసిద్ధ్యంతి యత్కర్తురిహలోకేపరత్రచ
చతురశ్రేసమేక్షేత్రే విభక్తేదశభిఃపదైః॥
కుర్వీతషట్పదంగర్భం కుడ్యంచాస్యచతుష్పదం
భాగేనైకేనభ్రమణీం బాహ్యాభిత్తించభాగికీం॥
కుర్వీతద్విపదాన్కర్ణాన్ శాలాంషడ్భిఃపదైర్బుధః
తదూర్ధ్వేంకర్ణశృంగంచ యథాశోభంప్రకల్పయేత్॥
త్రిపదంనిర్గమం తస్యాశ్చతుష్కశ్చచతుర్దిశం
మధ్యేబహిశ్చకుర్వీత తస్యాద్వారచతుష్టయం॥
ఉన్నతంభాగవింశత్యా మానమస్యోర్ధ్వతోభవేత్
త్రిపదఃపీఠబంధఃస్యాద్ ద్విగుణోచ్ఛ్రాయబాహ్యతః॥
సార్ధంభాగద్వయంకార్యో వేదీబంధస్తుశోభనః
అర్ధకుంభైకమధ్యేచ మేఖలాంసమసూరకః॥
జంఘాసార్ధచతుర్భాగా కార్యోచ్ఛ్రాయేణశోభనా
మేఖలాంతరపత్రేచ భాగేనైకేనకారయేత్॥

ఖురకాద్ మేఖలాయావత్ సప్తభాగాంతరంభవేత్
భాగాభ్యాంరాజపీఠంచ కుర్యాద్ వేదించసాసనాం॥
త్రిభాగం స్తంభముత్సేధాత్ భాగస్యార్ధేనహీరకం
భాగార్ధం స్తంభశీర్షంస్యాద్ భాగఃపట్టస్యచోన్నతిః॥
సూర్వచ్ఛాదోప్యద్విభాగఃస్యాద్ భాగేనైకేనలంబనం
శృంగోత్సేధస్త్రిభాగశ్చ కలశాండకసంయుతః॥
చతుర్భాగోన్నతః సింహాకర్ణఃషడ్భాగవిస్తృతః
కుర్వీతశృంగయోరూర్ధ్వం శోభనాంమూలమంజరీం॥
అష్టభాగప్రవిస్తీర్ణాం నవభాగసముచ్ఛ్రితాం
స్కంధఃపంచపదోజ్ఞేయో గ్రీవాచార్ధపదోచ్ఛ్రితా॥
అండకంభాగమాత్రంస్యాదూర్ధ్వంభాగేనచంద్రికా
వర్తులఃసమవిస్తారఃకలశస్త్రిభాగికః॥
భద్రదేవరాటకాశ్చైవ కర్తవ్యాహేమకూటవత్
యఃకుర్యాత్కారయేద్వాస్తు సిద్ధార్థం సర్వకామదం
సభవేత్సర్వకామాప్తిః శివలోకేచశాశ్వతః॥

తా॥ సిద్ధార్థముయొక్క లక్షణమును చెప్పుచున్నారు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి గర్భము 6 భాగములు, గోడ 4 భాగములు, భ్రమణి 1 భాగము, వెలుపలి గోడ 1 భాగము, కర్ణములు 2 భాగములు, శాల 6 భాగములు, దానిపైన కర్ణశృంగమును యిష్టము వచ్చినట్లు చేయవచ్చును. నిర్గమము 3 భాగములు, నలువైపుల నాలుగు రచించవలెను. లోపలను వెలుపలను 4 ద్వారములను కల్పించవలెను. ఎత్తును 20 భాగములు చేయవలయును. పీఠము 3 భాగములు విస్తారమును యెత్తు దానికి రెట్టింపు చేయవలయును. వెలుపల 2 1/2 భాగములు వేదిబంధమును చేయవలయును. కుంభము 1/2 భాగము, మేఖల మసూరకముతో 1/2 భాగము, జంఘ 4 1/2 భాగములు, యెత్తు మేఖల అంతరపత్రము 1 భాగము, ఖురకము

నుండి మేఖలవరకు 7 భాగములు, రాజసేన 2 భాగములు, వేదీ పీఠముతో సహా చేయవలయును. స్తంభము యెత్తు 3 భాగములు, హీరకము 1/2 భాగము, స్తంభశీర్షము 1/2 భాగము, పట్టము 1 భాగము సూర్యచ్ఛాద్యము 2 భాగములు, లంబము 1 భాగము, శృంగము యెత్తు 3 భాగములు, కలశము అండకము దీనితోసహా సింహాకర్ణములు యెత్తు 4 భాగములు, విస్తారము 6 భాగములు, శృంగములయొక్క పై భాగమున మూలమంజరి విస్తారము 8 భాగములును యెత్తు 9 భాగములును, స్కంధము 5 భాగములును, గ్రీవ 1/2 భాగమును, అండకము 1 భాగము, దానిపైన చంద్రిక 1 భాగము కలశమును గుండ్రముగాను విస్తారముతో సమానమైన యెత్తుగాను చేయవలెను. భద్రము వరాట లక్షణముతోను హేమకూటమువలె రచించవలెను. ఈ సిద్ధార్థకమును ఎవ్వరు రచింతురో వారు సమస్తమైన కోరికలను పొందుదురు. అట్టి వారెల్లప్పుడు శివలోకముననుందురు.

(అనుబంధము 58, 59వ పటములు చూడుడు)

## 95. శంఖవర్ధనము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ వృత్తంపూర్వవత్పరిధా చతుర్వింశతిభాజితే
శస్త్రాద్వ్యంశా అష్టకర్ణా అంతరేకర్ణికాః పదాః॥ 50
శంఖావర్తసమంమధ్యే వితానందివ్యభూషణం
తద్రూపంశిఖరంకార్యం శంఖావర్తంచమండపం॥ 51
శంఖవర్ధనానామాఽసౌ కర్తవ్యోవిష్ణుమందిరం
కర్తాయాయాద్విష్ణులోకే యావదాభూతసంప్లవం॥ 52

తా॥ పూర్వమువలెనే గుండ్రముగాచేసి 24 భాగములుచేసి అందు 2 భాగముల చొప్పున 8 కర్ణములును, వానిమధ్య కర్ణికలు

ట్లును శిఖరమునుచేసి అటులే మండపమునుగూడ యెదురుగా రచించి నచో శంఖవర్ధనమగును. దీనిని రచించినవారు విష్ణులోకమున చిర కాలముందురు.

(అనుబంధము 60, 61 పటములు చూడుడు)

## 96. శంఖవర్ధనము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథాభీధీయతేసర్వ పాపఘ్నఃశంఖవర్ధనః॥
ఆలయఃసర్వదేవానాం ప్రాసాదోభూభృతాంప్రియః
చతురశ్రేసమేక్షేత్రే భుజకర్ణవిశోధితం॥
వర్తులంకారయేత్ పశ్చాత్ సర్వకోణేషులాంఛితం
విస్తారార్ధోభవేద్గర్భో యచ్ఛేషం తేనభాజితః॥
ద్విగుణంకారయేదూర్ధ్వం భాగవింశతిభాజితే
తులోదయోఽష్టభాగఃస్యాద్ ద్వాదశాంశాచమంజరీ॥
కుంభకం కలశంద్వాభ్యాం కపోతాలీంచకల్పయేత్
పంచభాగోచ్ఛ్రితాజంఘా అగ్రేఽస్యాగ్రాసపట్టికాం॥
మేఖలాంతరపత్రేచ భాగేనైకేనకారయేత్
భాగార్ధంకారయేత్ ప్రాజ్ఞః శంఖావర్తకమంజరీం॥
శంఖవర్తకకూటాంశ్చవిదధీతస్వవిస్తరాత్
శతవాస్తువిభక్తేఽస్మిన్ యథావ్యమానానుసారతః॥
స్కంధోవిధేయోగ్రీవాచ భాగార్ధేనసముచ్ఛ్రితా
చంద్రికాశిరసాసార్ధం కార్యాసార్ధపదోన్నతా॥
ద్విపదఃకలశోచ్ఛ్రాయః కర్తవ్యఃశంఖవర్ధనే
గర్భస్యాచ్ఛాదనంకుర్యాత్ శంఖావర్తవితానకం॥
యఃశంఖవర్ధనంకుర్యాత్ సభునక్తిచిరంమహీం
వశగాచాస్యసతతం భవేల్లక్ష్మీఃకృతాంజలిః॥

తా॥ సమస్త పాపములను పోగొట్టునట్టి శంఖవర్ధనము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. ఇది సమస్త దేవతలకును ప్రియమైనది నలుచదరమును చక్కగాచేసి నాలుగుమూలలయందున్న గుర్తులవరకు గుండ్రముగా చేయవలయును. విస్తారములో సగము గర్భమును చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తునుచేసి దానిని 20 భాగములు చేసి అందు తులయొక్క పై భాగమువరకు 8 భాగములును, ఆపైన మంజరి 12 భాగములును చేయవలయును. కుంభము కలశము 2 భాగములును, కపోతములను చేయవలెను. జంఘ 5 భాగములును, దాని మధ్యను గ్రాసపట్టికను మేఖల అంతరపత్రము 1 భాగము చేయవలెను శంఖమువలె సుడిగల మంజరిని 1/2 భాగము చేయవలయును. అటులే శంఖమువలె సుడిగల కర్ణకూటములను విస్తారమునుండి రచించవలెను 10-10 భాగములుగల యీ శంఖవర్ధనమును అన్ని కొలతలతోను చక్కగా చేయవలయును. స్కంధమును తగిన కొలతతో చేయవలయును. గ్రీవ 1/2 భాగమును, శిఖరము 1 1/2 భాగము, చంద్రిక 1/2 భాగము చేయవలయును. కలశము 2 భాగముల యెత్తును గర్భమును కప్పుచు శంఖముయొక్క సుడివలెనే వితానమునుగూడ రచించవలయును. శంఖవర్ధనమును రచించినవారు సమస్త సుఖములతో భూమిని పాలించి లక్ష్మిదేవి యెల్లప్పుడు తన ఇంటనే యుండునంతటి వైభవము కలవారగుదురు.

(అనుబంధము 62, 63 పటములు చూడుడు)

## 97. త్రైలోక్య భూషణము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ త్రైలోక్యభూషణంవక్ష్యే వందితంత్రిదశైరపి
శతార్ధహస్తకేజ్యేష్ఠో మధ్యోదశకరోనకః॥ 53
త్రింశద్ధస్తైకనిష్ఠస్స్యాత్ త్రిధోదిత కమాగతః
వల్లభఃసర్వదేవానాం శివస్యాపివిశేషతః॥ 54

త్రింశద్భాగైస్త్రిధాభక్తే గర్భఃస్యాద్దశభాగికః
ద్వాద్వాభాగా భ్రమోభిత్తిః కర్తవ్యమవిశంకితైః॥ 55
భిత్తింత్రయంప్రకర్తవ్యం తథాచభ్రమణీద్వయం
భద్రకంమధ్యఖండేషు ద్వితీయేవర్ధమానకః॥ 56
అంతర్భిత్తింపరిత్యజ్య కుర్యాత్ షడ్దారుకద్వయం
త్రైలోక్యభూషణంబాహ్యే భద్రేచంద్రావలోకనం॥ 57
వృత్తస్యపంచమాంశేతు భిత్తిః శేషస్తుగర్భకః
చతుష్పదారథాఃకర్ణా ఏకభాగాచకర్ణికా
భద్రకర్ణీభవేద్భాగా భద్రంస్యాద్ద్విక్వవిస్తరం॥ 58
అంగమానేననిష్కాసో భద్రంపంచాంశనిర్గమం
పాదమానోచ్ఛ్రితంపీఠం పంచపీఠాదిభూషణం॥ 59
ఉపపీఠంతథాజంఘా మేఖలాకూటచ్ఛాద్యకం
త్రయోవింశతిరుత్సేధే భద్రంషోడశచోన్నతం॥ 60
కర్ణేప్రతిరథేచైవ ద్వేద్వేశృంగేచకారయేత్
అష్టసప్తాండకాఃకర్ణాః ప్రరథాశ్చషడండకాః॥ 61
ఉరఃశృంగాణ్యష్టకుర్యాత్ ప్రత్యంగానితతోఽష్టభిః
భద్రంసంవరణాయుక్తం కుర్యాత్ త్రైలోక్యభూషణం॥ 62
కర్ణాశ్చాష్టదలాఃకార్యాః ప్రత్యంగేవర్ధమానకః
ఘంటాకలశశోభాఢ్యః కర్తవ్యఃశుభలక్షణః॥ 63

తా॥ త్రైలోక్యభూషణమును చెప్పుచున్నాడు. 50 హ. ఉత్తమము, 40 హ. మధ్యమము, 30 హస్తములు అధమము చేయవలయును. దానిని 30 భాగములుచేసి, మధ్య 10 భాగములు గర్భమును, భ్రమణము 2 భాగములును, గోడ 2 భాగములును, ఇట్లు భ్రమణములు 2 ను, గోడలు 3 ను రచించవలయును. నడుమ ఛందమున భద్రమును, రెండవ దానియందు వర్ధమానమును చేయవలెను

లోపలి గోడను తీసివేసి షడ్దారుకములను రెంటిని కల్పించవలెను. వెలుపల చంద్రావలోకమును చేయవలయును వలయములో 5వ వంతు గోడయును, మిగిలినది గర్భమును, కర్ణములయందు రథములు 4 భాగములును, కర్ణిక 1 భాగమును, భద్రమునందలి కర్ణిక 1 భాగమును భద్రముయొక్క విస్తారము 10 భాగములును, అందలి 5వ భాగము నిర్గమము చేయవలయును. పీఠము యెత్తు 1 భాగమును 5 పీఠములుగా రచించవలయును, ఉపపీఠము, జంఘ, మేఖల, కూటము, ఛాద్యము, ఎత్తు 23 భాగములును, భద్రము యెత్తు 16 భాగములును కర్ణమునను ప్రతిరథమునను 2-2 శృంగములను రచించవలెను. కర్ణములు 8 అండకములును 7 అండకములును, ఇట్లు రెండు విధములు ప్రరథములు 6 అండకములు, ఉరఃశృంగములు 8 రచించవలయును. ప్రత్యంగములు 8 రచించవలయును. భద్రమునకుచుట్టూ గోడ యుండవలయును. కర్ణమున 8 దలములు చేయవలయును. ప్రత్యంగమున వర్ధమానము ను రచించవలయును. ఘంట, కలశము రచించవలెను దీనిని త్రైలోక్యభూషణమందురు.

## 98. త్రైలోక్య భూషణము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ త్రైలోక్యభూషణం బ్రూమోవందితంత్రిదశైరపి
ఆశ్రయంసర్వదేవానాం పాపస్యచవినాశనం॥
త్రింశద్ధస్తఃకనీయాన్ స్యాన్మధ్యమస్త్రీదశాధికః
పంచాశద్ధస్త ఉత్కృష్ట స్త్రివిధోహస్తసంఖ్యయా॥
చతురశ్రేసమేక్షేత్రే త్రింశద్భక్తేప్రకల్పయేత్
దశభాగాయతంగర్భం కందంత్విగుణసప్తకం॥
చతుష్పదంకందకర్ణం భద్రంచాస్యద్విభాగికం

అంధోఽర్ధద్విపదేచాస్యద్విపదాశ్చాత్రభిత్తయః
శృంగమేకంభవేన్మధ్యే విస్తారేణచతుష్పదం॥
మధ్యేశృంగస్యచాంతఃస్థస్తంభేషడ్దారుకంభవేత్
ద్వ్యంశాద్వితీయాభ్రమణీ బాహ్యాభిత్తిర్ద్విభాగికా॥
కర్ణశృంగద్వయంకార్యం విస్తారేణచతుష్పదం
ద్వాదశాంశమితాశాలా నిర్గమోఽస్యాఃపదత్రయం॥
ప్రాక్కర్ణశృంగమష్టాంశం స్యాదర్జునఫలోపమం
కర్ణ ద్విశృంగభాగేన వినిష్క్రాంతంచతుష్పదం॥
ద్విపదంతస్యభద్రంచ నిర్గమోద్విపదంభవేత్
శృంగయోరుభయోర్మధ్యే పదార్ధంపశుభద్రకం॥
పదార్ధంవారిమార్గశ్చ ప్రక్షేపంఃపదసమ్మితః
ఊర్ధ్వమానమథబ్రూమః షష్టిభాగసముచ్ఛ్రితం॥
తులోదయస్తతోవింశ పంచదశోరుమంజరీ
సతుసప్తదశోచ్ఛ్రాయో భాగేష్వేషువిధీయతే॥
తులోదయస్యమధ్యేతు వేదీపంచపదోదయా
తదర్ధంకుంభకంకుర్యాత్ తద్వత్కలశమేఖలా॥
ఏకావళీపదాజంఘా హీరకంతుపదత్రయం
ద్వాభాగామేఖలాతద్వత్ ద్వితీయాపిసతారకా॥
ఊర్ధ్వతస్తలపట్టస్యమానంషోడశభిఃపదైః
రాజాసనంసార్ధభాగం వేదికార్యాద్విభాగికా॥
పదార్ధమాసనంసార్ధ పదంచంద్రావలోకనం
స్తంభఃసప్తపదోదైర్ఘ్యాద్ధీరం సార్ధత్రిభాగికం॥
శీర్షంసార్ధపదోత్సేధం పట్టస్తుద్విపదోభవేత్
త్రిపదంఛాద్యకంకుర్యాద్ భాగేనైకేనలంబితం॥
ద్విపదాంఛేదహారాంతు ద్వ్యంశావాసంతపట్టికా
తదూర్ధ్వంమంజరీంకుర్యాద్ ద్రావిడక్రమభూషితం॥

సప్తోచ్ఛ్రితం కోణకూటం సఘంటాకలశాండకం
ద్వితీయమేతదూర్ధ్వంచ తన్మానేనైవకారయేత్॥
కర్ణేకర్ణం సమాశ్రిత్య షట్పదానితు కారయేత్
అష్టాండకే ద్వేకుర్వీత షడండక చతుష్టయం॥
ఏవంకర్ణాండకానిస్యు శ్చత్వారింశత్సమాసతః
ద్వాదశాంశక విస్తారముచ్ఛ్రాయాన్నవభాగికం॥
ఆద్యక్రమేవిజానీయాద్ ద్రావిడాభద్రియాన్వితం
అష్టాండకంసముత్సేధాద్ విస్తారాద్దశ భాగికం॥
భద్రక్రమం ద్వితీయంతు విద్యాత్కర్మవిభూషితం
విస్తారో మూలమంజర్యాద్వావింశత్యంశ సంమితః॥
త్రయోవింశతిరుచ్ఛ్రాయః స్కంధశ్చైవత్రయోదశ
గ్రీవాపదద్వయోత్సేధాత్ త్రిపదోన్నతమండకం॥
కర్పరంద్విపదం భాగచతుష్కంకలశోచ్ఛ్రయః
ప్రాసాదే ద్వాదశైతస్మిన్నరోమంజరికామతాః॥
అండకానాంతు విజ్ఞేయం త్రిసప్తత్యధికంమతం
త్రైలోక్యభూషణంకృత్వా త్రిదశానందకారకం॥
కల్పాంతంయావదధ్యాస్తే పురుషస్త్రీదశాలయమ్॥

తా॥ దేవతలకు సంతోషకరమైన త్రైలోక్య భూషణ యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. 50 హ. ఉత్తమము, 40 హ మధ్యమము, 30 హ. అధమము, చతురశ్రమునుచేసి దానిని భాగములు చేసి అందు గర్భము 10 భాగములును, కందము 7-7 భా ముల చొప్పునను, కందముయొక్క మూలకర్ణము 4 భాగములు ఆ కర్ణమునకు భద్రము 2 భాగములును, శాల 6 భాగములును, ద యొక్క నిర్గమము 1 భాగమును, అంధకారిక 2 1/4 భాగములు

గోడ 2 భాగములును, వీనిమధ్య శృంగము 4 భాగములును, శృంగము యొక్క నడుమ నడుమనున్న స్తంభమునందు షడ్దారుకమును రచించ వలయును రెండవ భ్రమణి 2 భాగములును, వెలుపలి గోడ 2 భాగములును, కర్ణశృంగములు రెండును 4 భాగములు చొప్పునను, శాల 12 భాగములును, శాలయొక్క నిర్గమము 3 భాగములును, ప్రాక్కర్ణ శృంగము 8 భాగములును, మద్దికాయవలె నుండవలయును. కర్ణము నందలి రెండు శృంగములును 4 భాగముల నిర్గమమును, వానియొక్క భద్రములు 2-2 భాగములును, నిర్గమముకూడ 2 భాగములును, రెండు శృంగములయొక్క మధ్యపతి భద్రము 1/2 భాగమును, జల మార్గము 1/2 భాగమును, నివేశము 1 భాగమును చేయవలయును. ఎత్తును చెప్పుచున్నాడు 60 భాగముల యెత్తును, అందు దూలము పై భాగమువరకు 20 భాగములును, ఉరుమంజరి 15 భాగములును, దానియెత్తు 7 భాగములును, దూలముకడ యొక్క మధ్యదేశమున వేదీ 5 భాగములును, కుంభము 2 1/2 భాగములును, కలశము మేఖల అదే ప్రకారమును చేయవలయును. జంఘ 11 భాగములును, హీరకము 3 భాగములును, మేఖల 2 భాగములును, రెండవ అంతస్తు నను పైన పట్టమును 16 భాగములుచేసి రాజసేన 1 1/2 భాగమును, వేది 2 భాగములును, పీఠము 1/2 భాగమును, చంద్రావలోకనము 1 1/2 భాగమును, స్తంభము 7 భాగములును, హీరము 3 1/2 భాగము లును, శిఖరము 1 1/2 భాగమును, పతిము 2 భాగములును, ఛాద్యము 3 భాగములును, లంబనము 1 భాగమును, ఛేదముయొక్క హారము 2 భాగములును, వాసంతపట్టిక 2 భాగములును, ఆపైన మంజరిని ద్రావిడ పద్ధతిలో అలంకారముగా రచించవలెను. కోణమునందలి కూటము యెత్తు 7 భాగములును, ఘంట, కలశము, అండకము మొద లైనవానితో చేయవలయును. దీనిపైన రెండవ కూటమునుకూడ అదే కొలతతో చేయవలయును. కర్ణమునననుసరించి మరియొక కర్ణమును

6 భాగములు చేయవలయును. 8 అండకములు 2ను, 6 అండకములు 4ను, మొత్తము 40 అండకములగును. విస్తారము 12 భాగములను, ఎత్తు 9 భాగములును, మొదటినుండి క్రమముగా ద్రావిడ పద్ధతిలో రచించవలెను. 8 అండకములు ఎత్తుచు విస్తారమును 10 భాగములు చేయవలయును. రెండవ భద్రము అలంకారయుక్తముగ రచించవలయును. మూలమంజరియొక్క విస్తారము 22 భాగములను, ఎత్తు 23 భాగములును, స్కంధము 13 భాగములును, గ్రీవ 2 భాగములును, ఎత్తయిన అండకము 3 భాగములును, శిఖరము 2 భాగములును, కలశము 4 భాగములును, ఈ ప్రాసాదమున ఉరోమంజరులు 12ను, అండకములు 73ను కలిగి దేవతలకు సైతము సంతోషము కలిగించునట్టి త్రైలోక్యభూషణమును రచించినవారు ఒక్క కల్పమువరకు బ్రహ్మలోకముననుందురు.

(అనుబంధము 64, 65, 66, 67వ పటములను చూడుడు)

## 99. పద్మాఖ్యము

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదమథపద్మాఖ్యం కంఠయామోఽశ్వినాప్రియం॥
చతురశ్రీకృతేక్షేత్రే సప్తభాగవిభాజితే
త్రీన్ భాగాన్ మధ్యమేత్యక్త్వా ద్వాద్వాకోణేషులాంఛయేత్॥
సాద్వయేద్విభిరష్టౌచ పశ్చాదపిచషోడశ
విస్తారార్ధేనగర్భఃస్యాద్ గర్భస్యార్ధంతథాబహిః॥
ఊర్ధ్వమానమథబ్రూమః పద్మాఖ్యస్యయథాక్రమం
విస్తారాద్ద్విగుణోత్సేధం భాగవింశతిభాజితం॥
వేదీజంఘాతదైతస్మిన్ కార్యామాలాతమంజరీ
గ్రీవాండకలశ్చైహ శంఖవర్ధనవర్త్మనా॥

పద్మాఖ్యః కారితో యేన ప్రాసాదో ద్రసవల్లభః
ఆత్మాసముద్ధృత స్తేన పాపపంక మహోదధేః॥

తా॥ పద్మాఖ్యప్రాసాద లక్షణము చెప్పుచున్నాడు. అశ్వినీ దేవతలకు ప్రియమైనది. చతురశ్ర ప్రదేశమును 7 భాగములు చేసి అందు గర్భము 3 భాగములును, మూలలయందు 2-2 భాగములు గుర్తులు పెట్టవలయును. ఆ రెండు కర్ణ శాలలయందు మరల 8 శాలలు కల్పించవలయును. మరల పదునాఱు భాగములు చేసి అందు గర్భము 8 భాగములును దానికి రెండువైపుల 4-4 భాగముల చొప్పున 8 భాగములును మొత్తము 16 భాగములు సరిచేయవలయును. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలయును. శంఖవర్ధనమున జేసిన భాగముల ప్రకారము వేది, జంఘ, మాల, మంజరీ, గ్రీవ, అండకము, కలశము మొదలైనవి రచించవలెను. ఇది సమస్తపాపములను హరింపజేయును.

# 100. పద్మాఖ్యము పక్షబాహువు

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ ద్వావింశద్భక్తేపరిధౌ వృత్తాకారస్తుపూర్వవత్
ద్విద్విభాగంభవేత్కర్ణః పద్మాపత్రాకృతిస్తథా॥ 64
మండోవరశ్చపాదోనః సపాదాశిఖరోన్నతిః
తలచ్ఛందోద్భవంరూపం పంచభూఘంటికావధి॥ 65
పద్మాఖ్యశ్చతదాప్రోక్తః పద్మనాభస్యమందిరం
కర్తృకావరకాశ్చైవ విష్ణులోకంవ్రజంతిహి॥ 66
దశధాభాజితేఛందే ద్విభాగఃకర్ణవిస్తరః
భాగంభాగంభవేత్కర్ణే వేదాంశోభద్రవిస్తరః॥ 67
ద్విభాగోభద్రనిష్కాస ఏకభాగాచకర్ణికా
ద్విభాగాచభవేద్భిత్తిః శేషంగర్భగృహంమతం॥ 68
మండోవరశ్చపాదోనః సపాదాశిఖరోన్నతిః
కుర్యాత్కర్ణేషుకూటాని విమానంపంచభూమికం॥ 69

భద్రేభద్రేతుప్రాగ్గ్రీవా చ్ఛాద్యఘంటాద్యలంకృతాః
పక్షబాహుస్తదానామ కర్తవ్యఃసర్వదైవతే॥ 70

తా॥ నలుచదరపు స్థలమును మూలలవరకు గుండ్రముగా చేసి దానిని 22 భాగములుచేసి, అందు కర్ణములు 2-2 భాగములును, తామరేకులవలె కల్పించి మండోవరము 3 4 భాగమును, శిఖరము 1 1/4 భాగమును, తలచ్ఛందమునుండి అయిదంతస్తులపైన ఘంటిక యును రచించినయెడల పద్మాఖ్యమగును. మఱియు దానినే 10 భాగములుచేసి కర్ణము 2 భాగములును, కర్ణికలు 1-1 భాగమును, భద్రము 4 భాగములును, భద్రముయొక్క నిర్గమము 2 భాగములును కర్ణిక 1 భాగమును, గోడ 2 భాగములును, మిగిలినది గర్భగృహమును చేయవలయును. మండోవరము 3/4 భాగమును, శిఖరము 1 1/4 భాగమును ఇట్లు కర్ణములయందు కూటములను రచించవలెను. విమానమును 5 అంతస్తులపైన రచించవలయును. భద్రములన్నిటియందును ప్రాగ్గ్రీవములను, ఛాద్యమును, ఘంట, కలశము మొదలైన అలంకారములను రచించినచో పక్షబాహువగును. ఇది సమస్త దేవతలకును యోగ్యము.

## 101. పక్షబాహువు మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ పక్షబాహుమథబ్రూమః ప్రాసాదంకులనందనం
సర్వరోగహరంపుణ్యం సర్వలోకేశుణంభవం॥
చతురశ్రీకృతేక్షేత్రే ద్వాదశాంశవిభాజితే
అష్టభాగాయతంగర్భం కుర్యాద్భిత్తిద్విభాగికాః॥
ద్విపదంకారయేత్కర్ణం భాగార్థముదకాంతరం
ప్రత్యంగంసార్ధభాగేస్యాత్ శాలాచైవచతుష్పదా॥
నిష్క్రమఉభయోర్భాగాద్ భాగార్ధేనపృథక్పృథక్
కర్తవ్యౌపక్షయోర్బాహూ విస్తారేణాష్టభాగికౌ॥

చతుష్పద స్తయోర్గర్భో ద్విపదాభిత్తివిస్తృతిః
చతుర్భాగంభ వేద్ భద్రం కోణాశ్చైవద్విభాగికః॥
ఊర్ధ్వమానమథ బ్రూమ శ్చతుర్వింశతి భాగికం
త్రిపదో వేదికాబంధో జంఘాపంచపదోన్నతా॥
ద్వాభాగా కలశః కార్యో ద్వాభాగా చంద్రికాండకం
మధ్యేతుమంజరీ కార్యా ఘంటాబద్ధాచపార్శ్వయోః॥
పక్షబాహుః కృతో యేన త్రిగర్భః కర్ణభూషితః
సత్రినేత్ర ప్రతాపః స్యాత్ తురంగ వాతనాయకః॥

తా॥ సమస్తమైన రోగములను పోగొట్టునట్టి పక్షబాహువును చెప్పుచున్నాడు, చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి అందు గర్భగృహము 8 భాగములును, చుట్టూ గోడ 2 భాగములును చేయవలయును. కర్ణము 2 భాగములును, జలాంతరము 1 2 భాగమును ప్రత్యంగము 1 1/2 భాగమును, శాల 4 భాగములును చేయవలెను. శాలయొక్క నిర్గమము 2 భాగములును, పంజరములయొక్క నిర్గమము 1/2 బాగమునుచేసి, దానికిరువైపుల 8-8 భాగముల చో॥న పక్షబాహువులను గృహములను రచించవలయును. ఆ గృహములకు చుట్టూ గోడ 2-2 భాగములును, మధ్యగర్భము 4 భాగములును చేయవలయును. దానికి భద్రము 4 భాగములును, కర్ణములు 2-2 భాగములును చేయవలయును. ఎత్తును చెప్పుచున్నాడు. 24 భాగములనుచేసి వేదిక 3 భాగములు, జంఘ 5 భాగములు, కలశము 2 భాగములు, చంద్రికాండకము 2 బాగములు, దానిమధ్య మంజరియును, ప్రక్కలనుగూడ ఘంట, కలశములను రచించవలయును. మూడు గర్భములును శిల్పచాతుర్యముతో రచించవలెను. మూడు కన్నులవలె ప్రతాపముతో నుండును.

(అనుబంధము 68, 69, 70 పటములు చూడుడు)

## 102. విశాలము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ త్రయోదశాండకంపూర్వం నాగరచ్ఛందనందనః
చతుర్ద్వారేషుప్రాగ్గ్రీవాః విశాలస్తుశివాలయః॥ 71

తా॥ నందనమునకు 13 అండకములును, నాగర పద్ధతితో చేయుచు నాలుగు వాకిళ్ళయందు ప్రాగ్గ్రీవములు కల్పించిన నదో విశాలమగును. ఇది శివప్రీతికరము.

## 103. విశాలము మఱియుక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ విశాలంసంప్రవక్ష్యామి విశాలైరన్వితంగుణైః
దయితంకృత్తికాసూనోః పూజితంగణకిన్నరైః॥
క్షేత్రందశాంశంకుర్వీత షడ్భాగామధ్యకందకం
భాగికోభిత్తయః కార్యాభ్రమంతోఽపితథావిధాః॥
భాగద్వయంభవేత్కర్ణో వారిమార్గేణసంయుతః
పదేనతిలకంకుర్యాత్ భాగార్ధేనవినిర్గతం।
ఆయామనిర్గమాచాస్య చతుర్భాగాచతుష్కికా
చతుష్పదోమధ్యగర్భః చతుర్ద్వారస్యశస్యతే॥
విస్తారాద్ద్విగుణోచ్ఛ్రాయమూర్ధ్వమానంవిధీయతే
విదధ్యాద్వేదికాబంధం సార్ధభాగేనసంమితం॥
సార్ధైశ్చతుర్భిఃకుర్వీత భాగైర్జంఘోచ్ఛ్రితింబుధః
మాలామంతరపత్రంచ భాగేనైకేనకారయేత్॥
సార్ధద్విభాగికంశృంగం కలశాండికసంయుతం
తస్యార్ధమపరంశృంగం తావన్మానంవిధీయతే॥
షడ్భాగవిస్తృతాంజంఘా మంతర్యాభాగసప్తకం
తద్విస్తారదశాంశేస్యాత్ షడ్భిఃస్కంధస్యవిస్తృతిః॥

గ్రీవాత్తూస్తువిధాతవ్యా పదస్యార్ధంసమున్నతిః
భాగేనాండకముచ్ఛ్రాయో భాగేనార్ధేనచంద్రికా॥
ద్విపదంకలశంకుర్యాత్ సమసూత్రంసుశోభనం
ప్రాసాదోఽయంవిశాలః స్యాదేవంసప్తదశాండకం॥
యఃకరోతిసలోకేఽస్మిన్ నరోనాగాధిపోభవేత్
లభతేచబహూన్ కామాన్ దేహాంతేచోత్తమంపదం॥

తా॥ కిన్నరగణముచే పూజింపబడినదియును కుమారస్వామికి ప్రియమైనదియును అగు విశాలము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 10 భాగములుచేసి మధ్య కందమును 6 భాగములును గోడ 1 భాగమును, భ్రమంతి 1 భాగమును చేయవలయును కర్ణము 2 భాగములును, జలాంతరముతోసహా చేయవలయును. తిలకము 1 భాగమును 1/2 భాగము నిర్గమమును చేయవలయును. ఆయామము నిర్గమములు నాలుగువైపుల నాలుగు భాగములుచేసి మధ్యగర్భము 4 భాగములును, 4 ద్వారములును చేయవలయును. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలయును. అనగా 20 భాగములు, వేదిక 1 1/2 భాగము, జంఘ 4 1/2 భాగములు, మాల అంతరపత్రము 1 భాగము, శిఖరము 2 1/2 భాగములు కలశము అండకమును చేయవలయును. మఱియొక శిఖరము అందులో సగము చేయవలయును. జంఘ విస్తారము 6 భాగములు, అంతరితము 1 భాగము, ఆ విస్తారమును 10 భాగములుచేసి అందు స్కంధ విస్తారము 6 భాగములు, గ్రీవ యెత్తు 1/2 భాగము, అండకము యెత్తు 1 భాగము, చంద్రిక 1/2 భాగము, కలశము 2 భాగములు సమసూత్రముతో చేయవలయును. 17 అండకములతో విశాల ప్రాసాదమును రచించేనేని అట్టివానికి అన్ని కోరికలు సఫలమై అంతమున దివ్యలోకమును బొందును.

(అనుబంధము 71, 72వ పటములు చూడుడు)

# 102· కమలోద్భవము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ వృత్తాకారోహ్యసౌపూర్వః పరిధిర్యుగవేదతః
కర్ణాశ్చద్విపదాఃప్రోక్తా భద్రంవైపంచవిస్తరం॥ 72
చతురభ్రదంసూర్యకర్ణా వికర్ణైతత్రలాంఛితాః
మండోవరశ్చపాదోనఃసపాదః శిఖరోదయః॥ 73
పంచభూమిసమాయుక్త ఏకషష్టిస్తథాండకాః
ఘంటాకలశపూర్వంచ శుకాగ్రంసమలంకృతం॥ 74
విధేర్విష్ణోరవేఃకుర్యాచ్ఛివస్యాపివిశేషతః
జగతీగర్భసంయుక్తం నామ్నావైకమలోద్భవమ్॥ 75

తా॥ చతురశ్రప్రదేశమును కోణములయొక్క చివరకు గుండ్రముగా చేసి దానిని 44 భాగములుచేసి కర్ణములు 2-2 భాగముల చొప్పున ఒక్కొక్క మూలను తిను, ఇట్లు నలుమూలల మొత్తము 12ను, భద్రముయొక్క విస్తారము 5 భాగములును, ఇట్లు నలువైపుల 4 భద్రములును అయిదంతస్తులకు 60 అండకములును శిఖరముతో 61 అండకములు, ఘంట, కలశము, శుకాగ్రముతో నలంకారముగా నుండవలయును. బ్రహ్మ, విష్ణు, సూర్య, శివ ఆలయములు రచించుట శ్రేష్ఠము. ఇతర దేవతలకు దీనిని రచించగూడదు. జగతి యును గర్భమును చెప్పబడిన కొలతలప్రకారము చేయవలయును.

(అనుబంధము 73, 74 పటములు చూడుడు)

# 105· కమలోద్భవము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ బ్రూమోఽథలక్ష్మీదయితం ప్రాసాదంకమలోద్భవం
సిద్ధగంధర్వసహితం స్కందోయత్రవ్యవస్థితః॥

చతురశ్రంసమంక్షేత్రం భువిదిక్షువిదిక్షుచ
కృత్వావృత్తంసమాలిఖ్య భాగైర్ద్వాత్రింశతాభజేత్॥
భాగాద్వాద్వాతతఃకుర్యాదేకైకాందలపట్టికాం
కర్ణైఃషోడశభిఃకుర్యాదంభోజసదృశాకృతిం॥
పంచభిర్భాజితేసీమ్నిగర్భేభాగత్రయంభవేత్
అధస్తాదాసనంతస్య పద్మపీఠంప్రకల్పయేత్॥
కృత్వాద్విగుణమూర్ధ్వంత ద్వింశత్యాప్రవిభాజయేత్
తులోదయోఽష్టభాగఃస్యాద్ ద్వాదశాంశాచమంజరీ॥
వేదీజంఘాచమాలాచ స్యాద్యథాశంఖవర్ధనే
తదూర్ధ్వంపద్మకూటాది చోన్నతంపద్మపత్రవత్॥
భూమికాఃపంచకర్తవ్యాః పదహీనాయథోత్తరం
వేదికాతస్యకర్తవ్యా వికాసిశతపత్రవత్॥
పాదోనభాగోగ్రీవాచ సపాదంపదమండకం
చంద్రికాచైవభాగేన వికాసికమలాకృతిః॥
ద్విపదంకలశంకుర్యాత్ సాబ్జపత్రంసపల్లవం
అరోగ్యంస్యాత్ పురోదేశే కారితేకమలోద్భవే॥
ఆయుఃశ్రీవృద్ధిపుత్రాఃస్యురమేయానాంచసంఖ్యయా॥

తా॥ లక్ష్మీదేవికి ప్రియముగల కమలోద్భవమును చెప్పుచున్నాడు. కుమారస్వామియును సిద్ధగంధర్వగణముతో నుండునది యును కమలోద్భవమే. చతురశ్రప్రదేశమును దిశలను మూలలును సమముగాచేసి వృత్తముగా రేఖను లిఖించి దానిని 32 భాగములుచేసి 2-2 భాగములచొప్పున ఒక్కొక్క దలపట్టికనుచేసి అందు 16 కర్ణములను తామరపుష్పమువలె రచించవలెను. ఆ ప్రదేశమును 5 భాగములుచేసి గర్భము 3 భాగములును, దిగువ పద్మపీఠమును రచించి దానిపైన రెట్టింపుగా యెత్తునుచేసి దానిని 20 భాగములుగా విభ

జించి, దూలము పైభాగమువరకు 8 భాగములును, మంజరి 12 భాగములును, వేది, జంఘ, మాల ఇవి శంఖవర్ధనమువలె రచించవలయును. దానిపైన పద్మకూటములు ఎత్తుగాను పద్మపత్రమువలె రచించవలెను. అయిదు అంతస్తులుచేసి అందు మొదటి అంతస్తుకంటె రెండవది 1/4 భాగము తక్కువగాను, ఇట్లు ఒక్కొక్క పాతికవంతు తగ్గించుచు చేయవలయును. వేదిక వికసించిన పద్మమువలె నుండవలయును. గ్రీవ 3/4 భాగమును, అండకము 1 1/4 భాగమును, చంద్రిక 1 భాగమును వికసించిన పద్మమువలె చేయవలయును. ఆపైన కలశమును 2 భాగములు చేయవలెను. తామరతేకు చిగురాకు ఈ రెండును కలశమునందుండవలెను. కమలోద్భవమునందిట్లు ముందు భాగమున రచించిరేని ఆయుష్యము, ఐశ్వర్యము, సంతానము అపరిమితముగా గలుగును. 81 అండకములు అగును.

(అనుబంధము 75, 76, పటములు చూడుడు)

## 106. హంసధ్వజము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ సిద్ధార్థస్యచసంస్థానే తద్రూపేతదవస్థితే
విమానంపంచభూమంచ కుర్యాచ్ఛృంగంతుకామదం॥ 76
హంసధ్వజస్తదానామ చతుర్ద్వారైరలంకృతః
చతుర్భిర్మండపైఃఖ్యాతః స్వర్గాదిభోగదాయకః॥ 77

తా॥ సిద్ధార్థమును 5 అంతస్తులుగా రచించి, పైన శిఖరము మొదలైనవి కల్పించినచో హంసధ్వజమగును దానికి 4 ద్వారములును, నాలుగుదిశలయందు 4 మండపములను రచించవలయును. ఈ ప్రాసాదము స్వర్గసుఖము మొదలైన సమస్త భోగములనిచ్చును.

(అనుబంధము 77, 78వ పటములు చూడుడు)

# 107. హంస ధ్వజము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ హంసధ్వజమథబ్రూమో హంసక్రీడావిభూషితం॥
సేవితంసురసంఘేన వల్లభంపద్మజన్మనః
విభజ్యదశధాక్షేత్ర మారభ్యబ్రహ్మణఃపదాత్॥
ఆదాయపార్శ్వయోర్భాగాం స్త్రీన్ స్త్రీన్ వృత్తంప్రకల్పయేత్
ఏవంగర్భోవిధాతవ్య చ్ఛాదద్యస్యజగత్యాదిభిః॥
ద్విపదాబాహ్యతోభిత్తిః కర్ణఃకార్యోద్విభాగికః
భద్రంపంచపదంకార్యం పదార్థముదకాంతరం॥
ద్వాభాగౌనిర్గతంభద్రం స్తంభద్వయసమన్వితం
మధ్యేతుఛాద్యకంకుర్యాత్ భాగోచ్ఛ్రాయంద్వివిస్తృతం॥
కుర్యాద్ భాగంసవిస్తారం తోరణంచతురున్నతం
మరాలమకరైర్యుక్తం స్తంభేషుస్యాత్ తథేల్లికాః॥
పురస్తాన్మండపంప్రాజ్ఞోరచయేన్మానపూర్వకం
ఊర్ధ్వమానమథబ్రూమః సూత్రంస్యాద్భాగవింశతిః॥
మేఖలావేదికాజంఘాః శంఖవర్ధనవన్మతాః
కర్తవ్యాఃకర్ణరథికా స్త్రిపదాఃకలశాన్వితాః॥
చతుష్కికాపంచపదా వరాటీఘటతమాన్వితా
కార్యాకలశసంయుక్తా విస్తారోచ్ఛ్రాయయోఃసమా॥
కర్ణశృంగోర్ధ్వతఃకుర్యాదష్టాంశాంమూలమంజరీం
ఉచ్ఛ్రితానవభిర్భాగైఃపంచభూమాస్తుసంవృతాః॥
ప్రథమాద్విపదాభూమి ర్ణేమకూటక్రియోపమా
అన్యాస్తుపదపాదార్థహీనాః కార్యాయథోత్తరం॥
మహాయత్నఃపునఃకార్యో భూమికాపరివర్తనే
భాగేనవేదికోచ్ఛ్రాయః స్కంధస్తుశతవాస్తువత్॥

గ్రీవాండకసము త్సేధం విదధీతపదద్వయం
అండకేవ ర్తనాకార్యాకంకతీఫలసన్నిభా॥
చంద్రికాభాగమేకంచ ద్వాభాగాకలశోన్నతం
హంసధ్వజఃకృతోయేన వల్లభఃపద్మజన్మనః॥
సయాతివిదిధైర్యాసై ద్దేహాంతే వసుసంగతిమ్॥

తా॥ బ్రహ్మకు ప్రియమైన హంసధ్వజముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. క్షేత్రమును 10 భాగములుచేసి అందు మధ్యస్థానము నుండి చుట్టూ 3-3 భాగములతో వలయరేఖ నేర్పరచి దానిని గర్భముగాజేసి చుట్టూ 2-2 భాగములు గోడయును, మూలలయందు 2 భాగముల చొప్పున కర్ణములును, మధ్యభద్రము 5 భాగముల విస్తారమును నిర్గమము 2 భాగములును, రెండు స్తంభములతో మధ్యఛాద్యకమును, దాని విస్తారము 2 భాగములును, యెత్తు 1 భాగమును తోరణము విస్తారము 1 భాగమును యెత్తు 4 భాగములును, హంసలు మొసళ్ళు చేయవలయును. స్తంభములయందు ఇల్లికాతోరణములను రచించవలయును. దానిముందు మండపమును (శాస్త్రో)క్త ప్రకారము రచించవలయును. ఎత్తును 20 భాగములు చేయవలయును. మేఖల వేదిక, జంఘ, ఇవి శంఖవర్ధనమునందుచేసిన కొలతల ప్రకారము చేయవలెను. కర్ణములయందు రథికలు 3 భాగములు కలశములతో చేయవలెను. నాలుగు కర్ణములను కలశములు 5 భాగములతో వరాటమునందు కుంభమునురచించినట్లు విస్తారమును యెత్తును సమానము చేసి రచించవలయును. కర్ణశృంగములపైన మూలమంజరి 8 భాగములు చేయవలెను. దానియెత్తు 9 భాగములుండవలెను. అయిదంతస్తులతో దీనిని రచించవలెను. మొదటి అంతస్తు 2 భాగములును, రెండవ అంతస్తు 1 3/4 భాగములును, మూడవ అంతస్తు 1 1/2 భాగమును, నాల్గవ అంతస్తు 1 1/4 భాగమును, ఐదవ అంతస్తు 1 భాగమును చేయ

చిన అంతస్తులలో ఒక్కొక్క దానియందు ఒక్కొక్క విధముగా చక్కని పనులను చేయవలయును. వేదిక 1 భాగమును, స్కంధము శతవాస్తువునందు చేసినట్లు చేయవలయును. గ్రీవ అండకము 2 భాగములు చేయవలెను. అండకము మద్దికాయవలెనుండవలెను. చంద్రిక 1 భాగమును, కలశము 2 భాగములును చేయవలెను. ఇట్లు హంస ధ్వజమును రచించినవారు దేహాంతమున వసులోకప్రాప్తిగల పుణ్యమును పొందుదురు.

## 108. లక్ష్మీధరము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ పూర్వాంతపృథ్వీజయశ్చైవ షణ్ణవత్యుత్తరంశతం
రేఖోర్ధ్వేతిలకంకుర్యా న్నందికాతిలకంతథా॥ 78
అండకైః సప్తత్రింశద్భిర్లక్ష్మీధరఇతీరితః
రమతేతత్రలక్ష్మీశ్చ సహితావిష్ణునాసదా॥ 79

తా॥ పృథ్వీజయమునందు 14-14 భాగములతో రేఖపైన తిలకమును, నందికయందు తిలకమునుచేసి యిట్లు 37 అండకములతో రచింపబడినది లక్ష్మీధరమగును. ఇది లక్ష్మీదేవికి సంతోషకరమైనది.

## 109. లక్ష్మీధరము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథలక్ష్మీధరంబ్రూమో యంకృత్వావిజయంనరః॥
రాజ్యమాయుష్యపూజాంచ గుణానాప్నోతిచైశ్వరాన్॥
చతురశ్రీకృతేక్షేత్రే భక్తేషోడశభిఃపదైః॥
కర్తవ్యఃషట్పదఃకందో గర్భసూత్రచతుష్పదః
చతస్రష్వపిదిక్షుస్యాత్ త్రిభిర్భాగైర్భ్రమంతికా॥
ద్విపదాబాహ్యభిత్తిఃస్యా చ్ఛభాకార్యాచతుర్దిశం
కర్ణేషుశృంగమేకైకం ద్వేద్వేశృంగేతుమధ్యగే॥

ద్వ్యంశానితానవిస్తారాత్ దశశృంగాణిదిక్త్రయే
షట్ శాలాశ్చవిధాతవ్యాః శుభాదిత్యుతిసృష్వపి॥
యామ్యేనచచతుర్భాగా భాగద్వితయనిర్గతాః
తలచ్ఛందోఽయముద్దిష్టో మండపఃపురతోభవేత్॥
విస్తారాద్ద్విగుణోఽసౌస్యాత్ ప్రాసాదస్యాస్యచోచ్ఛ్రయః
స్యాత్త్రయోదశభాగోఽత్ర ప్రమాణేనతులోదయః॥
ఊర్ధ్వంచవింశతిపదం వేదీబంధఃపదత్రయం
ఉత్సేధాత్షట్పదాజంఘా భాగేనభరణంభవేత్॥
భాగైస్త్రిభిర్మేఖలేద్వే శృంగంచకలశంత్రిభిః
ఉచ్ఛ్రయేణవిధాతవ్యః సింహకర్ణశ్చతుష్పదః॥
దశశృంగాణికుర్వీత ఘంటాపద్మంచదిక్త్రయే
చతుర్దశాంశవిస్తారా పంచగా మూలమంజరీ॥
ఊర్ధ్వంసప్తదశాంశాచ గ్రీవోచ్ఛ్రాయఃపదద్వయం
అండకంద్విపదంకార్యం భాగేనైకేనకర్పరం॥
కలశంత్రిపదంమూర్ధ్ని వర్తయేత్సుమనోరమం
లక్ష్మీధరాఖ్యంప్రాసాదం యఃకుర్యాద్వసుధాతలే॥
అతుయేనపదేతత్త్వే లీయతేనాత్రసంశయః॥

తా॥ మానవునకు విజయమును ఆయుష్యమును రాజ్యమును పూజితమును కలిగించునట్టి లక్ష్మీధరమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 16 భాగములు చేసి 6 భాగములు కందకమును 4 భాగములు గర్భమును చేయవలయును. భ్రమంతిక నాలుగువైపులను 3 భాగములును, వెలుపలి గోడ 2 భాగములును, కర్ణములయందు 1-1 భాగము శృంగములును, మధ్యశృంగములు 2-2 భాగములును, ఇట్లు 3 వైపుల మొత్తము 10 శృంగములను చేయవలయును. అటులే మూడువైపుల భద్రములను 6 భాగములు విస్తారముతోను, 2 భాగముల నిర్గమము

తోను రచించవలెను. పడమరపైపున భద్రమును 4 భాగముల విస్తారమును 2 భాగముల నిర్గమమును కల్పించవలెను. ఇట్లు తలచ్ఛందమును చేసి ముందు మండపమును రచించవలయును. ప్రాసాదము యెత్తు విస్తారమునకు రెట్టింపుగా చేయవలెను. దూలముయొక్క పై భాగము వరకు 13 భాగములును, పైన 20 భాగములును, వేదీబంధము 3 భాగములు, జంఘ 6 భాగములు, భరణం 1 భాగము, మేఖలలు రెండును 3 భాగములు, శృంగమును కలశమును 3 భాగములు, సింహకర్ణముల యెత్తు 4 భాగములు, మూడువైపులను 10 శృంగములు ఘంట కలశములతో రచించవలయును. మూలమంజరి విస్తారము 14 భాగములును, ఎత్తు 17 భాగములును, గ్రీవ యెత్తు 2 భాగములును, అండకము 2 భాగములును, శిఖరము 1 భాగమును, కలశము 3 భాగములును ఇట్లు అందముగా లక్ష్మీధరమును రచించినవారు శాశ్వతమైన పరతత్వమునందు ఐక్యమగుదురు.

(అనుబంధము 79, 80 పటములు చూడుడు)

## 110. వజ్రకము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ వృత్తంపూర్వంచపరిధౌ షట్త్రింశద్భిర్విభాజితే
ద్విపదాఃసూర్యకర్ణాశ్చ పాదాద్వాదశకర్ణికాః॥ 80
మండోవరశ్చపాదోనఃసపాదఃశిఖరోచ్ఛ్రయః
షడ్భూమికయుతశ్చైవ వజ్రకఃసర్వకామదః॥ 81

తా॥ ముందు సమ చతురశ్రమును గుండ్రముగాచేసి 36 భాగములుచేసి అందు కర్ణములు 2 భాగముల చొప్పున 12ను, కర్ణికలు 1 భాగముచొప్పున 12నుచేసి మండోవరము 3/4 భాగమును, శిఖరము 1 1/4 భాగమును ఆఱు అంతస్తులుగాను రచించిరేని అది సర్వము నిచ్చునట్టి వజ్రకమగును.

# 111. మహావజ్రము

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ మహావజ్రమథబ్రూమః ప్రేత్యపాపహరంశుభం॥
ప్రాసాదేకారితేయత్ర సురేంద్రఃపరితుష్యతి
అష్టౌహస్తాఃకనీయాన్ స్యాన్మధ్యోద్వాదశమానతః॥
ఉత్తమఃషోడశప్రోక్తస్త్రిధైవంకరసంఖ్యయా
స్వవిస్తారస్యసూత్రేణ కోణాదాలిఖ్యవర్తులం॥
కోణేషులాంఛితంకృత్వా భాగైఃషట్త్రింశతాభజేత్
ద్విపదాఃకర్ణికాశ్చేహ కార్యాద్వాదశసంఖ్యయా॥
కర్ణికాద్వయమధ్యేతు స్తంభోభాగేచవర్తులః
శతపత్రాకృతిఃకార్యో ద్వాభాగౌమూర్ధమానతః॥
అధస్తాన్మేఖలాయాశ్చ కమలోద్భవవద్భవేత్
స్తంభయేత్కర్ణికామధ్యే తేషుకూటానికారయేత్॥
కుర్యాదాలేఖముపరి కర్ణికాయాఃసుశోభనం
కర్తవ్యాభూమయఃపంచ క్రమేణాంఘ్ర్యూనయాన్వితా॥
స్యాద్భాగార్ధోదయాగ్రీవా విస్తారేణచతుష్పదా
అండకంసార్ధభాగేన విధాతవ్యంసకర్పరం॥
భాగద్వయంతుకలశః శృంగకర్ణైఃసపల్లవైః
యఃకరోతిమహావజ్రం ప్రాసాదంపురభూషణం॥
తుష్టోదివిసదాంపత్యో రమతేసోఽప్సరోగణైః॥

తా॥ మహావజ్రము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. పాపహరమైనదియును ఇంద్రుడు సంతోషించునదియును అగు నీవజ్రకము 8 హస్తముల విస్తారము అధమము, 12 హస్తముల విస్తారము

మధ్యమము, 16 హస్తముల విస్తారము ఉత్తమము. ఈ విస్తారమును నలుచదరముగా జేసి కోణములనుండి వృత్తరేఖనుగీచి యొక మూల నుండి మఱియొక మూలకు 36 భాగములుచేసి, కర్ణిక 2 భాగముల చొప్పున 12 రచించవలయును, ఆ కర్ణికల సందున 1 భాగము చొప్పున గుండ్రముగా స్తంభములను రచించవలయును. నలువైపుల 48 కర్ణము లును, 48 స్తంభములును అగును. ఇట్లు తామరపుష్పమువలె స్తంభ ములను 2 భాగముల యెత్తుతో చేయవలయును. అడుగున మేఖలలు పద్మము పుట్టినట్లు చేయవలయును. ఆ పద్మముమధ్యనున్నట్లు స్తంభ ములుండవలెను వానిపైన కూటములను చేయవలయును. పైన ఆలేఖమును చేయవలయును. కర్ణికలు అందముగా నుండవలయును. ఇట్లు 5 అంతస్తులు చేయవలయును. గ్రీవ 1/2 భాగమును, దాని విస్తా రము 4 భాగములును, అండకము 1 1/2 భాగమును శిఖరముతో చేయవలెను. కలశము 2 భాగములు శృంగమున కర్ణములతోను పల్లవములతోను రచించవలయును. దీనిని మహావజ్రమందురు. ఈ ప్రాసాదమును రచించినవారు దేవలోకమున అప్సరోగణముచే సేవింప బడుచు దంపతులు దేవలోకమున సంతోషముతోనుందురు.

(అనుబంధము 81, 82 పటములు చూడుడు)

# 112. రతిదేహము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ శ్రీనివాసస్యసంస్థానే తద్రూపేతదవస్థితే
చతుష్కభద్రప్రాగ్రీవే తదగ్రేవేదమండపాః॥ 82
సార్ధేషుభూమికోత్సేధం మాడంకుర్యాచ్ఛకామదం
రతిదేహస్తదానామ కామదేవస్యచాలయః॥ 83

తా॥ శ్రీనివాసమునందు నాలుగు భద్రములయొక్క ప్రాగ్రీ వములందు వానిముందు 4 మండపములను రచించి 1 1/2 భూమిక

యుత్తు మాడమును రచించిరేని కోరికల నిచ్చునట్టి రతి దేహ ప్రాసాదమగును.

## 113. రతిదేహము మరియుక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ రతి దేహమథ బ్రూమః ప్రాసాదంసుమనోరమం॥
అప్సరోగణసంకీర్ణం కామ దేవస్యమందిరం
అష్టభాగీకృతేక్షేత్రే సమభాగేసమాయతే॥
ద్విపదంకర్ణకూటంస్యాద్ వారిమార్గసమన్వితం
అలిందస్యచతుర్భాగా విస్తారాయామతఃసమాః॥
భాగికీబాహ్యభిత్తిస్తు శేషంగర్భంప్రకల్పయేత్
మధ్యేచతుష్కికాకార్యాయత్ర స్తంభాఃసుశోభనాః॥
మకరైస్త్రివక్త్రైశ్చ హస్తైసర్వైఃసపత్రకైః
పల్లవైర్నాగబంధైశ్చ సాలభంజిభిరన్వితాః॥
ఖల్లికాతత్రకర్తవ్యా మకరాస్యవినిర్గతా
చత్వారోబాహ్యతోఽలిందాః స్తంభద్వితయభూకులం॥
సదృశంప్రథమంకార్యం భవనంకర్మయుక్తిమత్
ద్వితీయంభవనంకార్యం బాహ్యలిందవివర్జితం॥
శేషంకర్మతథాకార్యం ప్రథమాయాంయథాభవేత్
తృతీయాయాంపునఃకార్యా చతుఃస్తంభాచతుష్కికా॥
ఖలికాతోరణన్యస్తాః సముఖాశ్చమరాలకాః
స్తంభానాంకూటకాన్ పూర్వాన్ సింహకర్ణాంశ్చమధ్యతః॥
మల్లచ్ఛాద్యానిభాగార్ధం భాగోచ్ఛ్రాయాన్యనుక్రమాత్
త్రీణికుర్వీతయుక్తాని శుభైరంతరపత్రకైః॥
ఘంటాచభాగినీంకుర్యా దూర్ధ్వేనామలసారకం
చం। దికాంభాగపాదేన దీఃభాగాంకలశో। చి\తిం॥

ఏవంవిధంయః కురుతే ప్రాసాదంరతివల్లభం
సంతోషయతికందర్పం స్వాభ్యజనేషుసపుణ్యభాక్॥

తా॥ మన్మథునకు ప్రియమైన రతిదేహమను ప్రాసాద లక్షణ మును చెప్పుచున్నాడు. సమచతురశ్రమును 8 భాగములు చేసి కర్ణ కూటములు 2-2 భాగముల చొప్పున జలాంతరములతోగూడ రచించ వలయును. అలిందములు 4 భాగములు విస్తారమును, ఆయతమును గూడ 4 భాగములు చేయవలయును. వెలుపలి గోడ 1 భాగమును చేయవలయును. మిగిలినది గర్భము చేయవలయును. మధ్యను 4 స్తంభములతో గర్భగృహమును కల్పించవలయును. మకరములు 3 మూడు శిరస్సులతోను, నానావిధ పత్రములతోను, చిగురుటాకుల తోను, నాగబంధములతోను, సాలభంజికలతోను అందముగా చేయ వలయును. మకర ముఖములనుండి వచ్చుచున్నట్లు ... చేయవలెను. వెలుపల నాలుగు అలిందములును, రెండు రెండు స్తంభములతోను ప్రత్యేకముగా కప్పుతోను రచించవలయును. మొదటి అంతస్తునందు అలిందములు భవనముతో సమానముగా రచించవలయును. రెండవ అంతస్తునందు వెలుపల అలిందము లేకుండ చేయవలయును. మిగిలిన పన్నియును వరుసగా అదేవిధముగా అన్ని పనులు చేయవలయును. మూడవ అంతస్తున 4-4 స్తంభములను నాలుగు వైపులను ... తోర ణములను, ఎదురు ముఖములుగల హంసలును, స్తంభములకు మొదట కూటములను, నడుమ సింహకర్ణములను, మల్లచ్ఛాద్యములు /2 భాగము చొప్పునను, ఎత్తు 1 భాగమును వరుసగా చేయవలెను. ట్లు మూడంతస్తులును అంతరపత్రములతో రచించవలయును. ఘంట భాగమును, శిఖరము 1 భాగము, చంద్రిక 1/4 భాగము, కలశము భాగములు చేసినచో పుణ్యము లభించునట్టి రతిదేహప్రాసాద ఏగును.

# 114. సిద్ధికామము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ భద్రకంపూర్వవిజ్ఞేయుం యదుక్తంరుచకాదికే
భద్రోద్గమసమాయుక్తః సిద్ధికామస్సఉచ్యతే। 84

తా॥ పూర్వము చెప్పబడియున్న భద్రకమునందు భద్రములను యెత్తుగా రచించినయెడల సిద్ధికామమగును.

# 115. సిద్ధికామము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ సిద్ధికామమథబ్రూమః ప్రమథైరుపశోభితం॥
ధనపుత్రకలత్రాణి కృతేయత్రాప్నుయాన్నరః॥
చతురశ్రీకృతేక్షేత్రే చతుర్భాగవిభాజితె
గర్భంద్విభాగంకుర్వీత భిత్తిభాగేనశోభనం॥
భద్రంద్విభాగవిస్తారం భాగేనైకేననిర్గతం
కర్ణమేకేనభాగేన కుర్యాత్ప్రతిదిశంబుధః॥
అస్యోర్ధ్వంద్విగుణంకుర్యాత్ షష్ఠభాగవిభాజితం
భాగేనవేదికాబంధం జంఘాసార్ధపదోన్నతా॥
మేఖలాంతరపత్రేచ పాదహీనంపదంమతే
స్యాదుచ్ఛ్రితిశ్చాస్యజంఘా పాదోనంపదపంచకం॥
త్రిభాగవిస్తృతాగ్రీవా భాగపాదసముచ్ఛ్రితా
పాదార్ధమండకంప్రాహుః పదపాదేనచంద్రికాం॥
భాగస్యార్ధేనకలశ సముచ్ఛ్రాయోమతఃసమః ...
గుణసూత్రాస్యా ద్వితీయాఃపంచభూమికాః॥
యఃసిద్ధికామంకురుతే సర్వపాపవిమోచనం

తా॥ ధనము, సంతానము మొదలైనవి లభించునట్టి సిద్ధి కామముయొక్క లక్షణము చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 4 భాగములుచేసి అందు గర్భము 2 భాగములును చుట్టూ గోడ 1 భాగమును, భద్రముయొక్క విస్తారము 2 భాగములును, నిర్గమము 1 భాగమును. కర్ణము 1 భాగమును, దానిపై ప్రమాణమును రెట్టింపుగా చేసి దానిని 6 భాగములుచేసి, వేదికాబంధము 1 భాగమును, జంఘ 1 1/2 భాగమును, మేఖల అంతరపత్రము 3/4 భాగమును, జంఘ యెత్తు 4 3/4 భాగములును, గ్రీవ విస్తారము 3 భాగములును, 1/4 భాగము యెత్తును, అండకము 1/2 భాగమును, 1/4 భాగము చంద్రికను, కలశము 1 2 భాగమును చేయవలయును. ...
రెండవ అంతస్తు ... ఐదవ అంతస్తువరకు నిర్మించవలయును. ఇది అన్ని కోరికలను లభింపజేయును. సమస్తమైన పాపములను పోగొట్టును.

## 116. పంచచామరము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ నందిశాలగుణైర్యుక్త స్త్వక్తైకాగ్రోరుమంజరీః
మత్తాలంబంతతఃకుర్యాత్ సభవేత్ పంచచామరః॥ 85

తా॥ నందిశాలయందు ఉరుమంజరిని తీసివేసి మత్తాలంబమును రచించినయెడల పంచచామరమగును.

## 117. పంచచామరము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథాభిధీయతేఽస్మాభిః ప్రాసాదఃపంచచామరః
యోభక్త్యాకారయత్యేనం సచిరందివిమోదతే॥
భక్తేద్వాదశభిఃక్షేత్రే చతురశ్రేసమంతతః
చతుర్భాగోభవేద్గర్భో భిత్తింభాగేనకల్పయేత్॥

అంధారికాతుభాగాద్వా బాహ్యభిత్తిస్తుభాగికీ
త్రిభిర్భాగైర్వినిష్క్రాంతం తేషుకార్యాశ్చతుష్కికాః॥
ద్విగుణంకథితంచోర్ధ్వ మానంఘంటాండకాన్వితం
ప్రమాణేనవిధాతవ్యో దశభాగాస్తులోదయః॥
త్రిదశో వేదికాబంధో జంఘాస్యాత్ ... షడంశకః
మేఖలాంతరపత్రేచ భాగేనైకేనకారయేత్॥
పదత్రయేణస్యాదూర్ధ్వం శృంగంసకలశాండకం
శిఖరావింశతిః కార్యాః సంభిన్నాఃసర్వమండకైః॥
శృంగాదధో విధాతవ్యం మల్లచ్ఛాద్యంమనోహరం
ఏవంసర్వంచతుష్కేషు మల్లచ్ఛాద్యానికారయేత్॥
ఛాద్యకైఃపంచభిఃకార్యోమధ్యేప్రాసాదనాయకః
ఘంటికానాంసముచ్ఛ్రాయఃసపాదంపదమిష్యతే॥
ఘంటాయాఃసార్ధభాగేన గ్రీవాయాశ్చపదాధికా
కర్తవ్యామలసారీతు పాదోనాంశాయచంద్రికాం॥
ద్విపదఃకలశఃకార్యోబీజపూరసమన్వితః
పంచఘంటావృతంక[illegible]
అతీతవిస్మయాః

తా॥ పంచచామరము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. దీనిని రచించినవారు చిరకాలము స్వర్గమున సంతోషముతో నుందురు. చతురశ్రప్రదేశమును 12 భాగములుచేసి మధ్యగర్భము 4 భాగములును, గోడ 1 భాగమును, అంధకారిక 2 భాగములును, వెలుపలి గోడ 1 భాగమును చేయవలయును. నలువైపుల 3 భాగములచొప్పున నిర్గమము చేయవలయును. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలయును. దూలము పైభాగమువరకు 10 భాగముల యెత్తును చేయవలయును. వేదికాబంధము 3 భాగములును, జంఘ 6 భాగములును,

శృంగము కలశము ఇవి 3 భాగములును, శిఖరములు 20 చేయవలెను అండకములను ముందుచేసి తర్వాత శిఖరములను రచించవలయును. ఆ శృంగముల క్రింద మల్లచ్ఛాద్యమును రచించవలయును. ఇట్లు నాలుగింటియందును మల్లచ్ఛాద్యములను రచించవలయును. ఛాద్యకములను ఐదింటిని చేయవలయును వానిలో మధ్యప్రాసాదముయొక్క ప్రధాన ఛాద్యమును రచించవలయును. ఘంటయొక్క యెత్తు 1 1/4 భాగమును, ఘంటను 1 1/2 భాగములు చేసి గ్రీవకు 1/4 భాగమును విడగొట్టవలయును. ఆమలసారము చంద్రికను 3/4 భాగమును, కలశము 2 భాగములును బీజపూరముతో రచించవలెను. ఘంటలు 5 కలసియున్నట్లు రచించవలయును. దీనిని పంచచామరమందురు.

(అనుబంధము 83, 84, పటములు చూడుడు)

## 118. నందిఘోషము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ రతిదేహ త్రిభూమ్యూర్ధ్వే కుర్యాచ్ఛిఖరోత్తమం
నందిఘోష స్తదానామ కర్తవ్యః సర్వదైవతే॥ 86

తా॥ రతిదేహప్రాసాదమునందు మూడవఅంతస్తుపైన శిఖరమును రచించిరేని నందిఘోషమగును.

## 119. నందిఘోషము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ నందిఘోషమథ బ్రూమో విపక్షభయనాశనం॥
యఏనంభక్తితః కుర్యాత్ సభవేదజరామరః
చతురశ్రీకృతే క్షేత్రే చతుర్భాగవిభాజితే॥
భద్రం ద్విభాగవిస్తారం కుర్యాద్భాగవినిర్గమం
భిత్తిరత్ర నకర్తవ్యా దిశికస్యామపిధ్రువం॥

కుర్వీతరాజపీఠంతు వేదిచంద్రావలోకనం
దిక్షుక్రమోఽయంసర్వాసు త్యక్త్వామార్గచతుష్టయం॥
విస్తారసదృశోచ్ఛ్రాయా కర్తవ్యాపూర్వభూమికా
వక్ష్యమాణైర్విభాగైశ్చ విప్రభజ్యాప్రమాణతః॥
భాగేనరాజపీఠంస్యాస్యాద్ వేదిర్భాగద్వయేనచ
భాగేనచంద్రాలోకఃస్యాదర్ధేనాసనపట్టకః॥
స్తంభోచ్ఛ్రాయస్త్రిభిర్భాగై స్తతోభాగేనశీర్షకం
పట్టోచ్ఛ్రాయోభాగమేకం స్యాచ్చతుర్వింశతిర్ధరాః॥
నానాసంస్థైఃపల్లవైశ్చ చారుకర్మకరానవై॥
ద్వితీయాభూమికాకార్యా స్తంభైఃషోడశభిర్యుతా॥
ఏవంభూమాద్వితీయాయా మపికర్మవిధీయతే
స్తంభైశ్చతుర్భిఃసంయుక్తా తృతీయాయాంచతుష్కికా॥
నందిఘోషఃకృతోయేన సూర్యతేజాఃసజాయతే
కర్మక్షయాత్తనుంత్యక్త్వా ప్రాప్నోతిపరమంపదం॥

తా॥ నందిఘోషమును రచించినవారు దేవత్వమును బొందుదురు. చతురశ్రప్రదేశమును 4 భాగములుచేసి అందు భద్రము యొక్క విస్తారము 2 భాగములును, నిర్గమము 1 భాగమును చేయవలయును. గోడ అవసరములేదు. అన్ని దిశలయందు రాజసేనమును వేది చంద్రావలోకనమును వదలిపెట్టి నాలుగువైపుల ద్వారములను ఉండునట్లు విస్తారముతో సమానమైన యెత్తున మొదటి అంతస్తును రచించవలయును. రెండవ అంతస్తున రాజపీఠము 1 భాగమును, వేది 2 భాగములను, చంద్రావలోకము 1 భాగమును, పీఠపట్టము 1/2 భాగమును, స్తంభము యెత్తు 3 భాగములును, శిఖరము 1 భాగమును పట్టము 1 భాగమును ఇట్లు 24 ధరలను రచించవలయును. ఆ ధరలు అనేక విధములైన పల్లవములు మొదలైనవానితో చేయవలయును

రెండవ భూమికయందు 16 స్తంభములను రచించవలయును. మొదటి అంతస్తున చేసినట్లే అంతముగా చేయవలెను. మూడవ అంతస్తున 4 స్తంభములును, 4 థరలను రచించవలెను. ఇది నందిఘోషము.

(అనుబంధము 85, 86వ పటములు చూడుడు)

## 120. మనూత్కీర్ణము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ అష్టాంశైశ్చకృతంక్షేత్రం వ్యాప్తభద్రమలంకృతం
అష్టకర్ణోదకైర్యుక్తం తద్రూపంశిఖరోత్తమం॥ 87
మనూత్కీర్ణంతదానామ చతుర్దశమనుప్రియం
విధేర్విష్ణోరవేః కుర్యాచ్ఛివస్యాపివిశేషతః॥ 88

తా॥ సమచతురశ్రమును 8 భాగములుచేసి 8 భద్రములను, 8 కర్ణములు జలాంతరములతోను, అటులే శిఖరమును రచించిరేని మనూత్కీర్ణమగును. బ్రహ్మ, విష్ణు, సూర్య, శివ మందిరములను మాత్రమే రచించవలయును. ఇది చతుర్దశమనువులకు ప్రీతికరము.

## 121. మనూత్కీర్ణము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదమభిధాస్యామో మనూత్కీర్ణంమహాద్భుతం
విమృశ్యబుద్ధ్యానిపుణం నిర్మితంప్రాక్ స్వయంభువా॥
క్షేత్రేషడ్భాగవిస్తారే గర్భంభాగచతుష్టయే
కుర్వీతవృత్తంమధ్యేచ నవభిర్వృత్తమాలిఖేత్॥
అష్టౌచరథికాః కార్యాః క్షేత్రేదిక్షువిదిక్షువా
ఊర్ధ్వమానమథబ్రూమో ద్విగుణంద్విపదాన్వితం॥
ఛాద్యంయావద్విధాతవ్యం తత్సార్ధాంశైకపంచకం
భాగానష్టార్ధసహితాన్ కుర్యాదూర్ధ్వంతులోదయాత్॥

సార్ధభాగేనకర్తవ్యో వేదీబంధశ్చశోభనః
భాగద్వయంతతఃసార్ధం కార్యాజంఘాసముచ్ఛ్రితిః॥
భాగార్ధంహీరకంకుర్యాత్ మనోజ్ఞంకర్ణికాన్వితం
మేఖలాంతరపత్రేచ భాగేనైకేనకారయేత్॥
శృంగోచ్ఛ్రాయస్తతఃకార్యః సార్ధభాగద్వయోన్మితః
మధ్యేనసర్వశృంగాణాం మస్తకేవృత్తమాలిఖేత్॥
షడ్భాగవిస్తృతంతస్య స్యాత్ షడ్భాగముచ్ఛ్రితం
యావన్మాత్రావరేప్రోక్తా తావత్కార్యాచమంజరీ॥
త్రిభౌమంపంచభౌమంచ విచిత్రంకారయేదిమం
గ్రీవాస్యాద్భాగపాదేన విస్తారాద్ద్విపదాయతా॥
పాదహీనంపదంకుర్యా దండకంమనుసంభవే(త్)
చంద్రికాభాగపాదేన పాదోనంకలశఃపదం॥
ప్రాసాదంమనసాప్యేవం మనూత్కీర్ణంకరోతియః
సగత్వాభవనంశంభోర్గాణాపత్యమవాప్నుయాత్॥

తా॥ మనూత్కీర్ణముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 6 భాగములుచేసి గర్భము 4 భాగములును, మధ్య 9 భాగములకు వృత్తమును రచించవలెను. దిశలయందును కోణములయందును మొత్తము 8 రథికలను రచించవలెను. విస్తారమునకు రెట్టింపును మరియు 2 భాగములు అధికమును చేయవలెను. ఛాద్యము 5 1/2 భాగములను, దూలపైనుండి యెత్తు 8 1/2 భాగములును, వేదీబంధము 1 1/2 భాగమును, జంఘ 2 1/2 భాగములును హీరము 1/2 భాగమును, చక్కని కర్ణికతో రచించవలెను. మేఖల అంతరపత్రము 1 భాగమును, శిఖరము 2 1/2 భాగములును అన్ని శిఖరములకుమధ్య శిఖరమును 6 భాగములు గుండ్రముగాను, 6 భాగముల యెత్తుతోను రచించవలెను. గర్భముతో సమానముగా మంజ

విచిత్రముగా రచించవలెను. గ్రీవ 1/4 భాగము విస్తారమును ఎత్తు 2 భాగములును, అండకము 3 4 భాగమును, చంద్రిక 1/4 భాగమును కలశము 3/4 భాగమును చేయవలెను. ఇట్లు రచించినవారు శివలోకమున ప్రమధగణమ్మున కధిపతులైయుందురు.

(అనుబంధము 87, 88 పటములు చూడుడు)

## 122. సుప్రభము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ విశాలేకర్ణ తిలకం కర్ణోర్ధ్వే తిలకంతథా
చతుః ప్రాగ్గ్రీవసంయుక్తః సుప్రభోనామనామతః 89

తా॥ విశాలమునందు కర్ణ తిలకమును, కర్ణములపైన తిలకమును ప్రాగ్గ్రీవములు 4ను రచించిరేని సుప్రభమగును.

## 123. సుప్రభము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథసుప్రభనామానం ప్రాసాదమభిదధ్మహే
యంకృత్వాప్రభయాన్యేషాం ప్రభాహంతిరవిర్యథా॥
చతురశ్రీకృతేక్షేత్రే ద్వాదశాంశవిభాజితే
కుర్యాచ్చతుష్పదంగర్భం విస్తారాయామతఃసమః॥
ప్రాసాదార్ధంభవేత్కంఠః కందభద్రంపదద్వయం
భ్రమంతీద్విపదాదిత్థు చతస్రష్వపిశోభనా॥
పదికాబాహ్యభిత్తిస్తు ద్విపదాకర్ణవిస్తృతిః
చతుష్పదంమధ్యభద్రం వినిష్క్రాంతంత్రిభిఃపదైః॥
అస్యైవాంతఃపునఃకార్యా ద్విపదాతుచతుష్కికా
శాలాయాఃపార్శ్వతఃకుర్యా దతిభద్రద్వయంబుధః॥
తయోఃపాదేననిష్కాసం పార్శ్వయోరుభయోరపి
పార్శ్వభద్రస్యకర్ణస్య చాంతరంపదికేనయేత్॥

జాలైర్విచిత్రితంకుర్యా న్మధ్యేజ్యోతిర్యథాభవేత్
ఏవందిక్షుసమస్తాసు కుర్వీతైనమనుక్రమాత్॥
ప్రాసాదభాగవిధినా పురఃకుర్వీతమండపం
చతస్రృష్వపిమంజర్యోదిక్షుకార్యాయథాక్రమమ్॥
లీయమూలసజంఘాత్రా స్వసార్ధాచయథాదిమం
ఉచ్ఛ్రాయోమూలవిస్తారాద్ ద్విగుణోద్వికలాధికః॥
తులోదయోదశపదో మంజరీషోడశాంశికా
వేదీబంధసముత్సేధః సార్ధభాగద్వయోన్మితః॥
పంచభాగోచ్ఛ్రితాజంఘా హీరంభాగసమున్నతం
సార్ధభాగేనకర్తవ్యే మేఖలాంతరపత్రకే॥
కర్ణశృంగసముత్సేధః కలశాంతస్త్రిభాగికః
దిఙ్మంజరీతుకర్తవ్యా విస్తారేణచతుష్పదా॥
ఉదయేనవిధాతవ్యా పంచభాగప్రమాణతః
గ్రీవాపదస్యపాదేన కలశోఽర్ధపదంభవేత్॥
విస్తారోమూలమంజర్యాః కర్తవ్యోదశభాగికః —
భాగత్రయోదశోత్సేధో గ్రీవాపాదోనభాగికా॥
అండకంసార్ధభాగేన ద్విపదాకలశోచ్ఛ్రితిః
దశాంశేపట్కతోమూల స్కంధపక్షోంతశోభవేత్॥
విస్తారోమూలమంజర్యాః కర్తవ్యోదశభాగికః
నవాండకోఽయంకర్తవ్యః ప్రాసాదఃశుభలక్షణః॥
యఃప్రాసాదమిమంకుర్యాత్ సుప్రభంభక్తిమాన్నరః
దివ్యతేజోవహఃసస్యాద్ దేహాంతేముక్తిమాప్నుయాత్॥

తా॥ సుప్రభప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి గర్భము 4 భాగములు, ప్రాసాదము యొక్క విస్తారములో సగము కందము, ఆ కందమునకు భద్రము 2

భాగములు, నలువైపుల భ్రమంతిక 2 భాగములు, వెలుపలి గోడ 1 భాగము ఇట్లు చేయవలెను. కర్ణముయొక్క విస్తారము 2 భాగములు, మధ్యభద్రము 4 భాగములు, ఆ భద్రముయొక్క నిర్గమము 3 భాగములు, దీనిలోపల 2 భాగములచొప్పున శాలలయొక్క పార్శ్వముల యందు అతిభద్రములను రెంటిని రచించవలెను. అతిభద్రములయొక్క నిర్గమము 1 భాగము, ప్రక్కలనున్న భద్రములయొక్కయు, కర్ణములయొక్కయు మధ్య 1 భాగము గవాక్షలతో విచిత్రముగా రచించవలెను. ఇట్లు అన్నివైపుల రచించవలెను. ప్రాసాదముయొక్క ప్రమాణము ననుసరించి ముందు మండపమును రచించవలెను. నలువైపుల మంజరులను కల్పించవలెను. విస్తారములో సగము జంఘను రచించవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. విస్తారమునకు రెట్టింపుచేసి మరల 1 భాగముతో 8వ వంతును కలిపి యెత్తుచేయవలెను. మూలము యెత్తు పైభాగమువరకు 10 భాగములు, మంజరి 16 భాగములు, వేదీబంధము 2 1/2 భాగములు, జంఘ 5 భాగములు, హీరము 1 భాగము మేఖల అంతరపత్రము 1 1/2 భాగము, కర్ణశృంగముల యెత్తు కలశముతోగూడ 3 భాగములు, నలుదిశలయందు మంజరులను 4 భాగముల విస్తారమును, 5 భాగముల యెత్తును చేయవలయును. గ్రీవ 1/4 భాగము, కలశము 1/2 భాగము ఇట్లు మంజరులను చేయవలయును. మూలమంజరియొక్క విస్తారము 10 భాగములను ఎత్తు 13 భాగములను చేయవలయును. గ్రీవ 3/4 భాగము, అండకము 1 1/2 భాగము, కలశము 2 భాగములు, ఇట్లు మూలమంజరిని చేయవలెను. మూలమంజరియొక్క 10 భాగములలో స్కంధము 6 భాగములు చేయవలెను (అనగా సగముకంటె యెక్కువ) 9 అండకములతో దీనిని రచించవలెను. ఈ ప్రాసాదమును రచించినవారు దివ్యతేజస్సు కలిగి దేహాంతమున మోక్షమును పొందుదురు.

(అనుబంధము 89, 90, పటములు చూడుడు)

# 124. సురానందము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ భూమిజంవైమల్లతలం కర్ణేకూటంచద్రావిడం
వరాటంతుప్రతిరథే సురానందఃస ఉచ్యతే॥ 90

తా॥ భూమిజ ప్రాసాదముయొక్క లక్షణములతో మల్లతలమును, కర్ణకూటములు ద్రావిడ పద్ధతితోను, ప్రతిరథములు వరాట పద్ధతితోను చేసినచో సురానందమగును.

# 125. సురానందము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ సురానందమథబ్రూమః ప్రాసాదమతిసుందరం
చతురశ్రంసమంక్షేత్రం దశధాప్రవిభాజయేత్॥
షడ్భాగోగర్భవిస్తారో ద్వాభాగాభిత్తివిస్తృతిః
॥
కర్తవ్యఃసార్ధభాగేన భాగార్ధేనజలాంతరం
ప్రత్యంగస్థానకంకుర్యాత్ సవృత్తంపదభాగికం॥
శాలాస్త్రిభిఃపదైఃకార్యాః శుభరూపాశ్చతుర్దిశం॥
శాలాయాఃపార్శ్వయోఃకార్యో వారిమార్గఃపదార్ధకః
పరస్పరంతునిష్కాసో భాగంభాగంవిధీయతే॥
ఊర్ధ్వమానంవిధాతవ్యం విస్తారాద్ద్విగుణంబుధైః
గర్భచ్ఛాద్యంపదాన్యష్టౌ భాగాద్వాదశమంజరీ॥
వాస్తువిస్తారపాదేన వేదీబంధోవిధీయతే
చతుష్పదోర్ధ్వతోజంఘా భాగార్ధంగ్రాసపట్టికా॥
మేఖలాంతరప తేచ విధాతవ్యేపదోచ్ఛ్రితే
కోణాద్రావిడకూటస్య వృత్తస్తంభావరాటకాః॥

మధ్యాంగతోరణానాంస్యు రంశకశ్చతురోభవేత్
షట్పదఃస్కంధవిస్తారో గ్రీవాభవతిభాగికీ॥
శిరఃసార్ధంపదంజ్ఞేయం భాగమేకంచచంద్రికా
కలశోఽంశద్వయోచ్ఛ్రాయః కార్యఃపల్లవభూషితః॥
యఃకరోతిసురానందం వరదాస్తస్యమాతరః
సురాస్తస్యహ్యతీష్టార్థ మపమృత్యుంహరంతిచ॥

తా॥ సురానందము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 10 భాగములుచేసి అందు గర్భము 6 భాగములును, వెలుపల గోడ 2 భాగములును చేయవలెను. నాలుగుమూలలయందు కర్ణకూటములు 1 1/2 భాగము చొప్పునను, జలాంతరము 1/2 భాగము చొప్పునను, తరువాత పంజరములు 1 భాగము చొ॥న గుండ్రముగాను, మధ్యశాల 3 భాగములును. శాల యొక్కయు పంజరముయొక్కయు మధ్య జలాంతరము 1/2 భాగమును, అనగా శాలయొక్క రెండువైపులను చేయవలయును. కర్ణము పంజరము శాల వీనియొక్క నిర్గమము 1-1 భాగము చేయవలయును. ఎత్తును చెప్పుచున్నాడు. విస్తారమునకు ద్విగుణముగా యెత్తును చేయవలెను. గర్భముయొక్క ఛాద్యము 8 భాగములును, మంజరి 12 భాగములును విస్తారమును యిష్టానుసారముగా చేసికొని యెత్తు 1 భాగము వేదికయును, దానిపైన జంఘ 4 భాగములును, దానిపైన గ్రాసపట్టిక 1/2 భాగమును, మేఖల అంతరపత్రము 1 భాగమును, మూలలయందు ద్రావిడ పద్ధతితో కూటములను రచించవలయును. స్తంభములు వరాటక పద్ధతితో గుండ్రముగా చేయవలెను. మధ్యను తోరణము 4 భాగముల యెత్తు చేయవలెను. స్కంధముయొక్క విస్తారము 6 భాగములును, గ్రీవ 1 భాగమును, శిఖరము 1 1/2 భాగమును, చంద్రిక 1 భాగమును, కలశము యెత్తు 2 భాగములును, పల్లవములతో చక్కగా రచించవలెను. ఈ సురానందము నెవ్వరు రచింతురో వారికి మాతృకా

దేవతలు అపమృత్యు దోషమును బోగొట్టి సంపూర్ణాయుష్యము నిత్తురు. (అనుబంధము 91 పటము చూడుడు)

## 126. హర్షణము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ కర్ణశృంగంభద్రశృంగం సంత్యజేత్పంచచామరే
సింహకర్ణద్వయంకార్యం హర్షణోనామనామతః॥ 91

తా॥ పూర్వముచెప్పిన పంచచామరమునందు కర్ణశృంగమును భద్రశృంగమును తీసివేసి సింహకర్ణములను రెంటిని రచించినచో హర్షణమగును.

## 127. హర్షణము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ అథహర్షంప్రవక్ష్యామి సర్వలోకప్రహర్షణం
నిత్యంవసతియత్రశ్రీః స్థానంయద్విశ్వకర్మణః॥
చతురశ్రీకృతేక్షేత్రే భక్తేఽష్టాదశభిఃపదైః
ప్రతికోణంవిధాతవ్యాః కర్ణాభాగైస్త్రిభిస్త్రిభిః॥
ద్విపదంకర్ణభద్రంచ భాగేనైకేననిర్గతం
వారిమార్గంపదంకుర్యాత్ ప్రవేశాయామతఃసమం॥
త్రిభాగమస్యప్రత్యంగం పదద్వితయనిర్గమం
వేదిచంద్రావలోకాఢ్యం ప్రత్యంగేకర్మకల్పయేత్॥
చతుష్పదంమధ్యభద్రం ద్విపదంచాస్యభద్రకం
వినిర్గతంచభాగేన విదధీతవిచక్షణః॥
వలభ్యశ్చద్విభాగాఃస్యుః స్వానురూపాశ్చతుర్దిశం
గర్భోభాగైశ్చతుర్భిస్తు వలభీనాంవిధీయతే॥
ద్విపదాబాహ్యతోభిత్తిర్ద్విపదాచభ్రమంతికా
కందఃస్యాద్దశభిర్భాగైర్గర్భః షట్త్రింశతాపదైః॥

ఊర్ధ్వప్రమాణమేతస్య స్యాచ్చత్వారింశతాపదైః
భాగైఃషోడశభిశ్చాస్య విదధ్యాచ్ఛాదనంశుభం॥
వేదీబంధఃపంచపదో జంఘాచాష్టపదాభవేత్
మేఖలాంతరపత్రంచ కుర్యాద్భాగత్రయాద్బుధః॥
ఊర్ధ్వమంతరపత్రంస్యాద్ విధాతవ్యంయథాక్రమం
వలభీసంవృతిఃప్రాజ్ఞైరుచ్ఛ్రాయాత్ పంచభాగికీ॥
సశృంగైఃసింహకర్ణైశ్చ కార్యాభాగసముచ్ఛ్రితిః
వర్ధమానేనకర్తవ్యా త్రిపదాకర్ణమంజరీ॥
ఊర్ధ్వంపదేభ్యస్త్రిభ్యఃస్యాద్ భాగేనకలశాండకం
విస్తారాత్షోడశపదా కర్తవ్యామూలమంజరీ॥
ఊర్ధ్వంవింశతిభాగాస్య స్కంధోనవపదాయతః
గ్రీవాసార్ధపదంకార్యా తతోద్విపదమండకం॥
చంద్రికైకేనభాగేన కలశస్త్రిపదాత్తతః
హర్షణఃక్రియతేయత్ర సదేశఃసుఖమేధతే॥
క్షేమంగోబ్రాహ్మణానాంస్యాత్ పూర్ణకామశ్చపార్థివః॥

తా॥ విశ్వకర్మ వలన లోకమునకు హర్షము కలిగించునట్టిది యును లక్ష్మీదేవి నివసించునట్టిదియును అగు హర్షణము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 18 భాగములు చేసి కర్ణము 3 భాగముల చొప్పున అన్ని మూలలయందును రచించ వలయును. కర్ణములయందు భద్రములు 2 భాగముల చొప్పునను, వానియొక్క నిర్గమము 1 భాగము చొప్పునను చేయవలెను. జలాంతరము 1 భాగము ప్రవేశమును ఆయామమును సమముగా చేయవల యును. పంజరములుకూడ 3 భాగముల విస్తారమును వాని నిర్గమము 2 భాగములును, వేదిక చంద్రావలోకనముకూడ పంజరమునందు కల్పించవలయును. మధ్యభాగము 4 భాగములును, దాని యొక్క

భద్రము 2 భాగములును, భద్రముయొక్క నిర్గమము 1 భాగమును చేయవలయును. వలభి 2 భాగములు నలుపైపుల రచించవలయును. గర్భము 4 భాగములును, వెలుపలి గోడ 2 భాగములును, భ్రమంతిక 2 భాగములును చేయవలయును. కంఠము 10 భాగములును, గర్భము 6.6 భాగములును చేయవలయును. ఇక యెత్తును చెప్పుచున్నాడు. 40 భాగములు యెత్తునుచేసి 16 భాగములు ఆచ్ఛాదనమును, వేదీబంధము 5 భాగములును, జంఘ 8 భాగములును, శాలయును అంతరపత్రమును 3 భాగములును, వలభిచుట్టూ 5 భాగముల యెత్తునను, సింహకర్ణములతోను శిఖరములతోను 1 భాగము చేయవలెను. వర్ధమానముతో కర్ణమంజరి 3 భాగములు చేయవలయును, దానిపైన 3 భాగములు అండకము ను కలశమును చేయవలయును. మూలమంజరి యొక్క విస్తారము 16 భాగములును, యెత్తు 20 భాగములును చేయవలయును. స్కంధము 9 భాగముల యెత్తును చేయవలయును. గ్రీవ 1 1/3 భాగమును, అండకము 2 భాగములును, చంద్రిక 1 భాగమును కలశము 3 భాగములును చేయవలయును. ఈ హర్మ్యమును ఎచ్చట చేయుదురో ఆ దేశము గోవులు మొదలు బ్రాహ్మణులవరకు సమస్త జీవులు సుఖముగానుందురు.

(అనుబంధము 92, 93 పటములు చూడుడు)

## 128. దుర్ధరము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ సిద్ధార్థశ్చభవేత్పూర్వం సింహకర్ణైఃసదుర్ధరః
దుర్ధరోనామగుణతః శివసాన్నిధ్యదఃసదా॥ (92)

తా॥ సిద్ధార్థమునందు సింహకర్ణములను రచించినచో దుర్ధరమగును. ఇది శివసాన్నిధ్యము లభించునంతటి పుణ్యముకలది.

# 129. దుర్ధరము మఱియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ఇదానీందుర్ధరంబ్రూమః ప్రాసాదంశుభలక్షణం॥
చతురశ్రేసమేక్షేత్రే చతుర్వింశతిభాజితే
కర్ణాఃస్యుఃషట్పదాఃకార్యా ప్రత్యంగంచద్వయంభవేత్॥
కర్తవ్యాష్టపదాశాలా నిర్గమోఽస్యచతుష్పదః
పదద్వయంవినిష్క్రాంతా సర్వతఃకర్ణశోభితా॥
ద్విపదాబాహ్యభిత్తిః స్యాచ్చతుర్భాగాంధకారికా
ద్విపదాకందభిత్తిస్తు గర్భశ్చాష్టపదాయతః॥
షట్పదాకంఠశాలాచ కందకర్ణాఃపదత్రయం
ఊర్ధ్వప్రమాణంవిస్తారాత్ ద్విగుణంద్విపదాధికం॥
వింశత్యంశస్తులోచ్ఛ్రాయః శిఖరంత్రింశతాపదైః
కుంభంసార్ధద్విభాగశ్చ కలశోభాగముచ్ఛ్రితిః॥
భాగార్ధేనాంతరంవక్త్రం భాగేనైకేనమేఖలా
దశభాగోచ్ఛ్రితాజంఘా హీరకంభాగికంభవేత్॥
భాగైశ్చతుర్భిఃకర్తవ్యం మేఖలాద్వితయంతతః
అధస్తాదూర్ధ్వపట్టస్య తలపట్టస్యచోపరి॥
భవేత్షోడశభిర్భాగైరనయోరంతరంద్వయోః
ద్విపదోవేదికాబంధో వేదికార్యాచతుష్పదా॥
ఆసనంచైకభాగేన స్తంభఃపంచపదైర్భవేత్
భాగేనైకేనభరణం శీర్షకంభాగమున్నతం॥
పట్టోభాగద్వయోత్సేధ చ్ఛాద్యంచత్రిపదాయతం
మూలభద్రాణిచత్వారి కోణభద్రాణికంభవేత్॥
కర్ణశృంగాణిదశచ ద్వయమస్మింశ్చతుర్దిశం
గ్రీవాంభాగసమంతానాం శృంగాణాంత్రిపదోచ్ఛ్రితిః॥

షట్పదాకర్ణమంజర్యః సప్తభాగసముచ్ఛ్రితాః
గ్రీవార్ధభాగికీభాగఃస్యాదుచ్ఛ్రాయోఽండకస్యతత్ ॥
పదత్రయోన్నతాకార్యా సింహాకర్ణాశ్చతుష్పదాః
మధ్యేభద్రేతదుత్సేధో విస్తారాదర్ధభాగికః॥
విస్తారోమూలమంజర్యాః పదైఃషోడశభిర్భవేత్
అష్టాదశభీరుచ్ఛ్రాయో గ్రీవాసార్ధపదోచ్ఛ్రితా॥
అండకంద్విపదంకార్యం చంద్రికాపదముచ్ఛ్రితా
కలశంత్రిపదంవిద్యాత్ సర్వలక్షణసంయుతం॥
అండకైఃసప్తదశభిః ప్రాసాదోదుర్ధరోభవేత్
దుర్ధరంయఃకరోతీహ భర్గాచ్ఛక్తింసమాప్నుయాత్ ॥
కాలేనశివసాయుజ్యం నిధనేచప్రపద్యతే॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 24 భాగములుచేసి కర్ణములు 6 భాగములును, పంజరములు 2 భాగములును, శాల 8 భాగములును, శాలయొక్క నిర్గమము 4 భాగములును, కర్ణములయొక్క నిర్గమము 2 భాగములును చేయవలయును. వెలుపలి గోడ 2 భాగములును, అంధకారిక 4 భాగములును, కందముయొక్క గోడ 2 భాగములును. గర్భము 8 భాగములును, కందశాల 6 భాగములును, కందకర్ణములు 3 భాగములును చేయవలయును. ఎత్తు విస్తారమునకు రెట్టింపును మరియు 2 భాగము లధికమును 50 భాగములు, దూలము ఎత్తు 20 భాగములును. అచ్చటినుండి శిఖరము 30 భాగములును చేయవలెను. కుంభము 2 1/2 భాగములు, కలశము 1 భాగమును, అంతరపత్రము 1/2 భాగము, మేఖల 1 భాగము, జంఘ 10 భాగములు, హీరకము 1 భాగము, రెండు మేఖలలు 4 భాగములు, పైపట్టమునకు దిగువను క్రింది పట్టమునకు పైనను యీ రెంటి సందున 16 భాగములును, వేదికాబంధము 2 భాగములును, వేది 4 భాగములును, పీఠము 1 భాగమును, స్తంభము 5 భాగములును, భరణము 1 భాగమును, శిఖ

రము 1 భాగమును, పట్టము 2 భాగములును, ఛాద్యము 3 భాగములును. ప్రధాన భద్రములు 4ను, కోణభద్రములు 4 ను, కర్ణశృంగములు ఒక్కొక్క మూలకు 3 చొప్పున 12ను, గ్రీవ 1 భాగము, శిఖరములు 3 భాగములు చేయవలయును. కర్ణమున మంజరిని 6 భాగముల విస్తారమును యెత్తు 7 భాగములు చేయవలయును. గ్రీవ 1/2 భాగమును, అండకము 1 భాగమును, సింహకర్ణములు విస్తారము 4 భాగములును, యెత్తు 3 భాగములును, మధ్యభద్రము విస్తారములో సగము యెత్తును, మూలమంజరియొక్క విస్తారము 16 భాగములును, యెత్తు 18 భాగములును, గ్రీవ 1 1/2 భాగమును, అండకము 2 భాగములును, చంద్రిక 1 భాగమును, కలశము 3 భాగములును, ఇట్లు సమస్తమైన లక్షణములతోను 17 అండకములతోను రచించవలెను. ఈ ప్రాసాదమును రచించినవారు శివలోకమును బొంది శివునివలన శక్తిని పొందుదురు.

(అనుబంధము 94, 95 పటములు చూడుడు)

## 130. విజయము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ శ్రీవత్సశ్చభవేత్పూర్వం విజయోభద్రకోద్గమైః
విజయంసర్వకళ్యాణ మాయురారోగ్యవర్ధనం॥ 93

తా॥ శ్రీవత్సమునందు భద్రములను యెత్తుగా రచించినచో విజయమగును. ఇది అన్ని శుభములనిచ్చును. ఆయుష్యము ఆరోగ్యము వృద్ధిచేయును.

## 131. దుర్జయము (విజయము) మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ఇదానీందుర్జయంబ్రూమః ప్రాసాదంశత్రుమర్దనం॥

యంకృత్వాదుర్గయోలోకో భవేత్ క్రీడతిచక్షితౌ
చతురశ్రీకృతేక్షేత్రే పంచభాగవిభాజితే॥
గర్భంనవపదంకుర్యాద్ భిత్తిఃషోడశభాగికీ
భాగేనకర్ణరథికా భాగాభ్యాంమధ్యమేరథః॥
భాగేననిర్గమస్తస్య విధిరేషచతుర్దిశం
భద్రకర్ణాంతరేకుర్యాద్ వారిమార్గంపదార్ధకం॥
ఊర్ధ్వమానంవిధాతవ్యం తమస్మిన్ దశభాగికం
వేదిబంధఃసపాదాంశౌ జంఘాంశౌపాదసంయుతౌ॥
మేఖలాంతరపత్రేతు పదార్ధేనప్రకల్పయేత్
శిఖరస్త్రిపదైఃసార్ధం భాగషట్కోచ్ఛ్రితోభవేత్॥
ద్విపదఃస్కంధవిస్తారో రేఖాపద్మదలాకృతిః
భూమయఃపంచకర్తవ్యా న్యూనమానాయథాక్రమం॥
ప్రథమాసార్ధభాగాన్యా పదపాదోనితాక్రమాత్
స్కంధఃపాదోనభాగేన స్యాద్గ్రీవార్ధపదేనచ॥
అండకంత్వేకభాగేన కర్పరంచార్ధభాగికం
భాగోత్సేధస్తుకలశః సమవృత్తఃసుశోభనః॥
దుర్జయఃక్రియతేయత్ర పురేవానగరేఽథవా
నభవేత్తత్రదుర్భిక్షం నచవ్యాధికృతంభయం॥

తా॥ దుర్జయముయొక్క లక్షణము చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 5 భాగములుచేసి అందు గర్భము 3 భాగములను వెలుపలి గోడ 1-1 భాగమును చేయవలయును. కర్ణమున రథిక 1 భాగమును, నడుమ రథము 2 భాగములును, దానియొక్క నిర్గమము 1 భాగమును, భద్రముయొక్కయు, కర్ణముయొక్కయు నడుమ జల మార్గము 1/2 భాగము చొప్పునను చేయవలయును. విస్తారమునకు

ంధము 1 1/4 భాగమును, జంఘ 2 1/4 భాగములను, మేఖల
ంతరపత్రము 1/2 భాగమును, శిఖరము ఎత్తు 6 భాగములును,
స్తారము చేయవలయును. స్కంధముయొక్క విస్తారము 2 భాగము
లను, రేఖ పద్మదలమువలె నుండవలెను. దీనిని 5 అంతస్తులు చేయ
లయును. ఒక్కొక్క అంతస్తునకు 1/4 భాగము యెత్తు తగ్గుచుండ
లెను. మొదటి అంతస్తు 1 1/2 భాగమును, రెండవ అంతస్తు 1 1/4
గమును, మూడవ అంతస్తు 1 భాగమును, నాల్గవ అంతస్తు 3/4
గమును, ఐదవ అంతస్తు 1/2 భాగమును చేయవలెను. స్కంధము
/4 భాగమును, గ్రీవ 1/2 భాగమును, అండకము 1 భాగమును,
ఖరము 1/2 భాగమును, కలశము 1 భాగమును సమానమైన గుండ్ర
ముతో రచించవలయును. ఈ దుర్జయమును రచించిన పట్టణమున
ాని గ్రామమునగాని దుర్భిక్షము, వ్యాధి మొదలైనవియుండవు.

## 132. త్రికూటము

పరాజిత 163వ సూ॥

శ్లో॥ కర్ణంచభవేద్భద్రం త్రికూటఃపంచభూమికః
దేశభాగోద్ఘాటనార్ధే శివఃస్యాద్దక్షిణాననః॥ 94

తా॥ కర్ణములయందుగూడ భద్రములను రచించి ఐదంతస్తులు
చేసిన యెడల త్రికూటమగును.

## 133. త్రికూటము మరియుక పద్ధతి

మరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ బ్రూమస్త్రీకూటంబ్రహ్మాద్యైః సేవితంత్రిదశైస్త్రిభిః
ఫలం క్రతుసహస్రస్య యేన మోక్షంచవిందతి॥
సంసాధ్యతుల్యత్రిభుజం క్షేత్రమిష్టప్రమాణతః
తతోఽస్యబాహుమేకైకం చతుర్భిర్విభజేత్ పదైః॥

ద్విభాగంమధ్యమంభద్రం భాగికీంకర్ణపట్టికాం
అర్ధేనగర్భమర్ధేన కుర్యాద్భిత్తిత్రయంబుధః॥
విస్తారంపంచధాభక్త్వా కుర్యాద్ద్విగుణముచ్ఛ్రయం
వేదిబంధోవిధాతవ్యః సపాదంభాగముచ్ఛ్రితః॥
జంఘాసపాదాభాగాద్వా కార్యాతస్యసముచ్ఛ్రితిః
మేఖలాంతరపత్రేచ భాగస్యార్ధేనకారయేత్॥
మంజరీభాగషట్కేన పంచభాగవిభాజితా
ఆసమంతాత్సమస్కంధః కార్యఃపూర్వోక్తవర్త్మనా॥
పాదభాగేనతుగ్రీవా మర్ధభాగేనచాండకం
చంద్రికాభాగపాదేన కలశంభాగముచ్ఛ్రితం॥
త్రికూటంకారయేద్యస్తు బ్రహ్మేశానహరిప్రియం
సిద్ధోభూత్వాపురీంతేషాం యాత్యసానాత్రసంశయః॥

తా॥ దేవతలకును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకును ప్రియమైన త్రికూటముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. సమానమైన చతురశ్ర ప్రదేశమునందు సమముగా త్రిభుజములను నిర్ణయించి, అంతట ఒక్కొక్క భుజమును 4 భాగములును, మధ్యభద్రము 2 భాగములును, కర్ణము 1 భాగమును చేయవలయును. మరియు త్రిభుజ క్షేత్రములలో మధ్య సగము గర్భమును గోడ సగమును చేయవలయును. విస్తారమును 5 భాగముచేసి దానికి రెట్టింపుగా యెత్తును చేయవలయును. వేదిబంధము 1 1/4 భాగమును, జంఘ 2 1/4 భాగములును, మేఖల అంతరపత్రము 1/2 భాగమును, మంజరి యెత్తు 6 భాగములును విస్తారము 5 భాగములును, స్కంధమును మంజరికి దగినట్లు పూర్వము చెప్పబడియున్న ప్రకారము చేయవలయును. గ్రీవ 1/4 భాగమును, అండకము 1/2 భాగమును, చంద్రిక 1/4 భాగమును

కలశము 1 భాగమును ఇట్లు మూడు శిఖరములతో ప్రాసాదమును రచించిన యెడల పుణ్యము లభించును.

(అనుబంధము 96, 97వ పటములు చూడుడు)

## 134. నవశేఖరము

అపరాజిత 163వ సూ॥

శ్లో॥ త్యక్తకర్ణద్వయంశృంగం తిలకంకామదంభవేత్
నవశేఖరనామాసా కర్తవ్యాఃసర్వదైవతే॥ 95

తా॥ కర్ణములు రెంటియందుగల శిఖరములను తగ్గించి తిలకములను రచించినచో నవశేఖరమగును.

## 135. నవశేఖరము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ ఇదానీమభిధాస్యామః ప్రాసాదంనవశేఖరం
చతురశ్రంభవేత్క్షేత్రం వింశత్యేకోనయాపదైః॥
కర్ణాశ్చతుష్పదాఃకార్యా స్తేషాంభద్రంద్విభాగికం
వినిర్గతంపదార్ధేన జలమార్గస్తథార్ధతః॥
అర్ధభాగాయతాకార్యాసాభవేహివిచక్షణైః
శాలాకర్ణపదార్ధేతు ప్రత్యంగంభాగమానతః॥
త్రిపదోరథకఃకార్యో మంజరీణాందతుష్టయం
చతుష్పదాభవేద్భిత్తి ర్గర్భశ్చైకాదశాంశకః॥
చత్వారింశత్పదాదూర్ధ్వం యావత్స్కంధంసమస్తకం
తులోదయఃషోడశభి ర్మంజరీచాష్టకైస్త్రిభిః॥
చతుష్పదోవేదిబంధో జంఘాసాష్టపదాభవేత్
భాగేనభరణేత్ర్యంశం మేఖలాంతరపత్రకం॥
ఉచ్ఛ్రాయతఃసప్తపదాకర్తవ్యాకర్ణమంజరీ
గ్రీవార్ధభాగేనభవే దండకంచైకభాగికం॥

భాగేనచంద్రికామూర్ధ్వం భాగేనకలశంతథా
సపాదముదయంస్కంధం మంజర్యావిస్తృతేవిదుః॥
గ్రీవాపాదేనభాగేన సపాదాంశమథాండకం
భాగార్ధంచంద్రికా భాగద్వయేనకలశోదయః॥
విస్తారోమూలమంజర్యాః కార్యఃపంచదశాంశకః
తథాసప్తదశోచ్ఛ్రాయః స్కంధాయామోనవాంశకః॥
గ్రీవాచాస్యార్ధభాగేన సార్ధద్విపదమండకం
చంద్రికాసార్ధభాగేన త్రిపదఃకలశోదయః॥
ఏవంయఃకారయశ్చైనం ప్రాసాదంనవశేఖరం
నవభిఃసహితాంఖండైః సభునక్తివసుంధరాం॥

తా॥ నవశేఖరముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురస్ర ప్రదేశమును 19 భాగములుచేసి కర్ణములు 4 భాగముల చొప్పునను, వానికి భద్రములు 2-2 భాగములును, భద్రములయొక్క నిర్గమము 1/2 భాగమును, జలాంతరము 1/2 భాగమును, శాల 2 భాగములును, పంజరము 1 భాగమును, రథకములు 3 భాగములును మంజరి 4 భాగములును, గోడ 4 భాగములును, గర్భము 11 భాగములును, ఎత్తు మొత్తము 40 భాగములు, అందులో దూలముపై భాగమువరకు 16 భాగములును, ఆపైన మంజరి 24 భాగములును చేయవలయును. వేదిబంధము 4 భాగములును, జంఘ 8 భాగములును, భరణము 1 భాగము, మేఖల అంతరపత్రము 3 భాగములు కర్ణమంజరి ఎత్తు 7 భాగములు, దానికి గ్రీవ 1/2 భాగము, అండకము 1 భాగము, చంద్రిక 1 భాగము, కలశము 1 భాగము, ఉరో మంజరియందు స్కంధముయొక్క ఎత్తు 1 1/4 భాగము, గ్రీవ 1/4 భాగము, అండకము 1 1/4 భాగము, చంద్రిక 1/2 భాగము, కలశము ఎత్తు 2 భాగములు (ఇచట ఉరోమంజరి విస్తారము 10 భాగములు ఎత్తు 12 భాగములు అని తెలియవలయును) ప్రధాన మంజరియొక్క

విస్తారము 15 భాగములును, ఎత్తు 17 భాగములును, స్కంధము ఎత్తు 9 భాగములును, గ్రీవ 1 2 భాగము, అండకము 2 1/2 భాగములు చంద్రిక 1 1 2 భాగము, కలశము 3 భాగములు, అండకములు 9 చేయవలయును.

(అనుబంధము 98, 99, పటములు చూడుడు)

## 136. పుండరీకము

అపరాజిత 163వ సూత్రము

శ్లో॥ కేశరీసింహాకర్ణశ్చ యుక్తశ్ఛందైస్తునాగరైః
పుండరీక స్తథానామ కర్తవ్యంవిష్ణుమందిరం॥ 96

తా॥ కేశరివలె సింహాకర్ణములను రచించి, నాగరపద్ధతితో రచించిరేని పుండరీకమగును. ఇది విష్ణువునకు ప్రియమైనది.

## 137. పుండరీకము మరియొక పద్ధతి

సమరాంగణ 57వ అధ్యాయము

శ్లో॥ పుండరీకమథబ్రూమో యశసోవర్ధనంపరం
యస్మిన్కృతేస్థిరా కీర్తిర్భవేద్ యావద్ వసుంధరా॥
చతురశ్రంసమంక్షేత్రం విభజేత్ పంచభిఃపదైః
త్రిపదంకల్పయేద్గర్భం తస్యభిత్తించభాగికాం॥
త్రిపదంతస్యభద్రంస్యాత్ సార్ధభాగవినిర్గమం
భద్రేషువర్తులందిక్షు రథికానాంచతుష్టయం॥
భాగేనైకేనరథికా మూలచ్ఛందోఽయమీరితః
ఊర్ధ్వమానంభవేద్ యస్య ద్విగుణోదశభాగికం॥
భాగేనోచ్ఛాలకంవిద్యాత్ భాగార్ధేనతుమేఖలా
వేదిబంధంనకుర్వీత జంఘాసార్ధద్విభాగికా॥

ప్రాసాదాన్నిర్గతౌ కార్యౌ కపోతౌ గర్భమానతః
ఊర్ధ్వంభిత్త్యుచ్ఛ్రయాతస్య మంజరీంతుప్రకల్పయేత్ ॥ 66
మంజర్యాసార్ధమానేన శుకనాసంప్రకల్పయేత్
ఊర్ధ్వంతథార్ధభాగేన వేదీబంధోభవేదిహ ॥ 67
వేద్యాశ్చోపరియచ్ఛేషం కంఠమామలసారకమ్
ఏవంవిభజ్యప్రాసాదం శోభనంకారయేద్బుధః ॥ 68
అథాన్యచ్చప్రవక్ష్యామి ప్రాసాదస్యేహలక్షణమ్
గర్భమానేనప్రాసాద ప్రమాణంశృణుతద్విజాః ॥ 69
విభజ్యనవధాగర్భం మధ్యేలింగస్యపీఠికా
పాదాష్టకంతురుధిరం పార్శ్వతఃపరికల్పయేత్ ॥ 70
మానేనానేనవిస్తారో భిత్తీనాంతువిధీయతే
పాదేపంచగుణంకృత్వా భిత్తీనాముచ్ఛ్రయోభవేత్ ॥ 71
సఏవశిఖరస్యాపి ద్విగుణఃస్యాత్సముచ్ఛ్రయః
చతుర్ధాతుశిరోభజ్య అర్ధంభాగద్వయస్యవా ॥ 72
శుకనాసంప్రకుర్వీత తృతీయేవేదికామతా
కంఠమామలసారంచ చతుర్ధేపరికల్పయేత్ ॥ 73
కపోలయోస్తుసంహారో ద్విగుణోఽస్యవిధీయతే
శోభనైర్వప్రవల్లీభిరండకైశ్చవిభూషితః ॥ 74
ప్రాసాదేయస్తృతీయస్తు మయాతుభ్యంనివేదితః
సామాన్యమపరంతద్వత్ ప్రాసాదంశృణుతద్విజాః ॥ 75
త్రిభేదంకారయేత్ క్షేత్రం యత్రవిష్ఠంతిదేవతాః
రథంకృత్వాతుమానేన బాహ్యభాగవినిర్గతమ్ ॥ 76
నేమీపాదేనవిస్తీర్ణా ప్రాసాదస్యసమంతతః
గర్భంతుద్విగుణంకుర్యాన్నేమిమానంభవేదిహ ॥ 77

సప్తవభిత్తీనాము త్సేధో ద్విగుణః శిఖరో మతః

ప్రాగ్గ్రీవం పంచభాగేన నిః శ్వాసస్తస్యచోచ్యతే॥ 78

కారయేచ్ఛిఖరం తద్వ ద్రత్వాప్రాకారస్య విధానతః

ప్రాగ్గ్రీవం తస్యమానేన నిష్కాంశేనవిశేషతః॥ 79

కుర్యాద్వా పంచభాగేన ప్రాగ్గ్రీవం కర్ణమూలతః

కారయేత్కనకం తత్ర గర్భాంతే హారమూలతః॥ 80

ఏవం తు త్రివిధం కుర్యా జ్జ్యేష్ఠ మధ్య కనీయసమ్

లింగమానానుభేదేన రూపభేదేనవా పునః॥ 81

ఏతే సామాన్యతః ప్రోక్తా నామతః శృణుతాధునా

మేరుమందర కైలాస కుంభహస్తి మృగాస్తథా॥ 82

విమానచ్ఛందకస్తద్వచ్చతురస్రస్తథైవచ

అష్టాస్ర షోడశాస్రశ్చ వర్తులః సర్వభద్రకః॥ 83

హంసశ్చనందనశ్చైవ నందివర్ధన ఏవచ

సింహో వృషః సుపర్ణశ్చ పద్మకోఽథ సముద్రకః॥ 84

ప్రాసాదానామతః ప్రోక్తా విభాగం శృణుతద్విజాః

శతశృంగశ్చతుర్ద్వారో భూమికాషోడశోచ్ఛ్రితః॥ 85

నానావిచిత్రశిఖరో మేరుప్రాసాద ఉచ్యతే॥

... ... చంద్రశాలైస్సమోపేతాః సర్వే ప్రాగ్గ్రీవసంయుతాః

ఇష్టికాదారవాశ్చైవ శైలజాశ్చ సతోరణాః మేరుః

పంచాశద్ధస్తః స్యాత్॥ 100

తా॥ విస్తారమును 16 భాగములుచేసి మధ్య 4 భాగములు గర్భమును చుట్టూయున్న 12 భాగములు గోడయును, గోడ ఎత్తు 4 భాగములును దానికి రెట్టింపు శిఖరమును, అందులో సగముచేత ప్రదక్షిణమును, నలువైపుల నిర్గమమును, గర్భసూత్రమునకు రెట్టిం

పుగా మండపముయొక్క విస్తారమును దానికి భద్రమును రచించవలయును. గర్భము 5 భాగములుచేసి, ప్రాగ్గ్రీవమును 1 భాగము నిర్గమము చేయవలయును. గర్భసూత్రముతో సమానముగా ముఖమండపమును రచించవలయును, ఇదియొక పద్ధతి. మరియొక విధము — లింగప్రమాణమునుబట్టి పీఠమును, పీఠములో సగము గోడయును, వెలుపలి గోడ యెత్తునకు రెట్టింపు శిఖరమును, శిఖరమునకు 4 భాగములు ప్రదక్షిణమును, ప్రదక్షిణముతో సమానము ముందు మండపమును, అందులో సగము ముందు ముఖమండపమును, గర్భము యొక్క విస్తారమునుబట్టి కపోతములయొక్క నిర్గమమును, గోడల యొక్క యెత్తునకు పైన మంజరిని రచించవలయును. మంజరియొక్క 1 1/2 భాగమున శుకనాసికను, పైన 1/2 భాగమున వేదీబంధమును దానిపైన గలమును, ఆమలసారమును రచించవలయును. ఇట్లు ప్రాసాదములు రచించవలయును. వేరొక పద్ధతి - గర్భమానముతో జెప్పుచున్నాడు. గర్భమును 9 భాగములుచేసి మధ్య లింగపీఠమును ప్రక్కల 8 భాగముల రుధిరమునుచేసి యీ ప్రకారము గోడను రచించవలయును. పాదమునకు 5 రెట్లు గోడ యెత్తును, దానికి రెట్టింపు శిఖరమును, ఆ శిఖరమును 4 భాగములుచేసి అందు 2 భాగములు శుకనాసమును, వేదిక 3వ భాగమునను, కంఠము, ఆమలసారము 4వ భాగమునను రచించవలయును. కపోతములయొక్క సంహారము దానికి రెట్టింపుగా చేయవలయును. అందమైన వప్రములును, వల్లికలును, అండకములును రచించవలెను. ఇంకొక పద్ధతి చెప్పుచున్నాడు, ఈ మూడు విధములగు దేవాలయములకు దేవతాస్థానముల యందు రథములుండవలెను. అవి వెలుపలికి నిర్గమమును, నేమి విస్తారము 1 భాగము, గర్భము 2 భాగములు, దానియొక్క గోడకు రెట్టింపుగా

శిఖరము యెత్తును, ప్రాగ్గ్రీవమును, అందులో 5వ వంతు నిర్గమమును ఆ శిఖరము ననుసరించి ప్రాకారమును, కర్ణమూలమునుండి 5వ భాగము ప్రాగ్గ్రీవమును, గర్భాంతమున హారమూలమునుండి కనక మును రచించవలయును, లింగప్రమాణమునుబట్టియు, రూపభేదమును బట్టియు, ఉత్తమ మధ్యమ కనీసములను మూడు విధములైనవి. ఇవి సామాన్యములు ఇతను, మేరువు, మందరము, కైలాసము, కుంభము గజము, మృగరాజము, విమానము, చతురశ్రము, అష్టాశ్రము, గోడ శాశ్రము, వర్తులము, సర్వభద్రము, హంసము, నందము, నందివర్ధ నము, సింహము, వృషభము, గరుడము, పద్మము, సముద్రము. ఇట్లు 20 భేదములు కలవు. మేరువు 50 హస్తములు విస్తారమును విస్తార మునకు రెట్టింపు శిఖరము ఎత్తును 4 ద్వారములును, 100 శృంగము లును 16 అంతస్తులును, విచిత్రములైన యనేక శిఖరములును, చంద్ర శాలలును, ప్రాగ్గ్రీవములును కలిగి యుండవలెను.

## 160. మేరు లక్షణము

## 6వ పద్ధతి సాంధారము

అపరాజిత 167వ సూత్రము

విశ్వకర్మోవాచ—

శ్లో॥ మేరుర్వృషభోగరుడో మందరోలక్ష్మికోటరః
కైలాసఃపంచవక్త్రిశ్చ విమానోగంధమాదనః॥ 1
ముక్తకోణోగిరిశ్చైవ తిలకశ్చంద్రశేఖరః
మందరతిలకశ్చైవ సౌభాగ్యఃసుందరస్తథా॥ 2

శ్రీతిలకో విశాలశ్చ శ్రీకూటో నందివర్ధనః
పద్మసంభవ ఆఖ్యాతాః ప్రాసాదస్త్వేకవింశతిః॥ 3
దశధా చాష్టధా చైవ నవధా చ ప్రకల్పయేత్
భాగో భాగాభ్రమో భిత్తిః శేషం గర్భగృహం భవేత్॥ 4
మేరుద్వృషభోగరుడ ఏషాంయుక్తిద్వితీయతే
జ్యేష్ఠోమధ్యః కనిష్ఠశ్చ మేరుస్త్రివిధ ఉచ్యతే॥ 5
దశహస్తాదధో నాస్తి ప్రాసాదో భ్రమసంయుతః
లతినే త్వేకహస్తాది పంచాశద్ధస్తకావధి॥ 6
నాగరైః శుద్ధఖండాశ్చ కర్తవ్యాః సర్వకామదాః
కర్ణాద్యం గర్భపర్యంతం విభాగానాం తు నిశ్చయః॥ 7
ఏకవింశతి ప్రాసాదా మేరుకాద్యసముద్భవాః
క్రమయుక్త్యా విధాతవ్యాః ప్రయుక్తా వాస్తువేదిభిః॥ 8
షడ్ఢస్తవేదయుగకాయుగ వేదద్విషడ్వసు
పృథుమానేన నిష్కాసో భద్రం షడ్భిర్వినిర్గతమ్॥ 9
కర్ణే చ నందికాంకుశాత్ తత్తుల్యాం ప్రరథే తథా
కేశరీ స్యాదుపరథే శ్రీవత్సే నందికోద్గమే॥ 10
త్రీణి షట్చత్వారి కర్ణే నంద్యాః ప్రరథకే క్రమాత్
ప్రత్యంగే చైవ ద్వాత్రింశ దురఃశృంగాణి వింశతిః॥ 11
చంద్రావలోకనా భద్రే ఘాద్యఘంటాద్యలంకృతా
ఆమలసారం కలశం శుకనాసయుతా ధ్వజా॥ 12
మండపైః సువితానైశ్చ స్తంభమాజగతీ తథా
శాలాకులో యుక్తికీర్ణ సహస్రాండక మేరుకః॥ 13

ఇది శ్రీమద్విశ్వకర్మవంశమూలర్షి పంచకమధ్య మాహాభౌనసగోత్రపవిత్ర, స్వర్ణాచ్చమాంబా వేంకటశివార్య పౌత్ర, లక్ష్మాంబా కోటయ సుధీమణిపుత్ర, శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితాసుధారసపాత్ర, పదవాక్య ప్రమాణనిధాన, విమర్శకాచార్య, శిల్పకళాకోవిద, సర్వతంత్ర స్వతంత్ర, స్థపతి, తిలకాది బిరుదవిరాజమాన సుబ్రహ్మణ్యాభిధాన విరచిత నానావాస్తు శిల్పాగమశాస్త్ర పరిశీలనాత్మకాంధ్ర తాత్పర్యసహిత భారతీయ మహాశిల్పమునందు సాంధార ప్రాసాదములు, నాగరోద్భవ విమాన ప్రాసాదములు, కైలాస ప్రాసాదములు - విమాన నాగరచ్ఛందజ పుష్పకాది ప్రాసాదములు, శ్రీధరాది శుద్ధఛందములు, మేరుజాతి ప్రాసాదములుగల దేవాలయ భేదములు అను పంచమకళ.

సమాప్తం

# అనుబంధము

1వ పటము



**రాజహంసము**

విస్తారము - 20 భా

అండకములు - 89

2వ పటము



**గరుడము**

విస్తారము - 20 భా

అండకములు - 93

3వ పటము



**వృషభము**

విస్తారము - 20 భా

అండకములు - 97

విస్తారము - 10 భా

ఎత్తు - 12 భా

## 4వ పటము



విస్తారము 10 భా

ఎత్తు. 12 భా

అండకములు. 101.

## 5వ పటము

విస్తారము 20 భా

2½ 2¼ గర్భము 8 భా 1½ 2½

## మేరువు

## 6 వ పటము



విస్తారము 6 భా

ఎత్తు. 7 భా

## 7 వ పటము

1 1 1 గర్భము 6 భా 1 1 1

విస్తారము 12 భా

## పంచవక్త్రము

## 8వ పటము




విస్తారము - 12 భా

మధ్య స్తంభములపై తోరణములను మిగిలినపనులన్నియును పైవిధముగనే చేయవలెను

## చతుర్ముఖము

9వ పటము




విస్తారము 21 భా
ప్రధానగర్భము 5 భా

**నవాత్మకము**

10వ పటము



11వ పటము



**నవాత్మకము**

విస్తారము - 21 భా
ప్రదానగర్భము. గోడ
అంధారికతో 9 భా

12వ పటము



**విమాన పుష్పకజాతి**
**నందిఘోషము**

విస్తారము - 16 భా
విస్తారము 10. భా
ఎత్తు . 11 భా

13వ పటము



**సర్వాంగ సుందరము**

విస్తారము - 18 భా

14వ పటము

కైలాసజాతి



స్తంభములు. కర్ణములు.

విమానము.ఇవన్నియును

గుండ్రముగా నుండవలెను

16వ పటము

భిన్నమందరము



ఉర: శృంగములు.16

భద్రములు. 8

కర్ణములు. 8

15వ పటము

స్వస్తికము



కోణములు 8

భద్రములు 8

17వ పటము



నలువైపుల భద్రములకు

ప్రాగ్రీవములుండవలెను

గజభద్రము

18వ పటము



నాలుగు వైపుల భద్రములయందు

సింహములు పైకెగయుచున్నట్లుండవలెను

సింహభద్రము

19వ పటము



20వ పటము




ఇంద్రమిశ్రము

21వ పటము






22వ పటము

**హర్షణము**

23వ పటము



భద్రములు.16 ను (పైవిధముగనే)
ఒక్కొక్కదానికి 22 ఉరఃశృంగములును

**భిన్నమేరువు**

24వ పటము




1 1 1 2 1 1 1

25వ పటము

**విమాననాగరచ్ఛందజాతి**

26వ పటము



27వ పటము




విజయము

28వ పటము






29వ పటము

శ్రీధరము

30వ పటము






31వ పటము

దుందుభి

35వ పటము



విస్తారము 18 ధా
2 2 1     1 2 2
గర్భము 8 ధా

36వ పటము

**సునందనము**

32వ పటము



విస్తారము 20 ధా
2 2 2   గర్భము 8 ధా   1 2 2

33వ పటము

**పుష్పవిజయము**

34వ పటము



మేరువు.

37వ పటము




38వ పటము




శుద్ధచ్ఛంద జాతి. శ్రీధరము

40వ పటము

2 5 2 6 2 5 2

విస్తారము 24 భా గర్భము 6 భా

శ్రీధరము (సమరాంగణ)

ఎత్తు పీఠముతో కూడ. 50 భా

39వ పటము



44వ పటము





3 3 3 గర్భము 8భా 3 3 3

43వ పటము

హేమకూటము

41వ పటము

1 1 1 విస్తారము 10 భా 1 1 1

గర్భము 4 భా

42వ పటము




హేమకూటము. (అపరా)

## 45వ పటము



## 46వ పటము




సుభద్రము

## 48వ పటము



## 47వ పటము




రిపుకేసరి

49వ పటము



విమానము 6రెట్లు
గలసూత్రముతో
గుండ్రముచేయవలెను

50వ పటము




విస్తారము 14 భా మధ్య 16.దలములు

పుష్పకము

51వ పటము



అండకము 29

విస్తారము 18 భా నిలువు కొలతలు
అదిగాష్ఠానము వరకే యున్నవి

శ్రీనివాసము

52వ పటము




విస్తారము 28 భా

విజయ భద్రము




53వ పటము

54వ పటము



55వ పటము




56వ పటము



57వ పటము




నంద్యావర్తము.

58వ పటము



59వ పటము




సిద్ధార్ధకము

60వ పటము



61వ పటము




శంకవర్ధనము. (అపరా)

62వ పటము




63వ పటము




శంఖివరనము.

64వ పటము




65వ పటము




త్రైలోక్యభూషణము

66వ పటము



విస్తారము30 భా

2 2 2 2 2 గర్భము10 భా 2 2 2 2 2

67వ పటము

**త్రైలోక్యభూషణము**

68వ పటము



69వ పటము

భద్రములయందు

ఘంటను రచించవలెను

2 గర్భము6భా 2

**పక్షభాహువు (అపరా)**

70వ పటము



ప్రధానగర్భము 8 భా

పార్శ్వగర్భము 4 భా

గోడ. 2 భా

**పక్షబాహువు**

71వ పటము



72వ పటము

విస్తారము 10 భా

గర్భము 4 భా

విశాలము

73వ పటము



61 అండకములు

5అంతస్తులు

74వ పటము




కమలోద్భవము. (అపరా)

75వ పటము



76వ పటము




కమలోద్భవము.

77వ పటము



హంసధ్వజము

78వ పటము




79వ పటము



80వ పటము




లక్ష్మీధరము

81వ పటము



82వ పటము




మహా వజ్రము

83వ పటము




84వ పటము




పంచచామరము

85వ పటము



86వ పటము




నందిఘోషము

87వ పటము



5 అంతస్తులు

88వ పటము




మనూత్కీర్ణము

89వ పటము



90వ పటము




సుప్రభము

91వ పటము



సురానందము

92వ.పటము



93వ పటము

విస్తారము 18భా

గర్భము 6 భా

హర్షణము

94వ పటము




దుర్ధరము

95వ పటము



విస్తారము 24భా

96వ పటము



97వ పటము




త్రికూటము

98వ పటము



99వ పటము

విస్తారము19 భా

గర్భము 11భా

నవశేఖరము

100వ పటము






విస్తారము17 భా   గర్భము 3 భా

ఎత్తు 34 భా

101వ పటము

సునాభము

102వ పటము



103వ పటము

గర్భము 6 భా

విస్తారము 10 భా

వరాటము

104వ పటము



9 అంతస్తులు చేయవచ్చును

105వ పటము

విస్తారము 19 భా

గర్భము 11భా

సుముఖము

106వ పటము

అన్ని కొలతలను నందిఘోషము వలనే భద్రములును రచించ వచ్చును



107వ పటము

2

మహాఘోషము (మిశ్రజాతి)

108వ పటము



కలశములు 21

109వ పటము




విస్తారము 18 భా శ్రీనివాసము నందలి కందములను తీసివేసి స్థంభములు 16 రచించవలెను

వృద్ధిరామము (మిశ్రజాతి)

111వ పటము



మార్గము. (మిశ్రజాతి)

110వ పటము




విస్తారము18 భా పైతొంతలన్నియు సాధారణమే

వసుంధరము. (మిశ్ర.జాతి)

112వ పటము

అండములు 36
నాం 18
ము 16
కెం 14
షై ´12



మేరువు1 .

113వ పటము



దీనిని 16 అంతస్తులు చేయవచ్చును

మేరువు 2 .

114వ పటము




మేరువు 3

115వ పటము



(విశ్వప్రకాశ)
16 అంతస్తులు
(సమరాం)

మేరువు 4

శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 6వ భాగము




రచయిత :

విమర్శకాచార్య శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి





ప్రచురణకర్త :

డా॥ స్వర్ణ వాచస్పతి, B. V. Sc.

భారతీయ మహాశిల్పము 6వ భాగం

# విషయ సూచిక

**విశ్వకర్మ ప్రకాశ 6. అధ్యాయము** **సమరాంగణ 49.56.57 62.63 55.65 అధ్యాయములు** **అపరాజిత 170.161 180.181.182.171.141 174,175 సూత్రములు**

శ్రీవిరాడ్విశ్వకర్మణే నమః

# 1. ఇష్టదేవతాస్తుతి

శ్లో॥ దేవః సపాతుభువనత్రయ సూత్రధార
స్త్వం బాలచంద్ర కలికాంకిత జూటకోటిః ।
ఏతత్ సమగ్రమపి కారణమంతరేణ
కార్త్స్న్యదసూత్రిత మసూత్ర్యత యేన విశ్వమ్॥ (సమరాం)
ఉత్పత్తి రక్షణలయాన్ జగతాం ప్రకుర్వన్
భూవారి వహ్ని మరుతో గగనంచ సూతే ।
నానాసురేశ్వర కిరీట విలోలమాలా
భృంగావలీఢ చరణాంబురుహం నమామి॥ (మానసార)
జయతి వరదమూర్తిర్మంగలం మంగలానాం
జయతి సకలవంద్యా భారతీ బ్రహ్మరూపా ।
జయతి భువన మాతా చిన్మయీ మోక్షరూపా
దిశతు మమ మహేశో వాఙ్మయః శబ్దరూపమ్॥
(విశ్వకర్మ ప్రకాశ)
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురేరపి ।
సర్వవిఘ్నచ్ఛిదేతస్మై గణాధిపతయేనమః॥ (అపరాజిత)
మహాదేవం శశిధరం సర్వలోకైక నాయకమ్ ।
మహేంద్ర మధ్యగం శాంతం పార్వతీసహితం పరః॥
దేవదానవ సిద్ధాద్యైః సేవితం సురపూజితమ్ ।
ప్రణమ్య దేవచరణ మేవం బ్రూయాత్ సకశ్యపః॥ (కాశ్యప)

# 2. మందరమేరువు లక్షణము (సాంధారము)

సమరాంగణ 57వ అధ్యాయము :

శ్లో॥ లక్షణం మందరసాధ్య ప్రాసాదస్యాభిధీయతే॥
సిద్ధిప్రదస్య పుణ్యస్య స్తుతస్య త్రిదశైరపి ।
చతురశ్రీ కృతేక్షేత్రే దశాభాగ విభాజితే॥

గర్భః కార్యశ్చతుర్భాగో భిత్తిరేకాంశ విస్తృతా ।
అంధారికైక భాగేన బాహ్యా భిత్తిస్తుభాగికీ॥
కోణేషుఘురధికాః కార్యాః పదద్వితయ సమ్మితాః ।
చత్వారో మండపాఃకార్యాః షట్ త్రింశత్పద సమ్మితాః॥
చతుర్ద్ది శమవిందాశ్చ విధాతవ్యాశ్చతుష్పదాః ।
భాగేన నిర్గతాస్తేచ సర్వతః శుభలక్షిణాః॥
అస్యోర్ధ్వమానం కర్తవ్యం విస్తారాద్ద్విగుణం బుధైః ।
కర్ణవిధేశ్చ విస్తారసీమా సర్వత్రగృహ్యతే॥
ప్రాసాదే మూలమానం యత్ తచ్చ సమ్యక్ ప్రకల్పయేత్ ।
ద్విపదం పీఠముత్సేధాత్ కార్యం ప్రాజ్మాలతోబహిః॥
తత్ పద్మైరంకితం కార్యం సింహైరపిచ మందిరే ।
పదార్ధంఖురకః కార్యః ప్రాసాద సమవర్జితః॥
సార్ధం పదద్వయం కార్యో వేదీబంధః సుశోభనః ।
చతుర్భాగోన్న తాజంసూ భాగార్ధం రూపపట్టికా॥
మేఖలాంతర పత్రంచ కార్యం పదసముచ్ఛ్రితం ।
పదద్వయా యతానిస్యుః కర్ణే శృంగాణి మానతః॥
ఉచ్ఛ్రయస్త్రిపదస్తేషాం గ్రీవాండ కలశైః సహ ।
మూలరేఖా విధాతవ్యా కర్ణకూటస్యచోపరి॥
నవభాగోచ్ఛ్రితాశస్తా విస్తారేణాష్ట భాగికా ।
విస్తారం దశధాకృత్వా తైః షడ్భిః స్కంధవిస్తృతైః॥
లతాః పంచవిధాతవ్యాః శ్రీవత్సేకథితాయథా ।
కుర్వీత పంచభౌమంవా సప్తభౌమ మథాపివా॥
గ్రీవా పాదోనభాగాస్యాత్ సపాదం పదమండకం !
చంద్రికైక పదాకార్యా కలశో ద్విపదోదయః॥
శిఖరం త్రిపదం కుర్యాత్ తత్త్రైకం భాగముత్సృజేత్ ।
శుకనాసోత్సృతం కుర్యాత్ సింహస్థాన విభూషితమ్॥

కనకాభరణైర్యుక్తః పుమాన్ యద్వత్ విరాజతే।
తథా ప్రాసాదరాజోఽయం శోభతే చిత్రకర్మభిః॥
మంజరీం దశధాకృత్వా కర్మశోభాం ప్రకల్పయేత్।
భాగైర్భద్రస్య విస్తారః షడ్భిర్భాగేన నిర్గమః॥
భాగికౌరథికేతత్ర కుర్యాద్ భాగాద్వినిర్గమః।
భాగద్వయమితాన్ కర్ణాన్ విదిక్షుచ నివేశయేత్॥
శాలాశ్చతస్రః కర్తవ్యా యుక్తాః కూటైర్మనోరమైః।
నీరాంతరాణితా అష్టౌ మంజర్యాద్విగుణాన్వితాః॥
కూటేర్ధ్వే ప్రథమాభూమిః కార్యాభాగద్వయోచ్ఛ్రితా॥
పదపాద విహీనాస్తు క్రమేణోపరిభూమికాః॥
అర్ధభాగోచ్ఛ్రితాగ్రీవా భాగికోచ్ఛ్రాయ మండకం।
భాగేన కలశఃకార్యః సర్వలక్షణ సంయుతః॥
విస్తారార్ధేన కర్తవ్యో వేదీబంధో విబంధురః।
షడ్గుణే నైవసూత్రేణ మధ్యరేఖాంసమాలిఖేత్॥
ద్వితీయామాలిఖేత్ పంచగుణితేన విచక్షణః।
సార్ధత్రిగుణసూత్రేణ వృత్తరేఖాం సమాలిఖేత్॥
మంజరీ భిర్విచిత్రాభిః సర్వతైవ విరాజితః।
ప్రాసాదో మందరః కార్యః ప్రమాణేనామునా శుభః॥
మందరం మందరాకారం కృత్వా ప్రాసాదముత్తమం।
ప్రాప్నోతీ హాపరం సౌఖ్యం పరత్రచ శుభం గతిమ్॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి గర్భము 4 భా, గోడ 1 భా, అంధారిక 1 భా, వెలుపలిగోడ 1 భాగము మూలల యందు రథికలు 2 భాగములును, మండపములు నాలుగు 6_6 చొకము 36 భాగముల చొప్పునను, నలుదిశలయందు అలిందము లను 4 భాగముల చొప్పునను వానియొక్క నిర్గమము 1 భాగమును కర్ణములయొక్క యెత్తు విస్తారముకంటె రెట్టింపుగాను విస్తారప్రదేశ

మును అంతటను గ్రహించవలెను. ప్రాసాదముయొక్క ప్రధాన మానము ప్రకారము చేయవలెను. పీఠము ప్రధానమానముకంటె వెలుపలికి 2 భాగములును యెత్తులో పద్మములును సింహములును రచించబడవలెను. ఖురము $\frac{1}{2}$ భాగము, ప్రాసాదముతో సమానముగా నుండరాదు. వేదీబంధము $1\frac{1}{2}$ భాగము, జంఘ 4 భాగములు, రూపపట్టిక $\frac{1}{2}$ భాగము, మేఖల అంతరపత్రము 1 భాగము, ఆయతము 2 భాగములు కర్ణములయందలి శృంగములుండవలెను. గ్రీవ, అండకము, కలశము ఈ మూడును కలసి 3 భాగములు, మూలరేఖ కర్ణకూటము యొక్క పైభాగమున నుండవలెను. విస్తారము 8 భాగములును, ఎత్తు 9 భాగములును కల్గియుండవలెను. మూలమంజరి యొక్క విస్తారమును 10 భాగములుచేసి అందులో స్కంధము యొక్క విస్తారము 6 భాగములును లతలు 5ను శ్రీవత్సమునందు చెప్పినట్లు రచించవలెను. దీనిని 5 అంతస్తులుగాగాని లేక 7 అంతస్తులుగాగాని చేయవచ్చును. గ్రీవ $\frac{3}{4}$ భాగము, అండకము $1\frac{1}{4}$ భాగము, చంద్రిక 1 భాగము, శిఖరము 3 భాగములుచేసి అందు 1 భాగమును వదలి శుకనాసను రచించవలెను. అచట సింహములచు రచించవలెను. కలశము 2 భాగములు, ఇట్లు బంగారపు సొమ్ములతో నలంకరింపబడిన వానివలె నీప్రాసాదము చిత్రకర్మతో ప్రకాశించును. మంజరిని 10 భాగములుచేసి చిత్రలేఖనాదులను రచించవలెను. భద్రముయొక్క విస్తారము 6 భాగములు, నిర్గమము 1 భాగము, రథిక 2 భాగములు. నిర్గమము 1 భాగము, కర్ణములు 2-2 భాగములు మూలలయందు రచించవలెను. శాలలు 4 రచించవలెను. 8 జలాంతరములు, మంజరికంటె రెట్టింపుగానుండవలెను. మొదటి అంతస్తున కూటములో సగము, ఎత్తు 2 భాగములు. ఇట్లు వరుసగా పై అంతస్తులు ఒక్కొక్క పాతికవంతు తక్కువగా రచించుచుండవలెను. గ్రీవ $\frac{1}{2}$ భాగము, అండకము 1 భాగము,

కలశము 1 భాగము, చేయవలెను. వేదీబంధమును విస్తారములో సగము యెత్తున చేయవలెను. మధ్యరేఖ 6 రెట్లుగల సూత్రముతో రచించవలెను. రెండవరేఖ 5 రెట్లుగల సూత్రముతోను 3½ రెట్లు గల సూత్రముతో వృత్తరేఖను రచించవలెను. ఇట్లు మంజరులను విచిత్రముగా రచించవలెను. మందరము యొక్క రూపమును బోలి యుండుటచే దీని మందరమేరువని చెప్పుదురు. ఇది సౌఖ్యమును మోక్షమును లభింపజేయును.

## 3. మందరమేరువు 2వ పద్ధతి సాంధారము

అపరాజిత 170 వ సూ.

శ్లో॥ దశధాభాజితే పూర్వం మందరే సర్వకామదే।
భాగోభాగాభ్రమోభిత్తి ర్దేవకోష్ఠం ద్విరష్టతః॥ 33
ద్విభాగః కర్ణవిస్తారో భద్రం షడ్భాగికం తథా।
కర్ణేచ నందిశాలశ్చ శిఖరంచ విమానజమ్॥ 34
పంచభూకర్ణశోభాఢ్యం సర్వతో భద్రమాలిఖేత్।
రథికాకర్ణ శృంగాఢ్యా భద్రం తత్రాపికారయేత్॥ 35
నాగరాహి ప్రతిరథా రథానాం వామదక్షిణే।
మందరో మేరురాఖ్యాతః శివార్కహరి బ్రహ్మణామ్॥ 36

తా॥ క్షేత్రమును 10 భాగములుచేసి మధ్యగర్భము 4 భాగములు, గోడ 1 భాగము, భ్రమ 1 భాగము, వెలుపలి గోడ 1 భా. చేయవలెను. కర్ణము 2 భాగములు, భద్రము 6 భాగములు, కర్ణమున నందిశాలయును, శిఖరమున విమాన పద్ధతితోను చేయవలెను. 5 అంతస్తులయందు కర్ణములు ప్రకాశించుచుండవలెను. అంతటను భద్రములను రచించవలెను. రథిక, కర్ణశృంగము, భద్రము మొదలైనవి నాగరపద్ధతితో చేయవలెను. రథమునకు కుడివైపునను ఎడమవైపునను ప్రతిరథములుండవలెను. దీనిని

మందరమేరువందురు. శివుడు, సూర్యుడు, విష్ణువు, బ్రహ్మ వీరికి ముఖ్యముగ దీనిని రచించవలెను.

## 4. మందరమేరువు 3 నాగరపద్ధతి సాంధారము

సమరాంగణ 63వ అధ్యాయమున జెప్పబడిన మేరుపద్ధతిని చూడవలెను.

శ్లో॥ మందరస్తు కరాత్ కార్యశ్చత్వారింశత్తు పంచచ॥ (28½)

తా॥ మందరమేరువు 45 హస్తములుండవలెను. 12 అంతస్తులు కలిగియుండవలెను. మిగిలిన యంశములన్నియును నాగర పద్ధతి మేరువునందే చూడవలయును. విశ్వకర్మ ప్రకాశ అ. 6 శ్లో. "మందరో ద్వాదశః ప్రోక్తం" (86) "మేరుః పంచాశద్ధస్తః స్యాన్మందరః పంచహీనకః" (100) అని విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయమున జెప్పబడియున్నది.

## 5. మందరమేరువు 4వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ ఇషుపంచ త్రిషట్కంచాఽధాష్టాత్రింశతి భాజితే।
కర్ణేకేశరికోద్వౌద్వావేకః ప్రతిరథే తథా॥ 20
ఉరఃశృంగద్వయంచైవ నంద్యాంచ తిలకం తథా।
పంచవేద చతుఃషట్కం కర్ణాద్యాభ్రమభిత్తయః॥ 21
పంచాశీత్యం డకైర్యుక్తః కర్తవ్యః సర్వకామదః।
మందరో మేరుసంజ్ఞశ్చ శివసూర్యాదికే భవేత్॥ 22

తా॥ చతురశ్ర ప్రదేశమును 38 భాగములుచేసి అందు 5-5-3-6 భాగముల చొప్పున చేయవలెను. కేశరిపద్ధతితో కర్ణమున 2-2 ను, ప్రతిరథమున 1-1 యును, శిఖరములనుచేసి, ఉరః శృంగములు 2 ను, నందియందు తిలకమును రచించవలెను. కర్ణము

నుండి 8-5-4-4-6 ఇటు గోడలను రచించవలెను. అండకములు 85 చేసినేని మందరమేరువగును.

(అనుబంధము 1, 2, 3, 4, 4-ఎ పటములు చూడుడు)

## 6. కైలాసమేరువు లక్షణము

సమరాం. 57వ అధ్యాయము :

శ్లో॥ కథయామోఽథ కైలాస మశేష సురసేవితం।
ప్రమథ ప్రవరైర్జుష్టం ప్రాసాదం పుణ్యవర్ధనమ్॥
చతుర శ్రీకృతే క్షేత్రే శతధా ప్రవిభాజితే।
శాలాషడ్భాగ విస్తారా కర్తవ్యాభాగ నిర్గమా॥
కర్ణాన్ ద్విభాగికాన్ కుర్యాత్ సలిలాంతర సంయుతాన్।
ఆరభ్య బ్రహ్మణః స్థానాత్ సమా ఇవ పదద్వయమ్॥
భ్రమయిత్వా సమంవృత్తం గర్భమంశం ప్రకల్పయేత్।
తథాభిత్తిర్విధాతవ్యా సమంతా దర్ధభాగికా॥
భాగికాబాహ్యభిత్తిః స్యాత్ కార్యాఽస్యా భద్రభూషితా।
అంతరావేతు సర్వత్ర విదధ్యాదంధకారికామ్॥
అలిందకాశ్చతుర్భాగాః కర్తవ్యాది క్షేత్రయే బుధైః
భాగద్వయేన నిష్క్రాంతాః సర్వతః శుభలక్షణాః॥
చతుష్కికా విధాతవ్యాస్తేషు స్తంభద్వయాన్వితాః।
ముఖేతు మండపః కార్యః స్తంభపంక్తి విరాజితః॥
అధోర్ధ్వమానం వక్ష్యామః కైలాసస్య యథాస్థితం।
పీఠం తస్యపదేద్వేతు కర్తవ్యం గణభూషితమ్॥
పదస్యార్ధేన కర్తవ్యః ఖురకస్తు ఖురాదితి।
తదూర్ధ్వం ద్విగుణాజ్ఞేయా ప్రాసాదస్య సముచ్ఛ్రితిః॥
ఏకేన కుంభకః కార్యో భాగేన సమవర్జితః।

కార్యం పదస్య పాదేన తతశ్చాంతర పత్రకం ।
మేఖలార్ధ పదేనస్యాచ్చంద్రశాలా విభూషితా॥
జంఘాత దూర్ధ్వం కర్తవ్యా సార్ధంపద చతుష్టయం ।
భాగేనైకేన కుర్వీత మేఖలాంతర పత్రకమ్॥
కర్ణశృంగం త్రిభిర్భాగైః కుర్యాత్ సకలశాండకం ।
తదూర్ధ్వం ద్విపదానిస్యుః కూటాన్యుచ్ఛ్రాయమానతః॥
పూర్వోక్తానామమీషాంచ ప్రక్షేపః స్యాత్ పదాశతః ।
చతుర్థాకూట విస్తారం సంవిభజ్యపదద్వయే॥
సంద్రస్యాదితి యుక్తాని సింహక్రాంతానికారయేత్ ।
విస్తారం మూలమంజర్యాః కుర్యాత్ షడ్భాగ సంబతమ్॥
సప్తభాగిక ముచ్ఛ్రాయం కైలాసేఽస్యాః ప్రకల్పయేత్ ।
భాగార్ధేన భవేద్వేది భాగికోచ్ఛ్రాయ మండకమ్॥
చంద్రికామర్ధ భాగేన కలశంసార్ధ భాగికం ।
కుర్వీత శిఖరంచాస్య స్వస్తికస్య యథోదితమ్॥
యుక్తం భూజాభిరష్టాభిర్మంజరీ భిరలంకృతం ।
సింహకర్ణైర్విచిత్రైశ్చ భద్రాణ్యస్య విభూషయేత్॥

కర్తవ్యః స్కంధవిస్తార స్తస్మిన్ పదచతుష్టయః ।
విదధీత సమారేఖా సూత్రేణ త్రిగుణేనచ॥
ఏవ లక్షణం సంయుక్తం కైలాసం విదధాతియః ।
విభూతిం లభతేసోఽత్ర సుఖసౌభాగ్య సంయుతామ్॥
కామానవాప్య వివిధాన్ కీర్తిమారోగ్యమేవచ ।
భుక్త్వాభోగాంశ్చకైలాసే కల్పాంతేయావ దీప్సితమ్॥
శార్వం పదమవాప్నోతి శాంతంధ్రువమ నామయమ్॥

తా॥ పుణ్యమును వర్ధిచేయునదియును దేవతలందఱిచేప్రశంసింపబడునదియునగు కైలాసమేరువుయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 10–10 భాగములుచేసి అందుశాల 6 భా.లును

నిర్గమము 1 భాగమును ... జలాంతరమును, బ్రహ్మయొక్క స్థానము నుండి మొదలుపెట్టి వృత్తరేఖను లిఖించి గర్భము 2 భాగములు. దానిచుట్టూ గోడ $\frac{1}{2}$ భాగము, వెలుపలిగోడ 1 భాగము, ముందు భద్రమును, మిగిలిన మూడుప్రక్కల అంతరాలము 4 భాగము అంధకారికయును, అలిందములు 4 భాగములు, మూడు వైపుల చించవలెను. అలిందముల యొక్క నిర్గమములు 2 భాగములును ఇట్లు నలువైపుల 2 స్తంభముల చొప్పునను ముందు మండపమును స్తంభములతో రచించవలెను. ఇంక యెత్తును చెప్పుచున్నాడు. పీఠము 2 భాగములును, ఖురకము $\frac{1}{2}$ భాగమును, దానిపైన ప్రాసాదము రెట్టింపుగా నుండవలెను, కుంభము 1 భాగము, సమానముగా నుండగూడదు. మసూరకము $\frac{3}{4}$ భాగమును, అంతరపత్రము $\frac{1}{4}$ భాగమును, మేఖల $\frac{1}{2}$ భాగము, చంద్రశాలతో గూడ నుండవలెను. జంఘ $4\frac{1}{2}$ భాగములు మేఖల అంతరపత్రము 1 భాగము, కర్ణము యొక్క శిఖరము 3 భాగములు కలశము అండకముతోసహా దానిపైన 2 భాగములు కూటములు చేయవలెను. పూర్వము చెప్పబడినట్లు వీనియొక్క ప్రక్షేపము 1 భాగము, కూటముయొక్క విస్తారము 4 భాగములుగాచేసి అందు 2 భాగములు ... ... సింహములను రచించవలెను. మూలమంజరియొక్క విస్తారము 6 భాగములు, ఎత్తు 7 భాగములు. అన్ని భాగములకును అండకము $\frac{1}{2}$ భాగము విస్తారమును ఎత్తు 1 భాగమును చేయవలెను. చంద్రిక $\frac{1}{2}$ భాగమును, కలశము $1\frac{1}{2}$ భాగమును, శిఖరము స్వస్తికమున జెప్పబడినట్లు చేయవలెను. 8 అంతస్తులకు మంజరులను రచించవలెను. సింహకర్ణములను విచిత్రముగా రచించవలెను. భద్రములనుకూడ నిర్మించవలెను. స్కంధముయొక్క విస్తారము 4 భాగములు. మూడురెట్లు గల సూత్రముతో వృత్తరేఖను రచించవలెను. ఇట్లు శుభలక్షణములతో కైలాసమును రచించిరేని ఐశ్వర్యము, సుఖము, సౌభా

గ్యము, ఇష్టసిద్ధి, కీర్తి ఆరోగ్యము లభించుటయేగాక శివలోక ప్రాప్తియును శాశ్వతసుఖమును కలుగును.

## 7. కైలాసమేరువు 2వ పద్ధతి

సమరాం. 55వ అధ్యాయము :

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే సప్తవింశతి పాణికం।
దశధావిభజేత్ సస్యాత్ కైలాసః పుణ్యవర్ధనః॥ 11
బ్రహ్మకోష్ఠ గతోగర్భః శేషం భిత్యంధకారికా।
చతుర్భాగం భవేద్ భద్రం మూలకర్ణా త్రిభాగికా॥ 17
సప్తభాగోచ్ఛ్రితా జంఘా మేఖలాచార్ధభాగికా।
భాగేనాంతర పత్రంస్యాద్ భాగేనాండక ముచ్ఛ్రితం॥ 18
గ్రీవార్ధ భాగముత్సేధాచ్ఛిఖరం దశకోచ్ఛ్రితమ్।
ఊర్ధ్వేషష్ఠాంశ విస్తారః స్కంధః కైలాససంజ్ఞితే॥ 19
అస్మిన్నంతర పత్రేతు సూత్రం దత్వాసుతాడితమ్।
త్రిగుణేన లిఖేత్ తేన వేణుకోశం మనోరమమ్॥ 20
అష్టభూమ్యుచ్ఛ్రయః శ్రీమాన్ మంజర్యాచ విరాజితః।
ఉచ్ఛ్రయశ్చాస్య కర్తవ్యో ద్విగుణశ్రియమిచ్ఛతా॥ 21
కార్యం షడ్భాగికంచాస్య భద్రం భాగార్ధ నిర్గతమ్।
పాదైకః సింహకర్ణస్యుః సమాప్తిర్నాయకేనచ॥ 22
కైలాస ఏషకథితో విశేషేణ హరప్రియః॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 27 హస్తములు కొలతతో 10 భాగములుచేసి మధ్యగర్భముచేసి మిగిలినది గోడయును అంధకారికను చేయవలెను. భద్రము 4 భాగములును, ప్రధానకర్ణములు 2ను 3-3 భాగములు చేయవలెను. జంఘ 7 భాగములు, మేఖల ½ భాగము, అంతరపత్రము 1 భాగము, అండకము 1 భాగము గ్రీవ ½ భాగము, శిఖరం 10 భాగములు, స్కంధముయొక్క విస్తారము 6 భాగములు, దీనియొక్క అంతరపత్రమునందు సూత్రమును

బట్టి 3 రెట్లుగల సూత్రముతో వృత్తమును లిఖించవలెను. 8 అంతస్తులు చేసి మంజరియును ఆ మంజిరి యొక్క రెుత్తు ద్విగుణముగాను చేయవలెను. భద్రముయొక్క విస్తారము 6 భాగములు, భద్రమును ½ భాగము నిర్గమమును సింహకర్ణము 1 భాగమును, చేసిరేని దీనిని కైలాసమేరువని చెప్పుదురు. ఇది శివప్రియమైనది. విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము శ్లో। కైలాసో నవభూమికః॥ (86) మఱియు శ్లో॥ చత్వారింశత్తు కైలాసః॥ (101) 9 అంతస్తులును 40 హస్తముల విస్తారమును కలిగియుండవలెను.

## 8. కైలాసమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ మందరస్య తలచ్ఛందే భద్రం ప్రాగ్గ్రీవ భూషితమ్।
ద్విక్రమాదూర్ధ్వ శిఖరం పంచభూమ్యా విమానజాః॥ 37
నందిశాలం నందనంచ కర్ణశృంగేషు దాపయేత్।
సదాశివ ప్రియశ్చాసౌ కైలాసః సర్వకామదః॥ 38

తా॥ మందరమేరువు యొక్క తలచ్ఛందమున భద్రమును ప్రాగ్గ్రీవముతో సహా రచించవలెను.ఇట్లు వరుసగా 2 రచించవలెను. పైన శిఖరమును కల్పించవలెను. 5 అంతస్తులుగల విమానమును రచించవలెను. నందిశాలము, నందనము, అను పద్ధతితో కర్ణశృంగములను రచించవలెను. దీనిని కైలాసమేరువనియును సదాశివునకు ప్రియమైనదనియును ప్రతీతి.

## 9. కైలాసమేరువు 4వ పద్ధతి సాంధారము

సమరాంగణ 63వ అధ్యాయము :

శ్లో॥ ద్విచత్వారింశః కైలాసో॥ (28½)

తా॥ కైలాసమేరువునకు 42 హస్తముల విస్తారము కలిగియుండవలెను మిగిలిన యంశములన్నియు మేరువునందు జెప్పబడినట్లు చేయవలెను.

## 10. కైలాసమేరువు 5వ పద్ధతి లతినము

అపరాజిత 167వ సూ.

శ్లో॥ వేదరామాబ్ధి త్రివేదాః షడ్ త్రింశద్భిర్విభాజితే ।
భ్రమైర్వినాస భ్రమోవా కర్తవ్యః సర్వకామదః॥ 27
కర్ణేప్రతిరథేచైవ ద్వే ద్వేశృంగే పంచాండకాః ।
ద్వాదశచోరః శృంగాణి ప్రత్యంగాని తథాష్టచ॥ 28
కర్ణాబ్యంతిలకాని కుర్యాత్ కైలాసోనామతో భవేత్॥ (28½)

తా॥ చతురశ్ర ప్రదేశమును 36 భాగములుచేసి 4-3-4-3-4 ఇట్లు భాగములుచేసి భ్రమములు లేకుండగాని భ్రమయుక్తముగా గాని చేయవచ్చును. కర్ణమునను, ప్రతిరథమునను, 2-2 శృంగములును 5 అండకములును, ఉరఃశృంగములు 12 ను ప్రత్యంగములు 8 యును కర్ణికలయందు తిలకములను రచించవలెను. దీనిని కైలాసమని చెప్పుదురు. (అనుబంధము 5, 6 పటములు చూడుడు)

## 11. త్రివిష్టప మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము :

శ్లో॥ త్రివిష్టప మథబ్రూమః ప్రాసాద మసుర ప్రియమ్॥
సేవితం యక్షగంధర్వ సిద్ధవిద్యాధరాదిభిః ।
చతురశ్రీ కృతే క్షేత్రే వింశత్యంశ విభాజితే॥
షడ్భాగ విస్తృతాశాలా స్యాచ్చతుర్భాగ నిర్గమా ।
చతుశ్నతీ కోష్ఠకానాం ద్వాసప్తత్యధికా భవేత్॥
ఆశాత్రయ స్థితైర్భద్రైః సార్థమేవం ప్రజాయతే ।
కుర్యాద్ గర్భగృహాణ్యష్టౌ దిక్ష్వష్టా స్వపితానితు॥
కోణేతు షోడశాంశాని తన్మధ్యే చతురోఽంశకాన్ ।
భిత్తిర్ ద్వాదశభిర్భాగైర్గర్భాణా మితినిర్ణయః॥
చతుః షష్టిపదః కార్యో మధ్యే ప్రాసాదనాయకః ।
పదైః షోడశ భిస్తస్య మధ్యే గర్భం ప్రకల్పయేత్॥

ద్విభాగవిస్తృతాభిత్తిః కర్తవ్యా తస్య బాహ్యతః ।
చతుర్దింశం భ్రమంతీ స్యాత్ తస్యాః పంచపదాయతా॥
వలభీః కారయేత్ తద్వత్ దిగ్భాగేషు చతుర్ష్వపి ।
ప్రత్యంగం ద్విపదం కర్ణశాలావలభి కాంతరే॥
తచ్చద్విపద ముద్దిష్టం జలమార్గే పదార్ధికే ।
పదైర్ద్వా దశభిర్దిక్షు చతస్రుష్వపి మండపాన్॥
ప్రాసాదస్య ప్రకుర్వీత కర్మశోభా విభూషితాన్ ।
మూలప్రాసాద గర్భస్య కుర్యాద్ ద్వార చతుష్టయమ్॥
విజ్ఞేయం తచ్చదిగ్భద్రే సూత్రమార్గానుసారతః ।
జలాంతరాణి కుర్వీత ప్రత్యంగే పార్శ్వయోరపి॥
బాహ్యభిత్తింతు కుర్వీత భాగేనైకేన సంమితామ్ ।
ఏవం విభజ్య కుర్వీత పురతోముఖ మండపమ్॥
ఊర్ధ్వమానమథ ద్వ్యంశం తత్రపీఠం చతుష్పదమ్ ।
మధ్యప్రాసాద జంఘాచ తద్వ దేవసముచ్ఛ్రితా॥
అతః పదైః స్యా ద్విస్తారాద్ ద్విగుణా శిఖరోన్నతిః ।
తస్యాశ్చ మధ్యే కుర్వీత షోడశాంశం తులోదయమ్॥
తులోదయస్య మధ్యేద్వే వేదీబంధం సపంచకమ్ ।
జంఘాచాష్ట పదాకార్యా మధ్యే చాసనపట్టికా॥
ఏషామంతర పత్రంచ కర్తవ్యం త్రిపదోచ్ఛ్రితమ్ ।
తులోదయస్యోప రిష్టాత్ ప్రమాణమథ కథ్యతే॥
చతుష్పదేషు కర్ణేషు కూటం పంచపదోదయమ్ ।
గ్రీవా పదస్య పాదోనా త్రిభిః పాదైస్తథాండకమ్॥
చంద్రికా కలశోత్సేధం పాదేనైకేన కల్పయేత్ ।
ప్రత్యంగే తిలకాస్త్ర్యంశా ఘంటాకలశ సంయుతాః॥
మధ్యేతు వలభీశృంగ మున్నతం సప్తభిః పదైః ।
ఊర్ధ్వత స్తిలకానాంస్యా దురో మంజరికాదశ॥
విస్తారేణ పదాన్యూర్ధ్వం భవేద్ ద్వాదశభాగికా ।
స్కంధః షష్ఠాంశ విస్తారో గ్రీవా పాదోన భాగికా॥

అండకం సార్ధభాగేన చంద్రికాభాగ ముచ్ఛ్రితా ।
ద్విపదః కలశోచ్ఛ్రాయ స్తద్వద్వైబీజ పూర్వకమ్॥
విస్తారో మూలమంజర్యాః కార్యః షోడశభిః పదైః ।
ఉచ్ఛ్రాయః సప్తదశభిః స్కంధో నవపదః స్మృతః॥
కార్యా సప్తలతోపేతా ప్రశస్తా మూలమంజరీ ।
గ్రీవాస్య భాగికాభాగ ద్వయమామలసారకమ్॥
చంద్రికా భాగమేకం స్యాత్ ద్విపదాకలశోచ్ఛ్రితిః ।
ఉక్తాయామూలమం జర్యః ప్రాక్ ప్రాసాదేషు తాస్వియమ్॥
కార్యో మహామకరాశ్చ చారుకర్మో పశోభితాః ।
బాహ్యాభిత్తి సమాయుక్తం ప్రాసాదస్య చతుర్దిశమ్॥
మల్లచ్ఛాద్యం ప్రకుర్వీత యథాశోభం విచక్షణః ।
సర్వతశ్చారు రూపాద్యై ర్విచిత్రైః శుభలక్షణైః॥
విభూషయేత్ సింహకర్ణైర్మల్లచ్ఛాద్యం మనోహరైః ।
వలభీత్రయ సంయుక్తం కర్ణకూట చతుష్టయమ్॥
యథాశోభం విధాతవ్యం ప్రాసాదేఽస్మిం స్త్రివిష్టపే ।
వాస్తౌ శతపదేయాని మర్మాణ్యుక్తాని సర్వతః॥
ఉత్సృజ్యతాని యత్నేన పరికర్మాత్రకారయేత్ ।
ప్రాసాదంకార యిత్వైన ముక్తరూపం త్రివిష్టపమ్॥
లభేతేహ యశోరాజ్యం పరత్రా నంత్యమేవచ !
కృత్వాత్రివిష్ట పందివ్యం ప్రాసాదం పురభూషణమ్॥
వసేత్ త్రివిష్ట పేతావద్ యావదాభూత సంప్లవమ్ ।
తస్యాంతేతు పరే తత్త్వే లయమాప్నోతి మానవః

తా॥ దేవతలకు ప్రియమైన త్రివిష్టప మేరువుయొక్క లక్షణములను చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 20 భాగములు చేసి అందుశాల 6 భాగములును, దానియొక్క నిర్గమము 4 భాగములును, ఇట్లు మూడు వైపుల చేయవలెను. 472 కోష్ఠములును, భద్రములు 3 దిశలయందును, $1\frac{1}{2}$ భాగము చేయవలెను. 8 దిక్కుల

యందును 8 గర్భగృహములను రచించవలెను. మూలను 16 భాగములును, దానిమధ్య గృహము 4 భాగములు, గోడ 12 భాగములును, ఇట్లు ఒక్కొక్క గర్భగృహమును రచించవలెను. నడుమనున్న ప్రదేశమును 8-8 చొప్పున 64 భాగములు నాయకప్రాసాదమును రచించవలెను. ఆప్రాసాదమునకు మధ్య 4-4 చొప్పున 16 భాగములు గర్భమును, గోడ 2 భా.లును, దానిచుట్టూ నలువైపుల భ్రమంతి 5 భాగములును, తూర్పు మొదలగు నలుదిశలయందు వలభి 5 భాగములును, ప్రత్యంగము 2 భాగములు, కర్ణశాల వలభియొక్క లోపల రచించవలెను. దానియొక్క విస్తారము 2 భాగములు, జలమార్గము $\frac{1}{2}$ భాగము, నలుదిశలయందు మండపములు 15-15 భాగముల చొప్పున ప్రాసాదమునకు కల్పించవలెను.

ఆ మండపములు చక్కని పనితనముతో నుండవలెను. ప్రధాన ప్రాసాదమునకు నలువైపుల ద్వారములను కల్పించవలెను. ఆ ద్వారములయందు భద్రములను సూత్రముననుసరించియే చేయవలెను. ముందుకు పెంచగూడదు. దాని కిరువైపుల ప్రత్యంగములును జలమార్గములును కలిగియుండవలెను. వెలుపలి గోడ 1 భాగము చేయవలెను. ఇట్లు విభజించి ముందు ముఖమండపమును రచించవలెను. విస్తారమునకు రెట్టింపు ఎత్తును చెప్పుచున్నాడు. 40 భాగములుచేసి పీఠము 4 భాగములు, మధ్యప్రాసాదము యొక్క జంఘ 4 భాగములు, తరువాత విస్తారమునకు రెట్టింపుతో శిఖరము యొక్క యెత్తును చేయవలెను. దానియొక్క నడుమ దూలము వఱకు యెత్తు 16 భాగములు, దూలముయొక్క పైభాగమునకు నడుమ వేదబంధము ప్రస్తరముతోగూడ 2 భాగములు, జంఘ 8 భాగములు, దానిమధ్య పీఠపట్టికయును, దీనికి అంతరపత్రమును కలిపి 3 భాగములు, దూలముయొక్క పైభాగమున రచించవలసిన విధమును చెప్పబోవుచున్నాడు.

కర్ణముల యొక్క విస్తారము 4 భాగములు, యెత్తు 5 భాగములు, గ్రీవ $\frac{3}{4}$ భాగము, అండకము 3 భాగములు, చంద్రిక కలశము 1 భాగము, ప్రత్యంగమున తిలకములు 3 భాగములు, ఘంటకలశములు కలిగియుండవలెను. మధ్యను వలభియొక్క శిఖరము యెత్తు 7 భాగములు, పైన తిలకములమీాద ఉరోమంజరి విస్తారము 10 భాగములు, ఎత్తు 12 భాగములు, స్కంధపట్టము యొక్క విస్తారము 6 భాగములు, గ్రీవ $\frac{3}{4}$ భాగము, అండకము $1\frac{1}{2}$ భాగము, చంద్రిక 1 భాగము, కలశము 2 భాగములు, బీజపూరకము అదే మాదిరి. మూలమంజరి యొక్క విస్తారము 16 భాగములు, ఎత్తు 17 భాగములు, స్కంధము 9 భాగములు, మూలమంజరి యందు 7 లతలు రచించవలెను. గ్రీవ 1 భాగము, ఆమలసారకము 2 భాగములు, చంద్రిక 1 భాగము, కలశము 2 భాగములు, ఇట్లు మూలమంజరి పూర్వప్రాసాదముల యందు చెప్పబడినట్లు చక్కగా రచించవలెను: గొప్ప మకరరూపములను అందముగా రచించవలెను. ప్రాసాదము యొక్క నలుదిశలను వెలుపలిగోడ రచించవలెను. మల్లచ్ఛాద్యమును చక్కగా రచించవలెను. అంతటను చక్కనిరూపములును, విచిత్రముగాను శుభలక్షణములతోను చేయవలెను.

మల్లచ్ఛాద్యమునకు సింహకర్ణములను అందముగా రచించవలెను. వలభి యనునవి 3 కల్పించవలెను. కర్ణకూటములు 4 చేయవలెను. ఈ ప్రకారముగా త్రివిష్టప మేరువును రచించవలెను. వాస్తువునందలి శతపదము అను భాగముల ప్రకారము చెప్పబడిన మర్మవేధరూపమగు దోషములు లేకుండ మిక్కిలి సుందరముగా చేయవలెను. ఇట్లు త్రివిష్టపమును జేయించినేని వారికి కీర్తియును, రాజ్యమును, లభించును. ఇంతేకాక అట్టి మానవుడు పరమేశ్వరుని యందు లీనమగును.

## 12. త్రివిష్టపమేరువు 2వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ మందరస్యచ సంస్థానే త్రమాపేతదవ స్థితే।
భద్రేద్వే ఉరు మంజర్యౌ। విమానాఃకుముదోద్భవాః॥ 39
కైలాస వత్కర్ణ శృంగం శిఖరంమందరాత్మకమ్।
త్రివిష్టపః సమాఖ్యాతః ప్రాసాదః సురవల్లభః॥ 40

తా॥ మందరమేరువు యొక్క భద్రములయందు 2 ఉరో మంజరులను 2 చేసి కుముదము యొక్క పద్ధతితో విమానములను రచించి కర్ణశృంగములను కైలాస మేరువున చేసినట్లును శిఖరము మందరమేరువువలెను చేసినచో త్రివిష్టపమేరువగును.

(అనుబంధము 7, 8 పటములు చూడుడు.)

## 13. పృథివీ జయమేరువు లక్షణము (సాంధారము)

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ అథాభిధీయతే సమ్యక్ ప్రాసాదః పృథివీజయః।
కిన్నరాసురయక్షాద్యైర్వందితః సురసత్తమైః॥
చతురశ్రీ కృతేక్షేత్రే దశభాగ విభాజితే।
చతుర్భాగాథ వేచ్ఛాలా। సపాదాంశ వినిర్గతా॥
కర్ణశృంగ ద్వయంకార్యం ప్రత్యేకం భాగవిస్తృతం।
పాదోనపద నిష్క్రాంతం। సఃవిలాంతర సంయుతం॥
భాగైశ్చతుర్భి ర్గర్భఃస్యాద్ భిత్తిఃకార్యాతుభాగికా।
భ్రమంతి కాపిభాగేన। బాహ్యాభిత్తిశ్చభాగికీ॥
భాగ ద్వయేనకుర్వీత దిక్త్రియేఽస్యచతుష్కికామ్।
పురతోమండ పంకుర్యా। దుపేంత కర్మశోభయా॥
ఏవం విభాగానీ సంకల్ప్య యథోద్దేశం విచక్షణః।
మందర స్యేవ కుర్వీత। కర్మశోభాంస మంతతః॥

ఊర్ధ్వతోయత్ ప్రమాణంస్యాత్ తదస్యేహాభిధీయతే ।
అధస్తాన్నాగ పీఠఃస్యాత్ ప్రమాణేన పదద్వయమ్ ॥
హీరకం భాగపాదేన। తస్య మధ్యే నివేశయేత్ ।
విస్తారాద్ ద్విగుణంచోర్ధ్వ మానంభాగార్ధ సంయుతమ్ ॥
ఊర్ధ్వ మానస్య మధ్యేస్యాత్ షట్పదాని బర్హ్మాణాదయః ॥
వేదీబంధశ్చతన్మధ్యే కర్తవ్యఃసార్ధ భాగికః ॥
తతో హీరకసంయుక్తా జంఘా పదచతుష్టయా ।
మేఖలాంతర పత్రంచ కార్యంభాగార్ధ సంమితమ్ ॥
భాగ ద్వయేన కర్తవ్యం వేదికా రాజపీఠికా ।
చంద్రావలోకం భాగేన విదధీత విచక్షణః ॥
కుర్యాత్ పదస్యపాదేన తత్రైవాసన పట్టకమ్ ।
పదద్వయేన సాంశేన స్తంభమూర్ధ్వం నివేశయేత్ ॥
అర్ధభాగేన కుర్వీత। భరణం స్తంభ శీర్షకే ।
అర్ధభాగేన పట్టంచ చ్ఛాద్యం సార్ధ పదాయతమ్ ॥
వసంత పట్టికా కార్యా తతో భాగార్ధ సంమితా ।
ఊర్ధ్వ మంతరపత్రస్య (కారయేచ్చ యథాక్రమమ్) ॥
కుర్యాద్ గ్రీవాండ కలశం చంద్రికాభిః సమంబుధః ।
ఉచ్ఛ్రియంకర్ణ శృంగాణాం సార్ధభాగ ప్రమాణతః ॥
స్తంభ సూత్రేణ కర్తవ్యం। నష్ట శృంగం విచక్షణైః ।
కూటాని పంచకుర్వీత యథావత్ ప్రథమక్షితౌ ॥
త్రీణి భూమాద్వితీయాయాం। తృతీయా యాంతుకూటకమ్ ।
కుర్యాత్ తుల్య సముచ్ఛ్రియ। విస్తారం తచ్ఛమానతః ॥
కర్ణేకర్ణేతు కూటాని। భవంత్యేవం పృథజ్జన ।
శుకనాసోన్నతిః కార్యా। సార్ధ భాగ ద్వయంబుధైః ॥
స్యాదురోమంజరీ పూర్వా నష్ట శృంగస్య చోపరి ।
విస్తారాత్ త్రిపదా సాస్యాత్ సార్ధ భాగత్రయోన్నతా ॥

భాగం సపాదం కుర్వీత గ్రీవాం సకలశాండకమ్ ।
ద్వితీయశ్శృంగ స్యోర్ధ్వంస్యా దురోమంజరి కాపరా ॥
విస్తీర్ణా చతురో భాగాన్ కార్యాపంచ పదోచ్ఛ్రితా ।
స్కంధావరోహణా గ్రీవా। చంద్రికాకల శైఃసహ ॥
ఏతేషాంతు సముచ్ఛ్రాయః సార్ధభాగం విధీయతే ।
ఉరఃశిఖర కాణ్యష్టా వేవం కుర్యా చ్చతుర్దిశమ్॥
తృతీయ కర్ణ శృంగస్య స్యాదూర్ధ్వం మూలమంజరీ ।
సాభవేత్ షట్పదోచ్ఛ్రాయా। పద పంచక విస్తృతా ॥
త్రిపదస్కంధ విస్తారో దిత్రస్యాచ్చ తస్యాప్యపి ।
కూటైశ్చ వివిధ న్యాసై రలం కుర్వీతమంజరీమ్ ॥
అర్ధ భాగోచ్ఛ్రితా గ్రీవా సార్ధాంశ ద్వయ విస్తృతా ।
అండకస్య సముచ్ఛ్రాయస్త్రి భాగోనపదం భవేత్ ॥
కర్పరంచార్ధ భాగేన కలశః పదముచ్ఛ్రితః ।
నవభిః శిఖరైర్యుక్తః కర్తవ్యోఽయం సమంతతః॥
వేదీ బంధస్తు సర్వత్ర కర్తవ్యః శతవాస్తువత్ ।
కుర్యాత్తేన విభాగేన కలశాన విశోభనాన్ ॥
మంజరీః పద్మ పత్రాగ్ర తుల్యాః సర్వత్ర కారయేత్ ।
అండకాని భవంత్యత్ర చత్వారింశచ్చ పంచచ ॥
ఏవం విధం విధత్తేయః ప్రాసాదంపృథివీజయం ।
పృథ్వీం విజయకృ తేత్నాం। నిర్జితారిః సపార్థివః ॥
అన్యోఽపికశ్చిద్యః కుర్యాద్ వర్ణానాం భక్తిమానితమ్ ।
సోఽపిసౌఖ్యమ వాప్నోతి పశ్చాదంతే పరం పదమ్ ॥

తా॥ యక్ష కిన్నరసురాసురులచే పొగడదగిన పృథివీజయ మేరువు యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశ మును 10 భాగములుచేసి శాల 4 భాగములు, నిర్గమము $1\frac{1}{4}$ భాగము, కర్ణశృంగములు రెంటను 1.1 భాగము విస్తారముతోను, నిర్గమము

$\frac{3}{4}$ భాగమును, $\frac{1}{2}$ భాగముచొప్పున జలమార్గముతోను రచించవలెను. గర్భము 4 భాగములు, గోడ 1 భాగము, భ్రమంతిక 1 భాగము, వెలుపలి గోడ 1 భాగము, మఱియు మూడువైపుల 2 భాగముల గోడయును, రచించి నలువైపులముందు మండపములను అందముగా రచించవలెను. ఇట్లు విభజించి మందరమేరువువలెనే చక్కగా జేయవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. క్రింద నాగపీఠమును 2 భాగములు చేయవలెను. హీరకము $\frac{1}{4}$ భాగము, మధ్యను, విస్తార మునకంటె రెట్టింపు యెత్తును, లేక $1\frac{1}{2}$ భాగము మధ్యమ పక్షము.

1 దానిమధ్య వేదీ బంధము $1\frac{1}{2}$ భాగము, దానిపైన హీరక ముతో గూడ జంఘ 4 భాగములు, మేఖల అంతరపత్రము $\frac{1}{2}$ భాగము, వేదిక రాజపీఠము. 2 భాగములు, చంద్రావలోకము 1 భాగము, పీఠ పట్టకము $\frac{1}{4}$ భాగము, పైన స్తంభము $2\frac{1}{4}$ భాగములు, ఆ స్తంభముపైన భరణము $\frac{1}{2}$ భాగము, పట్టము $\frac{1}{2}$ భాగము, ఛాద్యము $1\frac{1}{2}$ భాగము, వసంత పట్టిక $\frac{1}{2}$భాగము, దానిపైన అంతరపత్రము $\frac{1}{2}$ భాగము, గ్రీవ, అండకము, కలశము, చంద్రికలతో సమానము గాను, కర్ణశృంగములయొక్క యెత్తు $1\frac{1}{2}$ భాగము. స్తంభ సూత్ర ముతో సమానముగా రచించివలెను. శిఖరములేకుండ చేసి 5 కూటములను రచించవలెను ఇది మొదటి అంతస్తుయొక్క విధానము. రెండవ యంతస్తున 3 కూటములును, మూడవ యంతస్తున 1 కూట మును, ఎత్తుతో సమానముగా విస్తారముండునట్లు అన్ని కర్ణముల యందును కూటములు 9 రచించవలెను. శుకనాస యెత్తు $2\frac{1}{4}$ భాగ ములు, శృంగములను రచించకవిడిచిపెట్టినచోట ఉరోమంజరిని కల్పించవలెను. ఉరోమంజరి యొక్క విస్తారము 3 భాగములు, ఎత్తు $3\frac{1}{2}$ భాగములు, గ్రీవ, స్కంధము, కలశము, అండకము, ఇవి $1\frac{1}{4}$ భాగము, రెండవ శృంగముపైన నొకయురో మంజరి విస్తారము 4 భాగములు, ఎత్తు 5 భాగములు, స్కంధము, అవరోహణము, గ్రీవ,

చంద్రిక, కలశము, ఇవి యన్నియును $1\frac{1}{2}$ భాగము రచించవలెను. ఉరఃశిఖరములు 8. ఇట్లు నలువైపుల రచించవలెను. మూడవ కర్ణ శృంగము యొక్క పైభాగమున మూలమంజరి విస్తారము 5 భాగములు, ఎత్తు 6 భాగములు, స్కంధము యొక్క విస్తారము 3 భాగములు, ఇట్లు నలువైపుల రచించవలెను. అనేకవిధములైన కూటములతో మంజరిని అలంకారముగా చేయవలెను. గ్రీవ $\frac{1}{2}$ భాగము, విస్తారము $2\frac{1}{2}$ భాగములు, అండకము $2\frac{3}{4}$ భాగములు, తల $\frac{1}{2}$ భాగము, కలము 1 భాగము ఇట్లు 9 శిఖరములతో రచించవలెను. వేదీ బంధము అంతటను శతవాస్తువలెనే చేయవలెను. ఆభాగములతోనే కలశములును, మంజరులును, పద్మ పత్రముల యొక్క చివరలతో సమానముగా అంతటను రచించవలెను. 45 అండకములు రచించవలెను. ఇట్లు పృథివీజయమను మేరువునెవరు రచించుచున్నారో వారు లోకమున జయమును ఐశ్వర్యమును పొందుటయేకాక అంతమున పరమపదమును పొందుచున్నారు.

## 14. పృథివీ జయమేరువు 2వ పద్ధతి (సాంధారము)

అపరాజిత 170వ సూ.

శ్లో॥ త్రివిష్ట పస్య సంస్థానే తద్రూపేతదవస్థితే ।
ప్రరథే సర్వతోభద్రం కర్తవ్యంతు నవాండకమ్ ॥ 41
పృథ్వీజయస్తదానామ కర్తవ్యః సర్వకామదః ।
ఏకచ్ఛత్రంధరా రాజ్యం తస్య పృథ్వీంచశాసతః ॥ 42

తా॥ త్రివిష్టప మేరువునందు ప్రరథములున్నచోట సర్వతోభద్రములును, 9 అండకములును, రచించినచో పృథివీజయమగును. దీనిని రచించినవారు లోకమున జయమునుపొంది ఏకచ్ఛత్రాధిపత్యమును చేయుదురు.

(అనుబంధము 9వ పటము చూడుడు)

## 15. క్షితి భూషణమేరువు లక్షణము (సాంధారము)

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి ప్రాసాదంక్షితి భూషణం ।
అమరైర్వందితంసర్వైద్ స్తథాచాప్సర సాంగణైః ॥
చతురశ్రీ కృతేక్షేత్రే। ద్వాదశాంశ విభాజితే ।
భద్రే పంచపదాని స్యుః కోణేకార్యం పదత్రయమ్ ॥
గర్భంషోడశభిర్భాగై స్తస్య కుర్యా ద్విచక్షణః ।
కర్తవ్యాపద వింశత్యా కంఠభిత్తిః సమంతతః ॥
ప్రాసాదస్యాస్య కర్తవ్యా భ్రమణీతు పదద్వయమ్ ।
పదికా బాహ్యభిత్తిః స్యాద్। ద్విపదోభద్ర నిర్గమః ॥
జలాంతరంతు భాగస్తు గవాక్షకాః ।
భద్రాణాం మధ్యతః పంచ ప్రకాశాః సుమనోరమాః ॥
బాహ్యవిందం ప్రకుర్వీత। వేదీ జాల విభూషితమ్ ।
తస్యోపరిష్టాత్ కుర్వీత మాల్యోచ్ఛ్రియం సుశోభనమ్ ॥
ఊర్ధ్వ మానమథ బ్రూమః ప్రాసాదేక్షితి భూషణే ।
ఖురకంతస్య కుర్వీత। త్రిపదంపీఠ సంయుతం ॥
అస్యోచ్ఛ్రాయ స్తతః సార్ధ (పదాఃస్యాత్) పంచవింశతిః ।
ఏ తన్మధ్యేతు దశభిః పదైః కార్యస్తులోదయః ॥
రేఖా పంచదశాంశా స్యాత్ స్కంధ శీర్షం పదార్ధకమ్ ।
వేదీ బంధస్తు కర్తవ్యః సార్ధ భాగద్వయంబుధైః ॥
జంఘా షడ్భాగి కోచ్ఛ్రాయా। భాగార్ధేనాసనః శుభః ।
మేఖలాం తరపత్రంచ పదే నైకేనకారయేత్ ॥
కార్యాచతుష్కికా పంచ విస్తారాత్రిపదోచ్ఛ్రితా ।
తదూర్ధ్వతః క్రమఃకార్యో ద్విపదోఽన్యోఽధికం పదమ్ ॥
భూమయః పంచ కర్తవ్యా న్యూనాస్తాశ్చ యథోత్తరమ్ ।
ప్రథమాభూమికా కార్యా సార్థ భాగత్రయంబుధైః ॥
(ద్వి భాగస్తు గవాక్షః ?) ॥
సపాదాస్తు త్రయోభాగా ద్వితీయా సముదాహృతా ।
తృతీయాత్రి పదాకార్యా పాదోనత్రి పదా పరా ॥

భాగ ద్వయేనసార్ధేన పంచమీ భూమి విష్యతే ।
పాదహీన పదం గ్రీవా సపాద పద మండకమ్ ॥
చంద్రికా భాగమేకం స్యాత్ పద్మ పత్రనిభాశుభా ।
త్రిపదం కలశం విద్యాన్మాతులుంగ సమన్వితమ్ ॥
ద్రావిడం నాగరంవాపి వారాటం వాస్తుశోభనం ।
యదేకం వాంఛితంకర్తుః। తద్రూపంతం ప్రకల్పయేత్ ॥
నానాప్రకారైః స్తంభైశ్చ నానాభూషణ భూషితైః ।
కలశైః పద్మ పత్రైశ్చ హీరకైశ్చోపశోభితమ్॥
కృత్రిమగ్రా సయుక్తాభి శ్చంద్రశాలాభి రన్వితం ।
మకరగ్రా స సంయుక్తై స్తోరణై ర్లక్షణా న్వితైః ॥
కోణాత్ కోష్ఠైర్విచిత్రైశ్చ రూపైశ్చిత్రైశ్చ శోభితమ్ ।
కర్మ రమ్యం ప్రకుర్వీత। యథావద్ విత్తవిస్తృతమ్ ॥
గుణవాన్ నృపతిర్య ద్వద్ భూషయిత్వాఖిలం మహీం ।
క్షితిం విభూషయత్యేవం ప్రాసాదః క్షితిభూషణః ॥
ద్రవ్యేషు రేణుసంఖ్యాయా సుధాయామ పియావతీ ।
తావద్యుగ సహస్రాణి। కర్తా శివ పదే వసేత్ ॥

తా॥ అప్సరోంగనలచేతను దేవతలచేతను స్తుతింపబడుచున్న క్షితిభూషణ మేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి భద్రము 5 భాగములు, కోణము 3 భాగములు, గర్భము 4.4. చొప్పున 16 భాగములు, దానిచుట్టును కంచము అనుగోడ 1 భాగము, భ్రమణి 2 భాగములు, వెలుపలిగోడ 1 భాగమును, భద్రముయొక్క నిర్గమము 2 భాగములు, జల మార్గము $\frac{3}{4}$ భాగము, గవాక్షులు భద్రములకు మధ్యనుండి 5 చక్కగాచేసి వెలుపల అవిందమును రచించవలెను. వేదియును జాలకములును కలిగి యుండవలెను. దానిపైన తోరణమును సుందర ముగా నిర్మించవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. పీఠముతో సహ

ఖురమును 3 భాగములు చేయవలెను. మొత్తము యెత్తు $25\frac{1}{2}$ భాగములు, ఇందులో మధ్య 10 భాగములు మూలముయొక్క పై భాగమువఱకు. రేఖ 15 భాగములు, స్కంధము యొక్క తల $\frac{1}{2}$ భాగము, వేదీ బంధము $2\frac{1}{2}$ భాగములు, జంఘ 6 భాగములు, దాని యొక్క పీఠము $\frac{1}{2}$ భాగము, మేఖల అంతరపత్రము కలసి 1 భాగము, ఇట్లు నాలుగు స్తంభములను రచించవలెను. విస్తారము 5 భాగములు, ఎత్తు 3 భాగములు కలిగియుండవలెను. ఆపైన కప్పు 2 భాగములు, ఆ కప్పుపైన పీఠము 1 భాగము, ఇట్లు 5 అంతస్తులు చేయవలెను. ఒక్కొక్క అంతస్తునకు $\frac{1}{4}$ భాగము తగ్గించుచుండవలెను. మొదటి అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, రెండవ అంతస్తు $3\frac{1}{4}$ భాగములు, మూడవ అంతస్తు 3 భాగములు, నాలుగవ అంతస్తు $2\frac{3}{4}$ భాగములు, అయిదవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములు, గ్రీవ $\frac{3}{4}$ భాగము, అండకము $1\frac{1}{4}$ భాగము, చంద్రిక 1 భాగము పద్మ పత్రముతో సమానముగా నుండవలెను, కలశము 3 భాగములు, మాదీ ఫలమువలె నుండవలెను. ద్రావిడముగాని, నాగరముగాని, వరాటముగాని, మఱియే పద్ధతియైనను యజమానుని కోరిక ప్రకారము చేయవచ్చును. స్తంభములనేక విధములుగాను,అలంకారములనేక విధములుగాను, చేయవచ్చును. కలశములు, పద్మ పత్రములు, హీరములు, కృత్రిమ గ్రాసములుగా రచింపబడిన చంద్ర శాలలు, మకరముల నోటినుండి వెలువడినట్లు తోరణములు, మూలలయందు శాలలు, విచిత్రరూపములు, మొదలగు వానితో సౌందర్యముగా రచించినట్లయిన క్షితిభూషణ మేరువగును. దీనిని నిర్మించినవారు అనేకయుగములు శివసాన్నిధ్యమున నుందురు.

## 16. క్షితి భూషణమేరువు 2వ పద్ధతి (సాంధారము)

అపరాజిత 170వ సూ.

శ్లో॥ ఛందేఽష్టధా విభక్తేచ భిత్తిగర్భ భ్రమంతికాః ।
ద్విభాగశ్చ భవేత్కర్ణో। భద్రం భాగచతుష్టయమ్॥ 43

నిర్గతంచార్ధ భాగేన కర్ణేస్యాదుదకాంతరమ్ ।
కర్ణేచనందికా కార్యా శిఖరంవై విమానజమ్ ॥ 44
పంచాండకంభ వేచ్ఛృంగం ఘంటాకలశ భూషితమ్ ।
సింహ కర్ణాత్మకం భద్రం పృథ్వీభూషణ సంజ్ఞకః ॥ 45

తా॥ చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి గోడ, గర్భము భ్రమంతిక, అనునవి కల్పించవలెను అనగా గర్భము 4 భాగములు, చుట్టూ గోడ 1 భాగము, భ్రమంతిక 1 భాగము భద్రము 4 భాగములు, కర్ణము 2 భాగములు, భద్రమునకు నిర్గమము ½ భాగము, కర్ణమున జలమార్గమును రచించవలెను. మఱియు కర్ణమున నందిని రచించవలెను. శిఖరము విమాన పద్ధతితో రచించవలెను. శిఖరమునకు 5 అండకములును, ఘంట, కలశము, అనువానిని రచించవలెను. భద్రమునందు సింహకర్ణములను రచించవలెను దీనిని క్షితి భూషణ మందురు.

## 17. సర్వతో భద్రమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ సంస్థానం సర్వతోభద్ర స్యాధునా పరికీర్త్యతే ।
చతురశ్రీకృతంక్షేత్రం విభజేద్ దశభిఃపదైః ॥
తత్రగర్భోభ వేత్తావత్ యావత్ స్యాద్ బ్రహ్మణః పదమ్।
గర్భగేహాద్ భ్రమంతీచ। భిత్తిశ్చేతి పదంపదమ్ ॥
భాగమేకేన భద్రంస్యాత్ సార్ధభాగ వినిర్గతమ్ ।
కర్ణం ద్విభాగికం కుర్యాత్। జలమార్గ సమన్వితమ్ ॥
పదపాదస్య పాదేన విస్తారోజల వర్త్మనః ।
యత్రైకమేవ భద్రంస్యా। చ్చారుస్తం భైరలంకృతమ్ ॥
సంమోద దంస్యాత్ తద్ వస్తు ధనధాన్య సుఖావహామ్ ।
చతుర్భిర్విస్తృతం భాగైః సార్ధభాగ వినిర్గతమ్ ॥
భద్రస్యైవాగ్రతో భద్రం తచ్చబాహ్యాదరం విదుః ।

విస్తారాద్ ద్విగుణశ్చాస్య సముచ్ఛ్రాయః ప్రకీర్తితః ॥
కుంభ కంభాగికం కుర్యాద్ భాగార్ధేనమ సూరకమ్ ।
భాగపాదేన కుర్వీత। తతశ్చాంతర పత్రకమ్ ॥
మేఖలాయాః సముచ్ఛ్రాయ మర్ధభాగేన కారయేత్ ।
చతుర్భాగోన్నతాజంఘా। త్రాసకింకిణి కాన్వితా ॥
పదంపాద విహీనంస్యాత్। శీర్ష స్థానేషు హీరకమ్ ।
మేఖలాంతర పత్రంచ। పదార్ధేన సముచ్ఛ్రితమ్ ॥
త్రిభాగ వినతంకుర్యాత్ భాగే చంద్రావలోకనమ్।
ఊర్ధ్వ మాసనపట్టస్య స్తంభంకుర్యాత్ పదద్వయమ్ ॥
హీరగ్రహణ శీర్షంచ। పాదేనైకేన కారయేత్ ।
భాగేనైకేన కుర్వీత పట్టపిండం విచక్షణః ॥
ద్వి పదంఛాద్య విస్తారం తదర్ధేన సమున్నతమ్ ॥
జఠరంబాహ్యసీ మాచ భిత్తయశ్చాంధ కారికా ।
జంఘోత్సేధశ్చ కర్ణశ్చ మంధరస్య యథా భవేత్ ।
కోణేషు రథికాః కార్యాః కలశాంతాః పదత్రయమ్ ॥
ద్వితీయా ద్విపదోచ్ఛ్రాయా। రథికాపరికీర్తితా ।
ఉచ్ఛ్రాయః సింహకర్ణస్య ప్రథమస్య పదత్రయమ్॥
పద ద్వయం ద్వితీయస్య తత ఏవ సమున్నతిః।
శృంగణాంస్యాన్మిథః శ్లేషో। భాగంప యథోత్తరమ్ ॥
భాగాన్ సప్తోచ్ఛ్రితం కుర్యాచ్ఛిఖరం విస్తృతంతు షట్ ॥
అర్ధభాగోచ్ఛ్రితా గ్రీవా స్యాదేకం భాగ మండకమ్ ॥
చం దికార్ధ పదేనస్యాత్ సార్ధంతు కలశః పదమ్ ।
మంజరీః పద్మపత్రాగ్రే తుల్యాః సర్వత్రకారయేత్ ॥
అధస్తాద్ భద్ర పీఠంతు వాస్తుపాదేన శోభనమ్ ।
యః కుర్యాత్ సర్వతోభద్రం సర్వలక్షణ సంయుతమ్ ॥
జన్మ శ్రీరాజ్యమశ్నుతే తతో లభతే పరమంపదమ్ ॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి మధ్య గర్భము 4 భాగములు, గోడ 1 భాగము, భ్రమంతి 1 భాగము, వెలుపలిగోడ 1 భాగము చేయవలెను. భద్రము 6 భాగములు, నిర్గమము 1½ భాగము, కర్ణము 2 భాగములు, జలమార్గముతో కూడ నుండవలెను. జలమార్గము ¼ భాగము చేయవలెను. భద్రము చక్కని స్తంభములతోనలంకారముగా చేయవలెను. భద్రము ముందు పైన భద్రముయొక్క విస్తారము 4 భాగములు, దానిని వెలుపలి గర్భముగా దెలిసికొనవలెను. దానియొక్క విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. కుంభము 1 భాగము, మసూరకము ½ భాగము, అంతరపత్రము ¼ భాగము, మేఖల ⅓ భాగము, జంఘ 4 భాగములు, కదలునట్టి మువ్వలతో నుండవలెను. హీరకము ¾ భాగము, మేఖల అంతరపత్రము ⅓ భాగము, వంపు 3 భాగములు, చంద్రావలోకనము 1 భాగము, ఆసనపట్టము యొక్క పైన స్తంభము 2 భాగములు, హీరగ్రహణ శీర్షము 1 భాగము, పట్టము 1 భాగము ఛాద్యముయొక్క విస్తారము 2భాగములు, అందులో సగము యెత్తును చేయవలెను. గర్భముయొక్క వెలుపల గోడలును అంధకారిక యును రచించవలెను. జంఘయొక్క యెత్తు కర్ణములు మందరమువలె చేయవలెను. మూలలయందు రథికలను రచించవలెను. ఆరథికలు కలశముతో సహా 3 భాగములుండవలెను. ఆపైన రథికలు యెత్తు కలశములతో కూడ 2 భాగములు, మొదటి సింహకర్ణము యొక్క యెత్తు 3 భాగములు, రెండవ సింహకర్ణము యొక్క యెత్తు 2 భాగములు, శృంగములు లేకున్నప్పుడు దానిక్షేపము 1 భాగము, ఆపైన శిఖరము 7 భాగములు, శిఖరముయొక్క విస్తారము 6 భాగములు, గ్రీవ ⅓ భాగము, యెత్తు. అండకము 1 భాగము, చంద్రిక ½ భాగము, కలశము 1½ భాగము, పద్మపత్రము యొక్క పై భాగముతో సమానముగానంతటను మంజరులను రచించవలెను. దానికి

దిగ్భద్ర పీఠమును వాస్తు భాగముల ప్రకారము చక్కగా జేయవలెను. ఈ సర్వతో భద్రమును 5 అంతస్తులతోను సమస్తమైన శుభలక్షణములతో నిర్మించినవారు జయశ్రీని పొందుటయేకాక భగవత్ సాన్నిధ్యము లభించును.

విశ్వకర్మ ప్రకాశిక అ 6.

శ్లో॥ షోడశాస్త్రక సంయుక్తో నానారూప సమన్వితః ॥ 88
అనేక శిఖర స్తద్వత్ సర్వతోభద్ర ఉచ్యతే ।
చంద్రశాలా సమోపేతో విజ్ఞేయః పంచభూమికః ॥ 89
త్రింశ ద్భిర్నందనః ప్రోక్తః సర్వతోభద్ర క స్తథా ॥ 101

## 18. సర్వతో భద్రమేరువు 2వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ పృథ్వీ భూషణ సంస్థానే తద్రూపేత దవస్థితే ।
ఉరఃశృంగంతతో భద్రే కర్తవ్యంచ విమానజమ్ ॥ 46
రథోద్గమ స్తదగ్రేచ స్వరూపోలక్షణాన్వితః ।
సర్వతోభద్రనా మాసౌ సర్వకల్యాణ కారకః ॥ 47

తా॥ పృథ్వీ భూషణ మేరువునందు భద్రమునందు ఉరఃశృంగమును రచించి విమానమును చేయవలెను. ఆపైన రథములను లక్షణయుక్తముగా నిర్మించినచో సర్వతోభద్ర మేరువగును. ఇది సమస్త కల్యాణములను కలిగించును.

## 19. సర్వతోభద్ర మేరువు 3వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీం సర్వతోభద్రః ప్రాసాదః పరికీర్త్యతే ॥ 23
సప్తాంత్ షడ్వింశ తింహస్తాన్ పరమఃపరిమాణతః ।
జఠరం బాహ్య సీమాచ। భిత్తయో హ్యంధకారికాః ॥ 24
జంఘో త్సేధశ్చ కక్షాచ యథామేరో స్తథా స్మృతాః।
తత్రైవ భద్రవిన్యాసై ః కార్యోభాగార్ధ నిర్గతః ॥ 25

రథికైకా చతుర్భాగా తతఃసార్ధ ద్విభాగికా ।
తాసాం పరస్పరంజ్ఞేయో। భాగభాగం విధీయతే ॥ 26

షడ్భాగాద్ విస్తృతం కార్యం శిఖరం సప్తమోచ్ఛ్రితమ్ ।
షడ్భిర్ధ శభిర్భాగేః స్యాన్మూలజా స్కంధ విస్తృతిః ॥ 27
గ్రీవార్థ భాగముత్సేధా దండకం భాగముచ్ఛ్రితమ్ ।
మూలసూత్రాను సారేణ చ్ఛేదః సంయుజ్యతే తథా ॥ 28
అస్యరేఖాతథా కార్యా సర్వత్రైయః ప్రసాధనీ ।
మేరోరస్యచ శృంగాణి సింహకర్ణై ర్విభూష యేత్ ॥ 29

మంజరీం పద్మకోశాగ్ర తుల్యాంసర్వత్రకార యేత్ ।
జయంలక్ష్మీంయశః కీర్తిం సర్వాణీష్ట ఫలానిచ ॥ 30
కరోతి సర్వతో భద్రం సర్వతోభద్రకః ॥ శృతః ॥

తా॥ విస్తారము 26 హస్తములు, గర్భము, వెలుపలి ప్రదేశము, గోడలు, అంధకారికులు, జంఘ, కర్ణములు, అన్నియును మేరువువలెనే చేయవలెను. భద్రముకూడ అటులనే చేసి దాని యొక్క నిర్గమము ½ భాగము చేయవలెను. మొదటి రథిక 4 భాగములును, రెండవ రథిక 2½ భాగములు, తరువాత రథికలు 1.1 భాగము మాత్రమే చేయవలెను. శిఖరముయొక్క విస్తారము 6 భాగములు, ఎత్తు 7 భాగములు, మూలమంజరి యొక్క విస్తారము 10 భాగములును, ఎత్తు 11 భాగములును చేయవలెను. స్కంధము యొక్క విస్తారము 6 భాగములు చేయవలెను. ప్రధాన సూత్రము ననుసరించి భాగములు చేయవలెను. రేఖను మూలసూత్ర ప్రకారము చేయవలెను. ఈ మేరువు యొక్క శిఖరములు సింహకర్ణములతో నుండవలెను. పద్మకోశము యొక్క చివరతో సమానముగా అన్ని మంజరులను రచించవలెను. ఇట్లు రచించినవారికి జయమును, లక్ష్మియును, యశస్సును, కీర్తియును, సమస్తమైన కోరికలు ఫలించుటయును, కలుగును.

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ పంచభూః సర్వతో భద్రో భద్రశాలా విభూషితః।
అనేక శిఖరాకీర్ణః కర్తవ్యః ప్రచురాండకః ॥
హస్తాంస్తునందన స్త్రింశత్ సర్వతో భద్ర ఏవచ ॥ 8

సమరాం. 63 అ. 0 శ్లో॥

తా॥ అయిదంతస్తులును భద్రశాలయును అనేక శిఖరములును అండకములతో ప్రకాశించునది సర్వతో భద్రము.

## 20. విమానమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ బ్రూమోవిమాన సంజ్ఞస్య ప్రాసాదస్యాథ లక్షణమ్ ।
గణగంధర్వజుష్టస్య వల్లభస్య దివస్పతేః ॥
చతురశ్రీ కృతేక్షేత్రే శతధాప్ర విభాజితే ॥
విమానం విభజేత్ ప్రాజ్ఞః। శ్రేయః పుష్టిసుఖావహమ్ ।
భద్రైశ్చతుర్భిస్తం కుర్యాత్ । కర్ణప్రాగ్గ్రీవ కైస్తథా॥
విస్తారార్ధంభవే ద్గర్భో। యచ్ఛేషంతే నభిత్తయః ।
త్రింశద్దాస్తో మతో జ్యేష్ఠో। మధ్యమఃపంచ వింశతిః॥
కనీయాంఃస్తు విధాతవ్యః షోడశోఽప్యేక వింశతిః ।
జాతి శుద్ధోభవేదేకో మంజరీ భిస్తథాపరః ॥
మిశ్రకచ్ఛ విమానస్య। త్రైవిధ్యమితి కీర్తితమ్।
జ్యేష్ఠోమిశ్రక నిర్మాణే సర్వః కైలాస వద్భవేత్ ॥
మధ్యమో జాతి శుద్ధస్తు। మంజరీభిర్వి వర్జితః ।
కనీయాంశ్చ విధాతవ్యో మంజరీ భిరలంకృతః ॥
కర్ణప్రాగ్గ్రీవ విస్తారః కర్తవ్యో భాగసమ్మితః ।
భాగార్ధంక్షోభణా కార్యా యచ్ఛేషం తచ్ఛ కర్ణవత్ ॥
భాగస్యార్ధేన కుర్వీత తస్మాద్ భద్రస్య నిర్గమమ్।
మిశ్రకస్య చతుర్భాగః ప్రాగ్గ్రీవో విస్తరేణతు॥

మూలసూత్రానుసారేణ పార్శ్వయోః పదికౌరథా।
ఊర్ధ్వమానం విమానస్య యథావదథ కథ్యతే ॥
ద్విపదం పీఠమాఖ్యాతం। కిన్నరైరుప శోభితమ్ ।
స్కంధంయావచ్చ భాగానాం ద్వావింశ తిరుదాహృతా ॥
వేదీ బంధస్తు క ర్తవ్యః। సార్ధభాగ ద్వయంభవేత్ ।
చతుర్భాగోఽత్ర...ఛాద్యా। భాగార్ధేన స కిన్నరా ॥
మేఖలాంతర పత్రంచ। పదమేకం సమున్నతమ్ ।
రూపాణి జంఘాగాత్రేస్యుః। వ్యోమచారిణామ్ ॥
రథకేస్తరమే కాతస్య మధ్యే (స్యా) న్మకర గ్రాసభూషితా।
మల్లికా తోరణై శ్చారు ఘంటాచామర కిన్నరైః ॥
ఊర్ధ్వం తులాప్రమాణస్య చతుర్భాగం ప్రథమతః ।
జంఘాద్య భూమికాయాంతు చతుర్భాగ సమున్నతా ॥
సార్ధ త్రిభాగాత్యే పరావిస్తారా సార్ధభాగికీ। సంక్షేపః ।
ప్రథమతోఽస్యాః కలశాంతే పదంభవేత్ ॥
తృతీయా త్రిపదాకార్యా సపాదపద విస్తృతా ।
పదార్ధేనతు సంక్షేప స్తస్యాః కార్యోవిచక్షణైః ॥
చతుర్థీ త్రిపదాకార్యా। భూమిర్మేఖల లయాసహ ।
లలితామంజరీభిశ్చ నీలోత్పలదలాకృతిః ॥
సీమ్నః పంచగుణం సూత్రం రేఖాంతం తత్ర వర్తయేత్।
వ్యాస హావసమ మాత్రా। ప్రవేశః ప్రథమాభువః ॥
తతోఽర్ధ వృద్ధి వృద్ధొద్వా వన్యస్తుర్యస్తు తత్సమః ।
పదార్ధం వేదికోత్సేథాద్ విస్తారాత్ పంచభాగికీ ॥
గ్రీవాపదోన భాగంస్యాత్ సపాదంభాగ మండకమ్ ।
కంకతీ ఫలరూపంచ మందారకుసు మాకృతిః ॥
చంద్రికా గ్రీవయా తుల్యా కలశోద్విపదోన్నతః ।
విమానంఘంద కం కుర్యాత్ సర్వలక్షణ సంయుతమ్ ॥

అశ్వమేధ ప్రధానైర్యా దిష్టైః క్రతుశతైర్భవేత్ ।
తదేకేన విమానేన ఫలమాప్నోతిమానవః ॥

తా॥ విమానమేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10.10 భాగములుచేసి నాలుగు భద్రము లును కర్ణములును ప్రాగ్గ్రీవములును చేయవలెను. విస్తారములో సగము గర్భమును, మిగిలినది గోడయును. ఉత్తమము 30 భాగ ములు, మధ్యమము 25 భాగములు, అధమము 16. మొదలు 21 వఱకు, జాతిశుద్ధముగా నిర్మించుట మొదటిపద్ధతి. మంజరులతో రచించుట రెండవ పద్ధతి. విమానమునందు రెండు విధములైన పనులను కలుపుట మూడవపద్ధతి. మిశ్రజాతి యందును కైలాస మేరువు యొక్క లక్షణములతో రచించుట మొదటి తరగతి. ఒక్కటే జాతిపనిచేసి మంజరి లేకుండానేని మధ్యమతరగతి. మంజరితో అలం కారముగా జేయుట అధమ తరగతి. కర్ణప్రాగ్గ్రీవముల విస్తారము 1 భాగము, క్షోభణ ½ భాగము, మిగిలినది కర్ణమువలె రచించవలెను. భద్రము యొక్క నిర్గమము ½ భాగము, మిశ్రజాతి ప్రాసాదమునందు ప్రాగ్గ్రీవము యొక్క విస్తారము 4 భాగములు, ప్రధానసూత్రము ననుసరించి యిరుపైపుల రథములు 1.1 భాగము, ఎత్తును చెప్పు చున్నాడు. అధిష్ఠానము 2 భాగములు కిన్నరగణముతో నుండవ లెను. స్కంధము ... భాగములు, మొత్తము 22 భాగములు, వేదీ బంధము 2½ భాగములు, మొదటి జంఘ 4 భాగములు, ½ భాగము కిన్నరులతో నుండవలెను. మేఖల అంతరపత్రము 1 భాగము, ఆ స్తంభమునందు గగనచరులును రథికులును ఉండవలెను. స్తంభము యొక్క నకుమ 1 భాగము మకరములచే మ్రింగబడినట్లుండవలెను. మల్లెపూవుల యొక్క దండలును సుందరమైన ఘంటలును చామర ములు ధరించిన కిన్నరులును దూలముయొక్క పైభాగము వఱకు నాలుగు అంతస్తులును కల్పించవలెను. మొదటి జంఘ 4 భాగముల

యెత్తు, రెండవ జంఘ విస్తారము 1½ భాగము మొదటినుండి చివరకు తగ్గుచు కలశముయొక్క చివర 1 భాగముండవలెను. ఎత్తు 3½ భాగములు, మూడవ జంఘ విస్తారము 1¼ భాగము, అదియును వరుసగా తగ్గుచు చివర ½ భాగముండవలెను, ఎత్తు 3 భాగములు, నాలుగవ జంఘ యెత్తు 3 భాగములు అంతస్తు మేఖలతో సహితము. చక్కని మంజరులును. ఆ మంజరులు నీలోత్పలదలములవలె నుండవలెను. విస్తారమునకు 5 రెట్లుగల సూత్రములతో రేఖయొక్క పై భాగమున గుండ్రముగా జేయవలెను. వ్యాసముయొక్క సమానముతో మొదటి అంతస్తును చేయవలెను. రెండవ అంతస్తున అర్థ భాగమువృద్ధి చేయనలెను. మూడవ అంతస్తున ఇంకొక అర్థ భాగమువృద్ధి చేయవలెను. నాలుగవ అంతస్తు సమముగా నుండవలెను. వేదిక ½ భాగము, విస్తారము 5భాగములు, గ్రీవ ¾ భాగము, అండకము 1¼ భాగము, కంకతీఫలమువలె నుండవలెను. మందార పుష్పమువలెను రచించవలెను చంద్రిక గ్రీవతో సమానముగా నుండవలెను. కలశము 2 భాగములు, ఈ విమాన మేరువును లక్షణయుక్తముగా రచించిరేని అశ్వమేధములు నూరు చేసిన ఫలమును దీనివలన పొందుదురు. అధిష్ఠానముపైన 22 భాగములుండవలెను.

(అనుబంధము 11వ పటము చూడుడు)

## 21. విమానమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే విభాగ శతభాజితే ॥ 31
విమానం విభజేత్ ప్రాజ్ఞః శ్రీయఃపుష్టి సుఖావహామ్ ।
భద్రైశ్చతుర్భిస్తత్ కుర్యాత్ కర్ణప్రాగ్గ్రీవ కైస్తథా ॥ 32
పంచభూమి ర్భవత్యేష యదివాత్రి విధాభవేత్ ।
హస్తాస్త్రింశ ద్భవేజ్జ్యేష్ఠో మధ్యమఃపంచ వింశతిః ॥ 33
స్యాదేక వింశతిర్హస్తాత్ కనీయాన్ షోడ శాధవా ।
జాతి శుద్ధోభవేదేకో మంజర్యా వైపరోభవేత్ ॥ 34

మిశ్రకోఽన్యో విమానానా మితిసంఖ్యాత్రిధోదితా ।
జ్యేష్ఠోమిశ్రక నిర్మాణః సచకైలాస భద్రకృత్ ॥ 35
మధ్యమోజాతి శుద్ధఃస్యాత్ కనీయాన్ మంజరీయుతః ।
పంచభాగయుతం భద్రం। విస్తారేణ ప్రకీర్తితమ్ ॥ 36
కర్ణప్రాగ్గ్రీవ విస్తారః కర్తవ్యో భాగసమ్మితః ।
భాగార్థం క్షోభణేకార్యం తలిపంతు జలాంతరమ్ ॥ 37
గుప్తకర్ణంతు కర్తవ్యం యదిచ్ఛేల్లక్షణాన్వితమ్ ।
తస్మాద్ భద్రస్య నిష్కాశం భాగేనైకేన కారయేత్ ॥ 38
మిశ్రకస్య చతుర్భాగం భద్రంకుర్యా ద్విచక్షణః ।
పంచభాగోచ్ఛ్రితా జంఘా ఖురపిండిక యాసహ॥ 39
ద్విభాగారథికా కార్యా భూమిఃస్యాచ్ఛతురంశకా ।
ద్వితీయార్ధాంశహీనాచ। తృతీయా భూమిరిష్యతే ॥ 40
చతుర్థీతుత్రి భిర్భాగై రర్ధహీనాతుపంచమీ ।
ఉదయోభూమికాయా యః కూటం కుర్యాత్ తదర్ధతః ॥ 41
అర్ధేనకుంభికాం కుర్యా దుచ్ఛాలక సమన్వితామ్ ।
ఊర్ధ్వ భూమిస్తు పంచమ్యా వేదికాభాగముచ్ఛ్రితా॥ 42
ఘంటామధ్యాగ విస్తారా కార్యాభాగ ద్వయోచ్ఛ్రితా ।
ఘంటోత్సేధం త్రిభిర్భాగైర్విభజేత్ తదనంతరమ్ ॥ 43
భాగికాని ప్రకుర్వీత కంఠశీర్షాండ కానిచ ।
భాగం కంఠప్రదేశఃస్యా దండకానాం సముచ్ఛ్రితిః ॥ 44
ఘంటార్ధేన విధాతవ్యా ద్విభాగాకలశోచ్ఛ్రితిః ।
సూరసేనాదికం సర్వం కర్తవ్యం పూర్వవత్ తథా ॥ 45
భద్రంమనోరమై శ్శోభా। సింహకర్ణై ర్విభూషయేత్ ।
పంచవ్యాసేన సూత్రేణ పద్మకోశం సమాలిఖేత్ ॥ 46
లతా దయోభవేదేషాం లతాభిస్తం ప్రకల్పయేత్ ।
మిశ్రకోమిశ్రి తైరంగైః। శుద్ధఃస్యాద్ భూమికాన్వితః ॥ 47

తా॥ మొదటి పద్ధతికిని ఈనికిని అన్నియును సమమేకాని స్తంభములు మాత్రము మొదటి అంతస్తున 5 భాగములును, ఖుర ముతోసహా యుండవలెననియు, రథిక 2 భాగములు, రెండవ అంతస్తు 4 భాగములు, మూడవ అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, తరువాత అంతస్తు 3 భాగములు, ఐదవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములు, అంతస్తుయొక్క యెత్తులో సగముకూటము చేయవలెను. కుంభము సగము ఉచ్ఛా లకముతో గూడ రచించవలెను. ఐదవ అంతస్తుపైన వేదిక 1 భాగము, ఘంటయొక్క విస్తారము 6 భాగములు, ఎత్తు 2 భాగ ములు, ఘంటయొక్క యెత్తును 3 భాగములుచేసి తరువాత అందు కంఠము, 1భాగము దండికతో సమానముగా నుండవలెను. కలశము 2 భాగములు చేయవలెను. భద్రమునందు సింహకర్ణములను చక్కగా రచించవలెను. 5 రెట్లుగల సూత్రముతో పద్మకోశమును రచించవలెను. శిఖరములు మొదలైనవి రచించవలెను.

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ అనేక శిఖరశ్చిద్ర శ్చతుర్ద్వారో మహోచ్ఛ్రితిః।
విమానచ్ఛందక స్త్వష్ట భూమికః పరికీర్తితః॥

తా॥ నాలుగుద్వారములును 8 అంతస్తులును అనేక శిఖరము లును కలిగినది. విమానమేరువగను.

## 22. విమానమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ దశధాచతలచ్ఛందః సాంధారఃపూర్వ విస్తరః।
ద్విభాగశ్చ భవేత్కర్ణః కర్ణికాచైక భాగికా॥ 48
ఏకభాగః ప్రతిరథ శ్చార్ధ భాగస్తునిర్గమే।
పునర్ ద్విభాగా కర్ణీఃస్యాత్ భాగపాదేన నిర్గతా॥ 49
ద్విభాగోభద్ర విస్తారో నిర్గమోభాగ ఏవచ।
కర్ణే ప్రతిరథే శృంగం పంచభూమ్యో విమానజాః॥ 50

కర్ణే నవాండకం శృంగం పంచాండక మథానుగే।
ఘంటా కలశశోభాఢ్యో విమానః సర్వకామదః॥ 51

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి గర్భము 4 భాగములు, గోడ 1 భాగము, అంధారిక 1 భాగము, వెలుపలి గోడ 1 భాగము, చేయవలెను. కర్ణము 2 భాగములు, కర్ణిక 1 భాగము, ప్రతిరథము 1 భాగము, నిర్గమము ½ భాగము, మరల కర్ణము 2భాగములు, నిర్గమము ¼భాగము, భద్రముయొక్క విస్తారము 2 భాగములు నిర్గమము 1 భాగము, కర్ణములకును ప్రతిరథములకును శిఖరములను రచించవలెను. 5 అంతస్తులు విమానపద్ధతితో చేయవలెను. కర్ణమునందు శిఖరము 9 అండకములతోను, ప్రతిరథమునకు 5 అండకములును, ఘంట కలశముతో ప్రధాన శిఖరమును రచించవలెను.

## 23. విమానమేరువు 4వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ పక్ష చంద్రగుణాశ్చైవ విభక్తే సూర్యసంఖ్యయా।
చత్వారోనందనాః కర్ణే విమానః శిఖరోద్గమే॥ 32
త్రిసప్తత్యండ కోజ్ఞేయో భద్రేచరథి కోద్గమః।
విమానోఽసౌ సమాఖ్యాతః కర్తవ్యః సర్వకామదః॥ 33

విశ్వకర్మ ప్రకాశ అధ్యాయము 6.

శ్లో॥ విమానచ్ఛందకస్తద్వచ్చతురస్రస్తథైవచ॥ 83
విమానచ్ఛందకం తద్వ దనేక శిఖరానుతః।
సచాష్టభూమికః॥ 87

తా॥ విమానమేరువు నలుచదరమును 8 అంతస్తులును అనేక శిఖరములును.

తా॥ చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి 2-1-3 ఇట్లు భాగములుచేసి విమానము శిఖరమువఱకు కలిగి యుండును

చతుస్త్రింశ ద్విమానకః॥ 101 విస్తారము 34 హస్తములు కలిగి యుండును. 5 అంతస్తులకు 12 చొప్పున 3 అంతస్తులకు 4 చొప్పున శిఖరము. 73 అండకములతో రచించి కర్ణమునకు భద్రము నను రథికములనున్నతముగా రచించిన యెడల విమాన మేరువగును.

(అనుబంధము, 12, 13 పటములు చూడుడు)

## 24. నందనమేరువు లక్షణము (సాంధారము)

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ నందన స్యాథవక్ష్యామః ప్రాసాదస్యేహ లక్షణమ్ ।
ద్వాత్రింశతి కరంక్షేత్ర మష్టధాప్ర విభాజయేత్ ॥
చతుర్భాగ ప్రవిస్తారం తస్యభద్రం ప్రకల్పయేత్ ।
భాగేనైకేన నిష్క్రాంతం ప్రాగ్గ్రీవంచాస్య శోభనమ్ ॥
మూలకర్ణస్య పదికౌ కర్తవ్యౌ పార్శ్వ గౌరథౌ ।
షడంగులం త్ర్యంగులంవా చతురంగుల మేవచ ॥
జలాంతరం ప్రకుర్వీత, దీయతే తత్రమంజరీ ।
గర్భశ్చ తుర్భిర్భాగైః స్యాచ్ఛే పంధి త్త్యంధకారికా ॥
ద్విపదంకంద భద్రంస్యాత్ పదపాదేన నిర్గతమ్ ।
పురతోమండ పంచాస్య సుగ్రీవంనామ కారయేత్ ॥
ద్వైగుణ్యం మూర్ధవిస్తారాత్ సార్ధభాగేన వేదికా।
రేఖామస్యతథా కుర్యాత్ కైలాసస్య యథోదితా ॥
భూమ యఃషడ్ విధాతవ్యా। ద్వాదశాండాః ।
పృథక్ పృథక్ నందయత్యేషకర్తార మిహలోకే పరేచయత్ ॥
నందనోనామ తేనోక్తః ప్రాజ్ఞైఃప్రాసాదసత్తమః ॥

తా॥ నందనమేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారము 32 హస్తములు, దానిని 8 భాగములుచేసి అందులో 4 భాగములు భద్రమును కల్పించి దానియొక్క నిర్గమము 1భాగముచేసి ప్రాగ్గ్రీవమును సుందరముగా రచించవలెను. ప్రధాన కర్ణము 1

భాగమును, ఇరువైపుల రథములు 1.1 భాగమును, జలమార్గము 6. 4. 3. అంగులములలోనే పద్ధతిగానైన చేయవచ్చును. మంజరిని రచించవలెను. గర్భము 4 భాగములును మిగిలినది గోడయును. అంధకారికయును, రచించవలెను. కంఠభద్రము 2 భాగములు చేయవలెను. దానియొక్క నిర్గమము $\frac{1}{4}$ భాగము, దానికిముందు సుగ్రీవమను పేరుగల మండపమును నిర్మించవలెను. ఎత్తులో అనగా 64 హస్తములలో $1\frac{1}{2}$ భాగము వేదికను రచించవలెను. రేఖను కైలాసమేరువున రచించినట్లు రచించవలెను. 6. అంతస్తులును 12. అండకములును, చేయవలెను. శిఖరముతో 13 అండకములగును.

(అనుబంధము 14వ పటము చూడుడు.)

## 25. నందనమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ నందన స్య భవేత్ సీమా ద్వాత్రింశద్ధస్త నిర్మితః ।
అష్టాష్టక విభాగేన చతుఃషష్టి పదోహిసః ॥ 48
భాగైశ్చతుర్భి ర్గర్భోఽస్య శేషంభిత్త్యంధకారికా ।
భద్రంగర్భసమం కార్యం తదర్ధేనాస్య నిర్గమః ॥ 49
ద్వారథాపార్శ్వతో భూయః సర్వతః కర్ణసూత్రతః ।
పంచభాగోచ్ఛ్రితా జంఘా। మేఖలాభాగ సమ్మితా ॥ 50
షడ్భూమిరేషభూమిః స్యాద్దేకైకా ద్వాదశాంశికా ।
రేఖా స్కంధాండకాదీనాం కైలాసేన సమాకృతిః ॥ 51
నందనోనందయత్యేష సమృద్ధ్యాహంతి చాపరః ॥

తా॥ 32 హస్తముల విస్తారమును, 8 భాగములుచేసి అందు గర్భము 4 భాగములు మిగిలినది గోడ అంధకారికయును చేయవలెను. గర్భముతో సమానము భద్రమును, అందులో సగము నిర్గమమును, భద్రమునకు రెండువైపుల రథములును, కర్ణసూత్రము నుండి అంతటను రచించవలెను. జంఘ 5 భాగములు, మేఖల 1

భాగము, 6 అంతస్తులు కలిగియుండవలెను. ప్రధాన రేఖ 12 హస్తములుండవలెను. రేఖ స్కంధము, అండకము, ఇవియన్నియును కైలాసమేరువున జేసినట్లు చేయవలెను. ఇది నందనము. 12-11-10-9-8-7. ఇట్లు చేసి పైన గలము కుంభము కలశము మొదలైన వానితో సహా 64 భాగములుగాని చేయవచ్చును.

## 26. నందనమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ కర్ణే ద్విక్రమతః కార్యా నందిశాలేచనందికా ।
నందనాఖ్యః ప్రతిరథే భద్రే శృంగద్వయంభవేత్ ॥ 52
అష్ట ప్రత్యంగసంయుక్తా విమానేచోరు మంజరీ ।
నందనఃకామదశ్చోత్థం విమానే మూలమంజరీ ॥ 53

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ వింశాండక సమాయత్తో నందనః సముదాహృతః ॥ 88

తా॥ నందనమునకు 20 అండకములుండవలెనని చెప్పబడియున్నది త్రింశద్భిర్నందనః ప్రోక్తః ॥ 101 విస్తారము.

తా॥ నందిశాలయందు కర్ణమున 2. నందికలను, ప్రతిరథమున భద్రమును. ఆ భద్రమునకు 2 శిఖరములును 8 ప్రత్యంగములును ఉరోమంజరియును శిఖరమును, ప్రధానమంజరిని రచించిన యెడల నందనమగును.

(అనుబంధము 15వ పటము చూడుడు)

## 27. నందనమేరువు (4 నాగరపద్ధతి)

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ హస్తాంస్తు నందన స్త్రింశత్ ॥ 29¾

తా॥ విస్తారము 30 హస్తములుండవలెనని మాత్రము చెప్పబడియున్నది. మిగిలిన పద్ధతియంతయును. నాగరపద్ధతి మేరువు యొక్క లక్షణము 63వ అధ్యాయమున చూడవచ్చును.

# 28. స్వస్తిక మేరు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ అథాభి దధ్మః ప్రాసాదం స్వస్తికం స్వస్తిదాయకం ।
దేవాసురగణై ర్వంద్యం యక్ష సిద్ధమహోరగైః ।
జ్యేష్ఠమధ్య కనిష్ఠస్య తలచ్ఛందోఽస్య యాదృశః ॥
యాదృగూర్ధ్వ ప్రమాణంచ తత్సమ్యగిహ కథ్యతే ।
చతురశ్రీ సమేక్షేత్రే పంచవింశతి హస్తకే॥
సూత్రపాతం ప్రకుర్వీత కర్ణ తిర్యఙ్ముఖాయతమ్ ।
తతఃసీ మార్థ సూత్రేణ వృత్తమాలిఖ్య నిశ్చితమ్ ॥
ద్వాత్రింశతా సమంతాత్త ద్రేఖాభిర్వి భజేత్తత ః।
వృత్తంత్వ ధోముఖాత్తస్మిన్ దిగ్విదిక్ స్థాభిరంకయేత్ ॥
దికఽర్ణసూత్ర యోర్మధ్యం తతోరేఖాత్రయంబుధః ।
కుర్యాద్ ద్వాత్రింశ దేవంస్యు ర్భాగాస్తుల్య ప్రమాణకాః॥
ఐంద్రాదిష్వీశ పర్యంతా స్వష్టాశాలాః ప్రకల్పయేత్ ।
శాలాంతరేషు కుర్వీత కోణానష్టౌ యథాక్రమమ్ ॥
కోణాతోఽణంన యేత్ సూత్రం త్యక్త్వాశాలా ।
ద్వయంముహుః। విదిక్ష్వష్టసు సూత్రాగ్రం ।
పద్మ పత్రావదాన యేత్ ॥
కోణాశ్చ రథికాశ్చైవ భవంత్యేవంసులక్షణాః ।
చతురశ్రాభవంత్యష్టౌ శాలా భాగద్వయాయతాః ॥
ద్వ్యంశాని కర్ణభద్రాణి పద్మపత్రని భానిచ ।
ఊర్ధ్వ మానంభవత్య స్య ద్విగుణం హ్యార్థ్వమాపనాత్ ॥
వింశత్యా విభజేదూర్ధ్వం తత్రాష్టాంశస్తులోదయః ।
శేషాంతు మంజరీం కుర్యాదా సఽంధావధి బుద్ధిమాన్ ॥
విస్తార పంచమాంశేన పీఠోచ్ఛ్రాయం ప్రకల్పయేత్ ।
త్రిపదం వేదికాబంధం ఖురకేణ సమన్వితమ్ ॥

జంఘాంశ లంబనాం కుర్యా చ్చతుర్భాగ సముచ్ఛ్రితామ్।
మేఖలాంతర పత్రంచ భాగమేకేన కారయేత్॥
ద్వాదశాంశోచ్ఛ్రితా రేఖా కార్యా స ప్తచభూమయః।
అర్ధభాగోచ్ఛ్రితా గ్రీవా। విస్తారేణ చతుష్పదా॥
స్కంధఃషడ్భాగ విస్తారః కార్యోవృత్తః సుశోభనః।
సమాలిఖేదేషు కోశం విస్తారాత్ త్రిగుణాత్మనా॥
సూత్రేణ యేనవాస్కంధో భవేత్ షడ్భాగ విస్తృతః।
హస్తైఃస్యాత్ పంచవింశత్యా జ్యేష్ఠః షోడశభిఃపరః॥
కనీయాన్ స్వస్తికోజ్ఞేయః కరైర్ద్వాదశభిః పునః।
భాగ షట్కసముత్సాయా జంఘాజ్యేష్ఠ స్యకీర్తితా॥
మధ్య మాధమయోఃపంచ చతుర్భాగోచ్ఛ్రితా క్రమాత్।
స్వస్తికే కారితేస్వస్తి సర్వలోకస్య జాయతే॥
విశేషతశ్చ భూపానాం। కర్తుశ్చస్యాత్ సమీహితమ్॥

తా॥ దేవదానవ యక్ష గంధర్వాది సమస్తమైనవారిచేతస్తు తింపదగిన స్వస్తికమేరువు లక్షణమును చెప్పుచున్నాడు. ఉత్తమము మధ్యమము అథమము, అను మూడువిధములుకలవు. అందు ఉత్తమము 25 హస్తములు, కలదానిని చతురశ్రముగాచేసి అడ్డము నిలువు మూలలుసరిచూచి తరువాత అందులో సగము సూత్రముతో మూలలనానుకొనునట్లు గుండ్రముగా రేఖను గీయవలెను. దానిని 32 భాగములు చేయవలెను. ఆ వృత్తమునకు దిగువ దిక్కులకు విదిక్కులకు గుర్తులు పెట్టవలెను. ఆ వృత్త రేఖలు 3 గీయవలెను. పైనజెప్పిన 32 భాగములు సమముగాజేసి పూర్వ మొదలు ఈశాన్యమువఱకు 8 శాలలును, ఆశాలలమధ్య కర్ణములును, రచించవలెను. మొత్తము ఆకారము తామరపుష్పమువలె నుండవలెను. శాల 2 భాగములు చదరముగాను, రథిక 2 భాగములు గుండ్రముగాను, రచించవలెను. ఒకమూలనుండి మఱియొక మూలకు

6]

మాత్రమే నూలుపట్టి కొలత చేయుచుండవలెను. తరువాత విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. ఆ యెత్తును 20 భాగములుచేసి అందు 8 భాగములు దూలము యొక్క పై భాగము వఱకును, మిగిలినభాగములు మంజరియును, స్కంధమును రచించవలెను. విస్తారములో 5వ వంతు పీఠముయొక్క యెత్తు చేయవలెను. వేదికాబంధము ఖురముతోసహా 3 భాగములుండవలెను. జంఘ యెత్తు 4 భాగములు, మేఖల అంతరపత్రము 1 భాగము, రేఖ యొక్క యెత్తు 12 భాగములు, 7 అంతస్తులు చేయవలెను. గ్రీవ ½ భాగము, విస్తారము 4 భాగములు, స్కంధముయొక్క విస్తారము 6 భాగములు, గుండ్రముగాను అందముగాను రచించవలెను. విస్తారమునకు 3 రెట్లు గలసూత్రముతో స్కంధమును రచించవలెను. 25 హస్తములు ఉత్తమము 16 హస్తములు మధ్యముల, 12 హస్తములు అధమము, ప్రమాణము కలిగియుండవలెను. ఉత్తమ ప్రాసాదమునకు జంఘ 6 భాగములుండవలెను. మధ్యమమునకు 5 భాగములును, అధమమునకు 4 భాగములును కలిగి యుండవలెను. స్వస్తికమేరువును రచించినచో లోకము క్షేమముగా నుండును.

(అనుబంధము 16వ పటము చూడుడు)

## 29. స్వస్తికమేరువు 2వ పద్ధతి (లలితము)

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే పంచవింశతిహస్తకే ॥ 52
సూత్రపాతంతతః కుర్యాత్ కర్ణాయతముఖాయతమ్ ।
తతః సీమార్ధ సూత్రేణ సమ్యగ్ వృత్తం సమాలిఖేత్ ॥ 53
తతస్తదష్ట వింశత్యా భజేద్భాగై ర్యథాపదమ్ ।
నిర్మాపయేత్తదర్ధేన శాలాదిక్సూత్ర సంస్థితాః ॥ 54
తాసాంతుమధ్యగాః కార్యా ఏకైకస్యరథా స్త్రయః ।
అన్యేచార్ధరథాః కార్యాః శాలాకర్ణ సమాశ్రితాః ॥ 55

భాగపట్కోచ్ఛ్రితా జంఘా భాగార్ధేనతు మేఖలాః।
భాగేనాంతర పత్రంస్యాద్ భాగంచోద్వృత్త మండకమ్॥ 56
అర్ధభాగోచ్ఛ్రితా గ్రీవా విష్కంభేనచతుష్పదామ్ ।
శిఖరస్యోచ్ఛ్రయో భాగై రేకాదశభి రిష్యతే॥ 57
సర్వేషామేవలతినా మాత్రిధా ద్విగుణోపిసః ।
విస్తారాద్ ద్విగుణంసూత్రం స్కంధాద్యంచాపి షడ్గుణమ్॥ 58
సూత్రాన్వితం సమాకృష్య పద్మకోశం సమాలిఖేత్ ।
స పంచవింశతిర్హస్తా జ్యేష్ఠః షోడశమధ్యమః॥ 59
కనీయాన్ ద్వాదశకరా శ్చాస్యోచ్ఛ్రియం విజానతా।
జ్యేష్ఠస్య భాగసంఖ్యేయ మేతదర్ధేన మధ్యమః॥ 60
మధ్యమస్యత ధార్ధేన కనీయాన్ భాగసంఖ్యయా।
భాగషట్కమితా జంఘా। జ్యేష్ఠ స్యపరికీర్తితా॥ 61
సప్తభాగో చ్ఛ్రితాసాస్యాన్మధ్యమేస కనీయసి ।
సర్వేషాంలతినామేష క్షేత్రేణ విధిరీరితః॥ 62
స్వాస్తికోఽయంసమాఖ్యాతః స్వాస్తి శ్రేయస్కరోనృణామ్॥ 62½

తా॥ చతురశ్ర ప్రదేశము 25 హస్తములు నలువైపుల సరిచూచి అందులోసగము గల సూత్రముచేత గుండ్రముగా గీయవలెను. దానిని 28 భాగములుచేసి తూర్పు మొదలగు 8 దిశలయందు సగపాలుశాలలును, మూలలయందు 8 రథములును, రథముయొక్కయుశాల యొక్కయు మధ్య అర్ధభాగము రథికలును చేయవలెను. జంఘ యెత్తు 6 భాగములు మేఖల ½ భాగము, అంతరపత్రము 1 భాగము, అండకము 1 భాగము, గ్రీవ ½ భాగము, విస్తారము 4 భాగములు, శిఖరము యెత్తు 11 భాగములు, అనగా మొత్తము 20 భాగములయెత్తు లతినములన్నిటికిని యెత్తు విస్తారమునకు రెట్టింపుగాచేసి స్కంధము మొదలుకొని 6 రెట్లు సూత్రముతో పట్టుకొని పద్మకోశమును రచించవలెనని చెప్పబడియున్నది. 25

హస్తములయెత్తు ఉత్తమము, 16 హస్తములయెత్తు మధ్యమము, 12 హస్తములయెత్తు అధమము, జ్యేష్ఠమునకు జంఘపైన చెప్పబడి యున్నది. మధ్యమమునకు జంఘ 7 భాగములయెత్తు, కనీసమునకును 7 భాగములే యుండవలెను.

(అనుబంధము 17వ పటము చూడుడు)

## 30. స్వస్తికమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే కర్ణాంతే వృత్తమాలిఖేత్ ।
వేదర్త్వంశైశ్చ పరిధా షట్పదం భద్ర కాష్టకమ్ ॥ 54
పదికా కర్ణికా ప్రోక్తా భద్రం వేదాంశ విస్తరమ్ ।
నిర్గమ శ్చైక భాగేన కర్తవ్యః సర్వకామదః ॥ 55
కర్ణాశ్చ ద్విపదా అష్టౌ తత్ర శృంగాణికారయేత్ ।
సీమాంద్విభాగి కాంత్యక్త్వా పునర్వృత్తంతు కారయేత్ ॥ 56
అష్టచత్వారింశద్భక్తే హ్యాష్టభద్రం చతుష్పదమ్ ।
ద్విపదా అష్టకర్ణాశ్చ లతాండంభూమి పంచకమ్ ॥ 57
ఘంటాకలశ శోభాఢ్యా భద్రంద్వి ద్వ్యురుమంజరీ ।
స్వస్తికోఽసౌ సమాఖ్యాతః కర్తవ్యః శాంతిమిచ్ఛతా ॥ 58

తా॥ చతురశ్ర ప్రదేశమును కర్ణాంతమునుండి వృత్తమును గీయవలెను. దానిని 64 భాగములుచేసి ఒక్కొక్క భద్రము 6 భాగములచొప్పున 8 యును ఒక్కొక్క కర్ణిక 1 భాగము చొప్పున 8 యును, చేయవలెను. జలమార్గము ½ భాగము చొప్పున రచించవలెను. రెండవ అంతస్తున 48 భాగములుచేసి భద్రము 4 భాగములును, నిర్గమము 1 భాగమును, కర్ణము 2 భాగములును, చేయవలెను. వీనికి శిఖరములను కూడ రచించవలెను. సీమను 2 భాగములువదలిపెట్టి మరల పైన వృత్తమును రచించి భద్రము 4 భాగములును, కర్ణము 2భాగములును, ఇట్లు 8దిక్కుల యందును రచించి.

లతాండము 5 అంతస్తులుచేసి ఘంట, కలశము, భద్రము, 2 ఉరో మంజరి 2 భాగములును, కల్పించిన యెడల స్వస్తికమగును.

(అనుబంధము 18, 19 పటములు చూడుడు)

## 31. ముక్తకోణమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ ముక్తకోణ మథబ్రూమః ప్రాసాదంస్యాత్ సచత్రిధా ॥
హస్తైఃక్రమేణ జ్యేష్ఠాదిః షోడశద్వాదశాష్టభిః ।
జ్యేష్ఠోఽష్టాదశభాగాన్ స్యాన్మధ్యమస్తు చతుర్దశ ॥
కనీయాన్దశ భాగాన్స్యాత్ సదస్తస్యా భిధీయతే ।
చతురశ్రీ కృతేక్షేత్రే భక్తేఽష్టాదశభిఃపదైః ॥
కోష్ఠకానాంవిధా తవ్యం చతుర్వింశం శతత్రయమ్ ।
భాగషట్త్రింశతా కుర్యా న్మధ్యే గర్భగృహం శుభమ్ ॥
బాహ్యాభిత్తిస్తథాంధారీ మధ్యభిత్తిరితి త్రయమ్ ।
పృథక్ పృథక్స్యాద్ ద్విపద విస్తారం పరిమాణతః ॥
చతుర్భాగాయతాశాలా భాగేనైకేన నిర్గతా ।
శాలాయాంభూషణంభద్రం విధాయైతత్ పదద్వయమ్ ॥
తత్పార్శ్వే ద్వితయే కుర్యాత్ త్వధికేభాగకే బుధః ।
వార్యంతరాణి కుర్వీత దిక్ష్వష్టచత స్వప్వపి ॥
వార్యంతరానంతరంతు భాగద్వితయ సంమితాత్ ।
అష్టౌ కుర్వీత రథికాం శ్చతుర్దిశ మనుత్తమాన్ ॥
కోణే ద్విభాగికైఃకుర్యాద్ రథానామంశ సంమితః ।
కోణేరథాన్ పరిత్యజ్య శేషంకుర్యాద్ యథోదితమ్ ॥
మధ్యమోఽయం సమాఖ్యాతః కనీయాన్ కథ్యతేఽధునా।
చతురశ్రీ కృతేక్షేత్రే దశభాగ విభాజితే ॥
చతుర్భాగాభవేచ్ఛాలా భాగేనైకేన నిర్గతా ।
ఏకభాగ ప్రమాణాని। పార్శ్వే వార్యంతరాణిచ ॥

తేషాం మధ్యే ప్రకుర్వీత సరోజదలసన్నిభమ్ ।
రథకర్ణే యథావచ్చ సలిలాంతరభూషణమ్ ॥
భాగార్ధం క్షోభణాకార్యా చతుష్కేణేవ్యవస్థితా ।
సార్ధభాగోన్నతాన్ కుర్యాత్ కర్ణాన్ ప్రాగ్గ్రీవకాఞ్ శుభాన్ ॥
వార్యంతరాణాం యా ప్రోక్తా భూషణశ్రీః కనీయసి ।
ప్రాసాదే మధ్యమేఽప్యేషా జ్యాయస్యపిచ కల్ప్యతే ॥
త్రివిధోఽయం సమాఖ్యాతో ముక్తకోణః సమాసతః ।
ఊర్ధ్వమానం భవేదస్య విస్తారాద్ ద్విగుణోచ్ఛ్రయమ్ ॥
అంశస్తు పంచదశభిస్తన్మధ్యం స్యాత్తులోదయః ।
చతుష్పదో వేదిబంధో। జంఘా సార్ధైశ్చ సప్తభిః ॥
మేఖలాంతరపత్రంచార్ధం సార్ధంహీరకం పదమ్ ।
త్రిపదాకర్ణ శృంగాస్య కలశాంత సముచ్ఛ్రయాన్ ॥
సింహకర్ణశ్చ కర్తవ్యః స్వష్ట భాగసమున్నతః ।
ఊర్ధ్వతః కర్ణ శృంగస్య విధేయామూల మంజరీ ॥
సావై షోడశ విస్తారాద్ పదాన్యష్టాదశోచ్ఛ్రితా ।
చతుర్దిశం సమాయామః స్కంధఃస్యాన్నవభాగికః ॥
మంజర్యాస్త్ర్యంశే పురతః శుకనాససముచ్ఛ్రితిః ।
గ్రీవాపాదోన భాగేన కుర్యాద్ ద్విపద మండకమ్ ॥
చంద్రికా సార్ధభాగేన త్రిపదం కలశోచ్ఛ్రియమ్ ।
నిర్మాపయన్నరః కశ్చిన్ ముక్తకోణం మహాయశాః ॥
సంప్రాప్నోతి మహాసౌఖ్యం విముక్తః సర్వపాతకైః ।
సర్వ ద్వంద్వ వినిర్ముక్తః సర్వకిల్బిషవర్జితః ॥
సర్వపాప వినిర్ముక్తో భోగంమోక్షంచ విందతి ॥

తా॥ ముక్తకోణ మేరువుయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. ఉత్తమము 16 హస్తములు, మధ్యమము 12 హస్తములు. అధమము 8 హస్తములు విస్తారము, ఉత్తమమును 18 భాగములును, మధ్య

మమును 14 భాగములును, అధమమును 10 భాగములును చేయవలెను. ఉత్తమ భాగముల వివరము. 18-18 భాగములుచేసి మధ్య గర్భగృహము 6.6 భాగములును, వెలుపలి గోడ 2 భాగములు, అంధారిక 2 భాగములు, లోపలిగోడ 2 భాగములు చేయవలెను. శాల విస్తారము 4 భాగములు, నిర్గమము 1 భాగము, ఆ శాలముందు భూషణభద్రము 2 భాగములు ఇరువైపుల 1.1 భాగము నిర్గమము. ప్రక్కలయందు ఒక్కొక్క భాగము జలమార్గము, తరువాత 2 భాగముల చొప్పున 8 రథములును, మూలలయందు 2 భాగములు రథములును రథముల రెంటిమధ్య జలమార్గము 1 భాగము. ఇది ఉత్తమ భాగములపద్ధతి మధ్యమమున 14 భాగముల వివరము కోణములయందు రథములను తేకుండ జేసినచో సరిపోవును. అధమమున 10 భాగముల వివరము శాల 4 భాగములు, నిర్గమము 1 భాగము, ప్రక్కలయందు జలమార్గము 1 భాగము, వానియొక్క మధ్యనుపద్మదళములవలె రచించవలెను. మూలలయందు రథములను 1½ భాగము చేయవలెను. ఆ కర్ణములయొక్క ప్రక్కను ½ భాగము క్షోభణమును చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. 15 భాగములు దూలముపై మట్టము, వేదిబంధము 4 భాగములు, జంఘ 7½ భాగములు, మేఖల ½ భాగము, అంతరపత్రము 1½ భాగము, హీరకము 1 భాగము, కర్ణములయందలి శిఖరములు, 3 భాగములు, కలశములతోసహా సింహకర్ణములు 8 భాగములయెత్తు, ఆపైన మూలమంజరి విస్తారము 16 భాగములు, ఎత్తు 18 భాగములు, నలువైపుల సమముగా నుండవలెను. స్కంధము 9భాగములు, మంజరిలో 3వ భాగము శుకనాస యెత్తుండవలెను. గ్రీవ ¾ భాగము, అండకము 2 భాగములు, చంద్రిక 1½ భాగము, కలశము 3 భాగములు, ఈ ముక్తకోణమేరువును రచించినవారు సౌఖ్యమును భోగమును కీర్తియును పొందుటయేకాక సమస్త పాపములునశించి మోక్షము లభించును.

(అనుబంధము 20వ పటము చూడుడు)

## 32. ముక్తకోణమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీం ముక్తకోణస్య లక్ష్మబ్రూమః సతుత్రిధా ॥ 63
షోడశ ద్వాదశాష్టౌచ హస్తసంఖ్యా పరస్యచ ।
జ్యేష్ఠః షోడశభిర్భాగై ర్మధ్యో ద్వాదశభిర్భవేత్ ॥ 64
కనీయా నష్టభిః ప్రోక్తః। ప్రాసాదో ముక్తకోణకః ।
ముక్తకోణ స్వస్తికయో రిదమేవాంతరం భవేత్ ॥ 65
స్వస్తికో వర్తుల స్తత్ర చతురశ్రో ఒపరః స్మృతః ।
పంచభాగోన్నతా జంఘా ద్విభాగా రథికా భవేత్ ॥ 66
భాగైశ్చతుర్భిః కర్తవ్యా తృతీయాతస్య భూమికా ।
శేషా స్వర్ధార్ధ భాగోనం విధేయా స్తస్య భూమికాః ॥ 67
విధాయ నవధాగర్భం సైత్ర్ర యోదశ భిర్భవేత్ ।
జంఘా పాదోనపంచాం శైరాద్యైక స్త్వధికో భవేత్ ॥ 68

తా॥ జ్యేష్ఠము 16 మధ్యమము 12, కనీసము 8, హస్తముల విస్తారమును, అటులేవరుసగా 16-12-8 భాగములు చేయవలెను. స్వస్తికమేరువు గుండ్రముగాను, ఇది నలుచదరముగాను, రచించుట యేతక్క యితరములన్నియును సమానమే జంఘ 5 భాగములు, రథిక 2 భాగములు, దీనిని 3 అంతస్తులుచేసి ఒక్కొక్క అంతస్తు $\frac{1}{2}$ భాగము తగ్గించవలెను. 2వ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, 3వ అంతస్తు 4 భాగములు, చేయవలెను. మఱియు గర్భము 3.3 చొప్పున 9 భాగములుచేసి ముందుకు 1 భాగము పెంపుచేసి దానిని ప్రక్కలను గూడ $\frac{1}{2}$ భాగము చొప్పున పెంపుచేయగా 13 భాగములగును. దానికి జంఘ $4\frac{3}{4}$ భాగములుచేసి యిట్లు 2 స్తంభములతో ప్రాగ్గ్రీవము మొదటి అంతస్తున చేయవలెను.

## 33. ముక్తకోణమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ మందరస్య చసంస్థానే మధ్యేతత్త్రైవ తాదృశః ।
వేదాంశోభద్ర విస్తార స్తదర్ధంతు వినిర్గతమ్ ॥ 59
వార్యంతరంభద్ర పక్షే త్రిభాగఃకర్ణవిస్తరః ।
మూలనాసాస్థానతశ్చైక భాగోభయనిర్గతా ॥ 60
ద్విభాగోభద్ర విస్తారో భాగమేకైక నిర్గతమ్ ।
కర్ణభద్రం వృత్తభద్రే ఏకాంశముదకాంతరమ్ ॥ 61
సంస్థానే మూలనాసాయా భాగంస్యాత్కర్ణకక్షకమ్ ।
నిర్గమఃకర్ణమానేన పృథుత్వంచతురంశకమ్ ॥ 62
అష్టభాగం భవేద్రేఖా మల్లభూతలపంచకా ।
కర్ణేతిలక సంఘాటో భద్రేవై కూట ఘంటికే ॥ 63
శృంగంచ ఘంటాకలశే ధ్వజమాలా కులంభవేత్ ।
ముక్తాః సంసారతస్తైయై ర్ముక్తకోణే విధీయతే ॥ 64

తా॥ మందరమేరువునందు భద్రము 4 భాగములు నిర్గమము 2 భాగములుచేసి, భద్రముయొక్క ప్రక్కలయందు జలాంతరములను రచించవలెను. కర్ణములయొక్క విస్తారము 3 భాగములు, ప్రధాననాస ప్రదేశమునుండి యిరువైపుల 1-1 భాగము నిర్గమము, భద్రముయొక్క విస్తారము 2 భాగములు, నిర్గమము 1 భాగము, గుండ్రముగాజేసిన కర్ణభద్రమున వృత్తభద్రము 1 భాగము జలమార్గము, ప్రధాననాసయొక్కప్రదేశమున కర్ణము 1 భాగము, నిర్గమము కర్ణమానముచేతలావు 4 భాగములు. శిఖరము 8 భాగములు, మల్లతలములతో 5 అంతస్తులు, కర్ణమున తిలకములుండవలెను. భద్రమున కూటములును ఘంటలును, శిఖరమును కలశమును, ధ్వజముమాల మొదలైనవి చేయవలెను. ఇది ముక్తకోణము.

## 34. ముక్తకోణమేరువు 4వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ షడ్షడ్ సచంద్రతత్త్వాని షట్త్రింశ ద్భిశ్చభాజితే ।
కర్ణేశృంగ ద్వయంచైవ మేకంప్రతిరథే భవేత్ ॥ 36

భద్రే శృంగత్రయంకార్యం పంచాండం దలశృంగకమ్।
త్రినవత్యండకఃకార్యో ముక్తకోణశ్చలక్షితః॥ 37

తా॥ చతురశ్ర ప్రదేశమును 36 భాగములుచేసి, మధ్యనుండి 6-6-6 భాగములుచేసి వెలుపలిగోడ అంధారిక, లోపలిగోడ గర్భము అనగా బ్రహ్మస్థానమునుండి యనుట, కర్ణమున శిఖరములు 2 యును, ప్రతిరథమున 1 యును, భద్రమున 3ను, దలమున 5 అండకములును శృంగములును, మొత్తము 93. అండకములతో ముక్తకోణమగును.

(అనుబంధము 21వ పటము చూడుడు)

## 35. శ్రీవత్స మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ శ్రీ వత్సమథవక్ష్యామః ప్రాసాదం సురపూజితమ్॥
చతురశ్రీ కృతేక్షేత్రే దశధాప్రవిభాజితే।
షడ్భిర్భాగైర్భవేద్గర్భో భిత్తిఃకార్యా ద్విభాగికీ॥
రథకం త్రిపదంకుర్యాత్ ప్రత్యంగం సార్ధభాగికమ్।
ద్విపదంకర్ణ మస్యాహు ర్విదిక్షుచ తస్యప్యపి॥
భాగార్ధం క్షోభణాక్షేపాత్ తదర్ధార్ధం జలాంతరం।
ప్రక్షేపఃస్యాత్ పదార్ధేన పనమానస్య శాహ్యతః॥
ద్వేపదే నిర్గతంచాస్య శుకనాసంనివేశయేత్।
వాస్తు విస్తారపాదేన కర్తవ్యాద్వార విస్తృతిః॥
ద్వారోచ్ఛ్రియస్తు విస్తారాత్ కర్తవ్యో ద్విగుణోబుధైః।
ఊర్ధ్వమాన మథబ్రూమః శ్రీవత్స స్య యథోదితమ్॥
పీఠంప్రాసాద పాదేన। ఖురకశ్చ పదార్ధకః।
విస్తారాద్ ద్విగుణంచోర్ధ్వం కర్తవ్యం కుంభకాదితః॥
అంశైర్ద్వాదశ భిస్తేషు కుర్యాచ్ఛిఖరమాయతమ్।
అష్టభాగింతులోచ్ఛ్రియం వేదీసార్ధ ద్విభాగికీ॥

కుంభకం పదికం కుర్యాత్ పాదోనాంశమసూరకమ్।
పాదోనపదేన స్యాత్ మేఖలాంతర పత్రకమ్॥
చతుర్భాగోచ్ఛ్రితా జంఘా భాగార్ధం హీరకంభవేత్।
మేఖలాంతరపత్రంతు। భాగేనైకేనకారయేత్॥
షడ్భాగ విస్తృతంస్కంధం భాజయేద్ దశభిఃపదైః।
యథామూలే తథాస్కంధేఽప్యంగ ప్రత్యంగకల్పనా॥
స్కంధ పార్శ్వతుయోః రేఖా వ్యక్త్వాశ్చ స్కంధబాహ్యతః।
భజేత్ తాదశభిర్భాగై రూర్ధ్వమేవం విభాజయేత్॥
ఊర్ధ్వాధః ప్రతిభాగస్తు సూత్రంస్యాత్ పత్రసంహతిః।
తదాకృతా బాహ్యరేఖాం గాత్రేగాత్రే ప్రకల్పయేత్॥
అనుమాత్రగుణం సూత్రం త్రిభాగేన సమన్వితమ్।
భ్రామయేత్ కోణరేఖాస్యాత్ ప్రత్యంగే సూత్రపంచకాన్॥
షడ్గుణేనతు సూత్రేణ రథరేఖాం సమాలిఖేత్।
అత్రస్యు ర్భూమయఃసప్త ప్రథమాంక ద్వయోచ్ఛ్రితా॥
స్యాద్ ద్వితీయాపాద హీనాభాగా భూమిస్తతోభవేత్।
పాదద్వయంభాగహీనం తృతీయాయాంభవేద్భువి॥
అర్ధభాగ విహీనంచ చతుర్థీస్యాత్ పదద్వయమ్।
పంచమాసార్ధ భాగేన పదంస్యాత్ స్కంధ శీర్షకమ్॥
ఏవం పరస్పరంభాగం పాదార్ధేన హ్రతాభువః।
త్రిభాగీ కృత్యశిఖరం తత్రైకం భాగముత్సృజేత్॥
శుకనాసోచ్ఛ్రితిః శేషం సింహేనాధిష్ఠితాభవేత్।
పాదోనభాగా గ్రీవాండం సపాదం పదముచ్ఛ్రితమ్॥
రేఖాత్రవిధా తవ్యా। ... న్యూనాధిక మండకమ్।
సపాదభాగమానేన కర్తవ్యం చంద్రికాద్వయమ్॥
పద్మపత్రా కృతింకుర్యా న్మధ్యేచామలసారికామ్।
ద్విపదంకలశం కుర్యాద్ బీజపూరక వర్జితమ్॥

శ్రీవత్సం కారయేద్యస్తు ప్రాసాదమతి సుందరమ్ ।
కులానాంశత ముద్ధృత్య సవ్రజంత్య మరావతీమ్ ॥

తా॥ శ్రీవత్స మేరువుయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 10 భాగములుచేసి గర్భము 6 భాగములు, చుట్టును గోడ 2 భాగములు, రథము, 3 భాగములు, ప్రత్యంగము 1½ భాగము, కర్ణము 2 భాగములు, నాలుగు మూలల యందు క్షేపమునుండి క్షోభణము ½ భాగము. జలమార్గము ¼ భాగము, ప్రక్షేపము ½ భాగము, వెలుపలినుండి యనుట నిర్గమము 2 భాగములును శుకనాసయును రచించవలెను. వాస్తువిస్తారములో నాలుగవ వంతు ద్వారముయొక్క విస్తారమును చేయవలెను. ద్వారము యొక్క విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. అధిష్ఠానము ప్రాసాదములో నాల్గవవంతు, ఖురము ½ భాగము, విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలయును. దూలమువరకు 8 భాగములును పైన శిఖరము 12 భాగములును, వేదిక 2½ భాగములు, కుంభము 1 భాగము, మసూరకము ¾ భాగము, మేఖల అంతరపత్రము ¾ భాగము, జంఘ 4 భాగములు, హీరము ½ భాగము, మేఖల అంతరపత్రము 1 భాగము, స్కంధము యొక్క విస్తారము 6 భాగములు, స్కంధమును 10 భాగములుచేసి అందు అంగప్రత్యంగములను ఆలయమునజేసినట్లే చేయవలెను. స్కంధముయొక్క రెండువైపుల రేఖస్కంధము వెలుపలనుండ వలెను. దానిని 10 భాగములుచేసి యెత్తుకూడ 12 భాగములు చేయవలెను. పైభాగములును దిగువభాగములును మకరికా పత్రాదులను రచించవలెను. ఇట్లు వెలుపలిరేఖ యందును ప్రతి రూపమునందు సుందరముగా రచించవలెను. విస్తారమునకు 3 రెట్లు గల సూత్రముతో మూలలనానునట్లు గుండ్రముగా గీయవలెను. ప్రత్యంగములకు 5 రెట్లుగల సూత్రముతో గీయవలెను. రథ రేఖను

6 రెట్లుగల సూత్రముతో గీయవలెను. దీనికి 7 అంతస్తులుండును. మొదటిది 2 భాగములు, రెండవది $1\frac{3}{4}$ భాగము, మూడవది $1\frac{1}{2}$ భాగము, నాల్గవది $1\frac{1}{2}$ భాగము, ఐదవది $1\frac{1}{2}$ భాగము, స్కంధము యొక్క శిఖరము 1 భాగము, ఇట్లు అర్థభాగముచొప్పున తగ్గించవలెను. శిఖరమును 3 భాగములుచేసి అందులో 1 భాగమునువదలి పెట్టవలెను. శుకనాసయెత్తును చేయవలెను మిగిలినది సింహరూపములతో రచించవలెను. గ్రీవ $\frac{3}{4}$ భాగము, అండకము $1\frac{1}{4}$ భాగము, అచ్చట రేఖను రచించవలెను. ఎక్కువగాను తక్కువగానుకాకుండ సమానముగా అండకమును $1\frac{1}{4}$ భాగము రచించవలెను. చంద్రిక 2 భాగములు, పద్మమువలె రమ్యముగా నుంచవలెను. దానినడుమ ఆమలసారకమును రచించవలెను. కలశము 2 భాగములు, బీజపూరకము చేయగూడదు. దీనిని రచించినవారు నూరువంశముల నుద్ధరించి దేవలోకమును బొందుదురు.

(అనుబంధము 22వ పటము చూడుడు)

## 36. శ్రీవత్సమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ విస్తారందశధా కృత్వా షడ్భాగం మధ్యమాలిఖేత్ ।
కర్ణాద్విభాగికా మధ్యం చతుర్ధా విభజేత్పునః ॥ 69
తద్వన్మధ్యే కృతౌ ద్వ్యంశౌ। భాగికౌవామ దక్షిణౌ ।
అంగులీకర సంఖ్యాతై ర్విధే యోరథనిర్గమః॥ 70
ప్రాగ్గ్రీవై ర్వికలైః స్వష్టైః స్తంభైఃసమ్యాభష కర్మభిః ।
ఏ వంగుణసమాయుక్తః శ్రీవత్సః సుఖదోభవేత్ ॥ 71
ద్వ్యంగులంత్ర్యంగులంవాపి చతురంగుల మేవచ ।
ఉదకాంతరకం కార్యం శ్రీవత్సే నందినేఽపిచ ॥ 72

తా॥ విస్తారమును 10 భాగములుచేసి మధ్యగర్భము 6 భాగములు, చుట్టును 2 భాగములు గోడ, కర్ణములు 2-2 భాగములును,

మరలగర్భమును 4 భాగములుచేసి దానిమధ్య 2 భాగములుంచి కుడియెడమలను 1-1 భాగముచేసి రథములయొక్క నిర్గమము 2. అంగులములును, ప్రాగ్గ్రీవములు సుందరముగాను, నలువైపుల 2-2 చొప్పున మొత్తము 8 స్తంభములును, రచించి జలమార్గము 4 అంగులములుగాని 3 అంగులములుగాని లేక 2 అంగులములుగాని చేసినచో శ్రీవత్సమేరువగును.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ శ్రీవత్స కాదయశ్చాష్టౌ మధ్యేయస్య ఉదాహృతేః॥ 105
వథాహంసాదయః పంచ ఉక్తాస్తే శభిదామతాః ॥ 106
పద్మతుల్య ప్రమాణేన శ్రీవత్సవ ఇతిస్మృతః ॥

తా॥ విస్తారము 8 హస్తములు. పద్మముతో సమానముగ 12 అంతస్తులు కల్గియుండవలెను.

(అనుబంధము 23వ పటము చూడుము)

## 37. శ్రీవత్సమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ స్యాన్మధ్యే పూర్వవత్తత్ర శ్రీవత్సో బాహ్యాచ్ఛందకే।
కర్ణేప్రతిరథేచైవ లతాండం భూమిపంచకమ్॥ 65
కర్ణేవరాటశృంగాణి ప్రరథేద్రావిడానిచ।
ఛాద్యప్రాగ్గ్రీవ కౌభద్రే శ్రీవత్సోమేరు రుచ్యతే॥ 66

తా॥ పూర్వముచేసినట్లే వెలుపలను భాగములుచేసి కర్ణమునను ప్రతిరథమునను లతాండమును 5 అంతస్తులును చేయవలెను. కర్ణమునవరాట శిఖరములును, ప్రరథమున 8 కారణముతో ద్రావిడ పద్ధతియును, భద్రమున ప్రాగ్గ్రీవము ఛాద్యమును రచించినచో శ్రీవత్స మేరువగును.

# 38. హంసమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ అథహంసస్య వక్ష్యామః ప్రాసాదస్యేహలక్షణమ్ ।
చతురశ్రీ కృతేక్షేత్రే చతుర్భి ర్విభజేత్ పదైః ॥
భాగైశ్చతుర్భి ర్గర్భఃస్యాద్ భిత్తిర్ద్వాదశభాగికీ॥
భాగద్వయేన భద్రాణి తతశ్చపరికల్పయేత్ ॥
చతుర్భాగేనని ష్క్రమ స్తేషాంగర్భస్య శస్యతే।
భాగస్య షోడశాంశేన కుర్యాన్నిరాంతరాణిచ ॥
పీఠికా వేదికాబంధో జంఘా మేఖలయాసహ ।
ఊర్ధ్వమానంచ కర్తవ్యం స్వస్తికస్య యథోదితమ్ ।
మధ్యేకిన్నర రూపాణి పద్మపత్రాణిచాప్యధః ।
ఉపరివ్యాలహారాశ్చపీఠమేవం విభూషయేత్ ॥
త్రిభౌమం పంచభౌమంవా కుర్యాదేనం విచక్షణః ।
నాగరంద్రావిడశ్చేతి కర్ణేకర్ణే నివేశయేత్ ॥
భూమికాభంజికూటాని కుర్యాదే కాంతరాణిచ ।
రథికేరథికే కుర్యాత్। శుద్ధ నాగరకర్మణా ॥
విస్తారార్ధేన వేదీస్యాత్ గ్రీవాచాస్యపదాధికా ।
అండకంపదికం కార్యం కంకేలిల ఫలసన్నిభమ్ ॥
చంద్రికాచపదార్ధేన కలశఃస్యాత్ పదోచ్ఛ్రితః ।
యథా విరాజతేహంసో హంసోవాశిరసిస్థితః ॥
ప్రాసాదోఽపితథాహంసః పురమధ్యేవిరాజతే ।
హంసాఖ్యమే నంప్రాసాదం కారయేద్ యోనరోత్తమః ॥
తావత్ స్వర్గేవసేచ్ఛ్రీమాన్ యావదింద్రాశ్చతుర్దశ ॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 4 భాగములుచేసి, అందుమధ్య 2 భాగములు, గర్భమును చుట్టూగోడ 1 భాగమును చేయ

వలెను. 16వ వంతు జలమార్గమును చేయవలెను. అధిష్ఠానము వేదికాబంధము, జంఘ, మేఖల ఇవియన్నియును స్వస్తికమునందు జేసినట్లే చేయవలెను. నడుమ కిన్నరరూపములను దిగువ పద్మ పత్రములును, పైన వ్యాలహారములను పీఠమునందు రచించవలెను. 3 అంతస్తులుగాని 5 అంతస్తులుగాని చేయవచ్చును. నాగరపద్ధతితో గాని ద్రావిడ పద్ధతితోగాని కర్ణములను రచించవలెను. అంతస్తుల యందు బొమ్మలుగల కర్ణకూటములను రచించవలెను. ఒక్కొకకటి ఒక్కొక్కవిధముగా నుండవలెను. అన్నిరథికలయందును నాగరపద్ధతి కల్గియుండవలెను. విస్తారములో సగము వేదికను చేయవలెను. గ్రీవ దానికంటె ఒకభాగమెక్కువగా నుండవలెను. అండకము 1భాగము అశోకపుకాయవలె నుండవలెను. చంద్రిక $\frac{1}{3}$ భాగము, కలశము 1 భాగము, గ్రామమధ్యమున దేవాలయము యొక్క శిఖరము హంసవలె నొప్పుచుండుటచే దీనిని హంసమేరువని చెప్పుదురు. ఇట్టి మేరువును నిర్మించుటవలన మితిలేనిపుణ్యములభించి దేవలోకమున సౌఖ్యమనుభవింతురు.

## 39. హంసమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ విస్తారైర్దశధాభక్తైః షడ్భాగామంజరీ భవేత్ ।
సర్వతోభద్రవన్మూల కర్ణావస్య ద్విభాగికౌ ॥ 73
ఉదకాంతరమప్యస్య శ్రీవత్సస్యైవ కల్పయేత్ ।
హంసోఽయంకీర్తితః సమ్యక్ శుభదోలక్షణాన్వితః ॥ 74

తా॥ విస్తారమును 10 భాగములుచేసి మంజరి 6 భాగము లును, సర్వతోభద్రమువలె ప్రధాన కర్ణములు, 2-2 భాగములును, జలాంతరమును ఇవియన్నియును శ్రీవత్సమేరువున జేసినట్లే చేయ వలెను. దీనిని హంసమేరువందురు.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

తథాహంసాదలుఃపంచ ఉకాః స్తేశుభదామతాః ॥ 106

## 40. హంసమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170 సూ.

శ్లో॥ వార్యంతరం భద్రకేచ-కర్ణేఽండం భూమిపంచకమ్।
వరాటః కూట భద్రేచ కర్ణే వై ద్రావిడో భవేత్॥ 67
ఘంటాకలశ సంయుక్తో భద్రే ప్రాగ్గ్రీవకార భవేత్।
హంసమేరు స్తదానామ బ్రహ్మణః స సదాప్రియః॥ 68

తా॥ భద్రమున జలమార్గమును కర్ణమున అండకమును 5 అంతస్తులును-కర్ణకూటములందును భద్రములందును మందారపుష్పాకృతియును ఘంటయును, వేదకర్ణములందు ద్రావిడపద్ధతిగా నైనను ఘంట, కలశము మొదలైనవి చేయవలెను. భద్రమున ప్రాగ్గ్రీవమును రచించవలెను. బ్రహ్మకు ప్రియమైన హంసమేరువని చెప్పుదురు.

## 41. హంసమేరువు 4వ పద్ధతి

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ సప్తకా పంచకా భూమి ప్రాసాదోఽయ ఇహోదితం॥ 19
హంసస్యతే సమాఖ్యేయా యేచాన్యే తత్ర్పమాణకాః॥

తా॥ హంసమేరువు 5 అంతస్తులుగాని 7 అంతస్తులుగాని చేయవలెను. మిగిలిన పద్ధతులన్నియును మొదటి మేరువు పద్ధతిలో చెప్పబడియున్నవి.

(అనుబంధము 24వ పటము చూడుడు)

## 42. రుచుకమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ రుచకాఖ్య మథబ్రూమః ప్రాసాదం పురభూషణమ్॥
ఆదౌ సమస్త వస్తూనాం కల్పితం పద్మజన్మనా॥
చతుర శ్రీకృతే క్షేత్రే చతుర్భిర్భాజితే పదైః॥
భాగమేకం భవేత్ భిత్తి స్తస్య గర్భః పదద్వయమ్।
వేదీ బంధం తథా జంఘాం మేఖలా మూర్ధ్వ మేఖలామ్॥

మానమూర్ధ్వ మథశ్చాస్య శ్రీవత్సస్యైవ కారయేత్ ।
కోణేషు స్తంభకాః కార్యాహీరకశీర్ష సమన్వితాః॥
మధ్యేతు రథికాకార్యాచారు కర్మవిభూషితా ।
చతుర్భాగమిదం కార్యం తస్య వరాటకర్మణా॥
యుక్తం మధ్యేతు రథికా ప్రతిభూమి విధీయతే ।
రుచకః కారితో యేన ప్రాసాదః శుభవాస్తుని॥
కులానాంతారి తంతేన । శతమాత్మా తథోద్ధృతః॥

తా॥ రుచకమేరువు లక్షణము-చతురశ్ర ప్రదేశమును 4 భాగములుచేసి చుట్టూ గోడ 1 భాగమును మధ్యగర్భము 2 భాగములును, చేయవలెను. వేదిబంధము, జంఘ మేఖల, ఊర్ధ్వమేఖల ఇవియును యెత్తును శ్రీవత్సమునందు జేసినట్లు చేయవలెను. మూలల యందు స్తంభములు హీరకములతోగూడ రచించవలెను. నడుమ రథికలను రచించవలెను. 4 అంతస్తులు వరాటపద్ధతితో చేయవలెను. ప్రతి అంతస్తున నడుమ రథిక యుండవలెను. దీనిని రుచక మేరువందురు. ఇట్లు రచించినవారు నూరుతరముల వారికి పుణ్యము లభింపజేయుదురు.

## 43. రుచకమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ రుచకోఽప్యేర మేవస్యా దుదకాంతర వర్జితమ్ ।
భిత్తి యశ్చతురంశేన గర్భోవ్యాసార్ధ సంమితః॥ 75

తా॥ హంసమేరువునందు జలమార్గమును లేకుండ రచించినచో రుచకమేరువగును. విస్తారము 4 భాగములుచేసి అందు గర్భము 2 భాగములును దానిచుట్టును గోడ 1-1 భాగమును చేయవలెను.

## 44. రుచకమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ హంసక స్తుభవే త్పూర్వం కర్ణేఽండం భూమి పంచకమ్ ।
మేష వక్రకకూటపాలైః కంఠ కైరావృతః శుభః॥ 69

భద్రేయుక్తశ్చ ప్రాగ్గ్రీవ-చ్ఛాద్య ఘంటాద్యలంకృతః ।
రుచకశ్చ సమాఖ్యాతః కర్తవ్యో దేవతాలయః॥ 70

తా॥ హంసమేరువునకు కర్ణమున అండకమును, 5 అంతస్తులును, మేషరూపము నక్రరూపముగల కూటపాలములచేతను, కంఠములచేతను, ఆవరించబడి భద్రమున ప్రాగ్గ్రీవము ఛాద్యము ఘంట కలశము మొదలైనవి యున్నచో రుచకమగును.

(అనుబంధము 25వ పటము చూడుడు)

## 45. వర్ధమాన మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ వర్ధమాన మథబ్రూమో ధర్మారోగ్య యశస్కరమ్॥
తస్యాష్ట గుణమైశ్వర్యం భవేద్ యఃకారయేద్యది ।
చతురశ్రం సమం క్షేత్రం భాజయేద్ దశభిః పదైః॥
తతో భాగచతుష్కేన కర్తవ్యో మధ్యమో రథః ।
ఏకైకేన విభాగేన ద్వౌరథౌ వామ దక్షిణౌ॥
కర్ణాస్తు ద్విపదా కార్యా వారిమార్గం తు వర్జయేత్ ।
భద్రస్య నిర్గమంతత్ర భాగే నైకేన కారయేత్॥
భాగస్యార్ధేన పార్శ్వస్థ రథకానాం వినిర్గతమ్ ।
విస్తారార్ధే నగర్భః స్యాద్ యచ్ఛేషంతేన భిత్తయః॥
ఊర్ధ్వమానం భవేదస్య స్వస్తికస్య యథోదితమ్ ।
వర్ధమానోఽయమాఖ్యాతో యశో లక్ష్మీ వివర్ధనః॥

తా॥ వర్ధమానమేరువు లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి అందులో మధ్య 4 భాగములు రథమును, దాని కిరువైపుల 1-1 భాగము రథికలును, మూలల యందు 2-2 భాగములు రథములును చేయవలెను. జలమార్గ మవసరములేదు. భద్రము యొక్క నిర్గమము 1 భాగము, దాని కిరువైపులనున్న రథముల నిర్గమము ½ భాగము, రచించవలెను. విస్తా

రములో సగము మధ్యగర్భమును, మిగిలినది చుట్టును గోడయును రచించవలెను. ఎత్తును స్వస్తిక మేరువున జేసినట్లే చేయవలెను. దీనిని వర్థమానమందురు. ఆరోగ్యమును ఐశ్వర్యమును కీర్తిని లభింప జేయును.

## 44. వర్ధమానమేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే విభజేద్ దశభిః పదైః।
విదధ్యాదర్థ మానాఖ్యం తత్ర భ్రాంత మనుక్రమాత్॥ 76
భద్రస్య చ భవేద్భాగై శ్చతుర్భిః పరివిస్తృతమ్।
ఏకే నైకేన భాగేన ద్వారథౌ వామదక్షిణౌ॥ 77
ద్విభాగ విస్తృతౌ కార్యౌ నిర్గమః స్యాత్ కరాంగులైః।
వర్థమానః క్రియా యుక్తో యశోలక్ష్మీం వివర్ధయేత్॥ 78

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి అందులో సగము విస్తారముతో వృత్తరేఖను రచించవలెను. భద్రము 4 భాగములు, దానికి రెండుప్రక్కల రథములు 1-1భాగమును, 2-2 భాగములతో వాని ప్రక్క రథములును, రచించవలెను. నిర్గమము 2 అంగుళములు చేసిరేనివర్థమాన మేరువగును. లక్ష్మీప్రదము.

## 47. వర్ధమానమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ రుచకస్తు భవేత్పూర్వం కర్ణేఽండం భూమిపంచకమ్।
శృంగం తస్య చ కర్తవ్యం ద్రావిడే కర్మచర్చితమ్॥ 71
ఘంటా కలశశోభాఢ్యో భద్రే ప్రాగ్రీవ సంయుతః।
వర్థమాన స్తథానామ నిత్యం శ్రీర్వర్ధతేయశః॥ 72

తా॥ రుచక మేరువునకు కర్ణమున అండకములను 5 అంతస్తులను మునుపటివలెనే చేసి ద్రావిడపద్ధతితో శిఖరమును రచించి

ఘంట, కలశము మొదలైనవి చేసి భద్రమున ప్రాగ్గ్రీవమును గల్పించి నచో వర్ధమాన మేరువగును. ఇది కీర్తిని సంపదను వృద్ధిచేయును.

(అనుబంధము 26వ పటము చూడుడు)

## 48. గరుడ మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ గరుడస్యాధునా బ్రూమః ప్రాసాదస్యేహ లక్షణమ్ ।
ప్రాసాదః సర్వదైవాయం గరుడ ధ్వజవల్లభః॥
ద్వావింశతి కరం క్షేత్రం విభక్తం స్యాత్ సమాయతమ్ ।
పూర్వాపరేణ దశభిర్భాగై ర్యామ్యయో విభాజితమ్॥
కుర్వీత మధ్యే ప్రాసాదం తస్మిన్ శతపదం బుధః ।
ద్విపదం భిత్తివిస్తారం కర్ణాంశ్చాపి ద్విభాగికాన్॥
ఉత్సృష్ట మూలప్రాసాద ముభయోరపి పక్షయోః ।
అగ్రతః పృష్ఠతశ్చాపి ద్వాద్వాభాగా పరిత్యజేత్॥
శేషేణ పట్పదా పార్శ్వే సహస్తాయామ విస్తృతిః ।
గర్భః షోడశభిర్భాగై ర్భిత్తిః స్యాత్ పదమేతయోః॥
శ్రీవత్స హంస రుచక వర్ధమానేషు కోఽపియః ।
రోచతే గరుడం కుర్యాత్ తమేకం స్వేచ్ఛయా బుధః॥
తస్య పక్షౌ విధాతవ్యౌ నిర్గతౌ వామదక్షిణమ్ ।
ఏవ మేతేత్రయోగర్భా గరుడే పరికీర్తితాః॥

తా॥ గరుడ మేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 22 భాగములుచేసి మరల తూర్పు పడమరలును ఉత్తర దక్షిణములును 10 భాగములు చేయవలెను. మధ్యమ 10-10భాగములు గర్భమందిరమును అందులో గోడ 2 భాగములును, మూలలయందు 2-2 భాగములును, చేసి గర్భమందిరమునకు రెండు వైపులను ముందు వెనుకను 2-2 భాగములు వదలిపెట్టవలెను.

ముతో చేసి అందు గర్భము 5 భాగములును చుట్టును గోడ 1 భాగ మును కలుగజేయవలెను. శ్రీవత్సము, హంసము, రుచకము, వర్ధమానము, ఈ నాలుగింటిలో దేనినైనను గరుడ మేరువుగా రచించ వచ్చును. దీనికి మూడు గర్భములుండును.

## 49. గరుడ మేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ రుచకో వర్ధమానోవా శ్రీవత్సో హంస ఏవచ ।
స ఏకో రోచతే తేషు న్యసేత్ తం గరుడో సుధీః॥ 79
పక్షావేతస్య కర్తవ్యౌ ప్రాసాదార్ధ వినిర్గమౌ ।
నాసికాం వైనతేయస్య త్రిగర్భాంకార యే దపి॥ 80

తా॥ పై జెప్పిన శ్లోకార్థమే రెండు వైపుల ఱెక్కలుగా పెంచబడిన గర్భములు ప్రాసాదములో సగము విస్తారము కలిగి యుండవలెననియును, ముందు నాసిక గరుత్మంతుని నాసికవలె రచించవలెననియు జెప్పినాడు.

## 50. గరుడ మేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ వర్ధమానః పూర్వమయం తమూర్ధ్వే వామదక్షిణౌ ।
త్రిపుష్కరాకృతిః కార్యా శ్శృంగై ర్మల్లతలోద్భవైః॥ 73
విమాన పక్షే శృంగాణి పృష్ఠే ప్రాగ్గ్రీవక స్తథా ।
అగ్రతో మండపై ర్యుక్తః పక్షిరాజశ్చ శ్రీప్రదః॥ 74

తా॥ వర్ధమానమును పైన కుడి యెడమలను పెంచి మూడు తామరపుష్పములవలె మల్లతలములును శిఖరములును రచించి వెనుక ప్రాగ్గ్రీవమును ముందు మండపమును రచించవలెను. దీనిని గరుడ మేరువని చెప్పుదురు.

(అనుబంధము 27, 28 పటములు చూడుడు)

## 51. గరుడ మేరువు 4వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ ఇషువేదేషు వేదాశ్చ భద్రం పట్చ యథా క్రమమ్।
నందన ద్విక్రమం కర్ణే తత్తుల్యం ప్రరథే తథా॥ 17
కేశర్యుపరథే దేయస్తిలకాని తదూర్ధ్వతః।
ద్వాదశైవోరః శృంగాణి ప్రత్యంగేతు తథాష్టచ॥ 18
మేరుసంజ్ఞశ్చ గరుడో జ్ఞేయః పంచశతాండకః।
విధేర్విష్ణో రవేః కార్యో జైనా దీనాంచ శాశ్వతః॥ 19

తా॥ 5-4 5-4 భాగములు మధ్యనుండి చేయవలెను. మొత్తము 18 భాగములు, మధ్య భద్రముయొక్క విస్తారము 6 భాగములు, పార్శ్వముల యందు పరథములు 2 భాగములు చొప్పునను కర్ణములు 2 భాగములు చొప్పునను చేసి జలమార్గము 1-1 భాగము విడువవలెను. కర్ణములయందును ప్రరథముల యందును ఉపరథముల యందును పైన తిలకములను రచించి ఉరః శృంగములు 12ను ప్రత్యంగమున 8యును, 500 రచించి అండకములతో జేసిన గొడల బ్రహ్మ విష్ణువు మొదలైన దేవతలకు యోగ్యమగును.

(అనుబంధము 29వ పటము చూడుడు)

## 52. గరుడ మేరువు 5వ పద్ధతి

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ గరుడో నామనామతః॥ 15
సప్తభూమ్యుచ్ఛ్రిత స్తద్వ చ్చంద్రశాలాత్రయాన్వితః।
అష్టభిర్బహిరం తశ్చ షడ్భిర్యుక్తః సమంతతః॥ 16
స్యాదన్యో గరుడ స్తద్వ దుచ్ఛ్రాయోదశభూమికః॥
"దశహస్తో భవేద్వా సగరుడోష్టకరః స్మృతః॥ 34
ఏతైః ప్రమాణైః ప్రాసాదాన్ కుర్యాదిత్యపరే స్థితాః॥

(అనుబంధము 30వ పటము చూడుడు)

తా॥ గరుడ మేరువు 7 అంతస్తులును, 3 చంద్రశాలలును, లోపలను వెలుపలను 6 కోణములతో నుండవలెను. మఱియొక చో. 10 అంతస్తులతో రచించవలెనని చెప్పబడియున్నది.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ పర్యంక గృహరాజోవై గరుడో నామనామతః।
సప్త భూమ్యుచ్ఛ యస్తద్వచ్చంద్రశాలా త్రయాన్వితః॥ 96
భూమికాస్తు షడశీతి బాహ్యతః సర్వతో భవేత్ ।
తథాన్యో గరుడస్తద్వదుచ్ఛ్రాయో దశభూమికః॥ 97

తా॥ గృహరాజము యొక్క శయన పద్ధతితో 7 అంతస్తులును చంద్రశాలలు 3ను కలిగియుండవలెను. వేఱొక గరుడ మేరువు 10 అంతస్తులు కలిగియుండును. "గరుడోష్ట కరోజ్ఞేయః" అని విస్తారమును 8 హస్తములుగా విశ్వకర్మ ప్రకాశయందు చెప్పబడి యున్నది.

## 53. గజ మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ ప్రాసాదస్య గజస్యాథ లక్షణం సంప్రచక్ష్మహే।
చతుః షష్టి పదం క్షేత్రం విధాయ విభజేద్ గజమ్॥
తతః సీమార్థ సూత్రేణ పృష్ఠతో వృత్తమాలిఖేత్ ।
గర్భం కుర్యాత్తదర్ధేన వృత్తరేఖాకృతిం తతః॥
ఊర్ధ్వ ప్రమాణమధునా గజస్య పృష్ఠముచ్యతే ।
స్తంభాశ్యతుష్పదోచ్ఛ్రాయాః కార్యాః కోణ చతుష్టయే॥
జంఘే యమస్య నిర్దిష్టా మల్లస్తంభాంతరం భవేత్ ।
పట్టికాంతర పత్రాభ్యాం సమభాగేన మేఖలా॥
అగ్రతః శూరసేనం స్యాత్ పృష్ఠతస్తు గజాకృతిః॥

తా॥ గజ మేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నారు. చతురశ్ర ప్రదేశమును 8-8 భాగములు చేసి అందులో సగము

విస్తారముగల సూత్రముతో వెనుకవైపున సగమును గుండ్రముగా గీచి గర్భమును నడుమ సగముచేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తునుచేసి స్తంభము 4 భాగములు, నలుమూలల నిలిపి మల్లబంధమును రచించవలెను పట్టిక, అంతరపత్రము, మేఖల, సమానభాగములుగా రచించవలెను. ముందు శూరసేన పద్ధతియును వెనుక యేనుగురూపముగాను రచించవలెను.

## 54. గజ మేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ చతుః షష్టిపదే క్షేత్రే ప్రాసాదం విభజేచ్ఛుభమ్ ।
క్షేత్రార్థే నచ సూత్రేణ పృష్ఠతో వృత్తమాలిఖేత్॥ 81
భాగైశ్చతుర్భి ర్గంభీరస్య మేఖలాచార్ధ భాగికా ।
పురతః సూరసేనోఽయం పృష్ఠతశ్చ గజాకృతిః॥ 82

విశ్వకర్మ ప్రకాశ అధ్యాయము 6

శ్లో॥ పదే విమానచ్ఛందకో గజః షోడశ హస్తాః స్యుశ్చత్వారో ।
దేవవల్లభాః కైలాసో మగ్ర్యరాజస్తు॥

మఱియు

"గజో గజ సమస్తథా కుంభః కుంభాకృతిస్తు ।
ద్వాదశ్యాభిమితా నవకోచ్ఛ్రయః॥ 91

తా॥ 16వ హస్తముల విస్తారము 9 అంతస్తులును కలిగియుండవలెను. పై శ్లోకార్థమే కనుక తాత్పర్యము వ్రాయ నవసరము లేదు.

## 55. గజ మేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ వర్ధమానోప్యాసౌ పూర్వం పృష్ఠతో వృత్తమాలిఖేత్ ।
వామే దక్షేచ భద్రాద్యం సప్తభావలయాకృతిః॥ 75

వేద్యాం లేఖ్యం గజపృష్ఠం ఘంటాకేశ సంయుతమ్।
దివ్యమండపశోభాఢ్యః సగజః సర్వకామదః॥

తా॥ వర్ధమాన మేరువునందు సగపాలు వెనుక గుంద్రము
చేసి కుడిఎడమలయందు భద్రములను మొదలైనవానిని రచించి య
7 అంతస్తులును, వేదిక, ఘంట కలశము, ముందు మండపము గ
సహాగజ మేరువగును. దీనివలన సమస్తమైన కోరికలు సిద్ధించు

విశ్వకర్మ ప్రకాశ అధ్యాయము 6

శ్లో॥ ప్రాగ్గ్రీవేణ విశాలేన భూమికా సమదున్నతా।
అనేక చంద్రశాలస్తు గజ ప్రాసాద ఉచ్యతే॥

తా॥ విశాలమైన ప్రాగ్గ్రీవములతోను అనేక చంద్రశా
తోను 6 అంతస్తులు కలిగినది గజ మేరువగును.

## 56. గజ మేరువు 4వ పద్ధతి

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ ప్రాగ్గ్రీవేణ విశాలేన భూమికాసప్త ఉచ్ఛ్రితః॥
అనేక చంద్రశాలస్తు గజః ప్రాసాద ఉచ్యతే॥
'గజోగజ సమాకృతిః, (సమరాం. అ. 63వ-10 శ్లో)
"గజః సింహశ్చ కుంభశ్చ వలభీ ఛందక స్తథా॥
చత్వార ఏతే తుల్యాః స్యుర్ణస్తోన్మేథ సమానుతః॥

తా॥ పై జెప్పిన శ్లోకార్థమేకాక ప్రాగ్గ్రీవము విశాలము
నుండవలెననియును చంద్రశాల లనేకములను రచించవలెనని
జెప్పబడియున్నది. గజాకారముగ నుండవలెను. 7 అంతస్తులు
నుండవలెను. (అనుబంధము 31వ పటము చూడుడు)

## 57. సింహ మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ ప్రాసాదస్యాధునా లక్ష్మం సింహ సంజ్ఞస్య కథ్యతే॥

చతురశ్రం సమం క్షేత్రం విభజేన్నందనే యథా।
గర్భో భాగైశ్చ తుర్భిః స్యాత్ కందభిత్తి స్తుభాగికీ॥
భాగేనాం ధారికా కార్యా బాహ్యాభిత్తిశ్చభాగికీ।
భద్రం భాగైశ్చ తుర్భిః స్యాద్ భాగే నైకేన నిర్గతమ్॥
కర్ణస్తు ద్విపదః కార్యో జలమార్గసమన్వితః।
ద్విపదం పీఠ ముత్సేధాత్ సింహరూపై రధిష్ఠితమ్॥
ఖురకంచ పదార్ధేన కుర్యాత్ పీఠస్య మధ్యతః।
కుర్యా దూర్ధ్వంతు విస్తారాద్ ద్విగుణం కలయాధికమ్॥
ద్విపదం వేదికాబంధం జంఘాచాస్య చతుష్పదమ్।
మేఖలాంతర పత్రంచ విదధ్యాద్భాగికో దయమ్॥
త్ర్యంశాని కర్ణశృంగాణి గ్రీవాండ కలశైః సహ।
సింహకర్ణస్తు కర్తవ్యః సముచ్ఛ్రాయాచ్చతుష్పదః॥
సింహరూప సమాక్రాంతే ప్రాసాదే సింహసంజ్ఞితే।
ఊర్ధ్వతః కర్ణశృంగస్య షట్పదా మూలమంజరీ॥
సప్తభాగ సముత్సేధా లతాభిః పంచభిర్యుతా।
గ్రీవోచ్ఛ్రాయస్తు కర్తవ్యః పదం పాదేన వర్జితమ్॥
అండకం తు పదోత్సేధం రేఖాయుఃంచ ద్వినిస్సృతమ్।
పాదోన భాగముచ్ఛ్రాయ శ్చంద్రికాయాః ప్రకీర్తితః॥
ద్విపదం కలశం కుర్యాద్ బీజపూరక సంయుతమ్।
య ఇదంకారయేత్ సస్యా దజేయః పురుషో ధ్రువమ్॥
వ్యవహారే నృపకులే సంగ్రామే శక్రసంసది॥

తా॥ సింహమేరువు యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 10-10 భాగములుచేసి మధ్యగర్భమును 4 భాగములును, కందపుగోడ 1 భాగమును, అంధారిక 1 భాగమును, వెలుపలిగోడ 1 భాగమును చేయవలెను. భద్రము 4 భాగములు,

నిర్గమము 1 భాగము, కర్ణము 2 భాగములు జలమార్గము మిగిలిన ప్రదేశమున చేయవలెను. అధిష్ఠానము 2 భాగములు సింహములపై నిలచినట్లు రచించవలెను. ఖురకము ½ భాగము పీఠముయొక్క మధ్య నుండవలెను. విస్తారమునకు రెట్టింపును దానిపైన 8వ వంతును చేయవలెను. 22½ అగును. వేదిక 2 భాగములు, జంఘ 4 భాగములు, మేఖల అంతరపత్రము 1 భాగము, కర్ణశృంగములు గ్రీవ అండకము కలశముతో సహ 3 భాగములు, సింహకర్ణములు ఎత్తు 4 భాగములు, అంతటను సింహములను రచించవలెను. కర్ణశృంగముల పైన మూలమంజరి విస్తారము 6 భాగములును ఎత్తు 7 భాగములును 5 అండకములును చేయవలెను. గ్రీవ ¾ భాగము, అండకము 1 భాగము, రేఖయందు రెండును తగ్గించవలెను. చంద్రిక ¾ భాగము, కలశము 2 భాగములు బీజపూరకముతో సహితము చేయవలెను. ఈ మేరువును రచించినవారు లోకమునందు జయమును పొందుటయే కాక స్వర్గమునందును జయమును పొందుదురు. లేక నందనము వలె 8 భాగములతోనైన జేయవచ్చును.

## 58. సింహ మేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ చతుః షష్టిపదః సింహో భద్రం భాగచతుష్టయమ్।
ద్వ్యంశకో మూలకర్ణౌ చ గర్భః షోడశభిః పదైః॥ 83
విస్తారార్ధే భవేజ్జంఘా మేఖలోపదికా భవేత్।
ఏకైకా రథికాచాస్య భవేత్ భాగత్రయోచ్ఛ్రితా॥ 84
సర్వతో భద్రవచ్చాస్యా రేఖా గ్రీవాండకాదికమ్।
సింహక్రాంతై స్తథా భద్రైః ప్రాసాదః సింహ ఉచ్యతే॥ 85
విక్రమార్జవ శీలానాం ప్రాసాదోఽయం శుభావహః॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి గర్భము 4 భాగములు చేయవలెను. భద్రము 4 భాగములు కర్ణములు 2-2

భాగములు చేయవలెను. విస్తారములో సగము యెత్తు జంఘ అనగా 4 భాగములు మేఖల 1 భాగము, ఒక్కొక్క రథిక యెత్తు 3 భాగములు సర్వతో భద్రమేరువున జేసినట్లే మంజరులు గ్రీవ, అండకము చేసి భద్రములయందు సింహములను రచించినచో సింహ మేరువగును. శుభప్రదము.

## 59. సింహమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ విజ్ఞేయః కేశరీ పూర్వం శిఖరం చ విమానజమ్।
ప్రాగ్గ్రీవ యుక్తం భద్రాద్యం కర్ణాండం భూమిపంచకమ్॥ 77
ఘంటా కలశ శోభాఢ్యో దివ్యమండప సంయుతః।
దేవీనామాలయః కార్యం సింహో భగవతీ గృహమ్॥ 78

తా॥ కేశరి ప్రాసాదమును విమానపద్ధతితో శిఖరమును భద్రము మొదలయిన వానియందు ప్రాగ్గ్రీవములును, కర్ణముల యందండకములును 5 అంతస్తులును ఘంట కలశము ముందు మండపము రచించిన యెడల సింహమేరువగును దేవియొక్క మందిరమునకు ముఖ్యముగా సింహమేరువును రచించవలెను.

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ సింహః సింహాకృతిర్ జ్ఞేయో॥ 10

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

సింహః సింహ గతిజ్ఞేయో గజోగజ సమస్తథా ముఖః।
కుంభాః కుంభాకృతి సద్వార్భామికా నవకోచ్ఛ్రయః॥ 91
సింహో దశ ఉదాహృతః॥ 103

తా॥ సింహమేరువు విస్తారము 10 హస్తములు కలిగి సింహము వలె నుండును. 9 అంతస్తులుగా రచించవలెను.

(అనుబంధము 32వ పటము చూడుడు)

# 60. పద్మమేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీం పద్మకం బ్రూమః ప్రాసాదం పద్మసన్నిభమ్।
యః పుమాన్ కారయత్యేనం సకామాం ల్లభతేఽఖిలాన్।
చతురశ్రీకృతే క్షేత్రే చతుర్దిక్షు విదిక్షు వా॥

న్యస్యేత్ పృథక్ పృథక్ సూత్రాణ్యథవృత్తం ప్రసాదయేత్।
దిగ్వి దిక్ సూత్రయోర్మధ్యే చతురశ్రంతు రోపకమ్॥

తుల్యప్రామాణ్య విన్యస్యేత్ స్యుక్ ద్వాత్రింశ దమీరితః।
విస్తృతా స్యథ భాగాద్వా కర్ణపత్రాణి షోడశ॥

పద్మపత్ర సమానాని వారి మార్గాన్వితానిచ।
గర్భః స్యాద్ బాహ్యసీమార్ధం యచ్ఛేషం తేన భిత్తయః॥

షడష్ట ద్వాదశకరః పద్మో జ్యేష్ఠాదికః క్రమాత్।
ద్వాత్రింశత్ షోడశాష్టౌచ తస్యస్యూ రథకాః క్రమాత్॥

జలాంతరాణి చైతస్య శ్రీవత్సస్యే వకారయేత్।
పీఠకం వేదికాబంధం జంఘా శేఖర చంద్రికాః॥

అండకం కలశం గ్రీవా మేతస్యో చ్ఛ్రయమానతః।
కుర్వీత స్వస్తికస్యైవ స్వవిస్తారాను సారతః॥

తా॥ అన్నికోరికల నిచ్చునట్టి పద్మమేరువు యొక్క లక్షణము చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును దిశలయందును మూలలయందును గుర్తులుపెట్టి గుండ్రముగా గీయవలెను. దిశ యొక్కయు మూలయొక్కయు నడుమ నలుచదరముగాను సమానముగాను చుట్టూ 32 భాగములు చేయవలెను. 2-2 భాగముల చొప్పున 16 రథములను గుండ్రముగా రచించవలెను. జలమార్గములను కల్పించవలెను. విస్తారములో సగము గర్భమును చేయవలెను. మిగిలిన సగములో పాతికవంతున చుట్టూ గోడ రచించవలెను.

6-8-12 హస్తములు పద్మమేరువు యొక్క కనీస మధ్యమ ఉత్తమ విస్తారములు రథములు 32-16-8 వరుసగా ఉత్తమ మధ్యమ కనీస ప్రాసాదములయందు రచించు పద్ధతి జలమార్గములు శ్రీవత్సము నందు రచించినట్లే రచించవలెను. అధిష్ఠానము, వేదిక, జంఘ, చంద్రిక, అండకము కలశము గ్రీవ మొదలైనవి. స్వస్తిక మేరువున చేసినట్లు చేయవలెను.

## 61. పద్మ మేరువు 2వ పద్ధతి

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ పద్మస్య హస్త సంఖ్యాస్యాత్ షోడశ ద్వాదశాథవా॥ 86
వర్తేః సచ కర్తవ్యః సూత్రం తు స్వస్తికే యథా।
సర్వే రథాః స్మృతాః పద్మపత్రాకృతి మనోరమాః॥ 87
ఉదకాంతర కంకుర్యాచ్ఛ్రేయసే నందనే యథా॥

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ పద్మకః షోడశాస్రస్తు భూమిద్వయ మథాధికః॥
పద్మతుల్య ప్రమాణేన శ్రీసుష్టక ఇతి స్మృతః॥
పదోనాయ కోణములను 12 అంతస్తులును చేయవలెను.
"తథైవ పద్మకః ప్రోక్త ఉచ్ఛ్రాయో భూమికాద్వయః" 93
షోడశాస్రః స విజ్ఞేయో విచిత్ర శిఖరః శాఖః॥ 94

తా॥ పద్మమేరువునకు విస్తారము 16 హస్తములుగాని 21 హస్తములుగాని యుండవలెను. దానిని స్వస్తిక మేరువువలె గుండ్రముగా జేయవలెను. రథములన్నియును పద్మపత్రములవలె సౌందర్యముగా నుండవలెను. జలమార్గమును నందన మేరువున జేసినట్లు చేయవలెను.

## 62. పద్మమేరువు 3వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ వృత్తం వేదాశ్రకే కర్ణే ద్వాత్రింశద్భి ర్విరాజితే।
షోడశః ద్విపదాః కర్ణాః కర్తవ్యా భద్రవర్జితాః॥ 79

భూమిజం శృంగమేవం చ భూమిజం భూమి పంచకమ్।
ఘంటా కలశశోభాఢ్యం కారయే న్మేరు పద్మకమ్॥ 80

తా॥ నలుచదరపు ప్రదేశమును గుండ్రముగా గీచి దానిని చుట్టూ చదరముగా 32 భాగములు చేయవలెను. 2-2 భాగముల చొప్పున 16 రథికలను రచించవలెను. ఇట్లు 5 అంతస్తులు చేయవలెను. ఘంట, కలశము మొదలైనవి రచించవలెను. దీనిని పద్మమేరువందురు.

## 63. పద్మ మేరువు 4వ పద్ధతి

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ పద్మకః షోడశాశ్రిః స్యాద్ భూమికా ద్వితయాధికాః॥ 17
పద్మతుల్య ప్రమాణేన వావృత్తశ్చతురశ్రకః॥

మఱియు

"అష్టావింశతి రష్టాశ్రిః షోడశాశ్రిస్త్రిభిర్వినా।
వర్తులః పద్మకశ్చైతే విమానచ్ఛంద ఏవచ॥ 31

తా॥ పద్మమేరువు 16 కోణములు కలిగి 3 అంతస్తులతో పద్మమువలె నుండవలెను. పై శ్లోకార్థములకు సమముగ నేయున్నది. విస్తారము 28 హస్తములు, 16 కోణములు 8 కోణములు గుండ్రము ఈ మూడు విధములు తప్ప చేయరాదు.

(అనుబంధము 33, 34వ పటములు చూడుడు)

## 64. నందివర్ధన మేరువు లక్షణము

సమరాంగణ 57వ అధ్యాయము.

శ్లో॥ అథాభిధీయతే సమ్యక్ ప్రాసాదో నందివర్ధనః।
నందయత్యేష కర్తారం పుత్రదార ధనాదిభిః॥
చతురశ్రీ కృతే క్షేత్రే భజేత్ షోడశభిః పదైః॥
శతద్వయం విభాగాః స్యుః షట్పంచా శత్తథా పరైః॥
గర్భః శతపదః కార్యో భిత్తిశ్చాత్రి పదాయతా।
కర్ణప్రమాణం త్రిపదం నవబంధ సమన్వితమ్॥
భాగాయతం భాగపాద విస్తీర్ణం వారి వర్త్మచ।
విభజేత్ పంచధా కర్ణం తస్య భద్రంత్రిభిః పదైః॥
భాగం భాగం భవేత్ కర్ణే. భాగార్ధం భద్రనిర్గమః।
ప్రత్యంగం ద్విపదం కుర్యాద్ వారి మార్గేణ సంయుతమ్॥
నిర్గమః సార్ధభాగేన పార్శ్వయో రుభయోరపి।
శాలాషట్పద విస్తారా ప్రత్యంగం భాగ నిర్గతమ్॥
భద్రంత దగ్రతః కుర్యాద్ విస్తారేణ చతుష్పదమ్।
భాగార్ధ నిర్గమం సమ్యగ్ దిక్షు సర్వాస్వయం విధిః॥
కర్ణస్యార్ధేన యేద్ గర్భాత్ వృత్తంతత్ పూర్వమాలిఖేత్।
అనుసారేణ వితరే దంగప్రత్యంగ నిర్గమమ్॥
సార్ధభాగం గజాధారం సాబ్జపత్రం సుమేఖలమ్।
కుర్యాత్ పదం పాదహీనం జంఘాకుంభ సముచ్ఛ్రితమ్॥
భాగ పాదేన కణకం పాదేనాంతర పత్రకమ్।
తదర్ధం గ్రాసహారం చ భాగార్ధం ఖురకం తథా॥
ఖురకేణ సమం ప్రోక్తా పీఠస్యైషా సముచ్ఛ్రితిః।
విస్తారాద్ ద్విగుణశ్చాయం స్యాదూర్ధ్వం కల్పయేత్సుధీః॥

తులోదయో విధాత వ్యస్త్రయో దశభిరంశకైః।
వింశత్యం శంతు శిఖరం వేదికాచ చతుష్పజమ్॥
పాదోన భాగద్వితయం కుంభకంతేషు కారయేత్।
భాగే నైనేన కలశమర్ధేనాంతర పత్రకమ్॥
పాదహీన పదం కార్యా మేఖలాస్య సుశోభనా।
జంఘా పద్మాభికోర్ధ్వాచ్ఛాయా భాగార్ధం గ్రాసపట్టికా॥
హీరకంచైక భాగేన కర్ణస్థం పరికీర్తితమ్।
మేఖలాంతర పత్రంచు సార్ధభాగ సమున్నతమ్॥
జంఘా మధ్యేతు కర్తవ్యా రథికారథికా తథా।
వృత్త స్తంభైః సమకర్ణై ర్గ్రాసైర్యుక్తా వరాలకైః॥
జంఘాతు సంవృతా కార్యా మల్లచ్ఛాద్యై ర్విభూషితా।
జలాంతరేషు రూపాణి కుర్యాత్ సంఘాటకైః శుభైః॥
కుర్యాత్ తులోదయస్యోర్ధ్వః మితి భూమి భిదష్టభిః।
సఙంశాష్టాంశోఽస్య దూరా ద్యాభూమిః సాస పదత్రయమ్॥
ద్వితీయాత్రి పదా ప్రోక్తా తృతీయా పాదవర్జితా।
సార్ధద్వ్యంశా చతుర్థీచ పాదోనా పంచమీ తతః॥
షష్ఠీతు ద్విపదా కార్యా పాదోనా సప్తమీ తతః।
అష్టమీ తుక్షితిః కార్యా సార్ధభాగేన సంమితా॥
ఏకైక స్యాః పదార్ధేన ప్రక్షేపః స్యాత్ పరస్పరం।
కోణే కూటాని కుర్వీత తత్యంగే తిలకానిచ॥
భద్రే కుర్వీత రథికా వివిధాః కర్మ సంకులాః।
రథస్య పార్శ్వయోర్లేఖాః కర్తవ్యాశ్శోభయోరపి॥
వేదికాస్య విధాతవ్యా భాగమేకం సమున్నతా।
గ్రీవా తావద్భాగమేక మండకం ద్విపదోదయమ్॥

కుర్యాత్ సామల సారించ చంద్రికాం సార్ధభాగికామ్।
కలశస్త్రి పదః కార్యో బీజపూరం బహి స్తతః।
పురతః శూరసేనం స్యా న్మధ్యే రూప సమాకులమ్।
మిశ్రకస్య విమానస్య సదృశం శంకార యేదముమ్॥
భూషణం భవనస్యాస్య ప్రాసాదం నందివర్ధనమ్॥
ప్రాసాద వింశతి రియం పరికీర్తి తేహ
మేర్వాదికా సకలనాక సదా మభీష్టా
త త్త్వేన వేత్తియ ఇమాంస సమగ్ర శిల్పి
వర్గాగ్రణీ ర్బహుమతశ్చ భ వేన్నృపాణామ్॥

ఇతి సమరాంగణ సూత్రధారా పరనామ్ని వాస్తుశాస్త్రే కుర్వాది వింశికామ సప్తపంచాశోఽధ్యాయః.

తా॥ చతురస్ర ప్రదేశమును 16-16 భాగములుచేసి గర్భము 10-10 భాగములుచేసి చుట్టూ 3 భాగములు గోడను రచించవలెను. కర్ణము 3 భాగములు, దానిని 5 భాగములుచేసి మధ్య 3 భాగములు భద్రమును ఆ భద్రము యొక్క నిర్గమము $\frac{1}{2}$ భాగమును మధ్యశాలయొక్క విస్తారము 6 భాగములు, దాని మధ్య భద్రము 4 భాగములును నిర్గమము $\frac{1}{2}$ భాగమును అన్ని దిశలయందు రచించవలెను. జలమార్గము పొడవు 1 భాగమును విస్తారము $\frac{1}{4}$ భాగమును చేయవలెను. ప్రత్యంగము 2 భాగములు నిర్గమము 1 భాగము, శాలయొక్క నిర్గమము $1\frac{1}{2}$ భాగము, విస్తారములో సగము కొలతతో గుండ్రముగా గీయవలెను. దిశల ననుసరించి అంగప్రత్యంగములు మొదలైనవి రచించవలెను. ఆలయము ఒకటి నరభాగము ఏనుఁగుల పై నుండవలెను. తామరపుష్పము మేఖల యుండవలెను. $\frac{3}{4}$ భాగమున జంఘయొక్క కుంభము యెత్తు $\frac{1}{4}$ భాగము, అంతరపత్రము $\frac{1}{4}$ భాగము, గ్రాసహారము అంమలో సగముండవలెను. ఖురకము $\frac{1}{2}$ భాగము, ఖురకముతో సమానముగా పీఠముండవలెను. అధిష్ఠానము యొక్క విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. మూలముయొక్క పై భాగము వఱకు 13 భాగములు, శిఖరము

20 భాగములు, వేదిక 4 భాగములు, కుంభము $1\frac{3}{4}$ భాగములు' కలశము 1 భాగము, అంతరపత్రము $\frac{1}{2}$ భాగము, మేఖల $\frac{3}{4}$ భాగము, జంఘ 6 భాగములు, గ్రాసపట్టిక $\frac{1}{2}$ భాగము, హీరకము 1 భాగము, మేఖల అంతరపత్రము $1\frac{1}{2}$ భాగము జంఘయొక్క నడుమ రథికలను రచించవలెను. గుండ్రని స్తంభములును, మకరములు క్రమింగు చున్నట్లు చిత్రింపబడిన స్తంభములును, జంఘయొక్క చుట్టును మల్లచ్ఛాద్యమును రచించవలెను. జలాంతరములయందు రూపము లను రచించవలెను. దూలముపైనుండి అంతస్తులు 8 రచించవలెను.

స్కంధము 8 భాగములు, మొదటి అంతస్తు $3\frac{1}{4}$ భాగములు, రెండవ అంతస్తు 3 భాగములు, మూడవ అంతస్తు $2\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతసు $2\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $2\frac{1}{4}$ భాగములు, ఆఱవ అంతస్తు 2 భాగములు, ఏడవ అంతస్తు $1\frac{3}{4}$ భాగములు, ఎనిమిదవ అంతస్తు $1\frac{1}{2}$ భాగము, ఒక్కొక్క అంతస్తున చుట్టూ $\frac{1}{2}$ భాగము తగ్గించుచుండవలెను. మూలలయందు కూటములును, ప్రత్యంగములయందు తిలకములును, భద్రములయందు రథికలును, అనేకవిధములైన చిత్రములతో రచించవలెను. రథముయొక్క రెండువైపులను ... వేదిక 1 భాగము, గ్రీవ 1 భాగము. అండకము 2 భాగములు, ఆమలసారము-చంద్రిక $1\frac{1}{2}$ భాగము, కల శము 3 భాగములు, బిజపూరము చేయవలెను. వెలుపలను ముందు శూరసేన పద్ధతియును మధ్య రూపచిత్రములును మిశ్రవిమానముతో సమానముగా దీనిని రచించవలెను. దీనిని నందివర్ధన మేరువని చెప్పు దురు. మహాశిల్పులచే నీ యంశములెల్ల జెప్పబడినవి.

(అనుబంధము 35, 36వ పటములు చూడుడు)

## 65. నందివర్ధన మేరువు 2వ పద్ధతి

అపరాజిత 170వ సూ.

శ్లో॥ తలచ్ఛందం మల్లశాల ముచ్ఛ్రయే సప్తభూమికమ్।
కర్ణే నాగరశృంగాణి ప్రరథే ద్రావిడానిచ॥ 81

భద్రే వారాట కూటాంశ్చ లతాం వై వామ దక్షిణే।
నందివర్ధన ఆఖ్యాతః సురూపో లక్షణాన్వితః॥ 82

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ సప్తభిర్నంది వర్ధనః॥ 87

తా॥ నందివర్ధనము 7 అంతస్తులు కల్గియుండును. నందివర్ధన మేరువు 7 అంతస్తులును, తలచ్ఛందమున మల్లతలమును, కర్ణమున నాగరపద్ధతితో శిఖరములును, ప్రరథమున ద్రావిడ పద్ధతియును భద్రమున వరాటపద్ధతితో కూటములును కుడి యెడమలను శిఖరములును కలిగియుండును.

## 66. నందివర్ధన మేరువు 3వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ గుణరామ ద్వ్యేకపక్షా ద్వావింశతి విభాజితే।
అనుగే శృంగతిలకం కర్ణేకార్యం ద్విశృంగకమ్॥ 55
శృంగం చోపరథేఽధోరు మంజర్యో ద్వాదశైవచ।
శృంగైః పంచాండ కైర్యుక్తో నందివర్ధన నామకః॥ 56

తా॥ చతురశ్ర ప్రదేశమును 22 భాగములుచేసి మధ్యనుండి 3-3-2-1-2 భాగములుచేసి పైన శృంగమున తిలకమును కర్ణమున 2 శృంగములును, ఉపరథమున 1 శృంగమును, ఉరోమంజరులు 12ను ఉరోమంజరియందు 5 శృంగములును ఇట్లు రచించినచో నంది వర్ధన మేరువగును.

(అనుబంధము 37వ పటము చూడుము)

## 67. నందివర్ధన మేరువు 4వ పద్ధతి

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ వింశత్యండక సంయుక్తః సప్తభూర్నందివర్ధనః॥ 7

తా॥ నందివర్ధన మేరువు 7 అంతస్తులును 20 అండకములును కలిగియుండును.

# 68. వలభి మేరువు లక్షణము

సమరాంగణ 55వ అధ్యాయము.

శ్లో॥ స్వస్తికస్య యథాపూర్వం కథితం మానలక్షణమ్॥ 88
తేనైవ లక్షితః సర్వో విదధీత విచక్షణః।
యథామూల విభక్తస్తు లతిషు స్వస్తికాదిషు॥ 89
యథాస్కంధ విభాగోఽపి రేఖా మధ్య విభాగతః।
స్వస్తికాం కోవిధాతవ్యః శుకనాసోచ్ఛ్రయాచ్ఛుభః॥ 90
ప్రాసాదానాం సభాగైః స్యాత్ సప్తభిర్వైహి తచ్ఛ్రియే॥
విమానే సధరాత్ర్యంశే న్యూనః కార్యో విపశ్చితా॥ 91
కైలాసాచ్ఛ తురంశోనా విజ్ఞేయా శుకనాసికా।
సర్వతో భద్ర సింహాఖ్యా మేరూణాంతు విశేషతః॥ :2
షడ్భిర్భాగై ర్వినాకార్యా శుకనాసా విజానతా।
ప్రాసాదోచ్చేన సాంధారో విమానాద్యాః ప్రకీర్తితాః॥ 93
విస్తారార్థేన తద్గర్భే యచ్ఛేషం తేన భిత్తయః।
ప్రాసాద జంఘోచ్ఛ్రయేణ తుల్యోగర్భ తులోదయః॥ 94
సభిత్తి ర్గర్భతుల్యా స్యాత్ సాంధారేషు తులోదయః।
స విధేయః పునర్వ్యాసాద్ యది వాకించిదున్నతః॥ 95
మూలసూత్రం తుదశధా వృత్తమస్య సమాలిఖేత్।
గర్భసూత్రం ప్రతిష్ఠాప్య సింహకర్ణం ప్రకల్పయేత్॥ 86
సార్ధభాగేన సూత్రేణ మధ్యమస్య సమాలిఖేత్।
ఉరో ద్విభాగతుల్యంతు మస్తకంభాగ ముచ్ఛ్రితమ్॥ 97
అర్థేన వోచ్ఛ్రయస్తస్యాః పక్షోచ్ఛ్రాయా ద్విభాగికాః।
ఉరో రేఖా చ సీమాంతే సూత్రేణ చ్ఛందమాదిశేత్॥ 98
నవధా దశధాచైవ సింహకర్ణావు భౌస్మృతౌ।
ఏకః షడ్విస్తృతో భాగ ఉదయాత్మంచ భాగికః॥ 99

సూరసేనో ద్వితీయస్తు స్యాత్సమోదయ విస్తృతః।
ఉదయాత్సార్ధ విస్తీర్ణం సింహకర్ణ త్రి సంకులః॥ 100
కోమలాన్ మల్లకాంశ్చాన్యాన్ సింహకర్ణాత్ ప్రరోపయేత్।
ప్రాసాదానాం హి సర్వేషాం సర్వమేత ద్విభూషణమ్॥ 101
యస్య యత్రోచితం స్థానం తద్ తత్ర వినివేశయేత్।
నిర్మితౌ వలభే స్తిర్యక్ సూత్రం కుర్వీత సప్తధా॥ 102
పంచభాగాంశ్చ ముఖత స్తే నైవాంశేన కల్పయేత్।
మేఖలాంతర పత్రేచ జంఘా కుంభక మేవచ॥ 103
పంచభాగోచ్ఛ్రితం కుర్యాత్ తద్వచ్ఛిఖర ముచ్ఛ్రితమ్।
కీర్తితాని విమానాని యాన్యే వసుర వర్త్మని॥ 104
తాన్యేవ స్థావరత్వేన ప్రాసాదా ఇతి విశ్రుతాః॥

తా॥ పూర్వము స్వస్తికమునకు చెప్పబడినట్లు అన్నియును రచించవలెను. శుకనాసము కూడ అదే పద్ధతితో చేయవలెను. నప్రాసాదములన్నియు నొక్కటే పద్ధతి శ్రీవత్స ప్రాసాదమునకు 7వ భాగమును, విమానప్రాసాదమునకు 3వ భాగమును, కైలాసమునకు 4వ భాగమును, సర్వతోభద్ర సింహప్రాసాదమునకు 6వ భాగమును తగ్గించి శుకనాసమును రచించవలెను. విస్తారములో సగము గర్భము మిగిలినది గోడలు ఇట్లు సాంధారములకు చేయవలెను. ప్రాసాదము యొక్క జంఘ యెత్తుతో సమానముగా గర్భము నందలి మూలమును, ఆ గోడ గర్భము సమానమైన యెత్తునను ఉండవలెను. మరల విస్తారముకంటె కొంచె మెత్తుగాజేసి ప్రధాన సూత్రమును 10 భాగములుచేసి వృత్తమును రచించవలెను. గర్భ సూత్రమును నిలిపి సింహకర్ణమును చేయవలెను. 1½ భాగముగల సూత్రముతో మధ్యవృత్తమును, ఉరమును 2 భాగములుగాను, శిఖరము యెత్తు 1 భాగము దానిలో సగము ప్రక్కల యెత్తు 2 భాగములు, ఉపోమంజరిపైన సూత్రముతో ఛందమును 9 లేక 10 భాగములు చేయవలెను. సింహకర్ణములు రెండును విస్తారము

6 భాగములు, ఎత్తు 5 భాగములు చేయవలెను. ఇది యొక పద్ధతి. విస్తారమును యెత్తును సమానముగా చేయుట రెండవ పద్ధతి. సూరసేనము ఎత్తు 1 భాగమును విస్తారము $1\frac{1}{2}$ భాగమును చేయుట మూడవ పద్ధతి. సింహకర్ణములపైన మృదువుగా వేఱు వేఱు మల్లికములను రచించవలెను. అన్ని ప్రాసాదములకును ఇట్లు అలంకారము చేయవలెను. దేని కెక్కడ యేది యుచితమో తెలిసికొని దాని నచ్చట నిర్మించవలెను. వలభికి అడ్డముగా సూత్రమును బట్టి దానిని 7 భాగములుచేసి అందు 5 భాగములు ముఖమును చేయవలెను. మేఖల, అంతరపత్రము, జంఘ, కుంభము 5 భాగములు చేయవలెను. శిఖరమును అటులే చేయవలెను.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ వలభీచ్ఛందక స్త ద్వచ్ఛుకనాసత్ర్ర యాన్వితః॥ 90

తా॥ వలభి ప్రాసాదమునకు 3 శుకనాసము లుండవలెను. 5 అంతస్తులుగా రచించవలెను.

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ వలభిచ్ఛందకః కార్యో దేవతానాం వృషః సదా॥ 9

తా॥ వలభి మేరువు విస్తారమును మునుపటివలె భాగములుచేసి కోణిగలను మూడువైపులను పెంచిచేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును దూలముల వఱకు 5 భాగములును, పైన శిఖరము 9 భాగములును చేయవలెను.

(అనుబంధము 38వ పటము చూడుడు)

## 69. కుంభ మేరువు లక్షణము

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ కుంభః కుంభాకృతి స్తద్వత్ భూమికా నవకోచ్ఛ్రితః।
అంజలీ పుట సంస్థానః పంచాండక విభూషితః॥ 11

తా॥ కుంభ మేరువు కుంభమువలె 9 అంతస్తులతోను 5 అండకములతోను రచించవలెను.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ కుంభః కుంభాకృతి స్తద్వద్భూమికా నవకోచ్ఛ్రయః॥ 95
అంజలీపుట సలాన పంచాండక విభూషితః॥ 92

ఇట్లు పై రీతిగనే చెప్పబడియున్నది.

(అనుబంధము 39వ పటము చూడుడు)

## 70. సముద్ర మేరువు లక్షణము

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ షోడశాశ్రిః సమంతాచ్చ విజ్ఞేయః స సముద్రకః।
పార్శ్వయో శ్చంద్రశాలాచ ఉచ్ఛ్రాయాత్ సద్విభూమికః॥ 12

తా॥ సముద్రమేరువు మొదటి నుండి చివరవఱకు 16 కోణములుగాను 2 అంతస్తులుగాను రచించవలెను మిగిలిన యంశము లన్నియు మేరువువలెనే రచించవలెను.

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ "షోడశాస్రః సమంతాత్తు విజ్ఞేయః స సముద్రకః॥ 92
పార్శ్వయోశ్చంద్రశాలస్య ఉచ్ఛ్రాయో
భూమికాద్వయమ్॥ 93

(అనుబంధము 40వ పటము చూడుడు)

## 71. వృషభ మేరువు లక్షణము

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ ... I దేవతానాం వృషః సదా వృషస్తు స్యోచ్ఛ్రితే తుల్యః।
సర్వతః స్వస్తి వర్తితః॥ 9
... II పద్మతుల్య ప్రమాణేన వావృష శ్చతురశ్రకః।
పంచాండ మగ్రభూమిస్తు గర్భోహస్త చతుష్టయమ్॥ 18
వృషోభవతి నాత్రాయం ప్రాసాదం సర్వకామికః।
సప్తకా పంచకాభూమి ప్రాసాదోయ ఇహోదితః॥ 19
"వావృషో మృగరాజశ్చ విమానచ్ఛంద ఏవచ"॥ 33

"ఏతే ద్వాదశ హస్తాః స్యః ప్రమాణేన పృథక్ పృథక్"
విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ వృషస్యోచ్ఛ్రాయత స్తుల్యో మండితశ్చిత్ర వర్జితః॥ 90

తా॥ వృషభ మేరువునందు చిత్రరూప నిర్మాణ మవసరము లేదు. 5 అంతస్తులుండవలెను. వృషభ మేరువు సమస్త శుభముల నిచ్చును. పద్మమేరువునే నలుచదరముగాజేసి పైన 5 అండకము లతో రచించవలెను. 5 అంతస్తులుగాని 7 అంతస్తులుగాని కలిగి యుండవలెను. గర్భము 4 హస్తములుంచవలెను.

## 72. వృషభ మేరువు 2వ పద్ధతి

అపరాజిత 167వ సూ.

శ్లో॥ ఇషుపక్ష ర్తుయమలా స్తత్వద్వగ్నియ మర్తవః।
భద్రం ఛాద్ధార్ధ నిష్కాసం పృథక్ శేషా వినిర్గతాః॥ 14
కర్ణేచ సర్వతో భద్రం శ్రీవత్సో రథనందికే।
త్రీణి షట్ చత్వారి క్రమాదురః శృంగాణి షోడశ॥ 15
ద్వాత్రింశ చ్చైవ ప్రత్యంగే జగత్యాద్యంచ పూర్వవత్।
జ్ఞేయో వృషభ మేరుశ్చ సార్ధ సప్తశతాండకః॥ 16

తా॥ 5-2-6-2 ఇట్లు మధ్యనుండి భాగములు చేయవలెను. (మఱియు 5-2-3-1-6 భాగములును చేయవచ్చును. అప్పుడు 34 భా) 'తద్వత్ త్రింశ ద్విభాజితే' అని యుండవలయునేమో? భద్రము యొక్క నిర్గమము ½భాగము, కర్ణమున సర్వతో భద్రమువలెను. రథములయందును నందికములయందును శ్రీవత్సమువలెను. ఉరః శృంగములు 3-6-4 ఇట్లు 16 రచించవలెను. ప్రత్యంగములు 32 రచించవలెను. జగతి మొదలైనవి మేరువున జేసినట్లే చేయవలెను. 750 అండకములతో నుండవలెను దీనిని వృషభ మేరువని చెప్పుదురు. (అనుబంధము 41, 41-A పటములు చూడుడు)

# 73. మృగరాజ మేరువు

సమరాంగణ 63వ అధ్యాయము.

శ్లో॥ మృగరాజస్తు విఖ్యాత శ్చంద్రశాలా విభూషితః।
ప్రాగ్గ్రీవేణ విశాలేన భూమికా సప్త ఉచ్ఛ్రితః॥ 14

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము.

శ్లో॥ మృగరాజస్తు విఖ్యాత శ్చంద్రశాలా విభూషితః।
ప్రాగ్గ్రీవేణ విశాలేన భూమికా సషడున్నతా॥

తా॥ మృగరాజము చంద్రశాలతో 6 అంతస్తులు కలిగి యుండును. మృగరాజ మేరువు 7 అంతస్తులతోను చంద్రశాలలును ప్రాగ్గ్రీవములును కలిగియుండవలెను.

# 74. లక్ష్మీకోటర మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ వేదేందు వేదేందుయుగా అష్టావింశతి భాజితే।
కర్ణే ప్రతిరథే చైవ ద్వేద్వే శృంగేచ సర్వతః॥ 23
నంద్యాంచ లఘుశృంగాణి కర్ణతుల్యా నిచోచ్ఛ్రయే।
తదూర్ధ్వే లఘుతిలకం రథికాత్ర్యంశకోన్నతా॥ 24
షోడశచోరః శృంగాణి ప్రత్యంగేతు తథాష్టచ।
చతుర్వింశ త్సర్వభద్రే భద్రకాణాంచ సంఖ్యయా॥ 25
చతుర్వింశతి తిలకైః సభ్రమోవా భ్రమైర్వినా।
పంచ షష్టిశ్చద్విశతం లక్ష్మీకోటర కాండకాః॥ 26

తా॥ 4-1-4-1-4 ఇట్లు మధ్యనుండి భాగములు చేయవలెను మొత్తము 28 భాగములు, కర్ణములయందును ప్రతిరథముల యందును ఒక్కొక్క దానికి 2 శృంగములు అన్నిటికిని చేయవలెను. శాల నందియందు చిన్నశృంగములను చేయవలెను. కర్ణములతో సమానమైన యెత్తు గలిగియుండవలెను. ఆ పైన చిన్న తిలకమును రచించవలెను. రథిక యెత్తు 3 భాగములు, ఉరః శృంగ

ములు 16 ప్రత్యంగమున 8యును సర్వభద్రమున 24 భద్రములును, 24 తిలకములును 265 అండకములును చేయవలెను. సాంధారముగా గాని నిరంధారముగా గాని చేయవచ్చును. దీనిని లక్ష్మీకోటర మేరు వందురు. (అనుబంధము 42, 43 పటములు చూడుడు)

## 75. పంచవక్త్ర మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ ఏక చత్వారింశ దేవ ప్రస్యంతేఽండకా స్తథా ॥ 29
పక్షయుగ్మ చంద్రవేదై ర్భక్తేఽష్టౌ దశభి స్తథా।
కర్ణే శృంగద్వయం చైవ పంచాండక విభూషితః॥ 30
దాపయే త్తిలకం కర్ణ్యాం శృంగం ప్రతిరథే తథా।
కార్యాణ్యష్టోరు శృంగాణి పంచవక్త్రే స్తునా మతః॥ 31

తా॥ 2-2-1-4 ఇట్లు విభజించుచు మొత్తము 18 భాగములు చేసి కర్ణమున 2 శృంగములును, 5 అండకములును, తిలకమును కర్ణికయందు శృంగమును, ప్రతిరథమున శృంగమును, 8 ఉరః శృంగములును 41 అండకములతో జేసినచో పంచవక్త్రి మేరు వగును. (అనుబంధము 44వ పటము చూడుడు)

## 76. గిరి మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ పక్షైక యుగ్మ మేకంచ యుగ్మం షోడశ భాజితే।
కర్ణే ప్రతిరథే ద్వే ద్వే శృంగం పంచాండ భూషితమ్॥ 38
ద్వాదశైవోరు శృంగాణి ప్రత్యంగాని తథాష్టచ।
అండకా శతమేకం చ చత్వారింశ దుత్తరమ్॥ 39

తా॥ 2-1-౽-1-2 ఇట్లు మధ్యనుండి విభజించి మొత్తము 16 భాగములుచేసి, కర్ణములయందును ప్రతిరథములయందును 2-2 శృంగములును 5 అండకములును, 12 ఉరఃశృంగములును, ప్రత్యంగ ములు 8యును, 140 అండకములు చేసినచో గిరి మేరువగును.
(అనుబంధము 45వ పటము చూడుడు)

## 77. తిలక మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ యమేందు ద్వైకైకపక్షా అష్టాదశ విభాజితే।
కర్ణేఽను నేత్రి శృంగంచ పంచాండక విభూషితమ్॥ 40
ప్రత్యాంగాని తథాచాష్టావురః శృంగాణి షోడశ।
తిలకోఽండకా నాంత్రయో దశాధిక శతద్వయమ్॥ 41

తా॥ 2-1-2-1-12 ఇట్లు మధ్యనుండి విభజించుచు మొత్తము 18 భాగములుచేసి కర్ణమున 3 శృంగములును 5 అండకములును, ప్రత్యంగములు 8, ఉరఃశృంగములు 16, తిలకమున అండకములును. 213 అండకములతో రచించినచో తిలకమేరువగును.

(అనుబంధము 46వ పటము చూడుడు)

## 78. చంద్రశేఖర మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ త్రిద్విత్రి యుగ్మేందురసా శ్చతుస్త్రింశ ద్విభాజితే।
తిలకతుల్యాండక యుక్ తాదృక్ శృంగేఽబ్జశేఖరః॥ 42

తా॥ 3-2-3-2-1-6 ఇట్లు విభజించుచు మొత్తము 34 భాగములుచేసి తిలకముతో సమానముగా అండకములును శృంగముల యందును రచించినచో చంద్రశేఖర మేరువగును.

## 79. మందరతిలక మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ పక్షయుగ్మ ద్వయం శస్తం భక్తం ద్వాదశధా తథా।
కర్ణే శృంగద్వయం కుర్యాత్తిలకం ప్రరథే తథా॥ 43
ప్రత్యంగేచ తథా చాష్టౌ పురః శృంగాణి షోడచ।
మందరో మేరురాఖ్యాతః పంచవింశతి రండకాః॥ 44

తా॥ చతురశ్ర ప్రదేశము 12 భాగములుచేసి మధ్యనుండి 2-2-2 భాగములుచేసి కర్ణమున 2 శృంగములును, తిలకమును

ప్రరథమునను 2 శృంగములును ప్రత్యంగములు 8, ఉరఃశృంగములు 16ను 25 అండకములును రచించిన యెడల మందరతిలక మేరు వగును.

## 80 సౌభాగ్య మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ పక్షయుగ్మైక యుగ్మాంతా శ్చతుర్దశ విభాజితే।
కేశరీ శ్రీవత్సకర్ణే ప్రరథే తిలకం తథా॥ 45
ద్వాదశైవోరు శృంగాణి సప్త సప్తతిరండకాః।
సౌభాగ్య నామా కర్తవ్యో భుక్తి కామార్థ దస్తథా॥ 46

తా॥ విస్తారమును 14 భాగములు చేసి 2 2-1-2 ఇట్లు విభజించి కర్ణములు కేశరి శ్రీవత్సములవలెను. ప్రరథములును అదే విధముగాను, తిలకమును, ఉరఃశృంగములు 12ను, 77 అండకములతో రచించినచో సౌభాగ్య మేరువగును.

## 81. గంధమాదన మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ అష్టైక పక్షచంద్రాశ్చ చతుర్వింశతి భాజితే।
కర్ణేచ కేశరీ కార్యో భద్రే శృంగత్రయం తథా॥ 34
ప్రత్యంగేచాష్ట శృంగాణి అండకాః సప్తవింశతిః।
సర్వదేవాలయో యుక్తో నామ్నా వై గంధమాదనః॥ 35

తా॥ విస్తారమును 24 భాగములుచేసి 8-1-2-1 ఇట్లు విభజించి కర్ణములయందు కేశరి పద్ధతియును, భద్రములయందు 3 శృంగములును, ప్రత్యంగములయందు 8 శృంగములును 27 అండకములును కలిగినది గంధమాదన మేరువు.

## 82. సర్వసుందర మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ గుణేందురామైకగుణా ద్వావింశతి విభాజితే।
కర్ణే రథే ద్విద్విశృంగం పంచాండక విభూషితమ్॥ 47

ప్రత్యంగేచ తథా చాష్టా వురః శృంగాణి షోడశ।
చత్వారింశం శతం సంఖ్యాండకానాం సర్వసుందరే॥ 48

తా॥ విస్తారమును 22 భాగములుచేసి మధ్యనుండి 3-1-3-1-3 ఇట్లు విభజించి కర్ణములయందును ప్రతిరథములయందును 2 2 శృంగములును, 5 అండకములును ప్రత్యంగమున శృంగములు 8, ఉరఃశృంగములు 16ను 140 అండకములును రచించి రేని సర్వసుందరమేరువగును.

## 83. శ్రీతిలక మేరువు

అపరాజిత 167 సూ.

శ్లో॥ పక్షైక ద్వ్యేక పక్షాశ్చ క్షేత్రే షోడశ భాజితే।
రథే కర్ణే ద్విద్విశృంగం పంచాండక విభూషితమ్॥ 49
షోడశైవోరు శృంగాణి ప్రత్యంగేతు తతోఽష్టభిః।
పంచచత్వారింశం శతం తథా శ్రీతిలకోఽండకాః॥ 50

తా॥ విస్తారమును 16 భాగములుచేసి -1-2-1-2 ఇట్లు విభజించి రథమునను కర్ణమునను 2-2 శృంగములును 5 అండకములును ఉరఃశృంగములు 16ను ప్రత్యంగమున 8యును 145 అండకములును చేసినచో శ్రీతిలక మేరువగును.

## 84. శ్రీకూట మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ పంచత్రియుగ్మ వేదాస్స్యు రష్టావింశతి భాజితే।
కర్ణేశృంగద్వయం కార్యం నవాండక విభూషితమ్॥ 51
అష్టౌచైవోరు శృంగాణి ప్రత్యంగాని తథాష్టచ।
అండా ఏకోన నవతి ర్విశాః సర్వకామదః॥ 52
పక్షేందు రామా ఏవంతు క్షేత్రే ద్వాదశభాజితే।
శృంగమేకం తథా కర్ణే పంచాండక విభూషితమ్॥ 53
భద్రే సంవరణా చైవ ఘంటా కూటై రలంకృతా।
ఏక వింశత్యండక యుక్ శ్రీకూటో నామ శోభనః॥ 54

తా॥ విస్తారమును 28 భాగములుచేసి 5-3-2-4 ఇట్లు విభజించి కర్ణము 9 అండకములతోను 2 శిఖరములతోను ఉరఃశృంగములు 8 ప్రత్యంగములు 8 మొత్తము 89 అండకములతో రచించవలెను. లేదా 12 భాగములుచేసి 2-1-3 ఇట్లు కూడ భాగించి చేయవచ్చును. అయితే కర్ణము 5 అండకములు 1 శిఖరము, భద్రమున సంవరణ, ఘంట, కూటము మొదలై నూనితో అలంకారముగ 21 అండకములతో రచించవలెను. దానిని శ్రీకూట మని చెప్పుదురు. (అనుబంధము 47వ పటము చూడుడు)

## 85. పద్మసంభవ మేరువు

అపరాజిత 167వ సూ.

శ్లో॥ దేదరామైక పక్షాశ్చ క్షేత్రే వింశతి భాజితే।
క్రమోత్తర క్రమయుక్తాత్ర్య యస్త్ర్యయః కర్ణానుగే॥ 57
ద్వాదశైవోరు శృంగాణి ప్రత్యంగేచ తథాష్టభిః।
త్రింశే ద్వింశతి ర్ద్వాదశ చాండకాః కర్ణశృంగకే॥ 58
పంచవింశతిరేవస్యు ర్దిక్షు ప్రతిరథే తథా।
మూలరేఖాకర్ణ శృంగే కుర్యాత్ పంచాండకాస్తతః॥ 59
ఏకోత్తర సహస్రాండో నామ్నా సోపద్మ సంభవః।
హరిర్హిరణ్య గర్భశ్చ హరో దినకర స్తథా॥ 60
ఏతేషా మేవమేరుః స్యా న్నాన్యేషాంచక దాచన।
ఏకోత్తర సహస్రాండః పద్మసంభవ మేరుకః॥ 61
ఇతి సూత్ర సంతాన గుణకీర్తి ప్రకాశ ప్రోక్త
శ్రీ భువన దేవాచార్యక్తా పరాజిత పృచ్ఛాయా
మేక వింశతి మేరులక్షణాధికారో నామ
సప్త షష్ట్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ క్షేత్రమును 20 భాగములుచేసి 4-3-1-2 ఇట్లు భాగములుచేసి ప్రస్తరము పైన క్రమక్రమముగా 3-3 ఉరఃశృంగములు కర్ణముల ననుసరించి నలువైపుల రచించవలెను. అవి 12ను ప్రత్యంగ

ముల యందు 8యును, 30-20-12 అండకములు కర్ణశృంగములకును ప్రతిరథమున 25 అండకములు నలువైపులను కర్ణశృంగమున ప్రధాన మంజరి 5 అండకములతోను మొత్తము 100 అండకములుచేసి రేని అది పద్మసంభవ మేరువగును. విష్ణువు, బ్రహ్మ, ఈశ్వరుడు, సూర్యుడు అనువారలకే పై చెప్పిన మేరువు నిర్మించవలెనుగాని అన్యదేవతల కెన్నడును రచించరాదు-

## 86. విమానచ్ఛందజ మేరువులు 9.

## అందు శ్రీ మేరువు లక్షణము

**విశ్వకర్మోవాచ-**

అపరాజిత 180వ సూ.

శ్లో॥ నవమేరూం స్తథా ప్రోక్తాన్ కథయే తవసాంప్రతమ్।
ఏకైకస్య యథానామ లక్షణం యస్య యాదృశమ్॥ 1
శ్రీ మేరుః ప్రథమోనామ ద్వితీయో హేమశీర్షకః।
సురవల్లభ స్తృతీయస్తు్ర్యైభువన మండనః॥ 2
పంచమోరత్న శీర్షాఖ్యః షష్ఠో వైకిరణోద్భవః।
సప్తమో కమలహంసః సువర్ణ కేతు రష్టమః॥ 3
నవమో మేరురాఖ్యాతో నామ్నాతు వృషభధ్వజః।
ఇత్యుక్తశ్చ మహామేరు స్త్రీణోదిత క్రమాగతః॥ 4
భవేత్త్రి రథకశ్చాద్యో యావన్న వరథాంతకమ్।
పంచసప్తరథాశ్చోక్తా అంగమిత్యభిధీయతే॥ 5
పంచాదిహ స్తతో మేరుః పంచాశద్ధ స్తకావధి।
హస్తాంతరే తతో భేదా భూతలేదాశ్చ సంఖ్యయా॥ 6
వినాభ్రమైః సభ్రమాశ్చ మహామేరుర్భ మవ్యయమ్।
ఇత్యుక్త సమలంకారః ప్రయుక్తా వాస్తువేదిభిః॥ 7
శ్రీ మేరునామా ప్రోక్తోసా వేకోత్తర శతాండకః।
సపాద శతాండకోయో హేమశీర్షః స ఉచ్యతే॥ 8

సురవల్లభ నామా సయస్యార్థ ద్విశతాండకః।
పంచసప్త త్యుత్తర త్రిశతాండో లోకమండనః॥ 9

రత్నశీర్ష స్తథా చైకోత్తర పంచశతాండకః।
సపాద షట్ శతాంశకో మేరుర్వై కిరణోద్భవః॥ 10

సార్ధ సప్తశతాం డైశ్చ స్మృతః కమలహంసకః।
స్వర్ణకేత్వభి ధానశ్చ పాదోనాంకశతాండకైః॥ 11

ఏకోత్తర సహస్రాండో మేరుశ్చ వృషభధ్వజః।
అండ సంఖ్యాభి ధానంచ కధితం త్వ పరాజిత॥ 12

పంచాది హస్తతో మేరుః పంచాశద్ధ స్తకావధి।
హస్తాంతరే భేదకాః షట్ చత్వారింశచ్చ సంఖ్యయా॥ 13

తా॥ మేరువులు 9 విధములు అది 3 రథములతో ప్రారంభమై 5-7-9 రథముల వరకు వృద్ధితో మూడువిధములుగా విభజింపబడినది. వానికి అంగములని పేరిడిరి. అనగా పంచాంగ సప్తాంగ నవాంగములనుట. విస్తారము 5 హస్తములతో నారంభింపబడి 50 హస్తముల వఱకు పెంచబడినది. ఆ హస్తములతో 45 భేదములేర్పడినవి. మహామేరువు భ్రమములేకుండను, భ్రమముతో కూడను రచించవచ్చును. లేక రెండు భ్రమములను కల్పించవచ్చును. ఇట్లు వాస్తుశాస్త్రవేత్తలు అలంకార యుక్తముగ రచించుచుండిరి. 101 అండకములు కలది శ్రీ మేరువు. 125 అండకములు కలది హేమశీర్ష మేరువు. 250 అండకములు కలది సురవల్లభమేరువు. 375 అండకములు కలది భువనమండన మేరువు. 501 అండకములు కలది రత్నశీర్ష మేరువు. 625 అండకములు కలది కిరణోద్భవ మేరువు. 750 అండకములు కలది కమలహంస మేరువు. 875 అండకములు కలది సువర్ణకేతు మేరువు. 1001 అండకములు కలది వృషభధ్వజ మేరువు. 5 హస్తములు మొదలు 50 హస్తములతో హస్తభేదములలో వరుసగా ఒక్కొక్క హస్తము పెంపునకు ఒక్కొక్క పేరుకలిగినది అట్లు 46 భేదములును వాని నామములును కలిగినవి.

శ్లో॥ అండవింశతి వృద్ధ్యాచ హస్తభేదా ఇతిస్మృతాః।
షట్ చత్వారింశత్, ఏకో భేదఉక్తశ్చ శాశ్వతః॥ 14
చతుర శ్రీకృతే క్షేత్రే అష్టాష్టక విభాజితే।
భాగోభాగో భ్రమోభిత్తి ర్ద్విభాగోగర్భ ఉచ్యతే॥ 15
ద్విభాగోభిత్తి విస్తారః శేషంగర్భో భ్రమం వినా।
వినాభ్రమంస భ్రమంవా దూషయేన్నహి మేరువమ్॥ 16
క్షేత్రార్ధే చ భవేద్ భద్రం భద్రార్ధే కర్ణవిస్తరః।
కర్ణకార్ధ ప్రమాణేన కర్తవ్యో భద్రనిర్గమః॥ 17
భద్రంగ వాక్షకోపేతం మధ్యే కుర్యాచ్చ సమ్ముఖమ్।
యామ్యోత్తరే శుకాగ్రేతు జంఘయామత్రయోదశ॥ 18
పీఠోప పీఠ జంఘూర్ధ్వే మేఖలా కూటచ్ఛాద్యకమ్।
పునర్జంఘోర్ధ్వ మశ్ఛాద్యం ప్రహారాంతే సప్తోన్నతమ్॥ 19
రాజాసన వేద్యాసన స్తంభోచ్ఛాల చ్ఛాద్యాంతకైః।
షడ్భాగమున్నతం కూటం ఘంటాకూటై రలంకృతా॥ 20
చత్వారో నందనాఃకర్ణే విమాన మురుశృంగకమ్।
సార్ధత్రిభాగికం కుర్యాత్ర మూర్ధ్వేతు వినిర్గతమ్॥ 21
షడంశం మూలశిఖరం విమానం పంచభూమికమ్।
రథికోద్గమ శోభాఢ్యం శుకనాసాగ్ర భూషితమ్॥ 22
కంఠోగ్రీవా కుడ్మలంచ పద్మచ్ఛత్రో పచ్ఛత్రకమ్।
తదూర్ధ్వే కలశంస్థాప్యం క్షీరార్ణవ సముద్భవమ్। 23

తా॥ పై జెప్పినట్లు హస్తభేదములే కాక 20 అండకముల పెంపునకు ఒక్కొక్క పేరుతో కూడ 46 భేదములేర్పడినవి. అనగ 101 మొదలు 1001 వఱకు వరుసగా 46 భేదములైనవి. చతురస్ర ప్రదేశమును 8-8 భాగములుచేసి భ్రమ 1 భాగము, గోడ 1 భాగము గర్భము 2 భాగములు, వెలుపలి గోడ 1 భాగము ఇట్లు సాంధారమును, నిరంధారమునకు గర్భము 4 భాగములును, గోడ 2-2 భాగములును చేయవలెను. ఈ రెండు పద్ధతులలో నేదియైనను చేయ

వచ్చును. క్షేత్రములో సగము భద్రవిస్తారమును, భద్రములో సగము కర్ణవిస్తారమును, కర్ణములో సగము భద్రముయొక్క నిర్గమమును, భద్రమునకు గవాక్షములుండవలెను. దక్షిణోత్తరముల యందు శుకాగ్రములను రచించవలెను. జంఘయొక్క యెత్తు 13 భాగములు అందు పీఠము, ఉపపీఠము, జంఘ, మేఖల, కూటము, ఛాద్యము, భాగముల ప్రకారము చేయవలెను. మరల జంఘ ఛాద్యముపైన యెత్తు 7 భాగములు రాజపీఠమనేది. పీఠము, స్తంభము, ఉచ్ఛాలము, ఛాద్యము ఇట్లు భాగముల ప్రకారము రచించవలెను. కూటము యెత్తు 6 భాగములు. అందు ఘంట కూటము మొదలైన వానితో రచించవలెను. 4 అంతస్తులకు భద్రములు కర్ణములు రచించవలెను. 5వ అంతస్తున విమానమున ఉరః శృంగమును కల్పించవలెను. 3½ భాగములు యెత్తుండవలెను. ప్రధానశిఖరము 6 భాగముల యెత్తుండవలెను.రథికలు యెత్తుగా నుండవలెను. పై శుకనాసము లుండవలెను.కంఠము, గ్రీవ, మొగ్గ, పద్మచ్ఛత్రము, ఉపచ్ఛత్రము,నకలశము, ఇవియన్నియనుక్రమముగా రచించవలెను- అండకములు 101 కలిగియుండవలెను. దీనిని శ్రీ మేరువందురు.

(అనుబంధము 48వ పటము చూడుడు)

## 87. హేమశీర్షక మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే శతమూల విభాజితే।
ద్విభాగః కర్ణ ఇత్యుక్తః సార్థః ప్రతిరథో భవేత్॥ 24
త్రిభాగో భద్రవిస్తారో మత్తాలంబై ర్విభూషితః।
ఉక్తాః ప్రతిరథాః సూర్యా ఉరుశృంగం విమానకమ్॥ 25
విమానం మూలశిఖరం ఘంటాకలశ భూషితమ్।
శుకాగ్రక సమాయుక్తం శేషం పూర్వప్రకల్పితమ్॥ 26
వినాభ్రమం సభ్రమోవా శాశ్వతో హేమశీర్షకః।
హేమకూటపు రేయాంతి యావచ్చంద్రార్క తారకమ్॥ 27

తా॥ చతురశ్ర ప్రదేశమును 10-10 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, ప్రతిరథము 1½ భాగము, భద్రము 3 భాగములు, మత్తాలంబములతోను, ప్రతిరథములు 12ను, విమానమున నురఃశృంగములును. ప్రధానశిఖరమున ఘంట, కలశము, శుకనాసము మొదలైనవి మునుపటివలెనే రచించవలెను - నిరంధారముగా గాని సాంధారముగా గాని రచించవచ్చును. 125 అండకములతో నుండవలెను. దీనిని హేమశీర్ష మేరువని చెప్పుదురు.

# 88. సురవల్లభ మేరువు

అపరాజిత 180 సూ.

శ్లో॥ భక్తే ద్వాదశధా క్షేత్రే ద్విభాగః కర్ణవిస్తరః।
పార్శ్వకర్ణీ భవేద్భాగా సార్ధః ప్రతిరథో భవేత్॥ 2
కర్ణీ ప్రోక్తా చార్ధభాగా ద్విభాగో భద్రవిస్తరః।
చత్వారో నందనాః కర్ణే దశాంశైర్నాగరోద్భవాః॥ 2
తదూర్ధ్వే సార్ధభాగైశ్చ ద్వితయే కేశరీక్రమే।
శిఖరం వై మల్లతలం ప్రత్యంగ కుముదోద్భవమ్॥ 3
ఉరుశృంగంచ కుముదం విమానః స్యాద్ ద్వితీయకః।
ఏవం లక్షణకం కుర్యాన్మేరుంచ సురవల్లభమ్॥ 3
వల్లభః సర్వదేవానాం స్వర్గేవాభూమి శాసనమ్।
ఈప్సితం లభతే రాజ్యం స్వర్గేవాక్షితి మధ్యతః॥ 3

తా॥ చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, దాని ప్రక్కను రథము 1 భాగము, ప్రతిరథము 1 భాగము, కర్ణి ½ భాగము, భద్రము 2 భాగములు, కర్ణమున నం నములు 4ను. 10 భాగములతోను నాగరపద్ధతితోను రచించవలెను ఆపైన 1½ భాగము రెండవ అంతస్తున కేశరిపద్ధతితోను, మ తలముతో శిఖరమును, ప్రత్యంగము కుముదమువలెను. ఉర శృంగము కూడ కుముదమువలెను. రెండవ అంతస్తుపైన విమా మును ఇట్లు రచించిరేని సురవల్లభమగును. 250 అండకములతో

## 89. భువనమండన మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ చతుర్దశ విభక్తేచ ద్విభాగః కర్ణవిస్తరః।
నందనస్తత్ర కర్తవ్య ఊర్ధ్వే స్యాత్ సర్వభద్రకః॥ 33
మల్లతలంచ శిఖరం ఘంటాకలశ భూషితమ్।
భాగాచ పార్శ్వకర్ణే స్యాత్ శ్రీవత్సశ్చతతో భవేత్॥ 34
కర్ణతుల్యః ప్రతిరథః సర్వతో భద్రభూషితః।
తదూర్ధ్వే తిలకం స్థాప్య మురశ్శృంగం మల్లతలమ్॥ 35
కర్ణికా చైకపాదాతు శ్రీవత్సస్తత్ర భూషితః।
కుముదాఖ్యం చోరుశ్శృంగం తద్వత్ ప్రత్యంగకం తథా॥ 36
భద్రేకర్ణేచ శ్రీవత్సః కుముదం చోరుశ్శృంగకం।
వినాభ్రమంస భ్రమోవా కార్యో భువనమండనః॥ 37
రత్నకూటే మహాశైలే రాజ్యం యావచ్చమేదినీ।
చంద్రార్క తారకం యావత్ యావద్దేవో మహేశ్వరః॥ 38

తా॥ చతురశ్ర ప్రదేశమును 14 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, నందనములును, అంతట భద్రములును, శిఖరము మల్లతలముగాను, ఘంట, కలశమును చేయవలెను. ప్రక్క కర్ణిక 1 భాగము తరువాత శ్రీవత్సమును రచించవలెను. ప్రతిరథము కర్ణముతో సమానముగ రచించవలెను. అంతటను భద్రములుండవలెను. ఆపైన తిలకమును రచించవలెను. ఉరఃశృంగమును మల్లతలముగా రచించవలెను. కర్ణిక 1 భాగము, శ్రీవత్సమును రచించవలెను. ఉరఃశృంగము కుముదము అనుదానిని రచించవలెను. ప్రత్యంగము కూడ అటులేచేయవలెను. భద్రమునను, కర్ణమునను, శ్రీవత్సము యొక్క పద్ధతిగా రచించవలెను. ఉరఃశృంగము కుముదముగా రచించవలెను. నిరంధారముగా గాని సాంధారముగా గాని రచించవచ్చును. 375 అండకము లుండవలెను. దీనిని భువనమండన మందురు. సమస్తమైన కోరికలనిచ్చును.

# 90. రత్నశీర్ష మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ ద్వాత్రింశద్భాజితే క్షేత్రే పంచాంశః కర్ణ విస్తరః।
పార్శ్వకర్ణీ భవేద్భాగా వేదాంశః ప్రరథ స్తథా॥ 39
ద్విభాగాచ పునః కర్ణీభద్రం చాష్టాంశ విస్తరమ్।
కర్ణేచ మందరం కుర్యాచ్ఛిఖరం కౌముదం తథా॥ 40
సర్వతో భద్ర ఊర్ధ్వేతు మల్లం శిఖరం ముత్తమమ్।
ద్వావింశత్యంశ విస్తారం ఘంటాకలశ భూషితమ్॥ 41
పార్శ్వకర్ణీకే శరిణః ప్రత్యంగంచ విమానజం।
ప్రరథే సర్వతో భద్ర మూర్ధ్వ తద్రూపకం భవేత్॥ 42
మల్లతలం చోరుశృంగం తద్వత్ ప్రత్యంగ కర్ణికా।
మత్తాలంబోఽగ్ర భద్రేషు చోరుశృంగంతు కౌముదమ్॥ 43
సభ్రమంచ తతః కుర్యాద్ రేఖామర్మ వితర్కితమ్।
నవఖండధరా మధ్యే తద్రాజ్యం జన్మజన్మని॥ 44

తా॥ చతురస్ర ప్రదేశమును 32 భాగములుచేసి అందు కర్ణము 5 భాగములు, ప్రక్కనుకర్ణి 1 భాగము, ప్రరథము 4 భాగములు మరల కర్ణి 2 భాగములు, భద్రము 8 భాగములు కర్ణము మందరపద్ధతితోను, శిఖరము కుముదమును పైన సర్వతో భద్రమును, శిఖరము మల్లతలముగను, విస్తారము 22 భాగములతోను ఘంట, కలశములతోను రచించవలెను. పార్శ్వములందలి కర్ణికలు కేశరిపద్ధతితోను, ప్రత్యంగము విమానపద్ధతితోను, ప్రరథమున సర్వతో భద్రములును, పైన అదే ప్రకారమును, ఉరఃశృంగము కూడ మల్లతలమును, ప్రత్యంగమును కర్ణికయును అదేవిధముగాను, పై భద్రములయందును మత్తాలంబమును, ఉరఃశృంగము కుముదము వలెను రచించవలెను. సాంధారపద్ధతిగా రచించవలెను. వాస్తు మర్మదోషములు లేకుండ కూడ భాగములు నిర్ణయించవలెను.

## 89. భువనమండన మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ చతుర్దశ విభక్తేచ ద్విభాగః కర్ణవిస్తరః।
నందనస్తత్ర కర్తవ్య ఊర్ధ్వే స్యాత్ సర్వభద్రకః॥ 33
మల్లతలంచ శిఖరం ఘంటాకలశ భూషితమ్।
భాగాచ పార్శ్వకర్ణే స్యాత్ శ్రీవత్సశ్చతతో భవేత్॥ 34
కర్ణతుల్యః ప్రతిరథః సర్వతో భద్రభూషితః।
తమూర్ధ్వే తిలకం స్థాస్య మురుశ్శృంగం మల్లతలమ్॥ 35
కర్ణికా చైకపాదాతు శ్రీవత్సస్తత్ర భూషితః।
కుముదాఖ్యం చోరుశ్శృంగం తద్వత్ ప్రత్యంగకం తథా॥ 36
భద్రేకర్ణేచ శ్రీవత్సః కుముదం చోరుశ్శృంగకం।
వినాభ్రమంస భ్రమోవా కార్యో భువనమండనః॥ 37
రత్నకూటే మహాశైలే రాజ్యం యావచ్చమేదినీ।
చంద్రార్క తారకం యావత్ యావద్దేవో మహేశ్వరః॥ 38

తా॥ చతురశ్ర ప్రదేశమును 14 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, నందనములును, అంతట భద్రములును, శిఖరము మల్లతలముగాను, ఘంట, కలశమును చేయవలెను. ప్రక్క కర్ణిక 1 భాగము తరువాత శ్రీవత్సమును రచించవలెను. ప్రతిరథము కర్ణముతో సమానముగ రచించవలెను. అంతటను భద్రములుండవలెను. ఆపైన తిలకమును రచించవలెను. ఉరఃశృంగమును మల్లతలముగా రచించవలెను. కర్ణిక 1 భాగము, శ్రీవత్సమును రచించవలెను. ఉరఃశృంగము కుముదము అనుదానిని రచించవలెను. ప్రత్యంగము కూడ అటులేచేయవలెను. భద్రమునను, కర్ణమునను, శ్రీవత్సము యొక్క పద్ధతిగా రచించవలెను. ఉరఃశృంగము కుముదముగా రచించవలెను. నిరంధారముగా గాని సాంధారముగా గాని రచించవచ్చును. 375 అండకము లుండవలెను. దీనిని భువనమండన మందురు. సమస్తమైన కోరికలనిచ్చును.

# 90. రత్నశీర్ష మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ ద్వాత్రింశద్భాజితే క్షేత్రే పంచాంశః కర్ణ విస్తరః।
పార్శ్వకర్ణి భవేద్భాగా వేదాంశః ప్రరథ స్తథా॥ 39

ద్విభాగాచ పునః కర్ణిభద్రం చాష్టాంశ విస్తరమ్।
కర్ణేచ మందరం కుర్యాచ్ఛిఖరం కౌముదం తథా॥ 40

సర్వతో భద్ర ఊర్ధ్వేతు మల్లం శిఖరం ముత్తమమ్।
ద్వావింశత్యంశ విస్తారం ఘంటాకలశ భూషితమ్॥ 41

పార్శ్వకర్ణికే శరిణః ప్రత్యంగంచ విమానజం।
ప్రరథే సర్వతో భద్ర మూర్ధ్వే తద్రూపకం భవేత్॥ 42

మల్లతలం చోరుశృంగం తద్వత్ ప్రత్యంగ కర్ణికా।
మత్తాలంబోఽగ్ర భద్రేషు చోరుశృంగంతు కౌముదమ్॥ 43

సభ్రమంచ తతః కుర్యాద్ రేఖామర్మ వితర్కితమ్।
నవఖండధరా మధ్యే తద్రాజ్యం జన్మజన్మని॥ 44

తా॥ చతురస్ర ప్రదేశమును 32 భాగములుచేసి అందు కర్ణము 5 భాగములు, ప్రక్కనుకర్ణి 1 భాగము, ప్రరథము 4 భాగములు మరల కర్ణి 2 భాగములు, భద్రము 8 భాగములు కర్ణము మందరపద్ధతితోను, శిఖరము కుముదమును పైన సర్వతో భద్రమును, శిఖరము మల్లతలముగను, విస్తారము 22 భాగములతోను ఘంట, కలశములతోను రచించవలెను. పార్శ్వములందలి కర్ణికలు కేశరిపద్ధతితోను, ప్రత్యంగము విమానపద్ధతితోను, ప్రరథమున సర్వతో భద్రములును, పైన అదే ప్రకారమును, ఉరఃశృంగము కూడ మల్లతలమును, ప్రత్యంగమును కర్ణికయును అదేవిధముగాను, పై భద్రములయందును మత్తాలంబమును, ఉరఃశృంగము కుముదము వలెను రచించవలెను. సాంధారపద్ధతిగా రచించవలెను. వాస్తు మర్మదోషములు లేకుండ కూడ భాగములు నిర్ణయించవలెను.

501 అండకములతో రచించిరేని రత్నశీర్ష మేరువగును. ఇది రాజ్య ప్రదము-

## 91. కిరణోద్భవ మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ ఛందేఽష్టాదశధాభక్తే త్రిభాగః కర్ణవిస్తరః।
పార్శ్వకర్ణీ భవేద్భాగా ద్విభాగః ప్రరథస్తథా॥ 45
పునఃకర్ణీ భవేద్భాగా వేదాంశో భద్రవిస్తరః।
శ్రీవత్సో మూలకర్ణేతు తచ్ఛృంగంచ విమానజమ్॥ 46
మందరశ్చోర్ధ్వతో తు ద్విభాగః కర్ణవిస్తరః।
ద్వాదశాంశా మూలరేఖా మల్లతలంచ శృంగకమ్॥ 47
ద్వౌమందరౌ ప్రతిరథే చాధఊర్ధ్వేతు సంస్థితౌ।
తదూర్ధ్వతః ప్రమాణేన చోరఃశృంగం మల్లతలమ్॥ 48
కర్ణేచ తిలకం కార్యం ప్రత్యంగంచ విమానమ్।
తద్రూపాచాగ్ర కర్ణేతు హ్యురుశృంగంతు కారయేత్॥ 49
ఉరఃశృంగేచ కుముదో మత్తాలంబై ర్భద్రోన్నతమ్।
ఏవమాది గుణోపేతం కుర్యాద్వై శుభలక్షణమ్॥ 50
గత్వాతు సూర్యలోకం వై సూర్యతేజః సమన్వితః।
సూర్యోయావచ్చ విఖ్యాత స్తావత్తిష్ఠత్య సౌనరః॥ 51

తా॥ చతురశ్ర ప్రదేశమును 18 భాగములుచేసి అందు కర్ణము 3 భాగములు, కర్ణిక 1 భాగము, ప్రరథము 2 భాగములు, మరల కర్ణిక 1 భాగము, భద్రము 4 భాగములు, ప్రధాన కర్ణములు శ్రీవత్సమువలెను. వాని యొక్క శృంగములు విమానపద్ధతితోను ఆపైన మందరపద్ధతితోను కర్ణము 2 భాగములు, ప్రధానమంజరి 12 భాగములు, శిఖరము మల్లతలముగాను, ఆపైన ప్రతిరథములు 2ను మందరపద్ధతితోను, ఆపైన ఉరఃశృంగము మల్లతలముగాను, కర్ణమున తిలకమును, ప్రత్యంగమున విమానపద్ధతియును, పై కర్ణిక

యును అటులే చేయవలెను. ఊరోమంజరిని రచించవలెను. ఉరః శృంగమును కుముదమును, భద్రము యెత్తుగా మత్తాలంబమును రచించవలెను. 625 అండకములతో రచించిరేని అట్టివారు సూర్యునితో సమానముగా పుణ్యలోకమున నుందురు.

## 92. కములహంస మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ క్షేత్రే వింశతిధా భక్తే త్రిభాగః కర్ణవిస్తరః।
పార్శ్వేకర్ణీ భవేద్భాభా ద్విభాగః ప్రతిరథో భవేత్॥ 52
తత్సమోరథ ఆఖ్యాతో భద్రం వేదాంశ విస్తరమ్।
కర్ణే కైలాస ఇత్యుక్త తచ్ఛృంగంచ విమానజమ్॥ 53
తదూర్ధ్వే నందిశాలశ్చ మాల్యవాన్ శిఖరే తథా।
కర్ణికా వై నందనజా ప్రత్యంగంతు విమానజమ్॥ 54
నందిశాలః ప్రతిరథే తద్రూపంతు తదూర్ధ్వతః।
మల్లతలోరు శిఖరం కర్తవ్యం శుభమిచ్ఛతా॥ 55
నందనో రథ ఊర్ధ్వేతు హ్యురు శృంగం విమానజమ్।
పృథున్యే చైవ మద్భాగః కుముదో భద్రకారుహః॥ 56
స్థాపితో బ్రహ్మకేంద్రేషు బ్రహ్మలోకపితా మహః।
స యాతి బ్రహ్మలోకేతు యావదాహృత సంప్లవమ్॥ 57

తా॥ చతురశ్ర ప్రదేశమును 20 భాగములుచేసి అందు కర్ణము 3 భాగములు, కర్ణిక 1 భాగము. ప్రరథము 2 భాగములు, రథము 2 భాగములు, భద్రము 4 భాగములు, కర్ణమున కైలాస పద్ధతియును, దాని యొక్క శిఖరము విమానపద్ధతితోను, ఆపైన నందిశాల పద్ధతితోను, శిఖరమున మాల్యవంతపు పద్ధతియును, కర్ణిక నందన పద్ధతితోను, ప్రత్యంగము విమానపద్ధతితోను, ప్రతిరథము నందిశాలవలెను. ఆపైనను అదియే పద్ధతియును, శిఖరము మల్లతలముగను, రథముపైన నందన పద్ధతియును, ఉరః శృంగము విమానపద్ధతితోను విస్తారము 6 భాగములును, కుముదము భద్రముయొక్క పైనను, రచించవలెను. 750 అండకములు కలిగి

యుండవలెను. దీనిని కమలహంస మేరువందురు. ఇది బ్రహ్మలోక ప్రాప్తికరమైన పుణ్యమునిచ్చును.

## 93. సువర్ణకేతు మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ ద్వావింశతి భక్తే క్షేత్రే శతమూల గర్భో భవేత్।
భాగ భాగా భిత్తయః స్యుః శేషం చైవాంధకారికా॥ 58
కర్ణే పృథుత్వం వేదాంశం కైలాసం విమానశిఖరమ్। ?
తదర్థ మూర్ధత్వః శస్తం నందనం సర్వకామదమ్॥ 59
మాల్యవంతంచ శిఖరే సంసార భవనాశనం।
తదూర్ధ్వే కేశరీ పార్శ్వే ప్రత్యంగంచ విమానజమ్॥ 60
సార్ధత్రయం ప్రతిరథః నందనం నందనాత్పరమ్।
అష్టభాగైర్మల్లతలం కౌముదీ చోగ మంజరీ॥ 61
ఏకభాగా కర్ణికాచాఽఽన్వితం కేశరిణాయుతం।
ఉరఃశృంగం విమానంచ కర్తవ్యంతు భద్రాండకమ్॥ 62
వేదాంశో భద్ర విస్తార ఉరుశృంగంచ కౌముదం।
క్రమసూత్రే ద్వావింశతిర్లఘు ప్రత్యంగకాని చ॥ 63
ఏవం తథా పంచసప్త త్యధికాష్ట శతాండకః।
మానముక్తంచ విధినా లభ్యతే చేప్సితం ఫలమ్॥ 64

తా॥ చతురశ్ర ప్రదేశమును 22 భాగములు చేసి అందు గర్భము 10 భాగములను, గోడ 1-1 భాగములును అంధకారిక 4 భాగములును చేయవలెను. కర్ణము 4 భాగములు, శిఖరము కైలాస పద్ధతితోనైనను విమానపద్ధతితోనైనను రచించవలెను. ఆ శిఖరములో సగము నందనమును చేయవలెను. మాల్యవంత పద్ధతితోను చేయవచ్చును. ఆపైన నిరువైపుల కేశరిపద్ధతితో రచించవలెను. ప్రత్యంగము విమానపద్ధతితో చేయవలెను. ప్రతిరథము 3½ భాగములును నందనమువలె రచించవలెను. ఆపైన మల్లతలమును

8 భాగములు చేయవలెను. ఉరోమంజరి కుముదమును రచించవలెను. కర్ణిక 1 భాగము, అంతటను సింహములను రచించవలెను. ఉరః శృంగము మఱియొకటి విమానపద్ధతియును దానికి భద్రమును అండక మును రచించవలెను. భద్రము యొక్క విస్తారము 4 భాగములు, మరల ఉరఃశృంగము కుముదమును, క్రమసూత్రమున 22 భాగములు లఘుప్రత్యంగములను రచించవలెను. 875 అండకములతో రచించి రేని సువర్ణకేతు మేరువగును. ఇష్టసిద్ధిప్రదము.

## 94. వృషభధ్వజ మేరువు

అపరాజిత 180వ సూ.

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే చతుర్వింశతి భాజితే।
షడ్భాగశ్చ భవేద్గర్భో ద్విద్వ్యంశా భ్రమ భిత్తయః॥ 65
శ్రమణీద్వయకం కార్యం భిత్తీనాంచ త్రయం తథా।
అథస్తాద్ భ్రమమేకంతు త్రిభాగా భ్రమ భిత్తయః॥ 66
వేదాంశః కర్ణ విస్తారః పృథ్వీ జయవిమానకమ్।
ఊర్ధ్వ త్రిభాగం కుర్యాద్వై నందిశాలంతు కామదమ్॥ 67
మాల్యవంతంచ శిఖరే ద్వ్యష్టభాగైశ్చ విస్తరః।
భాగా కర్ణే కుముదజా ప్రత్యంగంతు విమానజమ్॥ 68
త్రిభిర్భాగైః ప్రతిరథం మందరం సర్వకామదం।
సార్థద్వయం నందిశాలం తదూర్ధ్వం లక్షణాన్వితమ్॥ 69
మల్లతల మురః శృంగం కల్పయేద్గుణ పూర్వకమ్।
కర్ణే కుముద ఆఖ్యాతా చోరుశృంగం విమానజమ్॥ 70
చతుర్భాగం చైవ భద్రం కుముదా చోరు మంజరీ।
తదర్థం ముఖభద్రంచ శ్రీవత్సా చోరు మంజరీ॥ 71
ఏవమా పూర్యతే శృంగై రేకోత్తర సహస్రకైః।
లభతే శివలోకంస యావదా హృత సంప్లవమ్॥ 72

ఇతి సూత్రసంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్తే శ్రీ భువన దేవాచార్యోక్తాపరాజిత పృచ్ఛాయాం విమాన నాగరచ్ఛందజ నవమేర్వధికారో నామా శీత్యుత్తర శతతమం సూత్రమ్॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 24 భాగములుచేసి అందు గర్భము 6 భాగములు, భ్రమము 2 భాగములు, గోడ 2 భాగములు, మరల భ్రమణి 2 భాగములు, వెలుపలి గోడ 3 భాగములు, చేయవలెను. దిగువభ్రమము నొకదానినే చేసి అది 3 భాగములును. వెలుపలిగోడ 3 భాగములును, లోపలిగోడ 3 భాగములును చేయవలెను. కర్ణము 4 భాగములు, పృథ్వీజయమువలె విమానమును పైన 3 భాగములు నందిశాలవలె రచించవలెను. శిఖరము మాల్యవంత పద్ధతితో రచించవలెను. దాని విస్తారము 16 భాగములు, కర్ణిక 1 భాగము కుముదమువలె చేయవలెను. ప్రత్యంగము విమానమువలె రచించవలెను. ప్రతిరథము 3 భాగములు మందరమువలె రచించవలెను. ఆపైన $2\frac{1}{2}$ భాగములు నందిశాలను చేయవలెను. ఉరఃశృంగమును మల్లతలముగా రచించవలెను. కర్ణిక కుముదమువలె చేయవలెను. ఉరఃశృంగము విమానమువలె రచించవలెను. భద్రము 4 భాగములును, ఉరోమంజరి కుముదమువలెను. అందులో సగము ముఖభద్రమును, ఉరోమంజరి శ్రీవత్సమువలెను. ఇట్లు శృంగములు 1001 కల్పించవలెను. దీనిని నిర్మించినవారు 3వ లోకమున శాశ్వతముగా నుందురు.

## 95. మహామేరుప్రాసాదము

**విశ్వకర్మోవాచ-**

అపరాజిత 181వ సూ.

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే మేకా సార్క-శతాంశకే।
అథాపి భాజితే భాగైః స నిర్గమతలే సమే॥ 1
కర్ణాంతాద్గర్భ పర్యంతం విభాగానాంతు నిశ్చయః।
షట్పంచాశ ద్విభాగైశ్చ కథ యిష్యామ్యను క్రమాత్॥ 2

గ్రహారామాః శరారామా నందారామాః శరాగుణాః।
పశ్చాచ భువనాదీని సీమార్ధం భక్తి భాగతః॥ 3
యుగాదిశశ్చబుతవః కర్ణే కర్ణాద్యముపరథే।
శృంగాణామితి సంఖ్యాచ కథితాసావను క్రమాత్॥ 4
క్రమోత్తరం హ్రాస్వ హ్రాస్వా దుపర్యు పరిచక్రమాత్।
అథ ఊర్ధ్వయోగతాశ్చ ససీమతః క్రమాగతా॥ 5
షష్టిభాగై ర్మూల గర్భే భిత్తిః చాష్టభాగికా।
దశభాగంచ భ్రమణ మష్టాంశా భిత్తికాపునః॥ 6
నందరాగేంద్రియపశ్చా ద్వ్యష్టతో భద్ర విస్తరః।
భాగభాగంతు నిష్కాసో రథోప రథకానుగే॥ 7
అర్ధార్ధే కర్ణాంత భద్రం మధ్యచ్ఛందే ప్రకీర్తితం।
వార్యంతరం వినాకార్యం కుంభకాదిచ్ఛాద్యాంతకమ్॥ 8
తద్రూపాకారకోఽగ్రేతు తతోఽధిక వినిర్గమః।
ఫాలయేద్భ్రమ మధ్యేతు బాహ్యచ్ఛంద పరిక్రమమ్॥ 9
చంద్రావలోకనం భద్రే చత్వారింశద్భిరున్నతమ్।
షట్పంచా శత్సముత్సేధో మేరుణాం ప్రహారాంతకే॥ 10
పీఠో పరిచకర్తవ్యో భద్రశాల సముచ్ఛ్రయః।
రాజాసీనో వేదికాచ స్తంభోచ్ఛాలక శీర్షకమ్॥ 11
పట్టోర్ధ్వేదండచ్ఛాద్యంత మూర్ధ్వే సంవరణా భవేత్।
పృథుత్వార్ధేన నిష్కాసో భద్రేషు సకలేషు చ॥ 12
సమ స భక్తి పాదేషు కర్తవ్యో మేఖలోదయః।
పీఠోప పీఠ జంఘాశ్చ మేఖలా కూటచ్ఛాద్యకమ్। 13
పునర్ఘం ఘోద్గమచ్ఛాద్యం ప్రహారాంతోఽర్ధ మున్నతః।
మండపా అగ్రయుక్తాశ్చ కర్తవ్యా మూల సూత్రతః॥ 14
పంచాశీత్యండకాః కార్యాః కర్ణశృంగేష్వైరావతః
కర్ణే ప్రతిరథేతాభ్యాం సమక్రమ సముద్భవః॥ 15

(అనుబంధము 49, 50 పటములు చూడుడు)

తా॥ చతురశ్ర ప్రదేశమును 112 భాగములు చేసి అనగా నిర్గమ ప్రదేశమునుండి గర్భముతో సహా భాగములు చేయవలెను. కర్ణము యొక్క అంతమునుండి గర్భము వఱకు 56 భాగములతో పైన చేయ వలయును. ఎట్లనగా ప్రస్తరముపైన కర్ణము 9 భాగములు, కర్ణిక 3 భాగములు, ప్రతిరథము 5 భాగములు, మరల కర్ణిక 3 భాగ ములు, శాల 16 భాగములు, కర్ణమునకు 6ను, శాలకు 10యును, పంజరమునకు 4ను, శిఖరములుండవలెను. వరుసగా పై అంతస్తు లకు కొంచెము కొంచెము తగ్గుచుండవలెను. అధిష్ఠానమున 112 భాగములను చెప్పుచున్నాడు. ప్రధానగర్భము 60 భాగములు, గోడ 8 భాగములు, భ్రమణము 10 భాగములు, వెలుపలిగోడ 8 భాగములు చేయవలెను. రెండవ అంతస్తున 9-6-5 భాగముల చొప్పున రెండువైపుల రథములను ప్రతిరథములను, మధ్యశాల 16 భాగములు చేయవలెను. రథము ప్రతిరథము మొదలైనవానికి నిర్గమము 1 భాగము చేయవలెను. కర్ణముయొక్క చివర భద్ర మును సగము సగము చేయవలెను. మధ్యచ్ఛందమున నిట్లు చేయ వలెను. జలమార్గ మవసరములేదు. కుంభము మొదలు ఛాద్యము వరకును ఆయా రూపముల యొక్క ముందు నిర్గమము యెక్కువగా నుండవలెను. భ్రమమధ్యమున శిరమును చేయవలెను. వెలుపలి కొలతలను చెప్పుచున్నాడు. భద్రమున చంద్రావలోకనము 40 భాగ ముల యెత్తు మేరువుయొక్క శిఖరము ప్రహారము వఱకు 56 భాగ ములు, పీఠముపైన భద్రశాలలను రచించవలెను. రాజపీఠ వేదిక, స్తంభము, ఉచ్ఛాలకము, శీర్షము, పట్టముపైన దండచ్ఛాద్యము, దానిపైన సంవరణను రచించవలెను. విస్తారములో సగము నిర్గ మము చొప్పున అన్ని భద్రములకును చేయవలెను. అన్ని భేదముల యందును మేఖలములను రచించుచుండవలెను. పీఠము, ఉపపీఠము, జంఘ, మేఖల, కూటము, ఛాద్యము మరల జంఘయును దానిపైన ఛాద్యమును, ప్రహారము వఱకు సగము యెత్తు చేయవలెను.

ముందు మండపములను రచించవలెను. అవి మొదట దేవాలయము ననుసరించి యుండవలెను. 85 అండకములును, కర్ణశృంగములు ఐరావత పద్ధతితోను, కర్ణమునందును ప్రతిరథమునందును సమానమైన వరుసలను రచించవలెను.

శ్లో॥ ఏకాదశోద్గమో మేరుస్తన్నామ్నః శృంగక క్రమః।
స వింశతి సహస్రాండైః సూర్య సంఖ్యైశ్చ శృంగకైః॥ 16
కర్ణికా శృంగమేకంతు సర్వతో భద్రకే భవేత్।
దశక్రమేణ వై తాభ్యా మండానాం నవతి స్తథా। 17
ఏకాదశోద్గమో మేరుః కర్ణికానాం తథాష్టకమ్।
కర్ణ్యండకాశ్చ వింశత్యుత్తర సప్తశతానిచ॥ 18
శృంగాణ్యశీతిః కర్ణ్యః షట్ తథా చైకాదశోద్గమైః।
రథస్యాను క్రమం వక్ష్యేహ్యండకైః శృంగసంఖ్యయా॥ 19
ఏక రథేచాండకాస్తు సంఖ్యయా పంచవింశతిః।
శృంగాణిస్యుః షట్ క్రమత స్తథా సార్ధశతాండకైః॥ 20
చతూ రథేత్వేకాదశ కార్యాః షట్ క్రమత స్తథా।
పంచవింశతి శృంగాణాం సంఖ్యా వైషట్ శతాండకైః॥ 21
భద్రేకర్ణికే శరిణో నవక్రమత ఏవచ।
పంచచత్వారింశదండః కర్తవ్యః సర్వకామదః॥ 22
భద్ర సంవరణోర్ధ్వేచ దర్శనీయాచ కర్ణికా।
ప్రకర్తవ్యాః కేశరిణ శ్చాండకాః పంచభూషితాః 23
చత్వారస్త్రయో ద్వావేక ఉభయభద్రే వింశతిః।
కుర్యాచ్ఛతాండకంచేత్థం మేరురేకాదశోద్గమః॥ 24
ఏకాదశోద్గమో మేరుః ప్రత్యంగాష్టక మేవచ।
నవశృంగాణి వైభద్రే కార్యాణి త్వపరాజిత॥ 25

తా॥ కర్ణము ప్రతిరథము మొత్తు 11 భాగములును, శిఖరమునకు 12 శృంగములును, కర్ణికకు 1 శృంగమును, భద్రమునకు

10 శృంగములును ఇట్లు 1020 అండకములు మొత్తమును, కర్ణికాదులకు 90 అండకములును, కర్ణికలు యెత్తు 8 భాగములు మేరువు ఎత్తు 11 భాగములును, కర్ణికయొక్క అండములు మొత్తము 720 కర్ణికల యొక్క శృంగములు 80 కర్ణికలు 6 భాగముల యెత్తును మరల కర్ణముల యెత్తు 11 భాగములును, రథముయొక్క అనుక్రమనుము ఎత్తు 8 భాగములు అండకములతోను శృంగములతోను చెప్పుచున్నాడు. రథమునకు అండకములు 25 శృంగములు 6 ఇట్లు వరుసగా అండకములు 150. రథములు నాలుగును ఎత్తు 11 భాగములును శృంగములు 6ను, 25 శృంగములు మొత్తము సంఖ్య 600 అండకములు భద్రమునందును, కర్ణికయందును కేశరిపద్ధతితో 9 భాగములును, 45 అండకములును,భద్రముయొక్క సంవరణముపైన చక్కని కర్ణికలును, సింహములును, 5 అండకములును రచించవలెను. 4-3-2-1 పై అంతస్తుల యందు క్రమముగా అండకములను ఒక్కొక్కటి తగ్గించుచుండవలెను. ఉపభద్ర సహితమైన భద్రమునందు 20 అండకములును, ఇట్లు 100 అండకములును దానిపైన మేరువు 11 భాగముల యెత్తును ఆ మేరువునకు ప్రత్యంగములు 8యును, 9 శృంగములతో భద్రములును, రచించవలెను.

శ్లో॥ మూలరేఖా పృథుత్వంచ ద్వాసప్తత్యంశ కంభవేత్।
శృంగం చతుస్త్రింశదంశం తదర్ధంచ వినిర్గతమ్॥ 26
ద్వ్యష్ట ద్వాదశదశాష్ట షట్ చత్వారో ద్వయం తథా।
ఏకో భాగా స్తదగ్రేస్యా దురఃశృంగేష్వను క్రమః॥ 27
అష్టభాగంచ ప్రత్యంగం శేషం స్యాద్ ... క్రమమ్।
చతుర్వింశతి ప్రత్యంగం షట్ త్రింశదురు మంజరీ॥ 28
సర్వేచా మలసారాస్తు దివ్యకుంభ విభూషితాః।
ఏవమేవ ప్రకర్తవ్యం మహామేరోశ్చ లక్షణమ్॥ 29
ఏకాధికం ప్రకర్తవ్యం దశోత్తర సహస్రకమ్।
మహామేర్వభిధానశ్చ కర్తవ్యస్త్రి పురాంతకే॥ 30

హరోహిరణ్య గర్భశ్చ హరిర్దినకర స్తథా।
ఏతే దేవాః స్థితామేరౌ నాన్యేచైవ కదాచన॥ 31

తత్సంతానే ర్యైః కృతోఽయం పూర్ణమన్నం భవేత్ సదా।
మాతృపక్షం పితృపక్షం తారయేన్నరకార్ణవాత్॥ 32

ఉత్పన్నశ్చ భవేత్ స్వర్గే స్వేచ్ఛయా పృథివీ పతిః।
మహామేరుధ్వజాంగోహే యావచ్చంద్రార్క మేదినీ॥ 33

ఇతి సూత్ర సంతానగుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీ భువన దేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం మహామేరువు ప్రాసాద నిర్ణయాధికారోనామై కాశీత్యుత్తర శతమం సూత్రమ్-

తా॥ ప్రధాన శిఖరము యొక్క విస్తారము 72 భాగములును, ఉరఃశృంగము యొక్క విస్తరము 34 భాగములును దాని యొక్క నిర్గమము అందులో సగమును 16-12-10-8-6-4-2-1 భాగములు వరుసగా ఉరఃశృంగముల యొక్క విస్తారములు. శాల 8 భాగములు. ప్రత్యంగములు 24ను, ఉరోమంజరులు 36ను శిఖరములన్నియును చక్రనికుంభములతో నలంకరింపబడియుండవలెను. ఇట్లు 1011 అండకములతో శివునకు రచించవలెను. బ్రహ్మ విష్ణు శివ సూర్యులకు దక్క దీనిని వేఱొక దేవతల కుపయోగించ గూడదు. ఈ మేరు నిర్మాణమువలన సమస్తైశ్వర్యములు కలుగుటయేకాక తల్లివైపు తండ్రివైపు గల పితృదేవతలు దివ్యత్వమును బొందుదురు. అనంత పుణ్యప్రదము.

## 96. శ్రీ చతుర్దశ భువనగిరి మేరువు

**విశ్వకర్మోవాచ-**

అపరాజిత 182వ సూ.

శ్లో॥ శతార్ధంచ తదర్ధంచ షట్ త్రింశత్కం తథైవచ।
ప్రత్యేకం త్రివిధం జ్ఞేయం జ్యేష్ఠ మధ్యకనిష్ఠకమ్॥ 1
త్రిజ్యేష్ఠంచ తథాఖ్యాతం త్రిమధ్యం త్రికనిష్ఠకమ్।
మేరా రియం హస్తసంఖ్యా విభాగశ్చ తతః పరమ్। 2

శ్రీ చతుర్దశభువన గిరిమేర్వాభిధస్యచ।
షట్ సప్తతిర్భాగ సంఖ్యా విభక్తాతు క్రమాగతా॥ 3
ఆద్యః కర్ణ ప్రతిరథ రథయుగ్ బాలపంజరః।
సార్ధ స్తంభైర్భూషితాశ్చ శాలావై వామ దక్షిణే॥ 4
రథప్రరథ సంయుక్తా స్తత్పరే బాలపంజరాః॥
తత్కర్ణావై నవనవాదికాంగక వికల్పనాత్ ॥ 5
వసుముని రస ఇషు వేదావికార్దైః శాలాయామః।
పృథుత్వేచ విధాతవ్యో విభాగోఽయ మతఃపరమ్॥ 6
గర్భః శుకః శుకోదరః శాంతః శ్రీగర్భ సుందరా।
ప్రశస్తోవై సప్తగర్భాః ప్రాసాదేషు సమాగతాః॥ 7
రథైః ప్రతిరథైః కర్ణైః పంజరాది క్రమత్రయమ్॥
ద్విక్రమోర్ధ్వే స్తంభ భద్రై స్తవంగ రథికోదరమ్॥ 8
కర్ణే ఆదిక్రమైః కుర్యా దధస్తాత్ త్రిశతాండకైః।
ద్విశతాండకై స్తమూర్ధ్వే శతాండశ్చ తదూర్ధ్వతః॥ 9
పంచసంఘాటజా రేఖా భ్రమికాచ సముచ్ఛ్రితా।
ఏక ద్విత్రిశతాండకాః కర్తవ్యాః సర్వకామదాః॥ 10
సభాగశ్చ ప్రతిరథం క్రమ తయ సముచ్ఛ్రితః।
ఆదిక్రమై రుద్గమశ్చ ఏక ద్వి త్రి శతాండకైః॥ 11
పంచవింశత్యండ ఊర్ధ్వం తిలకంచ తదూర్ధ్వతః।
ప్రత్యంగాన్యష్ట భాగైశ్చ స్యుర్ద్వా వింశతి రండకాః॥ 12
షడ్ లఘు ప్రత్యంగకాని తత్సంఖ్యై రండకై స్తథా।
షడ్భాగకైశ్చైవరథ స్త్రి క్రమోర్ధ్వ సముచ్ఛ్రయః॥ 13
ఆద్యః సార్ధ శతాండశ్చాఽపరో వింశతికాధికః।
నవాశీత్యండ స్తృతీయోఽష్టా వింశత్యగ్రు మంజరీ॥ 14

తా। విస్తారము 50-43-36 హస్తములు జ్యేష్ఠ మధ్యమ అధమములు అందును జ్యేష్ఠములో 3 విధములును, మధ్యమములో 3 విధములును, కనిసమున 3 విధములును కలవు. ఆ విస్తారమును చతురశ్ర

మముగాచేసి 76 భాగములుగను అందు మొదట కర్ణము, ప్రతి రథము, రథము, బాలపంజరము. మధ్య స్తంభయుతమైన శాల యును దాని కిరువైపుల రథములును, ప్రతిరథములును, బాలపంజ రములును, మూలలయందు ప్రతి అంతస్తున 9-9 భాగములు కర్ణము లును, అంతస్తులు పెరుగుటను బట్టి 8-7-6-5-4 భాగములు అగును. శాలయును అటులే క్రమముగా తగ్గును. గర్భము, శుకము, శుకో దరము, శాంతము, శ్రీగర్భము, సుందరము, ప్రశస్తము, ఇట్లు 7 గర్భములు ప్రాసాదములకు రచించుచుందురు. రథములు, ప్రతి రథములు, కర్ణములు, పంజరము మొదలైనవి వరుసగా మూడును, ఆపైన రెండును, స్తంభములుగల భద్రములును, తవంగము. రథిక కర్ణము మొదటినుండి వరుసగా దిగువ 300 అండకములును, ఆపైన 200 అండకములును, ఆపైన 100 అండకములును, ప్రధానశిఖరము 5 శిఖరములుగా నుండునట్లును, ఎత్తైన భ్రమికయును, 1-2-3 వందల అండకములు చేయుట ముఖ్యము. రథిక విస్తారము 1 భాగమును ఎత్తు 3 భాగములును మొదటి నుండి వరుసగా యెత్తును 1-2-3 వందల అండకములు పైన 25 అండకములును, ఆపైన తిలకమును. ప్రత్యంగములు 8 భాగముల చొప్పునను ఇట్లు 22 అండకములగును. లఘుప్రత్యంగములు 6ను అండకములు 6ను, రథము 6 భాగము లును. ఎత్తు విస్తారమునకు 3 రెట్లును, మొదటి 180 అండకములును, ఆ తరువాత 170 అండకములును, ఆపైన 89 అండకములును, ఉరో మంజరి 28 భాగములు విస్తారమును కల్పించవలయును-

శ్లో॥ త్రిసంఘాటా స్సప్తభూమా దశద్విద్విశతాండకైః।
పంజరః పంచభాగైశ్చ క్రమత్రయ సముచ్ఛ్రితః॥ 15
ఏకో ద్విశతాండ ఆద్యో ద్వితీయే పంచవింశతిః।
పంచాండక స్తృతీయేచాఽష్టా దశాంశోరు మంజరీ॥ 16
త్రిసంఘాటా పంచభూమా స్త్రి చత్వారింశ దండకైః।
వినోదకాంతరం స్తంభా వేదాంశకమితాః స్మృతాః ॥17

పంచవింశత్యండ మాద్యే పంచాండాశ్చ తదూర్ధ్వతః।
భువనాంశం చోరు శృంగం విమానం పంచభూమికమ్॥ 18
షోడశాంశం భవేద్ భద్రం దశాంశైస్తు విమానకమ్।
సప్తాండకం తదగ్రేతు కుర్యాత్ కుముదజం తథా॥ 19
మేరురేకాధిక దశసహస్రాండక ఈరితః।
ఏవం శృంగోద్భవః కార్యశ్ఛందే విమాననాగరే॥ 20
ద్వావింశతిర్మూలగర్భః షడ్భాగో భద్ర విస్తరః।
భ్రమమేకం సూర్యభిత్తిః సంభ్రమంచ ప్రకల్పయేత్॥ 21
విమానే భూమిజా ఘంటా కర్తవ్యా సర్వకామదా।
క్షీరార్ణవ సముత్పన్నం కలశంతు ధ్వజాగ్రజమ్॥ 22
మహామేరు ధ్వజారోహ పుణ్యంశతాశ్వమేధ ధ్వజమ్।
పూర్వాపరాన్ వింశతికాన్ తారయేన్నరకార్ణవాత్॥ 23

ఇతి సూత్రసంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీ భువనదేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయం శ్రీ చతుర్దశ భువనగిరిమేరు ప్రాసాదలక్షణాధికారో నామద్వ్యశీత్రుత్తర శతతమం సూత్రమ్.

తా॥ ఉరఃశృంగములు 7 అంతస్తులును ఒక్కొక్కదానికి 3 శిఖరములును 220 అండకములును చేయవలెను. పంజరము విస్తారము 5 భాగములును, విస్తారమునకు 3 రెట్లు యెత్తును, మొదట 201 అండకములును, రెండవది 25 అండకములును, మూడవది 5 అండకములును, ఉరోమంజరి విస్తారము 18 భాగములును, తరువాత 5 అంతస్తులును 3 శిఖరములును 43 అండకములును జలమార్గములు లేకుండ స్తంభములు 4 భాగములును, మొదటి 25 అండకములును, ఆపైన 5 అండకములు, ఉరోమంజరివిస్తారము 14 భాగములును, విమానము 5 అంతస్తులును చేయవలెను. భద్రముయొక్క విస్తారము 16 భాగములును, విమానము 10 భాగములును, చివర 7 అండకములు కుముదమువలెరచించవలెను. ఇట్లు పదివేలపైన ఒక్కటియైన అండక

ములను రచించవలెను. వానికి శిఖరములను కల్పించవలెను. ఇదివిమాన నాగరచ్ఛందము. ప్రధానగర్భము 22 భాగములును, నలువైపుల భద్రములయొక్క నిర్గమము 6 భాగములును, ఆ భద్రములు పోను మూలలయందు గోడలును, దాని వెలుపల చుట్టూ 9 భాగములు భ్రమమును, వెలుపలిగోడ 12 భాగములును మొత్తము 76 భాగములు చేయవలెను. విమానము భూమిజ ప్రాసాదపద్ధతితోను ఘంట కలశము మొదలైనవి రచించవలెను. మఱియు ధ్వజము యొక్క చివరను కలశము నుంచవలెను. నూరు అశ్వమేధ యజ్ఞముల ఫలమునిచ్చును. దీనిని నిర్మించిన వారికి పూర్వము 21 తరముల వారును, తరువాత 21 తరములవారును పాపవిముక్తులై పుణ్యలోకమున నుందురు.

## 97. కైలాస భేదములు 10 అందు వలయము

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ ప్రాసాదాశ్చతు రశ్రాః స్యుర్విశేషైర్వర్ణితాః పృథక్।
ఇదానీ మభిధీయంతే వృత్తాః స్యుః స్యుర్విశేషణైః॥ 111
తత్రా దౌవలయాకారో వలయః సచ కథ్యతే।
సమంతాద్ వర్తితే క్షేత్రే చతుర్భాగ విభాజితే॥ 112
కుర్యాత్ సారోహణం పీఠం సార్ధభాగోచ్ఛ్రితం శుభమ్।
పరిక్షిప్తం గజముఖైర్మకరాస్యాంబు నిర్గతమ్॥ 113
బహిర్భాగ సమోపేత స్తస్మిన్ కార్యః సురాలయః।
పాదోన విస్తృతిర్ద్విఘ్న ద్వారోచ్ఛ్రాయ విభూషితః॥ 114
తస్యాష్ట స్తంభకోఽలిందో బహిర్వలయ ఇత్యసౌ।
వృత్తచ్ఛాద్యః సింహకర్ణ స్తథా జాలకరూపవాన్॥ 115

తా॥ ఇది వఱకు నలుచదరపు ప్రాసాదములు చెప్పబడినవి. ఇప్పుడు గుండ్రముగా నుండెడి ప్రాసాదములను చెప్పుచున్నాడు. వానిలో మొదట వలయమనుపేరుగల ప్రాసాదలక్షణమును చెప్ప

బడుచున్నది. చతుర్దిశలు నిర్ణయించి దానిని గుండ్రముగా జేసిన ప్రదేశమును 4 భాగములుచేసి ఆరోహణ పీఠమును $1\frac{1}{2}$ భాగము యెత్తును, ఏనుగుతలలను వానిపైనుంచబడినట్లధిష్ఠానమును, జలనిర్గమము మకరముఖములతోను, దేవాలయమును రచించవలెను. ద్వారముయొక్క విస్తారము ముప్పాతికవంతున్న విస్తారమునకు రెట్టింపు యెత్తును చేయవలెను. చుట్టును 8 స్తంభములును అలిందము వెలుపలి వలయమును కలిపి గుండ్రముగా పైన కప్పును ంహాకర్ణములును జాలకములును రచించి రేని వలయప్రాసాదమగును.

## 98. దుందుభి-ప్రాంత-పద్మ-కాంత-ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ ప్రాగ్రీవకా వృత్తః సస్యాద్ యద్వా స్తంభ ద్వయాన్వితః।
తదైవ దుందుభిః ప్రోక్త స్త్రిభిస్తైః ప్రాంత ఉచ్యతే॥ 116
అయమేవ చతుర్భిః స్యాత్ పద్మః ప్రాగ్రీవకైః శుభైః।
స్తంభైశ్చ తుర్భి స్తస్యైవ యదా పశ్చాన్ని వేశ్యతే॥ 117
మధ్యవృత్తో గర్భకోష్ఠో భిత్తిశ్చోభయతః స్థితా।
సకాంత ఇతి విఖ్యాతః ప్రాసాదోవర్తులా కృతిః॥ 118

తా॥ వలయమునకు ప్రాగ్రీవములను 2 స్తంభములను కల్పించి ని దుందుభి యగును. 3 స్తంభములను రచించినచో ప్రాంత ిగును. 4 స్తంభములను రచించిన యెడల పద్మమగును. నలు ్పుల ప్రాగీవములును, వానికి 4-4 స్తంభములును మధ్యగర్భము ాడ గుండ్రమును, చుట్టూ గోడయును రచించి రేని కాంతమగును.

## 99. చతుర్ముఖము-ముండహాకము-కూర్మము

సరాంగణ 49వ అధ్యాయము.

॥ చత్వారి వలయస్యైవ యత్ర ద్వారాణ్యలిందకః।
స్యాచ్చతుర్వింశతి స్తంభై ర్ద్వితీయో భాగసమ్మితః॥ 119
ప్రాగ్గ్రీవకాశ్చ స్తంభాభ్యాం ద్వాభ్యాంద్వాభ్యా సమన్వితాః।
చత్వారో యత్ర సప్రోక్తః ప్రాసాదోఽత్ర చతుర్ముఖః॥ 120

అస్యైవేకం యదా ద్వారం ప్రాగ్రీవోఽలిందవేష్టితః।
ఏక ఏవ తదాచాన్యః ప్రాగ్రీవ స్తస్య చాగ్రతః॥ 121
ఖ్యాతో మండూక ఇత్యేష వృత్తప్రాసాద సత్తమః।
దిక్కోణేషు యదా స్యైవ భవేత్ ప్రాగ్రీవకల్పనా॥ 122
ప్రాసాదోఽయంతదాకూర్మ సంజ్ఞః స్యాద పరాజితః॥

తా॥ వలయముయొక్క నలువైపుల ద్వారములను అలిందములను 24 స్తంభములతో రచించి రెండవ అంతస్తున 1 భాగము ప్రాగ్గ్రీవములు 2-2 స్తంభములతో చేయవలెను. నలువైపుల ప్రాసాదములు రచించినచో చతుర్ముఖమగును. దానికే ఒక్క ద్వారమును ప్రాగ్గ్రీవమును అలిందమును రచించిన యెడల మండూకమగును- మఱియు వృత్తప్రాసాదమునకు 8 ప్రాగ్గ్రీవములను రచించిన యెడల కూర్మప్రాసాదమగును-

(అనుబంధము 51వ పటము చూడుడు)

## 100. తాలీగృహము-ఉలూకికము

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ కూర్మస్యైవ యదాదిక్షు స్తంభై రష్టాభిరష్టభిః॥ 1-3
ప్రాగ్రీవకాః ప్రకల్ప్యంతే చత్వారోఽలింద వేష్టితాః।
ప్రాగ్రీవకా స్తిర్యగగ్రే భవంత్యన్యే తదగ్రతః॥ 124
షోడశ స్తంభయుక్తస్య మధ్యభాగే యదా భవేత్।
జానీహూదేష విజ్ఞేయః ప్రాగ్రీవ రహితోత్తమః॥ 125
ఇతి వృత్తాః సమాఖ్యాతాః ప్రాసాదానామ లక్షణైః.

తా కూర్మప్రాసాదమునకు ఒక్కొక్క దిశయందు 8-8 స్తంభములతో ప్రాగ్గ్రీవములను రచించి 4 అలిందములును పైన ప్రాగ్రీవములు అడ్డముగా నుండెనేని తాలీ గృహమగును. మఱియు 16 స్తంభములతో మధ్యభాగమును ప్రాగ్గ్రీవములు లేకుండను వలయముగా రచింపబడినది ఉలూకిక ప్రాసాదమగును.

# 101. పుష్పక భేదములు 10. అందు

## భవము - విశాలము - సామ్ముఖ్యము

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ చతురశ్రాయతా యేస్యుః కథ్యంతే తేఽపినామతః
భవో విశాలః సామ్ముఖ్యః ప్రభవః శిబిరాగృహః।
ముఖశాలో ద్విశాలశ్చ గృహరాజోఽమలో విభుః॥
ఏవ మేతేస ముద్దిష్టా శ్చతురశ్రాయతాదశ

శ్లో॥ చతురశ్రాయతాన్ బ్రూమః ప్రాసాదా నిహసాంప్రతమ్।
అష్టభాగాం యతే క్షేత్రే చతురంశక విస్తృతే।
ద్విభాగ సార్ధభాగైక భాగోఽయం పీఠ ఇష్యతే
పశ్చిమం భాగముత్సృజ్య దేవకోష్ఠం ద్విభాగికం।
తస్మిన్ నివేశయేత్ సీమా స్యాదస్యాగ్రేఽష్టభిర్ధరైః
ససీమ్నో దేవకోష్ఠస్య భాగికాలిందకో బహిః।
యుక్తో ధగాణాం వింశత్యా వేదికా జాలవేష్టితః
ప్రాగ్రీవకస్య తస్యాగ్రే స్తంభ ద్వితయ భూషితః।
ద్విచ్ఛాద్యచ్ఛాదితః శ్రీమాన్ సింహకర్ణైరలంకృతః॥
ప్రాసాదోఽయం భవోనామ విశాలః కథ్యతేఽధునా।
యదాస్యైవస నిష్క్రాంతే సీమాయా మేచ వర్ధితే॥
వలభ్యా పార్శ్వయోః స్యాతాం విశాలాఖ్య స్తదా భవేత్
విశాలస్య యదాగర్భే భిత్తిర్భవతి దిక్త్రయే॥
ద్వా ద్వాగవాక్ష కౌచాపి సామ్ముఖ్యః సభవేత్తదా॥

తా॥ దీర్ఘచతురశ్రములగు దేవాలయములను చె
చున్నాడు. నిడుపు 8 భాగములును, వెడల్పు 4 భాగములును
అందు 2 భాగములుగాని $1\frac{1}{2}$ భాగమునుగాని అధిష్ఠానమును రచి
వలెను. అందు పడమర 1 భాగమును వదలి దేవగర్భగృహవ
2 భాగములుచేసి దానియందు నివేశమును కల్పించి ముందు 8

ములును, ఆ ప్రదేశమున దేవకోష్ఠమునకు వెలుపల 1 భాగ
అలిందమును, ఇట్లు 20 ధరలును వేదికలును జాలకములును రచ
వలెను. ప్రాగ్రీవము యొక్క ముందు 2 స్తంభములును 2 ఛాద
లతో కప్పబడియుండవలెను. సింహకర్ణముల నమర్చవలెను.
భవనమని చెప్పుదురు. దీనికి నిర్గమములతో సీమలను రచించి
వైపుల వలభిని వృద్ధిచేసిన యెడల విశాలమగును. విశా
యొక్క గర్భమునకు చుట్టూ గోడయును. మూడువైపుల రె
గవాక్షులును ముందు ముఖద్వారమును రచించిరేని సాము
మగును. (అనుబంధము 52వ పటము చూడుడు)

## 102. ప్రభవ, శిబిరాగృహ ముఖశాల, ద్విశాల ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ ప్రాగ్రీవస్త్రి దిశంతస్య గర్భకోష్ఠాయతాయదా॥
హిత్వావలభ్యా ప్రాగ్రీకా విధీయేతే తథాపరా।
కర్ణేషు భాగమేకైకం త్యక్త్వాస్యాత్ ప్రభవ స్తదా।
ఏతస్యైవ ముఖేస్యాతాం యదా ప్రాగ్రీవకా శుభా।
పార్శ్వయో రపరాద్వాద్వా ప్రాగ్రీవా భవతో యదా॥
కర్ణేషు భిత్తయశ్చస్యు స్తదా స్యాచ్ఛిబిరాగృహః।
యదా స్యైవముఖే శాలా భాగద్వితయ విస్తృతా॥
ఆయామేనచ షడ్భాగా ప్రాగ్రీవాద్వా తదగ్రతః।
ద్వాద్వాగవాక్ష కౌస్యాతాం తద్భిత్త్యోరుభయోరపి॥
సీమాయాం ద్వాదశ స్తంభా ముఖశాల స్తదా భవేత్।
అలిందో భాగికః కార్యో విశాల స్యైవబాహ్యతః॥
ప్రాగ్రీవభూమిషు వృతో భిత్త్యాచ సగవాక్షకః।
అగ్రతః సహితః స్తంభైః షడ్భిశ్చ క్రియతే యదా॥
ద్విశాల ఇతి విఖ్యాతః ప్రాసాదో జాయతే తదా॥

తా॥ గర్భకోష్ఠము దీర్ఘముగాను, మూడువైపుల ప్రాగ్రీవములును, రచించి వలభిని తీసివేసి ప్రాగ్రీవములను కల్పించిన యెడల ప్రభవమగును. కర్ణములయందు 1-1 భాగమును వదలి ప్రాగ్రీవములను రచించవలెను. మఱియు ప్రభవముయొక్క ముఖమునందు 2 ప్రాగ్రీవములును, ప్రక్కలయందును వెనుకను 2-2 ప్రాగ్రీవములును, కర్ణములయందు గోడలును, కల్పించిరేని శిబిరాగృహమగును. శిబిరాగృహమునకు ముఖమున 2 భాగములు విస్తారమున శాలయును, పొడవు 6 భాగములును, దానియందు రెండు ప్రాగ్రీవములును మఱియు 2-2 గవాక్షులును గల యిరువైపుల గోడలును, సీమయందు 12 స్తంభములును, రచించినచో ముఖశాలయగును. ఆశాలముయొక్క వెలుపల అలిందము 1 భాగమును, ప్రాగ్రీవభూములను చుట్టి గోడయును అందు గవాక్షులును ముందు 6 స్తంభములతో ప్రాగ్రీవమును రచించిరేని ద్విశాలయగును.

## 103. గృహరాజ, అమల, విభుప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ యదా స్యైవ విధీయంతే స్తంభాః సర్వే సమంతతః॥ 140
ప్రాగ్రీవ కౌచోభయతో గృహరాజ స్తదా భవేత్।
సర్వేషాం వై యదాలిందం స్యా దన్యోభాగ విస్తృతః॥ 141
సీమాంత విస్తృతే స్యాతాం వలభ్యౌ భాగనిస్సృతే।
భిత్తిర్విధీయతే శేషా గవాక్షై రుపశోభితా॥ 142
ముఖేపద్దారు కంచస్యాత్ తదా స్యాదమలాభిధః।
ఏకాదశాయతే క్షేత్రే తథా షడ్భాగ విస్తృతే॥ 143
ముక్త్వా భాగద్వయం పశ్చాద్ దేవకోష్ఠం నివేశయేత్।
భాగం ముక్త్వాగ్రతః కుర్యాత్ సీమాం భాగచతుష్టయమ్॥ 144
అష్టస్తంభాస్తతోఽలిందవింశతి స్తంభభాగికాః।
భాగికః పరితోఽలిందోఽష్టావింశతిధరోఽపరః॥ 145

ద్విద్విస్తంభయుతాః కార్యాః ప్రాగ్రీవాః కోష్ఠజాస్త్రయః।
సీమా స మే వలభ్యాచ ప్రాగ్రీవా మధ్యత స్తయోః॥ 146

ద్విద్విస్తంభా ఘనశ్చాన్యా వేదికా జాలశోభితా।
వేదికాః ల రూపాఢ్యః సింహకర్ణోప శోభితః॥ 147

ప్రాసాదోఽయం విభుర్నామ కథితో భర్తృనందనః।
ఏవ మేతే సమాఖ్యాతా చతురశ్రాయతాదశ॥ 148

తా॥ మఱియు ద్విశాలమున అంతరము స్తంభములును, రెండు వైపుల ప్రాగ్రీవములను రచించిరేని గృహరాజమగును. అన్ని ద్వారములయందు అలిందములును మఱియొక భాగము పెంపుచేసి సీమాంతమున వలభిని రెండువైపులనుచేసి గవాక్షములతో గోడను రచించి ముఖమున పట్టదారుకమును నిర్మించినచో అమలమగును. పొడవు 11 భాగములును వెడల్పు 6 భాగములునుచేసి వెనుక 2 భాగములు విడిచి దేవకోష్ఠమును రచించవలెను. ముందు 1 భాగమును విడిచి ఆ ప్రదేశమును 4 భాగములుచేసి 8 స్తంభములు అలిందమును 20 స్తంభములకు భాగములనుచేసి చుట్టూ అలిందము 1 భాగమును 28 ధరలును అలి 2-2 స్తంభములతో ప్రాగ్రీవములు 3. కోష్టమునుండి రచించవలెను. సీమతో సమానముగా వలభియుండవలెను. ఆ వలభి యిరువైపులను ప్రాగ్రీవములతో సహా రచించవలెను. వేదికలు జాలకములు సింహకర్ణములు కలిగియుండవలెను. దీనిని విభుప్రాసాదమని చెప్పుదురు.

## 104. పైజెప్పిన భవవిశాలాదులకు మఱియొక పద్ధతి

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ చతురశ్రా యతాంతిర్యగా యద్వ్యాథా పరానపి।
ప్రాసాదానభిధాస్యామో నవసంస్థాన లక్షణైః॥ 149
ద్వ్యాభాగా విస్తృతిర్గర్భే ద్విగుణాతిర్యగా యతిః।
[illegible] 150

స్తంభై శ్చతుర్భిః సంయుక్తా సీమా ద్వారస్యచాగ్రతః।
ద్విభాగాయామ విస్తారా తావన్మాత్ర సముచ్ఛ్రితిః॥ 151
తాంసీమాం గర్భసహితాం భాగేనాన్యే నవేష్టయేత్।
భిత్తి స్తత్ర విధాతవ్యా సగవాక్షా చతుర్దిశమ్॥ 152
షడ్దారుక యుతో హ్యేష ప్రాసాదో భవ ఉచ్యతే॥
అస్యైవ భాగనిష్కాంతా శాలా ముఖచతుష్టయే॥ 153
యదా షడ్దారుకో పేతా విశాలః స తదోచ్యతే॥
స్తంభైర్ముఖే ముఖే షడ్భిర్బహిః సామ్ముఖ్య ఇత్యసౌ॥ 154
అస్యైవ సీమా కర్ణస్థా ద్విద్వి స్తంభయుతా యదా।
ప్రాగ్రీవైర్భాగ నిష్క్రాంతా బహిఃస్థా ప్రభవ స్తదా॥ 155
సీమ్నోఽగ్రతో యదా స్యైవ స్తంభద్వయ యుతో భవేత్।
ప్రాగ్రీవో భాగనిష్క్రాంత స్తదా స్యాచ్ఛిబిరాగృహః॥ 156
విశాల సన్నివేశస్య ముఖే శాలా భవేద్యదా పార్శ్వయోః।
శోభయోః శాలే ప్రాగ్రీవాశ్చత్రయో యదా॥ 157
నిష్క్రాంత భాగ ఏకైకః స్తంభ ద్వితయ సంయుతః।
ప్రాసాదః స తదాజ్ఞేయో ముఖశాలోఽభిధానతః॥ 158

తా॥ చతురశ్రాయతమును అడ్డముగాచేసి మఱియొక విధముగా నిర్మించు పద్ధతి చప్పుచున్నాడు. గర్భమున విస్తారము 2 భాగములును, అడ్డముగ నిడుపు 4 భాగములును, మధ్యద్వారరము యెత్తు 1 భాగమును, ఆ ద్వారము యొక్క విస్తారము అందులో సగమును, ద్వారము ముందు సీమ 4 స్తంభములతోను 2 భాగముల విస్తారముతోను అంతే యెత్తుతోను, రచించవలెను. ఆ సీమను గర్భసహితముగా 1 భాగముతో గోడను రచించవలెను. ఆ గోడయందు నలువైపుల గవాక్షు లుండవలెను. షడ్దారుకమును రచించవలెను. దీనిని భవమని చెప్పుదురు. ఆ భవమునకు 1 భాగము నిర్గమమును చేసి నలువైపుల శాలలను రచించి షడ్దారుకమును రచించినచో

విశాలమగును. నలువైపుల 6 స్తంభములతో ముఖములను అలం కారముగా రచించిరేని సామ్ముఖ్యమగును. దానికే ప్రక్కలయం దుండెడి సీమను 2-2 స్తంభములతో ప్రాగ్రీవములును 1 భాగము నిర్గమమును చేసిరేని ప్రభవమగును-ప్రభవముయొక్క సీమముందు 2 స్తంభములును ప్రాగ్రీవము 1 భాగము నిర్గమముతోను రచించిన యెడల శిబిరాగృహమగును-విశాలము యొక్క సన్నివేశమున ముఖ శాలను రచించి యిరువైపుల రెండుశాలలును. ఈ మూటికిని ప్రాగ్రీవములును ఆ ప్రాగ్రీవములు 1-1 భాగము నిర్గమములును, 2-2 స్తంభములును ఉండునట్లు రచించిరేని అది ముఖశాలయగును.

శ్లో॥ ముఖశాలాగ్రశాలాయాం యదా స్తంభశ్చతుర్దశ।
ప్రాగ్రీవో ద్వివిధశ్చాగ్రే ద్విశాలః సతదా భవేత్॥ 159
భిత్తి స్తదానీం ప్రాసాదో గృహరాజః ప్రజాయతే।
గర్భాయామ సమావగ్ర పృష్ఠయోర్భాగ విస్తృతౌ॥ 160
చతుశ్చతుర్ధరాయత్ర ప్రాగ్రీవౌ ద్వౌచ పార్శ్వయోః।
తౌతు ద్విద్విధరాగర్భ విస్తారేణతు నిర్మితౌ॥ 161
అమలో నామ సప్రోక్తః ప్రాసాదః శుభలక్షణః।
అస్యైవచాగ్రే పృష్ఠేచ ద్విద్వి సంభయుతౌ యదా॥ 162
ప్రాగ్రీవై స తదా ప్రోక్తః ప్రాసాదో దశమోవిభుః॥

తా॥ ముఖశాల యొక్క ముందుశాలయందు 14 స్తంభములతో ప్రాగ్రీవము 2 విధములుగా నుండునట్లు రచించిన యెడల ద్విశాలయగును. ద్విశాలయందు రచించవలసిన పద్ధతులు లభించనందున వ్రాయబడలేదు. గోడను రచించిరేని గృహరాజమగును. గర్భముయొక్క నిడుపుతో సమానముగా ముందును వెనుకను 1 భాగము విస్తారముతో 4 ధరలును, ప్రాగ్రీవము యొక్క యిరువైపుల 2-2 ధరలును, గర్భవిస్తారముతో సమానముగా రచించిరేని అమలమగును. అమలము యొక్క ముందును వెనుకను 2-2 స్తంభములతో ప్రాగ్రీవములను రచించిన యెడల విభుప్రాసాదమగును.

## 105. మణికభేదములు 10. అందు ఆమోదము, రౌతికము, తుంగము, చారు, ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ అథవృత్తాయతాన్ బ్రూమః ప్రాసాదానభి ధానతః॥ 17
ఆమోదో రౌతికస్తుంగ శ్చారుర్భూతి ర్నిషేవకః।
తథా నిషేధః సింహాఖ్యః సుప్రభోలోచనోత్సవః॥ 18
ఏతే వృత్తాయతాః ప్రోక్తాః ప్రాసాదా నామతోదశ॥

శ్లో॥ ప్రాసాదాన్ కథయామోఽన్యాన్ దశవృత్తాయతాన్
పునః॥ 163
అష్టభాగ ముఖాయత్యా విస్తృత్యా చతురంశకమ్।
వృత్తాయతం ప్రకుర్వీత స బాహ్యాభ్యంతరం తతః॥ 164
గర్భం పశ్చిమభాగేఽస్య చతుర్భాగం సమంతతః।
కుర్యాత్ తస్యాగ్రతః సీమాం భాగ ద్వితయ విస్తృతామ్॥ 165
భాగత్రయ మితాం భాగే నైకేనాం తరితాంచతాం।
సంయుక్తా మష్టభిః స్తంభైః సువృత్తై శ్చారువర్ణనైః॥ 166
అలిందేన పరిక్షిప్తాం ససీ మాందేవ కోష్ఠకమ్।
షోడశ స్తంభ యుక్తేన కుర్యాత్ ప్రాగ్రీవ మగ్రతః॥ 167
ఛన్నాచ్ఛాద్య ద్వయేనాయ మామోద ఇతి కీర్తితః।
వృత్తాయతేషు ప్రథమః ప్రాసాదః స్వామినో హితః॥ 168
సమాహితౌ యదా స్యైవ ప్రాగ్రీవౌ భాగమాత్రితౌ।
చతుః స్తంభై రౌతికస్తు వృత్తాభ్యాం తుంగ ఉచ్యతే॥ 169
యదా సీమావధి ర్భిత్తిర్గవాక్షై రుపశోభితా।
వృత్త ప్రాగ్రీవ ఏకోఽన్యే తదా చారురుదాహృతః॥ 170

తా॥ వృత్తాయత ప్రాసాదములు ఆమోదము, రౌతికము, తుంగము, చారు, భూతి, నిషేవకము, నిషేధము, సింహము, సుప్రభము, లోచనోత్సవము, అనునవి. వానియొక్క లక్షణములను

చెప్పుచున్నాడు. నిడివి 8 భాగములును, వెడల్పు 4 భాగములును, చేసి దానిని సుంద్రనిరూపముగ చేయవలెను. దానియొక్క వెనుక భాగమున గర్భము 4 భాగములును దానిముందు 2 భాగముల విస్తారముతోను 3 భాగముల మొత్తుగాను, అందు 1 భాగము అంతరితమును, 8 స్తంభములును అలిందమునుచేసి ఆ ప్రదేశమును దేవ కోష్ఠమునుగనుంచి దానిముందు 16 స్తంభములతో ప్రాగ్రీవమును రెండు ఛాద్యములతో కల్పించి రేని ఆమోదమగును. దీనికే 4 స్తంభములతో ప్రాగ్రీవములు 1-1 భాగముగా రెండు కల్పించి రేని రాతికమగును దానినే సుంద్రముగా రచించినచో తుంగమగును. సీమయందు ఎడముంచి గోడయును గవాక్షులును, సుంద్రని ప్రాగ్రీవమును రచించిన మొదల చారుప్రాసాదమగును.

(అనుబంధము 53 పటము చూడుడు)

## 106. భూతి, నిషేధక, నిషేధ, సింహ, ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ సీమా మధ్యే విధాతవ్యా ప్రాగ్రీవా భాగవిస్తరౌ।
విస్తార సదృశాయామా దక్షిణోత్తరతస్త్రయః॥ 171
కార్యాః ప్రాగ్రీవకాస్తేచ గర్భకోష్ఠేన సమ్మితాః।
భూతిరిత్యేవ సంప్రోక్తః ప్రాసాదః శుభలక్షణః॥ 172
ముఖాయతాస్స్యాచ్చతురో భాగాన్యత్తిర్యగాయతాన్।
క్షేత్రం వృత్తంతతః కుర్యాత్ తన్మధ్యే గర్భవేశ్మచ॥ 173
చతుర్భాగాయతంతత్ స్యాత్ భాగద్వితయ విస్తృతం।
అలిందో బాహ్యత స్తస్య ద్వాదశ స్తంభ సంయుతః॥ 174
భాగద్వితయ విస్తారః ప్రాగ్రీవశ్చాంశ నిర్గతః
నిషేధ ఇతి విఖ్యాతః ప్రాసాదోఽయం పురాతనైః॥ 175
యథా నిషేధః స్యాదస్య పురః ప్రాగ్రీవకాయది।

అయమేవాంశకేన స్యాద్ యదాలిందేన వేష్టితః।
ముఖభాగత్రయం ముక్త్వాభిత్త్వాచ పరివేష్టితః॥ 177
యదాచకర్ణ ప్రాగ్రీవా ప్రాగ్రీవశ్చాగ్రతో భవేత్।
విశేష రచనాయాశ్చ ద్వావింశతి ధరాన్వితైః॥ 178
గవాక్షైః శోభనైర్యుక్త స్తదా సింహః ప్రకీర్తితః॥

తా॥ సీమ మధ్య రెండు ప్రాగ్రీవములు 1-1 భాగము విస్తారముతోను అదియే దీర్ఘముతోను, ముందు కూడ అటులే ప్రాగ్రీవమును ఈ మూడును గర్భకోష్ఠముతో సమానముగా రచించిరేని భూతిప్రాసాదమగును. ముఖభాగము 4 భాగములును అడ్డమును అదే ప్రమాణముచేసి ఆ ప్రదేశమును గుండ్రముగాచేసి దానిమధ్య గర్భగృహమును, రచించిన యెడల నిషేవకమగును. మఱియు పొడవు 4 భాగములు, వెడల్పు 2 భాగములు, దానిముందు అలిందము 12 స్తంభములతోను, 2 భాగముల విస్తారమును, ప్రాగ్రీవము 1 భాగము నిర్గమమును చేసిరేని నిషేధమగును. నిషేధమువలె ముందు ప్రాగ్రీవమును నాలుగు ద్వారములయందు అలిందములును 8 ధరలును రచించి 1 భాగము విస్తారముతో చుట్టును అలిందమును ముందు 3 భాగములను విడిచి గోడను రచించి ముందును యిరువైపులను ప్రాగ్రీవములను మూడింటిని రచించి 22 ధరలతోను గవాక్షులతోను అలంకారముగ జేసిన యెడల సింహప్రాసాదమగును.

## 107. సుప్రభ లోచనోత్సవములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ ద్వాదశాంశాయతే క్షేత్రే తథా షడ్భాగ విస్తృతే॥ 179
పశ్చాదంశ ద్వయం త్యక్త్వా ద్విభాగాయామ విస్తృతః।
దేవకోష్ఠో విధాతవ్య స్తద్ద్వారం భాగముచ్ఛ్రితమ్॥ 180
సీమాగ్రేసాంతరాద్వ్యంశ విస్తృతా చతురాయతా।
అష్టస్తంభోఽన్య గర్భోవై షోడశ స్తంభకో బహిః॥ 181

అలిందస్తస్య పురతో వృత్తే ప్రాగ్రీవకోఽపిచ।
సీమా ప్రాగ్రీవకాలింద కోష్ఠాన్ వృత్తాన్ ప్రకల్పయేత్॥ 182
ప్రాగ్రీవౌ పార్శ్వయోః సీమా సమా భాగ వినిర్గతౌ।
ద్వాభ్యాం ద్వాభ్యాం యుతౌ జ్ఞేయా స్తంభాభ్యాం
వర్తులాకృతీ॥ 183
ఏతత్సర్వం విధాతవ్య మలిందేనాభివేష్టితమ్।
చతుర్వింశే ధరోఽయంచ భాగికోఽస్య ప్రశస్యతే॥ 184
ద్విస్తంభయుక్తాన్ ప్రాగ్రీవాన్ కుర్యాద్గర్భస్యదిక్త్రియే।
ఏవమేవ సమాఖ్యాతః ప్రాసాదః సుప్రభః శుభః॥ 185
భాగద్వితయ విస్తారాః ప్రాగ్రీవాయేఽస్య కీర్తితాః।
చతురశ్రాస్త ఏవస్యు ర్ద్విద్విస్తంభ యుతా యది॥ 186
శేషాభవతి భిత్తిశ్చ గవాక్షైరుపశోభితా।
ప్రాసాదోఽయం తదాజ్ఞేయో దశమోలోచనోత్సవః॥ 187

తా॥ నిడుపు 12 భాగములును, వెడల్పు 6 భాగములును చేసి వెనుక 2 భాగములను వదలి 2 భాగముల విస్తారమును 2 భాగముల ఆయతమునుగల దేవకోష్ఠమును రచించి ద్వారము యెత్తు 1 భాగమును అందులో సగము విస్తారమును చేయవలెను. సీమ ముందు 2 భాగములు విస్తారమును 4 భాగములు పొడవును 8 స్తంభములతో గర్భమును వెలుపల 16 స్తంభములును, దానిముందు అలిందమును, గుండ్రని ప్రాగ్రీవమును, సీమను, ప్రాగ్రీవమును, అలిందమునుకోష్ఠమును, అన్నిటిని గుండ్రముగానే చేయవలెను. రెండువైపుల ప్రాగ్రీవమును, సీమయును సమానముగా 1 భాగము నిర్గమము లుండవలెను. 2-2 స్తంభములతో గుండ్రముగాను, చుట్టూ అలిందమును 24 ధరలును, ప్రాగ్రీవములు 2 స్తంభములతో గర్భము యొక్క-మూడువైపుల రచించవలెను. ఇట్లు రచించినచో సుప్రభమగును- ప్రాగ్రీవములు 2 భాగముల విస్తారముతో నలుచదరముగాను 2-2

స్తంభములతోను, మిగిలిన ప్రదేశమున గోడయును గవాక్షులును రచించి రేని లోచనోత్సవమగును.

## 108. త్రివిష్టప భేదములు 10 అందు

## వజ్రక, నందక, శంకు, వామన, మేఖల, ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ అష్టాశ్రీణాంచనామాని కథయామి సమాసతః॥ 19
వజ్రకోనందకః శంకుర్మేఖలో వామనోలయః।
మహాపద్మశ్చ హంసశ్చ వ్యోమచంద్రోదయావితి ॥ 20
అష్టాశ్రయ ఇ మేప్రోక్తాః ప్రాసాదాశసంఖ్యయా॥

శ్లో॥ అష్టాశ్రాన థరక్ష్యామః ప్రాసాదాంలక్షణైః సహ।
చతుర్భాగాన్వితే క్షేత్రే తథాష్టా శ్రీకృతే పునః॥ 188
ద్వాభాగా గర్భకోష్టః స్యాదలిందో భాగిక స్తదా।
స్తంభాష్టక కమలిందే స్యాత్ ప్రాగ్రీవ స్తస్య చాగ్రతః॥ 189
ద్విచ్ఛాద్యచ్ఛాదితః శ్రీమాన్ ప్రాసాదో వజ్రకో భవేత్।
అస్త్యైవాగ్రేయదా సీమా చతురశ్రా చతుర్ధరా॥ 190
స్యాచ్ఛతు ర్వింశతి స్తంభ శ్చాలిందో భాగికోఽపరః।
నందకోఽయం సమాఖ్యాతః శంకుః ప్రాగ్రీవకై స్త్రిభిః॥ 191
తస్యభి త్తిర్విధాతవ్యా క్షేత్రేఽష్టాశ్రియుతే బుధైః।
వామనః స్యాత్ పునర్ద్వాద్వా గవాక్షాదిక్ త్రయోమతౌ॥ 192
అస్యైవాశ్రే యదా సీమా భాగాద్ భాగత్రయా యతా।
ద్విభాగం విస్తృతాద్వ్యంశ ముత్సేధాదష్టభిర్ధరైః॥ 193
అలింద వేష్టితో యుక్తాః ప్రాగ్రీవైః స్యాత్తు మేఖలః॥

తా॥ ఎనిమిది కోణములుగల ప్రాసాదములు. వజ్రకము, ందకము, శంకు, వామనము, మేఖలము, లయము, మహాపద్మము, హంసము, వ్యోమము చంద్రోదయము. అను 10 భేదములు కలవు. అందువజ్రకమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 4 భాగ

ములు చేసి దానిని సమముగా 8 కోణములు చేసి అందు గర్భగృహము 2 భాగములును, చుట్టూ అలిందము 1 భాగము 8 స్తంభములతోను, దానిముందు ప్రాగ్గ్రీవమును, రెండు ఛాద్యములతో ప్రస్తరమును రచింపబడినది వజ్రకమగును. వజ్రకమునకు ముందు సీమ నలుచదరముగాను 4 ధరలును, 24 స్తంభములతో అలిందమును చుట్టూ 1 భాగమును రచించి రేని నందకమగును - పై చెప్పిన నందకమునకు 3 ప్రాగ్గ్రీవములను మూడువైపుల రచించిన యెడల శంఖవగును- శంఖప్రాసాదమునకు 8 కోణములుగల గోడను చుట్టును రచించి మూడువైపుల 2-2 చొప్పున గవాక్షులుంచినచో వామనమగును- వామనమునందు విస్తారము 2 భాగములును, పొడవు 3 భాగములును, ఎత్తు 2 భాగములును, 8 ధరలును, చుట్టూ అలిందమును, మూడువైపుల ప్రాగ్గ్రీవములును రచించిన యెడల మేఖలమగును-

(అనుబంధము 54వ పటము చూడుడు)

## 109. లయ, మహాపద్మ, హంస, వ్యోమ, చంద్రోదయ ప్రాసాదములు

సమరాంగణ 49వ అధ్యాయము.

శ్లో॥ భిత్తి క్షేత్రే యదా స్యైవ ప్రాగ్గ్రీవాః పరివేష్టితాః॥ 194
అలిందేన ధరైః షడ్భిః షడ్భిర్యుక్తః స్తదాలయః।
అష్టభాగమితే క్షేత్రే కృతేఽష్టాశ్రిణి సర్వతః॥ 195
భాగద్వయమితం కుర్యాద్ దేవకోష్ఠం మనోరమ్।
చతుర్భిః శోభితం ద్వారై ర్భాగి కాలింద వేష్టితమ్॥ 196
అలిందస్య విధాతవ్యాః స్తంభ శ్చాష్టౌ తతోఽపరః।
స్యాచ్చతుర్వింశతి స్తంభో భాగికోఽలిందకః పునః॥ 197
తథా విధ స్తృతీయోఽపి ప్రాగ్గ్రీవాశ్చ చతుర్దిశమ్।
తథా విధ స్తృతీయోఽపి ప్రాగ్గ్రీవాశ్చ చతుర్దిశమ్।
ప్రాసాదోఽయం మహాపద్మో బ్రహ్మణః శంకరస్య చ॥ 198
ద్వితీయఽలిందకేఽస్యైరవ ప్రాగ్గ్రీవాస్యు శ్చతుర్దిశమ్।
అలిందేన పరిక్షిప్తో హంస ఏవ ప్రకీర్తితః॥ 199

ప్రాగ్రీవోఽస్య మహాపద్మ స్యాలిందేనా వృతో యదా।
కర్ణ ప్రాగ్రీవకౌ ద్వౌద్వౌ వ్యోమసంజ్ఞ స్తదా భవేత్॥ 200
హంసస్యైవ వలభ్యః స్యుః ప్రాగ్రీవాణాం పదే యదా।
చతుః స్తంభాః పరిక్షిప్తా అలిందేన చతుర్దిశమ్॥ 201
తదా చంద్రోదయోనామ ప్రాసాదో జాయతే శుభః।
ఏవ మేషాం చతుః షష్టిః ప్రాసాదానా ముదాహృతాః॥

ఇతి సురభవనానాం సప్తతిర్ద్వా రవణా మిహ సదన చతు
ష్కోణాన్వితేయం ప్రదిష్టా జనమయ మవకోశానంద శుభ్రాం
శురేఖా భవతి సువిదితైషా శిల్పినాం కామధేనుః॥ 203

ఇతి సమరాంగణ సూత్రధారా పరనామ్ని వాస్తుశాస్త్రే రుచకాది చతుష్షష్టి ప్రాసాదలక్షణం నామైకోన పంచాశోఽధ్యాయః.

తా॥ పూర్వము చెప్పిన మేఖలప్రాసాదమునకు గోడయును ప్రాగ్రీవములును అలిందమును 6-6 ధరలును కలిగినది లయమని పించుకొనును. చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి 8 కోణము లుగానుచేసి అందు 2 భాగములు దేవకోష్ఠమును, నలువైపుల ద్వారములును, 1 భాగము చుట్టూ అలిందమును, అలిందమునకు 8 స్తంభములును, మరల నింకొక యలిందమును 1 భాగమును 24 స్తంభములును, మరల మూడవ వలయమున 1 భాగము నలువైపుల ప్రాగ్రీవములను, రచించిరేని మహాపద్మప్రాసాదమగును. బ్రహ్మ కును శివునకును ముఖ్యము - పై జెప్పిన దానినే మూడవ వలయము లేకుండ రెండవ అలిందముననే ప్రాగ్రీవములను నలువైపుల రచించి రేని హంసప్రాసాదమగును. మహాపద్మముయొక్క అలిందమున ముందును యిరువైపులను కలసి 3 ప్రాగ్రీవములను రచించినచో వ్యోమప్రాసాదమగును. హంసప్రాసాదమున వలభినలువైపులను రచించి 1 భాగము ప్రాగ్రీవములను 4-4 స్తంభములతో రచించి దానికి చుట్టూ అలిందమును కల్పించినట్లయిన చంద్రోదయ ప్రాసాద

నిర్మించుటకు మహాశిల్పులు దీనిని శిల్పులకు కామధేనువుగాను చంద్రకళవలె తేటతెల్లముగాను వ్రాసియుండిరి.

## 110. భూమిజ ప్రాసాదములు 25

### అందు నిషధము, సింహము, నందము

అపరాజిత 106వ సూ.

శ్లో॥ యత్ర వంశోద్భవాః కూటా హ్రస్వ వృద్ధిక్రమ స్థితాః।
దల విభక్త్వా త్వంగైశ్చ భూమిజా పురభూషణాః॥ 29

రాజసింహవాస్తు 1వ అధ్యాయము.

శ్లో॥ యథా వంశోద్భవాం కురో హ్రస్వవృద్ధిః క్రమస్థితాః।
యుక్తాదల విభక్త్యంగై ర్భూమిజాః పురభూషణాః॥ 28

తా॥ వెదురుకొమ్మలవలె పెద్దవి చిన్నవి వరుసగా నేర్పడి దలముల యొక్క విభాగములును, అనేక రూపములును కలవి భూమిజప్రాసాదములు.

అపరాజిత 171వ సూ.

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదాన్ భూమిజాభిధాన్।
వేదాశ్రా వృత్త సంస్థానా అష్టాశ్రాం శ్చతతః పరమ్॥ 1
నిషధః సింహానం దాఖ్యోమల యాద్రిశ్చ మందరః।
ప్రభామణిర్మాల్యవాంశ్చ మలయో నవమాలికః॥ 2
పృథ్వీజయ స్తథా చేమే చతురశ్రాః ప్రకీర్తితాః।
త్రిపంచాశ్వ నవాంగాశ్చ సంఖ్యయా తుదశైవచ॥ 3
వృత్తానాంచ తతోవక్ష్యే నామసంఖ్యాచ లక్షణమ్।
కుముదః కమలః కమలోద్భవః కిరణ స్తథా॥ 4
శతశృంగో నిరవద్య స్తథా సర్వాంగ సుందరః।
[illegible] 5

స్వస్తికోఽద స్వస్తికాంత వజ్రోహర్మ్యతల స్తథా।
శ్రీతిలకః సమాఖ్యాత ఉదయాచల ఏవచ॥ 6

పృథివీ భూషణశ్చాథ గంధమాదన ఏవచ।
త్రైలోక్య భూషణశ్చేతి హ్యష్టా శ్రాస్తే ప్రకీర్తితాః॥ 7

పంచవింశతి రాఖ్యాతాః ప్రాసాదా భూమికోద్భవాః।
తదనుక్రమ రూపంచ కథయే తవ సాంప్రతమ్॥ 8

నిషధాదా దశమేచ చతురశ్రాః ప్రకీర్తితాః।
వృత్తా కారశ్చతుః శాలాః సప్తైవ కుముదాదయః। 9

స్వస్తికాద్యా స్తథా చాష్టౌ వష్టాశ్రా స్తు ప్రకీర్తితాః।
త్రివిధా విధితః ఖ్యాతా భూమిజాః పురభూషణాః 10

నిషధం సంప్రవక్ష్యామి యథా వదను పూర్వశః।
చతురశ్రీ కృతే క్షేత్రే దశధాప్ర విభాజితే॥ 11

ద్విభాగః కోణ ఇత్యుక్తో భాగార్ధ ముదకాంతరైః।
షడ్భాగంతు భవేద్ భద్రం విభజేద్దశ భాగికమ్॥ 12

ఏకైక భాగాః కర్ణ్యశ్చ నిర్గమే విస్తరే తథా।
ద్విభాగో భద్రనిష్కాసః సర్వభద్రేష్వయం విధిః॥ 13

ద్విభాగం క్షోభయేత్ పార్శ్వం నిర్గమో భాగ ఏవచ।
చతుర్భాగంచ విస్తారే ముఖభద్రం విధీయతే॥ 14

షడ్భాగశ్చ భవేద్ గర్భోభిత్తి స్తత్ర ద్విభాగికా।
భిత్తితుల్యాగ్రక పాలం శుకాగ్రంచ సురాలయే॥ 15

ద్విభాగమేక భాగం వా త్రిభాగ మథవోచ్యతే।
ఇత్థం శుకాగ్రం త్రివిధం జ్యేష్ఠ మధ్య కనిష్ఠకమ్॥ 16

తా॥ ఈ ప్రాసాదములలో నలుచదరము, గుండ్రము, ఎనిమిది మూలలు కలవు. అందు నిషధము, సింహము, నందము, మలయాచలము, మందరము, ప్రభామణి, మాల్యవంతము, మలయము, నవమాలిక, భూజయము. ఈ 10 చతురశ్రములు వీనికి

అంగములు 3-5-7-9 ఇట్లు చెప్పబడుచున్నవి. కుముదము, కమలము, కమలోద్భవము, కిరణము, శతశృంగము, నిరవద్యము, సర్వాంగ సుందరము, ఈ 7ను గుండ్రములు. పై మాదిరిగానే వీనికిని 3-5-7-9 అంగములు కలవు. మఱియు స్వస్తికము, స్వస్తికాంతము, వజ్రము, హర్మ్యతలము, శ్రీతిలకము, ఉదయాచలము, పృథివీ భూషణము, గంధమాదనము, త్రైలోక్యభూషణము. ఈ 8 అష్టాశ్రములు. మొత్తము 25 ఇందు నిషధము మొదలగు 10 చతురశ్రములును, కుముదము మొదలగు 7 గుండ్రములును, స్వస్తికము మొదలగు 8 అష్టాశ్రములును, ఇట్లు మూడు విధములతో భూమిజ ప్రాసాదము లేర్పడినవి. నిషధమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి 2 భాగములు కోణములును, జలాంతరము $\frac{1}{3}$ భాగమును, భద్రము 6 భాగములును, చేసి మరల దానిని 10 భాగములు చేయవలెను. కర్ణికలు 1-1 భాగములను, నిర్గమమును విస్తారమును 1-1 భాగమును, భద్రయుమొక్క నిర్గమము 2 భాగములును, చేసి యిట్లు అన్ని భద్రములకును చేయవలెను. ప్రక్కల యందు 2 భాగములు క్షోభణము చేయవలెను. నిర్గమము 1 భాగమును విస్తారము 4 భాగములతో ముఖభద్రమును రచించవలెను. గర్భము 6 భాగములు, గోడ 2 భాగములు, గోడతో సమానముగ పైన కపాలమును, శుకాగ్రము $\frac{4}{3}$-$\frac{3}{2}$-$\frac{2}{1}$ భాగములు. ఉత్తమ, మధ్యమ కనిసములుగా తెలియవలెను. శుకాగ్రమును కూడ రచించవలెను.

శ్లో॥ పృథజ్మానోదయం కృత్వా క్షిత్యంతం భాగసంఖ్యయా।
సపాదోదయ శృంగంచ శేషం మండోవరో భవేత్॥ 17
ఏకాదశో దయశ్చోర్ధ్వే త్ర్యంగాదాచ సమస్తకే।
పంచాంగాదాచ సూర్యాంశాః సప్తాంగాద్త్రయోదశ॥ 18
చతుర్దశోచ్ఛ్రయే భాగా నవాంగేషుచ సర్వతః।
ఏష చోదయ ఆఖ్యాతః శృంగాణాం మాలికా క్రమః॥ 19

నిషధః సింహనందాఖ్యౌ త్ర్యంగాస్సై వేదభూమికాః।
నిషధో దశభాగైః స్యా త్తథా సింహోఽష్ట భాగికః॥ 20
నందాఖ్యో నవభిర్భాగైః క ర్తవ్యః సర్వకామదః।
నిషధశ్చ చతుర్భూమిః సింహనందాత్రి భూమికా॥ 21
సింహో భద్రం చతుర్భాగం నందాఖ్యో పంచభాగికమ్।
షడ్భాగంచ భవేద్ భద్రం ప్రాసాదే నిషధే తథా॥ 22
సింహో భద్రం చతురశ్రం నందాఖ్యో కర్ణికాయుతమ్।
కర్ణికా ముఖభద్రేచ నిషధే భద్రరూపకమ్॥ 23
ద్వాదశోచ్ఛ్రయ భద్రంచ ప్రాసాదే నిషధే తథా।
చతుః సార్ధత్రయ త్రయసార్ధ భాగోర్ధ్వ వేదికా॥ 24
ఘంటోదయశ్చ సఙ్కంధోర్ధ్వ కుంభ స్తత్ర్యుల్య ఉచ్ఛ్రయే।
ప్రథమాక్షితి జానామ ద్వితీయా సూర్యసేనికా॥ 25
తృతీయా చైవపర్యంతా చతుర్థీ గజకుంభికా॥
పంచమీ సింహరూపాచ నరసింహాచ షష్ఠికా,
సప్తమీ సర్వతో భద్రా చాష్టమీంగ గనోదరీ॥ 26
నవమీ చిత్ర సంఘాటా వేదికాస్త్రి దశాలయే।
కంఠోగ్రీవాకుడ్మలంచ పద్మచ్ఛత్రో షచ్ఛత్రకమ్॥ 27
త్ర్యంగాః శస్తాశ్చతుర్భామా నిషధః సింహనందకా।
పంచాంగాః పంచభూమా స్తు సప్తాంగాః సప్తభూమికాః 28
నవాంగా నవభూమా స్తు భూమిజాః పురభూషణాః।
తతః పరం నక ర్తవ్యం శుద్ధచ్ఛందేతు భూమిజే॥ 29

తా॥ ప్రాసాదములకు నిర్ణయింపబడిన వానిలో తనకు యిష్టము వచ్చిన యెత్తును నిర్ణయించుకొని అందు శిఖరము $1\frac{1}{4}$ భాగమును మిగిలినది మండోవరమును రచించవలెను. త్ర్యంగములు గల వానికి యెత్తు 11 భాగములు చేయుట సామాన్యపద్ధతి పంచాంగములు గల వానికి 12 భాగములు చేయవలెను. సప్తాంగములు గల

వానికి 13 భాగము లుండవలెను. నవాంగములు గల వానికి 14 భాగము లుంచవలెను. ఇట్లు భూమిజ ప్రాసాదము లన్నిటికిని ప్రమాణములు తెలియవలెను. నిషధము, సింహము, నందము ఈమూడును త్ర్యంగములును 4 అంతస్తులును చేయవలెను. విస్తారము నిషధమునకు 10 భాగములును, సింహమునకు 8 భాగములును, నందనమునకు 9 భాగములును చేయవలెను. నిషధము 4 అంతస్తులును, సింహము నందము 3 అంతస్తులును చేయవలెను. భద్రము నిషధమునకు 6 భాగములును, సింహమునకు 4 భాగములును, నందమునకు 5 భాగములును రచించవలెను. నిషధమున భద్రము కర్ణికయును ఉపభద్రమును, సింహమున భద్రము చతురశ్రమును, నందమున భద్రము కర్ణికయును, రచించవలెను. ఈ భద్రము యెత్తు 12 భాగములు అన్నింటికిని చేయవలెను. వేదికనిషధమునకు 4 భాగములును సింహమునకు 3 భాగములును, నందమునకు $3\frac{1}{2}$ భాగములును, చేయవలెను. స్కంధము పైన ఘంట యెత్తును కుంభమును సమానమైన యెత్తుననుండవలెను. మొదటి దానిని క్షితిజమనియును, రెండవ దానిని సూర్యసేనయనియును, మూడవదానిని పర్యంతయనియును, నాల్గవదానిని గజకుంభికయనియును, ఐదవ దానిని సింహరూపయనియును, ఆఱవదానిని నరసింహయనియును. ఏడవదానిని సర్వతోభద్రయనియును, ఎనిమిదవ దానిని గగనోదరియనియును, తొమ్మిదవదానిని చిత్ర సంఘాటయనియును ఇట్లు వేదికలకు నామములను నిర్ణయింపబడియుండెను. కంఠము, గ్రీవ, కుడ్మలము, పద్మచ్ఛత్రము, ఉపచ్ఛత్రము, వీనితో త్ర్యంగములును 4 అంతస్తులును కలవి నిషధము, సింహము నందము, మఱియు పంచాంగములు కలవి 5 అంతస్తులును, సప్తాంగములు కలవి 7 అంతస్తులును, నవాంగములు కలవి 9 అంతస్తులును ఇట్లు భూమిజప్రాసాదము లనేక భేదములు కలిగియున్నవి. శుద్ధచ్ఛందమున నింతకంటె అంతస్తులుగాని మఱేమియుగాని చెప్పబడి యుండలేమ.

# 111. నిషధము మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ భూమిజానాం విమానానాం బ్రూమోలక్ష్మ క్రమాగతమ్।
చతురశ్రీ కృతానాంచ వృత్తానామను పూర్వశః॥ 1
వేషాంచిన్నిర్గమ స్తత్ర జాయతే భాగసంఖ్యయా।
కేషాంచిత్పున రేష స్యాద్ వృత్తమధ్య మధిష్ఠితః॥ 2
చతురశ్రీ కృతే క్షేత్రే దశభాగవిభాజితే।
చతుర్భూమియుతస్యాథ లక్ష్మచ్ఛందస్య కథ్యతే॥ 3
చత్వారశ్చతురశ్రాః స్యు ర్నిషధో మలయాచలః।
మాల్యవాన్నవ మాలీచ నిషధ స్తేషు కథ్యతే॥ 4
కర్ణాః శంభ్వాదయో ద్వ్యంశం చార్ధాంశంవారి మార్గకః।
విస్తారాయామతః ప్రోక్తో భద్రం పంచాంశ విస్తృతమ్॥ 5
కార్యాః పాదోన భాగేన భద్రస్యైతస్య నిర్గమాః।
కార్యాపల్లవికాతస్య పాదభాగేన విస్తృతా॥ 6
భాగేన కర్ణికాకార్యా విస్తృత్యా నిర్గమేణచ।
ప్రతిభద్రం భాగార్ధ నిర్గతంతత్ర కల్పయేత్॥ 7
పాదోన భాగ ద్వితయం ప్రతిభద్రస్య విస్తృతిః
షడ్భిరాభాగై ర్భవేద్గర్భో భిత్తిరస్య ద్విభాగికా॥ 8
తలచ్ఛందస్యలక్ష్మోక్త మూర్ధ్వమానమథోచ్యతే।
విస్తృతే ద్విగుణం తచ్చ చతుర్భాగాది శంభవేత్॥ 9
వేదీబంధో భవేదస్య సార్ధభాగద్వయోచ్ఛ్రితః।
తత్తు భాగద్వయం సార్ధం విభజేత్సార్ధ పంచమైః॥ 10
భాగద్వయేన కుంభఃస్యాత్ కలశోభాగికః స్మృతః।
భాగార్ధేనాంతరం పత్రం కపోతాపీతు భాగికీ॥ 11
ఉక్తోఽయం వేదికాబంధో భాగై రిత్యర్థ పంచమైః।
అర్ధ పంచమ భాగైః స్యా జ్జంఘోచ్ఛ్రాలక సంయుతా॥ 12

త్రిభిర్భాగై స్తు ప్రథమా భూత్సేధః సవరండికః।
ద్వితీయస్య భవేద్భూమి రర్థపంచమ భాగికా। 13
కుంభః సోచ్ఛాలకా ప్రాగ్వత్ ద్వితీయాచాపితావతా।
తృతీయాస్యాద్ భూర్వివేధేయా స్యాదర్థ చతురంశికా॥ 14
చతుర్థీ చతుర్భాగా హీనా తస్యాః సముచ్ఛ్రితిః।
కుంభః సోచ్ఛాలకః కూటస్యోచ్ఛ్రాయోఽపిచ పూర్వవత్॥ 15
వేదీస్యాత్ సాంశకా సార్థ పంచాంశా స్కంధ విస్తృతిః।
వృత్తాకారం లిఖేత్ సార్థ చతుర్గుణిత విస్తరాత్॥ 16
తలేయాకధితాశాలా భాగపంచక విస్తృతా।
స్కంధస్థానం భవేద్వృత్తం భాగద్వితయ విస్తృతః॥ 17
రేఖావశేన కర్తవ్యాః ప్రవేశాచ్చ క్రమాద్భువామ్।
మూలతః స్కంధపర్యంతం ఘంటాయాః పు...యాః॥ 18
భవేత్ ప్రాసాద విస్తారః పంచభాగై వసుందరః।
వేదకోఽర్థేతరం యత్స్యా చ్ఛాలాయా స్త్రత్ప్రమాణతః॥ 19
...యే విస్తరః ప్రోక్తస్తం మడ్భిర్విభాజయేత్।
భాగే నైకేన కంఠస్య ప్రవేశః పరితో భవేత్॥ 20
కంఠవృత్తం చతుర్భాగ విస్తృతం పరికల్పయేత్।
ఘంటోత్సేధం త్రిభిర్భాగై ర్విభజేత్తత్ర భాగికాత్॥ 21
ఘంటోత్సేధా దథః కార్యం పద్మశీర్షం విపశ్చితా।
ఉత్సేధాత్కలశో ద్వ్యంశః సార్థభాగేన విస్తృతః॥ 22
శిఖరాత్ త్ర్యంశ హీనాస్యాత్ సర్వత్ర శుకనాసికా।
ఇతిత్ర్యంశ శ్చతుర్భూమిః ప్రాసాదో నిషధో మతః 23
సర్వాసామేవ కర్తవ్యో దేవతానాం విభూతయే॥

తా॥ భూమిజప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. కొన్ని చతురశ్రములును, కొన్ని గుండ్రములును, కొన్ని యెనిమిది మూలలును, గలిగియున్నది. మఱికొన్ని నిర్గమములతో

గూడ భాగములు చేయబడియున్నవి. అందు నాలుగు అంతస్తులు గలిగిన నిషధము, మలయాచలము, మాల్యవందము, నవమాలిక, అను నాలుగు నలుచదరములు. వానిలో ముందు నిషధమును జెప్పు చున్నాడు. నలుచదర ప్రదేశమును 10 భాగములుచేసి మూలల యందు కర్ణము 2-2 భాగములును, మధ్యశాల 5 భాగములును, జలమార్గము $\frac{1}{2}$ భాగమును, భద్రముయొక్క నిర్గమము $\frac{3}{4}$ భాగ మును, పల్లవికము $\frac{1}{4}$ భాగమును, కర్ణిక 1 భాగమును, ప్రతిభద్రము యొక్క నిర్గమము $\frac{1}{2}$ భాగమును, ప్రతిభద్రము యొక్క విస్తారము $1\frac{3}{4}$ భాగములును, చేయవలెను. గర్భము 6 భాగములును, దాని చుట్టూ గోడ 2 భాగములును, రచించవలెను. ఎత్తును చెప్పు చున్నాడు. విస్తారమునకు రెట్టింపును $\frac{1}{4}$ భాగము అధికము చేయ వలెను. అనగా విస్తారము 4 భాగములు ఎత్తు 9 భాగములు అగును. వేదికాబంధము $2\frac{1}{2}$ భాగములను మరల $2\frac{1}{2}$ భాగములను $5\frac{1}{2}$ భాగము లుగా జేసి అందు వేదిక 1 భాగము, కుంభము 2 భాగములు, కలశము 1 భాగము, అంతరపత్రము $\frac{1}{2}$ భాగము, కపోతములు 1 భాగము, ఇట్లు చేయవలెను. మిగిలిన $2\frac{1}{2}$ భాగములు ఉచ్ఛాలకముతో గూడ జంఘను చేయవలెను. అనగా వేదికాబంధము జంఘ కలసి 5 భాగ ములు తెలియవలెను. మొదటి అంతస్తును 3 భాగముల యెత్తు చేయ వలెను. అందు వరిండిక కూడ నుండవలెను. రెండవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములుండవలెను. కుంభమును ఉచ్ఛాలమును పూర్వమువలె రచించవలెను.

మూడవ అంతస్తు 2 భాగములు చేయవలెను. నాల్గవ అంతస్తు $1\frac{1}{2}$ భాగము చేయవలెను. కుంభము ఉచ్ఛాలకముతో సహా మునుపటివలెనే రచించవలెను. కూటముల యెత్తు కూడ పూర్వమువలెనే చేయవలెను. వేదిక 1 భాగమును, స్కంధము యొక్క విస్తారము $5\frac{1}{2}$ భాగములు, $4\frac{1}{2}$ భాగములుగల సూత్రముతో గుండ్రముగా గీయవలెను. అంతస్తున జెప్పబడిన శాల5 భాగముల

విస్తారము. స్కంధప్రదేశమున గుండ్రముగా విస్తారము 2 భాగములు, రేఖ ననుసరించి వరుసగా అన్ని అంతస్తులు రచించవలెను. మొదటినుండి స్కంధమువఱకు ఘంటయొక్క ప్రాసాదముయొక్క విస్తారము 5 భాగములు అందముగా నుండును. కొన్ని 4 భాగములతో నుండును. విస్తారమును 6 భాగములుచేసి కంఠము 1 భాగము దాని చుట్టుకొలత గుండ్రము మీద 4 భాగములు, ఘంటయెత్తును 3 భాగములుచేసి అందు 1 భాగము దిగువ పద్మశీర్షమును ఆపైన 2 భాగములు కలశమును, కలశము విస్తారము $1\frac{1}{2}$ భాగమును, శిఖరములో 3వ వంతు తగ్గించి అంతటను శుకనాసికలును, ఇట్లు 3 భాగములును నాలుగు అంతస్తులును రచించిరేని నిషధమగును.

(అనుబంధము 55వ పటము చూడుడు)

## 112. మలయ, మందర, ప్రభామణి, ప్రాసాదములు

అపరాజిత 171వ సూ.

శ్లో॥ ఛందే ద్వాదశధాభక్తే ద్విభాగః కర్ణ విస్తరః।
సార్ధభాగః ప్రతిరథ శ్చార్ధభాగాతు కర్ణికా॥ 30
పంచభాగం భవేద్భద్రం నిర్గమశ్చైక భాగికః।
మలయాద్రా శుద్ధచ్ఛందే ప్రరథః సార్ధ భాగికః॥ 31
కర్ణతుల్యః ప్రతిరథో భద్రం ద్విగుణ విస్తరమ్।
భద్రే ప్రతిరథేవాపి నిర్గమో భాగ భాగతః॥ 32
మందరస్తు సమాఖ్యాతః క్రమత్యాగే ప్రభామణిః।
భిత్త్యంతేచ క్రమంత్యక్త్వా తతో రేఖాశ్చ భూమిజాః॥ 33
కర్ణే ప్రతిరథే చైవ లతా శృంగాణి కారయేత్।
త్ర్యంశే పాదత్రయం కుర్యాత్ పాదో నత్రయ మేవచ॥ 43
సార్ధత్రయం ప్రకర్తవ్యం సార్ధభాగాతు వేదికా।
పంచాంగాః పంచభూమాశ్చ ఘంటా కలశ మూర్ధ్వతః। 35

తా॥ చతురశ్రప్రదేశమును 12 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగము, కర్ణిక $\frac{1}{2}$ భాగము, భద్రము 5 భాగములు, నిర్గమము 1 భాగము, ఇది మలయము శుద్ధచ్ఛందము ప్రరథము $1\frac{1}{2}$ భాగము, దానితో సమానము ప్రతిరథము, భద్రము 3 భాగములు, భద్రము ప్రతిరథము నిర్గమము 1-1 భాగము ఇది మందరము గోడవెలుపల క్రమముగా వదలి విస్తారమైన రేఖలును, కర్ణమునను, ప్రతిరథమునను. లత, శృంగములను రచించి $3\frac{3}{4}$ భాగములును, $2\frac{3}{4}$ భాగములును, $3\frac{1}{2}$ భాగములును, చేయవలెను. వేదిక $1\frac{1}{2}$ భాగము చేయవలెను. ఈ మూడును పంచాంగములు కలవి. 5 అంతస్తులును ఘంట కలశము మొదలైనవి రచించవలెను.

## 113. మలయము-మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ మలయాద్రేరిదానీంతు లక్షణం సంప్రచక్ష్మహే॥ 24
చతురశ్రీ కృతే క్షేత్రే ద్వాదశాంశ విభాజితే।
కర్ణా ద్విభాగికాః కార్యాః సమ్యక్ సలిల వర్త్మభిః॥ 25
శాలా స్యాత్ పంచభిర్భాగైః సార్ధాంశస్తు ప్రతిరథః।
సశాలా కర్ణయోర్మధ్యే కర్తవ్యః సోదకాంతరః॥ 26
ప్రతిరథస్య శాలాయాశ్చార్ధ భాగం వినిర్గమః।
భవేత్ స పదవిన్యాస విభాగోఽన్యశ్చ పూర్వవత్॥ 27
తే చ ద్వాదశభాగాయే దశభిస్తాన్ విభాజయేత్।
గర్భ భిత్తిం తథోత్సేధం జంఘాయాః ప్రథమక్షితేః॥ 28
వేదీ బంధస్యచోత్సేధం పూర్వమానేన కారయేత్।
మధ్యం పల్లవికాంతంతు శాలయోర్దశభిర్భజేత్॥ 29
క్షితేరారభ్య పూర్వస్యాః స్కంధం యావత్ సముచ్ఛ్రితిః।
కార్యా ద్వాదశభిర్భాగై రనంతర నిరూపితైః॥ 30

సార్ధయైకో న వింశత్యా భాజయేద్భూయ ఏవతాం।
ద్వితీయ భూమికోత్సేధ స్తైర్భవంత్యథ భాగికాః॥ 31
త్రిస్రోఽన్యాః పదపాదేన హీనాః కార్యా యథాక్రమమ్।
భాగేన వేదికోత్సేధః శాలా కార్యాచ నాగరః॥ 32
ఊర్ధ్వమాద్యక్షితేః కార్యా మాలాయాః శూరసేనకాః।
కోణ ప్రతిరథాయేతు పంచభాగ సముచ్ఛ్రితాః॥ 33
స్తంభోచ్ఛాలక మధ్యేన తేషు కూటోచ్ఛ్రితి స్తథా।
అర్ధేన ప్రవిధాతవ్యా భూష్వన్యా స్వప్యయం విధిః॥ 34
స్కంధ విస్తార రేఖా భూ ప్రవేశో ఘంటయా సహ।
కలశః శుకనాసస్య చోచ్ఛ్రితిః పూర్వవద్భవేత్॥ 35
మలయాద్రి రియం ప్రోక్తః ప్రాసాదః శుభలక్షణః।
య ఏనం కారయే త్తస్య తుష్యంతి సకలాః సురాః॥ 36
వర్ష కోటి సహస్రాణి స్వర్గలోకే మహీయతే॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు జలమార్గముతో సహా, శాల 5 భాగములు, శాలాకర్ణముల మధ్య ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును జలమార్గముతో సహా రచించవలెను. శాలయొక్క నిర్గమము 1 భాగమును, ప్రతిరథము యొక్క నిర్గమము $\frac{1}{2}$ భాగమును చేయవలెను. తరువాత పై జెప్పిన 12 భాగములను 10 భాగములుగాజేసి అందు గర్భము 6 భాగములును గోడ 2-2 భాగములును చేయవలెను. జంఘ యొక్క యెత్తును మొదటి అంతస్తు వేదికను పూర్వమువలెనే చేయవలయును. మధ్య పల్లవముయొక్క కడపటి వఱకు శాల 10 భాగములు చేయవలెను. మొదటి అంతస్తు మొదలుకొని స్కంధము యెత్తు 12 భాగములు చేసి మరల దానిని $19\frac{1}{2}$ భాగములుచేసి రెండవ అంతస్తు 3 భాగములు, మూడవ అంతస్తు $2\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $2\frac{1}{4}$ భాగములు, వేదిక 1 భాగము, శాల నాగర పద్ధతిలో చేయవలెను. మొదటి అంతస్తుపైన శూరసేన

పద్ధతిలో చేయవలెను. కర్ణకూటములును ప్రతిరథములును 5 భాగముల యెత్తుండవలెను. స్తంభము ఉచ్ఛాలకము ఈ రెంటి మధ్య కూటముల యెత్తు $\frac{1}{2}$ భాగము చేయవలెను. ఇతర ప్రదేశములందును ఇదే విధముగా చేయవలెను. స్కంధము యొక్క విస్తారమును, రేఖయును, అంతస్తున ప్రవేశమును, ఘంటతో కూడ కలశమును, శుకనాశము యొక్క యెత్తును, పూర్వమువలెనే చేయవలెను. ఇట్టి లక్షణములుగలది మలయాచలము. దీనిని రచించినవారు వెయ్యి కోట్ల సంవత్సరములు స్వర్గసుఖము ననుభవింతురు.

## 114. మాల్యవంతము - మలయము

అపరాజిత 171వ సూ.

శ్లో॥ క్షేత్రేచ పంచదశ భిర్భుజకర్ణ విశోధితే।
ద్విభాగః కర్ణకః సార్ధో రథః ప్రతిరథ స్తథా॥ 36
పంచభాగం భవేద్భద్రం విస్తరేచ ప్రకీర్తితమ్।
రథే ప్రతిరథే భద్రే భాగ భాగో వినిర్గమః॥ 37
మాల్యవానితి సంప్రోక్తో మలయం చ తతః శృణు।
రథో భాగః స పాదశ్చ ప్రరథశ్చ తతోఽధికః॥ 38
ఏవం మలయ ఆఖ్యాతః కథ్యతే భూమికోదయః।
సూర్యసేనా త్రిభిర్భాగైః పాదహ్రాసైః సప్తాంగకే॥ 39
సార్ధభాగా భవేద్వేదీ ఘంటాకలశ మూర్ధత్వః।
సప్తాంగాః సప్త భూమాశ్చ మాల్యవాన్ మలయ స్తథా॥ 40

తా॥ చతురశ్ర ప్రదేశమును 15 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, రథము ప్రతిరథము $1\frac{1}{2}$-$1\frac{1}{2}$ భాగములు, భద్రము 5 భాగములు, మఱియు రథము ప్రతిరథము భద్రము. వీని యొక్క నిర్గమములు 1-1 భాగములు చొప్పున రచించవలెను. దీనిని మాల్యవంతమందురు. కర్ణము మామూలుగానే యుంచి రథము $1\frac{1}{4}$ భాగమును, ప్రతిరథమును $1\frac{1}{2}$ భాగమునుచేసి శాల

యెప్పటివలెనే రచించినచో మలయమగును. సూర్యసేన 3 భాగములు, రెండవ అంతస్తు $2\frac{3}{4}$ భాగములు, మూడవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములు, నాల్గవ అంతస్తు $2\frac{1}{4}$ భాగములు, ఐదవ అంతస్తు 2 భాగములు, ఆఱవ అంతస్తు $1\frac{3}{4}$ భాగములు, ఏడవ అంతస్తు $1\frac{?}{?}$ భాగ రచించవలెను. ఆపైన వేదిక $1\frac{1}{2}$ భాగములు, మును, ఘంట కలశమును రచించవలెను అన్ని పద్ధతులును రెంటికి సమానముగనే యుండును.

## 115. మాల్యవంతము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథమాల్యవతోలక్ష్మ యథావదభిధీయతే॥ 37
భజేదర్ధయుతైః పంచ దశభిశ్చతురశ్రకమ్।
కర్ణా ద్విభాగికాః కార్యాః శాలా పంచాంశ విస్తృతా॥ 38
కర్ణాభ్యర్ణేఽంశ యుగలం పాదోనం స్యుః ప్రతిరథాః।
శాలాయాః పార్శ్వయోః కార్యా పంజరా సార్ధభాగికా॥ 39
పృథక్ పంజరశాలాయా నిర్గమశ్చార్ధ భాగికా।
శాలాయాః పల్లవీయాస్యా న్నిర్గమశ్చార్ధ భాగికః॥ 40
సార్ధ పంచదశోక్తాయే భాగాస్తాన్ దశభిర్భజేత్।
గర్భోఽథభిత్తి విస్తార స్తథా ఖురవరండికా॥ 41
జంఘాధః క్షితిరాద్యాచ రేఖోచ్ఛ్రాయశ్చ పూర్వవత్।
ప్రథమా భూమికా భాజ్యం పాదహీనాష్టభి యుక్తయా॥ 42
పంచభాగ సముత్సేధా ద్వితీయా భూమికా భవేత్॥
పదపాద విహీనాః స్యుస్త్రిస్రోఽన్యా భూమయః క్రమాత్॥ 43
సార్ధాంశో వేదికోచ్ఛ్రాయః కర్తవ్యో వాస్తువేదిభిః।
సకంధస్య విస్తృతీ రేఖా ఘంటాచ కలశ స్తథా॥ 44
శాలాయాం సూరసేనాశ్చ స్తంభ కూటాది కల్పనా।
శుక నాసోచ్ఛ్రితిశ్చైతి సర్వాణ్యే తాని పూర్వవత్॥ 45

ఇత్యేవం మాల్యవాన్ నామ ప్రాసాదః పరికీర్తితః।
య ఏనం కారయే త్తస్య జాయంతే సర్వసిద్ధయః॥ 46
శివలోకే నివాసోఽస్య భవేత్ కల్పాయురవ్యయమ్॥

తా॥ చతురశ్ర ప్రదేశమును $15\frac{1}{2}$ భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, శాల 5 భాగములు, ప్రతిరథము $1\frac{3}{4}$ భాగము, శాలకు రెండువైపుల పంజరములు $1\frac{1}{2}$ భాగము, చొప్పునను, ఆ పంజరములకును శాలకును నిర్గమము $\frac{1}{2}$ భాగము, పై జెప్పిన $15\frac{1}{2}$ భాగముల ప్రదేశమును 10 భాగములుచేసి అందు గర్భము 6 భాగములు చుట్టును గోడ 2 భాగములు చేయవలెను. ఖురకము, వరండిక, జంఘయొక్క దిగువను పైన రేఖయొక్క యెత్తును, పూర్వమువలెనే చేయవలెను. మొదటి అంతస్తు $7\frac{3}{4}$ భాగములును, రెండవ అంతస్తు 5 భాగములును, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములును, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములును, ఐదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములును, వేదిక $1\frac{1}{2}$ భాగమును, స్కంధముయొక్క విస్తారమును, రేఖయును, ఘంట, కలశము, శాల, స్తంభములు, కూటములు ఇవి యన్నియును సూరసేన పద్ధతితో రచించవలెను. శుకనాసను మునుపటివలెనే రచించవలెను. దీనిని మాల్యవంతమందురు. ఇట్లు రచించినవారు శివలోకమున నొక కల్పము వసించుదురు. ఇహలోకమున నన్ని కోరికలు సిద్ధించును.

(అనుబంధము 56వ పటము చూడుడు)

## 116. నవమాలిక - పృథివీ జయము

అపరాజిత 171వ సూ.

శ్లో॥ క్షేత్రేఽష్టా దశధాభక్తే శద్ధచ్ఛందేన వాంగకాః।
కర్ణో ద్విభాగో విస్తారే శేషావాపాదప్రాసితాః॥ 41
కర్ణే రథే ప్రతిరథే బాలపంజర భద్రకమ్।
పంచభాగం భవేద్భద్రం భాగః స్యాజ్జలనిర్గమః॥ 42

నవమాలిక ఆఖ్యాతః పృథ్వీజయమతః శృణు।
సార్ధభాగః ప్రతిరథో భద్రం వై సార్ధ పంచకమ్॥ 43
కృత్వా పంచదశోత్సేధ మష్టాదశ విభాజితమ్।
త్రిభాగాచోచ్ఛ్రితా భూమిః శేషాః పాదే న్యహ్రాసితాః॥ 44
ఊర్ధ్వవేదీ భవేద్భాగా ఘంటా పూర్వం ప్రకల్పితా।
నవాంగా నవభూమాశ్చ ప్రాసాదా భూమిజా మతాః 45

తా॥ చతురశ్ర ప్రదేశమును 18 భాగములుచేసి అందుకర్ణము 2 భాగములు,రథము $1\frac{3}{4}$ భాగములు, ప్రతిరథము $1\frac{3}{4}$ భాగములు శాల 5 భాగములు బాలపంజరములతో కూడ జలనిర్గమము 1-1 భాగము, ఇట్లు చేసిరేని నవమాలిక యగును.మఱియు ప్రతిరథములను $1\frac{1}{2}$-$1\frac{1}{2}$ భాగముల చొప్పునను శాలను $5\frac{1}{2}$ భాగముల విస్తారముతోను రచించి మఱియు 18 భాగముల యెత్తును మరల 15 భాగముములుగాజేసి మొదటి అంతస్తును 3 భాగములు, రెండవ అంతస్తును $2\frac{3}{4}$ భాగములు, మూడవ అంతస్తును $2\frac{1}{2}$ భాగములు, నాల్గవ అంతస్తును $2\frac{1}{4}$ భాగములు, ఐదవ అంతస్తును 2 భాగములు ఇట్లు చేసి పైన వేదిక 1 భాగము-మిగిలినది ఘంట కలశము రచించవలెను. దీనిని పృథివీజయ మందురు.

## 117. కుముదము మొదలగు 7 (వృత్తజాతి)

అపరాజిత 171వ సూ.

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే ప్రాసాదా వృత్తజాతయః।
పంచమాంశే భవేద్భిత్తిః కర్ణాంతే వృత్తమాలిఖేత్॥ 46
అష్టా వింశత్యంశ పరిధౌ భద్రం పంచభాగికమ్।
ద్విపదశ్చ భవేత్కర్ణ స్త్రి భూమః కుముదో భవేత్॥ 47
కర్ణాశ్చాష్టదలాః కార్యాః భద్రా రేఖై రలంకృతాః।
ఊర్ధ్వే ఘంటా కలశయుక్ కుముదః సర్వకామదః॥ 48

షట్ త్రింశద్భక్త పరిధౌ భద్రాంతర్ద్వి ద్వికర్ణికాః।
చతుర్భూమశ్చకమలో ఘంటా కలశకోన్నతః॥ 49
కర్ణాశ్చాష్టదలా కారాః కర్తవ్యా స్సుమనో రమాః।
ఏవం విధః ప్రకర్తవ్యః కమలోనామ శోభనః॥ 50
కమలోద్భవ క్షేత్రంతు చతుర్దశ భాజితమ్।
ద్విభాగః కర్ణవిస్తారో భద్రం షడ్భాగికం తథా॥ 51
కర్ణతుల్యః ప్రతిరథో వికర్ణేచాపి సంస్థితః।
పంచభూమ్యుచ్ఛ్రితం కుర్యాత్ ఘంటా కలశభూషితమ్॥ 52
పంచమాంశే భవేద్భిత్తిః శేషః గర్భగృహం భవేత్।
ఏవం విధః ప్రకర్తవ్యో నామ్నా సౌకమలోద్భవః॥ 53
శతశృంగ మథోవక్ష్యే ప్రాసాదం సర్వకామదం।
వల్లభం సర్వదేవానాం శివస్యాపి విశేషతః॥ 54
వేదాశ్రే భిత్తి భాగశ్చ వింశతిస్త్వేక వర్జితా।
పంచభాగం భవేద్భద్రం ద్విభాగః కర్ణ విస్తరః॥ 55
భద్రకర్ణకయోర్మధ్యే ద్వౌద్వౌ ప్రత్యంగ కౌస్మృతౌ।
పంచమాంశే భవేద్భిత్తిః శేషం గర్భ గృహం భవేత్॥ 56
సప్తభూమ సముత్సేధో ఘంటా కలశ భూషితః।
కర్ణాశ్చాష్ట దలాః కార్యాః ప్రత్యంగం వర్ధమానవత్॥ 57
అర్జున ఫలసంయుక్తా బాలపంజరి కామతా।
ఏవం విధం ప్రకర్తవ్య శతశృంగస్య లక్షణమ్॥ 58

తా॥ చతురశ్ర ప్రదేశమును మూలల వఱకు వృత్తరేఖను లిఖించవలెను. దానిని 5 భాగములుచేసి మధ్య 3 భాగములు గర్భమును చుట్టూ 1 భాగము గోడయును రచించవలెను. ఆ వలయమును 28 భాగములుచేసి భద్రము 5 భాగములును, కర్ణము 2 భాగములును చేసి దానిని మూడు అంతస్తులుగ రచించవలెను. మఱియు పై జెప్పిన పద్ధతిలోనే కర్ణములను 8 దలములుగాచేసి భద్రములను రేఖలతో నలంకారముగజేసి ఆపైన ఘంట, కలశమును రచించిన యెడల కుముదమగును. పై జెప్పిన పరిధిని 36 భాగములుచేసి

భద్రముల సందున 2-2 కర్ణములను రచించి నాలుగు అంతస్తుల తోను, ఘంట కలశము ఇవి యెత్తుగాను, కర్ణములు 8 దలములు గాను, చక్కగా రచించినచో కమలమగును - పై జెప్పిన వలయ మును ఒక్కొక్కదిశను 14 భాగములుచేసి అందు భద్రము 6 భాగ ములును, కర్ణము 2 భాగములును, కర్ణముతో సమానముగా ప్రతి రథము 2 భాగములును, చేసి యిట్లు వికర్ణములను కల్పించి, 5 అంత స్తులతోను పైన ఘంట, కలశము రచించవలెను. 6విస్తారమును 5 భాగములుచేసి అందు మధ్య 3 భాగములు గర్భమును చుట్టూ 1 భాగము గోడయును రచించవలెను. దీనిని కమలోద్భవమందురు.

నలుచదరమును ఒక్కొక్క దిశను 19 భాగములుచేసి అందు భద్రము 5భాగములు, కర్ణము 2 భాగములు, భద్రకర్ణముల మధ్య 2-2 ప్రత్యంగములు, కర్ణముతో సమానముగా రచించవలెను. విస్తారమును 5 భాగములుచేసి అందు గర్భము 3 భాగములును చుట్టూ గోడ 1 భాగమును చేయవలెను. దీనిని 7 అంతస్తులుగా రచించవలెను. ఘంట, కలము రచించవలెను. కర్ణములు 8 దలము లతో రచించవలెను. ప్రత్యంగములను వర్ధమానమువలె రచించ వలెను. తెల్లమద్దికాయలవలె బాలపంజరములను రచించవలెను. ఇట్లు చేసిరేని అది శతశృంగమనిపించుకొనును. సమస్తదేవతలకు ప్రియమైనది. శివునకు ముఖ్యమైనది, దీనివలన సమస్తమైన కోరి కలు సిద్ధించును.

శ్లో॥ అర్జున ఫలసంయుక్తా బాలవంజరి కామతా।
ఏవం విధం ప్రకర్తవ్యం శతృశృంగస్య లక్షణమ్॥ 58
విభక్తం పంచవింశత్యా వక్ష్యే సర్వాంగసుందరమ్।
యథా భద్రం తథా కర్ణః ప్రభద్రం శతశృంగవత్॥ 59
భద్రకర్ణకయోర్మధ్యే త్రిత్రి ప్రత్యంగకం తథా।
కర్ణాశ్చాష్ట దలాః ప్రోక్తాః ప్రత్యంగం వర్ధమానవత్॥ 60
అగ్రేఽర్జున ఫలైస్తుల్యం తదగ్రే భద్రకం భవేత్।
పంచమాంశయుతా భిత్తిః శేషం గర్భగృహం భవేత్॥ 61

నవభూమి సమాయుక్తం కుర్యాత్సర్వాంగ సుందరమ్।
అష్ట చత్వారింశదంశై ర్భక్తే భద్రం యుగాంశకమ్॥ 62
వేదా వేదా భద్ర మధ్యే కర్ణాః కార్యా ద్విపాదకాః।
భద్రాంతే వర్ధమానాశ్చ హ్యష్టాంశా యుగ్మతః స్థితాః॥ 63
షడ్భూమికోచ్ఛ్రితః కార్యః కిరణః సర్వకామదః।
సప్తకర్ణం రథ యుగ్మం కమలః పూర్వవత్ స్థితః॥ 64
ఉచ్ఛ్రయే కిరణచ్ఛందో నీరవద్యః కలాధికః।
నిరవద్యస్య పరిధౌ చతుష్షష్ట్యా విభాజితే॥ 65
చతుష్పదాని భద్రాణి కర్ణా ద్విపద విస్తరాః।
షట్ షట్ కార్యా భద్ర మధ్యే హ్యష్ట భూమి సముచ్ఛ్రితిః॥66
ద్వాద్వావష్ట దలాః కార్యా వర్ధమాన ద్వికద్వికమ్।
ద్వాద్వాభద్రక యుక్తాశ్చ కర్తవ్యాః సర్వకామదాః॥ 67
ఘంటా కలశ శస్తాశ్చ శాంతిదాశ్చ పురః పతేః।
ఇతి మానం సముద్దిష్టం వృత్తానాం భూమిజేషు చ॥ 68

తా॥ ఒక్కొక్క దిశను 25 భాగములుచేసి శతశృంగమున జేసినట్లే భద్రమును కర్ణమును ప్రభద్రమును రచించి ఆ భద్రకర్ణముల మధ్య 3-3 ప్రత్యంగములను రచించవలెను. కర్ణము 8 దలములతోను, ప్రత్యంగము వర్ధమానమువలె చివర మద్దికాయవంటి శిఖరముతోను ఉండవలెను. ఆపైన భద్రమును రచించవలెను. మఱియు విస్తారమును 5 భాగములుచేసి అందు గర్భము 3 భాగములును చుట్టూ గోడ 1 భాగమునను చేయవలెను. 9 అంతస్తులతో రచింపబడెనేని సర్వాంగసుందరమగును. చుట్టుకొలత మొత్తము 48 భాగములుచేసి అందు శాల 4 భాగముల చొప్పునను, ఆ శాలల మధ్య 2-2 భాగముల చొప్పున 4 కర్ణములును, భద్రములపై వర్ధమానములు 8 భాగములును, 6 అంతస్తుల పైన శిఖరమును రచించినచో దీనికి కిరణప్రాసాదమను—

కర్ణములను తగ్గించి రెండు రెండు రథములనుంచి పూర్వము చెప్పబడినకమలప్రాసాదమువలెనేచేసి యెత్తు మాత్రము కిరణప్రాసాదము కంటె 2 భాగము లధికముచేసిన యెడల నిరవద్యమగును. మఱియు దీనియొక్క వలయమును 64 భాగములుచేసి అందు భద్రము 4 భాగములు చొప్పున నలువైపుల రచించి రెండు భద్రములసందున 2-2 భాగముల చొప్పున 6 కర్ణములను రచించవలెను. 8 అంతస్తులును పైన శిఖరము ఘంటవలెను. దానిపైన కలశమును రచించవలెను. కర్ణములు అష్టదలములతో రెండును, వర్ధమానమువలె రెండును, భద్రములతో రెండును, ఇట్లు మూడు విధములుగా నుండవలెను. దీనిని నిరవద్యమని చెప్పుదురు. ఇట్లు గుండ్రని రూపముగల 7 ప్రాసాదములు చెప్పబడినవి—

## 118. కుముధము మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీ మభిధీయంతే ప్రాసాదవృత్త జాతయః॥ 59
వల్లభాః సర్వదేవానాం భూమిజాః పురభూషణమ్।
ఆశ్రయః శ్రేయసామేకో యశసామ పిరాశయః॥ 60
భుక్తి ముక్తి ప్రదాతారః సమాగత కృతా నృణామ్।
తత్రాద్యః కుముదో నామ కమలః కమలోద్భవః॥ 61
కిరణః శతశృంగశ్చ నిరవద్య స్తథా పరః।
సర్వాంగ సుందరశ్చేతి ప్రాసాదా వృత్తజాతయః॥ 62
నపిస్తారాన్న సంక్షేపా ల్లక్ష్మైషా మథకీర్త్యతే।
తత్రాద్యః కుముదోనామ సర్వానంద కృదుచ్యతే॥ 63
చతురశ్రీ కృతే క్షేత్రే విస్తారాయా మతః సమే।
విభక్తే దశభిర్భాగై ర్భవేద్గర్భస్తు షట్పదః॥ 64
తత్ర శేషేణ కుర్వీత భిత్తయశ్చ చతుష్టయమ్।
తతః కర్ణసూత్రేణ తత్ర వృత్తం సమా లిఖేత్॥ 65

దిగ్విదిగ్వృత్త కర్ణాః స్యుః సలిలాంతర భూషితాః।
సమంతా ద్భూమిపర్యంతం దశభిః స్యాదయం పదైః॥ 66
వేదీబంధో విధాతవ్యః సార్ధాంశస్య పదద్వయమ్।
తత్సార్ధ ద్విపదంసార్ధ చతుర్భి ర్విభజేత్పదైః॥ 67
కుంభకం ద్విపదం కుర్యాత్ తథా కలశమ శకమ్।
భాగార్ధేనాంతరం పత్రం కపోతాలీ చ భాగికా॥ 68
వేదీబంధోఽయ మిత్యుక్తో జంఘోత్సేధ మిహోచ్యతే।
స్యాదర్ధ పంచమైర్భాగైః సోచ్ఛాల స్తల కుంభకః॥ 69
ఆద్యభూమౌ భవేత్కూటం భాగత్రితయ లక్షితమ్।
ప్రాసాదే పంచదశభి ర్విభజేత సముచ్ఛ్రయమ్॥ 70
ద్వితీయా భూమికా తత్ర కార్యా పంచాంశ కోచ్ఛ్రితా।
అర్ధేనోచ్ఛాలక స్తంభైః కూటోచ్ఛ్రాయ స్తథోర్ధ్వతః॥ 71
పాదోనైః పంచభిర్భూమిం తృతీయాం పరికల్పయేత్।
చతుర్థీంరచయే ద్భాగైర్భూమికా మర్ధపంచమైః॥ 72
ద్వితీయా భూమికావత్ స్యాత్ కూట స్తంభాది కల్పనా
వేదీ భాగోచ్ఛ్రితా కార్యా పట్పదా స్కంధ విస్తృతిః॥ 73
షడ్గుణేన నచ సూత్రేణ వేణు కోశం సమాలిఖేత్।
ప్రాసాద పంచమాంశేన కార్యా ఘంటా సముచ్ఛ్రితిః॥ 74
ఘంటోత్సేధం తత స్తస్య త్రిభిర్భాగై ర్విభాజయేత్।
కంఠగ్రీవాం డకాన్యస్య భాగేనైకే నకారయేత్॥ 75
షడ్భాగ భక్త ఘంటాయాః సమంతాద్భాగ విచ్యుతేః।
భాగైశ్చతుర్భిః కర్తవ్యే ఘంటే కంఠస్య విస్తరమ్॥ 76
ఘంటోత్సేధార్ధతః కుర్యాద్ ఘంటార్ధే పద్మశీర్షకమ్।
ఘంటోత్సేధ సమా కుంభే బీజపూర సముచ్ఛ్రితిః॥ 77
చతురం శాంచితోచ్ఛ్రాయో విస్తారాత్ కలశః స్మృతః।
య ఇమంకారయేత్ ప్రీత్యా ప్రాసాదం కుముదాభిధమ్॥ 78

సమోదతేజ గర్భర్తుః శివస్య భవనే శుభే॥

తా॥ భూమిజా ప్రాసాదములలో గుండ్రముగా నుండెడి దేవాలయములు కుముదము, కమలము, కమలోద్భవము, కిరణము, శతశృంగము, నిరవద్యము, సర్వాంగసుందరము, అని 7 విధములు కలవు. అందు మొదటిదియైన కుముదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి అందు గర్భము 6 భాగములును, చుట్టూ గోడ 2 భాగములును చేయవలెను. మధ్యనుండి కర్ణసూత్రముతో గుండ్రముగా గీయవలెను. నాలుగుదిశలయందును నాలుగుమూలలయందును 8 కర్ణములు జలమార్గముతో గూడ రచించవలెను. ఇట్లు పైవఱకు 10 భాగములతోనే చేయవలెను. వేదీబంధమును $2\frac{1}{2}$ భాగములు చేయవలెను. దానిని $4\frac{1}{2}$ భాగములుగాచేసి అందు కుంభకము 2 భాగములు, కలశము 1 భాగము, అంతరపత్రము $\frac{1}{2}$ భాగము, కపోతముల వరుస 1 భాగము ఇట్లు వేదిబంధమును చేయవలెను. జంఘ $2\frac{1}{2}$ భాగములు కుంభకము ఉచ్ఛాలము మొదలైన వానితో సహా. మొదటి అంతస్తున కూటము 3 భాగముల యెత్తు ప్రాసాదము యొక్క యెత్తు 15 భాగములు.

రెండవ అంతస్తు 5 భాగములు, అందులో సగము ఉచ్ఛాలక స్తంభముల యెత్తు ఆపైనకూటము, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తును $2\frac{1}{2}$ భాగములుచేసి రెండవ అంతస్తున రచించినట్లు స్తంభములను, ఆపైన కూటము చేయవలెను. వేదిక 1 భాగము, స్కంధము యొక్క విస్తారము 6 భాగములు, ఆఱురెట్లుగల సూత్రముతో వేణుకోశమును లిఖించవలెను. ప్రాసములో 5వ భాగము ఘంట యెత్తును చేయవలెను. ఆ ఘంట యొక్క యెత్తును 3 భాగములుచేసి కంఠము గ్రీవ అండకము 1-1 భాగము చేయవలెను. ఘంటను 6 భాగములుచేసి అందు 4 భాగములు కంఠముయొక్క విస్తారము, ఘంట యెత్తులో సగము ఘంటలో

సగము పద్మశీర్షమును చేయవలెను. ఘంటయొక్క యెత్తు సమానముగా కుంభమున బీజపూరముయొక్క యెత్తు కల యొక్క చుట్టుకొలతలో నాల్గవవంతు దానియెత్తును చేయవ ఇట్లు రచించిరేని కుముదప్రాసాదమగును లోకనాథుడగు శివ సంతోషకరమైనది యని తెలియవలెను.

## 119. కమలము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదం కమలాభిధం॥
చతురశ్రీ కృతే క్షేత్రే దశవిభాగః భాజితే।
తతః కర్ణార్ధ సూత్రేణ వృత్తం తత్ర సమాలిఖేత్॥
విస్తీర్ణం పంచభిర్భాగైః కుర్యాద్ భద్ర చతుష్టయమ్।
సురేంద్ర యమతోయేశ కుబేరాశాస్వను క్రమాత్॥
భవేత్పల్ల వికాయాస్తు విస్తారో భాగ పాదికః।
భాగేన కార్యా భద్రాణాం నిర్గమావృత్త బాహ్యతః॥
శాలాయః ప్రతిభద్రంస్యాత్ కర్ణికార్ధేన నిర్గతమ్॥
పాదోన భాగత్రితయాత్ కార్యావృత్తస్య విస్తృతిః॥
ద్విభాగ విస్తరాయామా రథకద్వయ మధ్యగా।
పరివర్తన యాకార్యా ద్వ్యాకోణౌసోదకాంతరా॥
పూర్వప్రసాదవద్గర్భో విధేయోభిత్తయోఽపి చ।
వేదీ బంధాది కుంభాంతం సర్వమేతస్య పూర్వవత్॥
ద్వితీయ భూమిపర్యంత మూర్ధ్వం ప్రథమ భూమితః।
శూరసేనం విధాతవ్యం శాలాసుశ్లిష్ట ముత్తమమ్॥
కూటస్తంభాది కన్యాస్యాః కోణప్రతిరథాదిషుః।
శాలాః స్యాన్నాగరాః సర్వాః పంచాంశం ద్వ్యంశకోపరి
శిఖరస్య త్రిభాగోనా శుకాగ్రాయాః సముచ్ఛ్రితిః।

యఏనం కమలం నామ ప్రాసాదం కారయేన్నృపః 88
త్రైలోక్యే కమలాధీశ విజయీస భవేన్నృపః॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి దానిని అర్ధకర్ణసూత్రముతో గుండ్రముగా గీయవలెను. భద్రముయొక్క విస్తారము 5 భాగములుచేసి తూర్పు దక్షిణము, పడమర, ఉత్తరము ఈ నలువైపుల భద్రములను రచించవలెను. వానియొక్క శిఖరములను $\frac{1}{4}$ భాగము చేయవలెను. వలయముయొక్క వెలుపలకు 1 భాగము భద్రముల నిర్గమములను రచించవలెను. భద్రము యొక్క ప్రతిభద్రమును కర్ణికలో సగము నిర్గమము చేయవలెను. గుండ్రము యొక్క విస్తారము $2\frac{3}{4}$ భాగము లుండవలెను. 2 భాగముల నలుచదరముతో జలమార్గ సహితముగా రెండు రథములను రచించవలెను. అవి ఒకటే పద్ధతి కాకుండా మార్పుగా నుండవలెను. కుముదమువలెనే దీనికిగూడ గర్భమును గోడను రచించవలెను. వేదీ బంధము మొదలు కుంభము వఱకు అన్నియును పూర్వమువలెనే చేయవలెను. మొదటి అంతస్తునుండి రెండవ అంతస్తు వఱకు శూరసేన పద్ధతిగా రచించవలెను. శాలలుగూడ చక్కగానుండవలెను. కర్ణములయందును ప్రతిరథములయందును స్తంభములును కూటములను రచించవలెను. శాలలు నాగరపద్ధతితో రచించవలెను. ఆలయము యొక్క యెత్తును 5 భాగములుచేసి ప్రస్తరము వఱకు 2 భాగములును, పైన శిఖరము 3 భాగములును చేయవలెను. శిఖరములో 3వ భాగమున శుకనాసను రచించవలెను. దీనిని కమలప్రాసాదమందురు. దీనిని రచించినచో విష్ణుసమానుడై విజయమును బొందును.

## 120. కమలోద్భవము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథాతః కథ్యతే సమ్యక్ ప్రాసాదః కమలోద్భవః॥ 89

సదాలక్ష్మీ పతిర్యత్ర దేవోవిశ్రామ్యతి స్వయమ్।
చతురశ్రీ కృతే క్షేత్రే చతుర్దశభిరంశితే॥ 90
... స్త్రారో భద్రం పంచపదం భవేత్।
ద్విభాగాయాను విస్తారాః కార్యాః ప్రతిరథా స్తథా॥ 91
కోణ ... ... ...।
కార్యః పల్లవికాయాశ్చ నిర్గమోవృత్త మధ్యతః॥ 92
శాలా విభక్తిశ్చైతస్య కర్తవ్య ...।
శాలా కోణ ప్రతిరథాం తరేషు స్యాజ్జలాంతరమ్॥ 93
ద్వ్యంగుల త్ర్యంగులం వాపి తద్విధేయం విపశ్చితా భాగా...।
... ... కల్పయేత్॥ 94
ప్రాసాదస్యాస్య విస్తారం భాజయేద్దశభిః పదైః।
గర్భశ్చ పూర్వవత్ కార్యః పూర్వవద్భిత్తయోఽపి చ॥ 95
ప్రాగ్వత్ ఖురవరండీ స్యా జ్జంఘా కూటాద్య భూమికాః।
శిఖరస్యోచ్ఛ్రితిః ప్రాగ్వత్ తాంసార్ధైకా ను వింశతిమ్॥ 96
భాగాన్ కుర్యాత్తతః కార్యా భూర్ద్వితీయాంశ పంచకమ్।
కార్యాస్త్రిస్రో భువః శేషాః పాదపాద పరిచ్యుతాః॥ 97
భాగం వేదీ భూప్రవేశః కార్యో రేఖావశాదితః।
పూర్వవచ్చాథ విస్తారః స్యాద్ ఘంటా కలశాదివా॥ 98
కూట స్తంభాదికం ప్రాగ్వచ్ఛుకనాసోచ్ఛ్రయోఽపి చ।
య ఇమం కారయేత్ కాంతం ప్రాసాదం కమలోద్భవమ్ ॥99
స సమస్త జగన్నాథః ప్రతిజన్మ ప్రజాయతే॥

తా॥ లక్ష్మీపతి యెల్లప్పుడు నివసించునట్టి కమలోద్భవమను ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును పూర్వమువలెనే గుండ్రముగా గీయవలెను. ఒక్కొక్కదిశను 14 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, శాల 5 భాగములు, ప్రతిరథము 2 భాగములు, కమలప్రాసాదమున రచించినట్లు రచించి

మధ్య శిఖరమును నిర్మించవలెను. శాలయొక్క విభాగములు శాల, కర్ణము, ప్రతిరథము, వీని సందులలో 2 లేక 3 అంగులముల జల మార్గమును కల్పించవలెను.

ప్రాసాదము యొక్క విస్తారమును 10 భాగములుచేసి పూర్వము వలెనే గర్భము 6 భాగములును చుట్టూ గోడ 2 భాగములును చేయవలెను. ఖురము, వరండిక, జంఘ, కూటము, ప్రస్తరము, శిఖరము అన్నియును కమలప్రాసాదమువలెనే చేయవలెను. శిఖరము మొత్తును $21\frac{1}{2}$ భాగములుచేసి రెండవ అంతస్తు 5 భాగములును మిగిలిన 3 అంతస్తులును ఒక్కొక్క పాతికవంతు క్రమముగా తగ్గించుచు రచించవలెను. వేదిక 1 భాగము రేఖ ననుసరించి దాని ప్రదేశమును కల్పించవలెను. విస్తారముకూడ పూర్వమువలెనే చేయవలెను. ఘంట, కలశము, కూటము, స్తంభము, శుకనాస ఇవి యన్నియు మునుపటివలెనే రచించవలెను. ఇది కమలోద్భవ ప్రాసాదము దీనిని రచించిన వారుత్తరజన్మమున సమస్తలోకముల కధిపతు లగుదురు.

## 121. కిరణ ప్రాసాదము - మఱియొక పద్ధతి

అపరాజిత 65వ సూ.

శ్లో॥ లక్షణం కిరణస్యాథ బ్రూమః సమ్యక్ క్రమాగతమ్॥ 100
చతురశ్రీకృతే క్షేత్రే భక్తే పంచదశాంశకైః।
తద్వత్ పంచదశాంశాయే తాన్ భజేద్దశభః పునః॥ 101
గర్భోఽత్ర పూర్వవత్ కార్యః పూర్వవత్ భిత్తయోఽపి చ,
ప్రాగ్వత్ ఖురవరండీ స్యా జ్జంఘా కూటోచ్ఛ్రితి స్తథా॥ 102
పూర్వవచ్ఛిఖరోత్సేధ స్తంభజేత్పాదహీనయా।
చతురుత్తర వింశత్యా భాగానాం తత్ర భూమికా॥ 103
ద్వితీయా పంచభిర్భాగై శ్చ తత్ర స్త్వపరాః పునః।
పాదోన పదహీనాః స్యుః క్రమశశ్చాస్య భూమికాః, 104

వేదికాచాస్య కర్తవ్యా సపాదాంశ సముచ్ఛ్రితా।
శుకనాసోచ్ఛ్రితిః శాలా స్తంభకూట విభక్తయః॥ 105
రేఖా స్తంభస్య విస్తారో ఘంటా కుంభాది పూర్వవత్।
కూటా ద్రావిడకాః కార్యాః ప్రతిభూమ్యథ భూమిజే॥ 106
హారో హిరణ్యగర్భశ్చ హరిర్దినకర స్తథా।
ఏషామేవ విధేయోఽసౌ నాన్యేషాంతు కదాచన॥ 107
అముం యః కారయేద్రాజా ప్రాసాదం కిరణాభిధం।
సద్యః సహ ప్రతాపః స్యాత్ సహస్రకరవద్భువి॥ 108

తా॥ చతురశ్ర ప్రదేశమును 15 భాగములుచేసి, దానిని గుండ్రముగా గీయవలెను. అందు శాల 5 భాగములు, కర్ణము 2 భాగములు ప్రతిరథము 2 భాగములుచేసి మిగిలిన దానిని జల మార్గములు చేయవలెను. మొదట జెప్పిన 15 భాగములుగల విస్తారమును 10 భాగములుచేసి అందు గర్భము 6 భాగములును చుట్టూ గోడ 2 భాగములును చేయవలెను. ఖురము, వరండిక, జంఘ, కూటము. ఇవియన్నియును కమలోద్భవమువలెనే చేయవలయును— శిఖరముయొక్క యెత్తును $23\frac{3}{4}$ భాగములు చేయవలెను. అందు 2వ అంతస్తు 5 భాగములు, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములు, ఆఱవ అంతస్తు 4 భాగములు, వేదిక $1\frac{1}{4}$ భాగములు చేయవలెను. శుకనాసము యొక్క యెత్తును, శాల, కూటము, స్తంభము, మొదలగు భాగములును, శిఖరము యొక్కయు స్తంభముల యొక్కయు విస్తారములును, ఘంట, కుంభము ఇవి యన్నియును కమలోద్భవమున జేసినట్లే చేయవలెను. అయితే కూటములను ద్రావిడపద్ధతితో జేయవలెను. ఇట్లు అన్ని అంతస్తుల యందును రచించవలెను. శివ, బ్రహ్మ, విష్ణు, సూర్యులకే యీ ప్రాసాదమును నిర్మించవలెను. ఇతర దేవతలకు దీని నెప్పుడును రచింపరాదు. ఇట్లు దీనిని రచించిన

వారు సూర్యునివలె ప్రతాపముగలవారై ప్రకాశింతురు. ఇది కిరణ ప్రాసాదము.

## 122. శతశృంగము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ కథ్యతే శతశృంగోఽథ ప్రాసాదః శుభలక్షణః।
వల్లభః సర్వదేవానాం శిరస్యాపి విశేషతః॥ 109
చతురశ్రీ కృతే క్షేత్రే వింశత్యే కోనయాంశితే।
కర్ణాధార సూత్రేణ తతో వృత్తమస్య ప్రకల్పయేత్॥ 110
కర్ణా ద్విభాగికాః కార్యాః శాలాస్యో త్పంచ భాగికా।
శాలా పల్లవికాచాస్య నిర్గతావృత్త మధ్యతః॥ 111
ద్వాద్వౌ ప్రతిరథౌ కార్యౌ ద్విభాగాయామ విస్తృతౌ।
పరంవర్తనతో వృత్త మధ్యతః కోణశాలయోః॥ 112
శాలా కోణ ప్రతిరథాం తరేషుస్యా జ్జలాంతరమ్।
ఏకోన వింశతిం భాగాం స్తాన్ భజేద్దశభిః పునః॥ 113
గర్భః ప్రాగ్వత్ తథా భిత్తిః ప్రాగ్వత్ ఖురవరండికా।
జంఘోత్సేధోఽథ భూత్సేధః పూర్వవచ్ఛిఖరోచ్ఛ్రితిః॥ 114
అథాది భూమేరారభ్య పట్ట్యంతం శిఖరోచ్ఛ్రితమ్।
భాగా నామష్టా వింశత్యా విభజేత్ పాదహీనయా॥ 115
ద్వితీయ భూమికా తస్య కార్యా పంచపదోచ్ఛ్రితా।
రేఖాస్తు పంచకర్తవ్యాః పదపాదోచ్ఛ్రితా భువః॥ 116
సార్థభాగోచ్ఛ్రితా వేదీ ప్రవిధేయాస్య తద్విదా।
శాలాస్య స్తంభ కూటాది భక్తయః శుకనాసికా॥ 117
రేఖాద్యం చాపి కుంభాంతం ప్రాగ్వత్ స్యాత్ సర్వసంపదః।
శతశృంగ మిమం కుర్యాద్ యః ప్రాసాదం మనోరమమ్॥ 118
తస్యైక వింశతి కులా ...
కర్తా కారయితా చేతి ద్వావేతాం జగతాం ప్రభోః॥ 119
త్రిపుర ద్వేషిణః స్యా తాం నియతం గణనాయకౌ॥

తా॥ సర్వదేవతా ప్రియమైనదియును శివున కధికప్రి
మైనదియునగు శతశృంగ ప్రాసాదలక్షణమును చెప్పుచున్నా
చతురశ్రప్రదేశమును 19 భాగములుచేసి దానిని కర్ణార్ధ సు
ముతో గుండ్రముగా గీయవలెను. కర్ణము 2 భాగములు,
5 భాగములు, శాల యొక్క శిఖరము వృత్త మధ్యనుండి ని
మును, ప్రతిరథము 2 భాగముల విస్తారము చొప్పున శాలకర్ణ
ఈ రెంటి మధ్య 2-2 రచించవలెను. ఆ ప్రతీరథములు ఒక
తీరున గాకుండా పని మార్పుగా చేయవలెను. దీని మధ్య
మార్గములను రచించవలెను. పై జెప్పిన 19 భాగములు గల ప్ర
మును మరల 10 భాగములుచేసి అందు గర్భము 6 భాగము
చుట్టూ గోడ 2 భాగములును చేయవలెను. ఖురము, వరండికి,
యెత్తు, అంతస్తు యెత్తు శిఖరము యెత్తు ఇట్లు అన్నియును కిరణప్ర
దము వలెనే రచించవలెను. దీనిని 7 అంతస్తులుగా రచించవ
ఎత్తు 27¾ భాగములు చేయవలెను. రెండవ అంతస్తు 5 భాగమ
మూడవ అంతస్తు 4¾ భాగములు, నాల్గవ అంతస్తు 4½ భాగమ
అయిదవ అంతస్తు 4¼ భాగములు, ఆఱవ అంతస్తు 4 భాగమ
ఏడవ అంతస్తు 3¾ భాగములు, ఆపైన వేదిక 1½ భాగము,
స్తంభము, కూటము మొదలగు భాగములును, శుకనాసికయ
విమానము మొదటినుండి కలశము వఱకు కిరణప్రాసాదము
రచించవలెను. దీనిని రచించిన వారియొక్క వంశము 21 తర
వారు పాపవిముక్తులగుటయేగాక చేయించినవారును చేసినవా
శివసన్నిధియందెల్లప్పుడు నివసింతురు. దీనిని శతశృంగమందుర

## 123. నిరవద్యము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ ప్రాసాదస్యాథ వక్ష్యామో నిరవద్యస్య లక్షణమ్॥
సప్తాజ్యేష్ఠోఽథ మధ్యశ్చ కనీయానితి చ త్రిధా।
చత్వారింశత్కరో జ్యేష్ఠో మధ్యః త్రింశత్కరో భవేత్॥

వింశత్యాచకరై రేష కనీయాన్ సముదాహృతః।
చతురశ్రీ కృతే క్షేత్రే వింశత్యా భాజితే పదైః॥ 122
తతః కర్ణార్ధ సూత్రేణ వృత్త మత్ర ప్రకల్పయేత్।
కార్యాస్తైః పంచభిః శాలా పల్లవీ వృత్త మధ్యతః॥ 123
శాలా విభక్తిః ప్రాగ్వత్ స్యా చ్ఛాలయోః కేతయోః పునః।
కోణే కోణేచ షట్కర్ణా ద్విభాగాయామ విస్తృతాః॥ 124
పరివర్తనయా కార్యా వృత్తాంతః సోదకాంతరాః।
తాన్ భాగాంస్తు పునర్భాగై ర్విభజేద్ దశభి స్తతః॥ 125
విముచ్యభూమికా భాగాన్ భేషం గర్భగృహాదియత్।
తత్పూర్వ వద్విధాతవ్యం తద్వచ్చ శిఖరోచ్ఛ్రితిః॥ 126
తామేక త్రింశతా భాగైః సార్ధైశ్చ విభజేత్ పునః।
ద్వితీయ భూమికా కార్యా పదైః పంచభి రుచ్ఛ్రితా॥ 127
పదపాదే నహీనాః స్యుః శేషాషట్ చాస్య భూమికాః।
వేదీ పదద్వయం కార్యా పాదోన మిహ శిల్పినా॥ 128
స్తంభ కూటాది శాలానాం విన్యాసః శూరసేనకాః।
శుకనాసోచ్ఛ్రితి ర్ఘంటా కలశాది చ పూర్వవత్॥ 129
య ఇమం నిరవద్యాఖ్యం ప్రాసాదం కారయేత్సుధీః।
సప్రాప్నోతి పరంస్థానం బ్రహ్మా దీనాం సుదుర్లభమ్॥ 130

తా॥ నిరవద్య ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. 40 హస్తముల విస్తారముకలది జ్యేష్ఠము, 30 హస్తములు కలది మధ్యమము 20 హస్తములు గలది అధమము ఇట్లు మూడు విధములు. ఆ విస్తారమును 20 భాగములు చేసి దానిని కర్ణార్ధ సూత్రముతో గుండ్రముగా గీయవలెను. అందు శాల 5 భాగములు, ఇట్లు నలువైపుల రచించవలెను. మధ్యశిఖరమును రచించవలెను. శాలలయొక్క రెంటి మధ్య 2 భాగముల విస్తారముగల కర్ణములు 6-6 నలుమూలల రచించవలెను. అందు 2-2 ఒక్కొక్క విధముగా నుండునట్లు మూడు భేదములు కలిగియుండవలెను. అన్నిటి సందు

నను జలమార్గములను రచించవలెను. పైజెప్పిన 20 భాగములుగల ప్రదేశమును 10 భాగములుగా జేసి మధ్యగర్భము 6 భాగములును చుట్టూ గోడ 2 భాగములును రచించవలెను. ఎత్తు $31\frac{1}{2}$ భాగములు చేసి పూర్వమువలెనే అంతస్తులు చేయవలెను. రెండవ అంతస్తు 5 భాగములు, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, అయిదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములు, ఆఱవ అంతస్తు 4 భాగములు, ఏడవ అంతస్తు $3\frac{3}{4}$ భాగములు, ఎనిమిదవ అంతస్తు $3\frac{1}{2}$ భాగము ఆపైన వేదిక $1\frac{3}{4}$ భాగములు చేయవలెను. స్తంభములు, కూటములు, శాలలు, వీనియొక్క విన్యాసము శూరసేనపద్ధతిలోను, శుకనాసము యెత్తును, ఘంట కలశము మొదలైనవియును పూర్వము వలెనే చేయవలెను. దీనిని నిరవద్యమందురు. ఇట్టి దానిని రచించిన వారికి అనన్యసాధ్యమైన పుణ్యపదము లభించును.

## 124. సర్వాంగసుందరము మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ సర్వాంగసుందరం బ్రూమః ప్రాసాద మథసుందరమ్।
భుక్తి ముక్తి ప్రదాతారం వర్తులాలయ మండనమ్॥ 131
చతురశ్రీ కృతే క్షేత్రే చతుర్వింశతి భాజితే।
కర్ణా ద్విభాగ విస్తారాః శాలాస్యా త్పంచ భాగికా॥ 132
వృత్తాంతః పల్లవీకార్యా శేషాః శాలా సు పూర్వవత్।
త్రయస్త్రయః ప్రతిరథ మధ్యే స్యుః కర్ణశాలయోః 133
పరివృత్త్యా వృత్తమధ్యే ద్విభాగాయామ విస్తృతాః।
శాలా కర్ణ ప్రతిరథ ప్రాంతేషు స్యా జ్జలాంతరమ్॥ 134
తాంశ్చతుర్వింశతిర్భాగాన్ విభజ్యాః శిల్పిభిః పునః।
విధేయం గర్భభిత్త్యాది ప్రాగ్వత్ స్యాచ్చ వరండికా॥ 135
జంఘాది భూమికోచ్ఛ్రాయః ప్రాగ్వద్వా శిఖరోచ్ఛ్రితిః।
తంపంచ త్రింశతాభాగై ర్విభజేచ్ఛిఖరోచ్ఛ్రయమ్॥ 136

ద్వితీయా భూమికా చాస్య కార్యా పంచపదోచ్ఛ్రితా।
పదపాద విహీనాః స్యుః శేషాః సప్తాస్య భూమికాః॥ 137

ద్విభాగో వేదికోచ్ఛ్రాయో భూమికానాం ప్రవేశనమ్।
రేఖావశేన కర్తవ్యం శేషమేతస్య యత్నతః॥ 138

తత్పూర్వవద్విధాతవ్యం స్తంభ కూటాదితద్విదా।
సర్వాంగసుందరం యోఽత్ర ప్రాసాదం కారయేదముమ్॥ 139

స స్వర్గసుందరీ భోగా నాప్నోతి విపులాన్ దివి॥

తా॥ గుండ్రముగా నుండెడి ప్రాసాదము లన్నిటిలో చక్కని దైన సర్వాంగసుందర ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పు చున్నాడు. చతురశ్ర ప్రదేశమును 24 భాగములుచేసి కర్ణార్ధ సూత్రముతో దానిని గుండ్రముగా గీయవలెను. కర్ణములు 2 భాగ ముల చొప్పునను, శాల 5 భాగములును, మధ్య శిఖరమును చేయ వలెను. శాల కర్ణము ఈ రెంటిమధ్య 2 భాగములుగల ప్రతిరథ ములు 3-3 రచించవలెను. శాల, కర్ణము, ప్రతిరథము, వీనియొక్క ప్రక్కల జలమార్గములను చేయవలెను. పై జెప్పిన 24 భాగములు గల ప్రదేశమును 10 భాగములుగా చేసి అందు మధ్య 6 భాగములు గర్భమును చుట్టూ 2 భాగములు గోడయును రచించవలెను. ఖురము, వరండిక, జంఘ, కూటము మొదలైనవి నిరవద్యప్రాసాదము వలెనే రచించి శిఖరము యెత్తు 35 భాగములుచేసి రెండవ అంతస్తు 5 భాగములు, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, అయిదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములు ఆఱవ అంతస్తు 4 భాగములు, ఏడవ అంతస్తు $3^{3}$ భాగములు, ఎనిమిదవ అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, తొమ్మిదవ అంతస్తు $3\frac{1}{4}$ భాగములు, వేదిక 2 భాగ ములు ఈ భూమికలయొక్క ప్రవేశనము రేఖ ననుసరించి యుండ వలెను. స్తంభములు కూటములు మొదలైనవి సమస్తము పూర్వము వలెనే చేయవలెను. ఈ ప్రాసాదమును రచించినవారు దివ్యలోక సుఖములను పొందుదురు.

## 125. స్వస్తికము - మొదలగు 8 (అష్టకోణ జాతి)

అపరాజిత 171వ సూ.

శ్లో॥ కర్ణాంత వృత్తం వేదాశ్రీ పరిధో ద్వినగాం శతః ।
భద్రాణి పంచపాదాని ఖ్యాతాని పూర్వచ్ఛందకే॥ 69
చతుష్పదో భవేత్కర్ణః పంచభూమి సముచ్ఛ్రితీః।
ఘంటా కలశ శోభాఢ్యః స్వస్తికో నామ నామతః॥ 70
భద్రకేషు చ కర్ణేషు వజ్రశృంగం నిధాపయేత్ ।
వజ్ర స్వస్తిక ఆఖ్యాతః శక్రాది సురవల్లభః॥ 71
వేదోత్త రశతాంశైశ్చ పరిధిం తత్ర కారయేత్ ।
సప్తభూమో హర్మ్యతలః కోణా కర్ణోఒష్ట భద్రకః॥ 72
హర్మ్యతలే శ్రీతిలకః స్వస్తికే వజ్రక స్తథా।
భాగతః పరిధౌభక్తే శతం షట్ త్రింశ దుత్తరమ్॥ 73
త్ర్యష్టకర్ణోఒష్ట భద్రశ్చ నవభూమి సముచ్ఛ్రితః ।
పృథివీ భూషణో వజ్రే వజ్ర స్వస్తిక పూర్వకే॥ 74
అన్యథా పృథ్వీభూషణం ఛందశ్చ్యోకో దయాచలమ్।
పూర్వం జ్ఞేయః స్వస్తికశ్చ భద్రం వై సప్తభాగికమ్॥ 75
కర్ణోద్గమో ద్విభాగః స్యాద్ ... భద్రేచ శృంగమేకైకం।
సభవేద్ గంధమాదనః త్రైలోక్య భూషణో నామ
ద్విద్విశృంగ సముద్భవః॥ 76

ఇతి సూత్రసంతాన గుణకీర్తి ప్రకాశ ప్రోక్త శ్రీభువన దేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం భూమిజ ప్రాసాద లక్షణాధికారో నామైక సప్తత్యుత్తర శతతమ్ సూత్రమ్—

తా॥ ఎనిమిది మూలలుగల ప్రాసాదముల యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. నలుచదరపు ప్రదేశమును కర్ణాంతము వఱకు వృత్తముగా గీయవలెను. పరిధియందు ఒక్కొక్క దిశ 14 భాగములుగాచేసి అందు భద్రము 5 భాగములు, కర్ణము 4 భాగ

ములుచేసి యిట్లు 5 అంతస్తులుగా రచించి ఆపైన ఘంట కలశము రచించి రేని స్వస్తిక ప్రాసాదమగును. దీని చుట్టు కొలత మొత్తము 112 భాగముల గును. పై జెప్పినభద్రముల యందును కర్ణములయందును వజ్రశృంగమును కల్పించినచో వజ్రస్వస్తిక ప్రాసాదమగును. మొత్తము 104 భాగములుచేసి భద్రము ఒకొ్కక్కటి 5 భాగముల చొప్పున8 రచించి కర్ణము ఒకొ్కక్కటి 4 భాగముల చొప్పున 16 రచించి యిట్లు 7 అంతస్తులుచేసిన యెడల హర్మ్యతలమగును. మఱియు స్వస్తికమున వజ్రశృంగములను రచించినట్లు హర్మ్యతలమున రచించిన యెడల శ్రీతిలకమగును - మొత్తము 136 భాగములు చేసి భద్రము 5 భాగముల చొప్పున 8యును కర్ణము 4 భాగముల చొప్పున 24 కర్ణములును 9 అంతస్తులును కల్పించి రేని పృథివీ భూషణమగును - పై జెప్పిన పృథివీభూషణమున వజ్ర శృంగములను రచించిన యెడల ఉదయాచలమగును - చుట్టుకొలతను 128 భాగములుచేసి అందు ఒకొ్కక్క వైపున శాల 7 భాగములును కర్ణములు 4-4 భాగములుచేసి కర్ణముల యెత్తు 2 భాగములును, భద్రమున శృంగము ఒక్కటియే రచించిన యెడల గంధమాదనమగును - గంధమాదన ప్రాసాదమున భద్రములకు 2-2 శృంగములను రచించిన యెడల త్రైలోక్య భూషణమగును.

## 126. స్వస్తికము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథాష్టౌ ప్రోక్తాన్ వక్ష్యామో ప్రాసాదాన్ భూమిజాతిషు॥ 140
తేష్వాద్యః స్వస్తికోఽన్యశ్చ వజ్ర స్వస్తిక సంజ్ఞితః।
తృతీయో హర్మ్యతలక శ్చతుర్థ ఉదయాచలః॥ 141
గంధమాదన సంజ్ఞశ్చ పంచమః పరికీర్తితః।
అథాభిధీయతే తేషు స్వస్తికః శుభలక్షణః॥ 142
చతురశ్రీ కృతే క్షేత్రే విస్తారాయామ సమే।
కర్ణార్థ సూత్రపాతేన వృత్తమస్య సమం లిఖేత్॥ 143

వర్తులం భాజయేత్ క్షేత్రం షడ్గుణైరష్టభిః పదైః।
అష్టౌ శాలా విధాతవ్యా విస్తారేణ చతుష్పాదాః॥ 144
పల్లవీ వృత్త సూత్రేణ బాహ్యతో భద్ర కర్ణికే।
ద్విభాగా కర్ణికాజ్ఞేయా మానమూర్ధ్వ మథోచ్యతే॥ 145
వేదిబంధో విధాతవ్యో భాగద్వితయ ముచ్ఛ్రితః।
తంభజేత్ పంచభిర్భాగై ర్ద్విభాగ స్తత్ర కుంభకః॥ 146
పాదయుక్తేన భాగేన కర్తవ్యస్తుమ సూరకః।
అర్ధాంశేనాంతరం పత్రం కపోతాలీ తతో భవేత్॥ 147
స పాదేనా స్యభాగేన జంఘా భాగచతుష్టయాత్।
తల కుంభోచ్చాలకాభ్యాం సంయుక్తా శుభలక్షణా॥ 148
భాగద్వితయ మాద్యాభూః కర్తవ్యా నవరండికా।
వ్యాసం దశపదం కృత్వా త్రైర్ద్వాదశభిరుచ్ఛ్రితిః॥ 149
స్కంధశ్చ షట్పద స్తత్ర విధాతవ్యో విజానతా।
షడ్గుణే నైవ సూత్రేణ వేణుకోశం సమాలిఖేత్॥ 150
ద్వాదశాంశోయ ఉత్సేధో భాగానాం సమ వింశతిమ్।
తం కృత్వా పంచభిర్భాగై స్తై ర్ద్వితీయా భవేన్మహీ॥ 151
పదపాదోజ్ఝితాః కార్యా స్తత స్తిస్రోఽపరాభువః।
గర్భాద్గర్భం విధాతవ్యం భూమికానాం ప్రవేశనమ్॥ 152
వేదికా చతతః కార్యా సార్ధభాగ సముచ్ఛ్రితా।
పాదోన ద్విపదా ఘంటా విభజేత్ తాం త్రిభిః పదైః॥ 153
పదం స్యాత్ ఘంటాకోత్సేధో గ్రీవా భాగసముచ్ఛ్రితా।
అండకం భాగికం తస్యాం కర్తవ్యం సుమనోరమమ్॥ 154
కర్పరం సార్ధభాగేన కుర్యాత్ సామలసారకమ్।
సీమాత తశ్చ భాగాయాః సార్ధభాగ చతుష్టయాత్॥ 155
ఘంటాయాః విస్తరః కార్య స్తంభజేత్ షడ్భిరంశకైః।
చతుర్భిః కంఠవిస్తారాత్ ... ॥ 156

సార్ధభాగః సముత్సేధః కలశస్య తదర్ధతః।
శిఖరస్య త్రిభాగేన శుకనాసా విధీయతే॥ 157

విస్తారాద్ గర్భమానేన హీనావాష్టాంశతో భవేత్ ।
విస్తారాధ స పాదేన శూరసేన స్తదూర్ధ్వతః॥ 158

ద్వితీయ భూమికాతుల్య ఆద్యభూమే స ఊర్ధ్వతః ।
శాలా విస్తార తుల్యాస్తు శూరసేనాస్త్రయో మతాః॥ 159

శాలా నాగరికాశ్చాష్టౌ గ్రాహగ్రాస విరాజితాః।
య ఇమం కారయేద్ధన్యః ప్రాసాదం స్వస్తికం శుభమ్॥ 160
తస్యాను జన్మజ్ఞాతీనాం స్వస్తిశ్రీ భాజనం భవేత్॥

తా॥ భూమిజ ప్రాసాదములలో అష్టకోణములు గలవి. స్వస్తికము, వజ్రస్వస్తికము, హర్మ్యతలము, ఉదయాచలము, గంధమాదనము, అను 5 కలవు. అందు మొదటిది యగు స్వస్తికము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును కర్ణార్ధ సూత్రముతో వృత్తరేఖను గీయవలెను. అనగా 6 రెట్లుగల సూత్రముతో రచించవలెను. అందు శాల 4 భాగములు చొప్పున 8యును, కర్ణము 2 భాగముల చొప్పున 16ను మధ్యశిఖరమును రచించవలెను. వేదీ బంధము 2 భాగములు దానిని 5 భాగములుగాజేసి అందు కుంభము 2 భాగములు, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, అంతర పత్రము $\frac{1}{2}$ భాగము, కపోతముల వరుస $1\frac{1}{4}$ భాగము, జంఘ 4 భాగ ములు, తలము కుంభము ఉచ్ఛాలము మొదలైన వానితో సహా. మొదటి అంతస్తు 2 భాగములు వరండికతో సహా. విస్తారమును 10 భాగములుచేసి మొత్తును 12 భాగములు చేయవలెను. స్కంధము 6 భాగముల విస్తారమును 6 రెట్లుగల సూత్రముతో వేణుకోశమును రచించలెను. మఱియు 12 భాగముల మొత్తును 20 భాగములుచేసి రెండవ అంతస్తు 5 భాగములు, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములు చేయవలెను.

వేదిక $1\frac{1}{2}$ భాగము, ఘంట $1\frac{3}{4}$ భాగము, ఆ ఘంట యెత్తును 3 భాగములుచేసి కంఠము యెత్తు 1 భాగము, గ్రీవ 1 భాగము, అండకము 1 భాగము, కర్పరము $1\frac{1}{4}$ భాగము ఆమలసారకముతో సహా. సీమ $4\frac{1}{2}$ భాగములు, ఘంట యొక్క విస్తారము 6 భాగములు చేసి కంఠవిస్తారము 4 భాగములుచేసి ఆపైన కలశమును $1\frac{1}{3}$ భాగము యెత్తునను అందులో సగము విస్తారమును చేయవలెను. శిఖరములో 3వ భాగము శుకనాసను రచించవలెను. విస్తారమునుండి గర్భ మానమునకు 8వ వంతు తగ్గించిగాని, విస్తారమునకు $\frac{1}{4}$ వంతు యెక్కువచేసిగాని, విస్తారముతో సమానముగా గాని యిట్లు శూర సేన పద్ధతి 3 విధములు కలవు. మొదటిది పరక వంతు తక్కువ రెండవది పాతికవంతు యెక్కువ. ఆపైన మొదటి దానితో సమానము అనగా పరకవంతు తగ్గించకుండా సమానముగా నుండవలెను. శాలలు 8 నాగరపద్ధతితోను మకరగ్రాసములైన యలంకారములతో రచించవలెను. ఇట్లు రచించిరేని స్వస్తిక మగును. దీనిని రచించిన వారి సోదరులును జ్ఞాతులును లెస్సగా సిరిసంపదలతో నుందురు.

## 127. వజ్రస్వస్తికము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అతః పరం ప్రవక్ష్యామో వజ్రస్వస్తిక సంజ్ఞితమ్॥ 161
ప్రాసాదం లక్షణోపేతం శక్రాది సురవల్లభమ్।
పూర్వోక్త లక్షణోపేతే స్వస్తికేదల మధ్యగే॥ 162
భద్రే శృంగం ప్రదాతవ్యం తీక్ష్ణాగ్రం సుమనోరమ్।
పురస్తాన్మండపం కుర్యాత్ సర్వలక్షణ సంయుతమ్॥ 163
ఇత్యేవకథితః సమ్యగ్ వజ్రస్వస్తిక సంజ్ఞితః।
య ఇమం కారయేద్ధన్యః ప్రాసాదం సర్వకామదమ్॥ 164
సస్యాద్ భోగ్యః సురస్త్రీణా మైంద్రంచ పదమశ్నుతే॥

తా॥ వజ్రస్వస్తిక లక్షణమును చెప్పుచున్నాడు. పూర్వము చెప్పబడిన స్వస్తికమునందు దలముల మధ్యనున్న భద్రమున శృంగమును ముల్లువలె నుండునట్లుగా రచించి ముందుమండపమును రచించిన యెడల వజ్రస్వస్తికమగును. దీనిని రచించినవారు ఇంద్రపదమును బొందుదురు.

## 128. హర్మ్యతలము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథ హర్మ్యతలం బ్రూమః ప్రాసాదం మండనం భువః॥ 165
చతురశ్రీ కృతే క్షేత్రే విస్తారాయామ మతః సమే।
కర్ణార్థ సూత్రపాతేన తస్మిన్ వృత్తం సమాలిఖేత్॥ 166
తద్ వృత్తం విభజేత్ క్షేత్రం చతుః షష్ట్యా పదైస్తతః।
కర్తవ్యా విస్తరేణాస్మి న్నష్టౌ శాలాశ్చతుష్పదాః॥ 167
పల్లవీ వృత్త సూత్రేణ బాహ్యతో భద్రకర్ణికే।
కర్ణాద్వాద్వా విధాతవ్యా శాలాద్వితయ మధ్యతః॥ 168
ద్విభాగాయామ విస్తారా సలిలాంతర భూషితౌ।
పరివర్తనతో౽న్యోన్యం కోణాన్ కుర్వీతషోడశ॥ 169

అష్టా స్వపిచదిక్ష్వేవం మానాః కర్మభిరన్వితాః।
గర్భభిత్తిశ్చ వేదీచ జంఘా ప్రథమ భూమికాః॥ 170
కర్తవ్యాః పూర్వమానేన స్వస్తికోక్తేన తద్విదా।
ద్వాదశాంశో య ఉత్సేధో వింశత్యా తత్ర భాజితః॥ 171
షోడ్రాష్టా వింశతి విధః కర్తవ్య స్తత్రభూమికా।
ద్వితీయా పంచభిర్భాగైః పదపాదోజ్ఝితాః పృథక్॥ 172
అన్యాః స్యుర్భూమయః పంచ వేదీ కుర్యాత్ ద్విభాగికా।
చతస్రో మంజరీః కుర్యాన్నాగరైః కర్మభిర్యుతాః॥ 173

చతస్రః పునరన్యాశ్చ యుక్తాద్రావిడ కర్మభిః।
ఘంటాస్కంధస్య విస్తారో వేదికా కలశోచ్ఛ్రయా॥ 174

శూరసేనః శుకాగ్రాచ స్తంభికా కూటభక్తయః।
రేఖాశ్చ పూర్వవత్ కార్యాః ప్రాసాదస్యాస్య జానతా॥ 175
ప్రాసాదస్యాస్య కర్తాయ స్తథా కారయితాచయః।
ప్రాప్నుతః శివలోకంతౌ నిత్యానంద సుఖోదయమ్॥ 176

తా॥ హర్మ్యతల ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును కర్ణార్థ సూత్రముతో గుండ్రముగా గీయవలెను. దానిని 64 భాగములుచేసి అందు ఒక్కొక్క శాల 4 భాగముల చొప్పున 8యును, ఆ శాల కిరువైపుల 2-2 భాగములు చొప్పున రథములు 16ను మధ్యశిఖరమును రచించవలెను. కర్ణములు మార్పులుగా పనులు చేయవలెను. గర్భము గోడ వేదిక, జంఘ, ఇవి మొదటి అంతస్తున స్వస్తికమువలె రచించవలెను. 12 భాగములుగా జెప్పబడిన యెత్తును 20 భాగములు చేయవలసినదని చెప్పిన దానినే 28 భాగములుగాజేసి అంతస్తులను రచించవలెను. రెండవ అంతస్తున 5 భాగములు, మూడవ అంతస్తున $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తున $4\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తున $4\frac{1}{4}$ భాగములు, ఆఱవ అంతస్తున 4 భాగములు, ఏడవ అంతస్తున $3\frac{3}{4}$ భాగములు, వేదిక 2 భాగములు, మంజరులు 4ను నాగరపద్ధతితోను మఱియొక నాలుగు మంజరులు ద్రావిడ పద్ధతితోను, ఘంట, స్కంధవిస్తారము, వేదిక, కలశము యెత్తు పూర్వమువలెనే చేయవలెను. శుకనాస శూరసేన పద్ధతితో రచించవలెను. స్తంభములు కూటములు శిఖరములు ఇవి యన్నియును పూర్వమువలెనే రచించవలెను. ఈ హర్మ్యతల ప్రాసాదమును రచించిన కర్తకారయితలకు నిత్యానందముగల శివలోక సౌఖ్యమబ్బును.

## 129. ఉదయాచలము - మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదము దయాచలమ్।
చతురశ్రీ కృతే క్షేత్రే భుజాకర్ణ సమే శుభే॥ 177

తతః కర్ణార్ధ సూత్రేణ తస్మిన్ వృత్తం సమాలిఖేత్।
వర్తులంకారయేత్ క్షేత్ర మశీతి పదభాజితమ్॥ 178

శాలాశ్చాష్టౌ విధాతవ్యాః పూర్వాదిషు చతుష్పదాః।
పల్లవీ వృత్త సూత్రేణ బాహ్యతో భద్రకర్ణికే॥ 179

కుర్యాచ్ఛాలాద్వయ స్యాంతః కోణానాం చత్రయంత్రయమ్।
ద్విభాగాయామ విస్తార సలిలాంతర భూషితాః॥ 180

ఏవం కోణా విధాతవ్యా వింశతిశ్చతురుత్తరా।
పరివర్తన మన్యోన్య మేషాం కుర్యాద్ యథా క్రమమ్॥ 181

ఏతత్సమ ప్రకారేణ గర్భం భిత్తించ వేదికామ్।
జంఘాంచ భూమిశిఖరం పూర్వవత్పరి కల్పయేత్॥ 182

అష్టౌచ మంజరీః కుర్యాద్ యుక్తానాగర కర్మణా।
రుద్రేశ్వర సమాయుక్తా సీరధారోప శోభితాః॥ 183

ఘంటా కూటాశ్చ రేఖాచ స్తంభికా శూరసేనకః।
శుకాగ్రా స్కంధ విస్తార కలశేన సమన్వితః॥ 184

స్వస్తికోక్త విధానేన విదధ్యాదుదయాచలమ్।
ద్వాదశాంశోయ ఉత్సేధో వింశత్యాత్రత్ర భాజితః॥ 185

స్యాత్పంచత్రిం శతాభాజ్యో ద్వితీయా తత్ర భూమికా।
పంచభాగోచ్ఛ్రితా కార్యా తతోఽన్యాః సప్తభూమయః॥ 186

పదపాదోజ్ఝితా భాగ ద్వయో యోసాతు వేదికా।
ఘంటా కార్యా తదూర్ధ్వేచ సర్వలక్షణ సంయుతా॥ 187

ప్రాసాదం యస్త్విమం సమ్యగ్ భక్తిమాన్ కారయేన్నరః।
శాశ్వతం పదమాప్నోతి సమ్రాప్యం సురైరపి॥ 188

తా॥ ఉదయాచలము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును కర్ణార్ధ సూత్రముచేత గుండ్రముగా గీయవలెను దానిని 80 భాగములుచేసి తూర్పు మొదలగు 8 దిశల యందును. ఒక్కొక్క శాల 4 భాగముల చొప్పునను, మధ్యశిఖర

మును, రచించవలెను. శాలల రెంటిమధ్య 2-2 భాగముల చొప్పున 3 కర్ణములను రచించవలెను. మొత్తము 24 అగును. వానికి జల మార్గములు కూడ కలిగియుండవలెను. పై జెప్పిన కర్ణములు అనేక విధములుగా రచించవచ్చును ఒకేతీరున నుండరాదు. మఱియు గర్భము, గోడ, వేదిక, జంఘ, అంతస్తు, శిఖరము, అన్నియును పూర్వమువలెనే చేయవలెను. నాగరపద్ధతితో 8 మంజరులను రచించవలెను. జలధారము శివుని తలపైనుండి వచ్చుచున్నట్లు రచించవలెను. ఘంట, కూటము, శిఖరము, స్తంభము, ఇవి శూరసేన పద్ధతితో నుండవలెను. శుకనాస స్కంధవిస్తారమున కలశముతో సమానముగా నుండవలెను. స్వస్తికమున జెప్పిన కొలతల ప్రకారమే యుదయాచలమును రచించవలెను.

12 భాగములుగా జెప్పబడిన దానిని 20 భాగములతో రచించినప్పుడు స్వస్తికమగును. దానినే 35 భాగములుచేసి 9 అంతస్తులుగా రచించవలెను. రెండవ అంతస్తును 5 భాగములు, మూడవ అంతస్తు $4\frac{3}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $4\frac{1}{4}$ భాగములు, ఆఱవ అంతస్తు 4 భాగములు, ఏడవ అంతస్తు $3\frac{3}{4}$ భాగములు, ఎనిమిదవ అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, తొమ్మిదవ అంతస్తు $3\frac{1}{4}$ భాగములు చేయవలెను. వేదిక 2 భాగములు చేయవలెను. మొత్తము 35 భాగములగును. ఆపైన ఘంట మొదలైనవి శాస్త్రప్రకారము చేయవలెను. దీనిని ఉదయాచల మందురు. ఇట్టి ప్రాసాదమును నిర్మించినవారు దేవతలకు గూడ అలవిగాని దివ్యస్థానమును బొందుదురు.

## 130. గంధమాదనము మఱియొక పద్ధతి

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ ఇదానీం ప్రక్రమాయాతః కథ్యతే గంధమాదనః।
స్వలక్షణ ప్రమాణాఢ్యః క్షితిభి స్తూదయాచలే॥ 189

కుర్వీతమంజరీ రష్టౌ యుక్తా ద్రావిడకర్మభిః।
కూటాశ్చ మణికాః కార్యానానా కర్మభిః రన్వితాః॥ 190
స్థానేషు శూరసేనాఢ్యా పురో రేఖాత్రయం భవేత్।
శుకనాసాంచ ఘంటాంచ స్కంధం శిఖరమేవచ॥ 191
కూటాశ్చ స్తంభికాకుంభం పూర్వవత్పరి కల్పయేత్।
య ఇమం కారయేద్ధన్యః ప్రాసాదం మండనం భువః॥ 192
ః ద్యాధరాధిపః శ్రీమాన్ స భవేన్నాత్ర సంశయః।
భుంక్తేచ వివిధాన్ భోగాన్ సురస్త్రీభిశ్చ సేవ్యతే॥ 193

తా॥ పూర్వము చెప్పబడిన ఉదయాచలమునకు ద్రావిడ పద్ధతితో 8 మంజరులును, మణిక పద్ధతితో కూటములును, ఈ కూటము లనేకవిధములుగాను, శూరసేన పద్ధతితోను రచించవలెను. ముందు 3 రేఖలును, శుకనాస, ఘంట, స్కంధము, శిఖరము, కూటములు, స్తంభములు, కుంభము ఇవి యన్నియును పూర్వము వలెనే చేయవలెను. ఇట్టి లక్షణములతో గంధమాదన ప్రాసాదమును నిర్మించినవారు సమస్త భోగభాగ్యముల ననుభవించుటయే కాక దివ్యస్త్రీ సుఖముల నందుదురు.

## 131. ఉదయ కలా స్కంధ భేదరేఖలు

సమరాంగణ 65వ అధ్యాయము.

శ్లో॥ ఉదయస్య విభేదేన రేఖాయాః పంచవింశతిః।
లతినాగర భౌమానాం తాః కథ్యంతే యథాగమమ్॥ 194
లతినాంస్యా ద్వారంగతే నాగరాణాం తు కూటకః।
భూమిజానాం విధాతవ్యా సాంధారాః పురతో భువః॥ 195
శిఖరం వ్యాస కర్ణాభ్యాం తుల్యంస్యా దధమోత్తమమ్।
భాజనీయ చతుర్యుక్త వింశతిస్యా దనంతరమ్॥ 196
... ... భాగ రేఖాస్తావత్య ఈరితః।
సవ్యాసా శోభనా భద్రా సురూపా సుమనోరమా॥ 197

శుభాచైవ తథా శాంతా కౌబేరీచ సరస్వతీ।
కోలాచకర వీరాచ కుముదా పద్మినీ తథా॥ 198
కనకా వికటాచైవ రమ్యాచ రమణీ తథా।
వసుంధరా తథాహంసీ విశాఖానందినీతిచ॥ 199
జయాచ విజయాచైవ సుముఖాచ ప్రియాననా।
ఇత్యేతాః కీర్తితా రేఖాః సంఖ్యయా పంచవింశతిః॥ 200
ఏతాః శుభ ఫలాః సర్వాః కర్తుః కారయితు స్తథా।
చతురశ్రే చతుష్కంతు వృత్తాః సప్తస్తు పంచచ॥ 201
అష్టాశ్రే మేవముక్తం స్యాత్ ప్రాసాదా భూమిజా ఇమే॥

ఇతి సమరాంగణ సూత్రధారా పరనామ్ని వాస్తుశాస్త్రే భూమిజ ప్రాసాదాధ్యాయోనామ పంచషష్టితమోఽధ్యాయః॥

తా॥ విస్తారమునుబట్టి శిఖరమును రచించుటలో 25 భేదములు కలవు. విస్తారముతో సమానము, ఒక పరకవంతు యెక్కువ, విస్తారము కర్ణముల మధ్యకు, విస్తార కర్ణముల మధ్య 3 భాగములు చేసి 2 భాగములు, చేయుట ఇట్లు 25 భేదములు. వానిని రేఖ లందురు. సవ్యాస, శోభన, భద్ర, సురూప, సుమనోరమ, శుభ, శాంత, కౌబేరి, సరస్వతి, కోల, కరవీర, కుముద, పద్మిని, కనక, వికట, రమ్య, రమణి, వసుంధర, హంసి, విశాఖ, నందిని, జయ, విజయ, సుముఖ, ప్రియానన, అను 25ను రేఖాదేవతల నామములు.

అపరాజిత పృచ్ఛ 141వ సూత్రమున

శ్లో॥ సవ్యాసం శిఖరం కార్యం సకలః శిఖరోచ్ఛ్రయః।
వ్యాసస్య కర్ణయోర్మధ్యే ద్విఘ్నం చైవ త్రిభిర్గతాః॥ 1
సూత్ర రేఖోచ్ఛ్రితా రేఖా సంఖ్యాయాం పంచవింశతిః।
నామాని కథయిష్యామి సవ్యాసాదేర్యథా క్రమమ్॥ 2
సవ్యాసా శోభనాభద్రా సురూపా సుమనోరమా।
శుభాచైవ తథా శాంతా కౌబేరీచ సరస్వతీ॥ 3

కోలాచకర వీరాచ కుముదా పద్మినీ తథా।
కనకా వికటాచైవ రమ్యాచరమణీ తథా॥ 4
వసుంధరా తథా హంసీ విశాఖా నందినీ తథా।
జయాచ విజయాచైవ సుముఖాచ ప్రియాననా॥ 5
ఇత్యేతాః కీర్తితా రేఖాః సంఖ్యయా పంచవింశతిః।
ఉదయ భేదోద్భవాః ఖ్యాతాః సపాద కర్ణమధ్యతః॥ 6

కలాభేదోద్భవ రేఖలు చెప్పుచున్నాడు—

అపరాజిత పృచ్ఛ 141వ సూ.

శ్లో॥ పంచఖండాద్ధా ఖండర్ద్యా ఏకోన త్రింశకావధి।
ఖండచారే కలాజ్ఞేయా అంకవృద్ధి క్రమేణతు॥ 7
ఏకద్విత్రి చతుఃపంచ షట్ సప్తాష్టక్రమోద్గతాః।
అనేన క్రమయోగేన ఏకోన త్రింశకావధి॥ 8
పంచఖండే కలాశ్చైవ సంఖ్యయాదశ పంచచ।
ఏకోన త్రింశో పంచ త్రింశదుత్తరం చతుః శతమ్॥ 9
చంద్రకల్పా కలావతీ కలధౌతా చరుధిరా।
నలినీ మాలా కమలా దుందుభి ర్నవవేల్లికా॥ 10
రత్నచూలా బృందారకా త్రిశిఖానందా కౌముదీ।
న యనాచక్రాచోన్మత్తా విశాలాలి భ్రమాలతా॥ 11
మృగాక్షీ ద్వీపినీ శశీ కౌముదీ మంజరీ తథా।
పూర్ణరమ్యాచ మాహేంద్రీ కీర్తిపతాకా తత్పరే॥ 12
త్రైలోక్య విజయా చైవ నామభిః పంచవింశతిః।
కలారేఖాః సమాఖ్యాతాః సర్వకామ ఫలప్రదాః॥ 13

తా॥ పంచఖండములు మొదలు 29 ఖండముల వఱకు ఖండచారమున కలలు. సంఖ్యావృద్ధి క్రమముగా 1-2-3-4-5-6-7-8 ఇట్లు పైకి బోవుచు 29 వఱకు పంచఖండ కలల సంఖ్య 15ను, 29 రెట్లు చేయగా 435 భాగములగును. ఆ రేఖలకు చంద్రకల్ప, కలావతి,

కలధౌత, రుధిర, నలినీమాల, కమల, దుందుభి, వనవేల్లిక, చూల, బృందారక, త్రిశిఖానంద, కౌముది, నయన, చక్ర, ఉన విశాల, విభ్రమ, లత, మృగాక్షి, ద్వీపిని శశి, కౌముది మ పూర్ణరమ్య, మాహేంద్రి, కీర్తిపతాక త్రైలోక్య విజయ 25 నామము లేర్పడినవి - ఇవి కలా రేఖలు. స్కంధ రేఖలను చున్నాడు.

అపరాజిత 141వ సూ.

శ్లో॥ దశధా మూలపృథుత్వే షడ్భాగః స్కంధ ఉచ్యతే।
పంచభాగోఽథవా స్కంధో భాగో వామేచ దక్షిణే॥

షడ్ బాహ్యే దోషదః ప్రోక్తః పంచాధశ్చ నశస్యతే।
షట్ పంచమధ్యతః స్కంధే ఊర్ధ్వభాగేజినాంకితే॥

విభక్తి సూత్రక్రమతః స్కంధాః స్యుః పంఖవింశతిః।
నామాన్యను క్రమాత్తేషాం కథయే తవసాంప్రతమ్॥

సమః శాంతః శుభః సౌమ్యో గంధర్వః శంకవర్ధనః।
కీర్తినందో మహాభోగః సంభ్రమో దిశినాయకః॥

రుద్రతేజా సదాభ్యాసో జనానంద స్తథా ద్రకః।
యక్షోదక్షః క్షితిధరః స మాత్రః సంయుత స్తథా॥

శేఖరశ్చ ప్రజాపూర్ణః పర్వతశ్చ ప్రఘాతకః।
రేఖాతి భూషణశ్చైవ విజయానంద ఇత్యమీ॥

స్కంధాస్తు నామతో జ్ఞేయాః సంఖ్యాతాః పంచవింశతిః॥

తా॥ దేవాలయము యొక్క ప్రస్తరముపై ప్రదేశ 10 భాగములుచేసి దానియొక్క స్కంధము 6 భాగములుగాని 5 భాగములు చేయుటలో 5 భాగములకు తగ్గకుండా 6 భాగము హెచ్చకుండా 25 భేదములు పూర్వము నిర్ణయింపబడినవి. యొక్క నామములు సమము శాంతము, శుభము, సౌమ్యము, గ ర్వము, శంఖవర్ధనము, కీర్తినందము, మహాభోగము, సంభ్రమ దిశినాయకము, రుద్రతేజము, సదాభ్యాసము, జనానంద

ఆర్ద్రకము, యక్షము, దక్షము, క్షితిధరము, సమాత్రము, సంయుతము, శేఖరము, ప్రజాపూర్ణము, పర్వతము, ప్రఘాతము, రేఖాతి భూషణము, విజయానందము, ఇట్లు సకంధములయొక్క 25 భేదములు కలవు.

## 132. ద్రావిడ ప్రాసాదములు - 25 భేదములు

**విశ్వకర్మోవాచ :-**

అపరాజిత 174వ సూ.

శ్లో॥ ఇదానీంద్రా విడాన్ వక్ష్యే ప్రాసాదాన్ సర్వకామదాన్।
పీఠపంచక మిత్యుక్తం తలచ్ఛందాస్తు పంచధా॥ 1

ఐంద్రోద్భవో రాజహంసో నందనః సింహపంజరః।
త్ర్యంగాశ్చత్వార ఏవోక్తా ద్రావిడా ఏకభూమికాః 2

గరుడోవర్ధమానశ్చ శ్రీతరుః ప్రమదా ప్రియః।
నందిఘోషః సమాఖ్యాతాః పంచాంగాశ్చత్రి భూమికాః॥ 3

స్వస్తికః శంకుకర్ణాఖ్యో గోవిందో నందివర్ధనః।
పృథ్వీజయః పతాకశ్చ సప్తాంగాః పంచభూమికాః॥ 4

సర్వాంగః సర్వతోభద్రః సర్వసుందర సంభ్రమా।
జనానందః క్షితిధరో నవాంగాః సప్తభూమికాః॥ 5

పద్మసూత్రో మహాపద్మః కైలాసో మేరునాయకః।
చత్వారో వృత్తకా ఉక్తా ద్రావిడాః పంచవింశతిః॥ 6

భక్తం వేదాశ్రకం చార్ధే భద్రం పాదంచ నిర్గతమ్।
ఐంద్రోద్భవః పదంకర్ణ ఉదకాంతర భూషితః॥ 7

భద్రార్ధే ముఖభద్రంచ రాజహంసశ్చ నామతః।
భద్రోదయే నందనాఖ్యః కర్ణభద్రేచ పంజరః॥ 8

పీఠోర్ధ్వే కర్ణమానేన విభక్తం పంచభాగికమ్।
సార్ధభాగే భవే జ్జంఘా సపాదః కూటకోదయః॥ 9

వేదీపాదోన భాగా స్యాత్ ఘంటా వై సార్ధభాగికా।
ఊర్ధ్వే కలశమాఖ్యాతం కర్తవ్యం సర్వకామదమ్॥ 10

తా॥ నాగరపద్ధతితో జెప్పబడిన నామములతోనే ద్రావిడ ప్రాసాదములు కూడ గలవు. అధిష్ఠానభేదములలో ద్రావిడ పీఠములు చెప్పబడియున్నవి. 1 ఐంద్రోద్భవము, 2 రాజహంసము, 3 నందము, 4 సింహపంజరము. ఇవి త్ర్యంగములును 1 అంతస్తును కలిగియుండును. గరుడము, వర్ధమానము, శ్రీతరువు, ప్రమదాప్రియము, నందిఘోషము, ఇవి పంచాంగములును 3 అంతస్తులును కలిగియుండును. స్వస్తికము, శంకుకర్ణము, గోవిందము, నందివర్ధనము, పృథివీజయము, పతాకము, ఇవి సప్తాంగములును 5 అంతస్తులును కలిగియుండును. సర్వాంగము, సర్వతోభద్రము, సర్వసుందరము, సంభ్రమము, జనానందము, క్షితిధరము, ఇవి నవాంగములును, 7 అంతస్తులును కలిగియుండును. పద్మసూత్రము, మహాపద్మము, కైలాసము, మేరునాయకము. ఇవి వృత్తములును మొత్తము 25 భేదములు చతురశ్ర ప్రదేశములను 4 భాగములుచేసి మధ్య 2 భాగములు భద్రమును, నిర్గమము $\frac{1}{4}$ భాగమును, కర్ణము 1 భాగము జలమార్గముతోను చేసినేని ఐంద్రోద్భవమగును.

భద్రములో సగము ముఖభద్రమును రచించి పూర్వము వలెనే చేసినచో రాజహంసమగును. భద్రములు శిఖరములతో యెత్తుగా రచించిన యెడల నందనమగును. కర్ణముల యందును భద్రముల యందును పంజరములను కల్పించినయెడల సింహపంజరమగును. అధిష్ఠాన విస్తారము 4భాగములును, ప్రస్తరముపైన కర్ణమానముతో 5 భాగములునుచేసి జంఘ $1\frac{1}{2}$ భాగము, కూటము $1\frac{1}{4}$ భాగము, వేదిక $\frac{3}{4}$ భాగమును ఘంట $1\frac{1}{2}$ భాగమును, ఇట్లు 5 భాగములు సరిచేసి ఆపైన కలశమును స్థాపించవలెను. పైజెప్పిన నాలుగు ప్రాసాదములును ఒక్కటే అంతస్తు కలవి.

శ్లో॥ ఏకభూమాంశ్చ చత్వారో గరుడంచ తతః శృణు।
షడ్భాగశ్చైవ విస్తారో భాగః ప్రతిరథో భవేత్॥ 11

నిర్గమోఽర్ధం వార్మార్గయుక్ శేషంపూర్వ ప్రకల్పితమ్॥
గరుడాఖ్యో ముఖభద్రే వర్ధమానః స ఉచ్యతే॥ 12

భద్రోదయేశ్రీ తరుర్భద్రకర్ణే ప్రమదాప్రియః।
యదా ప్రతిరథే భద్రం నందిఘోషః ఉచ్యతే॥ 13

పీఠోర్ధ్వే కర్ణమానేనో దయేద్వాదశభాజితే।
సపాదద్వ్యంశకాజంఘా కూటం భాగద్వయోన్నతమ్॥
పాదోనద్వ్యంశకా జంఘా సార్ధః కూట సముచ్ఛ్రయః॥ 14
సపాత్ జంఘాం శకః కూటో వేదీ స్యాదర్ధభాగికా।
పాదోన ద్వ్యంశకా ఘంటా కర్తవ్యా శ్చత్రి భూచ్ఛ్రయాః॥ 15

తా॥ విస్తారము 6 భాగములుచేసి ప్రతిరథము 1 భాగమును నిర్గమము $\frac{1}{2}$ భాగమును జలమార్గముతో సహా చేసి పూర్వము చెప్పిన ప్రకారము రచించుచు 3 అంతస్తులుచేసిన యెడల గరుడమగును. గరుడ ప్రాసాదమునకు ముఖభద్రమును రచించిన యెడల వర్ధమానమగును. భద్రములను యెత్తుగా రచించి అన్నియును పూర్వమువలెనే రచించినచో శ్రీతరువమగును.

భద్రముల యందు కర్ణములు రచించి మిగిలినవన్నియు మునుపటివలెనే చేసినచో ప్రమదాప్రియమగును. ప్రతిరథముల యందు భద్రములను రచించి మిగిలినవన్నియును పూర్వమువలె రచించినచో నందిఘోషమగును. అధిష్ఠానముపైన కర్ణమానము చేత యెత్తును 12 భాగములుచేసి జంఘ $2\frac{1}{4}$ భాగములు, కూటము 2 భాగములు, మరల జంఘ $1\frac{3}{4}$ భాగములు, కూటము $1\frac{1}{2}$ భాగము, మూడవ జంఘ $1\frac{1}{4}$ భాగము, కూటము 1 భాగము, వేదిక $\frac{1}{2}$ భాగము, ఘంట $1\frac{3}{4}$ భాగములు, ఇట్లు 3 అంతస్తులు గలవి యని తెలియవలెను.

శ్లో॥ విభక్తే చాష్టధా ఖండే ద్విభాగః భద్ర విస్తరః।
భాగ భాగం రథ కర్ణౌ తత్తదర్థం స నిర్గతమ్॥ 16
స్వస్తికశ్చ సమాఖ్యాతః శృంగకర్ణస్తు భద్రకే।
గోవిందో ముఖ భద్రేషు భద్రోదనంది వర్ధనః॥ 17
ద్వాద్వా ప్రతిరథా భద్రే సభవేత్ పృథివీ జయః।
వర్ధమానో యదా కర్ణః పతాకః సర్వకామదః 18
పీఠోర్ధ్వే కర్ణమానేన షడ్వింశతి విభాజితే।
జంఘాసార్ధత్రయంకుర్యాత్ కూటం వై పాదయున్ త్రయమ్॥ 19
త్రిభాగంచ పునర్జంఘా కూటం పద వివర్జితమ్।
సార్ధ ద్విభాగా జంఘాచ కూటం పాదయుత ద్వయమ్॥ 20
ద్విభాగంచ తథా జంఘా కూటం పాదోన ద్వ్యంశకమ్।
జంఘాచ సార్ధభాగోక్తా కూటం భాగ సముచ్ఛ్రితమ్॥ 21
అర్థభాగా భవేద్వేదీ ఘంటా పాదోనద్వ్యంశకా।
ఏవమా దిగుణోపేతాః కర్తవ్యాః పంచభూమికాః॥ 22

తా॥ విస్తారమును 8 భాగములుచేసి అందు భద్రము 2 భాగములును, రథము 1 భాగము, కర్ణము 1 భాగముచేసి నిర్గమములు $\frac{1}{2}$ భాగము చేయవలెను. భద్రనిర్గమము 1 భాగము చేయవలెను. అధిష్ఠానము పైన కర్ణమానముచేత 26 భాగములు చేసి జంఘ $3\frac{1}{2}$ భాగములు, కూటము $3\frac{1}{4}$ భాగములు, రెండవ జంఘ 3 భాగములు, కూటము $2\frac{3}{4}$ భాగములు, మూడవ జంఘ $2\frac{1}{2}$ భా. కూటము $2\frac{1}{4}$ భాగములు, నాల్గవ జంఘ 2 భాగములు. కూటము $1\frac{3}{4}$ భాగములు, ఐదవ జంఘ $1\frac{1}{2}$ భాగములు, కూటము 1 భాగము, వేదిక $\frac{1}{2}$ భాగము, ఘంట $1\frac{3}{4}$ భాగములు, ఇట్లు సప్తాంగములతో 5 అంతస్తులుగా రచించవలెను. దీనిని స్వస్తికమని చెప్పుదురు.

స్వస్తికమున భద్రములను రచించిన యెడల శంకుకర్ణమగును. పై జెప్పిన దానినే ముఖభద్రమును కల్పించిరేని గోవిందమగును. గోవిందప్రాసాదము యొక్క భద్రమున జలమార్గమును కల్పించి

నచో నందివర్ధనమగును. భద్రమున 2-2 ప్రతిరథములను రచించి రేని పృథివీజయమగును. పృథివీజయమునకు కర్ణములు వర్ధమాన ముగా రచించి రేని పతాకమగును.

శ్లో॥ విభక్తే దశధాఛందే ద్విభాగో కర్ణవిస్తరః।
పాదాత్త్రయః ప్రతిరథా స్తత్తదర్ధం వినిర్గతమ్॥ 23
మధ్యే భద్రస్య కర్ణస్య ప్రరథాశ్చాత్ర యత్త్రయః।
ఉదకాంతర సంయుక్తాః కర్తవ్యాః సర్వకామదాః॥ 24
సర్వాంగః సమాఖ్యాతః ప్రభద్రే సర్వభద్రకః।
సుందరః కర్ణభద్రే స్యాద్ భద్రోదకేతు సంభ్రమః॥ 25
భద్రాణిచ ప్రతిరథే జనానందః స ఉచ్యతే।
కర్ణేచాష్ట దలంకార్యం ద్వితీయం ప్రరథే తథా॥ 26
శేషే యుగ్మ ప్రతిరథే కార్యా వై వర్ధమానకాః।
క్షితిధర స్తదానామ ప్రాసాదః సురవల్లభః॥ 27
పీఠోర్ధ్వే కర్ణమానేన పంచత్రింశ త్సముచ్ఛ్రితిః।
ఆది జంఘా చతుర్భాగం పాదోనం కూట ముచ్ఛ్రితమ్॥ 28
పాదహ్రాస్వా భవేజ్జంఘా పాదోనం కూట మున్నతమ్।
ఏవమాది క్రమయోగే భాగం కూటం తు సప్తమమ్॥ 29
అర్ధభాగం భవేద్ వేదీ ఘంటా భాగద్వయోన్నతా।
ఏవం విధం ప్రకర్తవ్యం నవాంగం సప్తభూమికమ్॥ 30

తా॥ చతురశ్రప్రదేశమును 10 భాగములుచేసి, అందు కర్ణము 2 భాగములు మధ్యభద్రమును 2 భాగములుచేసి యీ రెంటి మధ్య $\frac{3}{4}$ భాగము చొప్పున 3-3 ప్రరథములను రచించవలెను. జలమార్గములు కూడ చేయవలెను. అధిష్ఠానముపైన కర్ణమానము చేత 35 భాగములుచేసి అందు మొదటి జంఘ 4 భాగములు, కూటము $3\frac{3}{4}$ భాగములు, రెండవ జంఘ $3\frac{1}{2}$ భాగములు, కూటము $3\frac{1}{4}$ భాగములు, మూడవ జంఘ 3 భాగములు, కూటము $2\frac{3}{4}$ భాగములు, నాల్గవ జంఘ $2\frac{1}{2}$ భాగములు, కూటము $2\frac{1}{4}$ భాగములు,

ఐదవ జంఘ 2 భాగములు, కూటము $1\frac{3}{4}$ భాగములు, ఆఱవ జంఘ $1\frac{1}{2}$ భాగము, కూటము $1\frac{1}{4}$ భాగము, ఏడవ జంఘ 1 భాగము, కూటము $\frac{3}{4}$ భాగము, ఆపైన వేదిక $\frac{1}{2}$ భాగము, ఘంట 2 భాగములు ఇట్లు నవాంగములతో 7 అంతస్తులుగా రచించి రేని సర్వాంగమగును.

పై దానినే భద్రములకు ప్రతిభద్రములను రచించిన యెడల సర్వతోభద్రమమగును. కర్ణములయందుగూడ భద్రములను రచించి రేని సత్వసుందరమగును. భద్రములయందు జలమార్గములు రచించిన యెడల సంభ్రమమగును. భద్రములను వాని ప్రక్క ప్రతిరథములు రచించినచో జనానందమగును. కర్ణములయందు 8 దలములనుచేసి ప్రరథముల యందు గూడ అటులే 8 దలములను రచించిన మిగిలిన రెండు ప్రతిరథములు వర్ధమానముగా రచించినచో క్షితిధరమగును.

శ్లో॥ అష్టకోణాః పంచభూమా పద్మనామాచ కామదః।
పంచభూమా ద్వ్యష్టదలా మహాపద్మ ఇతి స్మృతః॥ 31
చతుర్వింశతి భిర్వృత్తః కైలాసః సప్తభూమికః।
ద్వాత్రింశద్భిర్ద్వై ర్వృత్తః సభవేన్మేరు నాయకః॥ 32
ఘంటా కలశశో భాఢ్యాన్ శుకనాస్యాగ్ర సంయుతాన్।
చిత్రకూటాన్వితాన్ కుర్యాత్ ప్రాసాదాన్ సర్వకామదాన్॥ 33
కూటాంశ్చాథ ప్రవక్ష్యామి ద్రావిడకర్మ చర్చితాన్।
తదను క్రమయుక్తీచ కథయేతవ సాంప్రతమ్॥ 34
పంచభాగైః పృథుః కూట ఉచ్ఛ్రయే సప్తభాగికః।
వేదీ బంధత్రయం కార్యం త్రిసంఘాటమితి స్మృతమ్॥ 35
వేదీ ఘంటాద్వయో రూర్ధ్వే ద్విసంఘాటాభిధః స్మృతః।
ఏక వేదీబంధ కోర్ధ్వే వేదీ ఘంటాద్యలంకృతః 36
ఏక సంఘాట సంజ్ఞోఽయం కర్తవ్యః సర్వకామదః।
ద్విభాగం సార్ధభాగం చ భాగికం చార్ధభాగికమ్॥ 37

త్రిసంఘాట ఇతి ప్రోక్త శ్చార్ధభాగాశ్చ వేదికాః।
ద్విభాగ కోచ్ఛ్రితాః కూటాః కర్తద్యానాసికోద్భవాః॥ 38
కర్తవ్య ఏక సంఘాటో ద్విసంఘాట స్తథోచ్యతే॥
త్రిసంఘాటస్తు కర్తవ్యో వేదీ ఘంటా తమూర్ధ్వతః॥ 39
సంఘాటే ప్రథమే కుర్యా న్మకరా న్వికృతాననాన్।
ద్వితీయే కోటపాలాంశ్చ కంఠకాంశ్చ తృతీయకే॥ 40
వేదీ ఘంటా తమూర్ధ్వేతు కార్యా పూర్వగుణైర్యుతా।
ఏవం విధం ప్రకర్తవ్యం స్కంధమానా ద్వినిర్గతమ్॥ 41

ఇతి సూత్రసందాన గుణకీర్తి ప్రకాశప్రోక్త్య శ్రీ భువవ దేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం ద్రావిడ ప్రాసాదలక్షణాధికారో నామ చతుః సప్తత్యుత్తర శతతమమ్ సూత్రమ్.

తా॥ మొదట గుండ్రముగా నుండి ఎనిమిది కోణములును 5 అంతస్తులును కలది పద్మప్రాసాదమగును. పదునాఱు కోణములును 5 అంతస్తులును కలది మహాపద్మమగును. గుండ్రముగా నుండి 24 కోణములును 7 అంతస్తులును కలిగియుండెనేని కైలాసమగును. ముప్పదిరెండు కోణములును గుండ్రమును గలిగి 7 అంతస్తులతో నుండెనేని మేరునాయకమగును. ఘంట, కలశము, ముందు శుకనాస, చిత్రములైన కూటములును, కలిగియుండవలెను. ద్రావిడ పద్ధతితో కూటములు నిర్మించుట యెట్లనిన కూటముయొక్క విస్తారము 5 భాగములు, ఎత్తు 7 భాగములు వేదీబంధములు మూడు చేయవలెను. ఇట్లు చేసిన దానిని త్రిసంఘాటమందురు. వేదిక, ఘంట, వీనిపైన రెండు వేదికలు చేయవలెను.

దీనిని ద్విసంఘాటమందురు. ఒక్క వేదీబంధముపైన వేది ఘంటచేయవలెను. దీనిని ఏకసంఘాటమందురు. 2 భాగములును, $1\frac{1}{2}$ భాగమును, 1 భాగమును, $\frac{1}{2}$ భాగమును ఇట్లు త్రిసంఘాటమందురు. వేదిక $\frac{1}{2}$ భాగము, కూటములు 2 భాగముల యెత్తు. నాసికమునుండి చేయవలెను. ఏకసంఘాటము, ద్విసంఘాటము,

త్రిసంఘాటము, ఆపైన వేదియును ఘంటయును రచించవలెను. మొదటి వేదీబంధమున వికృతమైన ముఖములు గల మకరములను, రెండవ వేదీబంధమున కోటపాలకులను, మూడవ వేదీబంధమున కంఠములను రచించి ఆపైన వేదికయును ఘంటయును కల్పించవలెను. ఇట్లు స్కంధమునుండి నిర్గమములగు నట్లు రచించవలెను. ఇది ద్రావిడ ప్రాసాదములు. (అనుబంధము 57వ పటము చూడుడు)

## 133. వరాటప్రాసాదములు 25 భేదములు

**విశ్వకర్మోవాచ :-**

అపరాజిత 175వ సూ.

శ్లో॥ ప్రాసాదాన్ సంప్రవక్ష్యామి వరాటాన్వయజానఘ।
నామపాద ప్రమాణంచ సంస్థానోన్మాన లక్షణమ్॥ 1

వరాటః పుష్పకశ్చైవ శ్రీపుంజశ్చ తృతీయకః।
సర్వతో భద్రనామాచ సింహో వై సింహభద్రకః॥ 2

కర్ణికారశ్చ కుముదో వర్ధమానః శ్రీవత్సకః।
పుండరీకః సునాభశ్చ వేణుకః సింహపంజరః॥ 3

నంద్యావర్తశ్చ పుణ్యాఖ్యః పతాకోనందన స్తథా।
శ్రీతిలకో మహాకాంతః సుందరశ్చారు వర్ధనః॥ 4

కంబలః కిరణశ్చైవ మహాపద్మ స్తథా పరః।
పంచవింశతి రాఖ్యాతాః ప్రాసాదాః సర్వకామదాః॥ 5

చతురశ్రీ కృతే క్షేత్రే ఏకభాగ విభాజితే।
చతుః స్తంభసమాయుక్త మేకద్వారేణ భూషితమ్॥ 6

క్షేత్రే భాగోదయం స్తంభం రథభూఫలకాంతరమ్।
ఆదిభూమ్యుదయార్ధేన పీఠబంధం ప్రకల్పయేత్॥ 7

కర్తవ్యా తత్ర ఛాద్యోర్ధ్వే ఘంటామందారపుష్పవత్।
వరాటశ్చ సమాఖ్యాతః కర్తవ్యః సర్వదైవతే॥ 8

తా॥ వరాట ప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పు చున్నాడు. అందు వరాటము, పుష్పకము, శ్రీపుంజము, సర్వతో భద్రము, సింహము,సింహభద్రకము, కర్ణికారము, కుముదము, వర్ధమానము, శ్రీవత్సము, పుండరీకము, సునాభము, వేణుకము, సింహపంజరము, నంధ్యావర్తము, పుణ్యాఖ్యము, పతాకము, నందనము, శ్రీతిలకము, మహాకాంతము, సుందరము, చారువర్ధనము, కంబలము, కిరణము, మహాపద్మము. అను 25 పేరులు గలవు. ఆ యా లక్షణములను చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును ఒక్కటే భాగముచేసి నాలుగు మూలల 4 స్తంభములను, ఒక్కటే ద్వారమును చేయవలెను. స్తంభము యెత్తు అటులే 1 భాగము చేయవలెను. రథము, భూమి, ఫలకము, ఇట్లు స్తంభమును విభజించవలెను. మొదటి అంతస్తులో సగము యెత్తున పీఠ బంధమును రచించవలెను. కప్పుయొక్క పై ప్రదేశమున ఘంట మందార పుష్పమువలె వెడల్పుగా రచించవలెను. ఒకటే అంతస్తు దీనిని వరాట మందురు.

అపరాజిత 106వ సూ.

శ్లో॥ భూమిజాభూమికాక్రమై ర్జంఘాహీనైశ్చ భూమికైః ।
శృంగే శృంగయుతాః కార్యా బహుశృంగ సమాకులాః ॥ 30
కర్ణే ప్రతిరథే చైవ భద్రే చ ప్రతిభద్రకే ।
మందారపుష్పికా ఘంటా వరాటాః శుభలక్షణాః ॥ 31

తా॥ భూమిక క్రమములతో జంఘ తక్కువగాను, కూటము యెక్కువగాను, శృంగమున శృంగములును, బహు శృంగములును, కర్ణము ప్రతిరథము భద్రము మొదలగు అన్నిటియందు ఘంట మందార పుష్పమువలె యెత్తు తక్కువగా నుండెనేని వరాట మగును.

శ్లో॥ చతుర్థే భాజితే ఛందే ద్విభాగో భద్రవిస్తరః ।
నిర్గతః పాదపాదేన సర్వభద్రేష్వయం విధిః ॥ 9
కర్ణే భద్రేషు ఘంటాచ రూపే మందార పుష్పవత్ ।
మధ్యోర్ధ్వేచ బృహద్ఘంటా పుష్పకోనామ నామతః ॥ 10

తా॥ చతురశ్ర ప్రదేశమును 4 భాగములుచేసి అందు భద్రము 2 భాగములు నిర్గమము ¼ భాగముచేసి కర్ణమునందును, భద్రమునందును, మధ్యశిఖరమునను, మందార పుష్పములవలె ఘంటలను రచించి ఆపైన కలశముల నుంచిన యెడల పుష్పక మగును— ఒక్కటే అంతస్తు—

శ్లో॥ చతుః పుష్పక సంఘాట ఊర్ధ్వేఘంటాతు పంచమీ ।
శ్రీపుంజోఽసౌ సమాఖ్యాతః కర్తవ్యః సర్వదైవతే ॥ 11

తా॥ వేదీ బంధమున 4 పుష్పములును, ఆపైన ఘంట గొప్పదియును మొత్తము 5 మందార పుష్పములవలె రచించిన యెడల శ్రీపుంజమగును—ఒక్కటే అంతస్తు—

శ్లో॥ అధస్తాదష్ట సంఘాటం పునః కుర్యాత్త దూర్ధ్వతః ।
తృతీయాతు తదూర్ధ్వేచ ఘంటామందార పుష్పవత్ ॥ 12
పాదహ్రాసోర్ధ్వ భూమిశ్చ రసాః స్కంధోదిశా అథః ।
సర్వతోభద్ర ఆఖ్యాతః కర్తవ్యః సర్వదైవతే ॥ 13

తా॥ దిగువ 8 వేదీ బంధములును, ఆపైన మరల 8 యును. మూడవ వరుస 8 యును, ఆపైన ఘంట మందార పుష్పమువలెను చేయవలెను. ప్రస్తరము పైన 10 భాగములు స్కంధము 6 భాగములు. ఇట్లు క్రమముగ తగ్గవలెను. సర్వతో భద్రమగును.

శ్లో॥ క్షేత్రార్థేచ భవేద్భద్రం భద్రార్థే కర్ణవిస్తరః ।
కర్ణార్థస్య ప్రమాణేన కర్తవ్యో భద్ర నిర్గమః ॥ 14

పంచభాగో భవేద్గర్భ శ్చత్వారశ్చార్ధ పంచమాః ।
కర్ణేభద్రేచ కూటాని సర్వభద్రాణి కారయేత్ ॥ 15

ఏక భూమ్యార్ధ్వ ఘంటాంచ కుర్యా న్మందార పుష్పవత్ ।
సింహనామా సమాఖ్యాతః ప్రాసాదః పార్వతీ సుఖః ॥ 16

తా॥ విస్తారములో సగము భద్రమును, భద్రములో సగము కర్ణమును, కర్ణములో సగము భద్రముయొక్క నిర్గమమును చేయవలెను. గర్భము 5 భాగములు, అందు భద్రము 2½ భాగములు, కర్ణము 1¼ భాగము. ఇట్లు నలువైపుల రచించవలెను. ఒక్కటే అంతస్తుగాచేసి ఆపైన ఘంట మందార పుష్పమువలె రచించవలెను. దీనిని సింహప్రాసాద మందురు—

శ్లో॥ ప్రతిభద్రే సింహభద్రో భద్రే ద్విద్విజలాంతరమ్ ।
కర్ణికారోఽథ కుముదః కర్ణేత్రమాపకేతథా ॥ 17

తా॥ సింహప్రాసాదము నందలి భద్రములకు ప్రతి భద్రములను రచించిన యెడల సింహభద్రమగును. భద్రమున 2,2 జలమార్గములను రచించి రేని కర్ణికార మగును. కర్ణముల యందుగూడ జలమార్గములను రచించినచో కుముదమగును. ఈ యెనిమిదియును ఒక్క అంతస్తుగల దేవాలయములని తెలియవలెను.

శ్లో॥ చతురస్రం సమం క్షేత్రం శతమూల విభాజితమ్ ।
ద్విభాగః కర్ణవిస్తారో భద్రం భాగత్రయం భవేత్ ॥ 18

భద్రార్థేచ ప్రతిష్ఠాన ముభయోర్వా మదక్షయోః ।
భాగపాదేనని ష్కాసో భద్రే ప్రతిరథేఽథశా ॥ 19

కర్ణే ప్రతిరథే సర్వ భద్రాణి త్రీణి త్రీణిచ
వలభీత్రి తయం భద్రే ఘంటా మందార పుష్పవత్ ॥ 20

వర్ధమాన స్తదానామ కర్తవ్యః సర్వకామదః ॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు, భద్రము 3 భాగములు, ప్రతి రథము $1\frac{1}{2}$ భాగము, చేసి భద్రమునకును ప్రతి రథమునకును $\frac{1}{4}$ భాగము నిర్గమము చేయవలెను. లేదా కర్ణమునకును ప్రతి రథమునకును $\frac{1}{4}$ భాగమును భద్రమునకు, $\frac{3}{4}$ భాగమును, నిర్గమమును చేయవలెను. భద్రమునకు వలభి మూడువగుస లుండవలెను. భద్రముపైన ఘంట మందార పుష్పమువలె నుండవలెను. 3 అంతస్తులతో రచించిరేని వర్ధమాన మగును—

శ్లో॥ భద్రే వార్యంతరే ద్వేచేత్ శ్రీవత్సః స తదోచ్యతే ॥ 21

తా॥ వర్ధమానము యొక్క భద్రమున రెండు వైపుల జల మార్గములను రచించిరేని శ్రీవత్సమగును—

శ్లో॥ యథాభద్రే తథాకర్ణే పుండరీకశ్చనామతః ॥

తా॥ భద్రములయందుంచినట్లు కర్ణములయందును జలమార్గము లుంచిరేని పుండరీక మగును—

శ్లో॥ తథా రూపం ప్రతిరథే సునాభో నామ ఉచ్యతే ॥ 22

తా॥ ప్రతి రథములయందు గూడ జలమార్గములను కల్పించినచో సునాభ మగును—

శ్లో॥ కర్ణతుల్యః ప్రతిరథ శ్చతుర్భాగంచ భద్రకమ్ ।
పంచభూమి సమాయుక్తో వేణుకోనామ శోభనః ॥ 23

తా॥ చతురశ్ర ప్రదేశమును 12 భాగములుచేసి భద్రము 4 భాగములు, కర్ణము 2 భాగములు, ప్రతిరథము 2 భాగములు చేసి 5 అంతస్తులుగా రచించిరేని వేణుక మగును—

శ్లో॥ కర్ణం ప్రతిరథం భద్రం చతురశ్రం ప్రకల్పయేత్ ।
భద్రంచ కర్ణికాయుక్తం సభవేత్ సింహపంజరః ॥ 24

తా॥ కర్ణము, ప్రతిరథము, భద్రము, ఇవి నలుచదరముగా

రచించి భద్రమున కిరువైపుల కర్ణికలను కల్పించినయెడల సింహ పంజరమగును— ఇదియును 5 అంతస్తులే—

శ్లో॥ ద్విద్వి వార్యంతరం భద్రే నంద్యావర్తశ్చ నామతః ।
యథాభద్రే తథాకర్ణే పూర్ణాక్షోనామ నామతః ॥ 25

తా॥ పై జెప్పిన సింహ పంజరము నందలి భద్రమున జల మార్గము లుంచినచో నంద్యావర్త మగును— భద్రమునకును కర్ణమునకును రెండువైపుల జలమార్గములను కల్పించిన యెడల పూర్ణాక్షమగును.

శ్లో॥ కర్ణేత్యక్త్వాఽనుగే దద్యాత్ పతాకో నామశోభనః ।
రథే ప్రతిరథే కర్ణే భవేన్నందన ఉత్తమః ॥ 26

తా॥ పై జెప్పిన జలమార్గములు భద్రమునకును ప్రతి రథము నకును మాత్రమే రెండు వైపులచేసి కర్ణమునకు జలమార్గము లేకుండ నుంచిన యెడల పతాకమగును.

లేక భద్రము ప్రతి రథము కర్ణము ఈ మూడింటికిని యిరు వైపుల జలమార్గము లుంచిరేని నందనమగును.

శ్లో॥ చతుర్దశ విభక్తేచ ద్విభాగః కర్ణవిస్తరః ।
భవేత్తద్ద్విగుణం భద్రం నిర్గమశ్చార్ధ భాగికః ॥ 27
భద్రకర్ణకయోర్మధ్యే ద్వాద్వా ప్రతిరథౌ తథా ।
నిర్గతం చార్ధభాగేన సార్ధభాగస్తు విస్తరః ॥ 28
సప్తభూమిశ్చ కర్తవ్యః స శ్రీతిలక నామకః ।
భద్రే వార్యంతరం ద్వేచ మహాకాంతః స ఉచ్యతే ॥ 29

తా॥ చతురశ్ర ప్రదేశమును 14 భాగములుచేసి కర్ణము 2 భాగములు, భద్రము 4 భాగములు, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగము చొప్పునను, ఇట్లు భద్రకర్ణములమధ్య 2.2 ప్రతిరథములును, భద్ర ప్రతిరథములయొక్క నిర్గమములు $\frac{1}{2}$ భాగమును చేయవలెను.

7 అంతస్తులు చేయవలెను. దీనిని శ్రీతిలక మందురు. మఱియు భద్రముయొక్క జలమార్గములు రెండువైపుల నుండవలెను. దీనిని మహాకాంత మందురు.

(అనుబంధము 58వ పటము చూడుడు)

శ్లో॥ కర్ణోదకైః సుందరః స్యాత్ ప్రరథే చారువర్ధనః ।
భద్రేషు ప్రతిభద్రంచ భవేత్కమల సంజ్ఞకః ॥ 30

తా॥ భద్రములయం దుంచినట్లే కర్ణముల యందును జల మార్గముల నుంచి రేని సుందరమగును. ప్రతి రథములయందు గూడ జలమార్గములు కల్పించినచో చారువర్ధన మగును. పై జెప్పిన భద్రములకు ప్రతిభద్రములను రచించిన యెడల కమలమగును.

శ్లో॥ తత్రోదకాంతరే ద్వేద్వే కిరణో నామనామతః ।
సప్తభూమాశ్చ కర్తవ్యాః ప్రాసాదాః శుభలక్షణాః ॥ 31

తా॥ భద్రములకును, కర్ణములకును, ప్రతిరథములకును, జల మార్గములను రచించి రేని కిరణమగును.

శ్లో॥ ఛందేఽష్టాదశధాభక్తే ద్విభాగః కర్ణవిస్తరః ।
పాదోనద్వ్యంశః ప్రరథః సార్ధం స్యాత్తత్రచానుగమ్ ॥ 32
బాలపంజరః సపాదో భద్రం స్యాత్పంచ భాగికమ్ ।
భాగావుభే కర్ణికేచ వేదాంశం ముఖభద్రకమ్ ॥ 33
నవభూమాశ్చ కర్తవ్యా ఘంటా మందార పుష్పవత్ ।
శుకాగ్రయుక్తశ్చ మహాపద్మః స్యాత్ సర్వకామదః ॥ 34

తా॥ చతురశ్ర ప్రదేశమును 18 భాగములుచేసి అందు కర్ణము 2 భాగములు, ప్రతిరథము $1\frac{3}{4}$ భాగములు, వాని తరువాత ప్రతి రథములు $1\frac{1}{2}$ భాగము, బాలపంజరము $1\frac{1}{4}$ భాగము, భద్రము 5 భాగములు చేయవలెను. లేక $1\frac{1}{2}$ భాగము చెప్పిన కర్ణిక 2 భాగ

ములుచేసి భద్రము 4 భాగముకూడ చేయవచ్చును. ఇట్లు 9 అంతస్తులును ఆపైన ఘంట మందార పుష్పమువలెను, శుకనాసతోను రచించిన యెడల మహాపద్మ మగును.

## 134. వరాటప్రాసాదమున 1-3-5-7-9 అంతస్తుల రచన

అపరాజిత 175వ సూ.

శ్లో॥ స్తంభాద్యాశ్చైవ గర్భాద్యాః పాదాః స్యాత్కర్మమానతః ।
చతుర్వింశతి భిశ్చారై రేఖాభిశ్చవరాటకాః ॥ 35

వరాటే ద్రావిడే చైవ ఘంటాంత ఉదయః స్మృతః ।
ప్రోక్తాశ్చ వివిధశ్ఛందాః ప్రయుక్తా వాస్తువేదిభిః ॥ 36
కర్ణమానోదయం సర్వం ఘంటాంతం చ ప్రకల్పయేత్ ।
దశభాగోదయం కృత్వా విభజేత్తదనంతరమ్ ॥ 37

ద్విభాగాచ భవేజ్జంఘా ద్విగుణః కూటకోదయః ।
చతుర్భాగోదయా ఘంటా విభాగో హ్యేకభూమికే ॥ 38

తా॥ ప్రాసాదములయొక్క యెత్తును నిర్ణయించునప్పుడు వరాటజాతికిగాని ద్రావిడ జాతికిగాని అధిష్ఠానము మొదలుకొని ఘంటయొక్క పైభాగమువఱకు కర్ణమానమునుండి భాగములని తెలియవలెను. స్తంభము మొదలునుండి యైనను లేక గర్భము మొదలునుండి యైనను ఘంటాంతమువరకు 24 చారగల రేఖతో 10 భాగములు చేయవలెను. జంఘ 2 భాగములు, కూటము 4 భాగములు, ఘంట 4 భాగములు, ఇది ఒక్క అంతస్తుగల దేవాలయము.

శ్లో॥ ద్వ్యష్టభాగోదయం కృత్వా విభజేత్తదనంతరమ్ ।
ద్విభాగాచ భవేజ్జంఘా ద్విగుణః కూటవోదయః ॥ 39
ఏకభాగా భవేజ్జంఘా త్రిభాగం కూటమున్నతమ్ ।
జంఘార్థం సార్థద్వయాంశం కూటం ఘంటా చ త్ర్యంశికా ॥ 40

తా॥ కర్ణమానముచేత యెత్తును 16 భాగములుచేసి జంఘ 2 భాగములు, కూటము 4 భాగములు, రెండవజంఘ 1 భాగము కూటము 3 భాగములు, మూడవ జంఘ ½ భాగము, కూటము 2½ భాగము ఘంట 3 భాగములు. ఇది మూడంతస్తుల దేవాలయము.

శ్లో॥ వింశద్వ్యంశోదయం కృత్వా విభజేత్తు దనంతరమ్ ।
ద్విభాగాచ భవేజ్జంఘా ద్విగుణః కూటకోదయః ॥ 41
సార్ధజంఘా త్రిభిః కూటం జంఘైకాసార్ధద్వ్యంశకమ్ ।
అర్ధం జంఘాద్వ్యంశకూటం పదికాసార్ధభాగికమ్ ॥ 42
శేషాంశంచ తథాఘంటాం కుర్యాన్మందార పుష్పవత్ ।
పంచభూమ ఇతి ఖ్యాతః కర్తవ్యః సర్వకామదః ॥ 43

తా॥ కర్ణమానముచేత యెత్తును 20 భాగములుచేసి మొదటి జంఘ 2 భాగములు, కూటము 4 భాగములు, రెండవ జంఘ 1½ భాగము, కూటము 3 భాగములు, మూడవజంఘ 1 భాగము, కూటము 2½ భాగములు, నాల్గవజంఘ ½ భాగము, కూటము 2భాగములు, అయిదవజంఘ ½ భాగము, కూటము 1½ భాగము ఆపైన ఘంట 1¾ భాగముల మొత్తము 20 భాగములు 5 అంతస్తులతో రచించవలెను.

శ్లో॥ త్రిచత్వారింశద్భాజితే కథ్యతే సప్తభూమితః ।
త్ర్యంశాజంఘా సప్తకూటం త్ర్యంశా జంఘాచ షట్ తతః ॥ 44
జంఘాద్వ్యంశాః పంచకూటం ద్వాజంఘా వేదకూటకః ।
సార్ధంజంఘా త్రిభిఃకూటం జంఘైకాంశా ద్వికూటకమ్ ॥ 45
అర్ధం జంఘా భాగకూటం ఘంటా భాగదర్ యోన్నతా ।
ఇతీత్థం సప్తభూమశ్చ కర్తవ్యః సర్వకామదః ॥ 46

తా॥ కర్ణమానములచేత 43 భాగముల యెత్తునుచేసి మొదటి జంఘ 3 భాగములు, కూటము 7 భాగములు, రెండవజంఘ 3 భాగ

ములు, కూటము 6 భాగములు, మూడవజంఘ 2 భాగములు, కూటము 5 భాగములు, నాల్గవజంఘ 2 భాగములు, కూటము 4 భాగములు, ఐదవజంఘ $\frac{1}{2}$ భాగము, కూటము 1 భాగము, ఆపైన ఘంట 2 భాగములు. ఇట్లు 7 అంతస్తులు రచించవలెను.

శ్లో॥ ఏకషష్ట్యుదయం కృత్వా విభజేన్నవ భూమికమ్ ।
వేదాజంఘూచాష్టకూటం వేదాజంఘూశ్వ కూటకమ్ ॥ 47

త్ర్యంశా జంఘూచషణ్ కూటం త్రిజంఘూ పంచకూటకమ్ ।
ద్వాజంఘూకూటకం వేదా ద్వాజంఘూకూటకం త్రయః ॥ 48

సార్థాజంఘూ సార్థద్వయం భాగంజంఘూ ద్వికూటకమ్ ।
జంఘూర్థం కూటకోభాగో ఘంటాస్యాత్సార్థ భాగికా ॥ 49

వరాటః పుష్పకశ్చైవ శ్రీపుంజ స్సర్వతోభద్రః ।
ఏతేకూటైః సమావృత్తాః కర్తవ్యాః సర్వకామదాః ॥ 50

ఇది సూత్రద సంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్తే శ్రీభువన దేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం వరాతి ప్రాసాదలక్షణాధికారో నామ పంచ సప్తత్యుత్తర శతతమమ్ సూత్రమ్—

తా॥ కర్ణమానముచేత యెత్తును 61 భాగములుచేసి మొదటి జంఘ 4 భాగములు, కూటము 8 భాగములు, రెండవజంఘ 4 భాగములు, కూటము 7 భాగములు, మూడవజంఘ 3 భాగములు, కూటము 6 భాగములు, నాల్గవజంఘ 3 భాగములు, కూటము 5 భాగములు, ఐదవజంఘ 2 భాగములు, కూటము 4 భాగములు, ఆఱవజంఘ 2 భాగములు, కూటము 3 భాగములు, ఏడవజంఘ $1\frac{1}{2}$ భాగము, కూటము $2\frac{1}{2}$ భాగములు, ఎనిమిదవజంఘ 1 భాగము, కూటము, 2 భాగములు, తొమ్మిదవజంఘ $\frac{1}{2}$ భాగము, కూటము

1 భాగము, ఆపైన ఘంట $1\frac{1}{2}$ భాగము చేయవలెను. ఇది తొమ్మిది అంతస్తుల దేవాలయము ఇందులో వరాటము, పుష్పకము, శ్రీపుంజము, సర్వతోభవము, ఈనాలుగు ప్రాసాదముల యొక్క-కూటములు క్రమముగా వృద్ధియై 25 భేదము లేర్పడినవి.

ఇది శ్రీమద్విశ్వకర్మవంశ మూలర్షి పంచకమధ్య మాహాభానస
గోత్ర పవిత్ర, స్వర్ణాచ్చమాంబా వేంకట శివార్య పౌత్ర,
లక్ష్మాంబా కోట యసుధీమణి పుత్ర, శ్రీ మద్గాయత్రీ విరా
డిశ్వకర్మ వరప్రసాద జనిత కవితా సుధారసపాత్ర, పద
వాక్య ప్రమాణనిధాన, విమర్శకాచార్య, శిల్పకళాకోవిద,
సర్వతంత్ర స్వతంత్ర, స్థపతి, తిలకాది బిరుద విరాజ
మాన సుబ్రహ్మణ్యాభిధాన విరచిత నానావాస్తు శిల్పా
గమశాస్త్ర పరిశీలనాత్మకాంధ్ర తాత్పర్య సహిత
భారతీయ మహాశిల్పమునందు మేరు కైలాస-
పుష్పక- మణిక- త్రివిష్టప- భూమిజ- ఉదయ
కలాసంధి- రేఖా- ద్రావిడ- వరాట
ప్రాసాదములుగల దేవాలయ భేదములు అను
షష్ఠకళ

# అనుబంధము

1వ పటము




మందర మేరువు

2వ పటము



మందర మేరువు 1అంతస్తు

3వ పటము




మందర మేరు

4వ పటము




విస్తారము 10 ఖా




4వ పటము ఎ

## 5వ పటము

విస్తారము 10భా
అంతస్తులు 9
చేయవచ్చును



కైలాసమేరువు-1

## 6వ పటము

విస్తారము 10 భా
ఉరుశృంగములు 12
ప్రత్యంగములు 8



కైలాసమేరువు-2 (అపరా)

## 7వ పటము



## 8వ పటము



| | |
|---|---|
| విస్తారము20 భా | 20. 20 400 |
| శాలనిర్గమములు 4భా | 3. 24 72 |
| గర్భము 4భా | భాగములు 472 |
| నలుదిశలమండపములు 12 భా | |

త్రివిష్టపమేరువు

ఇది బే ూరు చెన్నకేశవ ఆలయము ప్లాను

9వ పటము



10వ పటము

3వ కర్ణముల నుండి
మూలమంజిరి 5.6
2వ కర్ణమునుండి
ఉరోమం 4.5
1వ కర్ణము నుండి
ఉరోమము
3. 3 1/2



విస్తారము12 భా సాంధారము

క్షితి భూషన మేరువు

పృథివీజేయ మేరువు

విస్తారము10 భా



11వ పటము



12వ పటము



సర్వతోభద్రమేరువు

మిమాన మేరువు

13వ పటము




విమాన మెరువు (విశ్వపు)

14వ పటము




నందన మేరువు

15 వ పటము



నందన మేరువు

16 వ పటము




స్వస్తిక మేరువు

17 వ పటము




స్వస్తిక మేరువు- 2

18 వ పటము




స్వస్తిక మేరువు- 3

19వ పటము



స్వస్తికమేరువు- 3

20వ పటము



ముక్తకోణమేరువు 1

21వ పటము



ముక్తకోణ మేరువు 4

22వ పటము



శ్రీవత్సమేరువు 1

23వ పటము




శ్రీవత్ససమేరువు 2 (విశ్వప్ర)

24వ పటము




హంస మేరువు

25వ పటము




రుచకమేరువు 1

26వ పటము



వర్ధమాన మేరువు

28వ పటము

27వ పటము

7 అంతస్తులు





గరుడమేరువు

29వ పటము

ఉరఃశృంగములు

ప్రధాన శిఖరమున 12

ప్రక్క శిఖరములకు 8



గరుడమేరువు 4

30వ పటము

10 అంతస్తుల కూడా చేయవచ్చును.

శిఖరము 6.కోణములుగ రచించ వచ్చును



గరుడ మేరువు 5

31వ పటము




గజమేరువు

32వ పటము






సింహ మేరువు 1.2.3

34వ పటము




33వ పటము




పద్మ మేరువు

36వ పటము




నందివర్ధన మేరువు

35వ పటము



ప్రస్తరమునకు దిగువ

నందివర్ధన మేరువు

37వ పటము




నందివర్ధన మేరువు

38వ పటము




వలభిమేరువు

39వ పటము




కుంభమేరువు

40వ పటము




సముద్రమేరువు

41వ పటము




41-ఎ వ పటము




వృషభ మేరువు 1.2 పద్ధతులు

43వ పటము



42వ పటము



లక్ష్మీకోటమేరువు

44వ పటము




పంచవక్త్రమేరువు

45వ పటము




గిరిమేరువు

46వ పటము



తిలకమేరువు

47వ పటము




శ్రీకూట మేరువు

48వ పటము



విస్తారము 10.భా

విస్తారము 112భా

గర్భము 60 భా

49వ పటము



మహామేరువు

విమానఛందజాతి శ్రీమేరువు

50వ పటము

112 విస్తారము

ప్రస్తరము పైన

56భా. చేయవలెను

అండకములు 1011



మహామేరువు

51వ పటము

నలుదిశల ప్రాగ్రీవములు
ఆవిందములు
గుండ్రము



కైలాసజాతి.చతుర్ముఖము

52వ పటము

దీర్ఘచతురశ్రము



పుష్పకజాతి. ముఖశాల

53వ పటము



మణికజాతి ఆమోదము

54వ పటము

దీర్ఘవృత్తము

8కోణములు
మూడేసి
అవిందములు
నలు వైపుల
రచించ వలెను



త్రివిష్టపజాతి.మహాపద్మము

55వ పటము

56వ పటము



భూమిజప్రాసాదజాతి.నిషధము



మాల్యవంతము

57వ పటము

58వ పటము







ద్రావిడము. సర్వాంగము

వరాటజాతి. శ్రీతిలకము